కృపిసల్పిరి. శ్రీ జనార్ధనం నాయుడుగారు, జిల్లా విద్యాశాఖాధికారులు సత్వరంగా లోకల్ లైబ్రరీ అథారిటీలను ఏర్పాటు చేయుటకు తగు సలహాల నొసగిరి.

## లోకల్ లైబ్రరీ అథారిటీల నిర్మాణములో జరిగిన జాప్యము—

కారణాలు :—

శ్రీ జనార్ధనం నాయుడుగారు తగు సలహాల నొసగినప్పటికి లోకల్ లైబ్రరీ అథారిటీల నిర్మాణములో కొంత జాప్యము జరిగినది. రెండు నెలలలో లోకల్ లైబ్రరీ అథారిటీలను స్థాపించవలసి యుండగా కొన్ని జిల్లాలయందు ఈ లోకల్ లైబ్రరీ అథారిటీలను ఏర్పాటు చేయుటకు ఆరు నెలలకుపైగా పట్టినది. ఈ విధమయిన జాప్యమునకు కొన్ని ప్రధాన కారణములు:—

1. జిల్లా విద్యాశాఖాధికారుల కున్న కాలమంతయు విద్యాశాఖాకార్యనిర్వహణకే సరిపోవుచుండెడిది. వారికి లోకల్ లైబ్రరీ అథారిటీలను ఏర్పాటు చేయుటకు తగిన వ్యవధియుండెడిది కాదు.

2. గుంటూరు, విశాఖపట్టణము మున్నగు జిల్లాలలో ప్రతిజిల్లాయందును జిల్లా విద్యాశాఖాధికారులిరువు రుండిరి. కావున వారిలో లోకల్ లైబ్రరీ అథారిటీల స్థాపనా బాధ్యతల నెవరు స్వీకరించవలె నన్న సమస్య ఏర్పడినది. ఈ సమస్యను పరిష్కరించుటలో కొంత జాప్యము జరిగినది. తుదకు విశాఖపట్టణము, గుంటూరు కేంద్ర జిల్లా విద్యాశాఖాధికారులే ఈ ఏర్పాటు బాధ్యతల స్వీకరించవలెనని ప్రభుత్వము తీర్మానించినది.

3. పురపాలక సంస్థల ప్రత్యేకాధికారులు లోకల్ లైబ్రరీ అథారిటీ సభ్యులుగా నుండవచ్చునా, కూడదా యన్న యభిప్రాయము వివాదాస్పదముకాగా ఈవివాద పరిష్కారమునందు జరిగిన జాప్యము కూడ కొంతవరకు హేతువయినది.

4. ప్రతి జిల్లాలోను ప్రతి తాలూకా నుండి పంచాయతీ సభ్యులలో ఒకరిని ఎన్నుకొనవలసి వచ్చినది. కాన ఈ విధముగా ఎన్నుకొనడములో జరిగిన జాప్యము కూడ ఒక హేతువయినది.

5. ప్రతి జిల్లా బోర్డు నుండి ఒక సభ్యుని ఎన్నుకొనవలెను. కొన్ని జిల్లాలలో ఈ విధముగా ఎన్నుకొనుటలో కొన్ని నెలలు గడిచినది.

6. ప్రధానోపాధ్యాయులు, ప్రధానోపాధ్యాయినులు, కళాశాల ప్రిన్సిపాల్స్ మున్నగు వారిలో నైదుగురను, సహకార గ్రంథాలయముల కార్యవర్గ సభ్యులనుండి ముగ్గురను లోకల్ లైబ్రరీ అథారిటీలో సభ్యులుగా నియమించవలెను. ఈ నియామకము మాత్రము త్వరితముగా జరిగినది.

7. పలు విధములుగా లోకల్ లైబ్రరీ అథారిటీ సభ్యుల ఎన్నిక, నియామకము కావలసియున్నందున ప్రతి జిల్లాలో లోకల్ లైబ్రరీ అథారిటీల ఏర్పాటులకు ఆలస్యమైనది.

ఈ కారణములవలన గ్రంథాలయాలవ్యాప్తి, గ్రంథాలయాభివృద్ధి రాష్ట్రమునందు 1953 సం॥ వరకు త్వరితగతిన సాగలేక పోయినది.

## గ్రంథాలయ సెస్సు - వసూళ్ళలో జాప్యము - కారణాలు, అవరోధాలు -

ఇంటిపన్ను లేదా ఆస్తిపన్నుపై చట్టప్రకారము మునిసిపాలిటీలు, పంచాయతీలు, రూపాయకు 6 పైసలు సెస్సు వసూలు చేయవలసియున్నది. ఈ చట్టము 1—4—1950 నుండి అమలులోనికి వచ్చినప్పటికి మునిసిపాలిటీలు, పంచాయతీలు సెస్సును మొదటి రెండు సం॥లు మిగుల స్వల్పముగా వసూలు చేసినవి. ఈ విధమయిన

జాప్యము జరుగుటకు కొన్ని ప్రధాన కారణములుగా క్రింది వానిని పేర్కొ-నవచ్చును.

1—4—1950 నుండి సెస్సును వసూలుచేయవలెనని తెలియజేయు ప్రభుత్వ ఉత్తర్వుల నెం. 627, ఎడ్యుకేషన్ అండ్ పబ్లిక్ హెల్త్, తారీఖు 28—2—1950, మునిసిపాలిటీలకు, పంచాయతీలకు సకాలమున చేరనందున సెస్సు వసూలునందు మిగుల ఆలస్యము జరిగినది.

1. రాష్ట్రముయొక్క- ఆర్థికస్తోమత చక్క-బడిన యనంతరము సెస్సును వసూలు చేయవచ్చునని ఆనాటి కొన్ని మునిసిపాలిటీలు ప్రభుత్వమును కోరినవి. ప్రభుత్వమందుల కంగీకరించ లేదు.

2. సెస్సును వసూలుచేయు సందర్భమున రూపాయకు తక్కు-వగానున్నచో దానిని మినహాయించి పూర్తి రూపాయకు మాత్రము సెస్సును వసూలు చేయవలెనా లేక రూపాయతో బాటు చిల్లరకు కూడ లెక్క-గట్టి వసూలు చేయవలెనా యను సందేహము పురపాలక సంస్థలకు, పంచాయతీలకు కలిగినది. ఈ సందేహమును ప్రభుత్వము దృష్టికి తీసికొనిరాగా ప్రభుత్వము చిల్లరను మినహాయించి పూర్తి రూపాయి మీద మాత్రము సెస్సు వసూలు చేయవలెనని తెలియ జేసినది.

3. గ్రంథాలయ సెస్సునకు సంబంధించిన వివరములను ఇంటి పన్ను, ఆస్తిపన్నులకు సంబంధించిన రిజిష్టరునందే తెలియబరచ వచ్చునా లేక ప్రత్యేకించిన రిజిష్టరులను ఉపయోగించవలెనా యన్న సంశయము మునిసిపాలిటీలకు, పంచాయతీలకు కలిగి ప్రభుత్వము దృష్టికి తెచ్చినవి. సెస్సునకు సంబంధించిన వివరముల గణాంకములను తెలియజేయుటకు ప్రత్యేకించిన రిజిష్టరులు యవసరము లేదని ఇంటిపన్ను, ఆస్తిపన్నులకు సంబంధించిన వాటి రిజిష్టరులందు తెలియ జేసిన చాలునని తెలిపినది.

4. రైల్వే భవనములకు సంబంధించిన ఆస్తులపై సెస్సును విధించ వచ్చునా కూడదా యన్న సందేహమును నివృత్తి చేయుటలో రాష్ట్రప్రభుత్వము కేంద్రప్రభుత్వముయొక్క అభిప్రాయమును కోరినది. ఈ అంశమును పరిశీలించుటలో కొంత జాప్యము జరిగినది. కొంతకాలము తరువాత ప్రభుత్వము రైల్వే భవనములకు సంబంధించిన ఆస్తులపై సెస్సును విధించ నవసరము లేదని ఉత్తర్వులను జారీ చేసినది.

5. వసూలగునటువంటి విద్యాపన్నుపై సెస్సును విధించవలెనా యను సందేహము పలువురికి కలుగగా ప్రభుత్వము విద్యాపన్నుపై సెస్సును విధించనవసరము లేదని తెల్పినది.

6. లోకల్ లైబ్రరీ అథారిటీలు ఏర్పడిన యనంతరము ఇవి పురపాలక సంస్థలను, పంచాయతీలను వసూలయిన సెస్సును కట్టవలయునని కోరినవి. లోకల్ లైబ్రరీ అథారిటీల స్థాపన మిగుల యాలస్యముగా జరుగుటచే డిమాండ్ నోటీసులు పురపాలక సంస్థలకు, పంచాయతీలకు సకాలములో పంపలేక పోయినవి. కాన సెస్సును వసూలు చేయడములో అమిత ఆలస్యము జరిగినది.

7. పంచాయతీ సంస్థలు లేని ప్రాంతములందు జిల్లాబోర్డులు సెస్సును వసూలు చేయవలెనా యను ప్రశ్న జనించగా జిల్లాబోర్డులు సెస్సును వసూలు చేయరాదని ప్రభుత్వము తెలియజేసినది.

8. పురపాలక సంస్థలు, పంచాయతీలు గ్రంథాలయ సెస్సును వసూలు చేయుట కష్టతరముగా నున్నదని 1950 సం॥ నవంబరు మాసమున ప్రభుత్వమునకు తెలియబరచగా ప్రభుత్వము చట్టప్రకారము సెస్సును 1—4—1950 నుండి గాక 1—4—1951 నుండి వసూలు చేయవలసినదిగా తెలియజేసినది. కాని అదివరకే కొన్ని

ప్రాంతములందు కొంత సెస్సు 1—4—1950 నుండి వసూలు చేసి లోకల్ లైబ్రరీ అథారిటీలకు జమ చేసినవి. ఆ విధముగా జమ కట్టిన మొత్తమును లోకల్ లైబ్రరీ అథారిటీలు పంచాయతీ సంస్థలకు తిరిగి యివ్వ నవసరము లేదని ప్రభుత్వము తెలియబరచినది.

9. రాష్ట్ర ప్రభుత్వ భవనములపై సెస్సు విధించవలెనా, కూడదాయన్న సందేహము కలుగగా వసూలగు సెస్సు మొత్తము నకు సమానమగు మొత్తమును ప్రభుత్వము మంజూరుచేయుచున్నది గాన రాష్ట్ర ప్రభుత్వ భవనములపై సెస్సు వసూలుచేయ నవసరము లేదనియు, పురపాలక భవనములకు మాత్రము చట్టప్రకారము ఈ మినహాయింపు వర్తించదనియు ప్రభుత్వము స్పష్టపరచినది.

10. పురపాలక సంఘములకు ఆస్తిపన్ను యననేమి అను ప్రశ్న ఉదయింపగా ప్రభుత్వము ఇంటిపన్ను - నీటిపన్ను - విద్యుచ్ఛక్తిపన్ను మఱియు పరిశుభ్రతాపన్ను మున్నగునవి కలసి ఆస్తి పన్ను యగునని దీనిపై సెస్సు వసూలు చేయవలెనని సూచించినది. పంచాయతీలు ఇంటిపన్నుపై మాత్రము సెస్సు వసూలు చేయవలె నని విశదపరచినది.

11. కొన్ని పురపాలక సంస్థలు సెస్సును వసూలు చేయుటలో లోకల్ లైబ్రరీ అథారిటీల ప్రమేయ మవసరము లేదనియు తామే వసూలుచేసి గ్రంథాలయాభివృద్ధికి పూనుకొనెదమనియు ప్రభుత్వము నకు తెలియజేసినవి. ఈ విధముగా తెలియజేసిన పురపాలక సంస్థలలో మలపాళెం పురపాలక సంస్థ నొక ఉదాహరణముగా పేర్కొన వచ్చును. కాని ఈ పద్ధతికి ప్రభుత్వ మంగీకరించలేదు.

12. కొన్ని పురపాలక సంస్థలు సెస్సు వివరములను తెలియ జేయు పత్రములు, రిజిష్టరులు మున్నగు వాటిని తయారుచేసికొనుట

కగు వ్యయమును వసూలు కాబడిన సెస్సునుండి వెచ్చించవచ్చునని ప్రభుత్వమును కోరగా ప్రభుత్వ మందులకు నిరాకరించినది.

13. గ్రంథాలయ సెస్సును చట్టము ప్రకారము వసూలు చేయవలెనని కొన్ని పంచాయతీ సంస్థలకు చాల కాలమువరకు తెలియ లేదు. కొన్ని పంచాయతీలకు ఈ విషయము తెలిసి యుండినప్పటికి సెస్సును వసూలు చేయుటలో నిర్లక్ష్యము చేసినవి.

14. జిల్లా విద్యాశాఖాధికారులు సెస్సు వసూలుకు సంబంధించిన కొన్ని సందేహములను ప్రభుత్వమునకు తెలియబరచగా వారి సందేహముల తీర్పుటలో కొంత జాప్యము జరిగినది.

15. కొన్ని పురపాలక సంస్థలు వసూలయిన సెస్సును లోకల్ లైబ్రరీ అథారిటీలకు చెల్లించలేదు. అయినప్పటికి దీనిపై తగు విధమయిన చర్య గైకొనలేదు.

పై కారణములవలన ఈ చట్టము 1—4—1950 నుండి అమలులోనికి వచ్చినప్పటికి 1—10—1953 వరకు అనగా ఆంధ్ర రాష్ట్రావతరణము వరకు సెస్సు వసూలు మాత్రము నామమాత్రముగానే జరిగినది. ఈ చట్టమును అమలు పరచుటకు జిల్లా విద్యాశాఖాధికారికి సహాయముగా నుండుటకుగాను జిల్లా విద్యాశాఖాధికారి కార్యాలయాన ఒక గుమాస్తాను నియమించిరి. తగిన సిబ్బందిని ఏర్పాటు చేయక పోవుటవలన చట్టము నమలుపరచుటలో కొంత జాప్యము జరిగినది. కాన గ్రంథాలయ వ్యాప్తి త్వరితముగా జరుగుటకు వీలులేక పోయినది.

**లోకల్ లైబ్రరీ అథారిటీలకు రాష్ట్రప్రభుత్వము మంజూరు చేసిన అడ్వాన్సు గ్రాంట్లు :—**

1950-51 సం॥ చట్టప్రకారము గ్రంథాలయముల అభివృద్ధికి గాను ప్రభుత్వము లోకల్ లైబ్రరీ అథారిటీలకు రెండు లక్షల పైకొ

మును అడ్వాన్సు గ్రాంటుగా మంజూరు చేసినది. కాని, పురపాలక సంస్థలు, పంచాయతీ సంస్థలు సెస్సును సక్రమముగా వసూలు చేయలేక పోయినవి. సెస్సును సక్రమముగా వసూలు చేయజాలక పోయినందున చట్టము ప్రకారము ప్రభుత్వమునుండి రెండు లక్షల పైకమును పొందుటకు లోకల్ లైబ్రరీ అథారిటీలకు వీలు లేకపోయినది.

జిల్లా బోర్డులు పురపాలక గ్రంథాలయములలో శిక్షణ పొందని వారు అటెండర్లుగా 21 రూ॥ల వేతనముతో పనిచేయుచుండిరి. వీరు శిక్షణ పొందని వారగుటచే పాఠకులకు ప్రయోజనకరమయిన సేవ నందించలేకపోయిరి.

1950-51 సం॥ సెస్సు వసూలు సక్రమముగా జరుగక పోవుట వలన, శిక్షణ పొందని గ్రంథ పాలకులను గ్రంథాలయములందు నియమించుట వలన గ్రంథాలయముల వ్యాప్తి కూడ అంతంత మాత్రముగానే యుండినది. ఈ విషయమును గ్రహించి నూతన గ్రంథాలయములను స్థాపించుట కొఱకై ప్రభుత్వము 1951 సం॥ ఏప్రెల్ మాసమున అడ్వాన్సు గ్రాంటు క్రింద రూ॥ 8,000/-ల చొప్పున ప్రతిలోకల్ లైబ్రరీ అథారిటీకిని మంజూరు చేసినది. ఆయా జిల్లాలయందు మరుసటి సం॥ వసూలగు సెస్సు నుండి ఈ మొత్తమును మినహాయించడము కూడ జరుగునని ప్రభుత్వము స్పష్టపరచినది. 1950 - 51 సం॥ సెస్సు సక్రమముగా వసూలు కాలేదు. ఈ పరిస్థితుల నవగతము కావించుకొన్న ప్రభుత్వము ఆనాటికి పౌరగ్రంథాలయాల చట్టము అమలులోనికి వచ్చి ఒక సం॥ కాలము గడచుటచే సెస్సును సక్రమముగా వసూలు చేయవలెనని అందులకు సంబంధించిన కొన్ని నిర్ణయములను కూడ ప్రభుత్వం పొందించినది. కొన్ని పురపాలక సంస్థలు, పంచాయతీలు గ్రంథాలయ సెస్సును వసూలు చేయుట తమ విధి కాదని ప్రభుత్వమునకు తెలియజేసినవి. ఆ సమయమున విద్యాశాఖ సెక్రె

టరీగా నుండిన శ్రీ కె. ఎం. ఉనిధాన్ గారు సెస్సు వసూలుపై కొన్ని గట్టి ఉత్తర్వుల జారీచేసిరి. ఈ ఉత్తర్వుల వలన సెస్సు వసూలు కొంత మెరుగు పడినది. ఇదివరకు అడ్వాన్సు గ్రాంటు క్రింద మంజూరు చేసినటువంటి రూ. 8000/- లను ప్రభుత్వ గ్రాంటు నుండి మినహాయించక మరొక సం॥రము వరకు వ్యవధి నొసంగినది. కొన్ని జిల్లాలందు సెస్సు సక్రమంగా వసూలుచేయుట జరుగలేదు. అయినప్పటికి ప్రభుత్వము ఉదారతతో గ్రాంటును సక్రమముగా గ్రంథాలయవ్యాప్తి కుపయోగించు కొనమని కోరినది. అడ్వాన్సు గ్రాంటును 1952 – 53 లో గ్రంథాలయ సెస్సు గ్రాంటునుండి మినహాయించ గలదని తెలిపినది.

ప్రభుత్వముయొక్క కొన్ని కఠిన ఉత్తర్వుల వలన 1-4-52 నుండి సెస్సు వసూలునందు కొంతమెరుగు కన్పించినది. 1-4-1952 నుండి 30-9-1952 వరకు వసూలు చేయబడిన సెస్సు కొన్ని జిల్లాల యందు మెరుగుపడినందున గత సంవత్సరపు అడ్వాన్సు గ్రాంటు రూ॥ 8000/- లను మినహాయించడము జరిగినది.

1953 సం॥ ఫిబ్రవరి మాసమున ప్రభుత్వము మంజూరు చేసిన గ్రంథాలయ సెస్సు గ్రాంట్లు

| జిల్లా పేరు | మంజూరుచేయబడిన గ్రాంట్లు | |
|---|---|---|
| 1. శ్రీకాకుళము | రూ॥ | 4876-70 |
| 2. విశాఖపట్టణము | ,, | 9952-80 |
| 3. తూర్పు గోదావరి | ,, | 46808-15 |
| 4. పశ్చిమ గోదావరి | ,, | 16224-11 |
| 5. కృష్ణ | ,, | 975-13 |
| 6. గుంటూరు | ,, | 17909-09 |
| 7. కడప | ,, | 735-15 |
| 8. నెల్లూరు | ,, | 8048-13 |
| 9. చిత్తూరు | ,, | 4321-01 |

1951 సం॥ ఏప్రిల్ మాసమున ప్రభుత్వము మంజూరు చేసినటు వంటి అడ్వాన్సు గ్రాంటును చెల్లించనటువంటి లోకల్ లైబ్రరీ అథారిటీలు, ప్రభుత్వమునకు జమకట్ట వలసినదిగా ప్రభుత్వము ఉత్తర్వుల జారీచేసినది. చిత్తూరు, కృష్ణ మున్నగు జిల్లాలు సెస్సు వసూలు చేయలేకపోయిన కారణంగా ఆ పైకమును 31-3-1953 లోపున వసూలుచేసి వెనుకటి అడ్వాన్సు గ్రాంటును చెల్లించ వలసినదిగా ప్రభుత్వము ఉత్తర్వులను జారీచేసినది.

కర్నూలు, అనంతపురం జిల్లాలు వసూలయిన సెస్సు వివరము లను ప్రభుత్వమునకు ఆలస్యముగా తెలియబరచుటచే ప్రభుత్వము ఫిబ్రవరి 1953 న గ్రాంటులను మంజూరు చేసినది. ఈ జిల్లాలకు మాత్రము గ్రాంట్లు మంజూరు కావడములో కొంత ఆలస్యము జరిగినది.

1—4—1950 నుండి చట్టము అమలులోనికి వచ్చినప్పటికి 1950–51 సం॥ వసూలయిన సెస్సు నామమాత్రముగా నుండి 1951–52 సం॥న కొంత మెరుగుపడినది. 1952–53 సం॥ సెస్సు వసూలు మరికొంత మెఱుగై కొన్ని జిల్లాలయందు జిల్లా కేంద్ర గ్రంథాలయాలను, శాఖా గ్రంథాలయాలను స్థాపించుటకు ప్రయత్నాలు జరిగినవి. 1–10–1953 వరకు అనగా ఆంధ్ర రాష్ట్రావతరణమువరకు గ్రంథాలయవ్యాప్తి, గ్రంథాలయ సేవ సక్రమముగా జరుగక పోయినది. లోకల్ లైబ్రరీ అథారిటీలకు ఆర్థిక స్తోమత సరిగా లేకపోవడమే యిందులకు ప్రధాన కారణము.

## చట్టములోని యితర అంశములు – వాటి అమలు :—

మదరాసు గ్రంథాలయ చట్టములోని 16వ సెక్షన్ ప్రకారము లోకల్ లైబ్రరీ అథారిటీలు గ్రంథాలయములకు సంబంధించిన గణాంకాది వివరములను గ్రంథాలయ డైరెక్టరుకుగాని, వారిచే నియమించ

బడిన యితర ఉద్యోగికిగాని తెలియబరచవలెను. జిల్లా విద్యాశాఖాధికారులు పరిపాలనా యంత్రాంగమునందు అనుభవజ్ఞులుగా నుండిరి. కాన వారు గ్రంథాలయ గణాంక, నిర్వహణాది వివరములను ఎప్పటికప్పుడు సులభముగా తెలియజేయు చుండిరి. ఈ ప్రకారము 30—9—1953 వరకు అనగా ఆంధ్ర రాష్ట్రావతరణము వరకు జరుగుచుండినది.

గ్రంథాలయ చట్టములోని 17వ సెక్షను ననుసరించి జిల్లా కేంద్ర గ్రంథాలయములు, శాఖా గ్రంథాలయములు సత్వరంగా స్థాపింపబడుటకు, అవి సక్రమంగా నిర్వహింపబడుటకు రాష్ట్రములో సహాయక గ్రంథాలయ నిర్వహణా తీరుతెన్నులను రాష్ట్ర గ్రంథాలయ శాఖ ప్రత్యేకాధికారి పరిశీలిస్తూ యుండిరి.

1948 చట్టములోని 19వ సెక్షన్ననుసరించి అవిభక్త మదరాసు రాష్ట్రమునందలి ఏ ప్రచురణ కర్తయైనను తాను ప్రచురించెడి పుస్తకములలో ప్రభుత్వ సూచన ప్రకారము కన్నెమారా ప్రభుత్వ గ్రంథాలయమునకు తప్పనిసరిగా ఒక ప్రతిని పంపవలెను. కాని కొందరు ఈవిధముగా పంపనప్పటికి వారిపై తగు చర్యను గైగొనలేదు.

**చట్టము అమలు పరచుటలో రాఘవరెడ్డిగారి సలహాలు :—**

రాఘవరెడ్డిగారు 1947-48 సం॥ ఇంగ్లాండునందు విద్యనభ్యసించు కాలమున లీడ్స్ విశ్వవిద్యాలయ గ్రంథాలయములకు, లీడ్సునగరమందలి పౌర గ్రంథాలయములకు తరచుగా వెళ్ళు చుండిరి. అవిభక్త మదరాసు రాష్ట్రమునందు గ్రామీణ గ్రంథాలయాల, పాఠశాలల గ్రంథాలయాల నిర్వహణలో అనుభవమును గడించిన రాఘవరెడ్డిగారు ఈ గ్రంథాలయముల నిర్వహణావిధానమును పరిశీలించి, గ్రంథాలయ నిర్వహణను ఆకళింపు చేసికొనిరి. సెలవు

రోజులందు మాంచెస్టర్ నగరములోని పౌర గ్రంథాలయములకుకూడ వెళ్ళుచుండిరి. గ్లాస్గో, ఎడిన్‌బరో, డబ్లిన్ మున్నగు నగరములందలి విశ్వవిద్యాలయ గ్రంథాలయములకు తదితర పౌర గ్రంథాలయములకు కూడ వెళ్ళి అనుభవమును పొందిరి. ఫ్రాన్స్, స్విట్జర్లాండ్ దేశములందలి కొన్ని పౌర గ్రంథాలయములకు వెళ్ళెడి అవకాశము కూడా వీరికి లభించినది. పలు గ్రంథాలయములకు వెళ్ళి అచట పుస్తక భాండాగారులతో గ్రంథాలయ నిర్వహణ, పాలనా విధానములను తదితర విషయములను గురించి చర్చించి విశేషానుభవమును పొందిరి.

ఇంగ్లాండు నుండి అవిభక్త మదరాసు రాష్ట్రమునకు తిరిగి వచ్చిన యనంతరము కొంతకాలమునకు దృశ్య శ్రవణ విద్యా ప్రత్యేకాధికారిగా రాఘవరెడ్డిగారు నియమింపబడిరి. వీరిలో జిల్లా విద్యాశాఖాధికారులు, లోకల్ లైబ్రరీ అథారిటీ సభ్యులు, తదితర గ్రంథాలయ కార్యకర్తలు కొన్ని సమయములలో వారికి కావలసిన విషయములపై సంప్రదించుచుండిరి. ఈ సందర్భములందు, పాశ్చాత్య దేశములలో ముఖ్యముగా ఇంగ్లాండునందు తాము గడించిన అనుభవములను వారికి తెలియజేయుచుండెడివారు. ఆంధ్రరాష్ట్రావతరణమునకు మునుపు కూడ రాఘవరెడ్డిగారు గ్రంథాలయములకు అధికారిగా లేనప్పటికి ప్రత్యేకాధికారి హోదాలో కొన్ని ప్రాంతములందలి గ్రంథాలయ భాండాగారులతో ఇంగ్లాండునందు వారు గడించిన గ్రంథాలయ నిర్వహణ విధానములను తెలియజేయుచు వారికి గ్రంథాలయ వ్యాప్తికి తగు సలహాల నిచ్చుచుండిరి. ఇంగ్లాండునందలి పౌర గ్రంథాలయములలో నయోజన విద్యాకార్యక్రమములను, దృశ్యశ్రవణ విద్యా కార్యక్రమములను కూడ నిర్వహించుచుండిరి. ఈ కార్యక్రమములం దనుభవము పొందినటువంటి రాఘవరెడ్డిగారు జిల్లా విద్యాశాఖాధికారులకు గ్రంథపాలకులకు, ఆ కార్యక్రమములయొక్క ప్రయోజనముల గురించి సందర్భానుగుణముగా వివరించుచుండిరి.

రాష్ట్రములోని సహాయక గ్రంథాలయములు :-

పౌరగ్రంథాలయాల చట్టము అమలునకు రాక మునుపటి కాలము నుండియే చాలకాలముగా సహాయక గ్రంథాలయములు గ్రంథాలయ సేవను రాష్ట్రములో ప్రశంసనీయముగా చేయుచుండినవి. గ్రంథాలయ చట్టము అమలులోనికి వచ్చిన తరువాత లోకల్ లైబ్రరీ అథారిటీలు కూడా గ్రంథాలయ సేవ చేయుచుండినవి. క్రొత్త గ్రంథాలయములను స్థాపించిన యనంతరము కూడ సహాయక గ్రంథాలయములు అవిభక్త మదరాసు రాష్ట్రమున ముఖ్యముగా ఆంధ్రప్రాంతమునందు గొప్పసేవ నందించినవి. గ్రంథాలయ సేవా దృష్టితో కొన్ని స్వచ్ఛంద సంస్థలు సహాయక గ్రంథాలయములను నెలకొల్పి సేవచేసినవి. ఈ విధముగా సహాయక గ్రంథాలయములు అనేక సం॥లుగా గ్రంథాలయ సేవచేయు చుండినప్పటికి సహాయక గ్రంథాలయములకు మంజూరైన గ్రాంట్లు చాల తక్కువ. ఉదా॥ 1—4—1950 న అవిభక్త మద్రాసు రాష్ట్రమునందు 1,580 సహాయక గ్రంథాలయము లుండినప్పటికి వీటికి గ్రాంట్ల క్రింద మొత్తము ఒక లక్ష రూపాయలను మాత్రమే మంజూరు చేసినది. ఈ చట్టము అమలులోనికి వచ్చిన సం॥ అనగా 1950 - 51 సం॥ నందు 2,525 సహాయక గ్రంథాలయములు స్థాపించబడియున్నప్పటికి ఒక లక్ష రూ/- లు మాత్రమే గ్రాంట్ల క్రింద మంజూరు చేయబడినది. 1951 - 52 సం॥ లో సహాయక గ్రంథాలయముల సంఖ్య 3,740 కి పెరిగినప్పటికి మంజూరు చేసినటువంటి గ్రాంటునందు మాత్రము ఎటువంటి పెరుగుదల కన్పించలేదు.

రాష్ట్రమునందలి సహాయక గ్రంథాలయములలో ప్రతిజిల్లాలో కొన్ని గ్రంథాలయములు ముందంజవేసి నవీన పద్ధతిలో గ్రంథాలయ

సేవచేయుచుండినవి. 1–10–1953 నాటికి అనగా ఆంధ్ర రాష్ట్రావతరణము నాటికి లోకల్ లైబ్రరీ అథారిటీలు పట్టణములలో జిల్లా కేంద్ర గ్రంథాలయములను, కొన్ని శాఖా గ్రంథాలయములను స్థాపించుటకు తగు కృషిసల్పి కొంతవరకు గ్రంథాలయ సేవ సలుపగా సహాయక గ్రంథాలయములు పట్టణ ప్రాంతములలోనే గాక గ్రామప్రాంతములలో కూడ గ్రంథాలయ సేవ చేసినవి.

1948 గ్రంథాలయ చట్టము అమలునకు రాకపూర్వము నుండియు పంచాయతీల, గ్రామ సంఘముల, సహకార సంస్థల, పురపాలక మఱియు జిల్లా బోర్డుల ఆధీనమునందు కొన్ని సహాయక గ్రంథాలయములుండినవి. చట్టము వచ్చిన యనంతరముకూడ గ్రంథాలయములు గ్రంథాలయ సేవను కొనసాగించినవి.

ఆంధ్ర ప్రాంతమునందు సహాయక గ్రంథాలయములు 1948 మదరాసు పౌర గ్రంథాలయాల చట్టము అమలులోనికి రాకమునుపు పెక్కు సం॥ల నుండి గ్రంథాలయ సేవ జేయుచున్నవి. వీటిలో ఈ క్రింద కనబఱచిన గ్రంథాలయాలు ఈ నాటికిని ప్రశంసనీయమైన సేవ చేయుచున్నవి.

1. గౌతమీ గ్రంథాలయము, రాజమండ్రి.
2. కె. ఆర్. వి. కె. గ్రంథాలయము, కాకినాడ.
3. హిందూ పత్రికా విభాగము, విశాఖపట్టణము.
4. తిక్కన విద్యా నిలయము, గుంటూరు.
5. ఎడ్వర్డ్ కారోనేషన్ రీడింగ్ రూమ్ మఱియు సరస్వతీ నిలయము, ధర్మావరం.
6. ఎడ్వర్డ్ పత్రికా విభాగము మఱియు గ్రంథాలయము-కోవెలకుంట్ల.

7. చిత్తూరు సర్వమత సమానత్వ సంస్థా గ్రంథాలయము, చిత్తూరు.
8. సరస్వతీ నికేతనము, వేటపాలెం.
9. ఆర్య వైశ్య బాలమిత్ర బాంధాగారము, నరసరావుపేట.

ఇటీవల రాజమండ్రిలోని గౌతమీ గ్రంథాలయమును ప్రభుత్వము స్వాధీనపరచుకొని నిర్వహించుచున్నది. గ్రంథాలయ చట్టము అమలులోనికి రాకపూర్వము కూడ ప్రయివేటు సంస్థల యాజమాన్యమున, సొసైటీల రిజిస్ట్రేషన్ చట్టము XXI 1860 క్రింద రిజిష్టరయిన కొన్ని సహాయక గ్రంథాలయములు జరుపబడుచుండినవి. విద్యావంతులు, సంపన్నులు అయినవారి సహాయమునను, సాంఘిక సేవా సంస్కర్తల సహాయమునను ఈ సహాయక గ్రంథాలయములు నిర్వహింపబడు చుండినవి. గ్రామ ప్రజల విరాళములతో గూడ కొన్ని సహాయక గ్రంథాలయములు నిర్వహింపబడు చుండినవి. ఈవిధమయిన గ్రంథాలయముల అభివృద్ధికి ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘ సభ్యులయిన శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావు, శ్రీ పాతూరి నాగభూషణం, శ్రీ అయ్యంకి వేంకటరమణయ్య, శ్రీ కల్లూరు సుబ్బారావు తదితరులు ఎనలేని సేవ చేసిరి.

1935—39 సం॥లలో మదరాసునందు గ్రంథాలయోద్యమము లలో విద్యార్థి దశలో నుండిన రాఘవరెడ్డిగారు అప్పుడప్పుడు పాల్గొనుచు ఆంధ్రప్రాంతమునుండి మదరాసు నగరమునకువిచ్చేసెడు గ్రంథాలయాభిమానులతోను, గ్రంథాలయోద్యమ కార్యకర్తలతోను గ్రంథాలయోద్యమమును గురించి చర్చించుచు, సందర్భానుగుణముగా కొన్ని అభిప్రాయములనుకూడ గ్రంథాలయోద్యమ కార్యకర్తలకు తెలియజేయు చుండిరి. మఱియు ఆంధ్ర ప్రాంతమునందలి సహాయక గ్రంథాలయములు ఏ విధముగా పనిచేయుచున్నవన్న విషయములను గురించి వారి ద్వారా తెలిసికొనుచుండిరి. సహాయక

గ్రంథాలయములకు ప్రజాదరణ అమితముగా నుండెడివని గ్రంథాలయ కార్యకర్తలు రాఘవరెడ్డిగారికి తెలియజేసెడివారు.

ఈ క్రింద కనబరచిన వివిధ గ్రంథాలయములకు యిందు కనబరచిన మేరకు గ్రాంట్లను మంజూరు చేయుటకు 29--4—1950 న ప్రభుత్వము ఉత్తర్వులను జారీ చేసినది.

| గ్రంథాలయము పేరు | సం॥ నకు గ్రాంటు మొత్తము రూ/- |
|---|---|
| 1. ప్రయివేటు గ్రంథాలయము | 150/- రూ. లోపున |
| 2. పంచాయతీ గ్రంథాలయము | 65/- రూ. ,, |
| 3. గ్రామ సంఘం గ్రంథాలయము | 40/- రూ. ,, |
| 4. జిల్లాబోర్డు గ్రంథాలయము | 150/- రూ. ,, |
| 5. పురపాలక గ్రంథాలయము | 150/- రూ. ,, |

సహాయక గ్రంథాలయముల నిర్వహణకు కావలసినంత గ్రాంట్లు మంజూరు కాకపోయినప్పటికి అవి అధిక బాధ్యతలను మాత్రము నిర్వహింపవలసి వచ్చినది. పంచాయతీ గ్రంథాలయములు, గ్రామసంఘం గ్రంథాలయములు, జిల్లాబోర్డు గ్రంథాలయములు, పురపాలక గ్రంథాలయములు ప్రభుత్వము యిచ్చు గ్రాంటునకు సమానమగు మొత్తమును కలిపి గ్రంథాలయముల అభివృద్ధికి ఖర్చు పెట్టవలెను. మఱియు ఈ గ్రంథాలయములలో తగిన కుర్చీలు, మేజాలు, బీరువాలు తప్పని సరిగా నుండవలెను. ఈ సహాయక గ్రంథాలయములందలి పుస్తకముల వివరములను తెలియజేయు రిజిష్టరులను, వ్యయము చేయబడిన పైకము వివరముల గణాంకములను రిజిష్టరులలో సక్రమముగా వ్రాయవలెనని ప్రభుత్వము తెలియజేసినది. సాధారణముగా సహాయక గ్రంథాలయములందు నిర్ణీత కాలమున పనిచేయు గుమాస్తా ఉండెడివాడు. ఇతనికి తగు ప్రోత్సాహము

లేకుండెను. కాన తగిన గ్రంథాలయసేవ సల్పుటకు వీలులేక పోయినది. కొన్ని పెద్ద పంచాయతీల, పురపాలక సంస్థల సహాయక గ్రంథాలయములందు మాత్రము పూర్తి కాలము పనిచేయు గుమస్తాలుండిరి. వీరు కొంతవరకు గ్రంథాలయ సేవ చేయగల్గిరి. గ్రంథాలయాల చట్టము అమలులోనికి రాకపూర్వము ప్రయివేటు గ్రంథాలయములు చేసిన సేవ కొనియాడదగినది.

పై గ్రంథాలయములను పాఠశాలల ఉపతనిఖీ అధికారులు తనిఖీ చేయుచుండిరి.

పఠన మందిరములు:—

1948 మదరాసు రాష్ట్ర పౌరగ్రంథాలయ చట్టము అమలులోనికి రాక పూర్వమునుండి మదరాసు నగరమందును, రాష్ట్రమునందలి జిల్లాలన్నిటి యందును పెక్కు సహాయక గ్రంథాలయములు, పఠన మందిరములు మంచి సేవచేసినవి, క్రైస్తవ కళాశాలయందు విద్య నభ్యసించుచుండిన రాఘవరెడ్డిగారు 1931 సం॥ నుండి మదరాసు నగరములోని పఠనమందిరములకు తరచుగా వెళ్ళుచుండిరి. నగరములోని కొన్ని పఠన మందిరములందు మాత్రమే కొన్ని పుస్తకములుండినవి. మిగిలిన పఠన మందిరములందు పత్రికలు మాత్రమే యుండినవి. పుస్తకములున్న పఠన మందిరములలో కొన్నిటియందు మాత్రము వాటి నిర్వాహకులు పాఠకులకు పుస్తకముల నరువిచ్చు చుండిరి. కొన్ని పఠన మందిరములయందు పుస్తకములుండినప్పటికి పాఠకులకు పుస్తకముల నరువిచ్చు బాధ్యత తమది కాదని తెలుపువారు కూడ నుండిరి. పఠన మందిరములయందు కేవలము పత్రికలు మాత్రమే యున్నచో ఆశించినంత ప్రయోజనము కలుగదు. పుస్తకములను కూడ ప్రవేశ పెట్టవలెనని గ్రంథాలయ పాఠకులు తరచుగా ప్రభుత్వమునకు విన్నవించుకొనుచుండిరి. ఈ విషయమును గురించి రాఘవరెడ్డిగారు తమ మిత్రులయిన మద

రాసు గ్రంథాలయ సమాఖ్య సభ్యులకు కూడ వివరించుచుండిరి. పఠన మందిరములయందు కేవలము పత్రికలు మాత్రముండిన అవి పౌర గ్రంథాలయములుగా పరిగణింప బడవని అవిభక్త మదరాసు రాష్ట్ర ప్రభుత్వము 25—9—1950 న ఉత్తర్వులను జారీచేసినది. ఈ ఉత్తర్వుల ప్రకారము పఠన మందిరముల నిర్వాహకులు పఠన మందిరములయందు క్రమముగా పుస్తకములను కూడ ప్రవేశపెట్టుచూ వాటిని సహాయక గ్రంథాలయములుగా రూపొందించుటచే క్రమముగా పఠన మందిరముల సంఖ్య తగ్గి సహాయక గ్రంథాలయముల సంఖ్య పెరిగినది.

## ప్రభుత్వ బాలల గ్రంథాలయము :—

1948 గ్రంథాలయ చట్టములో ప్రత్యేకముగా బాలల గ్రంథాలయము లుండవలెనన్న సూచన లేనప్పటికి అవిభక్త మధ్రాసు రాష్ట్ర విద్యా శాఖ డైరెక్టరు శ్రీ డి. ఎస్. రెడ్డిగారు ఒక బాలల గ్రంథాలయమును విద్యాశాఖ డైరెక్టరు కార్యాలయ ఆవరణమునందు ఏర్పాటు చేయవలెనని సూచించగా వారి సూచన మేరకు 22—11—1950 న డైరెక్టరు వారి కార్యాలయ ఆవరణలో నొక బాలల గ్రంథాలయము స్థాపించబడినది. ఈ బాలల గ్రంథాలయము మదరాసు నగరమునందు ప్రాథమిక పాఠశాలలలో విద్యనభ్యసించు విద్యార్థులకు ఇతర బాల బాలికలకు మిగుల ప్రయోజనకారిగా నుండినది. ఈ బాలల గ్రంథాలయమునందు బాలలకు తగిన బల్లలు, మేజాలు, పుస్తకముల నుంచెడి బీరువాలు చక్కగా అమర్చబడి యుండినవి. ఈ ఫర్నీచర్ కుగాను 1950-51 సంllన ప్రభుత్వము 4,155 రూ/-లను గ్రాంటుక్రింద యిచ్చినది. బాలలకు సంబంధించిన అన్ని రకములయిన పుస్తకములు ఈ గ్రంథాలయము లందుండినవి. బాలలకు సంబంధించిన పుస్తకముల కొనుగోలుకుగాను 1,850 రూ/-

లను 1950-51 సం॥ ప్రభుత్వము గ్రాంటుక్రింద మంజూరు చేసినది. నాటినుండి ప్రతి సం॥రము పుస్తకముల కొనుగోలుకు తగిన గ్రాంటును మంజూరు చేయుచుండినది. నవీన పద్ధతిలో ఈ బాలల గ్రంథాలయ మును నిర్వహించెడివారు. 1950 సం॥నందు విద్యాశాఖ డైరెక్టరు వారి కార్యాలయమునందు దృశ్య, శ్రవణ, విద్య, పౌరశిక్షణ, బాల భటోద్యమము మున్నగు వాటికి ప్రత్యేకాధికారిగా రాఘవరెడ్డి గారుండిరి. వీరు అప్పుడప్పుడు బాలల గ్రంథాలయమునకు వెళ్ళి గ్రంథాలయాభివృద్ధికి తగిన సలహాల నిచ్చుచు దృశ్యశ్రవణ పరికరము లను బాలబాలికలకు ప్రదర్శింపమని సలహాల నిచ్చి తగు ప్రోత్సాహ మును కూడ కల్పించుచుండిరి. 1974 సం॥ ఈ బాలల గ్రంథాలయ మును రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమునకు తరలించడము జరిగినది.

### ఆర్థిక వనరుల లోపము-గ్రంథాలయ వ్యాప్తికి అవరోధము:—

ఏ దేశమందైనా ఏ గ్రంథాలయ చట్టమును గాని త్వరగా అమలుపరచుట సులభసాధ్యముకాదు. ఇంగ్లాండునందు 1850 సం॥ గ్రంథాలయ చట్టము అమలులోనికి వచ్చినప్పటికి ఆచరణకు మాత్రము కొద్ది సం॥ల కాలము పట్టినది. అదేవిధముగా మదరాసు రాష్ట్రము నందు 1—4—1950 న గ్రంథాలయ చట్టము అమలులోనికి వచ్చి నప్పటికి ఆచరణలోనికి ప్రవేశించుటకు కొద్ది సం॥ల కాలము పట్టినది. దీనికి గ్రంథాలయ సెస్సు సక్రమముగా వసూలు కాకపోవుట, లోకల్ లైబ్రరీ అథారిటీల ఆర్థిక స్తోమత తగినంతగా అభివృద్ధి కాకపోవుట ప్రధాన కారణములు. విద్యాశాఖాధికారులు గ్రంథాలయ నిర్మాణ నిర్వహణములందు కొంత అనుభవమును గడించిరి. లోకల్ లైబ్రరీ అథారిటీల చైర్మన్‌లకు, సభ్యులకు కూడ ఈ గ్రంథాలయ నిర్మాణ నిర్వహణలో అనుభవము కలుగుటయేగాక గ్రంథాలయ వ్యాప్తి, అభివృద్ధులకు పాటుపడవలయునను ఉత్సాహ ప్రోత్సాహములు కూడ

కలిగినవి. చట్టములో పెక్కు అంశములు స్పష్టంగా వివరింపబడని కారణంగాను, సభ్యుల ఎన్నికలలో విపరీతమగు జాప్యము అగుట చేతను, గ్రంథాలయాల వ్యాప్తి చురుకుగా సాగలేదు.

**ఆంధ్రరాష్ట్ర అవతరణము నాటికి గ్రంథాలయాల అభివృద్ధి:—**

1948 మదరాసు పౌరగ్రంథాలయాల చట్టము ప్రకారము మదరాసు నగరమునందును, ప్రతి జిల్లాయందును ఒక కేంద్ర గ్రంథాలయమును, 5000 కు మించిన జనాభాగల ప్రాంతమునందు ఒక శాఖా గ్రంథాలయమును, 5,000 కు తక్కువగాను 1000 కి పైనను జనాభాగల ప్రాంతమునందు ఒక పుస్తక పంపిణీ కేంద్రమును స్థాపించవలెను. 30–9–1953 నాటికి మునుపే అనగా ఆంధ్ర రాష్ట్రావతరణమునకు మునుపే ఆంధ్ర ప్రాంతమునందలి పదకొండు జిల్లాలలోను జిల్లా కేంద్ర గ్రంథాలయముల స్థాపనకు ప్రయత్నములు జరిగినవి. ఈ విధముగా జరిగిన జిల్లా కేంద్ర గ్రంథాలయముల స్థాపన 1953 సం॥ చివరినాటికి పూర్తి అయినది. ఈ కేంద్ర గ్రంథాలయములందలి పాలకులను గ్రంథాలయ శాస్త్ర శిక్షణకు పంపు ప్రయత్నములు కూడ జరిగినవి. జిల్లా కేంద్ర గ్రంథాలయములతో పాటు శాఖాగ్రంథాలయములను స్థాపించుటకు కూడ కృషి జరిగినది. ఈ విధమయిన కృషి ఫలితముననే 1953 సం॥ చివరి నాటికి 5 శాఖాగ్రంథాలయముల స్థాపన పూర్తి అయినది. ఇవి గాక 976 సహాయక గ్రంథాలయములు 336 పఠన మందిరములు పనిచేయు చుండినవి.

చేయబడలేదు. 1948-49 సం॥ ఈ గ్రంథాలయాల యభివృద్ధికి 47,076 రూ/- లు గ్రాంటుక్రింద మంజూరు చేయబడినది. 1949-50; 1950-51, 1951-52 సం॥లలో కూడ ప్రతి ఏటా గ్రాంటు క్రింద రూ/- 50,000 లోపుగానే మంజూరు చేసినట్లు తెలియుచున్నది. ఈ విధముగా మంజూరు చేయబడిన గ్రాంట్లు మిగుల స్వల్పమైనప్పటికి కన్నెమారా ప్రభుత్వ గ్రంథాలయ పుస్తక భాండాగారియగు శ్రీ ఆర్. జనార్ధనంనాయుడుగారి కృషి ఫలితమున గ్రంథసేవమాత్రము చక్కగా జరిగినది. 1948-52 సం॥ల మధ్యకాలమున మంజూరు చేసిన గ్రాంట్లు స్వల్పమైనప్పటికి ప్రతి సం॥ గ్రంథాలయములకు విచ్చేయు పాఠకుల సంఖ్యమాత్రము 75,000 కు పైగా యుండినది. గృహములలో చదువుకొను నిమిత్తము ప్రతి సం॥ గ్రంథాలయముల నుండి అరువు కొనిపోబడు పుస్తకముల సంఖ్య 50,000 కు పైబడినట్లు చెప్పవచ్చును. గ్రంథాలయములందు పాఠకులచే పఠించబడు పుస్తకముల సంఖ్య 1,75,000 కు మించినది. ఈ విధముగా గ్రాంట్లు గ్రంథాలయముల అభివృద్ధికి తగినంతగా లేకపోయినప్పటికి గ్రంథసేవ ప్రశంసనీయముగా జరుగుటకు ప్రధానముగా శ్రీ జనార్ధనంనాయుడుగారు మిగుల కృషి సల్పిరి. కన్నెమారా గ్రంథాలయము నందలి పుస్తకములు కేవలము మదరాసు నగరవాసులకే పరిమితముగాక అవిభక్త మదరాసు రాష్ట్రములోని అన్ని జిల్లాలయందలి పౌరగ్రంథాలయములు. పాఠశాలల గ్రంథాలయములుకూడా అరువు పొందుచుండినవి.

1—4—1953 వరకు అనగా ఆంధ్ర రాష్ట్రావతరణము వరకు కన్నెమారా ప్రభుత్వ పౌరగ్రంథాలయము ఉద్యోగస్థులకు, పరిశోధనా విద్యార్థులకు, విశ్వవిద్యాలయాల, కళాశాలల, పాఠశాలల విద్యార్థులకు మఱియు మహిళలకు మిగుల ప్రయోజనకరముగా నుండినదనుట అతిశయోక్తి కానేరదు.

దక్షిణ భారతదేశములోని గ్రంథాలయాలలో చాలా పెద్దదైనటువంటి కన్నెమారా ప్రభుత్వ గ్రంథాలయము అవిభక్త మదరాసు రాష్ట్రములోని యిప్పటి తమిళనాడు ప్రాంతమునకు మాత్రము పరిమితముగాక ఆంధ్రలోని పదునొకండు జిల్లాలు మఱియు ఉత్తర మలబారు, దక్షిణ కెనడా, బళ్ళారి మున్నగు ప్రాంతములయందలి గ్రంథాలయాల వ్యాప్తికి, అభివృద్ధికి దోహద పడుచుండినది.

రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమునందు పనిచేయువారు మంచి అనుభవము కలవారుగా నుండిరి. వీరిలో శ్రీ స్వామినాథన్ గారు మఱియు శ్రీ రాజాబాద్దూర్ గారు ప్రముఖులు. వీరు గ్రంథాలయ శాస్త్ర పరిశోధనా విద్యార్థులకు, తదితరులకు ఆంధ్ర ప్రాంతము వారికి కూడ కావలసిన సలహాల నొసగుచు తోడ్పడుచుండిరి. వీరిరువురు రాఘవరెడ్డిగారికి, కన్నెమారా గ్రంథాలయము ఆంధ్రప్రాంత గ్రంథాలయములలో ఏ యే గ్రంథాలయములకు ఎన్నెన్ని గ్రంథములను సరఫరా చేసినదను విషయమును గూర్చి, యితర సేవలను గూర్చి తెలియజేయుచుండిరి. రాఘవరెడ్డిగారు గ్రంథాలయోద్యమములో పాల్గొనుటకు కూడ వీరు తగు ప్రోత్సాహమును కల్పించిరి.

1931 సం॥ రాఘవరెడ్డిగారు, మదరాసు క్రైస్తవ కళాశాలయందు ఇంటర్ మీడియట్ విద్య నభ్యసించు కాలమునాటినుండి తరచుగా కన్నెమారా ప్రభుత్వ గ్రంథాలయమునకు వెళ్ళుచుండిరి. అంతేగాక 1935 సం॥ నుండి కొంత కాలముపాటు కన్నెమారా ప్రభుత్వ గ్రంథాలయమునం దొక ఉద్యోగిగా కూడ పనిచేసిరి. కావున యీ గ్రంథాలయము ఆంధ్ర ప్రాంత గ్రంథాలయములకు చేయుచుండిన సేవలను గూర్చి తెలిసికొని, రాఘవరెడ్డిగారు మిగుల సంతోష పడుచుండెడివారు. 1947-48 సం॥ రాఘవరెడ్డిగారు ఇంగ్లాండునందు విద్యాభ్యాస కాలమున గ్రంథాలయముల అభివృద్ధిని గురించి సమగ్ర పరి

# మదరాసు పౌరగ్రంథాలయాల చట్టము 1948

## అధునిక పద్ధతులలో గ్రంథాలయ నిర్వహణకు పునాది

## [ 1—10—1953 నుండి 31—10—1956 వరకు ]

**గ్రంథాలయోద్యమమున నూతన శకము :—**

ఆంధ్ర రాష్ట్రావతరణానంతరము ప్రభుత్వము వయోజన విద్యకు, గ్రంథాలయములకు, దృశ్య, శ్రవణ విద్యకు ప్రత్యేకాధికారిగా రాఘవ రెడ్డిగారిని నియమించినది. మదరాసు విశ్వవిద్యాలయమునందు గ్రంథాలయ శాస్త్రమున శిక్షణ పొందినవారును, ఇంగ్లాండు తదితర పాశ్చాత్య దేశముల యందలి గ్రంథాలయ నిర్వహణ విధానములను తెలిసినవారును అగుటచే రాఘవరెడ్డి గారిని ప్రత్యేకాధికారిగా నియమించడము జరిగినది. వీరి నియామకముచే గ్రంథాలయోద్యమమున నూతనశక మారంభమైనదని చెప్పవచ్చును.

ఆంధ్ర రాష్ట్రావతరణమునకు మునుపే జిల్లా కేంద్రగ్రంథాలయములను, కొన్ని శాఖా గ్రంథాలయములను స్థాపించుటకు ప్రయత్నములు జరిగినవి. ఈ గ్రంథాలయములను నవీన పద్ధతులలో తీర్చి దిద్దవలెనని రాఘవరెడ్డిగారు పట్టుదల వహించిరి. ఉన్నటువంటి గ్రంథాలయములను అభివృద్ధిపరచి గ్రంథాలయములు లేని ప్రాంతములందు నూతన గ్రంథాలయములను ప్రారంభించవలెనని సంకల్పించిరి.

యునెస్కో వారిచే లైబీరియాలో విద్యాభివృద్ధులను పెంపు చేయుటకుపంపబడిన శ్రీ డి.ఎస్. రెడ్డిగారు లైబీరియానుండి తిరిగివచ్చిన తరువాత వారిని ఆంధ్ర రాష్ట్ర ప్రభుత్వము విద్యా శాఖ డైరెక్టరుగా నియమించినది. గ్రంథాలయ చట్టప్రకారము విద్యాశాఖ డైరెక్టరే గ్రంథాలయ శాఖా డైరెక్టరుగా కూడ బాధ్యత వహింతురు.

## రాష్ట్ర గ్రంథాలయ కమిటీ సమావేశములు :—

1953-54 సం॥ ప్రభుత్వము రాష్ట్ర గ్రంథాలయ కమిటీని స్థాపించినది. చట్ట ప్రకారము ఈ కమిటీకి విద్యాశాఖా మంత్రి చైర్మన్‌గాను, ప్రత్యేకాధికారిగానున్న రాఘవరెడ్డిగారు కార్యదర్శిగా నుండిరి. ఈ కమిటీయందు కొందఱు గ్రంథాలయ నిపుణులు మఱియు విశ్వవిద్యాలయముల తరపున, అసెంబ్లీ తరపున, లోకల్ లైబ్రరీ అథారిటీల తరపున కొందరు సభ్యులుగా యుండిరి. 7-11-1954 న యీ కమిటీ ప్రథమ సమావేశము జరిగినది. ఈ కమిటీ సభ్యులు గ్రంథాలయ సెస్సును అధికముగా వసూలు చేసి, గ్రంథాలయము లను చక్కగా అభివృద్ధిపరచవలెనని తెలిపిరి. గ్రంథాలయముల అభివృద్ధికి కొన్ని సూచనలను చేసిరి. గ్రంథాలయములను సాంకేతి కంగా అభివృద్ధిపరచవలసిన ఆవశ్యకతను గురించి రాఘవరెడ్డిగారు వివరించిరి. 27—1—1956 న ఈ కమిటీ రెండవ పర్యాయము సమావేశమై గ్రంథాలయ వ్యాప్తికి అవలంబించవలసిన చర్యలతో పాటు లోకల్ లైబ్రరీ అథారిటీలకు, సహాయక గ్రంథాలయాలకు మంజూరు చేయవలసిన ప్రభుత్వ గ్రాంట్లను గూర్చి చర్చించిరి. చట్ట ప్రకారము ప్రభుత్వమునకు సలహాల నొసంగు కమిటీగా పరిమితమై వుండినప్పటికి ఈ కమిటీ యిచ్చు సలహాలను ప్రభుత్వము చాలవరకు అంగీకరించెడిది. ఈ కమిటీ యిచ్చిన సూచనల నన్నిటిని రాఘవరెడ్డి గారు ప్రభుత్వమునకు తెలుపుతూ వాటి నన్నిటిని అమలు చేయుటకై వాటి ఆవశ్యకతను గురించి విశదముగా తెలియజేసెడివారు.

## ఆంధ్ర రాష్ట్రములో కేంద్ర గ్రంథాలయ స్థాపన :—

ఆంధ్ర రాష్ట్రావతరణమునకు తరువాత కన్నెమారా ప్రభుత్వ గ్రంథాలయము తమిళనాడురాష్ట్ర కేంద్ర గ్రంథాలయముగామారినది చట్టప్రకారము ఆంధ్రరాష్ట్రమున ఒక రాష్ట్ర కేంద్ర గ్రంథాలయ

మును స్థాపించవలెను. ఈ విషయమును పరిశీలించి విశాఖపట్టణము నందు రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమును స్థాపించవలెనని 1954 ఏప్రిల్ నెలలో ప్రభుత్వము ఉత్తర్వులను జారీచేసినది. ప్రభుత్వము ఈ గ్రంథాలయమును స్థాపించుటకు 3 లక్షల 72 వేల రూపాయలను మంజూరు చేసినది. రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమునకు కావలసిన పుస్తకములను, ఫర్నిచర్ మున్నగు వానిని గ్రంథపాలకుడు కొనుగోలు చేసికొనుటకు ఈ సైకము మంజూరు చేయబడినది. ప్రభుత్వ ఉత్తర్వుమేరకు విశాఖపట్టణమున రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమును స్థాపించిరి. ఈ గ్రంథాలయ భవనము తగినంత విశాలముగా లేనందు వలన రాష్ట్ర కేంద్ర గ్రంథాలయము నిర్వర్తించ వలసిన విధులను సక్రమముగా నిర్వర్తించుటకు వీలులేకపోయినది. కాని పుస్తకముల వర్గీకరణ, సూచీకరణ మాత్రము ఈ గ్రంథాలయమున సక్రమముగా జరిగినది.

**లోకల్ లైబ్రరీ అథారిటీల పునర్నిర్మాణము:—**

1950 సం॥లో ఏర్పడిన లోకల్ లైబ్రరీ అథారిటీల మూడు సంవత్సరముల కాలపరిమితి 1953 సం॥లో ముగిసినది, 1953–54 సం॥ ఈ అథారిటీలను పునర్నిర్మించిరి. రాష్ట్రములోని పదకొండు జిల్లాల లోను లోకల్ లైబ్రరీ అథారిటీలు ఒక్కమారుగా పునర్నిర్మించ బడలేదు. దీనికి కారణములు లేకపోలేదు. ప్రతి తాలూకాకు ఆ తాలూకాలోని పంచాయతి సభ్యులలో ఒకరిని లోకల్ లైబ్రరీ అథా రిటీ సభ్యునిగా ఎన్నుకొనవలెను. అన్ని జిల్లాలలోని తాలూకాలలో ఈ విధముగా ఎన్నుకొనడము ఒకే మారు జరుగలేక పోయినది. ప్రతి పురపాలక సంస్థ నుండి ఒకరిని లోకల్ లైబ్రరీ అథారిటీ సభ్యు నిగా ఎన్నుకొనవలెను. కాని పురపాలక సంస్థల నుండి కూడ ఒకే మారు ఎన్నుకొనడము జరుగలేదు. ఈ ప్రధాన కారణముల వలన

లోకల్ లైబ్రరీ అథారిటీల పునర్నిర్మాణము అన్ని జిల్లాలలో ఒకే మారు జరుగుటకు వీలులేక పోయినది. రాష్ట్రమంత్రట ఈ లోకల్ లైబ్రరీ అథారిటీల పునర్నిర్మాణము మఱియు కాలపరిమితి ముగియుట ఒకేమారు జరుగుట శ్రేయస్కరమని రాఘవరెడ్డిగారి అభిప్రాయము. కాని కొందరు అధికారులు ఈ పునర్నిర్మాణము, కాల పరిమితులు ముగియుట అన్ని జిల్లాలలో ఒకేమారు జరుగవలసిన అవసరము అంతగా లేదని అభిప్రాయ పడిరి.

## జిల్లా విద్యాశాఖాధికారులకు జిల్లా కేంద్ర గ్రంథాలయాధికారుల తోడ్పాటుకు సూచనలు:—

ఆంధ్ర రాష్ట్రావతరణానంతరము చట్టప్రకారము జిల్లా విద్యాశాఖాధికారులే లోకల్ లైబ్రరీ అథారిటీలకు సెక్రటరీలుగా కొనసాగిరి. ఇదివరకు నియమించబడిన జిల్లా గ్రంథాలయ పుస్తక భాండాగారులు ఆ యా జిల్లా గ్రంథాలయ పుస్తక భాండాగారులు గానే కొనసాగిరి. విద్యావేత్తలైన ఈ విద్యాశాఖాధికారులు గ్రంథాలయములలో పరిపాలనా యంత్రాంగమునకు మాత్రము మంచి ప్రాధాన్యతను యివ్వగలిగిరేగాని సాంకేతిక విషయములకు తగు ప్రాధాన్యతను యివ్వలేకపోయిరి. ఈ కారణముగా సాంకేతిక శిక్షణ పొందిన గ్రంథాలయ పాలకులు మిగుల యిబ్బందులకు లోనగుచుండిరి. తరచు ఈ విషయమై ప్రత్యేకాధికారైన రాఘవరెడ్డిగారికి విన్నవించుకొనుచుండిరి. వారు ఈ విషయమును పరిశీలించి 1954 సం॥ నవంబరులో సాంకేతికముగా గ్రంథాలయములందు ఎటువంటి విధానముల నవలంబించవలెనో వివరముగా తెలియజేసిరి. ఈ విషయము లనుగురించి జిల్లా కేంద్ర గ్రంథాలయ పాలకులకు ఉత్తర్వులిచ్చిరి. ఈ ఉత్తర్వులలో పుస్తక వర్గీకరణ - సూచీకరణ గ్రంథాలయములను గురించి గణాంక వివరముల సేకరించుట, రీడింగ్ లిస్టులను తయారు

చేయుట, పరిశోధన విద్యార్థులకు, యువకులకు తగు సౌకర్యములు కలుగుజేయుట, అనునవి ప్రధానమైనవి. తనిఖీకి వెళ్ళు సందర్భము లందు సెక్రటరీలతోను, గ్రంథపాలకులతోను గ్రంథాలయ సాంకేతిక విషయములకు తగు ప్రాధాన్యత యివ్వవలెనని నొక్కి చెప్పుచుండిరి. లోకల్ లైబ్రరీ అథారిటీ సెక్రటరీలకు, ఆ గ్రంథాలయ గ్రంథపాలకు లకు మధ్య సహకారము చాలావరకు చక్కగా నుండినది. అయినను గ్రంథాలయ శాస్త్రమునందు శిక్షణ పొందియున్న కొన్ని జిల్లా కేంద్ర గ్రంథాలయ పుస్తక భాండాగారుల సేవను కొందరు సెక్రట రీలు చక్కగా వినియోగించుకొనలేకపోయిరి. చట్టము మేరకు తయారు చేయబడిన నిబంధనలందు పుస్తక భాండాగారుల విధులు నిర్దిష్టముగా లేకపోయినప్పటికి, రాఘవరెడ్డిగారు గ్రంథాలయము లందు ఈ పుస్తక భాండాగారుల సేవను చక్కగా ఉపయోగించు కొనవలసినదని, వారికి తగు ప్రోత్సాహమును కూడ కలుగ జేయవల యునని తెలిపి ఈ క్రింది ఉత్తర్వులు 1955 సం॥న జారీ చేసిరి.

1. గ్రంథాలయములకు పుస్తకములు, ఫర్నీచర్లు మున్నగు వానిని కొనుగోలు చేయునపుడు సెక్రటరీలు ఆయా జిల్లా కేంద్ర గ్రంథాలయ పుస్తక భాండాగారులతో సంప్రదించవలెను.

2. దినపత్రికలు, వారపత్రికలు, తదితర పత్రికలు, పుస్తక ములు గ్రంథాలయమునకు సక్రమముగా వచ్చుచున్నవా లేదా యని జిల్లా కేంద్ర గ్రంథాలయ పుస్తక భాండాగారులు తెలిపినగాని సెక్రె టరీలు ఆపత్రిక విక్రేతలకు పైకము యివ్వడానికి వీలులేదు. ఏ గ్రంథాలయమునకైన ఒకే రకమైన పత్రిక అదనముగా మరి కొన్ని కాపీలు కావలసి వచ్చిన సెక్రెటరీలు జిల్లా కేంద్ర గ్రంథాలయ పుస్తక భాండాగారిని సంప్రదించ వలెను.

3. గ్రంథాలయములకు పుస్తకములను కొనగోలు చేయునపుడు పుస్తకముల ఎన్నికొను కమిటీకి జిల్లా కేంద్ర గ్రంథాలయ పుస్తక భాండాగారి సహాయకుడుగా ఉండవలెను.

4. గ్రంథాలయ పరిపాలనా యంత్రాంగమునకు సంబంధించిన స్టాక్ ఫైల్సను పుస్తక భాండాగారులు చూపమనినపుడు సెక్రటరీలు వాటిని చూపవలెను.

5. గ్రంథాలయములందు ప్రత్యేక విభాగములను ఏర్పాటు చేయవలయునన్న సెక్రటరీలు జిల్లా కేంద్ర గ్రంథాలయ పుస్తక భాండాగారులతో సంప్రదించవలెను.

6. జిల్లా కేంద్ర గ్రంథాలయ పుస్తక భాండాగారికి మినహా ఇతర ఉద్యోగులకు గాని, శాఖా గ్రంథాలయ ఉద్యోగులకు గాని అత్యవసర సెలవు కావలసివచ్చిన జిల్లా కేంద్ర గ్రంథాలయ పాలకులే మంజూరు చేయవలెను.

7. జిల్లా కేంద్ర గ్రంథాలయ పుస్తక భాండాగారులు శాఖా గ్రంథాలయములకు తనిఖీ అధికారులుగా వుండవలెను. వీరు అవసరమైనపుడు యితర గ్రంథాలయములకుకూడ తనిఖీకి వెళ్ళవచ్చును. శాఖా గ్రంథాలయ పుస్తక భాండాగారులు సహాయక గ్రంథాలయములకు, తదితర గ్రామీణ ప్రాంతములలోని పుస్తక పంపిణీ కేంద్రాలకు తనిఖీ అధికారులుగా వుండవలెను.

ఈ ఉత్తర్వులు జారీ అయినప్పటినుండి జిల్లా కేంద్ర గ్రంథాలయ పుస్తక భాండాగారులు సాంకేతికముగా గ్రంథాలయాల అభివృద్ధికి మిగుల కృషి చేసిరి. వారిలో ఆత్మాభిమానము, విశ్వాసము ఏర్పడినది.

### లోకల్ లైబ్రరీ అథారిటీ చైర్మన్ల కార్యదర్శుల మధ్య అవగాహన:

సాధారణముగా సెక్రటరీల లోకల్ లైబ్రరీ అథారిటీ చైర్మెన్ల మధ్య సహకారము చక్కగా ఉండినది. 1948 చట్టము క్రింద రూపొందించబడిన 42 వ నిబంధనయందు కార్యదర్శుల, చైర్మెన్ల విధులు వివరింపబడినవి. కొన్ని సందర్భములలో ఈ నిబంధనలను అమలుపరచు సమయమున వీరిరువురికి కొంతవరకు కొన్ని జిల్లాలలో అభిప్రాయభేదములు కలుగుచుండెడివి. అటువంటి సందర్భములందు ప్రత్యేకాధికారి గారైన రాఘవరెడ్డిగారు ఈ నిబంధనలను అమలు పరచడములో ఐక్యత, సహకారము ఇరువురికి ముఖ్యమని భేదాభిప్రాయముల విస్మరించి నిబంధనలను సక్రమముగా అమలుపరచుటకు సంయుక్తముగా కృషి చేయవలెనని తెలుపుచుండిరి. వారిలో సుహృద్భావమును పెంపొందించిరి.

### లోకల్ లైబ్రరీ అథారిటీలు సహాయక ఇతర గ్రంథాలయాలకు చేసిన సహాయము:-

లోకల్ లైబ్రరీ అథారిటీలు తమ జిల్లాలలో గ్రంథాలయములను ఏర్పాటుచేసి, చదువుకొనుటకు తగు వసతులను కలుగజేయవలయును. లోకల్ లైబ్రరీ అథారిటీవారు వారి అజమాయిషీ క్రిందనున్న గ్రంథాలయాల నిర్వహణ బాధ్యతను నిర్వర్తించడమేగాక ఆ జిల్లాలోని యితరుల అజమాయిషీ క్రిందనున్న గ్రంథాలయ పుస్తక భాండాగారులతో కూడ గ్రంథాలయాభివృద్ధి, తదితర విషయములయందు సహకరించెడివారు.

ఉమ్మడి మదరాసు రాష్ట్రమున గ్రామీణాభివృద్ధి పథకము (రూరల్ డెవలప్ మెంట్ స్కీము) క్రింద 1948 లో ఫిర్కా కేంద్ర గ్రంథాలయములను స్థాపించి యుండిరి. ప్రతి ఫిర్కా కేంద్ర గ్రంథాలయమున ఒక పుస్తక భాండాగారి మరియు గ్రామీణ ప్రాంత

వాసులకు పుస్తకముల నందించుటకు ఒక బంట్రోతు ఉండిరి. ఈ గ్రంథాలయ నిర్వహణ బాధ్యతలను మండల విస్తరణాధికారులు (బ్లాక్ డెవలప్‌మెంట్ ఆఫీసర్లు) నిర్వహించుచుండిరి. కొంత కాలము నకు మండల విస్తరణాధికారులకు ఫిర్కా కేంద్ర గ్రంథాలయముల నిర్వహణ కష్టసాధ్యమైనది. ఆ గ్రంథాలయ ఉద్యోగులకు జీతమిచ్చు టకు తగు నిధులు లేవని ఫిర్కా కేంద్ర గ్రంథాలయముల నిర్వహణ బాధ్యత తమకు సాధ్యము కాదని తెలుపగా లోకల్ లైబ్రరీ అథా రిటి వారు ఫిర్కా కేంద్ర గ్రంథాలయముల నిర్వహణ బాధ్యత తాము తీసికొనుటకు అందు పనిచేయు ఉద్యోగులకు జీతముల నిచ్చు టకు సంసిద్ధతను వ్యక్తపరచి యీ క్రింది ఫిర్కా కేంద్ర గ్రంథాలయ ముల నిర్వహణ బాధ్యతలను స్వీకరించుటకు సిద్ధపడిరి.

| ఫిర్కా కేంద్ర గ్రంథాలయము | జిల్లా |
|---|---|
| 1. గార | శ్రీకాకుళం |
| 2. నగరి | చిత్తూరు |
| 3. పెందుర్తి | విశాఖపట్నం |
| 4. గోపన్నపాలెం | పశ్చిమ గోదావరి |
| 5. నూజివీడు | కృష్ణా |
| 6. కోరుకొండ | తూర్పు గోదావరి |
| 7. అమ్మనబ్రోలు | గుంటూరు |
| 8. వెంకటాచలం | నెల్లూరు |
| 9. జమ్మలమడుగు | కడప |
| 10. కర్నూలు | కర్నూలు |
| 11. కొడిగినహళ్లి | అనంతపురము |
| 12. ఆలూరు | కర్నూలు |

లోకల్ లైబ్రరీ అథారిటీలు ఫిర్కా కేంద్ర గ్రంథాలయ నిర్వహణ బాధ్యత వహించుటకు సిద్ధపడుటయేగాక సహాయక గ్రంథాలయములకు, పురపాలక గ్రంథాలయములకు అన్ని విధముల సహాయ పడుటకు సంసిద్ధతను వ్యక్త పరచినవి. ఆర్థికముగా ఈ గ్రంథాలయముల నిర్వహణ కష్టముగా నున్నపుడు గ్రంథాలయ పాలకులు యీ గ్రంథాలయములను మూసివేయదలచినచో వాటిని మూసి వేయరాదని, వాటి నిర్వహణ బాధ్యతలను కూడ తామే భరించ గలమని లోకల్ లైబ్రరీ అథారిటీవారు తెల్పుచుండిరి. ఉదా: తూర్పు గోదావరి జిల్లాలోని సామర్లకోట కమ్యూనిటీ ప్రాజెక్టు ఏరియా యందలి ఐదు సంచార గ్రంథాలయముల నిర్వహణ వారికి సాధ్యము కానపుడు తూర్పు గోదావరి జిల్లా లోకల్ లైబ్రరీ అథారిటీవారు వీని నిర్వహణ బాధ్యతలను స్వీకరించిరి. 1956 – 57 సం॥ కొన్ని సహాయక గ్రంథాలయముల నిర్వహణ కష్టమై, మూత పడు స్థితిలో నున్నపుడు లోకల్ లైబ్రరీ అథారిటీలు మూడు సహాయక గ్రంథాలయముల నిర్వహణ బాధ్యతలను స్వీకరించినవి.

ఈ విధముగ ఏవేని సహాయక గ్రంథాలయములు, తదితర గ్రంథాలయముల నిర్వహణ బాధ్యత ఆ గ్రంథాలయ పాలకులకు కష్టతరమై వారు ఆ గ్రంథాలయములను మూసివేయడానికి పూను కొన్నపుడు వాటి నిర్వహణ బాధ్యతలను లోకల్ లైబ్రరీ అథారిటీ వారు స్వీకరించుటకు సంసిద్ధులగుచుండిరి. ఈ సహాయక గ్రంథాలయ ములకు ఏవేని పుస్తకములు కావలసి వచ్చినపుడు లోకల్ లైబ్రరీ అథారిటీ వారు ఆ పుస్తకములను పంపుచుండిరి. కొన్ని సందర్భా లలో సహాయక గ్రంథాలయములందలి సాంకేతిక కార్యకలాపము లకు లోకల్ లైబ్రరీ అథారిటీవారు కొంతవరకు తోడ్పడుచుండిరి.

## పుస్తక పంపిణీ కేంద్రాల స్థాపన - వాటి నిర్వహణకు సూచనలు: —

5000 కు తక్కువగాను 1000 కి పైగను జనాభా ఉన్న ప్రతి గ్రామమునందు పౌరగ్రంథాలయ చట్టప్రకారము ఒక పుస్తక పంపిణీ కేంద్రమును ఏర్పాటు చేయవలెను. 1000 మంది జనాభా గల మూడు చిన్నగ్రామములు ఒక దానికి సమీపమున మరొకటి కలిసి ఉన్నచో ఆ ప్రాంతమునందు కూడ ఒక పుస్తక పంపిణీ కేంద్రమును ఏర్పాటు చేయవలయును. ఈ నిబంధన మేరకు లోకల్ లైబ్రరీ అథారిటీలు 1954 – 55 సం॥లో ఆంధ్ర ప్రాంతమునందు 35 పుస్తక పంపిణీ కేంద్రాలను స్థాపించినవి. ఇంగ్లాండు తదితర పాశ్చాత్య దేశములందు కూడ ఈ విధముగా పుస్తక పంపిణీ కేంద్రములను స్థాపించి అందు శిక్షణ పొందిన వారిని పుస్తక భాండాగారులుగా నియమించి సక్రమముగా వీటిని నిర్వహించు చున్నారు. ఇంగ్లాండు నందలి పుస్తక పంపిణీ కేంద్రముల నిర్వహణ విధానమును గ్రహించిన ప్రత్యేకాధికారియగు రాఘవరెడ్డిగారు, నిర్వహణకు సంబంధించిన సూచనలను తరచుగా యిచ్చుచుండిరి. 3—8—1954 న మన రాష్ట్రమున పుస్తక పంపిణీ కేంద్రములను నిర్వహించుటకు ఈ క్రింది ప్రధాన సలహాల నిచ్చి లోకల్ లైబ్రరీ అథారిటీ వారు పుస్తక పంపిణీ కేంద్రముల స్థాపనకు మిగుల ప్రోత్సాహమును కల్పించిరి.

1. ప్రస్తుతము జిల్లా కేంద్ర గ్రంథాలయమునకు 5 మైళ్ళ లోన గాని లేదా శాఖా గ్రంథాలయమునకు 5 మైళ్ళలోన గాని కల ఒక గ్రామమునందు పుస్తక పంపిణీ కేంద్రమును ఏర్పాటు చేయవలెను.

2. సహాయక, తదితర గ్రంథాలయము లున్న గ్రామములందు పుస్తక పంపిణీ కేంద్రములను ఏర్పాటు చేయరాదు.

3. పంపిణీ కేంద్రములను గ్రామములలోని ప్రాథమిక పాఠశాలల యందు స్థాపింప వచ్చును. ప్రాథమిక పాఠశాలలు అనుకూలముగా లేకున్న ఏదేని ఒక గృహమునందు స్థాపించి, ఆ గృహమునకు నామమాత్రపు అద్దె చెల్లించవచ్చును.

4. పుస్తక పంపిణీ కేంద్రాలు స్థాపించబడు ప్రదేశములందు పుస్తకములను నిలువ వుంచుకొనుటకు, కొన్ని సందర్భములలో పుస్తక ప్రదర్శనలు జరుపుకొనుటకు కావలసిన స్థల ముండవలెను.

5. పుస్తకముల నమర్చుకొనుటకు కావలసిన బీరువాలను, పుస్తకములను సరఫరా చేసికొనుటకు కావలసిన పెట్టెలను లోకల్ లైబ్రరీ అథారిటీలు పంపిణీ కేంద్రములకు పంపిణీ చేయవలెను.

6. వయోజన విద్యలో శిక్షణ పొందినటువంటి వారికి ఈ కేంద్రముల నిర్వహణ బాధ్యతల నప్పగించవలెను. వయోజన విద్యలో శిక్షణ పొందినవారు లేని సందర్భములందు వయోజన విద్య యందభిమానము కలవారికిగాని, గ్రంథాలయాభిమానులకుగాని ఈ బాధ్యత నప్పగించవలెను.

7. పంపిణీ కేంద్రములలోని పుస్తకములను అప్పుడప్పుడు మార్చుచుండవలెను. జిల్లా కేంద్ర గ్రంథాలయము నుండిగాని, శాఖా గ్రంథాలయము నుండిగాని ఈ కేంద్రములకు సరఫరా చేయబడిన పుస్తకములను కొంతకాలము ఈ కేంద్రము లందుంచి తరువాత ఆ పుస్తకములను ఆ యా జిల్లా కేంద్ర గ్రంథాలయము లేదా శాఖా గ్రంథాలయముల కప్పగించి తిరిగి అచటినుండి కొత్త పుస్తకములను పంపిణీ కేంద్రములకు సరఫరా చేయవలెను.

8. సాధారణముగా పక్షమున కొకమారు లేదా అవసరమైనపుడు పాత పుస్తకములను జిల్లా లేదా శాఖా గ్రంథాలయము

లకు చేర్చుటకు, జిల్లా లేదా శాఖా గ్రంథాలయములనుండి ఆ కేంద్రములకు క్రొత్త పుస్తకములను సరఫరా చేయుటకు ఒక సైకిలును, ఒక వ్యక్తిని ఏర్పాటు చేయవలసిన బాధ్యత లోకల్ లైబ్రరీ అథారిటీ వారిది. ఈ విధముగా జరుపుటకు వీలు లేని పక్షమున ఆ యా కేంద్ర నిర్వాహకులే జిల్లా కేంద్ర లేదా శాఖా గ్రంథాలయములకు వచ్చి వెనుకటి పుస్తకముల నప్పగించి క్రొత్త పుస్తకములను తీసికొని పోవలెను.

9. పుస్తక పంపిణీ కేంద్రముల నిర్వహణ బాధ్యత తీసికొన్న వారికి వారి గ్రంథాలయ సేవకు ప్రతిఫలముగా లోకల్ లైబ్రరీ అథారిటీలు నెలకు రూ. 7-8-0 లు చెల్లించవలెను. జిల్లా కేంద్ర లేదా శాఖా గ్రంథాలయములకు వచ్చి పుస్తకములను తీసికొనిపోవు కేంద్రముల నిర్వాహకులకు నెలకు రూ. 8-12-0 బత్తెముగా చెల్లించవలెను. జిల్లా కేంద్ర, శాఖా గ్రంథాలయములకు తీసికొనిపోబడు పుస్తకముల పెట్టెలను లోకల్ లైబ్రరీ అథారిటీవారే యివ్వవలెను.

10. జిల్లా కేంద్ర లేదా శాఖా గ్రంథాలయముల నుండి సరఫరాచేయబడిన పుస్తకముల జాబితా వివరములను పంపిణీ కేంద్రముల నిర్వహణ బాధ్యత తీసికొన్న వ్యక్తి తయారుచేయవలెను. పుస్తక పంపిణీ కేంద్రములందుగల పుస్తకములను గురించి ఆ గ్రామస్థులకు తెలిపి వారికి కావలసిన పుస్తకములను పంపిణీచేయు బాధ్యత కూడ పుస్తక పంపిణీ కేంద్రాల నిర్వాహకులదయి యుండవలెను.

11. జిల్లా కేంద్ర మఱియు శాఖా గ్రంథాలయములయందు గ్రంథాలయ పాఠకుల నుండి ధరావత్తు వసూలుచేయు విధముగా పుస్తక పంపిణీ కేంద్రములు స్థాపించబడిన గ్రామములలో గ్రంథ పాఠకుల నుండి డిపాజిట్టును వసూలు చేయవలసిన అవసరమున్నచో ఎంత పైకమును వసూలు చేయవలయునని నిర్ణయించవలసిన బాధ్యత లోకల్ లైబ్రరీ అథారిటీవారిదే.

12. జిల్లా కేంద్ర గ్రంథాలయమునకు ఐదుమైళ్ళ పరిధిలో నున్న కేంద్రాలను ఆ యా జిల్లా కేంద్ర గ్రంథాలయ పాలకులు తనిఖీ చేయవలెను. శాఖా గ్రంథాలయమునకు ఐదు మైళ్ళ పరిధిలో నున్న కేంద్రములను ఆ యా శాఖా గ్రంథాలయాధికారులు తనిఖీ చేయవలెను.

ఈ విధముగా ప్రత్యేకాధికారిగానైన రాఘవరెడ్డిగారు లోకల్ లైబ్రరీ అథారిటీలకు పుస్తక పంపిణీ కేంద్రాల నిర్వహణకు సంబంధించిన సూచనలను యిచ్చుటయేగాక, ఆ కేంద్రముల నిర్వహణకు సంబంధించి తరచుగా లోకల్ లైబ్రరీ అథారిటీ వారికి కలిగెడు సందేహాలను కూడ నివృత్తి చేయుచుండిరి. ఉదా॥ ఒక గ్రామమునందలి పుస్తక పంపిణీ కేంద్ర నిర్వహణ బాధ్యతను ప్రాథమిక పాఠశాల ఉపాధ్యాయుడు చక్కగా నిర్వర్తించని యెడల ఆ గ్రామము నందలి సాంఘిక సేవాభిలాషికి ఈ బాధ్యత నప్పగించ వలసినదని లోకల్ లైబ్రరీ అథారిటీ వారికి తెలియజేసెడివారు.

పగలంతయు శ్రమించి సాయంత్రములందు ఈ కేంద్రములను తెరచుట యిబ్బందికరముగా యున్నదని, లోకల్ లైబ్రరీ అథారిటీలు యిచ్చు ప్రతిఫలము తగినంతగా లేదని కాలక్రమమున పుస్తక పంపిణీ కేంద్రముల నిర్వాహకులు కొందరు వీటిని స్థాపించు నపుడున్నంత ఉత్సాహముతో లేకపోయిరి. అయినప్పటికి లోకల్ లైబ్రరీ అథారిటీ వారిచ్చు ప్రతిఫలమును లెక్కలోనికి తీసికొనక అమితోత్సాహముతో ప్రజలకు గ్రంథ సేవ చేయవలయునను తలంపుతో పుస్తక పంపిణీ కేంద్రములను చక్కగా నిర్వహించిన వారు లేకపోలేదు.

**లోకల్ లైబ్రరీ అథారిటీ గ్రంథాలయాలకు విరాళాలు:-**

గ్రంథాలయ సెస్సు, గ్రంథాలయములకు ప్రభుత్వ మిచ్చు నటువంటి గ్రాంట్లు గ్రంథాలయముల అభివృద్ధికి తగినంతగా లేనందు

వలన కొన్ని జిల్లాలలోని కొందరు లోకల్ లైబ్రిరీ అథారిటీ సభ్యులు సంపన్నులనుండి విరాళములను పొందిరి. ఇంగ్లాండు, అమెరికా మున్నగు దేశములందలి సంపన్నులు కూడ ఆ దేశముల గ్రంథాలయాభివృద్ధికి ఉదారముగా విరాళము లిచ్చుచుండిరి. అట్టి వారిలో ఆండ్రూ కార్నిగి ప్రశంసింప దగినవారు. వీరు పెద్ద మొత్తములను గ్రంథాలయముల అభివృద్ధికి విరాళముగా యిచ్చిరి. గ్రంథాలయాల అభివృద్ధికి విరాళముల నొసగెడివారు మన రాష్ట్రమునందు కూడ లేకపో లేదు. ప్రత్యేకాధికారియైన రాఘువరెడ్డిగారు గృహయజమానులను కలిసి కొన్ని భవనములను కూడ లోకల్ లైబ్రరీ అథారిటీలకు విరాళముగా నొసంగి జేసిరి. పుస్తక భాండాగారులు సంపన్నుల నుండి గ్రంథాలయములకు కావలసిన పుస్తకములను, ఫర్నీచర్‌ను కొంతవరకు విరాళముగా పొందిరి. ఈ విధముగా ఆంధ్రప్రదేశ్ అవతరణ నాటికి లోకల్ లైబ్రరీ అథారిటీలు సుమారు రెండు లక్షలకు పైబడి విలువచేయు భవనములను, పుస్తకములను విరాళముగా పొందినవి.

## గ్రంథాలయ సెస్సు సక్రమమైన వసూళ్ళకై చర్యలు:—

ఆంధ్ర రాష్ట్రము ఏర్పడిన తరువాత కూడ గ్రంథాలయ సెస్సు ఆశించినంత వసూలు కాకపోయినను సెస్సు వసూలు కొంతవరకు మెరుగు పడినదని చెప్పవచ్చును. ఇందులకు కారణములుగా ఈ క్రింది వానిని పేర్కొన వచ్చును.

చాలవరకు పురపాలక సంస్థలు, కొంతవరకు మేజర్ పంచాయతీలు గ్రంథాలయ సెస్సు వసూలు చేయడము తమ బాధ్యతయని గ్రంథాలయ సెస్సును వసూలు చేయుటకు దృఢసంకల్పముతో పూను కొన్నవి. మైనర్ పంచాయతీలలో మాత్రం సెస్సు వసూలు తృప్తి కరముగా లేదు.

పురపాలక సంస్థలు పంచాయతీలు వసూలైన సెస్సును ఖజానాలో చెల్లించుచుండినవి. ఖజానా అధికారులు, పురపాలక సంస్థలు, పంచాయతీలు కట్టిన సెస్సు రశీదులలో ఒకదానిని లోకల్ లైబ్రరీ అథారిటీ వారికి పంపుచుండిరి. దీని వలన లోకల్ లైబ్రరీ అథారిటీ వారు ఎవరు గ్రంథాలయ సెస్సు చెల్లించలేదో గ్రహించి వారికి తిరిగి విజ్ఞప్తి చేయుచుండిరి.

లోకల్ లైబ్రరీ అథారిటీ చైర్మన్‌లు, పుస్తకభాండాగారులు కొందరు పురపాలక శాఖాధికారులను, పంచాయతీ అధికారులను కలిసి గ్రంథాలయ సెస్సును సక్రమముగా వసూలు చేయవలెనని తెలియజేయుచుండిరి. రాఘవరెడ్డిగారు కూడ గ్రంథాలయాల తనిఖీకి వెళ్ళే సందర్భాలలో పురపాలక శాఖాధికారులను, పంచాయతీ అధికారులను కలిసి గ్రంథాలయ సెస్సు వసూలు సక్రమముగా జరుగకున్న గ్రంథాలయోద్యమము, గ్రంథాలయముల అభివృద్ధి కుంటుపడుననియు, సెస్సు వసూలు జేయు బాధ్యత వారిపైన ఎంతేని కలదనియు నొక్కిచెప్పి గ్రంథాలయ సెస్సు సక్రమముగా వసూలగుటకు మిగుల శ్రద్ధ వహించిరి.

ఈ విధముగా అధికారుల శ్రద్ధవలన గ్రంథాలయ సెస్సు వసూలులో కొంత మెరుగు కన్పించి నప్పటికిఆశించినంత మేరకు వసూలు కాకపోవుటకు ఈ క్రింది వాటిని ప్రధాన కారణములుగా పేర్కొన వచ్చును.

1. గ్రంథాలయ సెస్సు వసూలు చేయని వారి యెడలను, చేయుటలో జాప్యము చేయువారి యెడలను తీసికోదగు చర్య చట్టములో కాని, నిబంధనలలో కాని సూచించబడలేదు.

2. మైనర్ పంచాయితీలు తమకు సిబ్బంది లేని కారణముగా గ్రంథాలయ సెస్సును వసూలు చేయలేక పోయినవి.

3. పంచాయతీలు గ్రంథాలయముల యొక్క అవశ్యకత, వాటి ప్రాముఖ్యతను సరిగా గుర్తించలేదు.

4. వసూలు కాబడిన గ్రంథాలయ సెస్సును మైనర్ పంచాయి తీలు జమకట్టుటకు కూడా తెలియని పరిస్థితిలో యుండినవి.

5. గ్రంథాలయ సెస్సును గూర్చిన వివరములుగల రిజిష్టర్లు ప్రత్యేకముగా లేక పోయినవి.

## ఆధునిక పద్ధతులలో గ్రంథాలయాల నిర్వహణ.

1952-53 సం॥ ఆంధ్రరాష్ట్రములోని 11 జిల్లాలలోను జిల్లా కేంద్రగ్రంథాలయములు స్థాపించబడినవి. 1953-54 సం॥ 19 శాఖా గ్రంథాలయములు స్థాపించబడినవి. ఈ గ్రంథాలయములను, స్థాపించ బోవు పౌర గ్రంథాలయములను నవీన పద్ధతిలో నడుపవలెనని రాఘవరెడ్డిగారు సంకల్పించారు. వీరు ఇంగ్లాండుకు వెళ్ళుటకు ముందు అప్పటి విద్యాశాఖా మంత్రిగారైన అవినాశిలింగం చెట్టియార్ గారు, విద్యాశాఖ కార్యదర్శి ఉన్నితాన్ గారు ఇంగ్లాండులోని పౌర గ్రంథా లయములకు వెళ్లి అచ్చటి గ్రంథాలయ నిర్వహణా విధాన ములను గురించి కూడ సమయమున్నపుడు సమగ్ర పరిశీల నము చేసి రమ్మనిరి. రెడ్డిగారికి ఇంగ్లాండునందు విద్యాసంబంధ అధ్యయన శిక్షణ సులభతరమగుటచే కొద్ది కాలము విద్యాసంబంధ అధ్యయన శిక్షణ కుపయోగించి మిగిలిన కాలము ఇంగ్లాండులోని పౌరగ్రంథాలయములకు వెళ్ళి అచ్చటి గ్రంథపాలకులతో చర్చించి గ్రంథాలయ నిర్వహణ విధానములను కూలంకషముగా ఆకళింపు జేసికొనిరి. ఇంగ్లాండునందు విద్యాసంబంధ పరిపాలనా యంత్రాంగ విధాన అధ్యయన శిక్షణయందు ఉత్తీర్ణులై, స్కాట్లాండ్, ఫ్రాన్స్, ఐర్లాండ్, స్విట్జర్లాండ్ మున్నగు దేశములకు వెళ్ళి అచ్చటి పౌర

గ్రంథాలయ పుస్తక భాండాగారులతో గ్రంథాలయ విషయముల గురించి చర్చించి, గ్రంథాలయ నిర్వాహణ విధానములను గ్రహించి స్వదేశమునకు వచ్చిరి. తరువాత మదరాసు విశ్వవిద్యాలయమున ఒక సంవత్సర కాలము గ్రంథాలయ శాస్త్రమున శిక్షణ పొందిరి. కావున వీరికి గ్రంథాలయముల ఆధునిక పద్ధతులతో నిర్వహించడము సులభతరమైనది. గ్రంథాలయ సెక్రటరీలుగా నుండిన జిల్లా విద్యాశాఖాధికారులు శిక్షణ పొందినవారు కారు. జిల్లా కేంద్ర గ్రంథాలయ పుస్తక భాండాగారులు నూతనముగా శిక్షణ పొంది వచ్చినవారు. కాన, గ్రంథాలయములను నూతనపద్ధతిలో నడిపించు బాధ్యతతోపాటు వాటి నిర్వాహణ బాధ్యత కూడ రాఘవరెడ్డిగారిపై బడినది. వీరు గ్రంథాలయముల నిర్వాహణ విధానమును చక్కగా రూపొందించి ఇందుకు గట్టి పునాదివేసి గ్రంథాలయములు నవీన పద్ధతుల నవలంబించుటకు మిగుల కృషి చేసిరి. వీరి కృషివలననే చాలా గ్రంథాలయములు నవీనపద్ధతులలో విజయవంతముగా ప్రజోపయోగకరముగా నడచుచున్నవి. ఇందులకు రాఘవరెడ్డిగారి యొక్క అరమరలేని ఆసక్తి, ఎడతెగని కృషియే ప్రధానమని పేర్కొనక తప్పదు.

## గ్రంథాలయ భవనములు

1952-53 సం॥ ప్రారంభించబడిన జిల్లాకేంద్ర గ్రంథాలయములు, తరువాతి కాలమున ప్రారంభించబడిన శాఖాగ్రంథాలయములు చాలావరకు అద్దెకు తీసికొనబడిన భవనములలో నుండినవి. గ్రంథాలయములందు నవీన పద్ధతులు అమలుపరచుటకు ఈ అద్దె భవనములను కొంతవరకు పునర్నిర్మించవలసి వచ్చినది. కాని ఈ విధముగా పునర్నిర్మించుటకు ఆ భవనముల యజమానులు అంగీకరించకపోయిరి. కాన ఉన్న భవనములలోనే సాధ్యమైనంత వరకు నవీన పద్ధతులను అమలుపరచుటకు ప్రయత్నించిరి.

ఇంగ్లాండునందు 1850 లో పౌర గ్రంథాలయ చట్టము అమలులోనికి వచ్చినప్పటికి అచట కూడ తగిన స్వంత గ్రంథాలయ భవనములు లేకపోవుటచే నవీన పద్ధతిలో గ్రంథాలయ నిర్వహణ కష్టసాధ్యమైనది. కాన 1919 లో ఈ చట్టమునందు గ్రంథాలయ సెస్సు సవరణచేయబడుటచేత, గ్రంథాలయ భవనముల నిర్మించి నవీనపద్ధతిలో గ్రంథాలయములను నిర్వహించుటకు వీలైనది. అదేవిధముగా మనరాష్ట్రమునకూడ గ్రంథాలయ సెస్సును తగినంతగా వసూలుచేసిన సొంత గ్రంథాలయ భవనములను నిర్మించుకొనుటకు, నవీన పద్ధతిలో గ్రంథాలయ నిర్వహణ విధానములను ప్రవేశపెట్టుటకు వీలగును.

## గ్రంథాలయాలలో ప్రత్యేక విభాగములు:

ఇంగ్లాండు నందలి లీడ్స్ పట్టణ కేంద్ర పౌర గ్రంథాలయమునకు మాంచెస్టర్, షెఫీల్డు మున్నగు పట్టణ పౌర గ్రంథాలయములకు 1947-48 లో తరచుగా వెళ్ళుచుండిన రాఘవరెడ్డిగారు ఆ గ్రంథాలయముల నిర్వహణ విధానములను, ఆ గ్రంథాలయములందు వివిధ విభాగములను గురించి క్షుణ్ణముగా గ్రహించి, ఆ విధమైన ప్రత్యేక విభాగములను మనరాష్ట్రంలోని జిల్లా కేంద్ర గ్రంథాలయములందు, పెద్ద శాఖా గ్రంథాలయములందు ప్రవేశపెట్టిన చదువరులకు మిగుల ప్రయోజనకరమగునని గ్రంథాలయ పుస్తక భాండాగారులకు తెలియజేసెడివారు. ఆవిభాగములలో ప్రధానముగా పత్రికల విభాగము, పుస్తకముల అరువిచ్చు విభాగము, పెద్దలు చదువుకొనుటకు ఒక ప్రత్యేకవిభాగము, బాలలుచదువుకొనుటకు ఒక ప్రత్యేకవిభాగము, ఆచూకీ విభాగము, సాంకేతిక సేవావిభాగము, గ్రంథాలయ శాఖ పరిపాలనా విభాగము గ్రంథసూచి విభాగము, వయోజన విద్యా

విభాగము అవసర మున్నపుడు మహిళలకు ప్రత్యేకవిభాగము, విద్యార్థులకు వేరువిభాగము, మున్నగునవి ప్రధాన విభాగములు. పీటిలో పై తెలిపిన విభాగములను గ్రంథాలయభవనములలో గల స్థలము ననుసరించి జిల్లా కేంద్రగ్రంథాలయములందు, పెద్దశాఖా గ్రంథాలయ ములయందు తప్పనిసరిగా శీఘ్రముగా ఏర్పాటు చేయవలెనని, స్వంత గ్రంథాలయభవనములు ఏర్పడినతర్వాత ఇతరవిభాగములను ఏర్పాటు చేసికొనవచ్చునని గ్రంథపాలకులకు రాఘవరెడ్డిగారు తెలియబరచిరి. జిల్లా కేంద్ర గ్రంథాలయములను స్థాపించిన రెండుసంవత్సరములలోనే చాల జిల్లా కేంద్ర గ్రంథాలయములలో ఈ విభాగములలో ప్రధాన మైన వాటిని ఏర్పరచడము జరిగినది. ఏ గ్రంథాలయ భవనమునందైనను విశాలమైన హాలు ఉండినచో ఆ హాలును కొన్ని భాగములుగా విభజించి అందు ఈ విభాగముల నేర్పాటు చేయుచుండిరి. ఉదా: శ్రీకాకుళం జిల్లా కేంద్రగ్రంథాలయమునందు ఈవిధముగ చేసిరి. ఏ గ్రంథాలయ భవనమునందైనను కొన్ని గదులున్నచో గదికొక విభాగమును ఏర్పాటు చేయవలెను. ఉదా: చిత్తూరు జిల్లా కేంద్ర గ్రంథాలయమునందు ఈ విధముగా ఏర్పాటు చేయడము జరిగినది.

**మహిళా సంచార గ్రంథాలయములు:**

కొందరు జిల్లా కేంద్ర గ్రంథపాలకులు ఉత్సాహముతో గ్రంథాలయములందు మహిళలకు ప్రత్యేక విభాగముల నేర్పాటు చేయు తలంపును కలిగియుండిరి. ఉదా: కర్నూలు జిల్లా లోకల్ లైబ్రరీ అథారిటీవారు మహిళలకు ప్రత్యేక విభాగము ఏర్పాటు చేయుటకు గట్టి కృషిచేసిరి.



మహిళల గ్రంథాలయము, కర్నూలు.

సాధారణముగా గ్రంథాలయములకు వచ్చు మహిళా పాఠకుల సంఖ్య తక్కువ. కాన మహిళలకు గ్రంథాలయములందు ఒక ప్రత్యేక విభాగము ఏర్పాటుచేసిన ఆ విభాగము చాలావరకు ఖాళీగానే యుండునని, ఆ స్థలమును ఇతర శాఖలకు ఉపయోగించు కొనవచ్చునని, అంతగా అవసరమున్నచో మహిళలకు కావలసిన పుస్తకములను వారి గృహములకే వెళ్ళి ఇవ్వవచ్చునని భావించిరి. అంతేగాక మన దేశమునందు మహిళలు గ్రంథాలయములకు వచ్చుట కష్టతరమని అటువంటి వారి గృహములకే వెళ్ళి పుస్తకములను యివ్వవలయునని రాఘవరెడ్డిగారు తెలియబరచిరి. గ్రంథాలయ భవనములు విశాలముగానుండి మహిళా పాఠకుల సంఖ్య హెచ్చుగా నున్నచో మహిళా విభాగము ఏర్పాటు చేయవచ్చునని తెలియజేసిరి. ఇప్పుడు రాఘవరెడ్డిగారి సూచన మేరకు ప్రతిజిల్లా కేంద్ర గ్రంథాలయమునందే గాక కొన్ని పట్టణములందును ప్రత్యేక వాహన సదుపాయములతో మహిళలకు గృహములందే గ్రంథముల

బట్వాడా చేయు విధానము అమలులో యుండుట మిగుల ముదావహము.

## పాఠ్య పుస్తక విభాగము

కొందరు పుస్తక భాండాగారులు కళాశాల, విశ్వవిద్యాలయ విద్యార్థులకు జిల్లా కేంద్ర గ్రంథాలయములందు ఒక ప్రత్యేక విభాగము ఏర్పాటు చేయవలయునను ఉద్దేశ్యములో నుండిరి. సామాన్యముగా విద్యార్థులు పగలంతయు కళాశాల, విశ్వవిద్యాలయములలో నుందురు. కాన సాయంసమయములలో మాత్రము గ్రంథాలయములకువచ్చు అవకాశము కలిగియున్న వీరికి గ్రంథాలయమునందు ఒక ప్రత్యేక విభాగము నేర్పాటుచేసిన ఆ విభాగము చాలా వరకు ఖాళీగానే వుండునని, అవసరము వచ్చిన సందర్భాలలో మాత్రము అటువంటి ప్రత్యేక విభాగముల నేర్పరచుకొన వచ్చునని రాఘవరెడ్డి గారు స్పష్టపరచిరి. విద్యార్థులకు గ్రంథాలయములందు ప్రత్యేక విభాగము ఏర్పాటు చేయవలయునను పట్టుదలగల లోకల్ లైబ్రరీ అథారిటీలలో పశ్చిమ గోదావరిజిల్లా లోకల్ లైబ్రరీ అథారిటీ ఒకటి.

ప్రతి పౌరగ్రంథాలమునందును పెద్దలకు పరిశ్రమలలో పని చేయువారికి, వృత్తివిద్య నభ్యసించువారికి, వ్యవసాయదారులకు అంధులకు, వికలాంగులకు, అనగా ప్రతిపౌరునికి కావలసినవసతులను కలుగజేయవలసిన బాధ్యత లోకల్ లైబ్రరీ అథారిటీ వారిదేనని గ్రంథాలయ పాలకులకు రాఘవరెడ్డిగారు తెలియచేసెడివారు. ఈ విధముగ ప్రతిపౌరునికి ఉపయోగకరమైన వసతులను పుస్తక భాండాగారులు కలుగజేసిన ప్రతిపౌరుడు తనకు అభిమానము కల వృత్తియందు నిపుణుడగుటకు సేవచేసిన ఘనత గ్రంథాలయములకు దక్కునని తెలియసేసెడివారు. ఈ విషయమై క్రొత్తగా శిక్షణ పొందిన గ్రంథపాలకులుకూడ కడుశ్రద్ధను కనబఱచిరి.

## ఆధునిక పద్ధతులలో శాఖాగ్రంథాలయాల నిర్వహణకు కృషి

శాఖాగ్రంథాలయ భవనములు చాలా వరకు అద్దెభవనములే. మఱియు యివి విశాలముగా లేకపోవుటచేత శాఖాగ్రంథాలయము లందు ప్రత్యేక విభాగముల నేర్పరచుటకు చాల వరకు వీలులేక పోయినది. అయినప్పటికి కొన్ని శాఖాగ్రంథాలయ భవనములు మాత్రము కొంత విశాలముగా నుండుటచేత, వాటియందు పై విభాగములలో పుస్తకములు అరువిచ్చు విభాగము, పెద్దలు, పిల్లలు చదువుకొను విభాగములు మున్నగు రెండు, మూడు విభాగములను ఏర్పాటు చేయుటకు వీలైనది. ఉదా : విజయవాడ, నంద్యాల, తెనాలి, రాజమండ్రి మున్నగు పట్టణములలోని శాఖాగ్రంథాలయములందు ప్రత్యేకముగా ఆచూకీ విభాగము లేనప్పటికి యీ తరగతికి చెందిన మంచి పుస్తకములను ఒక ప్రత్యేక బీరువాలయందు అమర్చెడివారు. చాల వరకు అన్ని శాఖాగ్రంథాలయములయందును పిల్లలకు, పెద్దలకు కావలసిన ఆచూకీ గ్రంథములను ప్రత్యేక బీరువాలయం దమర్చడము జరిగినది. ఈ శాఖాగ్రంథాలయములందు పత్రికావిభాగము లేక పోయినప్పటికి ముఖ్యమైన దిన, వార, పక్ష, మాస, తదితర పత్రికలను, సంచికలను తెప్పించెడివారు. వాటిని ఈ గ్రంథాలయాలలో చాపలపైన, అరుగులపైన, కూర్చొని పాఠకులు చదువుకొనుచుండిరి. ప్రతిశాఖా గ్రంథాలయమునందు ఉన్నత స్థాయికి చెందిన పుస్తకములు తప్పనిసరిగా పెట్టవలెనని, ప్రయోజనకరమగు పత్రికలను కూడ ప్రవేశపెట్టవలెనని రాఘవరెడ్డిగారు నొక్కి చెప్పుచుండిరి. జిల్లా కేంద్ర గ్రంథాలయ, శాఖాగ్రంథాలయ పుస్తక భాండాగారులు 1953–54, 1954–55, 1955–56 లలో క్రొత్తగా గ్రంథాలయశాస్త్ర శిక్షణపొంది వచ్చినవారు, కాన గ్రంథాలయముల అభివృద్ధికి అమితోత్సాహముతో కృషిచేసిరి.

# గ్రంథాలయాలకు అవసరమైన ఫర్నిచరు

గ్రంథాలయ నిధులు తగినంత లేకపోవుటచేత జిల్లా కేంద్ర గ్రంథాలయములకు మాత్రము కొంత ఫర్నిచర్‌ను లోకల్ లైబ్రరీ అథారిటీవారు పంపగలిగినారు. వారికి శాఖా గ్రంథాలయములకు కావలసిన ఫర్నీచర్‌ను పంపుటకు వీలులేకపోయినది. అయినప్పటికి ప్రతి గ్రంథాలయమునందును చదువుకొనుట కుపయోగించు బల్లలు, కుర్చీలు, అలమారాలు మున్నగువాటిని మాత్రము సాధ్యమైనంత వరకు పంపిణీ చేసిరి.

ఈ గ్రంథాలయములందు పుస్తకము లుంచుకొనుటకు, తెరువ బడిన కొయ్యచట్టముల బీరువాల నుంచుటకన్న స్టీలుబీరువాల నుంచుట మంచిదని రాఘవరెడ్డిగారు గ్రంథపాలకులకు తెలిపిరి. ఈ స్టీలుబీరువాలు సరసమైన ధరకు లభించి చాలకాలము వరకు ఉప యోగపడునని వీటిని ఉపయోగించుట వలన కలుగు ఉపయోగము లను వివరించుచుండిరి. అప్పటినుండి సాధ్యమైనంత వరకు అన్ని గ్రంథా లయములయందును పుస్తకముల నమర్చుటకు స్టీలు బీరువాల నుప యోగించడము జరిగినది.

లోకల్ లైబ్రరీ అథారిటీలు గ్రంథాలయములకు కావలసిన బల్లలను కొనుగోలు చేయునపుడు లేదా తయారుచేయించునపుడు ఇంగ్లాండులోని ప్రముఖ గ్రంథాలయశాస్త్రవేత్త అయిన శ్రీ హెడి కార్ రచనలయందు సూచించబడిన పరిమాణములలో నిర్మించు చుండిరి. హెడికార్‌గారి అభిప్రాయము ప్రకారము గ్రంథాలయ ములలోని బల్లలు చదువరులకు తగినంత విశాలముగా నుండవలెను. ఇంగ్లాండునందలి పలు గ్రంథాలయములయందుగూడ వీరిసూచనల మేరకే బల్లల నిర్మాణము జరిగినది. మనదేశమున ఇండియన్ స్టాండర్డ్సు ఇన్స్టిట్యూట్ వారు కొంత కాలానంతరము గ్రంథాలయముం

లందలి ఫర్నిచర్ కొలతల వివరములను స్పష్టముగా తెలియజేసిరి. ఆనాటినుండి వీరు తెలియ బరచిన విధముగా గ్రంథాలయములందలి ఫర్నిచర్ నుతయారుచేయవలెనని గ్రంథపాలకులను నిర్దేశించడమైనది. చదువరులు, కొన్ని చిన్నగ్రంథాలయములందు, వార్తాపత్రికలను క్రింద కూర్చొని చదువుకొనుచుండిరి. రాఘవరెడ్డిగారు వార్తాపత్రిక లను చదువుకొనుటకు, తగిన విధముగా అమర్చుకొనుటకు ఏటవాలుగా నున్న వార్తాపత్రికల స్టాండులను గ్రంథాలయములందు ఏర్పాటు చేయవలసినదిగా గ్రంథాలయ పుస్తక భాండాగారులకు తెలియజేసిరి. ఇతర పత్రికలను అమర్చుటకు కూడ పత్రికలస్టాండు ఏర్పాటు చేయవలెనని సూచించిరి. పెక్కుగ్రంథాలయములందు యీ ఏర్పాటు చేయడము జరిగినది, ఈ విధముగా గ్రంథాలయ పాఠకులకు తగిన ఫర్నిచర్తోపాటు తగిన అనుకూల వసతులను ఏర్పాటుచేయడ ములోకూడ రాఘవరెడ్డిగారు లోకల్ లైబ్రరీ అథారిటీ వారికి తగు సలహాల నిచ్చుచుండిరి. గ్రంథాలయాల తనిఖీకి వెళ్ళినపుడు గ్రంథ పాలకులకు గ్రంథాలయములను నవీన పద్ధతిలో నడుపుటకు అవసరమైన సలహాల నిచ్చుచుండిరి.

## గ్రంథాలయాలలో స్వేచ్ఛోపలబ్ధి ప్రవేశపెట్టుట

ఆంధ్రరాష్ట్రావతరణానంతరము స్థాపించబడిన, కొన్నిశాఖా గ్రంథాలయములందు గ్రంథములను తలుపులు గల బీరువాల యందుంచి తాళము వేసి వుంచెడివారు. పాఠకులు కోరినప్పుడు తలు పులు తెరచి పుస్తకముల నిచ్చెడివారు. ఈ విధముగా చేయుటవలన పాఠకులకు పుస్తకములు అందుబాటులో నుండవని మఱియు గ్రంథాలయమున యే పుస్తకములు కలవో తెలుసుకొనుటకు కూడ ఆస్కారముండక పోవుటచే తెరువబడిన అలమారల యందు పుస్తకములను చిన్నగ్రంథాలయములలో కూడ అమర్చవలెనని

గ్రంథాలయ పాలకులకు రాఘవరెడ్డిగారు తెలియజేసిరి. ఆ తరువాత కొద్దికాలమునకు చాల శాఖాగ్రంథాలయములందును, తదితర గ్రంథాలయములందును చదువరులకు ప్రయోజనకరముగా నుండుటకు తెరువబడిన అలమారలయందు పుస్తకములను అమర్చడము జరిగినది. ఉదా॥ రాయదుర్గము (అనంతపురము జిల్లా) శాఖాగ్రంథాలయములో చెక్క అలమారలకు గల తలుపులను తొలగించడంవల్ల పై పేర్కొనిన అవరోధములు తొలగుటయే గాక మరికొన్ని అలమారల నుంచుటకు వీలయినది. ఈ విధముగ పెక్కు శాఖాగ్రంథాలయములందు తెరువబడిన అలమారలయందే పుస్తకముల అమరిక జరిగినప్పటికి, ఈనాటికిని కొన్ని శాఖా గ్రంథాలయములలో తగిన వసతులు లేక పోవుటచేత మూయబడిన అలమారలయందే పుస్తకములను అమర్చియున్నారు. అవి నామమాత్రమే అని చెప్పవచ్చును.

## టికెట్టు పద్ధతి ద్వారా గ్రంథముల అరువు

గ్రంథాలయములందు చదువరులకు పుస్తకములను అరువిచ్చునపుడు ఆ పుస్తకముల వివరములను పుస్తక భాండాగారులు ఒక రిజిష్టరునందు వ్రాసుకొనెడివారు. ఈ పద్ధతివలన పాఠకులకు పుస్తక భాండాగారులకు వృథా కాలయాపన జరుగునని రిజిష్టరు పద్ధతికి బదులు టికెట్టుపద్ధతి మిగుల ప్రయోజనకరమని ప్రత్యేకాధికారియైన రాఘవ రెడ్డిగారు సూచించుటచేత ఆనాటి నుండి పెక్కు పౌరగ్రంథాలయములందు టికెట్టు పద్ధతి ప్రవేశపెట్టడము జరిగినది. వసతులులేని కొన్ని గ్రంథాలయాలలో మాత్రము యీ పద్ధతులను ప్రవేశపెట్టుటకు యీనాటికిని వీలులేకపోవుచున్నది.

## గ్రంథాలయాలలో దశాంశ వర్గీకరణ - నిఘంటు సూచీకరణ

అన్ని పౌరగ్రంథాలయములందును ఒకేమాదిరి పుస్తకముల వర్గీకరణ, (దశాంశ వర్గీకరణ) సూచీకరణ (నిఘంటు సూచీకరణ) విధానముల నవలంబించవలయునని రాఘవరెడ్డిగారు వ్యక్తము చేసిరి. ఇదే విధముగా మనరాష్ట్రములోని జిల్లా కేంద్రగ్రంథాలయములందును, ఇతర పౌరగ్రంథాలయములందును ఈ నాటికిని ఇదేపద్ధతులలో పుస్తకవర్గీకరణ, సూచీకరణ జరుగుచున్నది.

## గ్రంథాలయాలలో వయోజన విద్యా కార్యకలాపాలు

పౌర గ్రంథాలయములందు సాంఘిక, విద్యా సాంస్కృతిక కార్యకలాపములను ప్రవేశపెట్టవలసిన ఆవశ్యకత ఎంతేని కలదు. రాఘవరెడ్డిగారు 1947-48 సం॥ దర్శించిన ఇంగ్లాండునందలి లీడ్స్ పట్టణ పౌరగ్రంథాలయము, డబ్లిన్‌పట్టణ పౌర గ్రంథాలయము మున్నగు పౌరగ్రంథాలయములందు సాంఘిక, విద్యాసాంస్కృతిక కార్యకలాపములను అమలుపరచువిధమును నిశితముగా పరిశీలించిరి. విద్యారంగమున అభివృద్ధి చెందిన ఆదేశములందే ఈ కార్యకలాపములను ప్రవేశపెట్టినపుడు నిరక్షరాస్యతతో, అమాయకత్వముతోనున్న మనదేశమునందు విద్యాభివృద్ధులకు పౌరగ్రంథాలయములందు ఈ రకమైన సాంఘిక, విద్యాసాంస్కృతిక కార్యకలాపములను ప్రవేశపెట్టడము అన్ని విధముల శ్రేయస్కరమని సందర్భానుసారములను బట్టి రాఘవరెడ్డిగారు గ్రంథపాలకులకు సవివరముగా తెలియజేసిరి. ప్రజా ప్రభుత్వములో జరుగుచున్న అభివృద్ధి కార్యక్రమములతోపాటు ప్రజలు తమ బాధ్యతలు, హక్కులు తెలుసుకొని వ్యవహరించుటకు కూడ గ్రంథాలయముల ద్వారా సాంఘిక విద్యాకార్యక్రమములను చేపట్టవలెనని గ్రంథపాలకులకు తెలియజేసిరి. ఆనాటి నుండి సాధ్యమైనంత వరకు మనరాష్ట్రమునందలి పలు పౌరగ్రంథాలయములందు ఈరకమైన కార్యక్రమములను విజయవంతముగ అమలుజేయుచున్నారు. నేటికిని

యీ కార్యకలాపములు కొనసాగుచునే యున్నవి. కొన్ని శాఖా గ్రంథాలయములలో మాత్రము యీ కార్యక్రమములు అమలుపరచుటకు తగిన వసతులు, లేవు. అయినప్పటికి చాలా శాఖాగ్రంథాలయములలో సాంఘిక, విద్యాసాంస్కృతిక కార్యకలాపములను వున్న వసతులతోనే కొంతమేరకు అమలు పరచడము జరుగుచున్నది.

## గ్రంథాలయాలలో దృశ్య, శ్రవణ విద్యా కార్యకలాపాలు

ఇంగ్లాండు, అమెరికా మొదలగు దేశములలో దృశ్య, శ్రవణ విద్యావిధానమునకు సంబంధించిన కార్యకలాపములు పౌరగ్రంథాలయములందు అద్భుతముగా ప్రదర్శించుచున్నారు. దీనివలన నిరక్షరాస్యులైన ప్రజలకు కూడ అమిత ప్రయోజనము చేకూరును. కాన ఆర్థికముగా వెనుకబడి, పుస్తకములు కొనుటకే నిధులులేని మన రాష్ట్ర పౌరగ్రంథాలయములకు దృశ్య, శ్రవణ సాధనముల కొనుట సాధ్యము కాకపోయినప్పటికి కొన్ని పౌరగ్రంథాలయములందు రేడియోలను ప్రవేశపెట్టినారు: పౌరసంబంధ శాఖవారు అప్పుడప్పుడు కొన్ని విజ్ఞానదాయకమైన చలనచిత్రములను కొన్ని గ్రంథాలయములందు ప్రదర్శింపజేయుచుండిరి. బోర్డులు, చార్టులు, గ్లోబులు మున్నగు వాటిద్వారా కూడ జిల్లా కేంద్ర గ్రంథాలయములే గాక కొన్ని శాఖా గ్రంథాలయములుకూడ విద్యను గరపుచుండిరి. నేటికిని యీ విధమైన విజ్ఞానదాయకమైన కార్యకలాపములు పౌరగ్రంథాలయములందు నడుపబడుచున్నవి.

## గ్రంథాలయాలలో పిల్లల కార్యకలాపాలు

పిల్లలకు సంబంధించిన వివిధరకములైన కార్యకలాపములను (కథలు చెప్పుట, డ్రాయింగ్, పద్యపఠనము, రేడియో శ్రవణ కార్యక్రమములు) పౌరగ్రంథాలయములందు ప్రవేశపెట్టవలసిన బాధ్యత

లోకల్ లైబ్రరీ అథారిటీలదే నని రాఘవరెడ్డిగారు పుస్తకభాండా గారులకు స్పష్టపరచిరి. సాధ్యమైనంత వరకు తగువసతులు లేకపోయి నప్పటికి, జిల్లాకేంద్ర గ్రంథాలయముల యందును, కొన్ని శాఖా గ్రంథాలయములయందును ప్రత్యేకవిభాగముల నేర్పాటుచేసి ఈ కార్యకలాపములను నేటికిని నిర్వర్తించు చున్నారు:

## గ్రంథపాలకులకు శిక్షణ

పౌరగ్రంథాలయములను నవీనపద్ధతిలో నడుపవలెనన్న గ్రంథ పాలకులు గ్రంథాలయ శాస్త్రమునందు శిక్షణపొందినవారై యుం డుట అత్యావసరము. మన రాష్ట్రమున స్థాపించిన జిల్లాకేంద్ర, శాఖా గ్రంథాలయముల పాలకులు చాలావరకు, గ్రంథాలయ శాస్త్రమున శిక్షణ పొందనివారుగా నుండిరి. ఈ విషయమును గ్రహించిన రాఘవరెడ్డిగారు 1953-54 1954-55, 1955-56 లలో గ్రంథా లయములందభిమానులను ఎన్నుకొని గ్రంథాలయ శాస్త్రమున శిక్షణ పొందుటకై ఆంధ్రవిశ్వవిద్యాలయమునకు పంపిరి. ఆంధ్రప్రదేశ్ ఏర్పడునాటికి శిక్షణపొందని గ్రంథపాలకుల సంఖ్య నామమాత్రమేనని చెప్పవచ్చును. గ్రంథా పాలకులు గ్రంథాలయశాస్త్రమున శిక్షణ పొందియుండిన వారైనప్పటికి వీరికి గ్రంథాలయముల నిర్వహణా నూతనము గాన నూతనపద్ధతిలో గ్రంథాలయ నిర్వహణకు అవలం బించవలసిన విధానములను రాఘవరెడ్డిగారు తరచుగా తెలియజేయు చుండిరి.

జిల్లాకేంద్ర గ్రంథాలయముల తనిఖీకి ప్రత్యేకాధికారియైన రాఘవరెడ్డిగారు వెళ్ళినపుడు, శాఖా గ్రంథాలయముల తనిఖీకి జిల్లా కేంద్రగ్రంథాలయ పాలకులు వెళ్ళినపుడు, సహాయక తదితర గ్రామీణ గ్రంథాలయముల తనిఖీకి శాఖా గ్రంథాలయాధికారులు వెళ్ళినపుడు ఆయా గ్రంథాలయ పాలకులకు ఆధునిక పద్ధతిలో గ్రంథా లయముల నిర్వహణకు కావలసిన సూచనలను, సలహాలనుయిచ్చుచు,

నవీనపద్ధతులలో గ్రంథాలయముల నిర్వహించుటకు గల ఆవశ్యకతను వివరించెడివారు. అందువలన రాష్ట్రమంతట గల పలు గ్రంథాలయములను నవీనపద్ధతిలో నడపుటకు సాధ్యమైనది.

పౌర గ్రంథాలయములందు ఉపన్యాసముల నిచ్చుటకు ప్రత్యేకమైన హాలు లేనపుడు పఠనమందిరములోని కుర్చీలను, బల్లలను తీసివేసి ఆ ప్రదేశమును ఉపన్యాస స్థలముగా తాత్కాలికంగా ఉపయోగించుకొనవలసినదిగా రాఘవరెడ్డిగారు తెలియజేయుచుండిరి. ఉదా॥ అనంతపురము జిల్లా కేంద్రగ్రంథాలయమునందు గుంటూరునందు ప్రభుత్వ ప్రాంతీయ గ్రంథాలయము చిత్తూరు, శ్రీకాకుళము మున్నగు జిల్లాలలోని గ్రంథాలయములయందు కూడ ఈ విధ కార్యక్రమములు జరుగుచుండినవి.

## గ్రంథాలయాలకు నియమావళి

కొన్ని పౌరగ్రంథాలయములందు గ్రంథాలయ నిబంధనలు చాల కఠినముగా వుండినవి. ఈ నిబంధనలు గ్రంథాలయ పాఠకులకు యిబ్బంది కరముగా నుండినవి. రాఘవరెడ్డిగారు అట్టి గ్రంథాలయములందుండిన ఆ నిబంధనలను పరిశీలించి గ్రంథాలయ నిబంధనలు పాఠకులకు ప్రయోజనకరముగాను, సహాయకరముగాను వుండవలసిన అవసరము ఎంతైన కలదని ఆ గ్రంథాలయ నిబంధనలను పాఠకులకు ప్రయోజనకరముగా నుండునట్లు సవరించి ప్రవేశపెట్టిరి. పౌర గ్రంథాలయాల పాఠకులు స్వేచ్ఛగా, సేవపొందగలుగుటకు గ్రంథాలయ నియమావళి సహకరించే విధంగా వుండాలని గ్రంథపాలకులకు తెలిపెడివారు.

## గ్రంథములు కొనుగోలు చేయుటలో కేటాయింపులు

క్రొత్తగా స్థాపించబడిన కొన్ని జిల్లా కేంద్ర గ్రంథాలయములలో గ్రంథపాలకులు గ్రంథాలయ నిధినుండి ఎక్కువ శాతము

గ్రంథాలయోద్యోగుల జీతములకును, చాల తక్కువ శాతము పత్రికల, పుస్తకముల కొనుగోలుకును కేటాయించుచుండిరి. 1953-54 లో గ్రంథపాలకులు నూతనముగా శిక్షణ పొందినవారు కాన ఈ విధముగా జరుగుచుండినది. ఈ విషయమును గ్రహించి గ్రంథాలయోద్యోగుల జీతములకు, గ్రంథాలయ నిధినుండి సుమారు 40 శాతమునకుపైన 45 శాతమునకు లోపున కేటాయించవలెననియు, పుస్తకముల, పత్రికల కొనుగోలుకు తప్పనిసరిగా సుమారు 45 శాతమును కేటాయించవలెననియు మిగిలిన శాతమును గ్రంథాలయములకు కావలసిన తదితర వసతుల కుపయోగించు కొనవలెననియు ఈ విధముగా గ్రంథాలయ నిధిని విభజించుకొనడము, నవీనపద్ధతిలో గ్రంథాలయ నిర్వహణకు మిగుల దోహదమగుననియు రాఘవరెడ్డిగారు జిల్లాకేంద్ర గ్రంథాలయ పుస్తకభాండాగారులకు తెలియజేయుచుండిరి. తద్వారా గ్రంథాలయములలో గ్రంథముల సంఖ్య కొంతవరకు పెరుగుతూవచ్చి పాఠకులను ఆకర్షించ గలిగినవి,

## పుస్తకముల ఎన్నిక కమిటీ ఏర్పాటులలో సూచనలు

గ్రంథాలయములకు కావలసిన పుస్తకములను ఎన్నుకొను కమిటీయందు బాలలకు కావలసిన పుస్తకములను ఎన్నుకొనుటకు పాఠశాలల ఉపాధ్యాయులకు ప్రాతినిధ్యము కలిగించవలెననియు, ఇతర పుస్తకములను ఎన్నుకొనుటకు ఆయా పుస్తకవిషయ జ్ఞానానుభవము కల్గిన వారిని నియమించవలెననియు రాఘవరెడ్డిగారు లోకల్ లైబ్రరీ అథారిటీ వారికి తెలియజేసిరి. వీరు సూచించిన మేరకు అన్నిగ్రంథాలయములందు పుస్తకములను ఎన్నుకొను కమిటీలయందు పుస్తక విషయమునందు అనుభవమున్న పాఠశాలల ఉపాధ్యాయులను, యితర విద్యావేత్తలను నియమించడము జరిగినది.

## గ్రంథాలయాల పనివేళలు

ఆంధ్రరాష్ట్రావతరణానంతరము పౌర గ్రంథాలయములు ఉదయము 3 గంటలు సాయంత్రము 3 గంటల కాలము పనిచేయుచుండినవి. పుస్తకముల, పత్రికల, సంచికల సంఖ్య గ్రంథాలయములందు పెరిగినవి. వీటిని చదువుకొనుటకు గ్రంథాలయ పాఠకులకు తగు సమయము లేకపోవుటచే రాఘవరెడ్డిగారు తనిఖీలకు వెళ్ళు సందర్భములందు గ్రంథాలయ పాఠకులు గ్రంథాలయముల పనిచేయు కాలము పెంచవలసిందిగా కోరుచుండిరి. గ్రంథపాలకులుకూడ దీనికి సుముఖతను వ్యక్తము చేసిరి. జిల్లాకేంద్ర గ్రంథాలయములందలి పత్రికల విభాగములు మాత్రము ఉదయము 8 గం॥ నుండి సాయంత్రము 8 గంటల వరకు పని చేయవలయునని 1954-వ సంవత్సరము నవంబర్ నెల 7 వ తేది ఉత్తర్వులు జారీ చేసిరి.

రాఘవరెడ్డిగారు పౌరగ్రంథాలయాల తనిఖీకి వెళ్ళినపుడు కొందరు గ్రంథపాలకులు గ్రంథాలయములందు రాత్రి యించుమించు 8 గం॥ల వరకు పనిచేయుట మిగులశ్రమతో కూడినదని తెలియజేయగా ఆసుపత్రులు, కళాశాలలు మున్నగునవి రాత్రులందుకూడ ప్రజాశ్రేయస్సుకొఱకు పనిచేయుచున్నవనియు, ప్రజలకు సేవచేయు బాధ్యత మనపై ఎంతేని కలదనియు వారికి రాఘవరెడ్డిగారు వివరించగా, వారు సంతోషమున వీరి సూచనకు సుముఖులయిరి. అప్పటి నుండి గ్రంథపాలకులు ప్రజలకు సేవచేయుట తమ బాధ్యతయని గుర్తించి గ్రంథాలయ సేవలో నిమగ్నులై రాత్రి 8 గం॥ల వరకు పనిచేయుటకు సంసిద్ధతను వ్యక్తపరచిరి.

ఆంధ్రరాష్ట్రము అవతరించిన అనంతరము వారపు సెలవు దినమును మఱియు ప్రభుత్వ సెలవు దినములను పౌరగ్రంథాలయములకు కూడ సెలవు దినములుగా పరిగణించుచుండిరి. ఉద్యోగులు

మఱియు విద్యార్థులు, తదితరులు కొందరు సెలవు దినములలో కూడ గ్రంథాలయములను తెరచియుంచవలయునని కోరగా రిపబ్లిక్ దినము, స్వాతంత్ర్యదినము, మహాత్మాగాంధీ జన్మదినము, తెనుగుసంవత్సరాది, ఈ నాలుగు దినములతో పాటు, వారసెలవు దినములలో మాత్రము మూసివుంచవచ్చునని మిగిలిన సంవత్సరము నందలి ప్రభుత్వసెలవు దినములలో లోకల్ లైబ్రరీ అథారిటీ నిర్ణయము మేరకు పనిచేయవలయునని రాఘవరెడ్డిగారు ఉత్తర్వులు జారీచేసిరి. ఈ విధముగా ఉత్తర్వులు జారీచేసిన యనంతరము ఏ గ్రంథాలయోద్యోగికూడ సెలవు దినములను తగ్గించినందుకు గాని, పనికాలము పెంచినందులకు గాని ఏవిధమైన భృతినిగాని, అదనపు జీతమునుగాని కోరలేదు. పౌర గ్రంథాలయములందు ప్రభుత్వసెలవు దినములందు పనిచేయు గ్రంథాలయోద్యోగులు ఎన్ని సెలవురోజులు పనిచేయుదురో అన్నిరోజులు సెలవు తీసికొనవచ్చునని 5–12–1955 న ఉత్తర్వులు జారీచేసిరి. ఈ ఉత్తర్వుల మేరకు ప్రభుత్వసెలవుదినములందు పనిచేసిన ఉద్యోగులు సంవత్సరమునకు ఏడు రోజులు వరుసగా, సెలవు రోజులలో పనిచేసినందుకు బదులుగా సెలవును తీసికొనవచ్చును. లేదా అత్యవసర సెలవుతో కలిపి వరుసగా 10 రోజులు సెలవు తీసికొనవచ్చును.

## గ్రంథాలయాలలో హుండీ ఏర్పాటు

పౌరగ్రంథాలయ పాఠకులు గ్రంథాలయముల నుండి నిర్ణీత కాలములో పుస్తకములను తిరిగి వాపసుచేయునట్లు అరువు తీసికొనిపోవుచుందురు. ఈ పుస్తకములను నిర్ణీత కాలమున పాఠకులు గ్రంథాలయమున కప్పగించక పోయినచో అదనపు సుంకమును చెల్లించవలసియుండును. దీనిని వసూలుచేయుటకు ఒకగుమాస్తా అదనపు సుంకముల రశీదులను, రిజిష్టరులను వ్రాయుచుండును. దీనివలన

గ్రంథాలయ పాఠకునికి, గ్రంథ భాండాగారికికూడ కాలము వృథా యగును. గ్రంథాలయములందు ఒక 'హుండీని' ప్రవేశపెట్టిన అరువు పుస్తకములను ఆలస్యముగా అప్పగించు గ్రంథపాఠకులు చెల్లించవల సిన అదనపు సుంకమును ఆ హుండీలోవేయు పద్ధతి నవలంబించిన' అదనపు సుంకములకు సంబంధించిన వివరములను, రశీదులను వ్రాయు గుమాస్తా గ్రంథాలయ పాఠకులకు ఎక్కువగా సేవచేయుటకు వీలగు నని రాఘవరెడ్డిగారు అభిప్రాయపడిరి, కొందరు లోకల్ లైబ్రరీ అథా రిటీ సభ్యులు, కొందరు గ్రంథపాలకులు యిందులకు సుముఖతను వ్యక్త పరచిరి. కొందరు కొంతకాలము అనుభవము తర్వాత పరిశీలించ వచ్చునని అభిప్రాయపడిరి. యీనాటికైనను యీ పద్ధతిని కొన్ని గ్రంథాలయాలలో ప్రవేశపెట్టి వాటి పరిణామముల పరిశీలించవలసిన ఆవశ్యకత ఎంతేని కలదు:

## గ్రంథాలయాలలో అరువు - డిపాజిట్టు

1948 మదరాసు పౌరగ్రంథాలయముల చట్టమునందు పుస్త కముల అరువుతీసికొను పాఠకులు కొంత రుసుమును గ్రంథాలయము నకు చెల్లించవలయునని సూచించబడలేదు. కాని గ్రంథాలయముల నుండి అరువు తీసికొనిపోబడు పుస్తకములు తిరిగి గ్రంథాలయములకు చేరునో, లేక చేరకపోవునో యను సందేహముతో గ్రంథాలయ పాలకులు పుస్తకముల నరువు తీసికొనిపోవు గ్రంథపాఠకుల నుండి కొంతపైకమును డిపాజిట్టుగా వసూలుచేయుచుండిరి. రాఘవరెడ్డిగారు డిపాజిట్టు వసూలుచేయ నవసరములేదని హామీదారా, బాధ్యతలు కల వారెవరైనను హామీయిచ్చిన చాలునని అభిప్రాయపడినారు. పౌరు లకు గ్రంథాలయసేవను ఉచితముగ అందించవలయు ననుట మన రాష్ట్రమునందమలు నందుండిన పౌరగ్రంథాలయ చట్టముల ఉద్దేశ్యము. పాశ్చాత్యదేశములయందు పౌరగ్రంథాలయముల సేవ ఉచితముగానే జరుగుచున్నది. సంపన్నుల వద్దనుండి కూడ గ్రంథాలయముల కొరకు

ఏ మాత్రము రుసుమును తీసికొనుటలేదు. ఈ విషయమును రాఘవరెడ్డిగారితో పుస్తక భాండాగారులు, లోకల్ లైబ్రరీ అథారిటీ వారు చర్చలు జరిపిన అనంతరము సాధ్యమైనంతవరకు గ్రంథాలయ పాఠకులనుండి పైకమును వసూలు చేయరాదని గ్రంథాలయముల అభివృద్ధి నిమిత్తము రాష్ట్రములోని సంపన్నులవద్ద నుండి విరాళములను తీసికొని గ్రంథాలయములను నిర్వహించుట సముచితమని అభిప్రాయపడిరి. అయితే కొంతకాలము జరిగిన తర్వాత ఈ పద్ధతి నవలంబించవచ్చునని కొందరు గ్రంథ పాలకులు లోకల్ లైబ్రరీ అథారిటీ సభ్యులు అభిప్రాయపడిరి. పాఠకులు తాము అరువుగా తీసికొనిన గ్రంథములను సకాలములో విధిగా గ్రంథాలయములకు వాపసు చేయవలెనను మనస్తత్వము అలవరచుకొనవలెను. తమవద్ద నిలిచిపోయిన గ్రంథము ఇతరుల కుపయోగపడకుండా వారికి ఇబ్బంది కలిగించిన వారమగుదుమని భావించి సకాలములో గ్రంథములను గ్రంథాలయములకు అందజేయవలసిన బాధ్యతను గుర్తించిన నాడు గ్రంథములను అరువుగా యిచ్చుటకుగాను డిపాజిట్టు వసూలు చేయ నవసరముండదు.

## ఆంధ్రరాష్ట్రములో సహాయక గ్రంథాలయాలు

ఆంధ్రరాష్ట్రము అవతరించిన అనంతరము కూడ ప్రభుత్వమునకు సహాయక గ్రంథాలయములకు తగినంత గ్రాంట్లను మంజూరు చేయుటకు వీలులేకపోయినది, లోకల్ లైబ్రరీ అథారిటీ వారికి గ్రాంట్లను ఎక్కువగా మంజూరు చేసిన వారే గ్రంథాలయ వ్యాప్తికి తోడ్పడుదురని ప్రభుత్వము అభిప్రాయపడినది. రాఘవరెడ్డిగారు సహాయక గ్రంథాలయముల కృషిని, వాటి ఆవశ్యకతను ప్రభుత్వమునకు తరచుగా తెలియజేయు చుండిరి. అయినప్పటికి ప్రభుత్వము తగినంత గ్రాంట్లను మంజూరు చేయు స్థితిలో లేనందువలన సహాయక గ్రంథాలయములకు తక్కువగానే గ్రాంట్లను మంజూరు చేయుచుండి

నది. రాఘవరెడ్డిగారు సహాయక గ్రంథాలయముల అభివృద్ధికి తగు చర్యలను తీసికొనిరి.

1. 1954 సం॥కు పూర్వము సంస్థలచే స్థాపించబడు సహాయక గ్రంథాలయముల రిజిస్ట్రేషన్ రుసుము ఎక్కువగా నుండినది. పిదప పౌరగ్రంథాలయ డైరెక్టరు సూచించిన పైకమును మాత్రమే సహాయక గ్రంథాలయముల రిజిస్ట్రేషన్ రుసుముగా తీసికొన బడుటకు ప్రభుత్వమంగీకరించినది. పౌరగ్రంథాలయాల డైరెక్టరు రాఘవరెడ్డి గారు రిజిస్ట్రేషన్ సుంకమును మిగుల స్వల్పముగా సూచించుచుండిరి. కావున సహాయక గ్రంథాలయముల సంఖ్య పెరుగుటకు కొంత అవకాశ మేర్పడినది.

2. సహాయక గ్రంథాలయములు కొనుగోలు చేయు పుస్తకముల నిమిత్తము మంజూరు చేయబడు గ్రాంటు నుండి పుస్తకములనే గాక పుస్తకముల నుంచు అరల బీరువాలను అనగా బుక్ రాక్స్‌లను కూడ కొని వాటియందు చదువరులకు అందుబాటులో నుండునట్లు పుస్తకముల నమర్చుచుండిరి.

3. సహాయక గ్రంథాలయములకు ఎన్నుకొనబడిన పుస్తకముల జాబితాను యిదివరకు జిల్లా విద్యాశాఖాధికారులు ధృవీకరించుచుండిరి. ప్రస్తుతము లోకల్ లైబ్రరీ అథారిటీలు ఈ జాబితాను ధృవీకరించవలెను. లోకల్ లైబ్రరీ అథారిటీ సభ్యులలో పెక్కుమంది విద్యావేత్తలు, పాఠశాలల ఉపాధ్యాయులు గ్రంథాలయాభిమానులు ఉందురు. అందువలన ఈ బాధ్యతను వీరి కప్పగించడము జరిగినది,

4. పాఠశాలల ఉపతనిఖీ అధికారి సహాయక గ్రంథాలయముల తనిఖీ అధికారిగా సహాయ గ్రంథాలయములకు వెళ్ళి సాంకేతిక

విషయములందు కొన్ని సలహాలను పుస్తక భాండాగారులకు సందర్భావసరములను బట్టి యివ్వవలెను.

5. సహాయక గ్రంథాలయములు చక్కగా పనిచేయు ప్రాంతములయందు లోకల్ లైబ్రరీ అథారిటీవారు గ్రంథాలయములను స్థాపించకూడదని ఉత్తర్వులు జారీచేయడమైనది.

6. ఏవేని సహాయక గ్రంథాలయములు మూతపడు స్థితిలోనున్న ఆ విధముగా మూతపడుటకు వీలులేదని వాటి నిర్వహణ బాధ్యతలను లోకల్ లైబ్రరీ అథారిటీలు స్వీకరించవలెనని రాఘవ రెడ్డిగారు నిర్ణయించిరి.

ఈ విధముగా ప్రభుత్వగ్రాంట్లు ఆశించిన విధముగా లేనప్పటికి సహాయక గ్రంథాలయములు సక్రమముగా నిర్వహింప బడుతూ కొంతవరకు అభివృద్ధి చెందినవి. దీనికి గ్రంథాలయాభిమానుల, లోకల్ లైబ్రరీ అథారిటీల కృషి ప్రశంసింప దగినది. ఆర్థికముగ వెనుకబడి మూతపడు స్థితిలోనున్న సహాయక గ్రంథాలయములను ఆదుకోవడమే గాక, సహాయగ్రంథాలయములు లేని కొన్ని ప్రాంతములందు గ్రంథాలయములను స్థాపించిరి. సహాయక గ్రంథాలయములకు కావలసిన కొన్ని పుస్తకములనుకూడ పంపుచుండిరి. కొన్ని గ్రామములలోని గ్రంథాలయాభిమానులు కూడ చందాలను వసూలుచేసి సహాయక గ్రంథాలయములను స్థాపించిరి. ఈ విధముగా సహాయక గ్రంథాలయములు అన్నివిధముల అభివృద్ధి చెంది ఆంధ్రప్రదేశ్ ఏర్పడునాటికి ఆంధ్రప్రాంతమున 1.127 సహాయక గ్రంథాలయములుండినవి. వీటిలో కొన్నిటికి మాత్రము ధరఖాస్తు ఫారములు నిర్ణీతకాలమున ప్రభుత్వమునకు చేరనందువలనను, తదితర కారణముల వలనను గ్రాంటు మంజూరు కాకపోయినది.

## పఠన మందిరములు:

1948 సం॥ కు పూర్వమందుండిన పఠనమందిరములు ఆంధ్ర రాష్ట్రము ఏర్పడిన తర్వాతకూడ కొనసాగినవి. ఆంధ్రరాష్ట్ర అవతరణానంతరము పఠనమందిరములపైన ప్రజలకు అభిమానము సన్నగిల్లినది. ప్రభుత్వము, పఠనమందిరములందు కేవలము పత్రికలు మాత్రమే యుండిన ప్రజలకు ప్రయోజనకరము కాదని వీటియందు పుస్తకములను కొన్నిటిని ప్రవేశపెట్టి పఠనమందిరములను సహాయక గ్రంథాలయములుగా రూపొందించవలెనని సంకల్పించినది. పఠనమందిరములవలన ప్రయోజనము ఆశించినంత కలుగుటలేదని కొందరు గ్రామస్థులు పఠనమందిరములకు వెళ్ళుట కిచ్ఛగించనందున క్రమముగా పఠనమందిరములకు విచ్చేయు పాఠకుల సంఖ్య సన్నగిల్లినది. దీనివలన కొందరు పఠనమందిరముల నిర్వాహకులకు ఉత్సాహము అడుగంటుటచే క్రమముగా కొన్ని పఠనమందిరములు సహాయక గ్రంథాలయములుగా రూపొందినవి. ఈ కారణములవలన పఠనమందిరముల సంఖ్య క్రమముగా తగ్గి సహాయక గ్రంథాలయముల సంఖ్య పెరుగుటచే 31—3—1954 సం॥ నాటికి 340 వున్న పఠనమందిరముల సంఖ్య 31—3—1956 సం॥ నాటికి 245 కు తగ్గినది. 31—3—1954 నాటికి గల 997 సహాయక గ్రంథాలయములు 31—3—1956 కు 1124 కు పెరిగినది.

పౌరగ్రంథాలయాలలో పనిచేయు గ్రంథపాలకులు సహాయక గ్రంథాలయాల స్థితిని గ్రహించి, పుస్తకములను విభజించుటయందును తదితర సాంకేతిక విషయముల యందును సహాయక గ్రంథాలయములకు కొంతవరకు తోడ్పడిరి. అంతేగాక ఈ సహాయక గ్రంథాలయములు లేని ప్రాంతములందు పుస్తకపంపిణీ కేంద్రములను స్థాపించుటకుకూడ లోకల్ లైబ్రరీ అథారిటీలు శ్రద్ధవహించినవి. అందువలన

1—10—1953 అనగా ఆంధ్రరాష్ట్ర అవతరణ నాటికి 976 సహాయక గ్రంథాలయాము లుండినవి. 1—11—1956 అనగా ఆంధ్రప్రదేశ్ అవతరించు నాటికి ఈ సహాయక గ్రంథాలయాల సంఖ్య 1127 కు పెరిగినది.

ఆంధ్రరాష్ట్రమునందు వలెనే తెలంగాణ ప్రాంతమునందు కూడ ఆంధ్రప్రదేశ్ ఏర్పడు వరకు సహాయక గ్రంథాలయములకు ప్రభుత్వము ఎక్కువ గ్రాంట్లను మంజూరు చేయలేకపోయినది. పెక్కుమంది గ్రామస్థులు, గ్రంథాలయాభిమానులు గ్రంథాలయములు లేని ప్రాంతములందు సహాయక గ్రంథాలయములను స్థాపించ సంకల్పించినను ప్రభుత్వగ్రాంట్లు అందకపోవుటచేత వారికి సహాయకగ్రంథాలయములను స్థాపించుటకు చాలవరకు వీలులేకపోయినది. కాన ఆంధ్రప్రదేశ్ ఏర్పడునాటికి 52 సహాయక గ్రంథాలయములు మాత్రమే తెలంగాణప్రాంతము నందుండినవి. వీటిలో 1956 సం॥ నాటికి 35 కు లోపు సహాయక గ్రంథాలయములు మాత్రము ప్రభుత్వగ్రాంటుతో నిర్వహింపబడినది.

## 1953—54 సం॥ నందు జరిగిన కొన్ని ప్రధాన గ్రంథాలయాభివృద్ధి కార్యక్రమములు:

ఆంధ్రరాష్ట్ర అవతరణ నాటికి అనగా 1—10—1953 నాటికి మునుపే పదకొండు జిల్లాలయందు జిల్లా కేంద్ర గ్రంథాలయములను ఐదు శాఖా గ్రంథాలయములను స్థాపించుటకు కృషి జరిగినది. ఆంధ్ర రాష్ట్రావతరణానంతరము తిరిగి 14 శాఖా గ్రంథాలయాల స్థాపన జరుగుటచే 31—3—1954 నాటికి శాఖాగ్రంథాలయముల సంఖ్య 19 కి పెరిగినది.

పురపాలక సంస్థల, పంచాయితీల, జిల్లాబోర్డుల మున్నగు సంస్థల అజమాయిషీ క్రింద నున్న గ్రంథాలయముల సంఖ్య ఆంధ్ర

రాష్ట్రావతరణ నాటికి 976 వుండినవి. క్రమముగా 31—3—1954 నాటికి ఈ గ్రంథాలయముల సంఖ్య 997 కు పెరిగినది.

ఆంధ్ర రాష్ట్రావతరణ నాటికి అనగా 1—10—1953 నాటికి రాష్ట్రమున 336 పఠనమందిరములు ఉండినవి. 31—3—1954 నకు వీనిసంఖ్య 340 కి చేరినది.

1953-54 ఆర్థిక సంవత్సరమున పైన తెలియజేయబడిన సహాయక గ్రంథాలయముల నిర్వహణకు అవిభక్త మదరాసు రాష్ట్రము నందు వెచ్చించబడిన మొత్తము రూ. 1,07,821.

1953-54 ఆర్థిక సంవత్సరమున పైన తెలిపిన పఠనమందిరముల నిర్వహణకు వెచ్చించబడిన మొత్తము రూ, 7,042.

1953-54 న రాష్ట్రగ్రంథాలయ కమిటి నెలకొల్పి, లోకల్ లైబ్రరీ అథారిటీలను పునర్నిర్మించడము జరిగినది.

1953-54 సం॥ పట్టభద్రులను నలుగురిని శిక్షణకు ఆంధ్ర విశ్వవిద్యాలయమునకు పంపి, వారు గ్రంథాలయశాస్త్ర శిక్షణ పొందిన యనంతరము వారిని జిల్లా కేంద్ర గ్రంథపాలకులుగా నియమించిరి.

1953-54 లో రాష్ట్రమునందలి 133 ఉన్నతపాఠశాలల గ్రంథాలయములందు విద్యార్థులకే గాక పౌరులందరికి కొన్ని వసతులను కలుగజేయడమైనది,

ఈ ఆర్థిక సంవత్సరమునందు చట్టప్రకారము రిజిష్టరయిన పుస్తకముల, నిర్ణీతకాలములో వెలువడు పత్రికల సంఖ్య 887.

1948 పౌరగ్రంథాలయముల చట్టప్రకారము లోకల్ లైబ్రరీ అథారిటీలకు 1953-54 సం॥న మంజూరు చేసిన సైకము రూ. 2,04,467.

1953-54 ఆర్థిక సంవత్సరమున

1. గ్రంథాలయముల నుండి అరువు తీసికొనిపోబడిన పుస్తకముల సంఖ్య 4,36,768.
2. గ్రంథాలయములందు పాఠకులు చదువుకొన్న పుస్తకములు 4,27,193.
3. సంవత్సరము చివర గ్రంథాలయములలోని పుస్తకముల సంఖ్య 6,62,737.
4. గ్రంథాలయములకు విచ్చేసిన చదువరుల సంఖ్య 16,32,895.

## 1954-55 ఆర్థిక సం॥న జరిగిన కొన్ని ప్రధాన గ్రంథాలయాభివృద్ధి కార్యక్రమములు :—

1954-55 సంవత్సరమునందు లోకల్ లైబ్రరీ అథారిటీవారు 46 శాఖా గ్రంథాలయములను, 38 పుస్తక పంపిణీ కేంద్రములను స్థాపించిరి. 31—3—1955 నాటికి లోకల్ లైబ్రరీ అథారిటీ ఆధీనములో నుండిన గ్రంథాలయముల సంఖ్య 114 కు పెరిగినది.

1954-55 సం॥నందు పఠనమందిరముల సంఖ్య 251 కి తగ్గినది. పఠనమందిరముల స్థాపనకు ప్రభుత్వము సుముఖముగా లేక పఠనమందిరములను సహాయక గ్రంథాలయములుగా రూపొందించుటకు సంకల్పించుటయే దీనికి ముఖ్యకారణము. 1954-55 ఆర్థిక సంవత్సరములో పురపాలక, పంచాయతీల, జిల్లాబోర్డుల, ప్రయివేటు మున్నగు సంస్థల యాజమాన్యమునందుండిన సహాయక గ్రంథాలయముల సంఖ్య 31—3—1955 నాటికి 1091 కి పెరిగినది.

1954-55 ఆర్థిక సంవత్సరమున గ్రంథాలయముల నిర్వహణకు ఖర్చించబడిన మొత్తము రూ. 4,12,475/-

1954–55 ఆర్థిక సం॥న పఠనమందిరముల నిర్వాహణకు వెచ్చించబడిన పైకము మొత్తము రూ. 3,419/-

విశాఖపట్టణములోని రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమును స్థాపించుటకు ప్రభుత్వము రూ. 3,72,000 లను మంజూరు చేసినది.

ఆంధ్రరాష్ట్రము ఏర్పడిన తరువాత 7—11—1954 న రాష్ట్ర కేంద్ర గ్రంథాలయ కమిటీ సమావేశము జరిగినది.

1954-55 సంవత్సరమున 40 మందిని సర్టిఫికేటు కోర్సునందు శిక్షణ పొందుటకై ఆంధ్రవిశ్వవిద్యాలయమునకు పంపి, తదనంతరము శాఖా గ్రంథాలయ గ్రంథపాలకులుగా నియమించిరి.

ఈ ఆర్థిక సంవత్సరమున ప్రచురించబడిన పుస్తకములలో ఉన్నతమైన మూడింటికి ఒక్కొక్క పుస్తక రచయితకు 500 రూపాయలను బహూకరించడము జరిగినది. ఆ పుస్తకముల పేర్లు వరుసగా (1) బొమ్మరిల్లు (2) లక్కపిడతలు (3) పిల్లల బొమ్మల భారతము.

ఈ పుస్తకముల రెండు వేల ప్రతులను రాష్ట్రప్రభుత్వము కొని పౌర గ్రంథాలయములకు, పాఠశాలల గ్రంథాలయములకు పంపుటకుగాను కేంద్రప్రభుత్వము కావలసిన ఆర్థిక సహాయమును చేసినది.

చట్టప్రకారము ఈ సంవత్సరమునందు రిజిష్టరయిన పుస్తకముల సంఖ్య 670. ఈ సంవత్సరమునందు 1948 పౌరగ్రంథాలయముల నిర్వాహణకు లోకల్ లైబ్రరీ అథారిటీవారికి ప్రభుత్వము మంజూరు చేసిన మొత్తము రూ. 2,40,222.

1954-55 సంవత్సరమునందు గ్రంథాలయ సేవ-వివరములు.

1. గ్రంథాలయముల నుండి అరువు తీసికొనిపోబడిన పుస్తకముల సంఖ్య 5,18,597.

2. గ్రంథాలయములందు పాఠకులు చదువుకొనిన పుస్తకముల సంఖ్య 6,92,165.
3. సంవత్సరము చివర గ్రంథాలయములందుండిన పుస్తకముల సంఖ్య 8,93,643.
4. గ్రంథాలయములకు విచ్చేసిన గ్రంథ పాఠకుల సంఖ్య 25,23,425.

## 1955-56 సంవత్సరమునందు జరిగిన కొన్ని ప్రధాన గ్రంథాలయాభివృద్ధి కార్యక్రమములు :

1955-56 ఆర్థిక సంవత్సరమునందు లోకల్ లైబ్రరీ అథారిటీ వారు 26 శాఖాగ్రంథాలయములను, 77 డెలివరీ స్టేషన్‌లను స్థాపించిరి. 31—3—1956 నాటికి లోకల్ లైబ్రరీ అథారిటీ యాజమాన్యమునందున్న గ్రంథాలయముల సంఖ్య 217 కు పెరిగినది.

పురపాలక, పంచాయతీల, జిల్లాబోర్డుల, ప్రయివేటు సంస్థల, మున్నగు సంస్థల అజమాయిషీ క్రింద నున్నటువంటి సహాయక గ్రంథాలయముల సంఖ్య 31-3-1956 నాటికి 1,124 కు చేరినది. పఠన మందిరములు 245 ఉండినవి.

1955-56 సం॥నందు రాష్ట్రమునందలి గ్రంథాలయ నిర్వహణకు వెచ్చించబడిన పైకము మొత్తము రూ. 5,63,549. ఇందులో లోకల్ లైబ్రరీ అథారిటీ వారికి గ్రంథాలయ నిర్వహణకు ప్రభుత్వము మంజూరుచేసిన పైకము మొత్తము రూ. 2,16,412.

విశాఖపట్టణములోని రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమునకు కావలసిన పుస్తకముల, ఫర్నిచర్ కొనుగోలు నిమిత్తము 1955-56 న ప్రభుత్వము వెచ్చించిన మొత్తము పైకము రూ. 1,06,363.

రాష్ట్ర కేంద్రగ్రంథాలయ కమిటీ ద్వితీయ సమావేశము 27-1-1956 న జరిగినది.

ఈ సంవత్సరమునందు లోకల్ లైబ్రరీ అథారిటీవారు 44 మందిని సర్టిఫికేటు కోర్సునందు శిక్షణ నిమిత్తము ఆంధ్రవిశ్వవిద్యాలయమునకు పంపిరి.

విద్యాశాఖలో పని చేయుచుండిన శ్రీ వి. పి. నారాయణరెడ్డి, జి. సత్యం లను డిప్లొమా కోర్సునందు శిక్షణ పొందుటకు ఢిల్లీ విశ్వవిద్యాలయమునకు పంపడమైనది.

ప్రత్యేకాధికారియగు రాఘవరెడ్డిగారిని, పదకొండు జిల్లా కేంద్ర గ్రంథాలయముల గ్రంథపాలకులను, రాష్ట్ర కేంద్ర గ్రంథాలయాధికారిని 26—9—1955 నుండి 5—10—1955 వరకు ఢిల్లీలో జరిగిన "గ్రంథాలయములు - సాంఘిక విద్య" అను సదస్సునకు పంపడము జరిగినది.

ఏలూరునందు ఒక సంచార గ్రంథాలయమును స్థాపించుటకు ప్రభుత్వము అంగీకరించినది.

ఈ ఆర్థిక సంవత్సరమునందు ఉత్తమపుస్తకములకు ప్రభుత్వము బహుమతు లివ్వవలెనని మఱియు అటువంటి పుస్తకములను ప్రభుత్వము ఉచితముగా గ్రంథాలయములకు సరఫరా చేయవలయునని ప్రభుత్వమును కోరడమైనది.

ఈ సంవత్సరమునందు 87 ఉన్నత పాఠశాలల గ్రంథాలయములయందును, మఱికొన్ని ప్రాథమిక పాఠశాలల గ్రంథాలయముల యందును పాఠశాలల విద్యార్థులకే కాక యితర చదువరులకు కూడ కావలసిన పుస్తకముల నరువిచ్చు ఏర్పాటు చేయడమైనది.

చట్టప్రకారము యీ సంవత్సరము రిజిష్టరయిన పుస్తకముల సంఖ్య 588.

1955-56 సంవత్సరమునందు గ్రంథాలయ సేవ:—

1. గ్రంథాలయముల నుండి అరువు తీసికొనిపోబడిన పుస్తకముల సంఖ్య 6,26,131.

2. గ్రంథాలయములందు పాఠకులు చదువుకొనిన పుస్తకముల సంఖ్య 5,59,241.

3. ఈ సంవత్సరము చివర గ్రంథాలయములందుండిన పుస్తకముల సంఖ్య 9,10,923.

## ఆంధ్రప్రదేశ్ అవతరణనాటికి గ్రంథాలయాల అభివృద్ధి:-

ఆంధ్రరాష్ట్ర అవతరణనాటికి అనగా 1—10—1953 నాటికి పదకొండు జిల్లా కేంద్ర గ్రంథాలయములను ఐదు శాఖా గ్రంథాలయములను స్థాపించుటకు ప్రయత్నములు జరిగినవి. పుస్తక పంపిణీ కేంద్రాల స్థాపన జరిగియుండలేదు. ఆంధ్రప్రదేశ్ ఏర్పడు నాటికి అనగా 1—11—1956 నాటికి లోకల్ లైబ్రరీ అథారిటీల యాజమాన్యమునందు పదకొండు జిల్లా కేంద్ర గ్రంథాలయములే కాక శాఖా గ్రంథాలయముల సంఖ్య 96 కు పెరిగినది. మఱియు 117 పుస్తక పంపిణీ కేంద్రాలు స్థాపించబడి యుండినవి.

1—10—1953 నాటికి అనగా ఆంధ్రరాష్ట్రావతరణ నాటికి పురపాలక, పంచాయతీల, జిల్లాబోర్డుల, ప్రయివేటు సంస్థల నిర్వహణలో నుండిన సహాయక గ్రంథాలయముల సంఖ్య 976. పఠనమందిరముల సంఖ్య 336గా ఉండినవి. ఈపై సంస్థల యాజమాన్యములోని సహాయక గ్రంథాలయములు ఆంధ్రప్రదేశ్ ఏర్పడు నాటికి అనగా 1-11-1956 నాటికి 1,127 కు పెరిగినది. పఠనమందిరముల వలన పాఠకులకు ఆశించినంత ప్రయోజనము కలుగకపోవుటచే, ఆ మందిరముల యందభిమానము క్రమముగా సన్నగిల్లుటచే, అచ్చోటికి విచ్చేయు చదువరుల సంఖ్య తగ్గుటచే పఠనమందిరములయందు పత్రికలను

మాత్రమే కాక పుస్తకములను కూడ ప్రవేశపెట్టి వీటిని చాల వరకు సహాయక గ్రంథాలయములుగా, రూపొందించుట చేత సహాయక గ్రంథాలయముల సంఖ్య పెరిగినది. కాన ఆ నాటికి పఠనమందిరముల సంఖ్య 100 కి తగ్గిపోయినవని చెప్పవచ్చును.

ఈ విధముగా ఆంధ్రరాష్ట్రావతరణానంతరము ప్రభుత్వ ఆర్థిక సహాయము ఆశించినంతగా లేకపోయి నప్పటికి, విద్యాశాఖవారు ప్రణాళికా నిధులనుండి, గ్రంథాలయాల అభివృద్ధికి తగిన మొత్తమును కేటాయించక పోయినప్పటికి, లోకల్ లైబ్రరీ అథారిటీ సభ్యుల, చైర్మన్‌ల, పుస్తక భాండాగారుల సమధి కోత్సాహము, ప్రత్యేకాధికారియైన రాఘవరెడ్డిగారి ప్రోత్సాహముతో గ్రంథాలయముల అభివృద్ధికి కృషి జరుగుటచేత గ్రంథాలయముల స్థాపన వాటి అభివృద్ధి చెప్పుకొనదగిన రీతిగా జరిగినది. పుస్తకములను, పత్రికలను గ్రంథాలయములందు పెంచుటచే గ్రంథాలయములకు విచ్చేయు, గ్రంథ పాఠకుల సంఖ్య పెరుగుటచేత శిక్షణ పొందిన వారిని పుస్తక భాండాగారులుగా నియమించుటచేత, వీరికి కావలసిన సహాయ సహకారములను రాఘవరెడ్డిగారు సందర్భానుసారముగా అందించుటచే నవీన పద్ధతిలో గ్రంథాలయాల నిర్వహణ, సాంకేతిక పరమైన పుస్తక విభజన జరిగినది. గ్రంథాలయ సేవకు గ్రంథపాలకులు గొప్ప ప్రాముఖ్యత నిచ్చిరి. ప్రజలకు గ్రంథాలయసేవ ప్రయోజనకరముగా జరిగినదనుట నిర్వివాదాంశము.

గ్రంథాలయాల యభివృద్ధికి తగిన నిధులు లేనప్పటికి మన రాష్ట్రమునందు గ్రంథాలయముల అభివృద్ధికి తమ శాయశక్తుల మరువలేని కృషి చేసిన గ్రంథాలయాభిమానుల ఘనతను గురించి

మన రాష్ట్రములోనేగాక దేశమునందలి యితర రాష్ట్రముల వారును వేనోళ్ళకొనియాడిరి. ఈ కృషి కర్తలలో బాల్యమునుండి గ్రంథాలయాభిమానులై నటువంటి, గ్రంథాలయోద్యమమున చిన్ననాటినుండి ఆసక్తితో పాల్గొనినటువంటి రాఘవరెడ్డిగారి కృషి బహువిధముల ప్రశంసనీయము. ఆంధ్రగ్రంథాలయ చరిత్రలో వీరి కృషి చిరస్థాయిగా నిలిచిపోగలదనుట అతిశయోక్తి కానేరదు.

సుప్రసిద్ధ గ్రంథాలయాభిమాని, గ్రంథాలయ శాస్త్రవేత్త, అంతర్జాతీయ గ్రంథాలయ అనుభవజ్ఞులు అయిన శ్రీ ఎస్. ఆర్. రంగనాథంగారు 1957 సం॥ నందలి తన రచనలలో ఆంధ్రరాష్ట్రమున జరిగిన కృషిని ఈ విధముగా తెలియజేసియున్నారు.

"After the Libraries Act came into force, Madras was bifurcated. The Andhra Desa took the library Act with it. It is working with Interest."



# గ్రంథాలయోద్యమము-తెలంగాణ ప్రాంతము
# హైదరాబాదు పౌరగ్రంథాలయ చట్టము:
# 1955-చట్టము అమలు
# (31-10-1956 వరకు)

తెలంగాణ ప్రాంతమును పరిపాలించుచుండిన నిజాంప్రభుత్వము మొదట గ్రంథాలయోద్యమమునకు ప్రాధాన్యత నివ్వక గ్రంథాలయ సమావేశముల, సదస్సుల నిర్వహణలకు కూడ సుముఖతను చూపెడిది కాదని తెలియుచున్నది.

అయినను ఆంధ్రప్రాంతమునందు వలెనే తెలంగాణ ప్రాంతమునందును ఎందరో దేశభక్తులు, గ్రంథాలయాభిమానులు పెక్కు సంవత్సరములుగా గ్రంథాలయోద్యమమునందు పాల్గొని గ్రంథాలయముల అభివృద్ధికి పాటుపడిరి.

## గ్రంథాలయ ఉద్యమ వ్యాప్తి - మహనీయుల కృషి

గ్రంథాలయోద్యమమున ప్రధాన, పాత్రవహించిన వారిలో మాడపాటి హనుమంతరావు, సురవరం ప్రతాపరెడ్డి, శ్రీధర్ వామన్నాయక్, కొండా వేంకటరంగారెడ్డి, మర్రి చెన్నారెడ్డి, కోదాటి నారాయణరావు మున్నగు వారిని ముఖ్యులుగా పేర్కొనవచ్చును.

1925 సం॥ ఖమ్మం జిల్లాకు చెందిన మధిరనందు రాష్ట్ర గ్రంథాలయ కార్యకర్తల కృషి ఫలితమున నిజాం రాష్ట్ర గ్రంథాలయ సభ ఏర్పాటు చేయబడినది. పింగళి వెంకట్రామరెడ్డిగారి అధ్యక్షతన

ఏర్పాటు కావింపబడిన ఈ సభకు పెక్కురు గ్రంథాలయాభిమానులు, కార్యకర్తలు హాజరైరి. ఈ సభ ద్వారా గ్రంథాలయోద్యమ వ్యాప్తికి తగు ప్రోత్సాహము లభించుటచే ఎక్కువమంది సహకారము లభించినది. ప్రభుత్వముయొక్క ప్రోత్సాహము లేకున్నప్పటికి ఈ సభ ఏర్పాటు కావింపబడిన నాటి నుండి గ్రంథాలయోద్యమము వ్యాప్తిచెందుటయే గాక, తరచుగా గ్రంథాలయ సభలు, సమావేశములు జరుగుతూ వచ్చినవి.

1944 సం॥ సింగరేణి కాలరీస్ నందు ఆంధ్రదేశ గ్రంథాలయ సభ ఏర్పాటు చేయబడినది. 1946 సం॥లో మహబూబ్ నగర్ జిల్లాకు చెందిన ఖ్యాతూర్ నందు కూడ ఆంధ్రదేశ గ్రంథాలయ సభా సమావేశము జరిగినది. ఈ రెండు సభలకును నిజాం రాష్ట్రమునకు చెందిన పెక్కురు గ్రంథాలయోద్యమ కార్యకర్తలు హాజరై గ్రంథాలయోద్యమ వ్యాప్తిని గురించి చర్చించుకొని తెలంగాణలో గ్రంథాలయోద్యమ వ్యాప్తికి పూనుకొనిరి. వీరు ఆంధ్రప్రాంతమునందు ఏర్పాటగు గ్రంథాలయ సదస్సులకు గూడ హాజరగుచు ఉద్యమస్వరూప స్వభావాదుల గురించి చక్కని అవగాహనను కల్గించుకొని గ్రంథాలయోద్యమమును నిర్వహించుచుండిరి. వీరి కృషి ప్రశంసనీయము.

## హైదరాబాదు పౌరగ్రంథాలయ చట్టము - పుట్టు పూర్వోత్తరాలు :

పౌరుల విజ్ఞాన వికాసముల పెంపొందింపజేయు ముఖ్యధ్యేయముతో అవిభక్త మదరాసురాష్ట్ర పౌరగ్రంథాలయ చట్టము రీతిగా హైదరాబాదు రాష్ట్రమునందు కూడ పౌరగ్రంథాలయ చట్టమునొకదానిని రూపొందించుట ప్రయోజనకరమని పలువురు విజ్ఞానవేత్తలు, రాజకీయ నాయకులు, గ్రంథాలయాభిమానులు, గ్రంథా

లయ కార్యకర్తలు అభిప్రాయపడిరి. వీరిలో శ్రీధర్ వామన్నాయక్, గోపాలరావు ఎగ్బోటే, ఉజ్లంకర్, ఆర్. ఎస్. శాస్త్రి, పావన్ కుమార్, అబ్దుల్ హై మున్నగువారు ప్రముఖులు. హైదరాబాదు గ్రంథాలయ సంఘ సభ్యుల సహకారముతో ఉజ్లంకర్ గారు హైదరాబాదు గ్రంథాలయ డ్రాఫ్టు బిల్లును రూపొందించిరి. ఈ విధముగా రూపొందింప బడిన డ్రాఫ్టుబిల్లును శ్రీ ఎస్.ఆర్. రంగనాథన్ గారు పరిశీలించి తమ అమూల్యమైన సలహాల నొసగిరి. అప్పటి విద్యాశాఖ మంత్రిగారైన శ్రీ గోపాలరావు ఎగ్బోటేగారు యీ డ్రాఫ్టుబిల్లును రూపొందించుటకు సహాయ సహకారములందించిన గ్రంథాలయ సంఘ సభ్యులకు గొప్ప ప్రోత్సాహము నిచ్చిరి.

## హైదరాబాదు పౌరగ్రంథాలయ బిల్లు : 1954 - శాసన సభలో చర్చలు.

హైదరాబాదు పౌరగ్రంథాలయ బిల్లును (L. A. Bill No. XXVIII of 1954) 27—8—1954 న హైదరాబాదు గెజెట్ నందు ప్రకటించడము జరిగినది. తదనంతరము ఈ బిల్లు 2—9—1954 న విద్యాశాఖమంత్రి గారిచే శాసన సభయందు ప్రవేశ పెట్టబడినది. ఈ విధముగా శాసన సభలో ప్రవేశపెట్టిన బిల్లును గురించిన చర్చలు 16—9—1954 న పలువిధములుగా జరిగినవి. ఈ చర్చలలో పలువురు ఈ బిల్లు మిగుల ప్రయోజనకరమైనదని బహువిధముల శ్లాఘించి, సముచిత సలహాల నొసగిరి. పౌర గ్రంథాలయములు వయోజన విద్యాభివృద్ధికి, భాషాభివృద్ధికి, పౌరుల విజ్ఞానమును, నైతిక విలువలను పెంపొందించుటకు దోహదము చేయును. కావున గ్రంథాలయముల స్థాపన జరుగవలెనని, గ్రంథాలయములకు ప్రభుత్వము తగు గ్రాంట్లను మంజూరు చేయవలెనని సభ్యులు చర్చా సందర్భమున సూచించిరి.

విద్యాశాఖ మంత్రిగారైన శ్రీ గోపాలరావు ఎక్బోటేగారు మరల ఈ బిల్లును శాసన సభయందు 21—2—1955 లో ప్రవేశ పెట్టిరి. మరల ఈ బిల్లుపై చర్చలు జరిగినవి. చర్చలలో పలువురు ప్రముఖులు తమ అమూల్యమైన సలహాల నొసగిరి. ఇటువంటి వారిలో శ్రీయుతులు కె. వెంకట రామారావు, కె. అనంత రెడ్డి, జె. ఆనంద రావు, శ్రీమతి మాసుమా బేగమ్ ముఖ్యులు. గ్రంథాలయ బిల్లును సమగ్రముగా పరిశీలించి వీరు గ్రంథాలయాభి వృద్ధికై పలువిధము లైన ప్రయోజన కరమగు సలహాల నొసగిరి.

మదరాసు రాష్ట్ర పౌర గ్రంథాలయ బిల్లు శాసన సభయందు నిరభ్యంతరముగా ఆమోదింప బడినట్లే హైదరాబాదు పౌర గ్రంథాలయ బిల్లు కూడ ఎటువంటి అభ్యంతరములు లేక అంగీకరింపబడినది. ఈ విధమైన ఏకాభిప్రాయముతో రూపొందిన పౌర గ్రంథాలయ బిల్లునకు 21—2—1955 న శాసన సభ ఆమోదముద్ర లభించినది. తదనంతరము ఈ చట్టమును 4—4—1955 న శ్రీ రాజ్ ప్రముఖ్ గారుకూడ ఆమోదించిరి. ఈ విధముగా సర్వాంగీకారముతో తుది మెఱుగులు సంతరించుకొని చట్టరూపమును దాల్చిన పౌర గ్రంథాలయ చట్టము 4—5—1955 న గెజెట్ నందు ప్రకటితమైనది. 1—7—1955 న ఈ పౌర గ్రంథాలయ చట్టము అమలు లోనికి వచ్చినది. విద్యాశాఖమంత్రి గోపాల్ రావు ఎక్బోటేగారు ఈ చట్ట మును అమలులోనికి తెచ్చుటకు గట్టి కృషి చేసిరి.

## మదరాసు గ్రంథాలయ చట్టముకంటె మెరుగైన హైదరాబాదు గ్రంథాలయ చట్టము

ఈ విధముగా అమలులోనికి వచ్చిన హైదరాబాదు పౌర గ్రంథాలయ చట్టము మదరాసు రాష్ట్రమునందములు నందున్న

పౌర గ్రంథాలయ చట్టముకన్న ప్రయోజనకరమైనదని ఈ క్రింది కొన్ని విషయముల బట్టి గ్రహింపవచ్చును.

1. 1948 మదరాసు రాష్ట్ర పౌర గ్రంథాలయ చట్టము ప్రకారము రాష్ట్ర గ్రంథాలయ కమిటీకలదు. ఇది గ్రంథాలయముల వృద్ధికి సలహాల నొసగు కమిటి. 1955 హైదరాబాదు రాష్ట్రపౌర గ్రంథాలయ చట్టమునందు రాష్ట్రగ్రంథాలయ కమిటీ అనుటకు బదులు రాష్ట్రగ్రంథాలయ కౌన్సిల్ అని సూచింపబడినది. ఈసూచనయందు నామమాత్రపు భేదమున్నప్పటికి ఈ కౌన్సిల్ కూడ గ్రంథాలయ సలహా సంఘమే.

2. మదరాసు పౌర గ్రంథాలయ చట్టములో రాష్ట్ర గ్రంథాలయ కమిటీయందు ఎవరు సభ్యులుగా నుండవలెనని సూచించ బడ లేదు. చట్టము ననుసరించి రూపొందించ బడిన నిబంధనలలో ఈ సూచన చేయబడినది. హైదరాబాదు పౌర గ్రంథాలయ చట్టములో రాష్ట్ర గ్రంథాలయ కౌన్సిల్‌నందు ఎవరు సభ్యులుగా నుండవలెనన్న విషయములను గురించి స్పష్టముగా సూచించడం జరిగినది. ఈ విధ ముగా చట్టమునందు సూచించడమే మిగుల శ్రేయోదాయకమని చెప్పవచ్చును.

3. గ్రంథాలయశాఖ మంత్రిగారే రాష్ట్ర గ్రంథాలయ అథారిటీయని హైదరాబాదు పౌర గ్రంథాలయ చట్టమునందు తెలియజేయబడినది. దీనిని ప్రయోజన కరమైన సూచనగా పరి గణింపవచ్చును. ఇట్టి సూచన 1948 మదరాసు రాష్ట్ర పౌర గ్రంథా లయ చట్టమునందు లేకపోవుట గమనించ వలసిన విషయము.

4. హైదరాబాదు పౌర గ్రంథాలయ చట్టప్రకారము రాష్ట్ర గ్రంథాలయ కౌన్సిల్‌నకు అధ్యక్షులుగా గ్రంథాలయశాఖ మంత్రి

గారును, కార్యదర్శిగా గ్రంథాలయ శాఖ డైరెక్టరుగారును వ్యవహరించుచుందురు. కాని మదరాసు రాష్ట్ర పౌర గ్రంథాలయ చట్టము ననుసరించి రాష్ట్ర గ్రంథాలయ కమిటీకి గ్రంథాలయశాఖ మంత్రిగారే అధ్యక్షులైనప్పటికి ఈ కమిటీకి గ్రంథాలయ ప్రత్యేకాధికారి కార్యదర్శిగా నుందురు. గ్రంథాలయ శాఖ డైరెక్టరుగారే రాష్ట్ర గ్రంథాలయ కమిటీకి కార్య నిర్వాహణాధికారిగానున్న మిగుల సమంజసముగా నుండునట్లు తెలియుచున్నది. హైదరాబాదు రాష్ట్ర పౌర గ్రంథాలయ చట్టమునందిట్టి సూచన చేయబడుట ముదావహాము.

5. హైదరాబాదు రాష్ట్ర పౌర గ్రంథాలయ చట్టము ననుసరించి ప్రతి లోకల్ లైబ్రరీ అథారిటీ నుండి ఒక సభ్యుని రాష్ట్ర గ్రంథాలయ కౌన్సిల్‌కు సభ్యునిగా ప్రతిపాదించవలెను. ఈ విధానము ననుసరించి రాష్ట్ర గ్రంథాలయ కౌన్సిల్‌నందు సభ్యుల సంఖ్య ఎక్కువగును. సభ్య లెక్కువైన కొలది అభిప్రాయ భేదములు ఎక్కువై గ్రంథాలయముల నిర్వాహణ విధానము కుంటుపడుటకవకాశము కలదు. మదరాసు పౌర గ్రంథాలయ చట్టము ననుసరించి లోకల్ లైబ్రరీ అథారిటీ సభ్యులనుండి ఇరువురిని మాత్రమే రాష్ట్ర గ్రంథాలయ కమిటీకి గ్రంథాలయ శాఖ మంత్రిగారు సభ్యులుగా నియమించెదరు. ఈ విధానము మిగుల శ్రేయోదాయకమని చెప్పవచ్చును. ఇందు సభ్యుల సంఖ్య స్వల్పమగుటచే సమస్యలకు సత్వర పరిష్కారము లభించి గ్రంథాలయ నిర్వాహణ సక్రియ పద్ధతిలో జరుగుట సాధ్యమగును.

6. హైదరాబాదు పౌర గ్రంథాలయ చట్టము ననుసరించి విద్యాశాఖ డైరెక్టరుగారినే ప్రత్యేక గ్రంథాలయశాఖ డైరెక్టరుగా నియమించవచ్చును లేదా గ్రంథాలయశాఖకు ప్రత్యేక డైరెక్టరునైనను నియమించవచ్చును. కాని మదరాసు రాష్ట్ర పౌర గ్రంథా

లయ చట్టమునందు విద్యాశాఖ డైరెక్టరే గ్రంథాలయ శాఖ డైరెక్టరుగా వ్యవహరించవలెనని సూచించబడినది. ప్రత్యేక గ్రంథాలయ శాఖకు ప్రత్యేక డైరెక్టరును నియమించవలెనన్న ప్రతిపాదన మదరాసు రాష్ట్ర పౌర గ్రంథాలయ చట్టమునందు లేకపోవడము విచారకరమైన విషయ మగుటచే మదరాసు చట్టముకన్న హైదరాబాదు చట్టమే మెఱుగైనదని చెప్పవచ్చును.

7. హైదరాబాదు పౌర గ్రంథాలయ చట్టము ననుసరించి హైదరాబాదు, సికిందరాబాదు జంట నగరముల లోకల్ లైబ్రరీ అథారిటీలకు ఆయా నగర కేంద్ర గ్రంథాలయ పుస్తక భాండాగారులు సెక్రటరీలుగా నుండవలెను. అదే విధముగా హైదరాబాదు రాష్ట్ర జిల్లాలకు సంబంధించిన లోకల్ లైబ్రరీ అథారిటీలకు ఆయా జిల్లా కేంద్ర గ్రంథాలయ పుస్తక భాండాగారి సెక్రటరీగా వ్యవహరించవలెను. ఈ విధమైన సూచన హైదరాబాదు చట్టమునందు చేయబడుట మిగుల ప్రశంసింప దగ్గ విషయము. ఇట్టి వీలు మదరాసు రాష్ట్ర పౌర గ్రంథాలయ చట్టమునందు కల్పింపబడక పోవుట గుర్తించదగ్గ విషయము. హైదరాబాదు రాష్ట్ర పౌర గ్రంథాలయ చట్టము అమలునకు వచ్చిన తొలి రోజులలో శిక్షణ పొందిన గ్రంథపాలకులు లేని కారణముచేత జిల్లా పాఠశాలల తనిఖీ అధికారులనే ఆయా జిల్లా లోకల్ లైబ్రరీ అథారిటీలకు సెక్రటరీలుగా నియమించడం జరిగినది. అట్లు గాక ఆనాడే శిక్షణ పొందని గ్రంథపాలకుల శిక్షితులజేసి వారిని సెక్రటరీలుగా నియమించియుండిన గ్రంథాలయ నిర్వహణ విధానము, గ్రంథాలయోద్యమము మరింత ముందంజ వేయుటకు వీలుండెడిదని చెప్పవచ్చును.

8. లోకల్ లైబ్రరీ అథారిటీలు పంపెడు గ్రంథాలయ ప్రణాళికలను ఆమోదించు అధికారము లేదా సవరించు అధికారము లేదా రద్దుచేసి మఱియొక ప్రణాళికను రూపొందించు అధికారము,

మఱియు ఏ గ్రంథాలయము నైనను మూసివేయుటకును, ఆర్థిక సహాయమును నిలుపుదల చేయుటకును, అంతేగాక గ్రంథాలయ నియమావళిని రద్దుచేయుటకును, అధికారము, హైదరాబాదు పౌర గ్రంథాలయ చట్టము ననుసరించి గ్రంథాలయశాఖ అజమాయిషీ బాధ్యతలు కల్గియున్న మంత్రిగారికి కలదు. కాని మదరాసు రాష్ట్ర పౌర గ్రంథాలయ చట్టము ననుసరించి ఇట్టి అధికారములు చాలవరకు గ్రంథాలయ శాఖ డైరెక్టర్‌కు కలదు.

9. ప్రతి ముద్రణాలయ యజమాని తాను ముద్రించెడు పుస్తకములయొక్క రెండు ప్రతులను రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమునకు పంపవలెనని హైదరాబాదు పౌర గ్రంథాలయ చట్టము తెలియజేయుచున్నది. మదరాసు రాష్ట్ర పౌర గ్రంథాలయ చట్టమునందు ప్రతి ముద్రణాలయ యజమాని తాను ముద్రించెడి పుస్తకములలో రకమునకు ఒక ప్రతిని రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమునకు పంపవలెనని తొలుత సూచన చేయబడినది. తదనంతరము రకమున కైదు ప్రతులను పంపవలసినదిగా ఈ సూచనను సవరించడము జరిగినది.

## గ్రంథాలయ చట్టము అమలు:

1948 మదరాసు పౌరగ్రంథాలయ చట్టము అమలునకు వచ్చిన తొలి రోజులలో రాష్ట్రమునందీ చట్టమును సక్రమపద్ధతిలో అమలు పరచుటకు శిక్షణ పొందిన గ్రంథపాలకులు లేకపోవుట, మఱియు చట్టమునందు కొన్ని సూచనలను నిర్దుష్టముగా పేర్కొనకపోవుట, చట్టముయొక్క నిబంధనలయందు కొన్నిలోపములుండుట మొదలగు సమస్యలెదురైనట్లే 1955 హైదరాబాదు పౌరగ్రంథాలయ చట్టము అమలునకు వచ్చిననాడుకూడ పైవిధమయిన కొన్ని సమస్యలు ఎదురయినందువలన హైదరాబాదు రాష్ట్రమునందీ చట్టము నమలుపరచుటకు కొంతవరకు కాలవ్యవధి జరిగినది. గ్రంథాలయశాఖకు ప్రత్యేక డైరెక్టరుగారిని నియమించుటకు హైదరాబాదు రాష్ట్ర పౌరగ్రంథా-

లయ చట్టమునందు వీలుకల్పింపబడి నప్పటికి విద్యాశాఖ డైరెక్టరు గారైన శ్రీరామ్‌లాల్ గారినే గ్రంథాలయశాఖ డైరెక్టరుగా హైదరాబాదు రాష్ట్రప్రభుత్వము నియమించినది. శ్రీరామ్‌లాల్ గారు విద్యావేత్తయేగాక గ్రంథాలయాభిమాని యగుటచే వీరు గ్రంథాలయ శాఖకు డైరెక్టరుగా నియమింపబడి నందులకు గ్రంథపాలకులు ఎటువంటి అభ్యంతరమును తెలియజేయలేదు. లోకల్ లైబ్రరీ అథారిటీల సెక్రటరీలుగా జిల్లాపాఠశాలల తనిఖీ అధికారుల నియమించడం జరిగినది. శిక్షణ పొందిన గ్రంథపాలకులను లోకల్ లైబ్రరీ అథారిటీలకు సెక్రటరీలుగా నియమించక జిల్లా పాఠశాలల తనిఖీ అధికారులనే సెక్రటరీలుగా నియమించుట గ్రంథాలయాభిమానులకు, కార్యకర్తలకు నచ్చలేదు. మదరాసు రాష్ట్రమునందుకూడ పౌరగ్రంథాలయ చట్టరూపకల్పన యందు ఇట్టి పొరబాటు జరుగుట గుర్తించదగ్గ విషయము.

హైదరాబాదు పౌరగ్రంథాలయ చట్టము అమలునకు వచ్చిన అనంతరము చట్టప్రకారము రాష్ట్రగ్రంథాలయ కౌన్సిల్ నియామకము జరిగినది. విద్యావేత్తలు, గ్రంథాలయాభిమానులైన వారిని సభ్యులుగా గల ఈ రాష్ట్రగ్రంథాలయ కౌన్సిల్‌కు, విద్యాశాఖమంత్రి గారైన శ్రీ ఎగ్బోటేగారు అధ్యక్షులుగాను, విద్యాశాఖ డైరెక్టరు అయిన శ్రీరామ్‌లాల్ గారు కార్యదర్శిగాను ఉండిరి.

ఆంధ్రప్రదేశ్ ఏర్పడక పూర్వము ఈ రాష్ట్ర గ్రంథాలయ కౌన్సిల్ 28—10—1956 న ఒక పర్యాయము హైదరాబాదు రాష్ట్ర కేంద్రగ్రంథాలయమునందు సమావేశమయినది. ఈసమావేశమునకు అప్పటి ముఖ్యమంత్రి శ్రీయుతులు బూర్గుల రామకృష్ణారావుగారును, విద్యాశాఖామంత్రి శ్రీ ఎగ్బోటేగారును, కార్యదర్శిగారైన శ్రీరామ్ లాల్ గారును తదితర కౌన్సిల్ సభ్యులు, విద్యాశాఖకు చెందిన ప్రము

ఖులు హాజరయ్యారు. ఈ సమావేశమునందు గ్రంథాలయాలచట్టము నమలు పరచుటకు తీసికొనవలసిన చర్యలగురించి సుదీర్ఘోపన్యాసము లతో కూడిన చర్చలు జరిగినవి. హాజరైన సభ్యులలో పలువురు గ్రంథాలయాభివృద్ధికి గైకొనవలసిన సలహాల నొసగిరి.

1955-56 సం॥ చట్టప్రకారము రాష్ట్రమునందలి ప్రతి జిల్లా యందొక లోకల్ లైబ్రరీ అథారిటీ స్థాపన జరిగినది. హైదరాబాదు నగరమునకు ఒక లోకల్ లైబ్రరీ అథారిటీ స్థాపన, సికిందరాబాదు నగరమున కొక లోకల్ లైబ్రరీ అథారిటీ స్థాపన కూడ జరిగినది. పౌర గ్రంథాలయములందు పనిచేయువారిని, ప్రయివేటు గ్రంథాలయ ములందు పనిచేయువారిని, గ్రంథాలయ సంఘములకు చెందిన వారిని, పురపాలక సంఘములకు, పంచాయితీలకు చెందిన వారిని, గ్రంథాల యోద్యమమున చురుకుగా పాల్గొనువారిని ఆయాజిల్లాకలెక్టర్ల సిఫార్సు ననుసరించి ప్రభుత్వము ఆయా జిల్లా లోకల్ లైబ్రరీ అథారిటీల సభ్యులుగాను. కలెక్టర్లను లోకల్ లైబ్రరీ అథారిటీలకు అధ్యక్షులు గాను నియమించినది. ఈ విధముగా నియమింపబడిన వారిలో పెక్కురు గ్రంథాలయోద్యమమునందుత్సాహము చూపెడువారు. మదరాసు రాష్ట్రమునందు పౌర గ్రంథాలయ చట్టము అమలులోనికి వచ్చిన అనంతరము లోకల్ లైబ్రరీ అథారిటీ సభ్యుల నియామకము నకు కొన్నిటికి ఎన్నికలు జరుపబడెడివి. హైదరాబాదు రాష్ట్ర పౌర గ్రంథాలయ చట్టము ననుసరించి లోకల్ లైబ్రరీ అథారిటీ సభ్యుల నియామకము మదరాసు రాష్ట్రమునందువలె ఎన్నిక పద్ధతిలోగాక ప్రభుత్వమే నామినేటు చేయుటచే మదరాసు రాష్ట్రముకన్న హైదరా బాదు రాష్ట్రమునందు లోకల్ లైబ్రరీ అథారిటీల నిర్మాణము త్వరిత ముగా జరిగినది.

ఆంధ్రప్రదేశ్ అవతరణకు మునుపే లోకల్ లైబ్రరీ అథారిటీలు రెండు మూడు పర్యాయములు సమావేశమై ఆయాజిల్లాలయందు

గ్రంథాలయముల అభివృద్ధికి తీసికొనవలసిన చర్యల రూపొందించు కొనుటయేగాక తగు ప్రణాళికలను కూడ కొన్ని లోకల్ లైబ్రరీ అథారిటీలు సిద్ధము చేసికొన్నవి. జంటనగరములందలి (హైదరాబాదు, సికింద్రాబాదు) లోకల్ లైబ్రరీ అథారిటీలుకూడ సమావేశముల నేర్పాటుచేసికొని గ్రంథాలయ స్థాపనాభివృద్ధికి తగు ప్రణాళికల రూపొందించుకొన్నవి. లోకల్ లైబ్రరీ అథారిటీలు సమావేశములందు గ్రంథాలయ సెస్సును గురించి కూడ చర్చించుకొనుచు గ్రంథాలయ సెస్సునుకూడ సక్రమ పద్ధతిలో వసూలు చేసుకొనవలెనని తీర్మానముల గైకొని సెస్సువసూలుకు తగు శ్రద్ధ గైకొనినవి.

మదరాసు రాష్ట్ర పౌరగ్రంథాలయ చట్టము ననుసరించి ఎన్నుకొనబడిన, వ్యక్తి లోకల్ లైబ్రరీ అథారిటీ చైర్మన్‌గాను, జిల్లా విద్యాశాఖాధికారి కార్యదర్శి గాను నుండుటచే వీరికి కొన్నిసమయములలో అభిప్రాయ భేదములు కల్గుచుండినవి. కాని హైదరాబాదురాష్ట్ర పౌరగ్రంథాలయ చట్టము ననుసరించి జిల్లాకలెక్టర్‌లు లోకల్ లైబ్రరీ అథారిటీల అధ్యక్షులు గాను, జిల్లాపాఠశాలల తనిఖీ అధికారులు సెక్రటరీలుగా నుండుటచే అభిప్రాయ భేదములకు సామాన్యముగా తావు లేకుండెడిది.

హైదరాబాదు పౌరగ్రంథాలయ చట్టము ననుసరించి హైదరాబాదు, సికింద్రాబాదు జంటనగరములయందు ఆయానగర పురపాలక కార్పోరేషన్‌లు, రాష్ట్రమునందలి జిల్లాలయందు ఆయాజిల్లాలకు చెందిన పురపాలక సంస్థలు, జిల్లా బోర్డులు, గ్రామపంచాయతీలు, ఆస్తిపన్నుపై లేదా ఇంటిపన్నుపై రూపాయకు 6 పైసలవంతున 1—7—1955 నుండి గ్రంథాలయ సెస్సును వసూలు చేయవలెను. అవిభక్త మదరాసు రాష్ట్రమునందు పౌరగ్రంథాలయ చట్టము అమలునకు వచ్చిన నాటి నుండి మొదటి రెండు సంవత్సరములు

సెస్సు వసూలు సక్రమముగా జరుగని విధముగానే హైదరాబాదు రాష్ట్రమునందుకూడ మొదటి రెండు సంవత్సరములు సెస్సు వసూలు సక్రమముగా జరుగలేక పోయినది. పెక్కు పంచాయతీలకు గ్రంథాలయ సెస్సును వసూలు చేయవలెనన్న విషయము రెండు సం॥రముల కాలము వరకు తెలియకపోవుటకూడ యిందులకు ప్రధానకారణముగా పేర్కొన వచ్చును, 29—2—1956 న అప్పటి హైదరాబాదు రాష్ట్రప్రభుత్వము గ్రంథాలయ సెస్సును తప్పనిసరిగా వసూలు చేయవలెనని ఉత్తర్వులను జారీచేసినది. అప్పటికిని సెస్సు వసూలుకు పెక్కు పంచాయితీలు నిర్లక్ష్యభావము వహించుటచే సెస్సు వసూలు సరిగా జరుగలేక పోయినది. ఈ కారణముల వలన 1—7—1955 నుండి అనగా హైదరాబాద్ రాష్ట్ర పౌరగ్రంథాలయ చట్టము అమలులోనికి వచ్చిన నాటి నుండి 31—10—1956 వరకు అనగా ఆంధ్రప్రదేశ్ అవతరణ వరకు వసూలైన సెస్సు రూ. 5000/- కు కూడ మించలేదు. కాన హైదరాబాద్ పౌరగ్రంథాలయ చట్టము ననుసరించి ఆంధ్రప్రదేశ్ అవతరణ వరకు నూతనముగా జిల్లాకేంద్ర గ్రంథాలయములను స్థాపించుటకుకూడ వీలులేకపోయినది.

## హైదరాబాదు రాష్ట్ర కేంద్ర గ్రంథాలయముగా అసఫియా గ్రంథాలయము

1891 సం॥ హైదరాబాదు నగరమునందు ప్రారంభింపబడిన అసఫియా గ్రంథాలయము పెక్కు సం॥లుగా హైదరాబాదు, సికిందరాబాదు జంటనగర వాసులకే గాక హైదరాబాదు రాష్ట్రమునకు చెందిన పలు జిల్లాలలోని వారికికూడ ప్రయోజనకరముగా నుండినది. హైదరాబాదు రాష్ట్ర పౌరగ్రంథాలయ చట్టము 1955 అమలులోనికి వచ్చిన అనంతరము అప్పటి ప్రభుత్వము అసఫియా గ్రంథాలయమును హైదరాబాదు రాష్ట్ర కేంద్ర గ్రంథాలయముగా ప్రకటించినది.

## హైదరాబాదు పబ్లిక్ గార్డెన్సులోని బాలల గ్రంథాలయము

హైదరాబాదునందు రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమే గాక ఒక బాలల గ్రంథాలయము కూడ ప్రభుత్వనిర్వహణలో నుండినది. ఈ గ్రంథాలయము హైదరాబాదు నగరములో పబ్లిక్ గార్డెన్సునందు 1954 సం॥ నుండి నిర్వహింపబడుచుండినది. ఈ గ్రంథాలయము నగరములోని బాల బాలికలకు మిగుల ప్రయోజనకరముగా నిర్వహింపబడుచుండినది.

### సహాయక గ్రంథాలయములు

తెలంగాణ ప్రాంతమునందు సహాయక గ్రంథాలయముల సంఖ్య ఆంధ్రప్రదేశ్ అవతరణ నాటికి 52 కు చేరినది. కాని 1955–56 సం॥ ఈ సహాయక గ్రంథాలయములలో 32 గ్రంథాలయములు మాత్రము ప్రభుత్వగ్రాంటును, పొందుచుండినవి. తక్కిన గ్రంథాలయములు సకాలమునందు ప్రభుత్వమునకు గ్రాంటు నిమిత్తము దరఖాస్తులు పెట్టుకొనక పోవుటవలననో, లేక యితర కారణముల వలననో ప్రభుత్వగ్రాంటును పొందలేక పోయినవి. 1955-56 సం॥నకు హైదరాబాదు రాష్ట్రమునకు చెందిన తెలంగాణ, మరఠ్వాడ, కర్నాటక ప్రాంతములలోని సహాయక గ్రంథాలయములకు ప్రభుత్వము 17,000/- రూ. మంజూరుచేసినది. ఆంధ్రప్రదేశ్ అవతరణానంతరము తెలంగాణ ప్రాంతమునందలి సహాయక గ్రంథాలయముల అభివృద్ధికి 1957–58 సం॥ ప్రభుత్వం 12000/–రూ. గ్రాంటును కేటాయించినది.

ఆంధ్రప్రాంతమునందు వలెనే తెలంగాణ ప్రాంతమునందు కూడ గ్రంథాలయోద్యమమును చురుకుగా నిర్వహించవలయునను పట్టుదల గల దేశభక్తులు, విద్యావంతులు చాలకాలము నుండి సహాయక గ్రంథాలయముల అభివృద్ధికై కృషిచేయుచుండిరి. కాని అప్పటి ప్రభుత్వము వీరికి తగిన ప్రోత్సాహము నివ్వకపోవుటయే గాక 1935 లో గ్రంథాలయ సభలను, సమావేశములను, వార్షికోత్సవము

లనుకూడ నిషేధించినదని చెప్పబడుచున్నది. విద్యావంతులయినట్టి వంటి గ్రంథాలయ కార్యకర్తలు ఈ నిషేధముపై హైకోర్టునకు వెళ్ళి కోర్టుద్వారా ఈ నిషేధాజ్ఞలను రద్దుచేయించి సమధికోత్సాహముతో గ్రంథాలయ వ్యాప్తికి తోడ్పడిరి.

ఆంధ్రప్రదేశ్ అవతరణానంతరము శ్రీ రాఘవ రెడ్డిగారు తెలంగాణలో సహాయక గ్రంథాలయములు 52 మాత్రమే వుండుటకు కారణమేమని మాడపాటి హనుమంతరావుగారితోను, నిజామాబాదుకు చెందిన రుక్మారెడ్డిగారితోను, చర్చా సందర్భాలలో ప్రశ్నింపగా, అప్పటి ప్రభుత్వముయొక్క నిరాదరణ గ్రంథాలయ విధానమే ప్రధాన కారణమనియు అందువలననే తెలంగాణ ప్రాంతమునందు గ్రంథాలయములు అభివృద్ధి చెందలేక పోయినవనియు వివరించిరి. ప్రభుత్వముయొక్క ప్రోత్సాహము లేకపోయినప్పటికి, పలువురు గ్రంథాలయాభిమానుల, దేశభక్తుల కృషి ఫలితమున కొన్ని గ్రంథాలయములు ప్రారంభింపబడినవి.

## తెలంగాణలో సహాయక గ్రంథాలయములకు గ్రాంట్లు

1951 వ సం॥ నుండి హైదరాబాదు రాష్ట్ర ప్రభుత్వము సహాయక గ్రంథాలయముల అభివృద్ధికిగాను ఈ క్రింద తెలిపిన విధముగా గ్రాంటులను మంజూరు చేసినది.

1. సంవత్సరమున వార్తా పత్రికలకు, తదితర నిర్ణీత కాలములో వెలువడు పత్రికలకు సహాయక గ్రంథాలయములు వెచ్చించు మొత్తము పైకములో సగభాగము ఆ మరుసటి సం॥ గ్రాంటుగా మంజూరు చేయబడును. అయితే ఈ మొత్తము రూ. 150/- లకు మించరాదు.

2. ఒక సంవత్సరమున సహాయక గ్రంథాలయములు పుస్తకముల కొనుగోలు నిమిత్తము వెచ్చించు మొత్తములో సగభాగము మాత్రము ఆ మరుసటి సం॥ పుస్తకముల కొనుగోలుకు గ్రాంటుగా

మంజూరు చేయబడును. ఎటువంటి పరిస్థితులలోను ఈ సగభాగము 300 రూ॥లకు దాటరాదు.

ప్రభుత్వము పుస్తకముల కొనుగోలు నిమిత్తము ఆంధ్ర ప్రాంతములోని సహాయక గ్రంథాలయములకన్న హైదరాబాదు రాష్ట్రములోని సహాయక గ్రంథాలయములకే ఎక్కువగా గ్రాంట్లు మంజూరు చేయుచుండినదని చెప్పవచ్చును.

సహాయక గ్రంథాలయముల భవనముల కొఱకుగాని. ఫర్నిచర్ కొఱకుగాని ఆంధ్ర ప్రాంతమునందువలెనే హైదరాబాదు రాష్ట్రము నందును ఏ విధమైన గ్రాంట్లను మంజూరు చేయడంలేదు.

ఆంధ్ర ప్రాంతములో పాఠశాలల ఉప తనిఖీ అధికారి సహాయక గ్రంథాలయములను తనిఖీ చేయును. డైరెక్టరు గ్రాంట్లను మంజూరు చేయును. హైదరాబాదు రాష్ట్రమునందుకూడ పాఠశాలల ఉపతనిఖీ అధికారి సహాయక గ్రంథాలయములను తనిఖీ చేయును. డైరెక్టరు గ్రాంట్లను మంజూరు చేయును.

హైదరాబాదు రాష్ట్రమునందు కూడ గ్రంథాలయోద్యమ కార్యకర్తలును గ్రంథాలయాభిమానులును గ్రామములందు పెక్కు మంది ఉండెడివారు. కాని ప్రభుత్వ గ్రాంట్లు తగినంతగా లేనందున గ్రామములందు తగినన్ని సహాయక గ్రంథాలయములను స్థాపించలేక పోయిరి.

1955 హైదరాబాదు పౌర గ్రంథాలయముల చట్టము రాక మునుపు కొద్ది సం॥ల నుండి తెలంగాణ ప్రాంతమునందు కూడ కొన్ని సహాయక గ్రంథాలయములు చక్కగా పని చేయుచుండినవి. ఈ గ్రంథాలయములు ఈనాటికిని గణనీయమైన సేవ చేయుచున్నది వాటిలో ముఖ్యమైన వానిగా నీ క్రింది గ్రంథాలయములను పేర్కొన. వచ్చును.

1. శ్రీ కృష్ణదేవరాయ ఆంధ్రభాషా నిలయం, హైదరాబాదు.
2. మార్వాడీ హిందీ పుస్తకాలయం, హైదరాబాదు.
3. బాపూజీ వచనాలయం, నిజామాబాదు.
4. రాజ రాజ నరేంద్ర ఆంధ్రభాషా నిలయము, హనుమకొండ.
5. విజ్ఞాన నికేతనం, ఖమ్మం.

# ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ ఉద్యమము: నూతన వికాసము:

## (1—11—1956 నుండి 31—3—1960 వఱకు)

ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తరువాత అనగా 1—11—1956 నుండి గ్రంథాలయోద్యమ కార్యకర్తలును పుస్తక భాండాగారులును, లోకల్ లైబ్రరీ అథారిటీ సభ్యులును గ్రంథాలయోద్యమ వ్యాప్తికి మిగుల కృషిచేసిరి. ఆంధ్రప్రదేశ్ అవతరణతో సువిశాలమైన తెలుగు ప్రాంతమంతయు ఒకటిగా కలసిపోయి ఒకే రాష్ట్రముగా ఏర్పడుటతో తెలుగు ప్రజలలో ఆనందము, ఉత్సాహము, ఏకీభావము కలిగినది. ఈ ఉత్సాహము, ఆసక్తి గ్రంథాలయోద్యమములోకూడ స్పష్టముగా కానవచ్చినది. ఆంధ్ర ప్రాంతములోని మదరాసు పౌర గ్రంథాలయ చట్టము 1948, తెలంగాణ ప్రాంతములోని హైదరాబాదు పౌర గ్రంథాలయ చట్టము 1955 వేరు వేరుగా ఆ యా ప్రాంతములలో 1960 వఱకు అమలులో నుండినవి. వీటిని సమీకృతముచేసి ఆంధ్రప్రదేశ్‌కు ఒకే పౌర గ్రంథాలయ చట్టమును రూపొందించుటకు రాఘవరెడ్డిగారు కృషి చేసిరి.

### గ్రంథాలయాల డైరెక్టరు: గ్రంథాలయాల ప్రత్యేకాధికారి.

మదరాసు పౌర గ్రంథాలయ చట్టము 1948 ప్రకారము విద్యాశాఖ డైరెక్టరుగా నుండిన గ్రంథాలయాభిమాని శ్రీ డి. ఎస్. రెడ్డిగారు ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తరువాత గూడ గ్రంథాలయముల డైరెక్టరుగా కొనసాగిరి. ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తరువాత కూడ

గ్రంథాలయ నిర్వహణలో అనుభవమున్న శ్రీ రాఘవరెడ్డిగారే, గ్రంథాలయములు, వయోజనవిద్య, దృశ్యశ్రవణవిద్య వీటికి ప్రత్యేకాధికారిగా కొనసాగిరి.

## లోకల్ లైబ్రరీ అథారిటీ కార్యదర్శులుగా జిల్లా విద్యాశాఖాధికారులు కొనసాగింపు :

మదరాసు పౌరగ్రంథాలయ చట్టప్రకారము జిల్లా విద్యాశాఖాధికారులే లోకల్ లైబ్రరీ అథారిటీలకు సెక్రటరీలుగా, ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన అనంతరము 31—3—1960 వరకు కొనసాగిరి. హైదరాబాదు పౌరగ్రంథాలయముల చట్టప్రకారము ఆంధ్రప్రదేశ్ అవతరించిన తరువాతకూడ జిల్లా పాఠశాలల తనిఖీ అధికారులే తెలంగాణలోని లోకల్ లైబ్రరీ అథారిటీలకు సెక్రటరీలుగా 31–3–1960 వరకు కొనసాగిరి. ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన అనంతరము కొంతకాలము వరకు తెలంగాణలోని విద్యాశాఖ డైరెక్టరువారి కార్యాలయమున గ్రంథాలయ శాస్త్రమునందు శిక్షణ పొందని అసిస్టెంట్ డైరెక్టరుకు గ్రంథాలయాల అభివృద్ధి బాధ్యత నప్పగించుట జరిగినది.

## ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ శాఖ బాధ్యత రాఘవరెడ్డిగారికి అప్పగింత :

తెలంగాణ యందలి విద్యాశాఖ డైరెక్టరువారి కార్యాలయమున అసిస్టెంటు డైరెక్టరు గ్రంథాలయ శాస్త్రమునందు శిక్షణ పొందని వారగుటచే, డి. ఎస్. రెడ్డిగారు డా॥ రామ్‌లాల్‌గారు రాఘవరెడ్డిగారికి ఆంధ్రప్రదేశ్‌నందలి గ్రంథాలయముల అభివృద్ధి బాధ్యతలను జూలై 1957 న అప్పగించిరి.

## తెలంగాణ గ్రంథాలయాభివృద్ధిపై రాఘవరెడ్డిగారి నివేదిక :

గ్రంథాలయముల అభివృద్ధి బాధ్యతలను రాఘవరెడ్డిగారికి అప్పగించిన తరువాత డి. ఎస్. రెడ్డిగారు, ఎన్. రామ్‌లాల్‌గారు తెలంగాణ ప్రాంతములోని గ్రంథాలయముల నిర్వాహణ విధానమును పరిశీలించి ఒక నివేదికను పంపవలసినదిగా రాఘవరెడ్డిగారిని కోరిరి. వారి కోరిక మేరకు రాఘవరెడ్డిగారు తెలంగాణ ప్రాంతములోని జిల్లాలన్నింటికి వెళ్ళి అచ్చటి లోకల్ లైబ్రరీ అథారిటీ సభ్యులతోను, చైర్మెన్‌లతోను, సెక్రటరీలతోను గ్రంథాలయముల అభివృద్ధిని గురించి చర్చించిరి. లోకల్ లైబ్రరీ అథారిటీ చైర్మెన్‌లు హైదరాబాదు పౌర గ్రంథాలయముల చట్టప్రకారము సెస్సు సక్రమముగా వసూలు కావడములేదని తెలుపగా రాఘవరెడ్డిగారు పంచాయతీల, పురపాలక సంస్థల అధికారులకు సెస్సు వసూలు చేయవలసిన బాధ్యతను గురించియు, గ్రంథాలయముల అభివృద్ధికి సెస్సు వసూలు చేయవలసిన ఆవశ్యకతను గురించియు వివరించిరి. అంతేగాక జిల్లాలలోని గ్రంథాలయ కార్యకర్తలతోను, జిల్లా పాఠశాలల తనిఖీ అధికారులతోను, జిల్లా పాఠశాలల ఉపతనిఖీ అధికారులతోను సహాయక గ్రంథాలయములను అభివృద్ధి చేయవలసిన ఆవశ్యకతను గురించి చర్చించిరి. ఆ రోజులలో గ్రంథాలయాభిలాషులు, గ్రంథాలయోద్యమములో చురుకుగా పాల్గొనెడివారు తెలంగాణ ప్రాంతమునందు చాలామంది లేకపోలేదు. ఖమ్మంజిల్లాకు చెందిన హీరాలాల్ మోరియా, నల్గొండ జిల్లాకు చెందిన కోదాటి నారాయణరావు, హైదరాబాదు జిల్లాకు చెందిన యస్వి. భోజ్‌రెడ్డి, ఎస్. చెన్నారెడ్డి, కరీంనగర్ జిల్లాకు చెందిన బి. వేంకట్రామారావు తదితరులు తెలంగాణ ప్రాంతములో గ్రంథాలయోద్యమమునకు గొప్పకృషి సల్పుచుండిరి. మహబూబ్‌నగర్ జిల్లా విద్యాశాఖాధికారియైన సోమసుందరం, వరంగల్లు జిల్లా విద్యాశాఖాధికారియైన వేంకటేశ్వరరావు

పాఠశాలల ఉపతనిఖీ అధికారిగారైన కె. రామారావుగారు తదిత రులుకూడ పాఠశాలల అభివృద్ధికే గాక పౌర గ్రంథాలయముల అభి వృద్ధికికూడ కృషిచేయు చుండిరి.

రాఘవరెడ్డిగారు తెలంగాణ ప్రాంతములోని లోకల్ లైబ్రరీ అథారిటీ సభ్యులతోను, గ్రంథాలయ పాలకులతోను, గ్రంథాలయ అభిమానులతోను గ్రంథాలయ సేవను, వ్యాప్తిని గూర్చి చర్చించిరి. తెలంగాణ ప్రాంతమునందు 52 సహాయక గ్రంథాలయము లున్నవని యు, అందులో దాదాపు 35 సహాయక గ్రంథాలయములు మాత్రము ప్రభుత్వగ్రాంటును పొందుచున్నవనియు తెలిసికొని ప్రభుత్వము పౌర గ్రంథాలయములకు కావలసిన గ్రాంట్లను మంజూరు చేయవలసిన అవశ్యకత ఎంతేనికలదనియు, పౌరగ్రంథాలయముల స్థాపనఅభివృద్ధి కొఱకు ప్రభుత్వము ప్రత్యేక శ్రద్ధవహించి లోకల్ లైబ్రరీ అథారిటీలకు ఉదారముగా గ్రాంట్లను మంజూరు చేయవలయుననియు డి. ఎస్. రెడ్డి గారు, ఎన్. రామ్‌లాల్ గార్లకు యిచ్చిన నివేదికయందు పేర్కొనిరి. ఈ విషయములను గురించి విద్యాశాఖ మంత్రిగారితోను, ప్రభుత్వ సెక్రటరీతోను కూడ చర్చించిరి. ఈ నివేదిక పరిశీలించిన తరువాత తెలంగాణ ప్రాంతములో పౌరగ్రంథాలయములకు ప్రభుత్వము కొంత వరకు ప్రోత్సాహకరముగా గ్రాంట్లను మంజూరు చేస్తూ వచ్చినది.

## ఆంధ్రప్రదేశ్ అవతరణానంతరము ఆంధ్ర, తెలంగాణ రాష్ట్ర గ్రంథాలయ కమిటీల కొనసాగింపు :

ఆంధ్రరాష్ట్రమునందు 1953-54 సం॥ నిర్మితమై యుండిన రాష్ట్రగ్రంథాలయ కమిటీ ఆంధ్రప్రదేశ్ అవతరణ అనంతరముకూడ కొనసాగినది. 28—10—1956 న ప్రప్రథమ సమావేశము జరిపిన హైదరాబాదు రాష్ట్ర గ్రంథాలయ కౌన్సిలు కూడ 1-11-1956

తరువాత కొనసాగినది. లోకల్ లైబ్రరీ అథారిటీల ఆర్థిక స్తోమత తగినంతగా లేనందువలన రాష్ట్ర గ్రంథాలయ కమిటీ సమావేశములు గాని, హైదరాబాదు రాష్ట్ర గ్రంథాలయ కౌన్సిల్ సమావేశములు గాని ఎక్కువగా జరుగలేదు. అయినప్పటికి ఇందలి సభ్యులతో రాఘవరెడ్డిగారు చర్చలు, సమాలోచనలు జరిపి గ్రంథాలయముల అభివృద్ధికి కావలసిన సలహాలను తీసికొనుచుండిరి.

## ఆంధ్రప్రదేశ్ కేంద్ర గ్రంథాలయముగా అసఫియా కేంద్ర గ్రంథాలయము :

హైదరాబాదు నగరమునగల అసఫియా గ్రంథాలయము 31—10—1956 వరకు హైదరాబాదు రాష్ట్ర గ్రంథాలయముగా పరిగణింప బడుచుండినది. 1—11—1956 అనంతరము, అనగా ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తరువాత దీనిని ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర కేంద్ర గ్రంథాలయముగా ప్రభుత్వము ప్రకటించినది.



రాష్ట్ర కేంద్ర గ్రంథాలయములో వివిధ విభాగములను సందర్శించి వెళ్లుచున్న శ్రీ రాఘవరెడ్డిగారు

1—11—1956 వరకు ఆంధ్ర రాష్ట్రమునకు రాష్ట్ర కేంద్ర గ్రంథాలయముగా ఉండిన విశాఖపట్టణములోని పూర్వపు గ్రంథాలయమును, ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన అనంతరము ప్రాంతీయ గ్రంథాలయముగా ప్రభుత్వము ప్రకటించినది.

## ఆంధ్ర, తెలంగాణా ప్రాంతపు లోకల్ లైబ్రరీ అథారిటీ సభ్యుల పదవీకాలము కొనసాగింపు.

1—11—1956 కు పూర్వము ఆంధ్రప్రాంతము నందుండిన లోకల్ లైబ్రరీ అథారిటీ సభ్యులు, చైర్మెన్‌లు, తెలంగాణ ప్రాంతము నందుండిన లోకల్ లైబ్రరీ అథారిటీ సభ్యులు, చైర్మెన్‌లుగా నుండిన కలెక్టర్లు ఆంధ్రప్రదేశ్ అవతరణానంతరముకూడ ఆయా పదవులలో కొనసాగిరి.

## లోకల్ లైబ్రరీ అథారిటీ చైర్మెన్, కార్యదర్శులు మరియు సభ్యుల అన్యోన్యత:

ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తరువాత లోకల్ లైబ్రరీ అథారిటీ సభ్యుల, చైర్మెన్‌ల, సెక్రిటరీల మధ్య సుహృద్భావ, సహకారములు చక్కగా నుండినవి. వీరు గ్రంథాలయముల అభివృద్ధికి, అభిప్రాయ భేదములు కలిగి యుండక ఒకరి కొకరు సహకరించుకొనుచుండిరి. జిల్లా కేంద్ర గ్రంథాలయ పుస్తక భాండాగారులు లోకల్ లైబ్రిరీ అథారిటీ సభ్యులు కాకపోయినప్పటికి గ్రంథాలయ సమావేశములకు సెక్రిటరీలు వీరినిగూడ ఆహ్వానించవలెనని మున్ముందు జిల్లా కేంద్ర గ్రంథాలయాధికారులే గ్రంథాలయ నిర్వహణ బాధ్యతను చేపట్టవలెను గాన గ్రంథాలయ పరిపాలనా విధానములందు వారప్పటి నుండి యే అనుభవము పొందవలసిన ఆవశ్యకత ఎంతేని కలదని రాఘవరెడ్డిగారు సెక్రటరీలకుకూడ తెలియజేయుచుండిరి.

ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన అనంతరము 1958-59 సం॥ తెలంగాణ ప్రాంతమునందు జిల్లా కేంద్ర గ్రంథాలయములకు పుస్తక భాండాగారులను నియమించిరి. సెక్రిటరీలకు, పుస్తక భాండాగారులకు అన్యోన్యత చాలవరకు చక్కగా యుండినది. కొన్ని సందర్భములందు వీరిరువురి మధ్య కొన్ని సమస్యలేర్పడి నప్పుడు రాఘవరెడ్డిగారు వాటిని సామరస్యముతో నివారించెడివారు.

## లోకల్ లైబ్రరీ అథారిటీలు – సహాయక తదితర గ్రంథాలయాలకు సహకారములు:

లోకల్ లైబ్రరీ అథారిటీలు ఫిర్కా గ్రంథాలయములకు, సహాయక గ్రంథాలయములకు ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తరువాత కూడ ఎక్కువ సహాయము నందించుచుండినవి. 1958 లో ఫిర్కా కేంద్ర గ్రంథాలయముల బాధ్యతలను లోకల్ లైబ్రరీ అథారిటీలే నిర్వహించవలెనని ప్రభుత్వము అభిప్రాయ పడినది. లోకల్ లైబ్రరీ అథారిటీలకు ఆర్థిక స్తోమత తగినంతగా లేకపోయినప్పటికి ఫిర్కా కేంద్ర గ్రంథాలయముల నిర్వహణ బాధ్యతలను సంతోష ముతో స్వీకరించినవి. పిదప ప్రభుత్వము ఫిర్కా కేంద్ర గ్రంథాలయముల నిర్వహణ కగు ఖర్చును మాత్రము లోకల్ లైబ్రరీ అథారిటీలే భరించ వలెనని ఈ గ్రంథాలయాల నిర్వహణ బాధ్యత పంచాయతీలకే ఉండవలెనని 1960 లో ఉత్తర్వులు జారీచేసినది. ప్రత్యేకాధికారియైన రాఘవరెడ్డిగారు పంచాయతీలలో శిక్షణ పొందిన పుస్తక భాండాగారులు లేరనియు, కాబట్టి ఫిర్కా కేంద్ర గ్రంథాలయముల నిర్వహణ బాధ్యతలను పంచాయతీ సమితులు సక్రమముగా నిర్వర్తింప జాలవనియు లోకల్ లైబ్రరీ అథారిటీలే ఈ గ్రంథాలయములను నిర్వహించుట సముచితమని ప్రభుత్వమునకు తెలియజేసిరి. ఫిర్కా కేంద్ర గ్రంథాలయములను ఎటువంటి పరి

స్థితులలోను మూసివేయకూడదను సంకల్పముతో లోకల్ లైబ్రరీ అథారిటీలు యిందులకు సమ్మతించినవి. కాని పంచాయతీ సమితి అధికారులు ఫిర్కా కేంద్ర గ్రంథాలయములను చక్కగా నిర్వహించ గలమని ఆ బాధ్యతను తమకే అప్పగించమని ప్రభుత్వమునకు తెలియజేయుటచే ప్రభుత్వము పై ఉత్తర్వులను అమలులో పెట్టినది.

ప్రభుత్వము లోకల్ లైబ్రరీ అథారిటీలకు ఫిర్కా కేంద్ర గ్రంథాలయముల నిర్వహణకు తగినంత గ్రాంట్లను మంజూరు చేసెడిది కాదు. 1959 - 60 సం॥ ఆంధ్రప్రదేశ్‌లోని ఫిర్కా కేంద్ర గ్రంథాలయముల నిర్వహణకు 22,500/-రూ. గ్రాంటును మాత్రము మంజూరు చేసినది. అయినప్పటికి కొన్ని లోకల్ లైబ్రరీ అథారిటీలు వారి నిధి నుండి పంచాయతీ సమితుల యాజమాన్యము క్రింద నుండిన ఫిర్కా కేంద్ర గ్రంథాలయముల నిర్వహణకు, కొంత గ్రాంటును మంజూరు చేసి ఆ గ్రంథాలయములను నిర్వహించుటకు సహాయము చేసినవి. కొంత కాలమునకు ప్రభుత్వముయొక్క ఆర్థిక స్తోమత క్షీణించుటచే ఫిర్కా కేంద్ర గ్రంథాలయములకు ప్రభుత్వము ఏ మాత్రము గ్రాంటును మంజూరు చేయక లోకల్ లైబ్రరీ అథారిటీలే యీ లోటును భర్తీ చేయవలెనని తెలియజేయగా, లోకల్ లైబ్రరీ అథారిటీలు ఎట్టి పరిస్థితులలోను ఫిర్కా గ్రంథాలయములను మూసి వేయుట జరుగరాదని గ్రంథాలయముల స్థాపన, అభివృద్ధి తమ కర్తవ్యముగా భావించి యిందులకు ఆమోదించినవి.

ఆంధ్ర రాష్ట్రము ఏర్పడిన తరువాత సహాయక గ్రంథాలయములకు లోకల్ లైబ్రరీ అథారిటీలు పుస్తక విభజన, పుస్తక పంపిణీ తదితర విషయములందు ఏ విధముగా సహకరించుచుండినవో ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన అనంతరము కూడ అదేవిధముగా సహాయక గ్రంథాలయములకు తమ సహాయ సహకారముల నంద

జేయుచుండినవి. ఎటు వంటి పరిస్థితులలోను సహాయక గ్రంథాలయములను మూసివేయరాదని లోకల్ లైబ్రరీ అథారిటీల దృఢ సంకల్పము. సహాయక గ్రంథాలయముల నిర్వహణ బాధ్యతలను చేపట్టుటకు కూడ లోకల్ లైబ్రరీ అథారిటీలు సిద్ధముగా నుండినవి. ఉదా॥ మహబూబ్ నగర్ సహాయక గ్రంథాలయము. మహబూబ్ నగర్ సహాయక గ్రంథాలయము సక్రమముగా నిర్వహించబడకుండుటచే మహబూబ్ నగర్ లోకల్ లైబ్రరీ అథారిటీ వారు తమ ఆధీనములోనికి తీసికొనిరి.

ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తరువాత లోకల్ లైబ్రరీ అథారిటీ వారు ఆంధ్ర ప్రాంతమున స్థాపించబడి యుండిన జిల్లా కేంద్ర గ్రంథాలయములను, శాఖా గ్రంథాలయములను, పుస్తక పంపిణీ కేంద్రములను అభివృద్ధి పరచుటయే గాక గ్రంథాలయములు లేని ప్రాంతములందు ప్రతి సంవత్సరము క్రొత్తగా శాఖా గ్రంథాలయములను, పుస్తక పంపిణీ కేంద్రాలను స్థాపించుచూ వచ్చిరి.

## తెలంగాణ ప్రాంతములో జిల్లా కేంద్ర గ్రంథాలయాలు, శాఖా గ్రంథాలయాల స్థాపన:

తెలంగాణ ప్రాంతము నందు గ్రంథాలయ సెస్సు సక్రమముగా వసూలు కాక పోవుటచేత, లోకల్ లైబ్రరీ అథారిటీలకు తగినంత ఆర్థిక స్తోమత లేకపోయినది. ఈ ప్రాంతమున గ్రంథాలయ స్థాపన నిమిత్తము రాఘవ రెడ్డిగారు గ్రంథాలయ పథకము నొకదానిని రూపొందించి ప్రభుత్వమునకు పంపిరి. ప్రభుత్వము ఈ పథకములోని సూచనలను పరిశీలించి ఆమోదించినది. ఈ పథకము ప్రకారము ప్రప్రథమముగా 9 జిల్లాలలో, జిల్లా కేంద్ర గ్రంథాలయములను, 27 శాఖా గ్రంథాలయములను స్థాపించవలెను. ప్రభుత్వము ఈ గ్రంథాలయాలను స్థాపించుటకు తగు గ్రాంట్లను మంజూరు చేసినది. ఇందు మంత్రివర్యులై యుండిన మర్రి చెన్నారెడ్డిగారి సాయము కూడ

యుండినది. 1958 - 59 లో తెలంగాణ ప్రాంతమునందు ప్రప్రథమ ముగా 9 జిల్లా కేంద్ర గ్రంథాలయములు 27 శాఖా గ్రంథాలయములు లోకల్ లైబ్రరీ అథారిటీలచే ప్రభుత్వ గ్రాంటుతో స్థాపింపబడినవి. ఈ గ్రంథాలయాలను నవీన పద్ధతులలో నిర్వహించుటకు గ్రంథ పాలకులు కూడ ఉత్సాహముతో నుండిరి.



ఆదిలాబాదు జిల్లాలోని నిర్మల్ పట్టణము నందలి శాఖా గ్రంథాలయము.

ఇటువంటి చిన్న శాఖా గ్రంథాలయములందు కూడ ప్రారంభింపబడినప్పటినుండియే స్వేచ్ఛోపలబ్ధి పద్ధతి యవలంబింపబడుచుండినది.

1958 - 59 సంవత్సరముననే ప్రప్రథమముగా 24 పుస్తక పంపిణీ కేంద్రములు కూడ స్థాపింపబడినవి.

## తెలంగాణలో గ్రంథాలయాల నిర్వహణకు సూచనలు:

ఆంధ్ర ప్రాంతమునందలి జిల్లా కేంద్ర గ్రంథాలయములు, శాఖా గ్రంథాలయములు, ఏ విధముగా తమ విధులను నిర్వర్తించు

చుండినవో అదేవిధముగా తెలంగాణ ప్రాంతమునందు క్రొత్తగా స్థాపించబడిన గ్రంథాలయములు తమ విధులను నిర్వర్తించవలెనని వాటి నిర్మాణ నిర్వహణలను గురించి ప్రత్యేకాధికారి రాఘవరెడ్డి గారు గ్రంథ పాలకులకు తెలియజేయుచు వారికి కావలసిన సలహాలను కూడ సందర్భాను సారముగా యిచ్చుచుండిరి.

ఆంధ్ర ప్రాంతములోని పుస్తక పంపిణీ కేంద్రముల నిర్వహణకు సంబంధించి 3-8-1954 న రూపొందించబడిన నిబంధనలను తెలంగాణ ప్రాంతమునందు క్రొత్తగా స్థాపించబడిన పంపిణీ కేంద్రములకు వర్తింప చేసిరి. ఆంధ్ర ప్రాంతములోని పుస్తక పంపిణీ కేంద్రముల నిర్వాహకులకు ఏ విధముగా జీత భత్యములు చెల్లించబడుచుండినవో అదేవిధముగా తెలంగాణ ప్రాంతములోని పుస్తక పంపిణీ కేంద్రముల నిర్వాహకులకు కూడ యిచ్చుచుండిరి. ప్రత్యేకాధికారియైన రాఘవరెడ్డిగారు తెలంగాణ ప్రాంతమునందు క్రొత్తగా స్థాపించబడిన జిల్లా కేంద్ర, శాఖా గ్రంథాలయములకు, పుస్తక పంపిణీ కేంద్రములకు తరచుగా తనిఖీకి వెళ్ళెడివారు. ఆ సందర్భమున గ్రంథాలయ నిర్వాహకులకును పుస్తక భాండాగారులకును సలహాలను యిచ్చుచుండెడివారు.

పుస్తకపంపిణీ కేంద్రముల నిర్వాహకుల కిచ్చు ప్రతిఫలము తక్కువయినప్పటికి, ఆంధ్ర ప్రాంతములోవలె తెలంగాణాలోను పంపిణీ కేంద్రముల నిర్వాహకులు పెక్కండ్రు ప్రతిఫలమును గణించక గ్రామస్థులకు ప్రశంసనీయమైన సేవ చేసిరి.

## గ్రంథాలయాల భవనాలకు, ఫర్నిచరుకు ప్రజల తోడ్పాటు – విరాళాలు:

ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తరువాత కూడ లోకల్ లైబ్రరీ అథారిటీలు గ్రంథాలయముల అభివృద్ధికి గ్రంథాలయాభిమానుల నుండియు,

సంపన్నుల నుండియు పుస్తకరూపమున, ఫర్నిచర్, భవనముల రూప మున విరాళములను పొందినవి. ఆంధ్రప్రదేశ్‌నందు ఈ విధముగా లోకల్ లైబ్రరీ అథారిటీలు పొందిన విరాళము 31—3—1960 నాటికి మూడు లక్షలకు పైగా ఉండునని చెప్పవచ్చును.

## గ్రంథాలయాల సెస్సు వసూళ్ళలో పంచాయతీల నిర్లక్ష్యము:

ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తరువాత గ్రంథాలయ సెస్సు వసూలు కొంతవరకు మెరుగయినది. 1—10—1956 నాటికి మదరాసు పౌరగ్రంథాలయ చట్టము అమలులోనికి వచ్చి ఆరు సం॥ గడచినప్పటి కిని హైదరాబాదు పౌరగ్రంథాలయముల చట్టము అమలులోనికి వచ్చి పదునెనిమిది మాసములు కావస్తున్నప్పటికిని ఇంకను కొన్ని మేజర్ పం చాయతీలును, పెక్కు మైనర్ పంచాయతీలును గ్రంథాలయ సెస్సును వసూలు చేయుటలో నిర్లక్ష్యము చేసినవి. కొన్ని పురపాలకసంస్థలు వసూలైన గ్రంథాలయ సెస్సునందు కొంత శాతమును తమకిమ్మని కోరినవి. అందులకు ప్రభుత్వము అంగీకరించలేదు. కొన్ని పురపాలక సంస్థలు, కొన్ని పంచాయతీలు గ్రంథాలయ సెస్సు వసూలు చేయ బడు ప్రాంతములందు మాత్రము గ్రంథాలయములను స్థాపించవలె నని కోరినవి. కాని ప్రభుత్వము యిందులకు సమ్మతించలేదు.

తెలంగాణ ప్రాంతమునందు గ్రంథాలయ సెస్సు సక్రమముగా వసూలు కాకపోవుటకు మఱికొన్ని కారణములు కూడ గలవు.

హైదరాబాదు పౌరగ్రంథాలయముల చట్టము 1955 లో అమలులోనికి వచ్చినప్పటికి కొన్ని పంచాయతీలకు, ముఖ్యముగా మైనర్ పంచాయతీలకు గ్రంథాలయ సెస్సు వసూలు చేయవలయు నన్న విషయము తెలియక పోవడము వలన గ్రంథాలయ సెస్సు వసూలు సక్రమముగా జరుగలేదు. అదియునుగాక తెలంగాణప్రాంత

మందు సెస్సు వసూలు చేయు విధానమును కొన్ని మైనర్ పంచాయతీలు తెలిసికొనుటకు కొంత ఆలస్యము పట్టినది.

సెస్సు వసూలు చేసిన కొన్ని పంచాయతీలకు వసూలు కాబడిన సెస్సును జిల్లా విద్యాశాఖాధికారిగారి కార్యాలయమున చెల్లించవలెనా లేక ఖజానాలలో చెల్లించవలెనా యన్న సందేహము కల్గినది.

తెలంగాణ ప్రాంతమునందు ఆస్తిపన్ను, ఇంటిపన్ను తక్కువగా వసూలు చేయుట వలన సహజముగా వసూలు చేయబడు గ్రంథాలయ సెస్సుకూడ తక్కువగానే వుండినది. మఱియు 1—7—1955 నుండి 31—3—1957 వరకు వసూలైన గ్రంథాలయ సెస్సు వివరములు ప్రభుత్వమునకు తెలియబరచక పోవుటవలన చట్టప్రకారము ప్రభుత్వము నుండి పొందవలసిన సహాయమును లోకల్ లైబ్రరీ అథారిటీలు సకాలమున పొందలేకపోయినవి.

## తెలంగాణ ప్రాంతమునకు చట్టము మేరకు తొలిసారిగా ప్రభుత్వ గ్రాంటులు :

1—7—1957 న ఆంధ్రప్రదేశ్ అంతటికి ప్రత్యేకాధికారి బాధ్యతలను స్వీకరించిన రాఘవరెడ్డిగారు గ్రంథాలయ సెస్సు వసూలు వివరములను ప్రతిజిల్లా యందును సేకరించి ప్రభుత్వమునకు పంపిరి. ప్రభుత్వము హైదరాబాదు పౌరగ్రంథాలయముల చట్టము క్రింద ప్రప్రథమముగా లోకల్ లైబ్రరీ అథారిటీలకు 1—7—1955 నుండి 31—3—1957 వరకు మంజూరు చేసిన గ్రాంట్లు.

| లోకల్ లైబ్రరీ అథారిటీ పేరు | మంజూరు చేయబడిన గ్రాంట్లు. |
|---|---|
| 1. లోకల్ లైబ్రరీ అథారిటీ — ఖమ్మం | 2483-06 |
| 2. ,, — కరీంనగర్ | 28-56 |

| | | |
|---|---|---|
| 3. లోకల్ లైబ్రరీ అథారిటీ | - నిజామాబాద్ | 435-84 |
| 4. ,, | - వరంగల్ | 4,404-94 |
| 5. ,, | - ఆదిలాబాద్ | 1,560-37 |
| 6. ,, | - మెదక్ | 113-16 |
| 7. ,, | - నల్గొండ | 672-71 |
| 8. ,, | - మహబూబ్ నగర్ | 816-33 |

ఈ మొత్తమును ప్రభుత్వము 24—3—1957 న గ్రాంటు క్రింద మంజూరు చేసినది. ఆంధ్రప్రదేశ్ అవతరణ తర్వాతకూడ, రాఘవరెడ్డిగారు పురపాలక శాఖాధికారులకు, పంచాయతీ అధికారులకు గ్రంథాలయ వ్యాప్తికి, అభివృద్ధికిని, గ్రంథాలయోద్యమము సక్రమముగా కొనసాగుటకును గ్రంథాలయ సెస్సును సక్రమముగా వసూలు చేయడము ఎంతో అవసరమని వివరించిరి. సెస్సు వసూలు చేయుట వారి ప్రథమ కర్తవ్యమని నొక్కి చెప్పి వారిని సెస్సు వసూలు చేయుటకు సుముఖులుగా చేసిరి. లోకల్ లైబ్రరీ అథారిటీ చైర్మెన్‌లు, సెక్రటరీలుకూడ సెస్సు వసూలుకు మిగుల శ్రద్ధ వహించుటచే తెలంగాణ ప్రాంతమునందు గ్రంథాలయ సెస్సు వసూలు కొంతవరకు మెరుగు పడినది.

## ఆంధ్రప్రదేశ్‌లో 1960 వరకు ప్రభుత్వ గ్రాంటులు:

1957 నుండి చట్టప్రకారము ప్రభుత్వము గ్రంథాలయములకు ఈ క్రింది విధముగా గ్రాంట్లను మంజూరు చేసినది.

1955 హైదరాబాదు పౌరగ్రంథాలయముల చట్టప్రకారము లోకల్ లైబ్రరీ అథారిటీలకు ప్రభుత్వము మంజూరు చేసిన మొత్తము.

| సంవత్సరము. | మంజూరు చేసిన మొత్తము రూ॥ |
|---|---|
| 1957–58 | 10,515–00 |
| 1958–59 | 29,911–00 |
| 1959–60 | 35,710–00 |

1948 మదరాసు పౌర గ్రంథాలయముల చట్టము ననుసరించి లోకల్ లైబ్రరీ అథారిటీలకు ప్రభుత్వము మంజూరుచేసిన మొత్తము.

| సంవత్సరము | మంజూరు చేసిన మొత్తము రూ॥ |
|---|---|
| 1956–57 | 2,36,475 |
| 1957–58 | 3,22,100 |
| 1958–59 | 2,50,164 |
| 1959–60 | 2,05,877 |

## తెలంగాణలో గ్రంథాలయాల నిర్వహణ – ఆధునిక పద్ధతులు:

ఆంధ్రరాష్ట్రము ఏర్పడిన తరువాత, ఆంధ్రప్రాంతములో నూతనముగా స్థాపించబడిన జిల్లా కేంద్ర గ్రంథాలయములను, శాఖా గ్రంథాలయములను ఆధునిక పద్ధతులలో నిర్వహించుటకు గట్టి పునాదులను వేసి గ్రంథాలయములను నిర్వహించిన విధముగా, తెలంగాణ ప్రాంతమునందు 1958–59 లో స్థాపించిన జిల్లా కేంద్ర గ్రంథాలయములను, శాఖా గ్రంథాలయములను కూడ ఆధునిక పద్ధతులలో నిర్వహించుటకు రాఘవరెడ్డిగారు గట్టి కృషిసల్పిరి. తెలంగాణ ప్రాంతమునందు క్రొత్తగా స్థాపించబడిన గ్రంథాలయముల పుస్తక భాండాగారులు క్రొత్తగా శిక్షణ పొందివచ్చిన వారు కావున డిప్యూటీ డైరెక్టరుగారైన రాఘవరెడ్డిగారి సలహాలను తీసికొనుచు ఆంధ్ర ప్రాంతమునందువలె ఆధునిక పద్ధతులలో గ్రంథాలయముల నిర్వహించుటకు ప్రత్యేక శ్రద్ధను వహించిరి.

ఆంధ్ర ప్రాంతమునందువలెనే తెలంగాణ ప్రాంతమునందును చాల వరకు జిల్లా కేంద్ర గ్రంథాలయ భవనములు అద్దె భవనములే. ఇవి తగు విశాలముగా లేకపోయినప్పటికి పౌరగ్రంథాలయములందు ప్రవేశపెట్టవలసిన ముఖ్య విభాగములను ఈ గ్రంథాలయములందు కూడ సాధ్యమైనంత వరకు ఏర్పాటు చేయడము జరిగినది. శాఖా గ్రంథాలయములు కూడ చాలవరకు అద్దె భవనములలోనే ఉండినవి. అయినప్పటికిని వీటియందు కూడ పౌరగ్రంథాలయము లందుండవలసిన విభాగములలో స్థలమునుబట్టి కొన్ని ప్రధానమైన విభాగములు ఏర్పాటు చేయబడినవి.

ఆంధ్ర ప్రాంతమునందువలెనే తెలంగాణ ప్రాంతములో అన్ని పౌరగ్రంథాలయములందును సాధ్యమైనంత వరకు పెద్దలు, బాల బాలికలు చదువుకొనుటకు వీలుగా విభాగములను ప్రత్యేకించ డము జరిగినది. పౌరగ్రంథాలయములలో అన్నిటియందు బాలల విభాగములను ఏర్పాటు చేయలేక పోయినప్పటికి, బాలల కార్యక్రమ ములు జరుపబడినవి. బాలలకు సంబంధించిన పుస్తకములను ప్రవేశ పెట్టి ఆ పుస్తకములను ప్రత్యేకముగా అమర్చడము జరిగినది. చాలి నంత స్థలము లేకపోవుటచేత మహిళలకును, విద్యార్థులకును ప్రత్యేక విభాగములు ఏర్పాటు చేయబడలేదు. ఈ పౌర గ్రంథాలయములను స్థాపించిన నాటినుండి అన్నిగ్రంథాలయముల యందును ప్రయోజన కరమగు ఆమూకీ గ్రంథములను ప్రవేశపెట్టిరి. నిర్ణీత కొలతలు కలిగిన బల్లలు, కుర్చీలు, బీరువాలు, పత్రికల స్టాండులు మున్నగు వాటిని తెలంగాణ ప్రాంత పౌరగ్రంథాలయములయందు కూడ కొంత ప్రభుత్వ గ్రాంటుతోను, కొంతవరకు లోకల్ లైబ్రరీ అథారిటీల నిధి తోను ఏర్పాటుచేయడము జరిగినది.

ఆంధ్రప్రదేశ్‌లోని అన్ని పౌరగ్రంథాలయముల యందును పుస్తక వర్గీకరణ - సూచీకరణ ఒకేరీతిగా జరగవలెనని ఆంధ్ర

ప్రాంతమునందు అవలంబించబడుచున్న దశాంశ వర్గీకరణ, నిఘంటు సూచీకరణ విధానములను తెలంగాణప్రాంతమున క్రొత్తగా స్థాపించ బడిన పౌరగ్రంథాలయములందు కూడ అవలంబింప చేయవలెనని రాఘవరెడ్డిగారు గ్రంథపాలకులకు తెలియజేసిరి. మఱియు లోకల్ లైబ్రరీ అథారిటీలు కొనుగోలుచేయు పుస్తకముల వర్గీకరణ-సూచీకరణ ఆంధ్రప్రాంతమునందువలె జిల్లా కేంద్రగ్రంథాలయమునందే జరుగ వలెనని స్పష్టపరచిరి. క్రొత్తగా స్థాపింపబడిన గ్రంథాలయము లయి నప్పటికిని, కొన్ని జిల్లాకేంద్ర గ్రంథాలయములందు 1960 సం॥నకు పూర్వమే సాంఘిక, సాంస్కృతిక సేవాకార్యక్రమములను, బాలల కార్యక్రమములను కొన్నిటిని ప్రవేశపెట్టిరి.

## పౌరగ్రంథాలయాలలో ఆధునిక పద్ధతుల అమలు:

దృశ్య శ్రవణ విద్యకు సంబంధించిన కార్యకలాపములను, విజ్ఞానదాయకమైన చలనచిత్రములను ప్రదర్శించుటకు లోకల్ లైబ్రరీ అథారిటీలకు తగు ఆర్థిక స్తోమత లేనందువలన పౌరసంబంధ శాఖవారి సౌజన్యముతో ఆంధ్రప్రాంతమునందువలె కొన్ని గ్రంథాలయములలో ఈ కార్యకలాపములను ఏర్పాటు చేయడము జరిగినది. తెలంగాణ ప్రాంతమునందు 1958-59 లో క్రొత్తగా స్థాపించబడిన పౌర గ్రంథాలయములకు గ్రంథాలయ శిక్షణ పొందని వారిని గ్రంథ పాలకులుగా నియమించడము జరిగినది. కావున వీరు 1959 సం॥ గ్రంథాలయ శాస్త్రమునందు శిక్షణ పొందుటకు ఉస్మానియా విశ్వవిద్యాలయమునకు పంపబడిరి. వీరు శిక్షణ పొందిన తరువాత, పౌరగ్రంథ పాలకులుగా బాధ్యతలను స్వీకరించి ఆధునిక పద్ధతులలో గ్రంథాలయముల నిర్వహించుటకు పునాదులను వేయసాగిరి. చాలవరకు శాఖా గ్రంథపాలకులను కూడ శిక్షణకు పంపి వారి శిక్షణానంతరము గ్రంథ పాలకులుగా ఖాయపర్చడము జరిగినది.

ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన అనంతరము ఒక పౌర గ్రంథాలయము నుండి మఱియొక పౌర గ్రంథాలయమునకు పుస్తకములను అరువు తీసికొనుటకు తెలంగాణలో కూడ తగు ఏర్పాట్లు చేయడము జరిగినది. దీనివలన పౌర గ్రంథాలయముల మధ్య సహకారము పెంపొందుటకు అవకాశము ఏర్పడినది. తెలంగాణ ప్రాంతము నందు క్రొత్తగా స్థాపించబడిన పౌర గ్రంథాలయము లందు పుస్తకము లను స్వేచ్ఛోపలబ్ధి పద్ధతిని పాఠకులు తాము చదువుకొనుటకు కావలసిన పుస్తకములను సులభముగా గ్రహించుట కనువుగా అమర్చి యుంచిరి. మఱియు అరువు తీసికొనబడు పుస్తకములకు రిజిష్టరు పద్ధతిని గాక, టికెట్టు పద్ధతిని ప్రవేశపెట్టిరి. గ్రంథాలయో ద్యోగుల పనికాలము గూడ ఆంధ్ర ప్రాంతమునందువలెనే నిర్ణ యింపబడినది.

తెలంగాణలో జిల్లా కేంద్ర గ్రంథాలయములకు, శాఖా గ్రంథాలయములకు తనిఖీలకు వెళ్ళినపుడు డిప్యూటీడైరెక్టరు గారైన రాఘవరెడ్డిగారు గ్రంథాలయ నిబంధనలను అనువుగా, ప్రయోజన కరముగా నుండునట్లు సవరించుచు ఆయా గ్రంథాలయముల పుస్తక భాండాగారులకు ఆచూకీ గ్రంథాలను తదితర గ్రంథములను గ్రంథ పాఠకులకు కావలసినపుడు సహాయ సహకారముల నందించు చుండవలయునని తెలియజేయుచుండిరి. మఱియు ఆంధ్ర ప్రాంతము నందువలె గ్రంథాలయములకు కావలసిన పుస్తకములను ఎన్నుకొను కమిటీలో బాల సాహిత్యమునందు ప్రావీణ్యత గలవారికి తప్పక సభ్యత్వము కలుగ జేయవలయునని తెలిపిరి. పుస్తకముల కొను గోలుకు కేటాయించబడిన మొత్తము పైకమునందు తప్పని సరిగా బాలలకు సంబంధించిన పుస్తకములను కొనుటకును, కొంత శాతము క్రొత్తగా అక్షరాస్యులైన వయోజనులకు సంబంధించినపుస్తకములను కొనుటకును కొంత శాతము కేటాయించవలెనని బాలలకు చిన్న

నాటినుండి విద్యయందు మక్కువను పెంచుటకు పుస్తక భాండా గారులు ప్రత్యేక శ్రద్ధ వహించవలెనని కూడ రాఘవరెడ్డిగారు వివరించుచుండిరి.

ఆంధ్ర ప్రాంతము కన్న తెలంగాణము నందలి లోకల్ లైబ్రరీ అథారిటీలు ఆర్థికముగా వెనుకబడి యున్నప్పటికిని, రాఘవరెడ్డిగారి సలహా సంప్రదింపులతో పౌర గ్రంథాలయములందు ఆధునిక పద్ధతులను ప్రవేశపెట్టి, గ్రంథాలయ నిర్వాహణకు చక్కని పునాదిని నిర్మించుటకు ఆంధ్ర ప్రాంతమునందువలె తెలంగాణలోను మిగుల ప్రశంసనీయమైన కృషి జరిగినది. సాంకేతికముగా గ్రంథాలయములందలి పుస్తక వర్గీకరణ, సూచీకరణ జరగనిచో పుస్తక భాండాగారులకు గ్రంథాలయములందు తగు ఆదరణ యుండదని తెలియ జేయుటచేత రాఘవరెడ్డిగారి సలహా మేరకు పుస్తకములను సాంకేతికముగా వర్గీకరణ, సూచీకరణచేసి పుస్తక భాండాగారులు ప్రశంసనీయమైన గ్రంథాలయ సేవకు పాత్రులైరి. పౌర గ్రంథాలయములను ఆధునిక పద్ధతులలో నిర్వహింప జేయుటకు ప్రయత్నింపకున్నచో గ్రంథాలయములు నిరాదరణ చెందుటకును, అభివృద్ధిలోనికి రాకపోవుటకును ఆస్కారము కలుగునని గ్రంథ పాలకులకు రాఘవరెడ్డిగారు పలుమార్లు స్పష్టపరచి నవీన పద్ధతిలో గ్రంథాలయ నిర్వాహణకు ఇతోధికముగా కృషిచేసిరి. ఈ విధముగా పలువురు గ్రంథాలయాభిమానుల, గ్రంథాలయోద్యోగుల సహకారముతో రాఘవరెడ్డిగారి ప్రశంసనీయమైన ప్రోత్సాహముతో ఆంధ్రప్రదేశ్ నందు పౌర గ్రంథాలయములు నవీన పద్ధతిలో 1960 సం॥నకు పూర్వము కూడ నిర్వహింపబడినవి.

31—3—1960 నాటికి ఆంధ్రప్రదేశ్ నందలి పెక్కు పౌర గ్రంథాలయములలో సక్రమముగా నవీన పద్ధతులను అవలంబించి

యుండిరి. ఆంధ్రప్రదేశ్ నందు అవలంబించ బడిన నవీన పద్ధతులు దేశములో యే రాష్ట్రమునందును అవలంబించబడలేదని చెప్పవచ్చును. భారత దేశము నందలి పలువురు గ్రంథాలయ శాస్త్ర నిపుణులుకూడ ఈ విషయమై మిగులకొనియాడి యున్నారనుట అతిశయోక్తి కాదు.

## తెలంగాణ ప్రాంతపు సహాయక గ్రంథాలయాల అభివృద్ధికితోడ్పాటు :

ఆంధ్రప్రాంతమునందు వలెనే తెలంగాణలో సహాయక గ్రంథాలయములకును, ప్రభుత్వము ఎక్కువగా గ్రాంట్లను మంజూరు చేయలేక పోయినప్పటికి గ్రంథాలయ కార్యకర్తలు సహాయక గ్రంథాలయముల అభివృద్ధికి కృషి చేసిరి. ఆంధ్రప్రదేశ్ ఏర్పడక పూర్వము తెలంగాణప్రాంతమునందలి గ్రామసంఘం గ్రంథాలయములకు, పంచాయతీ గ్రంథాలయములకు గ్రాంట్లు మంజూరు చేయబడ లేదు. ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తరువాత వీటికిగూడ గ్రాంట్లను రాఘవరెడ్డిగారు మంజూరు చేయించిరి. ఈ గ్రంథాలయములకు కావల సిన పుస్తకములను కొనుటకు కేటాయించబడిన మొత్తము పైకము నుండి పుస్తకములనే గాక ఆ పుస్తకముల నమర్చుటకు అనువగు బీరువాలను గూడ కొనవలసినదని డిప్యూటి డైరెక్టరుగారు తెలియ జేసిరి. గ్రంథాలయములకు కావలసిన పుస్తకములను ఎన్నుకొను కమిటీ సూచించిన పుస్తకముల జాబితాను ధృవపరచు అధికారము జిల్లా విద్యాశాఖాధికారులకు గాక, లోకల్ లైబ్రరీ అథారిటీలకుండ వలెనని రాఘవరెడ్డిగారు తెలియబరచిరి. లోకల్ లైబ్రరీ అథారిటీలు సాంకేతికముగా పుస్తక విభజన, తదితర అంశములయందు సహా యక గ్రంథాలయములకు కొంతవరకు తోడ్పడుచుండుటయే గాక అవ సరమైనప్పుడు కొన్ని ప్రామాణిక పుస్తకములను కూడ సహాయక గ్రంథాలయములకు పంపిణీ చేయుచుండిరి. రాఘవరెడ్డిగారు తెలం గాణలోని పలుగ్రామీణ ప్రాంతములకు వెళ్ళి సహాయక గ్రంథా

లయ గ్రంథపాలకులకు కావలసిన సలహాల నొసగుచు, గ్రంథాలయములు లేని ప్రాంతములందు గ్రంథాలయములను స్థాపించు బాధ్యత అవసరము యెంతేని కలదని తెలియబరచి గ్రంథాలయముల అభివృద్ధికి తగు ఉత్సాహ ప్రోత్సాహములను గ్రంథాలయ అభిమానులకును కార్యకర్తలకును కల్గించుచుండిరి. ఈ విధముగా డిప్యూటీ డైరెక్టరు గారైన రాఘవరెడ్డిగారి ప్రోత్సాహము వలనను గ్రంథాలయ కార్యకర్తల నిర్విరామకృషితోడను, గ్రంథాలయాభిమానుల సహకారముతోడను చాలవరకు సహాయక గ్రంథాలయములు అభివృద్ధిచెందినవి. తెలంగాణయందు ఆంధ్రప్రదేశ్ ఏర్పడుటకు పూర్వముగల ప్రభుత్వ గ్రాంటును పొందుచుండిన సహాయక గ్రంథాలయముల సంఖ్య 1—4—1960 నాటికి 35 నుండి 75 కు పెరిగినది. ఆంధ్రప్రాంతమునందు సహాయక గ్రంథాలయములు 1–4–1960 నాటికి 1200 దాకయుండినవి.

## ఆంధ్రప్రదేశ్‌నందు 1—11—1956 నుండి 30—3—1961 వరకు జరిగిన గ్రంథాలయాభివృద్ధి — సమీక్ష:

### 1956—57 సంగన జరిగిన ముఖ్యమైన గ్రంథాలయాభివృద్ధి కార్యక్రమములు:—

31—3—1956 నాటికి ఆంధ్ర ప్రాంతమునందు 11 జిల్లా కేంద్ర గ్రంథాలయములు, 91 శాఖా గ్రంథాలయములు, 115 పుస్తక పంపిణీ కేంద్రాలు లోకల్ లైబ్రరీ అథారిటీ వారి యాజమాన్యము నందుండినవి. ఆంధ్రప్రదేశ్ అవతరణ నాటికి అనగా 1—11—1956 నకు శాఖా గ్రంథాలయముల సంఖ్య 96 కు, పుస్తక పంపిణీ కేంద్రముల సంఖ్య 117 కు పెరుగుటచే లోకల్ లైబ్రరీ అథారిటీల యాజమాన్యమునందు మొత్తము 224 గ్రంథాలయము లుండినవి.

హైదరాబాదు రాష్ట్రమునకు కేంద్ర గ్రంథాలయముగా నుండిన అసఫియా గ్రంథాలయమును ఆంధ్రప్రదేశ్ కేంద్ర గ్రంథాలయముగాను, ఆంధ్ర రాష్ట్రమునకు కేంద్ర గ్రంథాలయముగా నుండిన విశాఖపట్టణములోని కేంద్ర గ్రంథాలయమును ప్రాంతీయ గ్రంథాలయముగాను ప్రభుత్వము ప్రకటించినది.

31—3—1956 నాటికి ఆంధ్ర ప్రాంతమునందు పంచాయతీల, పురపాలక సంస్థల తదితర ప్రయివేటు గ్రంథాలయ సంస్థల ఆధ్వర్యమున 1,124 సహాయక గ్రంథాలయము లుండినవి. ఈ గ్రంథాలయములలో 824 సహాయక గ్రంథాలయములు ప్రభుత్వ గ్రాంటును కూడ పొందినవి, 1—11—1956 నాటికి వీటి సంఖ్య 1,127 కు హెచ్చినవి.

31—3—1956 నాటికి ఆంధ్ర ప్రాంతమునందు 245 పఠనమందిరము లుండినవి. 1—11—1956 నాటికి వీటి సంఖ్య 100 కి తగ్గినది. పఠనమందిరములందు కేవలము పత్రికలు మాత్రము వుండిన పాఠకులకు ప్రయోజనకరముగా నుండదని ప్రభుత్వము భావించి పఠనమందిరములందు పుస్తకములను కూడ ప్రవేశపెట్టినచో అవి గ్రంథాలయములుగా పరిగణింపబడుననియు లేనిచో అవి గుర్తింపబడవనియు ప్రభుత్వము తెలియజేయుటచేత కొన్ని పఠనమందిరములందు వాటి నిర్వాహకులు కాలక్రమమున పుస్తకములనుకూడ ప్రవేశపెట్టి వాటిని సహాయక గ్రంథాలయములుగా రూపొందించుచూ వచ్చిరి. కొన్ని పఠనమందిరములలో కేవలము పత్రికలవిభాగము మాత్రముండుటచేత అవి పాఠకుల నంతగా ఆకర్షింప లేకపోయినవి. క్రమముగా అటువంటి పఠనమందిరములకు విచ్చేయు పాఠకుల సంఖ్యకూడ సన్నగిల్లుచూ వచ్చినది. దీనిని గమనించి సమర్థులైన పఠనమందిరముల నిర్వాహకులు పుస్తక

ములను ప్రవేశపెట్టి చాలావాటిని రెండు సం॥లలో సహాయక గ్రంథా లయములుగా రూపొందించిరి.

ఈ ఆర్థిక సంవత్సరమునందు తెలంగాణ ప్రాంతమునందలి 9 జిల్లాలకును మఱియు సికిందరాబాదు నగరమునకును హైదరాబాదు పౌరగ్రంథాలయ చట్టప్రకారము లోకల్ లైబ్రరీ అథారిటీల నియామకము జరిగినది. 1—11—1956 నాటికి తెలంగాణ ప్రాంతమందు లోకల్ లైబ్రరీ అథారిటీల యాజమాన్యము క్రింద గ్రంథాలయములు స్థాపించబడియుండలేదు. కాని ప్రయివేటు సంస్థల నిర్వహణలో 52 సహాయక గ్రంథాలయములు పని చేయుచుండినవి, 31—3—1957 నాటికి వీటి సంఖ్య 56 కు చేరినది. 1956-57 లో ఈ గ్రంథాలయముల నిర్వహణకు ప్రభుత్వము 10,513 రూ॥ గ్రాంటు క్రింద మంజూరు చేసినది.

ఆంధ్ర ప్రాంతమునందు 31—3—1957 నాటికి 11 జిల్లా కేంద్ర గ్రంథాలయములు, 114 శాఖా గ్రంథాలయములు, 123 పుస్తక పంపిణీ కేంద్రములు లోకల్ లైబ్రరీ అథారిటీల అజమాయిషీలో నుండినవి. పంచాయతీల పురపాలక, ప్రయివేటు సంస్థల నిర్వహణలో 1,130 సహాయక గ్రంథాలయములుండినవి. వీనిలో 832 గ్రంథాలయములు ప్రభుత్వ గ్రాంట్లను పొందినవి. మిగిలిన గ్రంథాలయములు డైరెక్టరు కోరినప్పటికిని ప్రభుత్వమునకు గ్రాంటు నిమిత్తము ధరఖాస్తును సమర్పించుకొనక పోవుటచేత గ్రాంటును పొందలేక పోయినవి.

మదరాసు పౌర గ్రంథాలయ చట్టము 1948 ప్రకారము ఆంధ్ర ప్రాంతములో గ్రంథాలయములకు 2,36,475 రూ॥లను ప్రభుత్వము వసూలయిన గ్రంథాలయ సెస్సుకు సమాన గ్రాంటుగా మంజూరు చేసినది.

ఈ ఆర్థిక సం॥నందు బాలలకు సంబంధించిన పుస్తకముల రచనలకుగాను 20 మంది కవులకు రాజమండ్రిలో శిక్షణ యివ్వబడినది.

కేంద్ర ప్రభుత్వముయొక్క బహుమతుల నందుకొన్న 8,150 పుస్తక ప్రతులను కేంద్ర ప్రభుత్వము ఆంధ్రప్రదేశ్‌కు పంపగా రాష్ట్రప్రభుత్వము పౌర గ్రంథాలయములకును, పాఠశాలల గ్రంథాలయములకును తదితర గ్రంథాలయములకును పై పుస్తకములను ఉచితముగా పంచి పెట్టినది.

ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తరువాత 3,823 పుస్తకములు కన్నెమారా ప్రభుత్వ గ్రంథాలయమునుండి ఆంధ్రప్రదేశ్‌కు బదిలీ చేయబడినవి.

1956 - 57 సం॥నందు పథకము నెం 1 IV క్రింద కేంద్ర ప్రభుత్వము ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయాభివృద్ధికి మంజూరు చేసిన మొత్తము పైకము రూ. 13,025/-

1956 - 57 సం॥నందు సంయుక్త గ్రంథాలయ సేవాపథకము (Integrated Library Service Scheme) క్రింద కేంద్రప్రభుత్వము గ్రంథాలయాభివృద్ధికి మంజూరు చేసిన పైకము రూ. 2,40,895/-

## 1957-58 సం॥నందు జరిగిన గ్రంథాలయముల అభివృద్ధి - ప్రధాన ఘట్టములు:

1. ఈ ఆర్థిక సం॥నందు లోకల్ లైబ్రరీ అథారిటీవారు 23 శాఖాగ్రంథాలయములను, 23 పుస్తకపంపిణీ కేంద్రములను ఆంధ్ర ప్రాంతమందలి గ్రామీణ ప్రాంతములలోను స్థాపించిరి.

2. 45,000 రూ॥ మొత్తముతో పశ్చిమగోదావరి యందలి ఏలూరునందు ఒక సంచారగ్రంథాలయము స్థాపించబడినది.

3. తెలంగాణ ప్రాంతమునందు 9 జిల్లా కేంద్ర గ్రంథాలయములను స్థాపించుటకొరకు లోకల్ లైబ్రరీ అథారిటీలకు 1,62,519 రూ॥లను ప్రభుత్వము మంజూరు చేసినది.

4. 27 శాఖా గ్రంథాలయములను స్థాపించుటకు 1,48,527 రూ॥ గ్రాంటును ప్రభుత్వము లోకల్ లైబ్రరీ అథారిటీలకు మంజూరు చేసినది.

5. తెలంగాణ ప్రాంతమునందలి సహాయక గ్రంథాలయముల సంఖ్య ఈ ఆర్థిక సంవత్సరమునందు 56 నుండి 75 కు పెరిగినది.

6. చట్టప్రకారము గ్రంథాలయాభివృద్ధి నిమిత్తము ప్రభుత్వము లోకల్ లైబ్రరీ అథారిటీలకు 3,22,100 రూ॥ మొత్తమును మంజూరు చేసినది.

7. గుంటూరు ప్రాంతీయ గ్రంథాలయ స్థాపనాభివృద్ధికిగాను కేంద్రప్రభుత్వము 65,723 రూ॥లను రాష్ట్రప్రభుత్వమునకు మంజూరు చేసినది.

## 1958-59 సం॥న జరిగిన గ్రంథాలయాభివృద్ధి ప్రధాన ఘట్టములు :

1. ఈ ఆర్థిక సంవత్సరమునందు 12 శాఖా గ్రంథాలయములు, 24 పుస్తకపంపిణీ కేంద్రములు, ఆంధ్రప్రాంతమునందును, 9 జిల్లా కేంద్ర గ్రంథాలయములు 27 శాఖాగ్రంథాలయములు తెలంగాణ ప్రాంతమునందును నూతనముగా ప్రారంభించబడినవి.

2. ఆంధ్రప్రాంతమునందలి సహాయక గ్రంథాలయముల నిర్వహణకు 60,000 రూ॥లను, తెలంగాణ ప్రాంతమునందలి సహాయక గ్రంథాలయముల నిర్వహణకు 10,928 రూ॥లను ప్రభుత్వము మంజూరు చేసినది.

3. రాష్ట్ర కేంద్రగ్రంథాలయమునందలి శిక్షణ పొందని పట్టభద్రులయిన గ్రంథపాలకులను ముప్పురిని గ్రంథాలయ శాస్త్రము నందు డిప్లొమా కోర్సునందు శిక్షణపొందుట కొరకు ఉస్మానియా విశ్వవిద్యాలయమునకు పంపడమైనది.

4. సాహిత్య రచనాలయమునకు ఇరువదిమంది కవులు బాలల సాహిత్య రచనయందు శిక్షణ పొందుటకు పంపబడిరి.

5. 'నాట్యశాస్త్రము' అను పుస్తకప్రచురణార్థము 4000/- రూ॥ గ్రాంటును ప్రభుత్వము మంజూరు చేసినది.

1958-59 సం॥లో మధుర సౌరాష్ట్ర భవనములోని లిఖిత ప్రతులలో నున్న త్యాగరాజ కృతులను పరిశీలించు నిమిత్తము శ్రీ జి. వి. సీతాపతిగారిని 26-12-1955 న మధురకు పంపుటకూడ జరిగినది.

మదరాసు పౌర గ్రంథాలయాల చట్టము ప్రకారము ఆంధ్ర ప్రాంతమునందలి లోకల్ లైబ్రరీ అథారిటీలకు 2,50,164 రూ॥లను, హైదరాబాదు పౌర గ్రంథాలయముల చట్టము ప్రకారము తెలంగాణ ప్రాంతమునందలి లోకల్ లైబ్రరీ అథారిటీలకు 29,911 రూ॥లను ప్రభుత్వము మంజూరు చేసినది. ఈ ఆర్థిక సంవత్సరమునందు ఆంధ్ర ప్రాంతములోని గ్రంథాలయములన్నియును చాలవరకు నవీన పద్ధతులలో నిర్వహింపబడినవి. తెలంగాణ ప్రాంతమునందు క్రొత్తగా స్థాపించబడిన గ్రంథాలయములందు నవీన పద్ధతులను ప్రవేశ పెట్టుటకు పలువిధములుగా ప్రశంసనీయమైన కృషి జరిగినది.

## 1959—60 సం॥న జరిగిన గ్రంథాలయాభివృద్ధి - ప్రధాన ఘట్టములు:

1. సికిందరాబాదు నగరమునందు ఒక కేంద్ర గ్రంథాలయము ఈ ఆర్థిక సంవత్సరమున స్థాపించబడినది.

2. ఈ సం॥ ఆంధ్ర ప్రాంతమునందు పదకొండు ప్రత్యేక బాలల గ్రంథాలయములు ప్రారంభించబడినవి.

3. ఈ సం॥నందు సహాయక గ్రంథాలయముల స్థాపనాభి వృద్ధి నిమిత్తము ఆంధ్ర ప్రాంతమునకు 45,665 రూ॥లను తెలంగాణ ప్రాంతమునకు 10,663 రూ.లను ప్రభుత్వము మంజూరు చేసినది.

4. మదరాసు పౌర గ్రంథాలయముల చట్టము 1948 ప్రకారము ఆంధ్ర ప్రాంతములోని లోకల్ లైబ్రరీ అథారిటీలకు 2,05,877 రూపాయలను, హైదరాబాదు పౌర గ్రంథాలయ చట్ట ప్రకారము తెలంగాణ ప్రాంతములోని లోకల్ లైబ్రరీ అథారిటీలకు 35,710 రూ. లను ప్రభుత్వము మంజూరు చేసినది.

31—3—1960 నాటికి ఆంధ్ర ప్రాంతమునందు 11 జిల్లా కేంద్ర గ్రంథాలయములును, బాలల గ్రంథాలయములతో సహా 160 శాఖా గ్రంథాలయములును, 294 పుస్తక పంపిణీ కేంద్రములును వుండినవి. తెలంగాణ ప్రాంతమునందు 31—3—1960 నాటికి హైదరాబాదు నగర కేంద్ర గ్రంథాలయమును, 9 జిల్లా కేంద్ర గ్రంథాలయములును, 27 శాఖా గ్రంథాలయములును, 20 పుస్తకపంపిణీ కేంద్రములును, 75 సహాయక గ్రంథాలయములును ఉండినవి. 31-3-1960 నాటికి ఆంధ్ర ప్రాంతమునందు 1,200 సహాయక గ్రంథాలయములుండినవి. వీనిలో 986 సహాయక గ్రంథాలయములకు ప్రభుత్వము గ్రాంటును మంజూరు చేసినది.

ఆంధ్ర ప్రాంతమునందలి గ్రంథాలయము లన్నిటియందును గత సంవత్సరము కంటె ప్రశంసనీయముగా నవీన పద్ధతులు అవలంబింపబడినవి. ఈ సం॥నందు తెలంగాణ ప్రాంతమునందలి గ్రంథాలయముల యందు ఆధునిక పద్ధతులను అమలు పరచుటకు గట్టి పునాది వేయడమైనది.

## 1 – 10 – 1957 నుండి 1 – 10 – 1960 వరకు జరిగిన గ్రంథాలయాభివృద్ధి - గణాంక వివరములు:

1957 జూలై నందు ఆంధ్రప్రదేశ్ నందలి గ్రంథాలయముల నిర్వహణా బాధ్యతలను రాఘవరెడ్డిగారు చేపట్టి పెక్కు గ్రంథాలయములను సందర్శించి అందలి గ్రంథ పాలకులకు సముచిత సలహాల నొసగుచు గ్రంథాలయముల అభివృద్ధికిని, క్రొత్త గ్రంథాలయాల స్థాపనకును వారికి తగు విధముగా ప్రోత్సాహము కల్పించుచు ప్రతిభావంతముగా బాధ్యతలను నిర్వహించుచూ, గ్రంథాలయాభివృద్ధికి మిగుల కృషి చేయుచూ వచ్చిరి. హైదరాబాదు పౌర గ్రంథాలయ చట్టమును, మదరాసు పౌర గ్రంథాలయ చట్టమును సమీకృత పరచి ఆంధ్రప్రదేశ్ అంతటికి అన్వయింపబడు నటువంటి ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ చట్టమును రూపొందించవలయునని వీరి సంకల్పము. ఆంధ్రప్రదేశ్ అంతటికి అన్వయింపబడు నటువంటి పౌర గ్రంథాలయ చట్టమును రూపొందించుట కొరకు గాను ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయముల డ్రాఫ్టు బిల్లును తయారు చేయుటకు పూనుకొనిరి. ఇందు కొరకై వీరు 1—10—1957 సం॥నందు గ్రంథాలయముల అభివృద్ధిని తదితర విషయములకు సంబంధించిన గణాంక వివరములను సేకరించిరి. ఇంతేగాక 1—10—1957 నుండి 1—10—1960 వరకు అనగా వారు బాధ్యతలను స్వీకరించిన 3 సం॥ల తరువాత గ్రంథాలయముల అభివృద్ధి ఏ విధముగా నున్నదో పరిశీలించుట కొరకు ఆంధ్రప్రదేశ్ నందు జరిగిన గ్రంథాలయాభివృద్ధి కార్యక్రమ గణాంక వివరములను కూడ సమీకరించిరి.

## 1—10—1957 నుండి 1—10—1960 వరకు గ్రంథాలయాభివృద్ధికి సంబంధించిన గణాంక వివరములు:

### 1. లోకల్ లైబ్రరీ అథారిటీల యాజమాన్యము నందుండిన గ్రంథాలయముల సంఖ్య:

| గ్రంథాలయము | 1-10-1957 న గ్రంథాలయముల సంఖ్య | 1-10-1960 న గ్రంథాలయముల సంఖ్య. |
|---|---|---|
| **ఆంధ్ర ప్రాంతము.** | | |
| 1. జిల్లా కేంద్ర గ్రంథాలయములు | 11 | 11 |
| 2. శాఖా గ్రంథాలయములు | 120 | 182 |
| 3. పుస్తక పంపిణీ కేంద్రములు | 126 | 294 |
| 4. సహాయక గ్రంథాలయములు (గ్రాంట్లు పొందినవి) | 824 | 986 |
| 5. ప్రత్యేక బాలల గ్రంథాలయములు | | 11 |
| మొత్తము. | 1081 | 1484 |
| **తెలంగాణ ప్రాంతము.** | | |
| 1. జిల్లా కేంద్ర గ్రంథాలయములు | NIL | 10 |
| 2. శాఖా గ్రంథాలయములు | NIL | 27 |
| 3. పుస్తక పంపిణీ కేంద్రములు | NIL | 20 |
| 4. సహాయక గ్రంథాలయములు | 56 | 75 |
| మొత్తము. | 56 | 132 |

హైదరాబాదు పౌర గ్రంథాలయ చట్టము 1955 లో అమలులోనికి వచ్చినప్పటికిని జూలై 1957 న రాఘవరెడ్డిగారు పదవీ

బాధ్యతల చేపట్టిన వెంటనే ఈ చట్టమును తెలంగాణ ప్రాంతము నందు అమలుపరచుటకు పట్టుదల వహించిరి. అప్పటినుండి గ్రంథాలయ ముల యభివృద్ధి తెలంగాణ ప్రాంతమున కూడ చక్కగా జరిగినదని చెప్పవచ్చును.

## 2. లోకల్ లైబ్రరీ అథారిటీల యాజమాన్యము నందుండిన గ్రంథాలయములలోని పుస్తకముల సంఖ్య మొత్తము.

| ప్రాంతము | 1—10—1957 నాటికి | 1–10–1960 నాటికి |
|---|---|---|
| ఆంధ్ర | 8,65,000 | సుమారు 10,00,000 |
| తెలంగాణ | పౌర గ్రంథాలయాలు లేవు. | ,, 2,00,000 |

బాలలకును, వయోజనులకును, స్త్రీలకును, విద్యార్థులకును, పెద్దలకును తదితరులకును సంబంధించిన వివిధ నూతన పుస్తకములను అన్నివృత్తులకును సంబంధించిన పుస్తకములను కొనుగోలు చేసి లోకల్ లైబ్రరీ అథారిటీవారు జిల్లా కేంద్ర, శాఖా గ్రంథాలయ ములలో నుంచిరి.

3. 1957 సం॥ నాటికి ఆంధ్ర ప్రాంతమునందు పౌర గ్రంథా లయము లెక్కువగా లేకుండినవి. 1957 — 58 సం॥ ఆంధ్ర ప్రాంత మున లోకల్ లైబ్రరీ అథారిటీల ఆధీనములోని పౌర గ్రంథాలయ ములకు విచ్చేయు పాఠకుల సంఖ్య దినమునకు సరాసరి 12,792. ఈ సంఖ్య 1960 – 61 సం॥నకు 15,000కు పైగా పెరిగినది. 1957–58 సం॥ తెలంగాణ ప్రాంతమునందు లోకల్ లైబ్రరీ అథారిటీల యాజ మాన్యమున పౌర గ్రంథాలయములు లేవు. 1960 – 61 సం॥ తెలం గాణలోని లోకల్ లైబ్రరీ అథారిటీల ఆధీనము నందుండిన పౌర గ్రంథాలయముల కేతెంచుచుండిన పాఠకుల సంఖ్య దినమునకు సరాసరి 7,500 వరకుండినది.

1957 - 58 సం॥ ఆంధ్ర ప్రాంతమున లోకల్ లైబ్రరీ అథారిటీల అధీనములోని గ్రంథాలయాలలో ఒక నెలకు అరువివ్వబడిన పుస్తకముల సరాసరి సంఖ్య 31,850. ఈ సంఖ్య 1960 - 61 కి 44,400 కు పెరిగినది. తెలంగాణయందు 1960 - 61 సం॥ లోకల్ లైబ్రరీ అథారిటీల అధీనములోని గ్రంథాలయాలలో ఒక నెలలో అరువివ్వబడు చుండిన పుస్తకముల సరాసరి సంఖ్య 12000 వరకుండినది.

ఆంధ్రప్రదేశ్ నందు చక్కగా గ్రంథాలయ వ్యాప్తి జరిగినదని పేర్కొనుటకు ముఖ్యకారణము గ్రంథాలయములకు విచ్చేయు పాఠకుల సంఖ్యయొక్క క్రమాభివృద్ధి అని, చెప్పక తప్పదు. గ్రంథాలయముల యందలి పుస్తకముల సంఖ్యకూడ కాలక్రమమున పెరుగుతూ వచ్చినది. ఇది మున్ముందు దిన దినాభివృద్ధి చెందగలదనుటలో సందేహాము లేదు.

## 4. గ్రంథాలయములలో శిక్షణ పొందిన సిబ్బంది:

| వివరము | 1—10—1957 నాటికి ఆంధ్ర | 1—10—1957 నాటికి తెలంగాణ | 1 - 10 - 1960 నాటికి ఆంధ్ర | 1 - 10 - 1960 నాటికి తెలంగాణ |
|---|---|---|---|---|
| 1. డిప్లొమా పొందినవారు | 11 | NIL | 11 | 7 |
| 2. సర్టిఫికేటు పొందినవారు | 65 | NIL | 110 | 25 |

నవీన పద్ధతులలో గ్రంథాలయముల నిర్వహించవలెనన్న ప్రతి గ్రంథాలయము నందును శిక్షణ పొందిన గ్రంథపాలకు డుండడము అత్యవసరమని 1957 నుండి పలువురిని శిక్షణకు పంపడము జరిగినది.

## 5. గ్రంథాలయ సెస్సు వసూళ్ళు:

| ప్రాంతము | | 1957 – 58 | 1959 – 60 |
|---|---|---|---|
| 1. | ఆంధ్ర | రూ. 5,22,100 | రూ. 4,35,885 |
| 2. | తెలంగాణ | రూ. 10,515 | రూ. 34,185 |

ఈ గణాంకములనుబట్టి ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తరువాత సెస్సు వసూలు చాల వరకు మెరుగు పడినట్లు తెలియుచున్నది. 1955 లో హైదరాబాదు పౌర గ్రంథాలయ చట్టము అమలులోనికి వచ్చినప్పటికిని, రాఘవరెడ్డిగారు పదవీ బాధ్యతలను స్వీకరించిన తరువాత 1957 లో మొట్ట మొదటి సారిగా తెలంగాణ ప్రాంతమునకు గ్రంథాలయాభివృద్ధికొరకు వసూలయిన సెస్సునకు సమానమైన పైకమును ప్రభుత్వము మంజూరు చేసినది. లోకల్ లైబ్రరీ అథారిటీ వారు 1957 లో 3 లక్షలకు పైగా ప్రత్యేక గ్రాంటులను పొందినందు వలన శాఖా గ్రంథాలయములను, తదితర గ్రంథాలయములను స్థాపించుటకు వీలయినది.

## కర్ణాటక, మరత్వాడా ప్రాంతముల గ్రంథాలయాభి వృద్ధి కంటె తెలంగాణ ప్రాంతమునందలి గ్రంథాలయాల అభివృద్ధి పురోగమనము:

పాత పద్ధతులలో నిర్వహింపబడు చుండిన రాష్ట్ర కేంద్ర గ్రంథాలయము నందు ఆధునిక పద్ధతులను అవలంబించుటకును, క్రొత్తగా ప్రచురింపబడిన సాహిత్య అకాడమీ, తదితర ప్రామాణికమైనటువంటి పుస్తకములను గ్రంథాలయములందు ప్రవేశపెట్టుటయే గాక, సెస్సును సక్రమముగా వసూలు చేయుటకును తగు శ్రద్ధ తీసికొని, ఆధునిక పద్ధతులలో గ్రంథాలయములను నిర్వ

హించుట కొరకు గ్రంథాలయ శాస్త్రమునందు శిక్షణ పొందిన వారిని పుస్తక భాండాగారులుగా నియమించడము జరిగినది.

ఆంధ్రప్రదేశ్ అంతట గ్రంథాలయములందు ముఖ్యముగా తెలంగాణ యందలి వెనుక బడిన ప్రాంతమందలి గ్రంథాలయము లందు అన్ని హంగులతోను, నూతన పద్ధతులతోను ప్రశంసనీయ మైన నిర్వహణ జరిగినది.

తెలంగాణ ప్రాంతమున హైదరాబాదు పౌర గ్రంథాలయ చట్టము 1955 లో అమలు వచ్చిన నాటి నుండి గ్రంథాలయ ముల స్థాపనకు పూనుకొనడము జరిగి, 1960 నాటికి తెలంగాణయందు గ్రంథాలయములు త్వరిత గతిని అభివృద్ధి సాధించినవి.

1955 హైదరాబాదు పౌర గ్రంథాలయ చట్టము కర్నాటక, మరత్వాడ ప్రాంతములందు 1955 నుండి అమలులో నుండినప్పటికిని ఈ ప్రాంతములందు జిల్లా కేంద్ర శాఖా గ్రంథాలయముల స్థాపన తెలంగాణ ప్రాంతమునందు స్థాపించిన కొన్ని సంవత్సరముల తరువాత గాని జరుగలేదు.

దీనిని బట్టి తెలంగాణ ప్రాంతమునందు త్వరిత గతిని గ్రంథా లయ స్థాపనాభివృద్ధి జరుగుట కొనియాడదగిన విషయము. మర త్వాడ, కర్నాటక రాష్ట్రముల గ్రంథాలయ కార్యకర్తలు కూడ తెలంగాణ ప్రాంతము నందలి గ్రంథాలయాభివృద్ధిని గురించి మిగుల ప్రశంసించియున్నారు.

## ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయాభివృద్ధిపై ప్రశంస:

విద్యాశాఖవారు తగిన నిధులు కేటాయించక పోయినప్పటికిని ఉన్నంతలోనే ఆంధ్రప్రదేశ్ అంతట గ్రంథాలయ స్థాపనాభివృద్ధి చక్కగా జరిగి, యీ గ్రంథాలయములు నవీన పద్ధతులలో పాఠకు లకు ప్రయోజన కరముగా నిర్వహింపబడుచున్నందులకు దేశము నందలి పలువురు ప్రముఖులు ప్రశంసించారు.

పలు దేశములలో ఖ్యాతి వహించిన గ్రంథాలయ శాస్త్రవేత్త శ్రీ ఎస్. ఆర్. రంగనాథంగారు ఆంధ్రప్రదేశ్ నందు జరిగిన గ్రంథా లయాభివృద్ధిని గురించి వారి రచనలలో ఈ విధముగా కొనియాడి యున్నారు.

"When Andhra desa was formed it took the Madras Library Act with it. It has also worked it with Zeal".



# ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయాల బిల్లు - 1959

ఆసెంబ్లీలో చర్చలు :

ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తరువాత కొంత కాలమునకు శ్రీ డి. ఎస్. రెడ్డిగారు, శ్రీ ఎస్. రామ్‌లాల్‌గారు ఆంధ్రప్రదేశ్ నందలి గ్రంథాలయాల నిర్వహణ బాధ్యతలను రాఘవరెడ్డిగారి కప్పగించిరి, తర్వాత రాఘవరెడ్డిగారు ఆంధ్రప్రదేశ్ కంతటికి ఒకే పౌర గ్రంథాలయ చట్టము అమలునందుండ వలసిన ఆవశ్యకతను గుర్తించి రాష్ట్రమునందు గ్రంథాలయాల అభివృద్ధికి దోహదముగా నుండునట్లు ఒక డ్రాఫ్టు బిల్లును తయారుచేసిరి.

**నిపుణుల కమిటీచే డ్రాఫ్టు బిల్లు పరిశీలన :**

రాఘవరెడ్డిగారు రూపొందించిన డ్రాఫ్టు బిల్లు పరిశీలనకుగాను 1957 సం॥ జూన్ నెలలో ఒక నిపుణుల సంఘము నియమించబడినది. ఈ సంఘమునకు శ్రీ రాఘవరెడ్డిగారు కార్యదర్శిగాను, శ్రీధర్ వామన్ నాయక్, కోదాటి నారాయణరావు, పాతూరి నాగభూషణంగార్లు సభ్యులుగా ఉండిరి.

**ఆంధ్ర రాష్ట్ర గ్రంథాలయ కమిటీ, తెలంగాణ రాష్ట్రగ్రంథాలయ కౌన్సిల్‌లచే డ్రాఫ్టు బిల్లు పరిశీలన:**

ఈ నిపుణుల సంఘము పరిశీలించిన డ్రాఫ్టు బిల్లును చర్చించు నిమిత్తము ఆంధ్రరాష్ట్రగ్రంథాలయ కమిటీ సభ్యులను, తెలంగాణ రాష్ట్ర గ్రంథాలయ కౌన్సిల్ సభ్యులను 1957 సం॥ డిసెంబర్ మాసమున ఒక సమావేశమును ఏర్పాటుచేసి ఆహ్వానించిరి. ఈ సమావేశ

మున సభ్యులు పలువిధములయిన చర్చలుజరిపి డ్రాఫ్టు బిల్లును మెరుగు పరచుటకు కొన్ని సూచనలను చేసిరి. వారిసూచనలను దృష్టియం దుంచుకొని యీ డ్రాఫ్టు బిల్లును కొంత సవరించుట జరిగినది. ఈ విధముగా సవరణలతో కూడిన డ్రాఫ్టు బిల్లును ప్రభుత్వము నిశిత ముగా పరిశీలించిన యనంతరము ప్రజాభిప్రాయ నిమిత్తము ఆంధ్ర ప్రదేశ్ గెజట్‌నందు 1959 జూలై 25 న ప్రకటించడము జరిగినది.

## గ్రంథాలయాల బిల్లుపై విద్యాశాఖమంత్రి ప్రసంగము:

1959 డిసెంబర్, 10 వ తేదీన విద్యాశాఖామాత్యులు శాసన సభయందు ప్రవేశపెట్టుచూ ఆంధ్రప్రాంతమునందు మదరాసు పౌర గ్రంథాలయ చట్టము 1948, అమలునందున్నదనియు, తెలంగాణాప్రాంత మునందు హైదరాబాదు పౌరగ్రంథాలయ చట్టము 1955, అమలు నందున్నదనియు, అట్లుగాక ఆంధ్రప్రదేశ్ కంతటికిని ఒకే పౌరగ్రంథా లయచట్టము అమలునందుండుట ఎంతో సమంజసమనియు, తదావశ్యక తను పురస్కరించుకొనియే ఈ బిల్లు ప్రవేశపెట్టడమైనదనియు తెల్పిరి.

మదరాసు పౌరగ్రంథాలయ చట్టములోని కొన్ని ప్రధానాంశ ములను హైదరాబాదు పౌర గ్రంథాలయ చట్టములోని కొన్ని ప్రధా నాంశములను క్రోడీకరించి ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయాల డ్రాఫ్టు బిల్లు తయారు చేయుట జరిగినదనియు, ఆ బిల్లులోని సూచనలలో క్రింద కనపరచినవి ముఖ్యమైనవనియు విద్యాశాఖ మంత్రిగారు తెలియజేసిరి.

1. రాష్ట్ర గ్రంథాలయ కమిటీ నిర్మాణ విధానము చట్టము క్రింది నిబంధనలలో గాక చట్టమునందే సూచించడమైనది.

2. పరిస్థితుల పురస్కరించుకొని పౌర గ్రంథాలయములకు ప్రత్యేక డైరెక్టరు నియామకమునకు చట్టమునందవకాశము కల్పించ బడినది.

3. విధాన పరిషత్‌నకును, విధాన మండలికిని మఱియు హైదరాబాదు నగర కార్పొరేషన్‌కును యీ చట్టము నందు, రాష్ట్ర గ్రంథాలయకమిటి యందు తగు ప్రాతినిధ్యము కల్పించబడినది.

4. హైదరాబాదు చట్టమునందు హైదరాబాదు నగరమున కొక లోకల్ లైబ్రరీ అథారిటీ, సికిందరాబాదు నగరమున కొక లోకల్ లైబ్రరీ అథారిటీ వేరు వేరుగా యుండునట్లు సూచించబడినది. ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ బిల్లు నందట్లు గాక జంట నగరములకు ఒకే లోకల్ లైబ్రరీ అథారిటీ యుండునట్లు సూచించ బడినది.

5. ఆస్తిపన్ను, ఇంటిపన్నుపై రూపాయకు 4 పైసలు గ్రంథాలయ సెస్సు వసూలు చేయబడునట్లు బిల్లునందు సూచింపబడినది.

**శాసన సభలో గ్రంథాలయ బిల్లుపై సభ్యుల అభిప్రాయములు:**

ఈ బిల్లుపై జరిగిన చర్చలలో పలువురు సభ్యులు పాల్గొని తమ తమ అభిప్రాయములను వ్యక్తీకరించిరి.

విద్యాశాఖ డైరెక్టరు గారికి ఆ శాఖలోని బాధ్యతలే ఎక్కువగా నుండుట వలన పౌర గ్రంథాలయములకు ప్రత్యేక డైరెక్టరు నియామకము జరుగవలెననియు, జిల్లాలలో కూడ జిల్లా గ్రంథాలయముల నిర్వహణ బాధ్యతలను జిల్లా విద్యాశాఖాధికారులనుండి నూతనముగా నియమింపబడు గ్రంథాలయ కార్యదర్శులకు బదిలీ చేయవలెననియు, అంతేగాక గ్రంథాలయ సెస్సును చక్కగా వసూలు చేయకపోవడము వలన గ్రంథాలయోద్యోగులకు సక్రమముగా వేతనముల చెల్లించడం లేదనియు యిందులకు కూడ తగు చర్యల గైకొనవలెననియు కల్లూరు సుబ్బారావుగారు తెలియజేసిరి.

మన దేశములో జాతీయోద్యమ వ్యాప్తికి గ్రంథాలయోద్యమము చేయూత నిచ్చినదనియు, స్వాతంత్ర్యము రాక పూర్వము అప్పటి తెలంగాణ ప్రభుత్వము గ్రంథాలయముల స్థాపించుటకు అవకాశ మిచ్చెడిది కాదనియు అంతేగాక గ్రంథాలయ వ్యాప్తికి సభలు, సమావేశములు జరిగినచో నేరముగా పరిగణించెడి వారనియు బద్దం ఎల్లారెడ్డిగారు వివరించుచూ గ్రంథాలయములు లేనిచో విద్యావ్యాప్తి జరుగజాలదు, కనుక గ్రంథాలయముల అభివృద్ధికి యీ బిల్లును ఆమోదించుట ఎంతేని అవసరమని తెలియజేసిరి.

దృశ్య శ్రవణ విద్యాపరికరములను ప్రయోజన కరముగా గ్రంథాలయములయం దుపయోగించవలెనని డా॥ ఆర్. అచ్యుత రామయ్యగారు వక్కాణించిరి.

తెలంగాణ ప్రాంతములో శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారు, మాడపాటి హనుమంతరావుగారు, కొత్వాల్ వెంకట్రామరెడ్డిగారు, ఎం. నరసింగరావుగారు, కొండా వెంకటరంగారెడ్డిగారు, రావి నారాయణరెడ్డిగారు, డా॥ మర్రి చెన్నారెడ్డిగారు, తదితరులు, మహారాష్ట్రలో శ్రీధర్ వామన్నాయక్ గారు, కర్నాటకలో శ్రీరామాచారిగారు గ్రంథాలయముల అభివృద్ధికి కృషిసల్పిరని బసవ మానయ్యగారు తెల్పిరి. అంతేగాక గ్రంథాలయముల అభివృద్ధి బాధ్యతలను జిల్లా విద్యాశాఖాధికారుల కప్పజెప్పకూడదని వివరించిరి.

కొందరు సభ్యులు ఈ బిల్లు పరిశీలనకుగాను ఒక సెలెక్టు కమిటీని నియమించవలెనని సూచించగా మంత్రిగారు అవసరములేదని తెలియజేసిరి.

## గ్రంథాలయ బిల్లుపై మరికొందరి సభ్యుల సూచనలు:

మరుసటి రోజున అనగా 11—12—1959 న జరిగిన సమావేశమునందు శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యగారు రాష్ట్ర గ్రంథాలయ

కమిటీ సెక్రటరీగారయిన డిప్యూటీ డైరెక్టర్ గారికి విద్యాశాఖమంత్రి గారు సులభముగా అందుబాటులో నుండరని తెల్పినప్పుడు విద్యాశాఖమంత్రిగారు డిప్యూటీ డైరెక్టర్ గారే చాలవరకు, గ్రంథాలయ కార్యక్రమముల నిర్వహించుచున్నారనియు, వారి నిర్ణయములే చాల వరకు తుది నిర్ణయములనియు, డైరెక్టరు కొన్ని అంశములను మాత్రమే పరిశీలించుచుండుననియు తెలియజేసిరి. ఇదివరకు గ్రంథాలయములకు సంబంధించిన విషయములలో డిప్యూటీ డైరెక్టరుగారు కూడ తనతో చర్చలు జరిపెడివారని కూడ తెలియబరచిరి. విద్యాశాఖ డైరెక్టరుకు తన శాఖ బాధ్యతలే ఎక్కువగా నుండుట వలన గ్రంథాలయముల బాధ్యతను రాష్ట్ర కేంద్ర గ్రంథాలయ పుస్తక భాండాగారి కప్పగించినచో సమంజసముగా నుండునని వావిలాల గోపాలకృష్ణయ్యగారు తెలుపగా అందులకు గ్రంథాలయములు అభివృద్ధి చెందిన తరువాత ఆ విషయమును పరిశీలించవచ్చునని విద్యాశాఖమంత్రిగారు నుడివిరి.

జిల్లా విద్యాశాఖాధికారులకు గ్రంథాలయముల అభివృద్ధికి తగు చర్యలు గైకొనుటకు తగినంత కాలముండదని వావిలాల గోపాల కృష్ణయ్యగారు తెలుపగా, జిల్లా కేంద్ర గ్రంథాలయోద్యోగులను ప్రభుత్వోద్యోగులుగా పరిగణించవలెనని శ్రీ కల్లూరు సుబ్బారావు గారు సూచించిరి. విద్యాశాఖమంత్రిగారు అందుల కంగీకరించిరి.

ఇతర రాష్ట్రములలో గ్రంథాలయముల అభివృద్ధి తగినంతగా లేకపోయినప్పటికిని గ్రంథాలయాల ప్రచారము మాత్రము విస్తృతముగా జరుగుచున్నది కాని మన రాష్ట్రమునందు గ్రంథాలయముల అభివృద్ధి ఎక్కువైనప్పటికి తగినంత ప్రచారము జరుగుట లేదని శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యగారు వ్యక్తము చేసిరి. అంతేగాక సహాయక గ్రంథాలయములను రిజిష్టరు చేయు సుంకమును 50 రూ.ల నుండి 10 రూ.లకు తగ్గించవలసినదని సూచించగా ఆ సూచనను

పరిశీలించెదమని మంత్రిగారు తెల్పిరి. ఈ బిల్లుపై జరిగిన చర్చలలో శ్రీ ఎస్. వెంకయ్య, శ్రీ ఎం. నాగిరెడ్డి, శ్రీ మండెపూడి రాజేశ్వర రావు, శ్రీమతి వై. సీతాకుమారి, శ్రీ పి. రాజగోపాల్ నాయుడు మున్నగువారు కూడ పాల్గొనిరి.

## శాసన మండలిలో గ్రంథాలయ బిల్లుపై సభ్యుల అభిప్రాయములు :

శాసన సభామోదము పొందిన ఈ బిల్లును విద్యా శాఖా మాత్యులు 21—12—1959 న శాసన మండలియందు ప్రవేశ పెట్టుచూ, ఆంధ్ర ప్రాంతమునందు అమలు నందున్న 1948 మదరాసు రాష్ట్ర పౌర గ్రంథాలయ చట్టమునకు, తెలంగాణ ప్రాంతము నందమలులోనున్న 1955 హైదరాబాదు పౌర గ్రంథాలయ చట్టమునకు బదులుగా ఆంధ్రప్రదేశ్ కంతటికి ఒకే చట్టము నమలు నందుంచ వలసిన ఆవశ్యకత ఎంతేని కలదని గుర్తించి ఒక కమిటీని నియమించి పౌర గ్రంథాలయములకు సంబంధించిన డ్రాఫ్టు బిల్లును తయారుచేయ వలసినదిగా ఆదేశించడమైనదనియు ఈ కమిటీ సభ్యులు ఆంధ్ర రాష్ట్ర గ్రంథాలయ కమిటీ సభ్యుల మరియు తెలంగాణ గ్రంథాలయ కౌన్సిల్ సభ్యుల సూచనలను గైకొని డ్రాఫ్టు బిల్లును రూపొందించి రనియు వివరించిరి.

రాష్ట్ర గ్రంథాలయ కమిటీ నిర్మాణమును గురించియు, గ్రంథాలయములకు ప్రత్యేక డైరెక్టరు నియమించవలసిన ఆవశ్యకతను గురించియు, ప్రత్యేక డైరెక్టరుగారి కార్యాలయ స్థాపనను గురించియు, రాష్ట్ర గ్రంథాలయ కమిటీయందు శాసనసభ, మరియు శాసనమండలి సభ్యులకు కల్పించవలసిన ప్రాతినిధ్యమును గురించియు ఈ బిల్లునందు విశదముగా సూచించడమైనదని తెల్పిరి.

నిర్బంధ విద్యవలనను, వయోజనవిద్యా వ్యాప్తివలనను ప్రజలలో చదువుపై గల ఆసక్తి పెరిగినది. కాన గ్రంథాలయములందు ప్రజలకు ప్రయోజనకరమైన పుస్తకముల నుంచవలసిన ఆవశ్యకత ఎంతేని కలదనియు దాక్షిణాత్య భాషాపుస్తకసంస్థ ప్రచురించెడి పుస్తకములను గ్రంథాలయశాఖ డైరెక్టరు అనుమతి లేనిదే కొనుగోలు చేసికొనుట కవకాశము కల్పించవలెననియు పి. శ్రీరామమూర్తిగారు తెలియజేసిరి. గ్రంథాలయముల అభివృద్ధికి ప్రత్యేకడైరెక్టరు నియామకమునకు బదులుగా, గ్రంథాలయాల కార్పొరేషన్‌ను నిర్మించిన సబబుగా నుండగలదని శ్రీ కాళోజీ నారాయణరావుగారు వ్యక్తము చేసిరి.

గ్రంథాలయములకు ప్రత్యేకడైరెక్టరు నియామకము తప్పక జరుగవలెనని ప్రొఫెసర్ శ్రీ హరూన్‌ఖాన్ షెర్వానిగారు నొక్కి వక్కాణించిరి.

జిల్లా గ్రంథాలయములకు విద్యాశాఖాధికారికి బదులు పుస్తక భాండాగారులను సెక్రటరీలుగా నియమించుట ప్రయోజనకరమనియు సహాయక గ్రంథాలయములకు ఎక్కువగా గ్రాంట్లను మంజూరు చేయవలెననియు, గ్రంథాలయశాఖకు ఒక డైరెక్టరు, ఒక డిప్యూటి డైరెక్టరుండవలెననియు, డి. ఎస్. సుబ్రహ్మణ్యంగారు తెలిపిరి.

గ్రంథాలయములకు అశ్లీల సాహిత్య పుస్తకములను కొనకూడదనియు ప్రభుత్వప్రాంతీయ గ్రంథాలయములలో ప్రామాణిక గ్రంథములను ప్రవేశపెట్టవలెననియు డి. వి. సుబ్బాశాస్త్రిగారు తెలియజేసిరి. రాష్ట్ర కేంద్ర గ్రంథాలయము నుండి యితర గ్రంథాలయములకు కావలసిన పుస్తకములను పంపుచుండవలెననికూడ వీరు అభిప్రాయపడిరి.

పురాతన సహాయక గ్రంథాలయములకు తగు ప్రోత్సాహమును కల్గించవలెననియు, రచయితలకు కూడ తగు ప్రోత్సాహమును

కల్పించుచూ నవీన పంథాలో మార్గదర్శకమైన, ప్రయోజనకరమైనటువంటి, కాలానుగుణమైనటువంటి అభివృద్ధిదాయక రచనలను వెలువరింపజేసి, వాటిని ముద్రించి గ్రంథాలయములకు పంపిణీ చేయవలెననియు శ్రీ జి. బ్రహ్మయ్యగారు తెలియజేసిరి. గ్రామీణ ప్రాంతములందలి గ్రంథాలయములకు, పరిశ్రమలకు వ్యవసాయమునకు సంబంధించిన సాహిత్యమునే ఎక్కువ భాగము పంపవలెనని కూడ వీరు నుడివిరి. అంతేగాక ప్రతిగ్రామమునందు ఒక గ్రంథాలయమును స్థాపించవలెనని, సంచార గ్రంథాలయము ద్వారా గ్రంథాలయములకు రాలేని వారలకు మహిళలకు పుస్తకముల నందజేయవలెననికూడ తెలియజేసిరి.

పిల్లలకు ప్రయోజనకరమయిన సులభ గ్రాహ్యమగు పుస్తకములను వ్రాయించవలయునని అశ్లీల సాహిత్యము గ్రంథాలయములలో ఉండరాదని ముక్దుం మొహిద్దీన్‌గారు తెలియజేయగా పిల్లలకు ప్రయోజనకరమైన పుస్తకములను సరఫరా చేయుట, అశ్లీల సాహిత్యము గ్రంథాలయములందు లేకుండునట్లు చూచుట, మొదలగు సలహాలు సముచితములయినవని ఈ విధముగా జరుగునట్లు డైరెక్టరు, డిప్యూటీ డైరెక్టరు చూడగలరని మంత్రిగారు సమాధానమిచ్చిరి.

రాష్ట్ర గ్రంథాలయ కమిటీకి అసెంబ్లీ నుండి ఎనమండుగురిని, కౌన్సిల్ నుండి నల్గురిని ఎన్నుకొనుట కవకాశము కల్గించవలెననియు మఱియు ఉపాధ్యాయులకు రాష్ట్ర గ్రంథాలయ కమిటీయందు సభ్యులుగా నుండుటకు ఎక్కువ అవకాశముల కల్గించవలెననియు పి. రామమూర్తిగారు తెలియజేసిరి. గ్రంథాలయ సేవయందు ప్రసిద్ధిగాంచిన ప్రతిభావంతులను రాష్ట్ర గ్రంథాలయ కమిటీకి సభ్యులుగా సూచించుటకు ప్రభుత్వమున కధికార ముండవలెనని మంత్రిగారు వ్యక్తము చేసిరి.

గ్రంథాలయములకు కావలసిన పుస్తకముల నిర్ణయించుటకు ఒక ప్రత్యేక కమిటీని నియామకము చేయుట ప్రయోజనకరమని అంతే గాక ఈ కమిటీయందు తక్కువ మంది సభ్యులుండుట వలన ప్రతిభా వంతముగా పుస్తకముల నిర్ణయము జరుగుటకు వీలగునని జి. బాపయ్యగారు తెలిపిరి.

ఈ విధముగా శాసన మండలియందు చర్చలు జరిగిన అనంతరము మంత్రిగారు ప్రవేశపెట్టిన సవరణల నామోదించడం జరిగినది.

## ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ చట్టము: 1960— 1—4—60 నుండి అమలు:

ఈ విధముగా శాసనసభ, శాసనమండలియందు ఆమోద ముద్రల పొందినటువంటి యీ చట్టమును 18—2—1960 న గవర్నరుగారు ఆమోదించిరి. గవర్నరుగారి ఆమోదముద్ర పొందినటువంటి చట్టము 25—2—1960 న ఇంగ్లీషు నందును, 1—9—1960 న తెలుగు నందును గెజెట్ నందు ప్రకటించడమైనది. యీ చట్టము 1—4—1960 నుండి రాష్ట్రములో అమలు లోనికి వచ్చినది. యీ చట్టమును అమలులోనికి తెచ్చుటకు శాసన సభ్యులైన శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యగారు, శ్రీ కల్లూరు సుబ్బారావుగారు మున్నగు వారు గట్టి కృషి సల్పిరి.

## ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ చట్టము — విశిష్టత :

మదరాసు, హైదరాబాదు పౌర గ్రంథాలయ చట్టముల యందలి లోపముల తొలగించి ప్రయోజన కరముగా రూపొందింపబడినటువంటి ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ చట్టము మెరుగైనదని భావించక తప్పదు. యీ చట్టము విద్యాశాఖయందు అంతర్భాగముగా నుండిన గ్రంథాలయ శాఖను వేరుచేసి ప్రత్యేక శాఖగా

రూపొందించినది. యీ విధముగా పౌర గ్రంథాలయ శాఖను ప్రత్యేక శాఖగా పరిగణించడము మన దేశమునందు మొట్టమొదటిసారిగా మన రాష్ట్రమునందే జరిగినది. జిల్లా గ్రంథాలయముల నిర్వహణ బాధ్యతాధికారములను జిల్లా విద్యాశాఖాధికారుల నుండి లోకల్ లైబ్రరీ అథారిటీ కార్యదర్శులయిన గ్రంథపాలకులకు బదిలీ జేయడము జరిగినది. యీ విధముగా మన దేశమునందు జిల్లా గ్రంథాలయముల నిర్వహణ బాధ్యతలను లోకల్ లైబ్రరీ అథారిటీ కార్యదర్శులయిన జిల్లా కేంద్ర పుస్తక భాండాగారుల కప్పగించడము కూడ దేశములో మన రాష్ట్రమునందే ప్రప్రథమముగా జరిగినది. ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ చట్టము ననుసరించి జిల్లా గ్రంథాలయ నిర్వాహణ బాధ్యతల స్వీకరించి నటువంటి లోకల్ లైబ్రరీ అథారిటీ కార్యదర్శులయిన పుస్తక భాండాగారులలో మిగుల ఉత్సాహము పెంపొందుటయేగాక వీరు గ్రంథాలయములందు నవీన పద్ధతుల ప్రవేశ పెట్టుటకు తగిన శ్రద్ధను గైకొని వర్గీకరణ, సూచీకరణను, పుస్తక సూచీలను యితర సాంకేతికాంశముల నిర్వహణకు కృషి చేసిరి.

మదరాసు పౌరగ్రంథాలయ చట్టమునందు సూచించబడని గ్రంథాలయముల అరువు విధానము వర్గీకరణ – సూచీకరణ, గ్రంథాలయముల మధ్య నెలకొన వలసిన సహకారము తదితర ప్రయోజనకర పద్ధతులు ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ చట్టమునందు సూచించ బడినవి.

మదరాసు పౌర గ్రంథాలయ చట్టము ప్రకారము లోకల్ లైబ్రరీ అథారిటీలచే ప్రారంభింపబడిన గ్రంథాలయములు మాత్రము పౌర గ్రంథాలయములుగా పరిగణింపబడును. సహాయక గ్రంథాలయములు పౌరగ్రంథాలయముల క్రిందికి చేరవు. అంతేగాక ఈ చట్టము

ప్రకారము సహాయక గ్రంథాలయములకు ప్రభుత్వము మాత్రమే ఆర్థిక సహాయమును కల్పించును. లోకల్ లైబ్రరీ అథారిటీలు ఏ మాత్రము ఈ సహాయక గ్రంథాలయాలకు సహాయ సహకారముల నందించవు. ఆంధ్రప్రదేశ్ పౌరగ్రంథాలయ చట్టమునందు సహాయక, పురపాలక, పంచాయతీ గ్రంథాలయములు కూడ పౌరగ్రంథాలయములుగా పేర్కొనబడుటయే గాక, ఈ గ్రంథాలయములకు కావలసిన గ్రాంట్లను మంజూరుచేయు అవకాశము ప్రభుత్వమునకేగాక లోకల్ లైబ్రరీ అథారిటీలకు కూడ కల్పించబడినది. ఈ పద్ధతి గ్రంథాలయముల అభివృద్ధికి అనుకూలమైనది.

ఆధునిక పద్ధతులను గ్రంథాలయములందు ప్రవేశపెట్టి, తద్వారా శాస్త్రీయమైన గ్రంథాలయ సేవ నందించుటకు సూచనల గల్గినటువంటి యీ ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ చట్టము, మదరాసు, హైదరాబాదు రాష్ట్ర పౌరగ్రంథాలయ చట్టములకన్న మిగుల ప్రయోజనకరమయినదని పలువురు గ్రంథాలయ నిపుణులును, మేధావులును అనేక విధముల కొనియాడిరి.

## గ్రంథాలయ చట్టముపై ప్రముఖ గ్రంథాలయ శాస్త్రవేత్త శ్రీ ఎఫ్. ఎమ్. గార్డనర్ అభిప్రాయము:

యునెస్కో ప్రవీణుడు ప్రముఖ గ్రంథాలయ శాస్త్రజ్ఞుడు అయినటువంటి శ్రీ ఫ్రాంక్ ఎమ్. గార్డనర్ గారు అనేక దేశములలో పలు గ్రంథాలయముల సందర్శించి గ్రంథాలయముల నిర్మాణ నిర్వహణాది విషయములకు సంబంధించి పలుసూచనలను, సలహాల నిచ్చుటయేగాక పలురాష్ట్రముల పౌర గ్రంథాలయ చట్టములను పరిశీలించి ఆ చట్టముల సవరణల కమూల్యమైన సూచనల నిచ్చినటువంటి ఈ మేధావంతుడు ఆంధ్రప్రదేశ్ పౌరగ్రంథాలయ చట్టమును గురించి తన రచనలలో,

"Generally the Act is a great Improvement on the Madras Act, and corrects many of its defects"
అని శ్లాఘించిరి.

ఈ విధముగా మదరాసు, హైదరాబాదు పౌరగ్రంథాలయ చట్టములలోని లోపములను తొలగించి ఆంధ్రప్రదేశ్ పౌరగ్రంథాలయ డ్రాఫ్టు బిల్లును చాలవరకు రూపొందించి, ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ చట్టము మిన్నయని కొనియాడబడుటకు రాఘవరెడ్డిగారు చేసిన కృషి ఎంతో ప్రశంసనీయమైనది.

ఆంధ్రప్రదేశ్ తొలి ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డిగారు, ఆంధ్రరాష్ట్రము - హైదరాబాదు రాష్ట్రములలో వేరువేరుగా నుండిన వివిధశాఖలకు సంబంధించిన చట్టములను విలీనము చేస్తూ సమగ్రంగా క్రొత్తచట్టములను రూపొందించుటకు తీవ్రకృషి చేసిరి. గ్రంథాలయ చట్టములను కూడ విలీనముచేసి సమగ్రగ్రంథాలయ చట్టమును రూపొందించుటకు నీలం సంజీవరెడ్డిగారు ప్రప్రథమముగా సూచన లిచ్చి ప్రోత్సహించిరి. విశేష కార్యకలాపములలో నిమగ్ను లగుటవలన వ్యవధి లేకపోయినను, విద్యారంగమన్నను, గ్రంథాల యోద్యమన్నను మిగుల ఆసక్తి చూపుతూ వానిని విస్తృతపరచుటలో మనరాష్ట్రపతి సంజీవరెడ్డిగారు ముఖ్యమంత్రిగా చేసిన కృషి చిరస్మరణీయము.



# ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ చట్టము - 1960

# రాష్ట్ర గ్రంథాలయ కమిటీ నిర్మాణము:

## సమావేశములు — ప్రధాన సూచనలు:

ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ చట్టమును అమలు పరచు బాధ్యతలను స్వీకరించినటువంటి శ్రీ రాఘవరెడ్డిగారు ఈ చట్టమును చక్కగా అమలు పరచుటకు బహువిధముల కృషి చేసిరి. మన దేశమునకు చెందినవారేగాక విదేశీ గ్రంథాలయ శాస్త్రవేత్తలును, యునెస్కో ప్రవీణులును, మేధావులును పౌర గ్రంథాలయ చట్టమును రాష్ట్రమున అమలు పరచుటయందు తగిన నేర్పును ప్రదర్శించిన శ్రీ రాఘవరెడ్డిగారిని పలువిధముల కొనియాడియున్నారు.

గ్రంథాలయ చట్టము అమలు పరచబడిన విధానముపై ఎఫ్. ఎం. గార్డనర్ ప్రశంస:- ప్రపంచములోని పెక్కు దేశములలో పౌర గ్రంథాలయ చట్టములు అమలు పరచబడిన విధానములను తులనాత్మకముగా పరిశీలన జరిపినటువంటియు, ప్రపంచమునందుగల గ్రంథాలయ శాస్త్రవేత్తలలో ప్రముఖులును అయిన ఎఫ్. ఎం. గార్డనర్ గారు ఆంధ్రప్రదేశ్ నందు పౌర గ్రంథాలయ చట్టము అమలు పరచబడిన విధానమును పరిశీలించి,

"The Act has been rapidly Implemented"

అని తన రచనలలో పేర్కొని యున్నారు. ఈ విధముగా మన రాష్ట్రమునందు పౌర గ్రంథాలయ చట్టము అమలు పరచబడిన విధానము ప్రపంచ గ్రంథాలయ నిపుణులలో ఉన్నతులగు ఎఫ్. ఎం. గార్డ

నర్ గారి ప్రశంసల నందుకొనుట శ్రీ రాఘవరెడ్డి గారికే గాక రాష్ట్రమునకే గర్వ కారణము.

ఈ చట్టమును అమలు పరచుటలో శ్రీ రాఘవరెడ్డి గారికి విద్యాశాఖ డైరెక్టరులు డా॥ ఎస్. రామ్‌లాల్ మఱియు శ్రీ వి. సి. వామనరావు యొక్క ప్రోత్సాహము కూడ లభించినది. ప్రభుత్వ కార్యదర్శులయినటువంటి శ్రీ జె. పి. ఎల్. గ్విన్, శ్రీ ఎన్. రమేశన్, శ్రీ ఎస్. ఆర్. రామమూర్తి, శ్రీ ఎం. ఏ. అబ్బాసి తదితరుల ప్రోత్సాహము కూడ యీ చట్టమును అమలు పరచుటలో అమితముగా తోడ్పడినది.

## రాష్ట్ర గ్రంథాలయ కమిటీ నిర్మాణము:

మదరాసు పౌర గ్రంథాలయ చట్టమునందు రాష్ట్ర గ్రంథాలయ కమిటీయందు సభ్యు లెందరుండవలెను, సభ్యులుగా ఎన్నుకొనబడు వారు ఎటువంటి అర్హతల కల్గియుండవలెను అను మున్నగు అంశములు సూచించబడలేదు. ఈ చట్టము క్రింద రూపొందించబడిన నిబంధనలయందు మాత్రము యీ విషయ ప్రస్తావన కలదు. ఈ విధమయిన ప్రధానాంశములను ప్రత్యక్షముగా చట్టమునందు తెలుపక చట్టము క్రింద రూపొందించబడిన నిబంధనలయందు సూచించుట సమంజసము కాదు. ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ చట్టము 1960 నందు రాష్ట్ర గ్రంథాలయ కమిటీ సభ్యుల సంఖ్య, సభ్యుల అర్హతలు మున్నగు విషయములు స్థూలముగా పేర్కొనబడినది.

ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ చట్టము 1960 ప్రకారము రాష్ట్ర విద్యాశాఖ మంత్రి రాష్ట్ర గ్రంథాలయ కమిటీ అధ్యక్షులు. పౌర గ్రంథాలయ శాఖ డిప్యూటీ డైరెక్టరుగాను, డైరెక్టరుగాను నున్నటువంటి శ్రీ రాఘవరెడ్డిగారు యీ కమిటీకి కార్యదర్శి.

విధాన మండలి సభ్యులు తమలో నల్గురిని, విధాన పరిషత్ సభ్యులు తమలో ఇరువురిని ఈ కమిటీ సభ్యులుగా ఎన్నుకొనవలెను.

ఆంధ్ర గ్రంథాలయ సంఘమునకు కూడ ఈ చట్టమునందు తగు ప్రాముఖ్యత కల్పించబడినది.

రాష్ట్ర గ్రంథాలయ సంఘ సభ్యులు తమలో మువ్వురిని రాష్ట్ర గ్రంథాలయ కమిటీకి సభ్యులుగా ప్రతిపాదించవలెను.

రాష్ట్రములోని మూడు విశ్వవిద్యాలయముల సిండికేట్ సభ్యులు తమలో నొక్కొక్కరిని రాష్ట్ర గ్రంథాలయ కమిటీకి సభ్యులుగా సూచించవలెను.

రాష్ట్రమునందు ప్రస్తుత మున్నటువంటి యితర విశ్వవిద్యాలయముల సిండికేట్ సభ్యులలో గూడ కొందరిని ఈ కమిటీ యందు సభ్యులుగా చేర్చుకొనవలెనని కొంతమంది గ్రంథాలయ కార్యకర్తల అభిప్రాయము.

1955 హైదరాబాదు పౌర గ్రంథాలయ చట్టము ప్రకారము, హైదరాబాదు నగర లోకల్ లైబ్రరీ అథారిటీ నుండి ఒకరిని, సికిందరాబాదు నగర లోకల్ లైబ్రరీ అథారిటీ నుండి ఒకరిని, ప్రతి జిల్లా లోకల్ లైబ్రరీ అథారిటీ నుండి ఒక్కొక్కరిని కమిటీ సభ్యులుగా ఆయా లోకల్ లైబ్రరీ అథారిటీలు ఎన్నుకొనవలెను.

ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ చట్టము 1960 ప్రకారము, హైదరాబాదు, సికిందరాబాదు జంటనగరముల లోకల్ లైబ్రరీ అథారిటీ నుండి ఒకరిని, రాష్ట్రమునందలి ప్రతి విశ్వవిద్యాలయ పరిధిలోని లోకల్ లైబ్రరీ అథారిటీ సభ్యుల నుండి ఇరువురిని అనగా మొత్తము ఆరుగురిని ప్రభుత్వము రాష్ట్ర గ్రంథాలయ కమిటీకి సభ్యులుగా ఎన్నుకొనవలెను.

మదరాసు రాష్ట్ర పౌర గ్రంథాలయ చట్టము ప్రకారము, రాష్ట్ర కేంద్ర గ్రంథాలయ పుస్తక భాండాగారి రాష్ట్ర గ్రంథాలయ కమిటీయందు సభ్యుడు కాదు. కాని ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ చట్టము ప్రకారము రాష్ట్ర కేంద్ర గ్రంథాలయ పుస్తక భాండాగారి ఈ కమిటీ సభ్యుడు. ఇది హర్షించదగిన విషయము.

పైన పేర్కొనబడిన వారేగాక స్థానిక సంస్థల పాలనామంత్రి, విద్యాశాఖ కార్యదర్శి, ఇన్స్పెక్టర్ జనరల్ ఆఫ్ లోకల్ అడ్మినిస్ట్రేషన్‌లు కూడ ఈ కమిటీయందు సభ్యులుగా నుందురు. వీరినేగాక రాష్ట్ర గ్రంథాలయ కమిటీ సమావేశమై మరి నల్గురిని కమిటీ సభ్యులుగా చేర్చుకొనవచ్చును.

ఈ కమిటీ యందు గ్రంథాలయ నిపుణులలో నిరువురిని, రాష్ట్రములోని జిల్లా కేంద్ర గ్రంథాలయ పుస్తక భాండాగారులలో ఇరువురిని మఱియు విద్యాశాఖ డైరెక్టరు గారిని సభ్యులుగా సూచించిన ప్రయోజనకరముగా నుండునని శ్రీ రాఘవరెడ్డిగారి అభిప్రాయము. ఆ నాటి అధికారులు ఈ సూచనల అమలు పరచవలసిన ఆవశ్యకతను కొంత కాలమైన తరువాత పరిశీలించవచ్చునని అభిప్రాయపడిరి.

ఈ విధముగా నిర్మాణము జరిగిన రాష్ట్ర కేంద్రగ్రంథాలయ కమిటీ కాలపరిమితి మూడు సం॥లు మాత్రమే. ఈ కమిటీ గైకొను గ్రంథాలయాభివృద్ధికర తీర్మానములను ప్రభుత్వము ఆమోదించవచ్చును లేదా తిరస్కరించవచ్చును. సాధారణముగా ఈ కమిటీ గైకొను తీర్మానములలో చాలమేరకు ప్రభుత్వ మామోదించుచూ వచ్చినది.

## కమిటీ సమావేశములు - ముఖ్య సూచనలు :

ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ చట్టము ననుసరించి రాష్ట్ర గ్రంథాలయ కమిటీని 31—5—1963 న ప్రభుత్వము ఏర్పాటు

చేసినది. ఈ విధముగా రాష్ట్రమునందు ఏర్పాటు చేయబడిన రాష్ట్ర గ్రంథాలయ కమిటీయొక్క ప్రప్రథమ సమావేశము 19-7-1963 న జరిగినది. ఈ సమావేశమునకు హాజరయిన కమిటీ సభ్యులెల్లరు రాష్ట్రమునందు గ్రంథాలయముల అభివృద్ధికి ప్రయోజనకరమయిన సూచనల నొసగిరి. ఉస్మానియా విశ్వవిద్యాలయమునకు చెందిన శ్రీరామరాజుగారు, లిఖిత ప్రతుల గ్రంథాలయమును స్థాపించవలెననియు, పుస్తకముల రిజిస్ట్రారు బాధ్యతలను పౌర గ్రంథాలయశాఖ డైరెక్టరు నిర్వహించవలెననియు కమిటీ సమావేశమున నొక్కి-వక్కాణించిరి.

ఈ కమిటీయొక్క రెండవ సమావేశము 28—2—1964 న జరిగినది. ఈ సమావేశమునందు కూడ గ్రంథాలయముల అభివృద్ధికి కమిటీ సభ్యులు పలు సలహాల నొసగిరి. గ్రంథాలయ సెస్సు వసూలు నందు తగుశ్రద్ధను గైకొనవలెననియు, ప్రభుత్వము కూడ గ్రంథాలయముల అభివృద్ధికి గ్రాంట్లను విరివిగా మంజూరు చేయవలెననియు పలువురు సూచించిరి.

18—12—1964 న రాష్ట్ర గ్రంథాలయ కమిటీ యొక్క మూడవ సమావేశము జరిగినది. లోకల్ లైబ్రరీ అథారిటీల అధ్యక్షులకు గౌరవవేతనముల మంజూరు చేయవలెననియు, విశాఖపట్టణము, వరంగల్లు, కర్నూలు మున్నగు పట్టణములందు ప్రత్యేక లోకల్ లైబ్రరీ అథారిటీల నేర్పాటుచేయవలెననియు, వయోజన విద్యాశాఖ మఱియు పౌర గ్రంథాలయశాఖ ఒకే డైరెక్టరు ఆధీనము నందుండవలెననియు యింకను కొన్ని యితర సూచనలను యీ సమావేశమునందు సభ్యులు సూచించిరి. ఈ రాష్ట్రగ్రంథాలయ కమిటీ తదుపరి సమావేశము 29—12—1965 న జరిగినది. ఈ సమావేశమునందు ప్రధానముగా జిల్లా లోకల్ లైబ్రరీ అథారిటీ నిధుల నుండి పాఠశాలల గ్రంథాలయములకు గ్రాంట్లను మంజూరుచేయవలె

ననియు, లోకల్ లైబ్రరీ అథారిటీ చైర్మెన్‌ల, సభ్యుల ఎన్నికలను సులభతరము గావించవలెననియు పలువురు సూచించిరి. ఇంకను గ్రంథాలయాల అభివృద్ధికిని, తదితర అంశములకును సంబంధించి కూడ పలువురు సభ్యులు సూచనల నొసగిరి.

1965 సం॥ తరువాత కూడ యీ కమిటీ పలు సమావేశముల నిర్వహించినది. ఈ సమావేశములలో పలువురు సభ్యులు సముచిత సూచనల నొసగుచుండిరి. వాటిలో యీ క్రింది వానిని ప్రధానముగా పేర్కొన వచ్చును. కర్నూలు లోకల్ లైబ్రరీ అథారిటీ చైర్మెన్ గారైన శ్రీ బి. సుబ్బారెడ్డిగారు భూమిశిస్తుపై గూడ గ్రంథాలయ సెస్సును వసూలు చేయవలెనని సూచించిరి. 'గ్రాంట్ యిన్ ఎయిడ్ కోడ్'ను త్వరగా ప్రచురించవలెనని శ్రీ పాతూరి నాగభూషణంగారు నొక్కి చెప్పిరి. ఆంధ్ర విశ్వవిద్యాలయమునకు చెందిన శ్రీ రామకృష్ణ రావుగారు గ్రంథాలయశాస్త్ర శిక్షణ నిర్వహణ విధానములను గురించి వక్కాణించుటయే గాక, పౌర గ్రంథాలయశాఖ కార్యాలయమునందు గ్రంథాలయాల గురించి పరిశోధన సల్పువారి కొక ప్రత్యేక విభాగము నేర్పాటు చేయవలెనని సూచించిరి. లోకల్ లైబ్రరీ అథారిటీల యాజమాన్యములోని గ్రంథాలయోద్యోగుల హోదాలను పెంచవలెననియు, లోకల్ లైబ్రరీ అథారిటీలు గ్రంథాలయ భవన నిర్మాణముల నిమిత్తము, ప్రభుత్వ భవననిర్మాణశాఖ వారికి చెల్లించు సెంటేజ్ సుంకమును రద్దుచేయవలెననియు, ప్రభుత్వము గ్రంథాలయాల అభివృద్ధికి తగు గ్రాంట్లను మంజూరు చేయవలెననియు పలువురు సభ్యులు కమిటీ సమావేశాలలో సూచించిరి. ఈ విధముగా గ్రంథాలయాభివృద్ధి, తదితర కార్యక్రమములను గురించి సూచించునటువంటి ఈ రాష్ట్ర గ్రంథాలయ కమిటీ కేవలమొక సలహాల నొసగు కమిటీ మాత్రమే అయినప్పటికిని ప్రభుత్వము చాలవరకు యీ కమిటీ సూచనలనామోదించుచుండినది.

ఈ రాష్ట్ర గ్రంథాలయ కమిటీ కార్యదర్శియైన రాఘవరెడ్డి గారికి, కమిటీ సభ్యులకు చాలవరకు సఖ్యము ఉండినది. సభ్యులు సూచించెడు సూచనల నమలు పరచుట కూడ రాఘవరెడ్డిగారు చాలవరకు కృషిచేయుచుండిరి.

## పౌర గ్రంథాలయశాఖకు ప్రత్యేక డైరెక్టరు:

1960 పౌర గ్రంథాలయ చట్టము ప్రకారము పౌర గ్రంథాలయ విభాగమును విద్యాశాఖనుండి వేరుచేసి, ప్రత్యేకశాఖగా గుర్తించుట జరిగినది. తరువాత ఈ చట్టమునకు కొన్ని సవరణలు చేయుట జరిగినది. ఈ సవరణల ప్రకారము పౌర గ్రంథాలయ శాఖకు ప్రత్యేక డైరెక్టరు నియామకము జరుగవలెను. అనగా సవరణలతో కూడిన పౌర గ్రంథాలయ చట్టము ప్రకారము ప్రత్యేక డైరెక్టరులను ప్రభుత్వము తప్పక నియమించవలెను.

## గ్రంథాలయశాఖ డైరెక్టరు విధులు :

రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమును, రాష్ట్రములోని యితర పౌర గ్రంథాలయాల నిర్వహణ విధానములను పరిశీలించి వాటి అభివృద్ధికి తగు సూచనలిచ్చుట; జిల్లా గ్రంథాలయ సంస్థలకు సందర్భానుసరముల ననుసరించి, వాటి పరిపాలనా విధానములకు సంబంధించిన సూచనల నిచ్చుట; సహాయక గ్రంథాలయముల అభివృద్ధికి తగు గ్రాంట్లనుమంజూరు చేయుట; గ్రంథసూచీలను తయారుచేసి వాటిని ప్రచురించుట; గ్రంథాలయములందు వర్గీకరణ – సూచీకరణ సక్రమముగా జరుగుచున్నదా, గ్రంథాలయములు ఆధునిక పద్ధతుల నవలంబించుచున్నవా యన్న అంశములను పరిశీలించి అందులకు సంబంధించిన సలహాల నొసగుట; ఎటువంటి పుస్తకములను గ్రంథాలయములు ఎన్నిక చేయవలెనన్న విషయములను గురించి, గ్రంథాలయముల

మధ్య అరువు విధానములను గురించి తగు సలహాల నిచ్చుట; రాష్ట్రములోని గ్రంథాలయముల జాబితాను మఱియు పౌర గ్రంథాలయాలలో పనిచేయు పుస్తక భాండాగారుల జాబితాను రూపొందించుట; రాష్ట్రమునందలి పౌర గ్రంథాలయాలలోను, జిల్లా గ్రంథాలయ సంస్థల కార్యాలయముల యందును అవసరమైన ఉద్యోగావకాశములను కల్పించుట; పౌర గ్రంథాలయముల అభివృద్ధిని గురించి ప్రతి ఏటా ఒక నివేదికను రూపొందించి ప్రభుత్వమునకు పంపుట, మున్నగునవి పౌర గ్రంథాలయశాఖ డైరెక్టరు యొక్క ప్రధాన విధులు.

కేంద్ర ప్రభుత్వ నియుక్త సలహా సంఘు నివేదికయందు కూడ ఈ విధులలో చాలవరకు గలవు. ఈ నివేదికయందు పేర్కొనబడని కొన్ని విధులుకూడ ఈ చట్టమునందు సూచింపబడినవి.



# పౌర గ్రంథాలయ శాఖకు ప్రత్యేక డైరెక్టరు నియామకములో జాప్యము:

భారత దేశమునందు ప్రప్రథమముగా పౌర గ్రంథాలయ చట్టము అవిభక్త మదరాసు రాష్ట్రమునందు అమలులోనికి వచ్చినది. ఈ విషయమును గర్వకారణంగా భావించి దేశమునందలి పలువురు గ్రంథాలయాభిమానులు, గ్రంథాలయ శాస్త్రవేత్తలు మిగుల ప్రశంసించినారు. కాని గ్రంథాలయ శాఖకు ప్రత్యేక డైరెక్టరును నియమించవలెనన్న సూచన మదరాసు పౌర గ్రంథాలయ చట్టమునందు లేకపోవడము లోటుగా భావించి దేశము నందలి పలువురు గ్రంథాలయ శాస్త్రవేత్తలు సంతృప్తి చెందలేకపోయిరి. ఆంధ్ర గ్రంథాలయ సంఘమువారు, మదరాసు రాష్ట్ర గ్రంథాలయ సంఘమువారు, పలువురు గ్రంథాలయ కార్యకర్తలు యీ విధమైన సూచన చట్టమునందు లేనందుకు విచారము వ్యక్తపరిచిరి.

## మదరాసు పౌర గ్రంథాలయ చట్టము మేరకు విద్యాశాఖ డైరెక్టరే గ్రంథాలయశాఖ డైరెక్టరు:

విద్యాశాఖ డైరెక్టరు గారైన డి. ఎస్, రెడ్డిగారు లైబ్రేరియాకు యునెస్కో తరపున వెళ్ళినందున ఎస్. గోవిందరాజులు గారు విద్యాశాఖ డైరెక్టరుగా నియమింపబడిరి. చట్టప్రకారము వీరే గ్రంథాలయశాఖ డైరెక్టరు పదవీ బాధ్యతలను కూడ కల్గియుండిరి. వీరు అక్టోబరు 1953 సం॥ వరకు గ్రంథాలయశాఖ డైరెక్టరుగా కొనసాగిరి.

## గ్రంథాలయశాఖ ప్రత్యేకాధికారిగా ఆర్. జనార్దనం నాయుడిగారి నియామకము:

మదరాసు పౌర గ్రంథాలయ చట్టము అమలుపరచు నిమిత్తము పౌర గ్రంథాలయాల డైరెక్టరుకు సహాయముగా నుండుటకు కన్నెమారా ప్రభుత్వ గ్రంథాలయాధికారియైన జనార్దనం నాయుడు గారిని ప్రత్యేకాధికారిగా ప్రభుత్వము నియమించినది. వీరు కొంత కాలము మాత్రమే ప్రత్యేకాధికారిగా నుండినప్పటికిని గ్రంథాలయ శాస్త్ర నిపుణులగుటచే, జిల్లాల యందు లోకల్ లైబ్రరీ అథారిటీల ఏర్పాటు గురించి, సెస్సు వసూలునందు తీసికొనవలసిన చర్యలను గురించి విద్యాశాఖాధికారులకు, గ్రంథాలయ కార్యకర్తలకు, ఇతర అధికారులకు తగిన సలహాల నొసంగిరి. వీరి పదవీకాలానంతరము కొంత కాలమువరకు గ్రంథాలయ శాస్త్రమునందు డిప్లొమాను కాని డిగ్రీనికాని పొందని విద్యాశాఖకు చెందిన అధికారులనే ప్రభుత్వము గ్రంథాలయాల ప్రత్యేకాధికారిగా నియమించినది.

## సాంకేతికశాఖ (గ్రంథాలయాలు, వయోజన విద్య మున్నగునవి) ప్రత్యేకాధికారిగా రాఘవరెడ్డి నియామకము:

1953 వ సంవత్సరమున ఆంధ్ర రాష్ట్రావతరణానంతరము గ్రంథాలయ శాస్త్రవేత్తలైన రాఘవరెడ్డిగారిని సాంఘిక విద్య (గ్రంథాలయాలు, వయోజన విద్య, దృశ్య, శ్రవణ విద్య) కు ప్రత్యేకాధికారిగా ప్రభుత్వము నియమించినది. వీరు స్వదేశమునందలి పాఠశాలల గ్రామీణ గ్రంథాలయ నిర్వహణాద్యంశములలోను, ఇంగ్లాండు నందలి పౌర గ్రంథాలయ నిర్వహణాద్యంశములలోను విశేషానుభవము కలిగినవారు. గ్రంథాలయ శాస్త్రమునందు మదరాసు విశ్వవిద్యాలయములో శిక్షణ పొందినవారు.

## హైదరాబాదు గ్రంథాలయ చట్టము మేరకు విద్యాశాఖ డైరెక్టరే గ్రంథాలయ శాఖ డైరెక్టరు :

హైదరాబాదు పౌర గ్రంథాలయ చట్టము 1955, నందు కూడ మదరాసు పౌర గ్రంథాలయ చట్టము 1948 నందు వలెనే విద్యాశాఖ డైరెక్టరు గ్రంథాలయశాఖ డైరెక్టరుగా నుండ వచ్చును. అందువలన చట్టప్రకారము ఆనాటి విద్యాశాఖ డైరెక్టరుగానైన ఎన్. రామ్‌లాల్‌గారు గ్రంథాలయ డైరెక్టరుగా కూడ ఆంధ్రప్రదేశ్ అవతరణ వరకు కొనసాగిరి. హైదరాబాదు రాష్ట్రము నందలి గ్రంథాలయ కార్యకర్తలు, గ్రంథాలయాభిమానులు కూడ గ్రంథాలయాలకు ప్రత్యేకంగా సాంకేతిక అంశము లందనుభవము పొందిన డైరెక్టరు నియామక సూచన పౌర గ్రంథాలయ చట్టము నందు లేనందులకు కొంత అసంతృప్తితో నుండిరి.

ఆంధ్ర ప్రాంతమునందు గ్రంథాలయ వ్యాప్తికి గొప్పకృషి చేసినందువలన ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తరువాత కూడ యితర అధికారములతో పాటు తెలంగాణలో గ్రంథాలయశాఖ బాధ్యతలనుకూడ రాఘవరెడ్డిగారి కప్పగించడము జరిగినది. ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తరువాత కూడ గ్రంథాలయాలకు ప్రత్యేక డైరెక్టరు నియామకము జరుగవలెనని రాఘవరెడ్డిగారును, తదితరులును ప్రభుత్వమునకు తరచు విజ్ఞప్తులు చేయుచుండిరి.

## గ్రంథాలయశాఖకు ప్రత్యేక డైరెక్టరు నియామకమునకు గ్రంథాలయ కార్యకర్తల పట్టుదల :

ఆంధ్రప్రదేశ్ అవతరణానంతరము గ్రంథాలయ శాఖనుకూడ నిర్వహించిన, డి. ఎస్. రెడ్డిగారు, ఎన్. రామ్ లాల్ గారు,

వి. సి. వామనరావుగారు, తదితర విద్యాశాఖ డైరెక్టరులు కూడ గ్రంథాలయములకు ప్రత్యేక డైరెక్టరు నియామకమునకు తమ సమ్మతిని వ్యక్తపరచిరి.

ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తరువాత లోకల్ లైబ్రరీ అథారిటీ వారుకూడ గ్రంథాలయశాఖకు ప్రత్యేక డైరెక్టరు నియామకము జరుగవలెనని తమ అభిప్రాయమును ప్రభుత్వమునకు తెలియజేయుచూ వచ్చిరి. ఉదాహరణకు: 1957 వ సంవత్సరము ఫిబ్రవరి నెల 28 వ తేది నెల్లూరు లోకల్ లైబ్రరీ అథారిటీ పౌర గ్రంథాలయములకు ప్రత్యేక డైరెక్టరును నియమించవలయునని తీర్మానించి ప్రభుత్వమునకు తెలియజేసినది. రాష్ట్రమునందలి పెక్కు యితర లోకల్ లైబ్రరీ అథారిటీలుకూడ యిదే అభిప్రాయమును కల్గియుండినవి.

వావిలాల గోపాలకృష్ణయ్యగారు, తదితరులు శాసనసభలో కూడ గ్రంథాలయాలకు ప్రత్యేక డైరెక్టరుయొక్క ఆవశ్యకతను గురించి వివరించిరి. ప్రభుత్వము గ్రంథాలయశాఖను ప్రత్యేక శాఖగా ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయచట్టము 1960 ప్రకారము పరిగణించుటకు అంగీకరించినది.

## ప్రత్యేక డైరెక్టరు నియామకమునకు రాష్ట్ర గ్రంథాలయ కమిటీ సమావేశములో సభ్యుల సూచనలు:

1960 లో ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ చట్టము అమలుకు వచ్చిన నాటినుండి రాష్ట్ర గ్రంథాలయ కమిటీ సమావేశములు తరచు జరుగుచుండినవి. ప్రత్యేక డైరెక్టరు నియామకము జరుగవలెనని ఈ సమావేశములందు తీర్మానించడం జరిగినది. 1965 వ సంవత్సరము డిశంబరునెల 29 వ తేదీన జరిగిన రాష్ట్ర గ్రంథాలయ కమిటీ సమావేశమునందు "గ్రంథాలయ శాఖకు ప్రత్యేక డైరెక్టరు

నియామకము'' అను అంశముపై చర్చ జరిగినది. రాష్ట్ర గ్రంథాలయ కమిటీ సభ్యులు శ్రీ బెళంచర్ల సుబ్బారెడ్డి, కోదాటి నారాయణరావు గారలు గ్రంథాలయ శాఖకు వెంటనే ప్రత్యేక డైరెక్టరును నియమించ వలసిన ఆవశ్యకతను గురించి విశదీకరించిరి. ఆ సమావేశములో హైదరాబాదు జిల్లాకు చెందిన ఎస్. చెన్నారెడ్డి గారు రాష్ట్రమునందలి ఎనుబదికి పైబడిన శాఖలకు ప్రత్యేక డైరెక్టరు లుండుటచే, గ్రంథాలయ శాఖకు కూడ తప్పని సరిగా ప్రత్యేక డైరెక్టరు నియామకము జరుగవలెనని, గ్రంథాలయ శాఖకన్న తక్కువ బడ్జెట్ కల యితర శాఖలకు ప్రత్యేక డైరెక్టరు నున్నపుడు, గ్రంథాలయ శాఖకు ప్రత్యేక డైరెక్టరు నియామకము జరుగక పోవుటలో ఔచిత్యము గోచరించడము లేదని తీవ్రంగా వాదించిరి. కేంద్ర ప్రభుత్వముచే నియమించబడిన అఖిలభారత గ్రంథాలయ సలహా సంఘ సభ్యులచే 1959 వ సంవత్సరమున రూపొందించబడిన నివేదిక యందును, యీ నివేదిక ప్రాతిపదికగా చేసికొని రూపకల్పన చేసిన గ్రంథాలయాల నమూనా (Model) బిల్లునందు కూడ ప్రత్యేక డైరెక్టరు నియామక సూచన చేయబడినదని చెన్నారెడ్డిగారు ఉద్ఘాటించిరి ఈ సమావేశము విద్యాశాఖమంత్రి అధ్యక్షతన జరిగినది. ఈ సమావేశమునకు విద్యాశాఖకు చెందిన సెక్రటరీ, విద్యాశాఖ డైరెక్టరు మున్నగువారు కూడ హాజరైరి. విద్యాశాఖ డైరెక్టరుకు అదనపు బాధ్యతలుగా నున్న గ్రంథాలయశాఖ బాధ్యతలను తొలగించి గ్రంథాలయాలకు ప్రత్యేక డైరెక్టరును నియమించ వలెనని ఏక గ్రీవముగా ఈ సమావేశము తీర్మానించడము జరిగి నది. అయినప్పటికిని ఈ తీర్మానములను అమలు పరచడం జరుగలేదు.

**ప్రత్యేక శాఖ డైరెక్టరు నియామకమునకు కొన్ని అవరోధములు:**

విద్యాశాఖకు చెందిన కొందరు అధికారులు రాష్ట్ర కేంద్ర గ్రంథాలయాధికారి మాత్రము సాంకేతిక విషయములందు శిక్షణ

పొందిన వారుగానుండిన చాలునని, గ్రంథాలయశాఖ డైరెక్టరు అటువంటి శిక్షణ పొందవలసిన ప్రమేయము లేదని అభిప్రాయమును వ్యక్తపరచిరి. కాని ఈ అభిప్రాయమునకు రాఘవరెడ్డిగారును, ఇతర గ్రంథాలయ కార్యకర్తలును, గ్రంథాలయాభిమానులును సుముఖతను వ్యక్తపరచలేదు. గ్రంథాలయశాఖ డైరెక్టరు సాంకేతిక విషయ జ్ఞానము పొందియున్నచో రాష్ట్రమునందలి గ్రంథాలయముల పర్యవేక్షణ చక్కగా జరుగగలదని తెలియజేసిరి.

మదరాసు రాష్ట్రమునందు గ్రంథాలయములకు ప్రత్యేక డైరెక్టరు లేరని కాన మనరాష్ట్రమునందుకూడ ప్రత్యేక డైరెక్టరు నియామకావశ్యత లేదని విద్యాశాఖాధికారులలో కొందరు భావించుచుండిరి. ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ చట్టమునందు గ్రంథాలయశాఖను ప్రత్యేక శాఖగా పరిగణించుటకు స్థూలముగా నిర్దేశింపబడినదని, అందువలన ప్రత్యేక డైరెక్టరు నియామకము అత్యంతావశ్యకమని గ్రంథాలయ కార్యకర్తలు ప్రభుత్వమునకు విన్నవించుకొనుచుండిరి. ఈ విషయమును గుర్తించకపోవుట విచారకరమనికూడ గ్రంథాలయ కార్యకర్తలు, తదితరులు ప్రభుత్వమునకు తెలియజేసిరి.

ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ చట్టము 1960, సెక్షన్ 8 ప్రకారము పౌర గ్రంథాలయ శాఖను ప్రత్యేకశాఖగా పరిగణించవలెనని, ప్రత్యేకించబడిన శాఖకు విద్యాశాఖ డైరెక్టరును లేదా ప్రత్యేక డైరెక్టరును నియమించవలెనని నిర్దేశించబడి యుండినది. కొంతకాలము తర్వాత విద్యాశాఖ డైరెక్టరును గ్రంథాలయశాఖ డైరెక్టరుగా నియమించవలెనను సూచనను తొలగించి చట్టమును సవరించుటచే గ్రంథాలయశాఖకు ప్రత్యేక డైరెక్టరును నియమించవలెనని స్పష్టముగా సూచించడమైనది. అయినప్పటికిని ప్రత్యేక డైరెక్టరును నియమించకపోవుటచే దీనికి రాజకీయ ప్రభావము

కొంతవరకు కారణమని కొంత మంది గ్రంథాలయ కార్యకర్తలు అభిప్రాయమును కల్గియుండిరి.

ప్రత్యేక డైరెక్టరు నియామకమునందు మిగుల జాప్యము జరిగినది. విద్యాశాఖ డైరెక్టరే గ్రంథాలయశాఖ డైరెక్టరుగా 1967 సంవత్సరము వరకు కొనసాగిరి.

## ప్రత్యేక డైరెక్టరు నియామకమునకు గ్రంథాలయ సంఘాల తీర్మానములు:

1965 లో మైసూరునందు అఖిల భారత గ్రంథాలయ సంఘ సమావేశ మొకటి ఏర్పాటు చేయడమైనది. ఈ సమావేశమునందు కూడ పౌర గ్రంథాలయాలకు ప్రత్యేక డైరెక్టరు ప్రతి రాష్ట్రము నందుండవలెనని తీర్మానించి, తీర్మానములను రాష్ట్ర ప్రభుత్వములకు పంపిరి.

1966 లో విజయవాడ యందు ఆంధ్ర గ్రంథాలయ సభ జరిగినది. ఆ సమావేశమున పౌర గ్రంథాలయములకు ప్రత్యేక డైరెక్టరును నియమించ వలయునని ఏకగ్రీవంగా తీర్మానించి ప్రభుత్వమునకు తెలియజేసిరి.

1966 వ సంవత్సరము మార్చి నెల 20 వ తేది హైదరాబాదు నందు రాష్ట్ర గ్రంథాలయ సమావేశ మొకటి ఏర్పాటు కావించబడినది. ఈ సమావేశమునకు లోకల్ లైబ్రరీ అథారిటీ చైర్మన్‌లు, కార్యదర్శులు హాజరైరి. విద్యాశాఖ మంత్రిగారు కూడ ఈ సమావేశమునందు పాల్గొనిరి. వ్యక్తులకు ప్రాధాన్యము నివ్వక గ్రంథాలయాభివృద్ధిని ధ్యేయంగా నెంచి గ్రంథాలయ శాఖకు తగు ప్రాముఖ్యత నిచ్చి, ఆ శాఖాభివృద్ధికి ప్రత్యేక డైరెక్టరు నియామకము జరుగవలెనని ఆ సమావేశమునందు ఏకగ్రీవంగా తీర్మానించడము జరిగినది.

ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘమువారు కూడ ప్రత్యేక డైరెక్టరు నియామకమునకు గట్టి కృషి సల్పిరి.

1965 వ సంవత్సరము మైసూరునందు పౌర గ్రంథాలయ చట్టము అమలులోనికి వచ్చినది. ఈ చట్టమునందు గ్రంథాలయ శాఖకు, రాష్ట్రగ్రంథపాలకుని అధికారిగా నియమించవలెనని సూచించబడినది. ఈ సూచనను ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వదృష్టికి తీసికొనివచ్చినప్పటికి గ్రంథాలయ శాఖకు ప్రత్యేకడైరెక్టరు నియామకమునందు జాప్యము జరిగినది.

## ప్రత్యేక గ్రంథాలయ శాఖ డైరెక్టరుగా నియామకావశ్యకతపై పలువురి నిపుణుల విజ్ఞప్తులు:

ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ చట్టము ననుసరించి ఈ క్రింది బాధ్యతలను కూడ గ్రంథాలయముల డైరెక్టరు స్వీకరించవలయును.

1. జాతీయ గ్రంథ సూచీలు తయారు చేయుట.

2. ఒక గ్రంథాలయము నుండి మఱియొక గ్రంథాలయమునకు కావలసినపుస్తకముల నరువుగైకొను సహకారమును పెంపొందించుట.

3. గ్రంథాలయములందు వర్గీకరణ, సూచీకరణ సక్రమముగా నిర్వర్తించుట.

4. పుస్తక భాండాగారులు నిర్వర్తించు పై కార్యక్రమములను గ్రంథాలయ శాఖ డైరెక్టరు పరిశీలించవలెను. వీటిని సక్రమముగా పరిశీలించవలయునన్న గ్రంథాలయ శాస్త్రశిక్షణ, అనుభవము ఎంతో అవసరము. గ్రంథాలయ నిర్వహణలో అనుభవములేని విద్యాశాఖ డైరెక్టరులు గ్రంథాలయ శాఖ డైరెక్టరులుగా బాధ్యతల నిర్వహించిన చో యిట్టి విధులను సక్రమముగా నిర్వహింపజాలరని, పుస్తక

ఛాండా గారులు చేయు పొరబాట్లను కూడ సరిదిద్దజాలరని, అందువలన ప్రత్యేక డైరెక్టరు నియామకమెంతేని అవసరమని ప్రభుత్వమునకు తరచు గ్రంథాలయాభిమానులు, గ్రంథాలయ శాస్త్రవేత్తలు నొక్కి చెప్పుచుండిరి.

విద్యాశాఖ డైరెక్టరులు తమకున్న కాలమునందు ఎక్కువ భాగమును విద్యాశాఖ కార్యక్రమములకే కేటాయించి, తక్కువ కాలమును గ్రంథాలయ శాఖ కార్యక్రమములకు కేటాయించుచుండిరి. పౌర గ్రంథాలయముల అభివృద్ధికి తగినంత గ్రాంట్లను మంజూరు చేయకుండిరి, పౌర గ్రంథాలయాలకు ప్రత్యేక బడ్జెట్ మంజూరు చేయవలెనని ప్రత్యేక డైరెక్టరును నియమించవలెనని గ్రంథాలయ కార్యకర్తలు, గ్రంథాలయ శాస్త్రనిపుణులు ఎన్ని విజ్ఞాపనలు చేసినప్పటికిని, 1967 వ సంవత్సరమువరకు గ్రంథాలయ శాఖకు ప్రత్యేకడైరెక్టరు నియామకము జరుగలేదు.

ప్రముఖ విద్యావేత్త, ప్రణాళికా సంఘ సభ్యులైన వి. కె. ఆర్. వి. రావుగారు కూడ పౌర గ్రంథాలయాలు అభివృద్ధి చెందవలయునన్నచో గ్రంథాలయాలకు ప్రత్యేక డైరెక్టరు నియామకము ప్రభుత్వముల తక్షణ కర్తవ్యమని స్పష్టపరచినప్పటికిని ఆంధ్ర ప్రదేశ్‌లో పౌర గ్రంథాలయాలకు ప్రత్యేక డైరెక్టరు నియామకము నందు జాప్యము జరిగినది.

## భారత దేశములో ప్రప్రథమముగా గ్రంథాలయ డైరెక్టరుగా సాంకేతిక నిపుణులైన రాఘవరెడ్డిగారి నియామకము:

గొప్ప విద్యావేత్తయగు ఎన్. రమేశన్ గారు 1967 వ సంవత్సరము విద్యాశాఖ కార్యదర్శిగా నుండిరి. ఎ. బలరామిరెడ్డిగారు విద్యాశాఖ మంత్రిగా నుండిరి. వీరు రాష్ట్రమునందు విద్యాభివృద్ధికి ప్రాముఖ్యత నిచ్చువారే గాక, గ్రంథాలయాభివృద్ధికి కూడ

ద్రోహదము చేసిరి. వీరిరువురు గ్రంథాలయాభిమానులగుటచే, గ్రంథాలయాలకు ప్రత్యేక డైరెక్టరు నియామకము తక్షణ కర్తవ్య మని భావించి, 1967 వ సంవత్సరము, జనవరిలో గ్రంథాలయాలకు ప్రత్యేక డైరెక్టరుగా రాఘవరెడ్డి గారిని నియమించిరి. ఈ సమస్యా పరిష్కారానికి అప్పటి ఆర్థికశాఖ మంత్రియు, గొప్ప విద్యావేత్తయు, గ్రంథాలయ అభిమానియునగు డాక్టరు మర్రి చెన్నారెడ్డిగారు మిక్కిలి సహాయపడిరి. దేశమునందు పౌర గ్రంథాలయ శాఖకు ప్రత్యేక డైరెక్టరు నియామక ఘనత ప్రప్రథమముగా ఆంధ్రప్రదేశ్ కే దక్కినది.

## గ్రంథాలయ శాఖకు సాంకేతిక నిపుణులను డైరెక్టరుగా నియమించినందులకు అభినందనలు:

జిల్లా గ్రంథాలయ సంస్థ సభ్యులు, గ్రంథాలయ కార్యకర్తలు, గ్రంథాలయాభిమానులు, పలువురు గ్రంథాలయ పాఠకులు భారత దేశమునందు ప్రప్రథమముగా మన రాష్ట్రమునందు గ్రంథాలయ శాఖకు ప్రత్యేక డైరెక్టరు నియామకమునకు మిగుల సంతోషించిరి. ఈ నియామకమునకు తమ శాయశక్తుల ప్రయత్నించిన మర్రి చెన్నా రెడ్డి, ఎ. బలరామిరెడ్డి, ఎస్. రమేశన్ మున్నగు వారిని బహువిధ ముల శ్లాఘించి వారిపై అభినందనల వర్షము కురిపించిరి.

తొలిసారిగా గ్రంథాలయ శాఖకు ప్రత్యేక డైరెక్టరు నియా మకము జరిగిన తర్వాత 1967 వ సంవత్సరము మే నెల 6 వ తేదిన రాష్ట్ర గ్రంథాలయ కమిటీ సమావేశము నిర్వహింపబడినది. ఈ సమావేశమునకు విద్యాశాఖ మంత్రిగారు, గ్రంథాలయాభిమాని యగు టి. వి. రాఘవులుగారు అధ్యక్షత వహించిరి. ఈ సమావేశంలో ప్రసంగిస్తూ పెక్కు సంవత్సరములుగా గ్రంథాలయాలకు ప్రత్యేక డైరెక్టరు నియామకమునకు కృషి చేయుచున్నామనియు, మన అందరి లక్ష్యము. ఈ ఏడు ఫలించినదనియు తెలిపిరి. గ్రంథాలయోద్యమ వ్యాప్తికి నడుము కట్టిన గ్రంథాలయాభిమానులగు రాఘవరెడ్డిగారు

గ్రంథాలయ శాఖకు ప్రథమ ప్రత్యేక డైరెక్టరు కావడము గర్వించ దగిన విషయమని ప్రశంసా పూర్వకముగా రాఘవరెడ్డిగారిని అభినందించిరి. శ్రీహిరాలాల్ మోరియా, ఇతర గ్రంథాలయ సభ్యులు కూడ ఈ సమావేశమున రాఘవరెడ్డిగారు ప్రత్యేక డైరెక్టరుగా నియమింప బడుటను హృదయపూర్వకముగా కొనియాడిరి.

## వివిధ పత్రికల ప్రశంసలు;

రాష్ట్రమునందలి వివిధపత్రికలు గ్రంథాలయశాఖ ప్రత్యేక డైరెక్టరు నియామకమును గురించి, రాఘవరెడ్డిగారిని తొలిగ్రంథాలయశాఖ ప్రత్యేక డైరెక్టరుగా నియమించడమును గురించి మిగుల కొనియాడినవి.

ఆంధ్రప్రభ (దినపత్రిక) 1967 వ సంవత్సరము ఫిబ్రవరినెల 2 వ తేదీన తమ సంపాదకీయములో "ఉన్నత విద్యాడైరెక్టరేటులో ఇంతకాలము అంతర్భాగంగా వున్న గ్రంథాలయశాఖను విడదీసి దానికి ప్రత్యేక ప్రతిపత్తిని కల్పిస్తూ దాని డైరెక్టరుగా శ్రీ కె. రాఘవరెడ్డిని రాష్ట్రప్రభుత్వం నియమించినదనేవార్త గ్రంథాలయోద్యమాభిమానులెల్లరకు సంతోషం కలిగించక మానదు" అని ప్రశంసా పూర్వకముగా తెలియజేయడమైనది.

ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘమువారు తమ గ్రంథాలయ సర్వస్వమునందు 1967 వ సంవత్సరము, ఫిబ్రవరి మాససంచికలో సంపాదకీయమునందు ఈ విధముగా ప్రశంసించి యున్నారు. "చాల కాలంగా యీ శాఖకు ప్రధాన నిర్వాహకులుగా నుండి తమ పనిని మిగుల శ్రద్ధతోను, పట్టుదలతోను, నిర్వహించిన శ్రీ కె. రాఘవరెడ్డి గారినే యీ పదవిలో నిలపడం. చాలా శ్లాఘాపాత్రమైన విషయం. ఈ పదవికి రాకముందు కూడా దాదాపు డైరెక్టరు బాధ్యతలన్నిటినీ

శ్రీ రాఘవరెడ్డిగారే నిర్వహిస్తున్నందున యీ గౌరవము వీరికి దక్కుట సహజమని మేము భావిస్తున్నాము. దీనికిగాను ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వాన్ని, శ్రీరాఘవరెడ్డిగారిని కూడ మేమభినందిస్తున్నాము''

ఈ విధముగా ప్రత్యేక డైరెక్టరుగా నియమించడమును గురించి మనదేశమునందలి పలువురు రాజకీయ నాయకులు, ఇతర గ్రంథాలయాభిమానులు మిగుల ప్రశంసించి యున్నారు.

రాఘవరెడ్డిగారి అనుభవమును గురించి యునెస్కో [UNESCO] వారు ఈ విధముగా ఆంధ్రప్రదేశ్ రాష్ట్రప్రభుత్వము నకు, కేంద్ర ప్రభుత్వమునకు లిఖితపూర్వకముగా తెలియజేసి యున్నారు.

"The candidate has suitable Acadamic and professional qualifications for consideration as advisor in Public Libraries; In addition, he appears to have a considerable experience in planning and organising Libraries on a regional scale and in the training of staff and we shall be glad to put him forward for vacancy where his interesting back ground is called for."

## రాఘవరెడ్డిగారి మాతృదేశాభిమానము:

విదేశములందు కొన్ని ఉద్యోగావకాశములు వచ్చినప్పటికి మాతృదేశాభిమానముచేతను, మిత్రులు స్వదేశమునందే యుండి గ్రంథాలయాభివృద్ధికి ప్రాధాన్యము నివ్వవలెనని కోరుటచేతను, రాఘవరెడ్డిగారు ఆ అవకాశములను త్రోసిపుచ్చి ఆంధ్రప్రదేశ్ రాష్ట్రమునందే యుండి గ్రంథాలయాభి వృద్ధికి నిరంతరము శాయ శక్తులా కృషి చేసిరి. రాష్ట్రమునందు గ్రంథాలయోద్యమము ముందంజ వేయుటకు ముఖ్య కారకులైరి. ఈ విషయమును దేశము

నందలి గొప్ప గ్రంథాలయ నిపుణులు అఖిలభారత గ్రంథాలయ సంఘాధ్యక్షులైన శ్రీ సోహాన్‌సింగ్, శ్రీ డి. ఆర్. కాలియా మున్నగువారు కూడ గొప్పగా శ్లాఘించి యున్నారు.

## డైరెక్టరుగారి కార్యాలయ సిబ్బంది నియామకము:

1961 వ సంవత్సరము జనవరి 1-వ తేది నుండి గ్రంథాలయశాఖ రాష్ట్రమునందు ప్రత్యేక శాఖగా పరిగణించబడినది. గ్రంథాలయ శాఖ ప్రత్యేక శాఖగా పరిగణించబడిన యనంతరము రాఘవరెడ్డిగారు డైరెక్టరు కార్యాలయమునందు యువకులను నియమించిరి. వీరు గ్రంథాలయ శాస్త్రమునందు శిక్షణ పొందినవారు కాకపోయినప్పటికి యువకులగుటచే ఉత్సాహముతో, రాఘవరెడ్డిగారి ప్రోత్సాహముతో గ్రంథాలయ కార్యక్రమముల నిర్వర్తించుట యందు మిగుల చురుకుగా పాల్గొనుచు గ్రంథాలయ నిర్వహణలందు అనుభవమును పొందుచుండిరి. కాలక్రమేణ వీరిలో కొందరికి గ్రంథాలయ శాస్త్రమునందు శిక్షణ నివ్వడము కూడ జరిగినది. శిక్షణానంతరము గ్రంథాలయ నిర్వహణాద్యంశముల యందు తగు జ్ఞానమును పొందినవారైరి. రాష్ట్రంలో గ్రంథాలయాల అభివృద్ధికి వీరందరు చాల కృషి చేసిరి,

## డైరెక్టరుగా రాఘవరెడ్డిగారి పదవీకాలము పొడిగింపు:

దేశమునందలి పలువిద్యావేత్తల, గ్రంథాలయ శాస్త్రవేత్తల అభినందనలచే అలంకృతులైన రాఘవరెడ్డిగారు 1968 వ సంవత్సరము జనవరి 24 వ తేదీ వరకు డైరెక్టరుగా నుండి గ్రంథాలయాభివృద్ధికి ప్రశంసనీయమైన సేవజేసిరి. ఆ సంవత్సరముననే 55 సంవత్సరములు నిండిన రాఘవరెడ్డిగారికి పదవీ విరమణ వయస్సు వచ్చినది. గ్రంథా

లయముల అభివృద్ధికి ప్రత్యేకడైరెక్టరుగా యెనలేని సేవజేసిన రాఘవరెడ్డిగారి కృషి సామర్థ్యముల ప్రభుత్వము గుర్తించి వారిని తిరిగి ఒక సంవత్సరము కాలము గ్రంథాలయశాఖ డైరెక్టరుగా కొనసాగవలెనని కోరి వారి పదవీ విరమణకాలమును మరొక సంవత్సర కాలము పొడిగించుచూ,

"The Government have under consideration the appointment of a suitable substitute in his place to administer the department of Public Libraries. As there is no suitable officer to replace him immediately, Government have decided to re-employ him for a period of one year."

అని ఉత్తర్వుల జారీచేసినది. రాఘవరెడ్డిగారు తమ పదవీ విరమణా నంతరము విశ్వవిద్యాలయములకు సేవ చేయవలెనని తలచిరి. కాని ప్రభుత్వాభిప్రాయమునకు సమ్మతించి 1969 జనవరి 24 వ తేదీ వరకు డైరెక్టరుగా రాష్ట్ర పౌర గ్రంథాలయములకు విశిష్ట సేవజేసిరి. ఈ విధముగా పదవీ విరమణ కాలానంతరము కూడ ప్రభుత్వము వీరిని మరియొక సంవత్సరకాలము డైరెక్టరుగా నియమించుటకు ప్రతిభా విశేషములతో కూడిన వీరి గ్రంథాలయ సేవయే ప్రధాన కారణమని చెప్పక తప్పదు. ఇట్టి గౌరవముతో కూడిన అవకాశము రాష్ట్రమునం దేకొద్దిమందికో తప్ప ఎల్లరకు లభ్యము కాలేదు. ఇట్టి గౌరవము లభించిన రాఘవరెడ్డిగారు ధన్యులు.

## రాఘవరెడ్డిగారి సేవలను గూర్చి రాష్ట్ర గ్రంథాలయ కమిటీ తీర్మాన ప్రశంసలు:

రాఘవరెడ్డిగారు ప్రభుత్వమునుండి పదవీ విరమణ చేసిన అనంతరము 27—10—1969 న ఏర్పాటు కావింపబడిన ప్రప్రథమ రాష్ట్ర గ్రంథాలయ కమిటీ సమావేశములో విద్యాశాఖ మంత్రి

యగు పి. వి. నరసింహారావుగారు గ్రంథాలయముల కమూల్యమైన సేవ నొనరించిన రాఘవరెడ్డిగారి గ్రంథాలయ సేవను మిగుల కొనియాడిరి. అనంతరము ఈ సమావేశమునందు క్రింది తీర్మానమును కమిటీ సభ్యులు ఏకగ్రీవంగా ఆమోదించిరి.

"This committee records the yeoman service rendered by Sri K. Raghava Reddy, Ex-Director who had devoted his servicrs. for the improvement of library movement in Andhra Pradesh."

గ్రంథాలయ శాస్త్రవేత్తయే గాక, విద్యావేత్త అయిన రాఘవరెడ్డిగారు పదవీ విరమణానంతరము కొన్ని సంవత్సరములు రాష్ట్రములోని విశ్వవిద్యాలయములకు సేవా సహకారముల నందించిరి.

రాఘవరెడ్డిగారు పౌర గ్రంథాలయశాఖ డైరెక్టరుగా పదవీ విరమణ చేసిన యనంతరము, పౌర గ్రంథాలయ అభివృద్ధి బాధ్యతలను ప్రభుత్వము గ్రంథాలయాభిమాని, ప్రముఖ విద్యావేత్త అయిన శ్రీ ఎం. వి. రాజగోపాల్, ఐ, ఏ. ఎస్. గారి కప్పగించినది. హైదరాబాదులోని నెహ్రూ టెక్నాలాజీకల్ యూనివర్సిటీ ఉపాధ్యక్షులుగాను, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వవిద్యాశాఖ కార్యదర్శిగాను పని చేసి గొప్ప కీర్తిని గడించిన వీరు పౌర గ్రంథాలయాల అభివృద్ధి బాధ్యతలను కొంత కాలము మాత్రమే నిర్వహించినను గ్రంథాలయ కార్యకర్తలకు మిగుల ప్రోత్సాహమును కల్గించి గ్రంథాలయాల అభివృద్ధికి తగు సూచనల నిచ్చుచు ప్రశంసనీయమైన గ్రంథాలయ సేవ చేసిరి.



ప్రముఖ విద్యావేత్త శ్రీ ఎం. వి. రాజగోపాల్ ఐ. ఏ. ఎస్., గారు.

# రాష్ట్ర కేంద్ర గ్రంథాలయము - ప్రాంతీయ గ్రంథాలయములు - సంచార గ్రంథాలయము - ఏలూరు :

ప్రస్తుతము హైదరాబాదు నగరము నందుగల ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమును అసఫియా గ్రంథాలయమని పూర్వము వ్యవహరించెడివారు. 1891 సం॥ హైదరాబాదు రాష్ట్ర విద్యాశాఖ డైరెక్టరు గారైన నవాబ్ ఇమాదుల్ ముల్కు బహదూర్ గారు హైదరాబాదులోని అబిడ్స్ రోడ్డు నందలి ఒక చిన్న భవనమున ఆసూకీ గ్రంథాలయమును స్థాపించిరి. ఈ భవనము మిగుల స్వల్ప విస్తీర్ణము కలదగుటచే 1936 సం॥ మూసీనదీ తీరమున గల పెద్దభవనమునకు తరలించిరి. హైదరాబాదు నగరములో ఆకర్షణీయమైన గ్రంథాలయ భవనములలో ఈ భవనము పేర్కొన దగినది. ఈ గ్రంథాలయము హైదరాబాదు నగరవాసులకే గాక హైదరాబాదు రాష్ట్రమునందలి విద్యావంతులకు గూడ మిగుల ప్రయోజనకరమైన సేవ నందించుచుండినది.

హైదరాబాదు పౌర గ్రంథాలయ చట్టము 1955, ననుసరించి అసఫియా గ్రంథాలయమును హైదరాబాదు రాష్ట్రమున కంతటికి రాష్ట్ర కేంద్ర గ్రంథాలయముగా ప్రకటించడము జరిగినది. ఈ గ్రంథాలయమునే ఆంధ్రప్రదేశ్ అవతరణానంతరము ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర కేంద్ర గ్రంథాలయముగా ప్రకటించడము జరిగినది. 1958 సం॥నకు పూర్వము ప్రభుత్వ యాజమాన్యము నందుండిన ఈ గ్రంథాలయముయొక్క అజమాయిషీ బాధ్యతలను పౌర గ్రంథాలయాల శాఖ డైరెక్టరుగారు స్వీకరించిరి.

ఆంధ్రప్రదేశ్ అవతరణానంతరము డా॥ రహంతుల్లాఖాన్ గారు రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమునకు పుస్తక భాండాగారిగా నుండెడివారు. వీరు గ్రంథాలయ శాస్త్ర నిపుణులు. ఆధునిక పద్ధతులను గ్రంథాలయములందు ప్రవేశపెట్టవలెనని వీరి ఆకాంక్ష. కాని కొన్ని యనివార్య కారణముల వలన వీరి ఆకాంక్ష సిద్ధింపలేదు. అందువలన ఆంధ్రప్రదేశ్ అవతరణ యనంతరము కొంత కాలమునకు, అప్పటి విద్యాశాఖ డైరెక్టరయిన శ్రీ రామ్‌లాల్ గారు మదరాసు పౌర గ్రంథాలయ చట్టమును చక్కగా అమలు పరచి నటువంటి డిప్యూటీ డైరెక్టరు గారైన శ్రీ కె. రాఘవరెడ్డి గారికి ఈ గ్రంథాలయమునందు ఆధునిక పద్ధతుల ప్రవేశపెట్టు బాధ్యతల నప్పగించిరి.

మదరాసు పౌర గ్రంథాలయ చట్టము 1948 నందుగాని, హైదరాబాదు పౌర గ్రంథాలయ చట్టము 1955 నందుగాని, ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ చట్టము 1960 నందుగాని రాష్ట్ర గ్రంథాలయ విధులు సూచించబడలేదు. పెక్కు పాశ్చాత్య దేశము లందమలు నందున్నటువంటి పౌర గ్రంథాలయ చట్టములందు రాష్ట్ర కేంద్ర గ్రంథాలయ విధులు సూచిత మైనట్లు ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ చట్టము 1960 నందు కూడ రాష్ట్ర కేంద్ర గ్రంథాలయ విధులను స్థూలముగా సూచించవలసిన అవసర మెంతేని కలదు.

## ప్రభుత్వ కేంద్ర గ్రంథాలయమును ఆధునిక పద్ధతులలో రూపొందించుటకు రాఘవరెడ్డిగారి నివేదిక :

1959 సం॥నందు కేంద్ర ప్రభుత్వముచే నియమింపబడిన సలహా సంఘము రూపొందించిన నివేదికయందు పేర్కొనబడినటువంటి కేంద్ర గ్రంథాలయ విధులలో కొన్నిటిని 1956 సం॥ నుండి ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమునందు అమలు పరచడం జరిగినది. ఆంధ్రప్రదేశ్ అవతరణకు పూర్వము కూడ ఈ

గ్రంథాలయము పాఠకులకు పుస్తకముల నరువిచ్చుచుండినది. కాని పాఠకులే స్వయముగా పుస్తకమందిరమునకు వెళ్ళి వారికి కావలసిన పుస్తకములను స్వేచ్ఛగా గైకొను సదుపాయము లేకుండినది. ఇటువంటి సదుపాయముల కలుగజేయవలసినదిగా నగరమునందలి పలువురు పాఠకులు డైరెక్టరుగా నుండిన శ్రీరామ్‌లాల్ గారికి విన్నవించిరి. శ్రీరామ్‌లాల్ గారు ఈ విషయమును గురించి డిప్యూటీ డైరెక్టరు గారైన రాఘవరెడ్డిగారితో చర్చించిరి. ఈ చర్చా సందర్భమున రాఘవరెడ్డిగారు రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమునకు పలువిధము లయిన ఆచూకీ గ్రంథముల కొనుగోలు చేయవలెననియు, కేంద్ర రాష్ట్రప్రభుత్వములచే ప్రచురింపబడిన పుస్తకముల నధికసంఖ్యలో సేకరించవలెననియు, కేంద్ర గ్రంథాలయమునందు గ్రంథ సూచీలను తయారు చేయవలెననియు, పరిశోధకులకు తగువసతులు కేంద్ర గ్రంథాలయమునందు కలుగజేయవలెననియు సాంకేతిక విషయముల కధిక ప్రాధాన్యత నొసగవలెనని వక్కాణించిరి. రాష్ట్రమునందు గ్రంథాలయములకు కొనుగోలు చేసిన పుస్తకముల వర్గీకరణ-సూచీకరణ కేంద్ర గ్రంథాలయమునందు జరుపవలెననియు శ్రీరామ్‌లాల్ గారికి వివరించిరి. రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమును ప్రధానముగా ఆచూకీ గ్రంథాలయముగా అభివృద్ధి పరచవలసిన ఆవశ్యకత ఎంతేని కలదనియు తెలియజేసిరి. రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమును అభివృద్ధి పరచుటకుగాను ఒక నివేదికను కూడ శ్రీరామ్‌లాల్ గారి కందజేసిరి.

ఆంధ్రప్రదేశ్ అవతరించిన యనంతరము కూడ కొన్ని సంవత్సరముల వరకు హైదరాబాదు నగర లోకల్ లైబ్రరీ అథారిటీ, నగరమునందు శాఖాగ్రంథాలయాలను స్థాపించలేదు. నగరమునందచ్చటచ్చట కొన్ని సహాయక గ్రంథాలయములు మాత్రముండినవి. అయినప్పటికిని ఈ సహాయక గ్రంథాలయాలలో కావలసిన పుస్తకములు లేనందున పాఠకులకు రాష్ట్ర కేంద్ర గ్రంథా

లయమునందే పఠనప్రవేశ వసతుల కల్గించవలసిన యవసరమెంతేని యుండెను. నగర లోకల్ లైబ్రిరీ అథారిటీచే శాఖాగ్రంథాలయాలు తగినన్ని స్థాపించబడునంత వరకైన సామాన్య ప్రజల కిటువంటి వసతులను రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమునందే కలుగజేయవలెనని శ్రీరామ్‌లాల్‌గారు రాఘవరెడ్డిగారికి సూచించిరి.

## రాష్ట్ర కేంద్ర గ్రంథాలయము 1960-61 సం॥రము నుండి నిర్వర్తించుచుండిన విధులు :

రాష్ట్ర కేంద్ర గ్రంథాలయము సామాన్యప్రజలకు కూడ ప్రవేశ, పఠనవసతుల కల్పించి గృహములకు పుస్తకముల నరువిచ్చుటయేగాక ఈ క్రింది ప్రధాన విధులను కూడ 1960-61 సం॥ నుండి కొంతవరకు నిర్వర్తించుచూ వచ్చినది.

రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమునకు కావలసిన పుస్తకముల ఎన్నిక చేయుటకొక కమిటీ నేర్పాటుచేసి, ఆ కమిటీ సలహాల ననుసరించి పుస్తకముల కొనుగోలు చేయుట జరిగినది. వీటిలో అధిక భాగము పరిశోధకులకు ప్రయోజనకరములైనవిగానుండుట గుర్తించదగ్గ విషయము. పర్షియన్, అరబిక్, తదితర భాషా ప్రతులను కూడ సేకరించి పరిశోధకులకు మిగుల ప్రయోజనమును కల్గించిరి. ఈ గ్రంథాలయమునందు గల పుస్తకములను రాష్ట్రములోని ఇతర గ్రంథాలయములకు అరువు యిచ్చు విధానమును ప్రవేశపెట్టిరి. ఈ గ్రంథాలయము కలకత్తా జాతీయ గ్రంథాలయము నుండి కూడ కావలసినప్పుడు పుస్తకములను అరువు పొందు చుండినది. జాతీయ గ్రంథాలయము రూపొందించిన గ్రంథ సూచీని ముద్రించెడి బాధ్యతను కూడ రాష్ట్ర కేంద్ర గ్రంథాలయము స్వీకరించినది. పిల్లలకు సంబంధించిన గ్రంథ సూచీలను ఉర్దూభాషయందు తయారుచేయు బాధ్యతను కూడ రాష్ట్ర కేంద్ర గ్రంథాలయము స్వీకరించినది. రాష్ట్ర

కేంద్ర గ్రంథాలయము సందర్భావసరములను బట్టి సంవత్సరమున కొకటి లేక రెండు పర్యాయములు పుస్తక ప్రదర్శనలను నిర్వహించు చుండినది. జిల్లా కేంద్ర గ్రంథాలయముల తనిఖీ బాధ్యతలను రాష్ట్ర కేంద్ర గ్రంథాలయ పుస్తక భాండాగారి కప్పగించడం జరిగినది. వీరు తనిఖీలకు వెళ్ళినపుడు జిల్లా గ్రంథాలయ పాలకులకు సాంకేతిక విషయములందు తగు సలహాల నొసగుచుండిరి. గ్రంథాలయ శాస్త్రమును వృత్తి విద్యగా నభ్యసించిన కొందరు పుస్తక భాండాగారులు ఈ గ్రంథాలయాలలో తరచు సమావేశముల నేర్పాటు చేసికొని సాంకేతిక పరమైన విషయములను గురించి రాష్ట్ర కేంద్ర గ్రంథ పాలకునితో చర్చించుకొనుచుండిరి. విశ్వవిద్యాలయములు, గ్రంథాలయ సంఘములు నిర్వహించునటువంటి సర్టిఫికేటు కోర్సుల పరీక్షల కజమాయిషీ వహించు బాధ్యతలను కూడ రాష్ట్ర కేంద్ర గ్రంథాలయ పుస్తక భాండాగారియే కల్గియుండిరి.

రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమునందే రాష్ట్రములోని పౌర గ్రంథాలయములకు కొనుగోలు చేసిన పుస్తక వర్గీకరణ, సూచీకరణ జరుపవలెనని రాఘవరెడ్డిగారు 1964 సం॥న ప్రభుత్వమునకు సూచించగా ప్రభుత్వము వెంటనే అమలుపరచుటకు సుముఖతను వ్యక్తపరచ లేదు. తెలుగునందు రాష్ట్ర యూనియన్ కేటలాగును తయారుచేయు బాధ్యత గుంటూరు ప్రాంతీయ గ్రంథాలయమున కప్పగించబడినది.

రాష్ట్ర కేంద్ర గ్రంథాలయము 1960 సం॥నుండి తన విధులను నిర్వహించుచు రాష్ట్రము నందలి యితర గ్రంథాలయ పాఠకులకు ప్రయోజనకారిగా నుండి వారికి కావలసిన పుస్తకములను అరువిచ్చు చుండినది. రాష్ట్ర కేంద్ర గ్రంథాలయము సాధారణ పౌర గ్రంథాలయ విధులను మాత్రమే నిర్వర్తించు చుండినదని భావించుట ఏ మాత్రము సమంజసము కాదు. హైదరాబాదు నగర లోకల్

లైబ్రరీ అథారిటీ ఆ నాటికి తగినన్ని గ్రంథాలయములను స్థాపించి యుండక పోవుటవలన రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమే పాఠకులకు వసతులను కల్పించినదనుట గుర్తించవలసిన విషయము.

రాష్ట్రమునందు లోకల్ లైబ్రరీ అథారిటీలు పౌర గ్రంథాలయములను స్థాపించిన యనంతరము కూడ పౌర గ్రంథాలయములకు రాష్ట్ర కేంద్ర గ్రంథాలయము పుస్తకములను కొంతవరకు అరువిచ్చుచుండినది. ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ చట్టమునందు రాష్ట్రమునందలి యన్ని పౌర గ్రంథాలయాలు రాష్ట్ర కేంద్ర గ్రంథాలయము క్రింద పనిచేయు శాఖలని స్పష్టముగా సూచించినచో రాష్ట్ర కేంద్ర గ్రంథాలయము పౌర గ్రంథాలయాలకు విరివిగా పుస్తకముల నరువిచ్చుటకు మఱియు వీని మధ్య సహకార విధానములు వృద్ధి చెందుటకెక్కువ అవకాశ ముండును.



రాష్ట్ర కేంద్ర గ్రంథాలయములో రీడింగ్ రూమునందు శ్రీ రాఘవరెడ్డిగారు.

## ఆధునిక పద్ధతుల అమలునకు నిర్ణయము:

సామాన్య ప్రజలకు కూడ రాష్ట్ర కేంద్ర గ్రంథాలయము ప్రవేశ వసతుల కల్పించినది. పాఠకులు రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమునకు స్వేచ్ఛగా వెళ్ళి తమకు కావలసిన పుస్తకముల పొందుచుండిరి. గ్రంథాలయమునందు వీరికి అనుకూల వసతుల కూడ కల్పించుట జరిగినది. పిల్లలకు, అంధులకు కూడ రాష్ట్ర కేంద్ర గ్రంథాలయము ప్రత్యేక వసతులను కలుగజేసినది. ఈ విధముగా రాష్ట్ర కేంద్ర గ్రంథాలయము సామాన్య ప్రజలకు తగు వసతులను కల్పించవలసిన బాధ్యతను చేపట్టడము, ఆనాడు రాష్ట్రమునందు ముఖ్యముగా హైదరాబాదు నగరమునందు తగినన్ని పౌర గ్రంథాలయములు లేక పోవుటవలననే యని చెప్పవచ్చును. విద్యావంతులకేగాక, సామాన్య ప్రజలకు కూడ ప్రయోజనకరమయిన గ్రంథాలయ సేవ చేయవలెనని, ఆధునిక పద్ధతులను కూడ రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమునందు ప్రవేశ పెట్టు బాధ్యతను రామ్‌లాల్ గారు, రాఘవరెడ్డిగారి కప్పగించిరి,

బొంబాయి, కలకత్తా, మదరాసు మున్నగు పట్టణములందలి రాష్ట్ర కేంద్ర గ్రంథాలయములు, అనుసరించు నవీనపద్ధతులను ప్రత్యక్షముగా కూలంకషముగా గ్రహించినటువంటి రాఘవరెడ్డిగారు ఆంధ్రప్రదేశ్ లోని రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమును ఆధునిక పద్ధతులలో నిర్వహింప యుటకు గొప్ప కృషి సల్పిరి. అప్పటి రాష్ట్ర కేంద్ర గ్రంథాలయ పుస్తక భాండాగారులగు సయ్యద్ జఫ్రాలి, శ్రీ టి. వి. రమణయ్యాగార్లు గ్రంథాలయమందు ఆధునిక పద్ధతుల ప్రవేశపెట్టుటలో రాఘవరెడ్డిగారితో సహకరించిరి. ఈ గ్రంథాలయములో వివిధ విభాగముల నభివృద్ధి చేయుటకు కూడ శ్రీ టి. వి. రమణయ్యాగారు కృషిచేసిరి.

## రాష్ట్ర కేంద్ర గ్రంథాలయానికి అదనపు భవన నిర్మాణము:

రాష్ట్ర కేంద్ర గ్రంథాలయ భవనము తగినంత విశాలముగా లేనందున ఆధునిక పద్ధతుల నవలంబించుటకును, వివిధ విభాగముల నేర్పాటు చేయుటకును తగు వసతి లేకుండెను. పాఠకుల సంఖ్య కాల క్రమేణ పెరుగుచుండుటచే గ్రంథాలయ భవనము చాలదని రాఘవ రెడ్డిగారు ఈ విషయముల గురించి మంత్రిగారైనటువంటి శ్రీ మర్రి చెన్నారెడ్డిగారికి, ఆర్థిక శాఖ సెక్రటరీగారైన శ్రీ అబ్బాసీగారికి వివరించిరి. రాష్ట్రమునందలి గ్రంథాలయములలో ప్రధానమైన గ్రంథాలయమని దీనిని వారు గుర్తించి ఈ గ్రంథాలయమునకు విశాలమైన భవనము తప్పని సరిగా నుండవలెనని రాఘవరెడ్డిగారి యభిప్రాయముతో ఏకీభవించిరి. ప్రభుత్వము ఎనిమిది లక్షల రూ॥లకు పైగా కేటాయించి రాష్ట్ర కేంద్ర గ్రంథాలయ ఆవరణమందు ఒక నూతన భవనమును నిర్మించి, 9—7—1961 న ఈ భవనమును రాష్ట్ర గ్రంథాలయ శాఖకు అప్పగించినది. ఈ విధముగా నూతనముగా గ్రంథాలయ భవనము విస్తరింప బడినందున వివిధ శాఖల నేర్పాటు చేయుటకు రాఘవరెడ్డిగారు బహువిధముల కృషి చేసిరి.

## రాష్ట్ర కేంద్ర గ్రంథాలయములో స్వేచ్ఛోపలబ్ధి పద్ధతి:

1960 సం॥నకు పూర్వము స్థాపించబడి నటువంటి జిల్లా కేంద్ర గ్రంథాలయములందును, కొన్ని శాఖా గ్రంథాలయములందును స్వేచ్ఛగా లభ్యమగునట్లుగా పుస్తకము లమర్చబడి యుండినవి. కాని రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమునందు ఈ వసతి కల్పింపబడ లేదు. ఇందువలన పాఠకులకు తమకు కావలసిన పుస్తకముల గ్రహించుట కష్టముగా నుండుటయే గాక గ్రంథాలయములందే యే పుస్తకములు కలవన్న విషయమును గ్రహించుట కూడ కష్టతరముగా నుండినది.

గ్రంథాలయ సేవ ప్రజల కందుబాటు నందుండునట్లు చేయుటకొరకు 1960-61 సం॥ రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమునందు పుస్తకములు తెరువబడిన బీరువాలయం దమర్చు విధానము ప్రవేశపెట్టబడినది. ఈ విధానము ద్వారా పాఠకులు స్వేచ్ఛగా గ్రంథాలయమునకు వెళ్ళి తమకు కావలసిన పుస్తకములను సులభముగా నెన్నుకొనుటకు వీలు కలిగెను. పాఠకులకు గ్రంథాలయము నందున్న యితర పుస్తకములను వెంటనే పరిశీలించు అవకాశము కల్గినందున వారికి కాలయాపన జరుగుచుండెడిది కాదు. ఈ పద్ధతి ప్రవేశపెట్టుట పాఠకులకు మిగుల హర్షదాయక మయినది.

## టికెట్టు పద్ధతిలో అరువు విధానము అమలు

1960 సం॥నకు పూర్వము స్థాపించబడి యున్నటువంటి జిల్లా కేంద్ర గ్రంథాలయములందును మరియు కొన్ని శాఖా గ్రంథాలయములందునుపుస్తకముల నరువిచ్చుటకు టికెట్టు పద్ధతి ప్రవేశ పెట్టబడి యుండినది. కాని రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమునందు మాత్రము రిజిష్టరు పద్ధతి అమలు నందుండినది. ఒక పాఠకుడు తనకు కావలసిన పుస్తకమును ఎన్నుకొని ఆ పుస్తకమును గ్రంథాలయము నందలి అరువు విభాగ గ్రంథపాలకున కిచ్చినచో అతను ఆ పుస్తక నామము, గ్రంథకర్త యొక్క నామము, ప్రచురణ సంస్థనామము, వర్గీకరణ సంఖ్య తదితర వివరముల నొక రిజిష్టరునందు వ్రాసికొని ఆ పుస్తకమును పాఠకున కిచ్చెడివారు. కాలయాపనతో కూడిన ఈ విధానమును శ్రీ రాఘవరెడ్డిగారు తొలగించి టికెట్టు పద్ధతిని రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమునందు 1960 - 61 సం॥ ప్రవేశపెట్టిరి. ఈ పద్ధతి పాఠకులకు మిగుల ప్రయోజన కరముగా నుండినది.

## దశాంశ వర్గీకరణ నిఘంటు సూచీకరణ విధానము అమలు:

1960 సం॥నకు పూర్వము రాష్ట్ర కేంద్ర గ్రంథాలయము పుస్తక వర్గీకరణ యందు బ్రౌను వర్గీకరణ పద్ధతిని (Brown's Classification Scheme) కొంత వరకు సవరించి అనుసరించు చుండినది. రాష్ట్రము నందలి యితర పౌర గ్రంథాలయాలు డ్యూయీ దశాంశ వర్గీకరణ విధానము ననుసరించు చుండగా రాష్ట్ర కేంద్ర గ్రంథాలయము మాత్రము బ్రౌను సర్దుబాటు వర్గీకరణ పద్ధతిని అనుసరించుటచే వర్గీకరణలో భిన్నత్వ మేర్పడుటయే గాక పాఠకులకు కూడ పుస్తక సూచీల మూలమున పుస్తకముల నెన్నుకొనుట కష్టతరముగా నుండినది. రాష్ట్రము నందలి అన్ని గ్రంథాలయములలోని పుస్తకములను, రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమునందలి పుస్తకములను డ్యూయీ పద్ధతిలో వర్గీకరించినచో రాష్ట్ర మంతట వర్గీకరణ విధానమున ఏకత్వము సాధించుటకు వీలగును. రాఘవరెడ్డిగారు యిందు నిమిత్తమై ప్రత్యేక అదనపు సిబ్బందిని నియమించి వారికి శిక్షణనుకూడ కల్పించి డ్యూయీ దశాంశ వర్గీకరణ విధానమును రాష్ట్ర కేంద్ర గ్రంథాలయము నందమలు పరచిరి. దీనివలన రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమునుండి యితర గ్రంథాలయాలు పుస్తకముల నరువు పొందుట కూడ సులభతరమయినది రాఘవరెడ్డిగారు ఈ గ్రంథాలయమున నిఘంటు సూచీ విధానమును కూడ ప్రవేశపెట్టిరి. పుస్తకములను అరువు యిచ్చు పద్ధతిని కూడ రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమునందు రాఘవ రెడ్డిగారు ప్రవేశపెట్టిరి. రాష్ట్రమునందలి యితర గ్రంథాలయాలకు కావలసిన పుస్తకములను ఈ గ్రంథాలయము అరువిచ్చుచుండినది.

### తాళపత్ర గ్రంథాలయాభివృద్ధికి చర్యలు:

రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమునందు క్రీ॥ శ॥ 5, 6 శతాబ్దములకు చెందిన ప్రాచీన తాళ పత్రము లుండినవి. ఇందు ఉద్గ్రం

అరబిక్, పర్షియన్ భాషలకు చెందిన లిఖిత ప్రతములు 16,000 కు పైబడి యుండినవి. ఈజిప్టు, ఇరాన్, ఇరాక్ మున్నగు దేశముల వారు ఈ గ్రంథాలయమునకు విచ్చేసి వీటి మూలమున పరిశోధనలను కూడ నిర్వహించుచుండిరి. తెలుగు, సంస్కృతములకు చెందిన కొన్ని తాళ పత్రములు కూడ రాష్ట్ర కేంద్ర గ్రంథాలయము నందుండినవి. ఇవి ప్రాచీన కాలమునకు చెందిన తెలుగు లిపిని, వాఙ్మయమును తెలియజేయుచున్నవి. ఈ విధమయిన ప్రాచీన తాళ పత్రముల వ్రాతప్రతులను సక్రమముగా, శాస్త్రీయ పద్ధతులలో భద్ర పరుచవలెనని రాఘవరెడ్డిగారి యభిప్రాయము. కావున యీ విభాగమును నిర్వహించుచుండిన శ్రీ సయ్యదు హామిద్ అలీగారిని ఢిల్లీ లోని జాతీయ ప్రాచీన పత్ర పరిరక్షణ కేంద్రమునకు, తగు శిక్షణకై పంపడము జరిగినది.

ఈ విధమయిన ప్రాచీన కాలమునకు చెందిన తాళ పత్రముల కొక ప్రత్యేక గ్రంథాలయమును స్థాపించవలెనని ప్రభుత్వము సంకల్పించినది. కాని, రాఘవరెడ్డిగారు రాష్ట్ర గ్రంథాలయ పాలకులు, గ్రంథాలయాభిమానులు రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమునందు గల తాళ పత్రములను వేరొక గ్రంథాలయమునకు తరలించుటకు వ్యతిరేకించిరి. రాఘవరెడ్డిగారు 1969 సం॥లో ప్రభుత్వ పదవీ విరమణ గావించిన యనంతరము కూడ రాష్ట్ర కేంద్ర గ్రంథాలయములోని వివిధ భాషలకు చెందిన తాళ పత్రములను, ఆంధ్ర రాష్ట్ర అవతరణానంతరము మదరాసు నగరములోని ఓరియంటల్ గ్రంథాలయము నుండి తిరుపతికి తరలింపబడిన తాళ పత్రములను కేంద్ర గ్రంథాలయమునకే తెప్పించి తాళ పత్ర విభాగమును స్థాపించుటకు ప్రయత్నించిరి. 19—7—1963 మఱియు 28–2–1964 తేదుల యందు జరిగిన రాష్ట్ర కేంద్ర గ్రంథాలయ కమిటీ సమావేశముల యందు లిఖిత ప్రతులను రాష్ట్ర కేంద్ర గ్రంథాలయము నందొక విభాగము క్రింద ఏర్పాటు చేయుటయే సమంజసమని ఏక

గ్రీవముగా తీర్మానించడం జరిగినది. తరువాత జరిగిన సమావేశముల యందు కూడ యిదే తీర్మానమును గైకొనడము గమనింపదగినది.

## ప్రాచీన పత్ర పరిరక్షణశాఖలో లిఖిత పత్ర గ్రంథాలయము:

ప్రభుత్వము లిఖితప్రతులకై ఒక ప్రత్యేక గ్రంథాలయమును స్థాపించవలెనని సూచనలిచ్చుచుండినది. కాని రాష్ట్ర కేంద్ర గ్రంథాలయ కమిటీ సభ్యులు మఱియు గ్రంథపాలకులు యిందులకు సుముఖులుగాలేరు. 10—7—1968 న జరిగిన రాష్ట్ర గ్రంథాలయ కమిటీ సమావేశమునందు కూడ పాతూరి నాగభూషణంగారు తదితరులు ఈ లిఖిత ప్రతులను రాష్ట్ర కేంద్రగ్రంథాలయములో ఒక విభాగముగ నేర్పాటు చేయవలెనని నొక్కి చెప్పిరి. అయినప్పటికి 23—1—1968 న లిఖితప్రతుల కొకప్రత్యేక గ్రంథాలయమును స్థాపించవలెనని ప్రభుత్వము ఉత్తర్వుల జారీ చేసినది. ఈ ఉత్తర్వుల ప్రకారము అవిభక్త మదరాసు రాష్ట్రమునుండి ఆంధ్రరాష్ట్రమునకు సంక్రమించిన ప్రాచీన లిఖితప్రతులను రాష్ట్ర కేంద్ర గ్రంథాలయములోని పర్షియన్, అరబిక్, ఉర్దూ తదితర భాషలయందలి లిఖితప్రతులను ప్రత్యేకించి, వాటి కొఱకు ప్రాచీన పత్ర పరిరక్షణశాఖ (డిపార్టుమెంటాఫ్ ఆర్కైవ్స్) ఆధీనమునందు ప్రత్యేక గ్రంథాలయము నొకదానిని స్థాపించడం జరిగినది.

## రాష్ట్ర కేంద్ర గ్రంథాలయములోనే లిఖితపత్ర విభాగ ముండుటకు పునరాలోచన చేయుటకు సభ్యుల సూచన:

ఈ లిఖిత పత్రముల గ్రంథాలయమే ప్రత్యేకముగా స్థాపించబడిన యనంతరము జరిగిన రాష్ట్రగ్రంథాలయ కమిటీ సమావేశములందుకూడ దీనిని గురించి సభ్యులు విమర్శించు చుండిరి. పలువురు గ్రంథపాలకులు కూడ యీా విధానము ప్రయోజనకారి కాదని తెలియ

జేయు చుండిరి. యునెస్కో ప్రవీణుడయిన శ్రీ డి ఆర్. కాలియాగారు రాష్ట్ర కేంద్ర గ్రంథాలయ సందర్శనమునకు 1967 లో విచ్చేసిన సమయమున కూడ యీ విధముగ లిఖిత పత్రముల గ్రంథాలయమును ప్రత్యేక గ్రంథాలయముగా నేర్పాటు చేసినందులకు సుముఖముగా లేకుండిరి. రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమునందే లిఖితప్రతుల విభాగము నేర్పాటు చేసినచో గ్రంథాలయానికి విచ్చేయు పరిశోధకులకు, తదితరులకు మిగుల దోహదకారిగా నుండగలదని ప్రాచీన పత్ర పరిరక్షణ శాఖ ఆధీనమునందు యీ లిఖిత ప్రతుల గ్రంథాలయము నుంచి నందున యీ గ్రంథాలయము కొందరికే ప్రయోజనకారిగా నుండగలదని, దీనిని రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమునందే అంతర్విభాగముగా నుంచిన సమంజసముగా నుండునని యీ నాటికిని పలువురు ప్రముఖులు అభిప్రాయ పడుచున్నారు,

## కేంద్ర గ్రంథాలయములో బాలలకు ప్రత్యేక వసతులు:

1960-61 సం॥ రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమునందు పిల్లల విభాగమును స్థాపించుట జరిగినది. ఇందు తెలుగు, ఆంగ్లము, హిందీ, ఉర్దూ, మరాఠీ కన్నడ తదితర భాషలలో ప్రయోజనకరమగు పుస్తకము లుండినవి. పిల్లల కనుకూలముగా నుండునట్లు కుర్చీలను, మేజాలను, మొదలగువాటిని కూడ ఏర్పాటు చేయుటయేగాక ఆట వస్తువులను కూడ ప్రవేశపెట్టడం జరిగినది. వ్యాసరచన పోటీలు, వక్తృత్వపు పోటీలు మున్నగునవి కూడ నిర్వహింపబడినవి. పోటీలలో విజేతలయినవారికి బహుమతుల ఇవ్వడము జరుగుచున్నది. చలన చిత్రములను కూడ ప్రదర్శించుచు పెక్కు పిల్లలకు గ్రంథాలయముపై చిన్ననాటి నుండి మక్కువను కల్గించుటకును, పఠనమునందాసక్తిని పెంచుటకును ఈ గ్రంథాలయము ఈ నాటికిని బహుళ కృషి సల్పుచున్నది.

## వయోజన విద్యా కార్యక్రమాలకు ప్రత్యేక విభాగము :

రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమునందు 1961-62 సం॥ వయోజన విద్యావిభాగ మేర్పాటు చేయబడినది. ఇది గ్రంథాలయమునకు విచ్చేయు నిరక్షరాస్యుల జ్ఞానాభివృద్ధికి కూడ తగు కృషి సల్పుచుండినది. చలనచిత్ర యంత్రపరికరములను కూడ యీ విభాగమునందు ప్రవేశపెట్టడం జరిగినది. ఈ విభాగమునందు తరచు చలన చిత్ర ప్రదర్శనలను నిర్వహించుచుండిరి. అక్షరాస్యులకే గాక, నిరక్షరాస్యులకు కూడ ప్రయోజనమును కూర్చు చలన చిత్రములను ప్రదర్శించుచుండిరి. పుస్తక ప్రదర్శనములను కూడ నిర్వహించుచుండిరి. ఈ కార్యక్రమములు యీనాటికిని నిర్వహింపబడుచున్నవి.

## విద్యార్థులకు పాఠ్యపుస్తక పఠన సౌకర్యము:

నగరములోని విద్యార్థులకు ప్రయోజనమును చేకూర్చు ధ్యేయముతో 1961 – 62 సం॥ రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమునందు పాఠ్యపుస్తక విభాగము తెరువబడినది. కళాశాల, విశ్వ విద్యాలయములకు సంబంధించిన పలు పాఠ్య పుస్తకములు ఈ విభాగమునందు యుండినవి. పలువురు విద్యార్థులు ఈ విభాగమును సద్వినియోగ పరచుకొనుటకు వీలుగా ఈ విభాగము రోజు 16 గం॥ అనగా ఉ॥ 8 గం॥ నుండి రాత్రి 12 గం॥వరకు పని చేయుచుండెను. అమూల్యమయిన పుస్తకములు ఈ విభాగము నందుండినవి. పుస్తకముల కొనలేని పేద విద్యార్థులకు ఈ సహాయము మిగుల ప్రయోజన కరముగా నుండినది. అటువంటివారు ఈ విభాగమునకు విచ్చేసి చక్కగా చదువుకొని తమ విద్యాభ్యాసమును కుంటు పడకుండ సాగించుకొనుటకు వీలుండినది. ఈ విధమయిన అవకాశము కల్పించ బడినందులకు పలువురు పేదవిద్యార్థులు మిగుల హర్షించిరి. ఈ విభాగము నేటికిని కొనసాగుచున్నది.



రాష్ట్ర కేంద్ర గ్రంథాలయ పాఠ్యపుస్తక విభాగములో గ్రంథములు అమర్చబడిన విధానమును పరిశీలిస్తూయున్న శ్రీ కె. రాఘవరెడ్డిగారు.

## అంధులకు పఠన సౌకర్యము:

ఈ గ్రంథాలయమునందు అంధులకు తగు వసతుల కల్పించవలయునను ప్రధానధ్యేయముతో, రాఘవరెడ్డిగారి పట్టుదలతో 1967 – 68 సం॥లో రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమునందు అంధులకొక ప్రత్యేక విభాగము నేర్పాటు చేయుట జరిగినది. 'అంధుల గ్రంథాలయ నిర్వహణాంశములందు శిక్షణ పొందు నిమిత్తము ఒక ఉపగ్రంథ పాలకుని ఢిల్లీ, డెహరాడూన్ మున్నగు పట్టణములలోని 'అంధుల గ్రంథాలయముల' కు పంపిరి. తెలుగు, ఆంగ్లము, హిందీ, మరాఠీ, మున్నగు భాషలయందు అంధులకు కావలసిన గ్రంథములు సేకరించబడినవి. నగరములోని అంధుల కిది మిగుల ప్రయోజనకరమయినది.

ఈ అంధుల గ్రంథాలయ విభాగ ప్రారంభోత్సవ సమయమున యీ విభాగ స్థాపనకు ప్రశంసనీయమైన కృషి సల్పిన శ్రీ రాఘవ రెడ్డిగారికి, అంధుడును పట్టభద్రుడునగు గౌసుద్దీన్ తదితరులు వారి కృతజ్ఞతల తెలియజేసి పలు విధముల కొనియాడిరి. గ్రంథాలయముల అభివృద్ధికి తగు సలహాల నొసగు నిమిత్తము 1962 సం॥ ఏర్పాటు చేయబడిన రాష్ట్ర గ్రంథాలయ సలహా సంఘ సభ్యులు కూడ రాఘవ రెడ్డిగారు కేంద్ర గ్రంథాలయమునందు ప్రవేశ పెట్టుచుండిన నవీన పద్ధతులకు నూతన విభాగముల ఏర్పాటుకు మిగుల హర్షించుచు సందర్భావసరములను బట్టి వారితో సలహా సంప్రదింపులు జరుపుచుండిరి.

## రాష్ట్ర కేంద్ర గ్రంథాలయాభివృద్ధి వివరములు:

1961 సం॥నుండి కాలక్రమేణ గ్రంథాలయముల పుస్తకముల కొనుగోలు నిధులు పెరుగుతూ వచ్చినవి. గ్రంథాలయమునకు కావలసిన పుస్తకముల సూచించు పుస్తక నిర్ణయ కమిటీలు ఆంగ్లము – తెలుగు– ఉర్దూ–హిందీ – మరాఠీ–కన్నడ మున్నగు భాషలయందు పాఠకులకు ప్రయోజనకరమైన పుస్తకముల సూచించు చుండినవి. ఆచూకీ పుస్తకముల కొనుగోలుకు కూడ తగు ప్రాధాన్యత చూపవలెనని సూచించబడినది.

1961 సం॥ నుండి పాఠకులు గృహములకు పుస్తకముల తీసికొని వెళ్ళి చదువుకొనెడి యవకాశమును పలువురు సద్వినియోగ పరచుకొనిరి. వారి సంఖ్య కాలక్రమేణా వృద్ధిచెందుచు వచ్చినది, గ్రంథాలయమునందు చదువుకొనెడివారి సంఖ్య 1961 సం॥ నుండి హెచ్చుతూ వచ్చినది. అదే విధముగా పాఠకులు అరువు తీసికొను పుస్తకముల సంఖ్య కూడ ప్రశంసనీయముగా పెరిగినది. రాఘవరెడ్డిగారిచే ప్రవేశ పెట్టబడిన ఈ పద్ధతులు ఈ నాటికిని పాఠకులకు మిగుల ప్రయోజనకరములుగా నున్నవి.



పాఠకుల అభిప్రాయములను తెలుసుకొంటున్న రాష్ట్ర కేంద్ర గ్రంథాలయ పత్రికా విభాగములో శ్రీ కె. రాఘవరెడ్డిగారు.

## రాష్ట్ర కేంద్ర గ్రంథాలయ నిర్వహణపై 'విలియంబెనెట్' ప్రశంస:

భారత దేశములోని అమెరికా సమాచార గ్రంథాలయాల డైరెక్టరుగారయిన శ్రీ విలియం డబ్ల్యు బెన్నెట్‌గారు మన దేశములోని వివిధ రాష్ట్రములలో గ్రంథాలయాలను సందర్శించుచూ వాటి అభివృద్ధిని పరిశీలించుచూ గ్రంథాలయాభివృద్ధిని సాధించిన మన ఆంధ్రప్రదేశ్‌నకు విచ్చేసి, రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమును తదితర గ్రంథాలయాలను సందర్శించిరి. మన రాష్ట్రమందు గ్రంథాలయాలు ప్రగతిమార్గ మధిరోహించుటకు కీలకపాత్ర వహించిన రాఘవరెడ్డి గారికి తాము 27—10—1967 న వ్రాసిన ఉత్తరమునందు —

"You have a dynamic programme of service to the People of Hyderabad and you are building a service throughout the state of Andhra pradesh."

అని శ్లాఘించి యున్నారు.

## రాష్ట్ర కేంద్ర గ్రంథాలయము ద్వారానే వర్గీకరణ సూచీకరణకు సూచన :

పుస్తకముల వర్గీకరణ–సూచీకరణ రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమునందు జరుపుటకు వెంటనే ప్రభుత్వ మంగీకరింపలేదు. రాఘవరెడ్డి గారు రాష్ట్ర కేంద్ర గ్రంథాలయ సమావేశములందును, గ్రంథాలయ సదస్సులయందును యీ విషయమై ప్రస్తావించుచు పుస్తక వర్గీకరణ–సూచీకరణ రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమునందే నిర్వహించుట మిగుల ప్రయోజనకరమని విశదీకరించుటయే గాక ప్రభుత్వమునకు కూడ పలుమార్లు యీ విషయమై నొక్కి చెప్పుచూ వచ్చిరి. 1964 సం॥ దీనికి సంబంధించిన రాష్ట్ర గ్రంథాలయ కమిటీ తీర్మానములను కూడ ప్రభుత్వదృష్టికి తెచ్చిరి. కాని ప్రభుత్వమిందులకు వెంటనే సుముఖతను చూపలేదు.

పరిశోధకులకు తగు సదుపాయాలను రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమునందు కల్పించవలెనని, డాక్యుమెంటేషన్‌కు సంబంధించిన కార్యక్రమములకు తగు ప్రాధాన్యత నివ్వవలెనని, రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమునందు డాక్యుమెంటేషన్ జాబితాలను తయారు చేయుటకై ఒక పుస్తక భాండాగారిని నియమించవలెనని, మైక్రోఫిల్మ్ సదుపాయాల కలుగజేయవలెనని, బాలలకు పఠనమునందు ఆసక్తిని పెంచుట కొఱకు అవలంబింపదగు పద్ధతులను తెలిసికొనుటకై రాష్ట్ర కేంద్ర గ్రంథాలయములో పరిశోధనావకాశము కల్పించవలెనని రాఘవరెడ్డిగారి యభిప్రాయము. రాష్ట్ర కేంద్ర గ్రంథాలయము పై విధులను సక్రమముగా నిర్వర్తించవలెనన్న సరిపడు నిధులను గూడ ప్రభుత్వము మంజూరు చేయవలసిన అవసరమెంతేని కలదు. నాల్గవ పంచవర్ష ప్రణాళిక డ్రాఫ్టునందు యీ విధుల నిర్వహణ నిమిత్తము తగిన నిధులు మంజూరు చేయబడునట్లు సూచింపబడినది.

కాని ప్రభుత్వము నిధులను మంజూరు చేయజాలక పోయినది. ప్రభుత్వమీనాటికైనను తగు గ్రాంట్లను మంజూరు చేసినచో రాష్ట్ర కేంద్ర గ్రంథాలయము తన విధులను ప్రయోజనకరముగా నిర్వహించుటకు వీలగును.

## రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమును, ఆచూకీ, పరిశోధన గ్రంథాలయముగా రూపొందించుటకు రాఘవరెడ్డిగారి సూచనలు:

హైదరాబాదు నగర గ్రంథాలయ సంస్థ నగరమునందు తగినన్ని శాఖా గ్రంథాలయములను స్థాపించి, వాటియందు పాఠకులకు కావలసిన పుస్తకములను ఉంచి, నరువిచ్చుచూ గ్రంథాలయాలనాకర్షణీయముగా తీర్చి దిద్ది వాటిని ప్రయోజనకరముగా నుండునట్లు చేసినచో, రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమునకు విచ్చేయు వారి రద్దీ పరిమితము కాగలదు. అప్పుడు యీ రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమును పరిశోధన, ఆచూకీ గ్రంథాలయముగా రూపొందించుటకు వీలేర్పడునని రాఘవరెడ్డిగారు సూచించిరి.

## ప్రభుత్వ ప్రాంతీయ గ్రంథాలయములు: ప్రాంతీయ గ్రంథాలయాల స్థాపన – ఉద్దేశ్యము :

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రము చాల విశాలమైనది. ఇందు రాష్ట్ర కేంద్ర గ్రంథాలయము ఒకటే యున్నచో అది తన విధులను సక్రమముగా నిర్వర్తింపజాలదు. ఈ గ్రంథాలయమునకు విచ్చేయు పాఠకుల సంఖ్య పెరిగినకొలది యీ గ్రంథాలయముయొక్క బాధ్యతలు కూడ కాలక్రమేణ పెరుగుచుండును. కాన, యీ బాధ్యతల భారమంతయు ఒక్క రాష్ట్ర కేంద్ర గ్రంథాలయముపై బడినచో ఆ విధుల నన్నింటిని రాష్ట్ర కేంద్ర గ్రంథాలయము సంతృప్తికరముగా నిర్వర్తింపవీలుపడదు. కావున, ప్రాంతీయ గ్రంథాలయములను స్థాపించి, రాష్ట్ర

కేంద్ర గ్రంథాలయము యొక్క విధుల కొన్నింటిని ప్రాంతీయ గ్రంథాలయముల కప్పగించి, వీటిని కూడ రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమువలె ఆచూకీ గ్రంథాలయములుగా రూపొందించు ధ్యేయముతో, పరిశోధకులకు తగు సౌకర్యముల కల్పించునట్లు చేసినచో రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమునకు విధుల భారము తగ్గుటచే, తన విధులను సంతృప్తికరముగా నిర్వహించుటకు వీలేర్పడునను ఆశయముతో ప్రాంతీయ గ్రంథాలయములు స్థాపింపబడినవి. ఈ ప్రాంతీయ గ్రంథాలయాల స్థాపనలో రాఘవరెడ్డిగారి కృషి ప్రశంసనీయము.

## ప్రాంతీయ గ్రంథాలయములయొక్క ప్రధాన విధులు :

రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమువలె ప్రాంతీయ గ్రంథాలయాలలో కూడ ఆచూకీ పుస్తకములు తగు సంఖ్యలో నుండవలెను. ప్రాచీన వాఙ్మయ, నాగరికత మున్నగు అంశములను తెలియజేయునటువంటి తాళపత్రములను సాధ్యమగు నంతవరకు సేకరించవలెను. ఈ గ్రంథాలయములందు కూడ తగు ఆచూకీ సేవ సదుపాయములను కలుగజేయవలెను. ఆయా ప్రాంతీయ గ్రంథాలయములు తమ ప్రాంత పరిధిలోని గ్రంథాలయములకు సంబంధించిన ప్రాంతీయ యూనియన్ గ్రంథసూచి (రీజనల్ యూనియన్ కేటలాగ్)ని తయారుచేయవలెను. ప్రాంతీయ గ్రంథాలయములు పుస్తకములను యితర గ్రంథాలయములను అరువు యిచ్చు పద్ధతులను ప్రవేశపెట్టవలెను. ఆయా ప్రాంతీయ గ్రంథాలయ పుస్తక భాండాగారి తన ప్రాంతములోని గ్రంథాలయోద్యోగులకు సాంకేతిక విషయములందు సలహాల నివ్వవలెను. ఈ గ్రంథాలయములు తమ పరిధిలోని గ్రంథాలయ విస్తరణ, అభివృద్ధి పథకముల రూపొందించుకొని తమ ప్రాంతములోని గ్రంథాలయములు సాధించిన ప్రగతిని నివేదిక ద్వారా డైరెక్టరుగారికి తెలియజేయుచుండవలెను.

## నాల్గవ పంచవర్ష ప్రణాళికలో ప్రాంతీయ గ్రంథాలయాల బడ్జెట్ కేటాయింపునకై సూచనలు:

ప్రాంతీయ గ్రంథాలయాలు తమ విధులను సక్రమముగా నిర్వహించుటకు ఈ క్రింది కార్యక్రమముల నిమిత్తము పదిలక్షల రూపాయల మొత్తమవసరమని నాల్గవ పంచవర్ష ప్రణాళిక డ్రాఫ్టునందు సూచింపబడినది.

1. ప్రాంతీయ గ్రంథాలయాలకు కావలసిన భవన నిర్మాణము, పరికరముల కొనుగోలు.

2. గ్రంథాలయములందు పరిశోధన, పరిశీలన సదుపాయములను కల్పించుట.

3. ఆధునిక సదుపాయముల విస్తారముగా ప్రవేశపెట్టుట.

ప్రభుత్వము పై గ్రాంట్లను మంజూరు చేయుట కంగీకరించినది. ఇందులకు రాఘవరెడ్డిగారు మిగుల సంతసించిరి. 1969 లో రాఘవ రెడ్డిగారు పదవీ విరమణ జేసిన యనంతరము ఆర్థిక, పరిస్థితులవలన ప్రభుత్వము తగిన గ్రాంట్లను మంజూరు చేయుటకు వీలులేకపోయినది. ఈ విధముగా ప్రభుత్వము ప్రాంతీయ గ్రంథాలయములకు నిధుల మంజూరు చేయజాలక పోయినప్పటికి కొన్ని ప్రాంతీయ గ్రంథాలయములు మాత్రము తమ విధులను సంతృప్తికరముగా నిర్వహించు కొనగల్గినవని చెప్పవచ్చును. వాటిలో గుంటూరు ప్రాంతీయ గ్రంథాలయమును ప్రధానముగా పేర్కొనవచ్చును.

## ప్రభుత్వ ప్రాంతీయ గ్రంథాలయము - గుంటూరు:

ఆంధ్ర రాష్ట్రావతరణానంతరము 1954 సం॥ విశాఖపట్టణమునందు ఆంధ్ర రాష్ట్ర కేంద్ర గ్రంథాలయము స్థాపింపబడినది.

1956 సం॥ ఆంధ్రప్రదేశ్ అవతరణానంతరము హైదరాబాదులోని అసఫియా గ్రంథాలయమును రాష్ట్ర కేంద్ర గ్రంథాలయముగా ప్రకటించిరి. విశాఖపట్టణములోని రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమును 1958 సం॥ గుంటూరుకు తరలించి ప్రాంతీయ గ్రంథాలయముగా రూపొందించుట జరిగినది.

ఆంధ్రప్రదేశ్ లోని ఐదు ప్రాంతీయ గ్రంథాలయాలలో గుంటూరు ప్రాంతీయ గ్రంథాలయము పెద్దదగుటయేగాక ఈ గ్రంథాలయము స్వంత భవనమును కల్గియుండుట గుర్తించదగ్గ విషయము. ఈ గ్రంథాలయమునకు మంజూరగు నిధులు కూడ యితర ప్రాంతీయ గ్రంథాలయము కన్న హెచ్చు. అన్ని విధముల అనుకూల వాతావరణమును కల్గియున్నటువంటి గుంటూరు ప్రాంతీయ గ్రంథాలయము తన విధులను సంతృప్తికరముగా నిర్వహింప గల్గినదని చెప్పవచ్చును.

## గుంటూరు ప్రభుత్వ ప్రాంతీయ గ్రంథాలయము నిర్వహించిన కొన్ని ప్రధాన విధులు:

1. ఆచూకీ పుస్తకములను విరివిగా లభింపజేయడం జరిగినది. పరిశోధకులకు కావలసిన సదుపాయములు కల్పించుట జరిగినది. ఈ సదుపాయములను కలుగజేయుట వలన వివిధ పోటీ పరీక్షలయందు విజేతలయిన వారిలో గుంటూరుకు చెందిన వారి సంఖ్య అధికముగా నుండుట విశేషము. తెలుగునందు 'యూనియన్ కేటలాగ్'ను, 'బాలసాహితీమాల'ను తయారు చేయు బాధ్యతను కూడ గుంటూరు ప్రాంతీయ గ్రంథాలయమున కప్పగించుట జరిగినది.

ఆంధ్ర ప్రాంతములోని జిల్లా కేంద్ర గ్రంథాలయాల తనిఖీ అధికారిగా గుంటూరు ప్రాంతీయ గ్రంథాలయ పుస్తక భాండాగారిని నియమించుట జరిగినది. వీరు జిల్లా కేంద్ర గ్రంథాలయాల తనిఖీ

సమయమున గ్రంథాలయోద్యోగులకు కావలసిన సాంకేతిక సలహాల నొసగుచుండిరి. జిల్లా కేంద్ర గ్రంథాలయోద్యోగులు పుస్తకముల నరువు తీసికొనుటకో లేక యితర కార్యముల నిమిత్తమో ప్రాంతీయ గ్రంథాలయమునకు వెళ్ళినచో ఆ సమయమున కూడ ప్రాంతీయ గ్రంథాలయ పుస్తక భాండాగారి, వారు గ్రంథాలయాల అభివృద్ధికి అవలంబించవలసిన మార్గముల గురించి సూచన లిచ్చుచుండెడివారు. గ్రంథపాలకులయిన నారాయణరెడ్డిగారు మఱియు సత్యంగారు గ్రంథాలయములకు విచ్చేయు పాఠకులకు కావలసిన సహాయము నందించుచుండిరి.

నవీన దృశ్యశ్రవణ పరికరములను కూడ గుంటూరు ప్రాంతీయ గ్రంథాలయమున కిచ్చుట జరిగినది. వీటిని గుంటూరు ప్రాంతీయ గ్రంథాలయము చాలవరకు సద్వినియోగ పరచుకొన్నది. పుస్తకముల నరువిచ్చు పద్ధతులను ప్రవేశ పెట్టుటయేగాక పుస్తక ప్రదర్శనములను కూడ పెక్కింటిని ఈ గ్రంథాలయము నిర్వహించుచుండినది.

గుంటూరు ప్రాంతీయ గ్రంథాలయము సాధారణ పౌర గ్రంథాలయ విధులను కూడ కొన్నింటిని నిర్వహింపవలసి వచ్చినది. ఇందులకు కారణములు లేకపోలేదు. గుంటూరు పట్టణము విస్తీర్ణములో చాల పెద్దది. ఈ గ్రంథాలయమునకు విచ్చేయు పాఠకుల సంఖ్య కూడ ఎక్కువగా నుండినది. గుంటూరులోని జిల్లా కేంద్ర గ్రంథాలయములోని పుస్తకముల సంఖ్య తక్కువ. ఈ గ్రంథాలయమున లేని పుస్తకములు కూడ గుంటూరు ప్రాంతీయ గ్రంథాలయము నందుండినవి. కావున గుంటూరు ప్రాంతీయ గ్రంథాలయము, జిల్లా కేంద్ర గ్రంథాలయమునకు వెళ్లవలసిన పాఠకులకుకూడ ప్రవేశమును కల్పించి వారికి కావలసిన పుస్తకముల నందించుచు అరువు కూడ యిచ్చుచుండినది. అంతేగాక సాధారణ పౌర గ్రంథాలయాలు నిర్వహించు సమావేశములు, చర్చలు, సదస్సులు నిర్వహించుటకు కూడ జిల్లా

కేంద్ర గ్రంథాలయమునందు చాలినంత స్థలములేని కారణమున యిటువంటి కార్యక్రమములను గూడ గుంటూరు ప్రాంతీయ గ్రంథాలయమున అప్పుడప్పుడు నిర్వహించవలసి వచ్చినది.

ప్రభుత్వ ప్రాంతీయ గ్రంథాలయమునందు పత్రికల విభాగము, వయోజన విద్యా విభాగము, పుస్తకముల అరువిచ్చు విభాగము, ఆచూకీ విభాగము, బాలల విభాగము మున్నగు వాటిని ప్రవేశపెట్టుటయే గాక స్వేచ్ఛోపలబ్ధి పద్ధతిని ప్రవేశపెట్టి పాఠకుల కందుబాటున పుస్తకములు యుండునట్లు అమర్చుట జరిగినది. అరువిచ్చు విధానమున టిక్కెట్టు పద్ధతిని కూడ ప్రవేశపెట్టుట జరిగినది. ఈ ప్రాంతీయ గ్రంథాలయము రాష్ట్రములోని యితర గ్రంథాలయముల వలెనే డ్యూయీ దశాంశ వర్గీకరణము ననుసరించుచూ వచ్చినది. వర్గీకృత పుస్తకసూచిని ఈ గ్రంథాలయములో ప్రవేశపెట్టి యుండిరి. అట్లుగాక ప్రస్తుతము తయారుచేసికొనియున్న వర్గీకృత పుస్తక సూచీని నిఘంటు సూచిగా రూపొందించుకొనవలెనని రాఘవరెడ్డిగారు ప్రాంతీయ గ్రంథాలయాధికారికి సూచించెడివారు.

1968 సం॥ గుంటూరులోని అమెరికా సమాచార విభాగపు గ్రంథాలయ సెంటరును మూసివేయు సందర్భమున ఆ గ్రంథాలయ అధికారులు ఆ సెంటరు నందున్న పుస్తకములను ప్రాంతీయ గ్రంథాలయమునకు విరాళముగా నిచ్చిరి. ఇవి ప్రయోజనకరమయిన పుస్తకములు కావని కొందరభిప్రాయపడగా రాఘవరెడ్డిగారు పుస్తకములను స్వయముగా పరిశీలించి ఇవి మిగుల ప్రయోజనకర మయినవని తెలియజేసి వాటిని ప్రాంతీయ గ్రంథాలయము నందొక ప్రత్యేక విభాగము క్రింద అమర్చిరి.



**గుంటూరులో అమెరికా సమాచారశాఖవారు తమ గ్రంథాలయ సెంటర్‌ను మూసి వేసి అందలి గ్రంథములను గుంటూరు ప్రాంతీయ గ్రంథాలయమునకు విరాళముగా యిచ్చినప్పుడు తీసిన ఛాయా చిత్రము.**

ప్రాంతీయ గ్రంథాలయములలో కెల్ల గుంటూరు ప్రాంతీయ గ్రంథాలయమునకు మంజూరు కాబడు నిధు లెక్కువగుటచే గ్రంథాలయములోని పుస్తకముల సంఖ్య కూడ ఎక్కువయినది. తత్కారణమున గ్రంథాలయమునకు విచ్చేయు పాఠకుల సంఖ్య గ్రంథాలయము నుండి అరువు కొని పోబడు పుస్తకముల సంఖ్య కూడ పెరిగినది. ఈ విధముగా గుంటూరు ప్రాంతీయ గ్రంథాలయము గుంటూరు పట్టణవాసులకు మిగుల ప్రయోజనకరముగా ఉపయోగపడుచున్నది. గుంటూరు లోకల్ లైబ్రరీ అథారిటీ గుంటూరు పట్టణమునందు సాధారణ పాఠకులను కూడ ఆకట్టుకొనులాగున తగినన్ని గ్రంథాలయములను స్థాపించినచో గుంటూరు ప్రాంతీయ గ్రంథాలయమును ఆచూకీ పరిశోధక గ్రంథాలయముగా నిర్వహించుటకు వీలేర్పడును.

## ఇతర ప్రభుత్వ ప్రాంతీయ గ్రంథాలయాలు:

9—1—1964 న తిరుపతి ప్రాంతీయ గ్రంథాలయమును, 4—2—1964 న వరంగల్లు ప్రాంతీయ గ్రంథాలయమును, 6–9–1965 న విశాఖపట్టణ ప్రాంతీయ గ్రంథాలయమును, 4—8—1966 న నిజామాబాదు ప్రాంతీయ గ్రంథాలయమును ప్రారంభించుట జరిగినది. ఈ నాలుగు ప్రాంతీయ గ్రంథాలయములు అద్దె భవనము లందున్నవి. ఈ భవనములలో తగిన స్థలము లేనందున ఆధునిక పద్ధతులందు గ్రంథాలయ విధులను నిర్వహింపజేయుటకు అనుకూలములు లేవు. ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ చట్టమునందు ప్రాంతీయ గ్రంథాలయాల విధులు సూచించబడి యుండినచో మిగుల ప్రయోజనకరముగా నుండెడిదని చెప్పవచ్చును.

ఈ నాలుగు ప్రాంతీయ గ్రంథాలయములు పెద్ద పట్టణములందున్నవి. ఇవి తమ తమ పట్టణ ప్రాంత పరిధిలోని పౌర గ్రంథాలయాలలో లేని అమూల్యమయిన పుస్తకములను, సాంకేతిక పరిశోధనా సంబంధిత పుస్తకములను సేకరించి ఆయా ప్రాంత పౌర గ్రంథాలయములకు ప్రయోజనకరముగా నుండుటయేగాక ఆయా పట్టణములలోని కళాశాల, విశ్వవిద్యాలయ విద్యార్థులకు, పరిశోధకులకు కొంత వరకు వసతుల కలుగ జేసినవి. ఈ విధమయిన వసతులు కలుగజేయుటలో తిరుపతి, వరంగల్లు ప్రాంతీయ గ్రంథాలయములు ప్రధాన పాత్ర వహించినవని చెప్పవచ్చును. ఈ రెండు ప్రాంతీయ గ్రంథాలయములకు ప్రభుత్వము 1966—67 సం॥ రేడియోలను, చలనచిత్ర పరికరములను పంపిణీ చేసినది.

ఇతర గ్రంథాలయములకు పుస్తకముల అరువిచ్చు పద్ధతులను కూడ ఈ నాలుగు ప్రాంతీయ గ్రంథాలయములు అవలంబించినవి. తిరుపతి ప్రాంతీయ గ్రంథపాలకులు సందర్భావసరములనుబట్టి మదరాసు

లోని అమెరికా సమాచార విభాగ గ్రంథాలయ సెంటరునుండి కూడ కావలసిన పుస్తకముల నరువు పొందు చుండెడివారు. ప్రాంతీయ గ్రంథాలయములకు వెళ్లెడు పౌర గ్రంథాలయముల గ్రంథపాలకులకు కూడ ఆయా ప్రాంతీయ గ్రంథాలయ పుస్తక భాండాగారులు వారికి కావలసిన సాంకేతిక సలహాల నొసగు చుండెడివారు.

రాఘవరెడ్డిగారు తిరుపతి విశ్వవిద్యాలయమునందు గ్రంథాలయశాఖ అధికారిగా నుండెడి కాలమున గ్రంథాలయ శాస్త్ర విద్యార్థులను ప్రాంతీయ గ్రంథాలయమునకు తీసికొని వెళ్ళుచుండిరి. ఆ సమయమున ప్రాంతీయ గ్రంథాలయ పుస్తక భాండాగారులు విద్యార్థులకు వర్గీకరణ - సూచీకరణలకు సంబంధించిన సాంకేతిక విషయములను గురించి విశదీకరించుచుండిరి, ఈ నాలుగు ప్రాంతీయ గ్రంథాలయములు అప్పుడప్పుడు పుస్తకప్రదర్శనములను కూడ నిర్వహించుచుండినవి.

ఈ విధముగా ప్రాంతీయ గ్రంథాలయములు తమ ముఖ్య విధులను నిర్వహించుటయేగాక సాధారణ పౌర గ్రంథాలయ విధులను కూడ కొన్నింటిని నిర్వహించ వలసిన అవసరమేర్పడినది.

పత్రికల విభాగము, పాఠ్యపుస్తకముల విభాగము, పుస్తకముల నరువిచ్చు విభాగము, వయోజన విద్య విభాగము, గ్రంథసూచి విభాగము, బాలల విభాగము మున్నగు విభాగములను కూడ ప్రాంతీయ గ్రంథాలయములు ఏర్పరచినవి. ప్రాంతీయ గ్రంథాలయములలో స్వేచ్ఛోపలబ్ధిపద్ధతిని ప్రవేశపెట్టిరి. విద్యావంతులకేగాక నిరక్షరాస్యులకు కూడ ఈ గ్రంథాలయములు సమావేశముల నేర్పాటుచేయుచుండినవి. చలనచిత్ర ప్రదర్శనములను, పిల్లల కార్యక్రమములను, వయోజన విద్యాకార్యక్రమములను మున్నగువాటిని

కూడ ఈ ప్రాంతీయ గ్రంథాలయములు నిర్వహించు చుండినవి. జాతీయ గ్రంథాలయ వారోత్సవములలో కూడ ఆయా గ్రంథాలయములలో గల పుస్తకములను గురించి వాటి పఠనావశ్యకతను గురించి అన్ని ప్రాంతీయ గ్రంథాలయములలోను చక్కగా ప్రచారము జరుగుచుండినది.

ఈ విధముగా ప్రాంతీయ గ్రంథాలయములు కేవలము తమ విధులనేగాక సాధారణ పౌర గ్రంథాలయముల విధులను కూడ కొంతవరకు నిర్వహించుటకు కారణములు లేకపోలేదు. ప్రాంతీయ గ్రంథాలయములన్నియు పెద్దపట్టణము లందున్నది. ఈ గ్రంథాలయాలకు సమీపమున వసించు పాఠకులు తమకు కావలసిన పుస్తకములు జిల్లా కేంద్ర, శాఖాగ్రంథాలయము లందుండినను అవి కొంత దూరమున నుండుటచే తమకు సమీపమునగల ప్రాంతీయ గ్రంథాలయము నుండియే పుస్తకముల నరువు పొందవలయునని కోరెడివారు. అట్టి పరిస్థితులలో ప్రాంతీయ గ్రంథపాలకులు విముఖతను చూపుటకు వీలులేకపోయినది. ఈ పెద్దపట్టణములలో పెద్ద కళాశాల లుండుటచే ఆ కళాశాలల విద్యార్థులకు కావలసిన పుస్తకములు ఆయా ప్రాంతము లందలి సాధారణ పౌర గ్రంథాలయములందు తగుసంఖ్యలో లేనందున అట్టి పుస్తకముల కల్గినటువంటి ప్రాంతీయ గ్రంథాలయములు గ్రంథ సేవ నిమిత్తము ఆ కళాశాలల విద్యార్థులకు, అరువిచ్చు చుండినవి. ఈ పట్టణములలోని సాధారణ పౌర గ్రంథాలయముల భవనములందు తగు వసతులు లేని కారణంగా అవి నిర్వహించవలసిన గ్రంథాలయ సమావేశములు, వయోజన విద్యా కార్యక్రమములు, బాలల కార్యక్రమములు మున్నగు విధుల నిర్వహించుటకు స్థలము లేమిచే ప్రాంతీయ గ్రంథాలయములం దీవిధుల నిర్వహింపజేయుట జరిగినది.

ఈ నాలుగు ప్రాంతీయ గ్రంథాలయము లున్న పట్టణములలోని ఇతర పౌర గ్రంథాలయములందు పాఠకుల కవసరమయిన పుస్తక

ములు తగినన్ని ప్రవేశ పెట్టవలసిన యావశ్యకత, ఆ పట్టణములందు నూతనముగా శాఖా గ్రంథాలయములను స్థాపించవలసిన ఆవశ్యకత ఎంతేని కలదు. అంతేగాక ఈ పౌర గ్రంథాలయముల భవనములను తగు రీతిగా మార్పుచేసి అందే వయోజన విద్యా కార్యక్రమములను, బాలల కార్యక్రమములను తదితర పౌర గ్రంథాలయ కార్యక్రమములను ఏర్పాటుచేసి తగు సదుపాయముల కల్పించినచో ప్రాంతీయ గ్రంథాలయములకు విచ్చేయు పాఠకుల సంఖ్య కూడ పరిమితము కాగలదు. మరియు ప్రధానముగా జిల్లా కేంద్ర, శాఖా గ్రంథాలయములకు ప్రభుత్వము తగిన గ్రాంట్లను మంజూరు చేయవలెను. ప్రభుత్వము గ్రంథాలయ భవనముల నిర్మాణమునకు, పుస్తకముల కొనుగోలుకు తగు నిధులను మంజూరు చేసినచో సాధారణ పౌర గ్రంథాలయములు తమ విధులను తమ గ్రంథాలయముల యందే నిర్వహించు కొనుటకు వీలేర్పడును. ప్రాంతీయ గ్రంథాలయాలకు విచ్చేయు సాధారణ పాఠకుల సంఖ్య కూడ పరిమిత మగుటచే అవి పరిశోధక ఆచూకీ గ్రంథాలయములుగా రూపొందించుటకు వీలేర్పడును.

## సంచార గ్రంథాలయము : ఏలూరు:

గ్రామీణ ప్రజలకు కూడ గ్రంథ పఠన వసతులు కలుగజేయవలెనను ఉద్దేశ్యముతో 1956 సం॥నందు ఏలూరు నందొక సంచార గ్రంథాలయమును స్థాపించుట జరిగినది. ఒక మోటారు వ్యాను లోపలి భాగమున మూడు వైపుల సులభముగా తీసికొనుటకు వీలుగా నుంచునట్లు 2000 పుస్తకము లమర్చబడినవి. గ్రామస్థులు వ్యానులోనికి వెళ్ళి వారికి కావలసిన పుస్తకములను సులభముగా ఎన్నుకొని తీసికొనగలుగుటకు వీలైనది.

ఈ విధముగా 2000 పుస్తకము లమర్చబడి నటువంటి ఈ వ్యాను ప్రతి గ్రామమునందును కొంత కాలము నిలచియుండును.

ఆ సమయమున గ్రామస్థులు వారు తీసికొని యుండిన పుస్తకములను తిరిగి యిచ్చి క్రొత్త పుస్తకములను తీసికొనుచుందురు. గ్రామీణ ప్రాంతములోని గ్రంథాలయాలకు కావలసిన పుస్తకములను జిల్లా కేంద్ర గ్రంథాలయము నుండి గొనిపోవు అవకాశముకూడ ఈ సంచార శకటముద్వారా కల్పించుట జరిగినది. ఈ సంచార గ్రంథాలయ పుస్తక భాండాగారి గ్రామీణ ప్రాంతములలోని గ్రంథాలయములకు వెళ్ళి గ్రంథ పాలకులకు కావలసిన సాంకేతిక సలహాలను కూడ నిచ్చుచుండెడివారు. వ్యాను నందు ఫిల్ము ప్రొజెక్టరు కూడ అమర్చబడి యుండినవి. ఈ వ్యాను పగలంతయు పీలైనన్ని గ్రామములకు వెళ్ళి ఆ గ్రామస్థులకు కావలసిన పుస్తకముల నందించుటయే గాక చీకటి పడుసరికి ఏ గ్రామము చేరునో ఆ రాత్రికి ఆ గ్రామమునందే నిలచి ఆ గ్రామస్థులకు చలనచిత్ర ప్రదర్శనములను, టేప్ రికార్డరు ద్వారా సమాచార, సంగీత, మున్నగు కార్యక్రమములను ఏర్పాటు చేసెడివారు. ఈ సంచార గ్రంథాలయము ద్వారా గొప్ప గ్రంథాలయ సేవ చేయుటకు వీలయినది,

ఇట్టి సంచార గ్రంథాలయములను ప్రతి జిల్లా యందును ప్రవేశ పెట్టవలెనని రాఘవరెడ్డిగారి యభిప్రాయము. నాల్గవ పంచవర్ష ప్రణాళికయందు కూడ యీ విషయమై ప్రస్తావించి యున్నారు.

28—2—1964 న రాష్ట్ర గ్రంథాలయ కమిటీ కూడ యీ ప్రకారము ప్రతి జిల్లాయందును సంచార గ్రంథాలయములను స్థాపించవలెనని తీర్మానించినది. అయినప్పటికిని ఆర్థిక యిబ్బందుల వలన వీటి ఏర్పాటుకు ప్రభుత్వము తగిన గ్రాంట్లు మంజూరు చేయలేక పోయినది.



# పౌర గ్రంథాలయములు :
# గ్రంథాలయ శాస్త్ర శిక్షణలో ఆంధ్రప్రదేశ్ ముందంజ :

## రాఘవరెడ్డిగారికి విద్యార్థి దశలో గ్రంథాలయాలపై ఆసక్తి :

రాఘవరెడ్డిగారు తమ ప్రాథమిక విద్యాభ్యాస కాలమున స్వంతగ్రామమైన చిత్తూరు జిల్లాకు చెందిన పట్నం గ్రామమునందు 1924–26 సం॥లలో 4, 5 తరగతులు చదువుకొనుచుండినపుడు ఆ పాఠశాలలోని గ్రంథాలయమునకు అజమాయిషీ వహించిరి. బాల్యమునుండి విద్యాభిమానులగుటచే వారికీ బాధ్యతల నప్పగించడము జరిగినది. ఆ గ్రంథాలయమునందు సుమారు వంద పుస్తకము లుండినవి; ఈ పుస్తకములను అంశప్రాధాన్యమునుబట్టి విభజించి బీరువాల యందు అమర్చవలసినదిగా ఆ పాఠశాల ప్రధానోపాధ్యాయులు రాఘవరెడ్డిగారి నాదేశించిరి. ఈ విధముగా అమర్చునపుడు అమరికలో కల్గిన లోటుపాట్లను ప్రధానోపాధ్యాయులు సరిదిద్దుచూ రాఘవరెడ్డిగారికి తగు సూచనల నిచ్చుచుండిరి. విషయప్రాధాన్యమును బట్టి పుస్తకముల వర్గీకరించు పద్ధతిని రాఘవరెడ్డిగారికి సూచించినవారు ఆ ప్రాథమిక పాఠశాల ప్రధానోపాధ్యాయులైన శ్రీ మురుగేశం గారే.

1930 లో రాఘవరెడ్డిగారు చిత్తూరు జిల్లా బోర్డు ఉన్నత పాఠశాలయందు 9 వ తరగతి చదువుకొనుచున్న కాలమున వారి ఉపాధ్యాయులైన శ్రీ ఎమ్. సి. శేషాచలంగారు 9 వ తరగతి గ్రంథాలయమునకు అజమాయిషీదారుగా రాఘవరెడ్డిగారిని నియమించిరి. రాఘవరెడ్డిగారు 9 వ తరగతి విద్యార్థులు గ్రంథాలయము నుండి

కొనిపోవు పుస్తకముల, వాపసు పొందు పుస్తకముల వివరములను ఒక రిజిష్టరునందు శ్రీ ఎమ్. సి. శేషాచలంగారి సూచనల మేరకు వ్రాయుచుండిరి. ఈ విధముగా వ్రాయునప్పుడేవేని దోసగు లేర్పడిన శ్రీ ఎమ్. సి. శేషాచలంగారు వానిని సవరించుచూ శ్రీ రాఘవ రెడ్డిగారికి తగు తర్ఫీదు లిచ్చుచుండిరి. ఈ గ్రంథాలయము నందలి పుస్తకముల సంఖ్య మాత్రము చాల తక్కువ.

## కన్నెమారా పౌర గ్రంథాలయములో రాఘవరెడ్డిగారి అనుభవము:

1935 సం॥ కన్నెమారా పౌరగ్రంథాలయమున శ్రీ రాఘవరెడ్డిగారు సహాయకులుగా నియమితులైరి. ఆనాడు యువకులు ఉత్సాహవంతులైన శ్రీ రాజాబాదర్‌గారు - శ్రీ స్వామినాథన్‌గారు కూడ కన్నెమారా పౌర గ్రంథాలయమునందు సహాయకులుగా పని చేయుచుండిరి. వీరు గ్రంథాలయ పాఠకులకు కావలసిన సమాచారము నందించుటలో మిగుల ఉత్సాహముతో వ్యవహరించుచుండిరి. వీరు గ్రంథాలయములోని వివిధ భాగములందలి కార్యకలాపములను గురించి రాఘవరెడ్డి గారికి అవసరమున్నప్పుడు విశదీకరించుచుండిరి. గ్రంథాలయ సక్రమ నిర్వహణకు గ్రంథాలయ శాస్త్ర శిక్షణ ఎంతో అవసరమని వీరు రాఘవరెడ్డి గారికి తెలియజేసెడివారు.

1931 సం॥ నుండి 1937 సం॥ వరకు మదరాసులో క్రైస్తవ కళాశాలలోను, ప్రెసిడెన్సీ కళాశాలలోను విద్య నభ్యసించు కాలమున తరచుగా మదరాసు విశ్వవిద్యాలయ గ్రంథాలయమునకు రాఘవరెడ్డిగారు వెళ్ళుచుండెడివారు. విశ్వవిద్యాలయ గ్రంథాలయ కార్యకర్తలలో గొప్ప వారైన, గ్రంథాలయ నిర్వహణాంశములందు మంచి అనుభవజ్ఞులయిన శ్రీ ఎమ్. శివరామన్‌గారు గ్రంథాలయమునకు విచ్చేయు పాఠకులకు మిగుల ప్రయోజనకరమైన పుస్తకముల

నందించుచు, వారికి పఠనమునందు మిగుల ఆసక్తిని కల్గించెడివారు. వీరు రాఘవరెడ్డిగారికి కావలసిన పుస్తకములను కూడ యిచ్చుచు గ్రంథాలయములపై వారికి కల అభిమానమున కానందపడి గ్రంథాలయ సేవ చేయుటకు గ్రంథాలయ శాస్త్రమునందు శిక్షణ పొందవలసిన అవసరము ఎంతో కలదని వివరించెడి వారు.

రాఘవరెడ్డిగారు చిత్తూరు జిల్లా బోర్డు ఉన్నతపాఠశాలయందు విద్య నభ్యసించు కాలమున జనార్దనంనాయుడుగారు ఆ పాఠశాల ప్రధానోపాధ్యాయులుగాను డిరి. కొంతకాలమునకు మదరాసు రాష్ట్ర ప్రభుత్వము వీరిని కన్నెమారా పౌర గ్రంథాలయ పుస్తక భాండాగారిగా నియమించినది. జనార్దనంనాయుడుగారు కన్నెమారా పౌర గ్రంథాలయమున పుస్తక భాండాగారిగా నున్న కాలమున రాఘవరెడ్డిగారు యీ గ్రంథాలయమున 1935 సం॥లో కొంతకాలము సహాయకులుగా పని చేసిరి. ఆ సందర్భమున జనార్దనంనాయుడుగారు గ్రంథాలయ భవనములు తగు విశాలముగా నున్నప్పటికిని పాఠకులకు ప్రయోజనకరముగా గ్రంథాలయ సేవ చేయవలెనన్న గ్రంథాలయ శాస్త్ర శిక్షణ పొందడము అత్యవసరమని రాఘవరెడ్డిగారికి గ్రంథాలయ శాస్త్ర శిక్షణావశ్యకత ప్రయోజనముల గురించి విపులీకరించుచుండిరి. కేవలము విశ్వవిద్యాలయ గ్రంథాలయమునకు మఱియు కన్నెమారా ప్రభుత్వ గ్రంథాలయమునకు మాత్రమే గాక మదరాసు నందలి యితర గ్రంథాలయములకు కూడ వెళ్ళి అచ్చటి గ్రంథపాలకులతో చర్చించి గ్రంథాలయ నిర్వాహణాంశముల గ్రహించవలసినదని జనార్దనంనాయుడుగారు రాఘవరెడ్డిగారిని కోరగా, రాఘవరెడ్డిగారు విరామకాలమునందు మదరాసు నగరమునందలి పెక్కు యితర గ్రంథాలయములను కూడ సందర్శించి అచటి గ్రంథపాలకులతో చర్చలు జరిపి ఆ గ్రంథాలయములు పనిచేయు తీరుతెన్నులను చక్కగా గ్రహించుచుండిరి. ఈ అనుభవములను గడించిన యనంతరము వారికి గ్రంథాలయ శాస్త్ర శిక్షణ పొందవలెనని కోరిక కల్గినది.

## పాఠశాలల గ్రంథాలయాల నిర్వహణకు సూచన :

ఆ రోజులలో గ్రంథాలయములకు ప్రభుత్వము తగు గ్రాంట్లను మంజూరు చేసెడిదికాదు. గ్రంథాలయములందు ఉద్యోగావకాశములుగూడ చాల తక్కువగా నుండెడివి. కావున రాఘవరెడ్డిగారు విద్యాశాఖలో చేరవలసి వచ్చినది. అప్పటి విద్యాశాఖ డైరెక్టరయిన సర్. ఎమ్. స్టాథమ్‌గారు పాఠశాలల తనిఖీ అధికారుల నియామక పోటీకి పెక్కురు హాజరయినప్పటికి, రాఘవరెడ్డిగారిని డైరెక్ట్ రిక్రూట్‌మెంటుద్వారా ఎన్నుకొని పాఠశాలల తనిఖీ అధికారిగా నియమించిరి. 1941 సం॥ నుండి 1947 సం॥వరకు రాఘవరెడ్డిగారు తూర్పుగోదావరి, గుంటూరు, చిత్తూరు జిల్లాలలో పాఠశాలల తనిఖీ అధికారిగా పదవీ బాధ్యతల నిర్వహించిరి. ఆ రోజులలో కొన్ని ప్రాథమిక పాఠశాలలందుమాత్రము గ్రంథాలయము లుండినవి. మదరాసునందు గ్రంథాలయముల నిర్వహణా విధానమును గురించి చక్కగా గ్రహించియుండిన రాఘవరెడ్డిగారు పాఠశాలలకు తనిఖీకి వెళ్ళినపుడు ఉపాధ్యాయులకు గ్రంథాలయ నిర్వహణ గురించి తెలియజేసెడివారు. పంచాయతీ అధికారులను కలుసుకొని ప్రతి పంచాయతి ఒక గ్రంథాలయమును స్థాపించవలెనని ఆ అధికారులకు సూచించెడివారు. కాకినాడ, గుంటూరుజిల్లా విద్యాశాఖాధికారులతో, ఉన్నతపాఠశాలలకు తనిఖీకి వెళ్ళినపుడు ఆ పాఠశాలల ఉపాధ్యాయులకు బోధనాపద్ధతుల గురించియే గాక, గ్రంథాలయ నిర్వహణాంశముల గురించి కూడ సలహాలనిచ్చుచూ గ్రంథాలయాభివృద్ధి కార్యక్రమములు, వాటి ఆవశ్యకతను గురించి ప్రధానముగా తెలియజేయుచుండిరి. గ్రంథాలయ శాస్త్రమున శిక్షణ పొందవలసినదిగా పాఠశాలలో పని చేయు శిక్షణ పొందని గ్రంథపాలకులకు తెలియజేసెడివారు. కాని ఆ రోజులలో గ్రంథాలయములందు ఉద్యోగావకాశములు చాల తక్కువ, గాన

గ్రంథాలయ శాస్త్రమునందు శిక్షణ పొందుటకు పాఠశాలల అధి కారులు తగు ఉత్సాహము చూపలేదు.

### మదరాసు గ్రంథాలయ సంఘ సభ్యులతో పరిచయము:

1949 సం॥ విద్యాశాఖ డైరెక్టరు, రాఘవరెడ్డిగారిని తన కార్యాలయము నందలి చలనచిత్ర విభాగమున కధికారిగా నియ మించిరి. ఈ అధికార బాధ్యతలను చక్కగా నిర్వర్తించ వలెనన్న గ్రంథాలయ నిర్వహణ యందనుభవము మఱియు చలన చిత్రముల గురించి చక్కని విజ్ఞానము కలిగి యుండడము మిక్కిలి అవసరము. కాన యీ విషయములందు మంచి అనుభవము కల్గిన రాఘవరెడ్డి గారికే బాధ్యతల నప్పజెప్పడము జరిగినది. ఈ బాధ్యతల స్వీకర ణానంతరము రాఘవరెడ్డిగారు తాను మదరాసు నగరము నందు 1949 సం॥నకు మునుపు సందర్శించి యుండిన గ్రంథాలయములకు అప్పుడప్పుడు వెళ్ళి అవి సాధించిన ప్రగతిని గురించి తెలిసికొను చుండిరి. మదరాసు గ్రంథాలయ సంఘ సభ్యులతో తరచుగా సంప్ర దించుచుండెడి వారు. గ్రంథాలయ సంఘ సభ్యులు కూడ శ్రీ రాఘవ రెడ్డిగారికి పరిచితులైరి. ఆ సభ్యులలో గ్రంథాలయోద్యమమున చాల చురుకుగా పాల్గొను చుండెడి వారైన ఎన్. ఎమ్. ఫాసిల్ గారు ముఖ్యులు. వీరు విద్యాశాఖలో పని చేయు పట్టభద్రులకు గ్రంథాలయ శాస్త్రమున శిక్షణ పొందుటకు తగు ఉత్సాహమును కల్పించవలసినదిగా రాఘవరెడ్డి గారిని కోరెడివారు.

### దృశ్యశ్రవణ విద్యా ప్రత్యేకాధికారిగా గ్రంథాలయాల అభివృద్ధికి సూచన:

1951 లో మదరాసు రాష్ట్ర ప్రభుత్వము రాఘవరెడ్డి గారిని దృశ్యశ్రవణ విద్యకు ప్రత్యేకాధికారిగా నియమించినది. దృశ్య

శ్రవణ పరికరములను విద్యావ్యాప్తికై ఇంగ్లాండు నందుపయోగించు విధానముల గురించి, క్షుణ్ణముగా తెలుసుకొనిన వారు, కావున మన రాష్ట్రములో ఉన్నత పాఠశాలల ఉపాధ్యాయులకు దృశ్య శ్రవణ విద్యావిధానములను, వివరించు చుండుటయేగాక, దృశ్య, శ్రవణ పరికరములను పౌర గ్రంథాలయములు కూడ ఉపయోగించు కొనవలెనని వాటి ప్రయోజనములను గురించి గ్రంథాలయ కార్య కర్తలకు కూడ అవసరమున్నపుడు విపులీకరించు చుండిరి. రాష్ట్రమున దృశ్య శ్రవణ పరికరములచే విద్యావ్యాప్తికి వీరు కావించిన సేవ అపూర్వమైనది.

## శాఖా గ్రంథాలయాధికారులకు తొలిసారిగా గ్రంథాలయ శాస్త్ర శిక్షణ:

1953 సం॥ ఆంధ్ర రాష్ట్రావతరణానంతరము రాఘవరెడ్డిగారు సాంఘిక విద్యకు ప్రత్యేకాధికారిగా నియమితులైరి. అప్పటి నుండి రాష్ట్రమున గ్రంథాలయ వ్యాప్తి బాధ్యతలు వీరిపై ఎక్కువగా పడినవి.

రాఘవరెడ్డిగారు గ్రంథాలయాల ప్రత్యేకాధికారిగా నియమితులయిన యనంతరము గ్రంథపాలకులు శిక్షణ పొందుటకు తగు యేర్పాట్లు చేసిరి. వారి కృషిని గురించి యీ అధ్యాయమునందు వివరించడమైనది. గ్రంథాలయ సంఘం వారు, విశ్వ విద్యాలయాలవారు గ్రంథపాలకులకు శిక్షణ నొసగుటకు సల్పిన కృషిని గురించి కూడ ఈ అధ్యాయమునందు పొందు పఱచి యున్నాము. మేము సేకరింపలేని విషయములను సేకరించి ప్రచురింప వలసిన యవసరమున్నది.

1948 పౌర గ్రంథాలయాల చట్టము 1950 సం॥ అమలులోనికి వచ్చినప్పటికి 1953 లో మాత్రమే ఆంధ్ర ప్రాంతమున జిల్లా కేంద్ర గ్రంథాలయాలు కొన్ని శాఖా గ్రంథాలయాలు స్థాపించబడి

నవి. శిక్షణ పొందినవారే గ్రంథాలయ పాలకులుగా నుండవలెనని భావించి గ్రంథాలయ శాస్త్రమునందు శిక్షణ పొందుట కొరకు కొందరిని ఆంధ్ర విశ్వవిద్యాలయమునకు పంపిరి. జిల్లా కేంద్ర గ్రంథాలయాలలోనే గాక శాఖా గ్రంథాలయములందు కూడ శిక్షణ పొందిన వారినే గ్రంథపాలకులుగా నియమించవలెనని రాఘవరెడ్డిగారు పట్టుదల వహించిరి. 1954 – 55 సం॥ ఆంధ్ర విశ్వవిద్యాలయమున రాఘవరెడ్డిగారి అభిమతము మేరకు గ్రంథాలయ శాస్త్రమునందు సర్టిఫికేటు కోర్సు నిర్వహణ ప్రారంభమైనది. సర్టిఫికేటు కోర్సునందు శిక్షణ పొందుటకు రాష్ట్రము నందలి ప్రతి లోకల్ లైబ్రరీ అథారిటీ యిరువురిని ఆంధ్ర విశ్వవిద్యాలయమునకు పంపవలెననియు, వారికగు ఖర్చు ఆయా జిల్లా లోకల్ లైబ్రరీ అథారిటీలే భరించవలెననియు రాఘవరెడ్డిగారు తెలియజేసిరి.

1933 సం॥ ఆంధ్ర విశ్వవిద్యాలయమునందు గ్రంథాలయ శాస్త్ర శిక్షణను వేసవికాలమునందు నిర్వహించుచుండిరి. విశ్వవిద్యాలయమునందు గ్రంథాలయశాఖ ప్రత్యేకింపబడిన అనంతరము ఈ శిక్షణ గ్రంథాలయశాఖ యందు నిర్వహింపబడుతూ వచ్చినది.

ఆంధ్ర విశ్వవిద్యాలయమునందు సర్టిఫికేటుకోర్సు 3 నెలల కాల పరిమితిని కలిగియుండినది. ఈ మూడు నెలల కాలమునందు గ్రంథాలయ నిర్మాణము – నిర్వహణ – వర్గీకరణ – సూచీకరణ అను అంశములను ప్రధానముగా బోధించుచుండిరి. ఈ విధముగా శిక్షణ పొందిన అభ్యర్థులు సహాయక, శాఖాగ్రంథాలయములను సక్రమముగా నిర్వహించుటకు, జిల్లా కేంద్ర, తదితర పెద్దగ్రంథాలయములందు పట్టభద్రులైన పుస్తక భాండాగారులను సహాయకులుగా నుండుటకు అర్హులుగా నుండిరి. పౌర గ్రంథాలయములు వయోజన విద్యావ్యాప్తికై ఏవిధముగా తోడ్పడవలెనన్న అంశమును కూడ గ్రంథాలయ శాస్త్ర శిక్షణ పాఠ్యాంశములందు చేర్చవలెనని రాఘవరెడ్డి

గారు అభిప్రాయమును వ్యక్తీకరించుచుండిరి. ఆంధ్ర విశ్వవిద్యాలయమువారు మెట్రిక్యులేషన్ పరీక్షయందు త్తీర్ణులైన వారిని లేదా దానికి సమానమయిన విద్యార్హతల కలిగినవారిని మాత్రమే గ్రంథాలయశాస్త్రమున సర్టిఫికేటుకోర్సు శిక్షణకు ఎన్నుకొనుచుండిరి. మఱియు ఈ విధముగా ఎన్నుకొనుట యందు గ్రంథాలయ నిర్వహణ యందు అనుభవము పొందినవారికి ప్రాధాన్యత నివ్వవలెనని రాఘవ రెడ్డిగారు విశ్వవిద్యాలయములకు తెలియజేసెడివారు.

## గ్రంథాలయోద్యోగులకు ప్రభుత్వము లేదా లోకల్ లైబ్రరీ అథారీటీల ఖర్చుతో గ్రంథాలయ శాస్త్ర శిక్షణ:

సర్టిఫికేటుకోర్సునందు శిక్షణకై ఎన్నికయిన అభ్యర్థుల శిక్షణా వ్యయమును లోకల్ లైబ్రరీ అథారిటీలు గాని, రాష్ట్రప్రభుత్వము గాని భరించవలెనని రాఘవరెడ్డిగారు పట్టుదల వహించిరి. లోకల్ లైబ్రరీ అథారిటీ సభ్యులు కొందరు, అభ్యర్థులు వారి స్వంతఖర్చుతో ఈ శిక్షణ పొందవచ్చునను అభిప్రాయమును వెలిబుచ్చిరి. అందులకు రాఘవరెడ్డిగారు అభ్యర్థులు తమ స్వంతఖర్చుతో సర్టిఫికేటుకోర్సు నందు శిక్షణ పొందినచో అటువంటివారు ఎక్కువ కాలము లోకల్ లైబ్రరీ అథారిటీవారి గ్రంథాలయములందు ఉద్యోగము చేయలేక పోవచ్చునని లోకల్ లైబ్రరీ అథారిటీల సభ్యులకు స్పష్టపఱచెడివారు. రాఘవరెడ్డిగారి అభిప్రాయానుసారము ఎన్నుకొనబడిన అభ్యర్థుల శిక్షణ కగు వ్యయమును భరించుటకు లోకల్ లైబ్రరీ అథారిటీలు పూనుకొనినవి. లోకల్ లైబ్రరీ అథారిటీల వ్యయముతో 1954-55 సం॥ల నుండి శిక్షణ పొందినవారిలో గ్రంథాలయ సేవ చేయువారు ఈ నాటికిని పెక్కుండ్రు గలరు.

ఈ విధముగా సర్టిఫికేటుకోర్సు నందు శిక్షణ నిచ్చుటకు ప్రతి అభ్యర్థికి సుమారు 350 రూపాయలకు పైగా లోకల్ లైబ్రరీ అథారి

ట్లీలు వెచ్చించుచుండినవి. విశ్వవిద్యాలయమునందు ప్రవేశమునకు, బోధనకు, రిజిస్ట్రేషన్‌కు, పుస్తకముల కొనుగోలు కగు వ్యయమును మున్నగువాటిని లోకల్ లైబ్రరీ అథారిటీవారే భరించి అభ్యర్థికి నెలకు 45 రూపాయల స్టైపండ్‌ను చెల్లించుచుండిరి. లోకల్ లైబ్రరీ అథారిటీల ఖర్చుతో శిక్షణ పొందిన అనంతరము అభ్యర్థులు ఏ గ్రంథాలయమునందు గ్రంథాలయ సేవకు నియోగింపబడుదురో ఆ గ్రంథాలయములకు వారు శిక్షణ కాలమున కొనుగోలు చేసిన పుస్తకముల నప్పగించవలెను. లోకల్ లైబ్రరీ అథారిటీల శిక్షణకు పంపినవారి శిక్షణకాల వ్యయమును భరించి వారి శిక్షణ కాలమును పని చేయు కాలముగా పరిగణించుచూ సాధారణముగా వారి కగు రవాణా ఖర్చులను కూడ భరించుచుండినవి.

శ్రీ రాఘవరెడ్డిగారు విశాఖపట్టణమునకు పౌర గ్రంథాలయాల తనిఖీనిమిత్తము వెళ్ళినపుడు ఆంధ్రవిశ్వవిద్యాలయ రిజిస్ట్రారుకు ఆంధ్ర విశ్వవిద్యాలయ గ్రంథాలయాధికారికి సర్టిఫికేటుకోర్సుకు మూడు మాసములు చాలదనియు దాని కాలవ్యవధిని మరింత పొడిగించవలె ననియు, ఈ శిక్షణాకాలమున బోధించు పాఠ్యాంశములను విస్తృత పరచ వలసినదని తెలియజేసిరి. రాష్ట్ర గ్రంథాలయ శాఖ సిఫారసు చేసెడి అభ్యర్థులను తప్పక శిక్షణ కెన్నుకొనవలసినదని రాఘవరెడ్డి గారు సూచించెడివారు. వీరి సూచనమేరకు ఆంధ్రవిశ్వవిద్యాలయము వారు రాష్ట్ర గ్రంథాలయ శాఖ పంపెడి అభ్యర్థులను శిక్షణకు ఎన్ను కొనుచుండిరి.

1953 – 54 సం॥ నుండి స్థాపించబడిన శాఖా గ్రంథాలయము లందలి శిక్షణ పొందని పలువురి ఉద్యోగులను ఈ శిక్షణకు పంపటము జరిగినది. 15—11—55 నుండి ప్రారంభింపబడిన సర్టిఫికేటు కోర్సు శిక్షణకు లోకల్ లైబ్రరీ అథారిటీలు పది జిల్లాలను డి ఒకేసారి 20 మందిని పంపిరి. ఈ విధముగా ప్రతి సంవత్సరము లోకల్ లైబ్రరీ

అథారిటీలు తమ స్వంత వ్యయముతో శిక్షణకు అభ్యర్థులను పంపు చుండినవి. 1960 కి పూర్వము ఈ విధముగా సర్టిఫికేటు కోర్సునందు శిక్షణ పొందినవారు ఈ నాటికిని రాష్ట్రమునందలి పౌర గ్రంథాలయ ములందు పెక్కండ్రు పని చేయుచున్నారు.

## తెలంగాణలో 1956 సం॥ ముందు గ్రంథాలయ శాస్త్రశిక్షణ:

ఆంధ్రప్రదేశ్ ఏర్పడక మునుపటినుండి తెలంగాణ గ్రంథాలయ సంఘము సర్టిఫికేటు కోర్సును నిర్వహించుచుండినది. పాఠశాలల యందలి గ్రంథాలయములలో వీరిని నియమించుట కొరకు ఈ సర్టిఫికేటు కోర్సు శిక్షణ యివ్వడము జరిగినది. ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తరువాత కూడ ఈ కోర్సు కొంత కాలము వరకు కొనసాగినది.

హైదరాబాదు నందలి College of languages అను సంస్థ కూడ సర్టిఫికేటు కోర్సును ఆంగ్లమునందు కొంతకాలము పాటు నిర్వహించుచూ వచ్చినది. దీనికి ఉస్మానియా విశ్వవిద్యాలయము గుర్తింపు నొసగినది.

## హైదరాబాదులో ఇన్స్టిట్యూట్ ఆఫ్ లైబ్రరీ సైన్సు వారిచే గ్రంథాలయ శాస్త్ర శిక్షణ:

ఆంధ్రప్రదేశ్ అవతరణానంతరము ఆంధ్ర గ్రంథాలయ సంఘము - తెలంగాణ గ్రంథాలయ సంఘము లేకమై ఆంధ్ర ప్రదేశ్ గ్రంథాలయ సంఘముగా రూపొందినది. తెలంగాణ గ్రంథాలయ సంఘమునందు సభ్యులుగా నుండిన వారిలో కొందరు హైదరాబాదు నందు గ్రంథాలయ శాస్త్ర శిక్షణ కేంద్రము (Institute of Library Science) ను ప్రారంభించిరి. 1964 లో ప్రభుత్వము యీ సంస్థకు గుర్తింపు నిచ్చి, కొన్ని నిబంధనలు తెలియజేసినవి. ఆ నిబంధనలలో ప్రధానమైనవిగా యీ క్రింది వాటిని పేర్కొనవచ్చును.

ఈ ఇన్స్టిట్యూట్ లోని పాఠ్యాంశములను గ్రంథాలయశాఖ డైరెక్టరు సూచింపవలయును. డైరెక్టరు కోరినపుడు ఈ శిక్షణను ప్రారంభించవలెను. ఈ శిక్షణ పొందిన వారిని పౌర గ్రంథాలయము లందుకూడ నియమించవచ్చును. ఈ కోర్సునందు ఏబది శాతము సీట్లను గ్రంథాలయశాఖలో పని చేయువారి కివ్వవలెను, ఈ ఇన్స్టిట్యూటుకు పరీక్షల నిర్వహణ బోర్డును, బోధనాధికారుల నియామకమును డైరెక్టరుగారు అంగీకరించవలెను. ఈ ఇన్స్టిట్యూట్‌ను రిజిష్టరు చేయవలెను. రాష్ట్ర కేంద్ర గ్రంథాలయాధికారిగాని, సాంకేతిక విద్యాశాఖ డైరెక్టరుగాని ఈ ఇన్స్టిట్యూట్ యొక్క పరీక్షలు నిర్వహించవలెను. ఈ నిబంధనలకు ఇన్స్టిట్యూట్ వారు సమ్మతించిరి. ఈ శిక్షణకు ప్రభుత్వము గుర్తింపు నొసగిననాటి నుండి శిక్షణకోర్సులు నిర్వహింపబడుచున్నవి. ఇప్పుడు గ్రంథాలయములలో పని చేయు గ్రంథపాలకు లనేకులు ఈ గ్రంథాలయ శిక్షణా కేంద్రమునందు శిక్షణను పొందిరి. ఉదా॥ 1—5—1968 నుండి ప్రారంభింపబడిన కోర్సుకు గ్రంథాలయ శాఖవారు 21 మందిని మరియు 15—12—67 నుండి జరుపబడిన కోర్సుకు 20 మందిని పంపిరి.

## విజయవాడలో తెలుగులో ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘముచే గ్రంథాలయశాస్త్ర శిక్షణా నిర్వహణ :

పలువురు గ్రంథాలయాభిమానులు గ్రంథాలయ శాస్త్రము నందు సర్టిఫికేటు కోర్సును తెలుగులో నిర్వహించ వలసినదిగా రాఘవ రెడ్డిగారిని కోరిరి. ఆంధ్రప్రాంతమునందలి గ్రంథాలయ సంఘసభ్యులు గ్రంథాలయాభిమానులు కూడ యిదే అభిప్రాయమును రాఘవరెడ్డిగారికి వ్యక్తపరచిరి. రాఘవరెడ్డిగారు యిందులకు సుముఖులుగా నుండిరి. గ్రంథాలయ సంఘములే ఈ కోర్సులను నిర్వహించవలెనని రాఘవరెడ్డిగారి అభిప్రాయము. 1964లో ఏర్పాటుచేయబడిన రాష్ట్రగ్రంథాలయ

కమిటి సమావేశమునందు ఈ అంశమును గురించి కూడ చర్చించడము జరిగినది. రాఘవరెడ్డిగారు సర్టిఫికేటు కోర్సు శిక్షణను గ్రంథాలయ సంఘముచే నిర్వహించవలెనని ప్రభుత్వమునకు తెలియజేసిరి. 1965 నవంబర్ నెలలో ప్రభుత్వము ఇందుల కంగీకరించుచూ హైదరాబాదు గ్రంథాలయ శిక్షణ కేంద్రమునకు వర్తించు నిబంధనలే ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘము కూడ సర్టిఫికేటు కోర్సు శిక్షణను నిర్వహించునపుడు పాటించవలసినదని తెలియజేసినది. అందులకు ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘమువారు అంగీకరించిరి. 1965 లో ప్రభుత్వము తెలుగునందు సర్టిఫికేటుకోర్సు నిర్వహణకు గుర్తింపు నిచ్చినది. 1966 నుండి గ్రంథాలయ సంఘము ఈ శిక్షణను నిర్వహించుచున్నది. 15—12—1967 నుండి జరుపబడిన కోర్సుకు గ్రంథాలయ శాఖ వారు ఒకేమారు 20 మందిని పంపిరి. ఈ విధముగా ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘముచే తెలుగునందు సర్టిఫికేటు కోర్సునందు శిక్షణ పొందినవారు నేటికిని పెక్కు గ్రంథాలయములందు పని చేయుచున్నారు.

ఆంధ్ర విశ్వవిద్యాలయము గ్రంథాలయ శాస్త్రములో సర్టిఫికేటు కోర్సును నిర్వహించుచుండిన కాలమున రాఘవరెడ్డిగారు హైదరాబాదు గ్రంథాలయ శిక్షణ కేంద్రమునకు మఱియు ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘమునకు కూడ సర్టిఫికేటు కోర్సు శిక్షణ కాల వ్యవధిని 3 నెలలకు పైగా పెంచవలసినదిగా తెలియజేసిరి. కొంత కాలమునకు యీ సర్టిఫికేటు కోర్సు శిక్షణా సంస్థలు శిక్షణాకాల వ్యవధిని పొడిగించినవి. హైదరాబాదు గ్రంథాలయ శిక్షణ కేంద్రము, ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘమువారు అనుసరించు పాఠ్యాంశములు—పరీక్షల నిర్వహణ పద్ధతులు ఒకే రీతిగా నుండవలెనని రాఘవరెడ్డిగారు వివరించి అందుకు తగు కృషిని కూడ సల్పిరి. సర్టిఫికేటు కోర్సు నిర్వహణ సంస్థలయందు పూర్తికాలము పనిచేయు బోధనాధికారులు

కొందరైనా యుండడము మిగుల ఆవశ్యకమని యిటువంటి సిబ్బందిని నియమించిన సంస్థలకు ప్రభుత్వము తగు గ్రాంట్లను కూడ మంజూరు చేయవలెనని రాఘవరెడ్డిగారి అభిప్రాయము. కొన్ని సర్టిఫికేటు కోర్సుల నిర్వహణకు రాఘవరెడ్డిగారు ప్రభుత్వమునుండి కొంతవరకు గ్రాంట్లను మంజూరు చేయించిరి.

## ఉస్మానియా విశ్వ విద్యాలయములో గ్రంథాలయ శాస్త్ర శిక్షణ తరగతులను ప్రారంభించుటకు అధికారుల సుముఖత :

హైదరాబాదు పౌర గ్రంథాలయ చట్టము, 1955 అమలు లోనికి వచ్చిన తరువాత 1958 – 59 సం॥ నాటికి తెలంగాణ ప్రాంత మునందు, ప్రభుత్వ సహాయమున జిల్లా కేంద్ర గ్రంథాలయములు, కొన్ని శాఖా గ్రంథాలయములు ప్రారంభింపబడినవి. వీటియందు శిక్షణ పొందిన గ్రంథపాలకులు లేకుండిరి. రాష్ట్ర కేంద్ర గ్రంథా లయమునందు కూడా శిక్షణ పొందిన గ్రంథపాలకుల సంఖ్య మిగుల స్వల్పము. వీరికి దూర ప్రాంతములకు వెళ్ళి డిప్లొమా కోర్సు, సర్టిఫికేటు కోర్సులందు శిక్షణ పొందుట ఇబ్బందిగా నుండినది, అందువలన రాఘవ రెడ్డిగారు ఉస్మానియా విశ్వవిద్యాలయమునందు ఈ కోర్సులను ప్రారంభించుట ప్రయోజనకరమని అభిప్రాయపడి తదనంతరము ఉస్మానియా విశ్వవిద్యాలయ గ్రంథాలయాధికారియైన ఎమ్. యజ్దాని గారిని కలసి వారితో తెలంగాణ ప్రాంతమునందలి పౌర గ్రంథా లయములందు, శిక్షణ పొందిన గ్రంథపాలకులు లేకపోవడమును గురించి చర్చించిరి. అనంతరము వీరిరువురును కలసి ఉస్మానియా విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులును, 1948 మదరాసు పౌర గ్రంథాలయ చట్టమును రాష్ట్రమునందమలు పరచడములో ఆనాడు అన్నివిధముల సహకరించిన గొప్ప గ్రంథాలయాభిమానులును, మఱియు గొప్ప విద్యావేత్త డి. ఎస్. రెడ్డిగారిని కలిసికొని వారికి ఉస్మానియా విశ్వ

విద్యాలయమునందు గ్రంథాలయ శాస్త్ర శిక్షణను ప్రవేశ పెట్టవలసిన ఆవశ్యకతను వివరించిరి. వారు రాఘవరెడ్డిగారి అభిమతమున కంగీక రించి ఆనాడు విశ్వవిద్యాలయమునందు తగు సిబ్బంది లేనందువలన ఈ కోర్సు బోధనాబాధ్యతను కొంతవరకు రాఘవరెడ్డిగారు స్వీకరించి, ప్రభుత్వమునుండి తగు గ్రాంట్లను కూడ మంజూరు చేయించవలసిన దిగా తెలియజేయగా రాఘవరెడ్డిగారు అందులకు హర్షామోదములు తెలియజేసిరి. 1959 సం॥ నుండి ఉస్మానియా విశ్వవిద్యాలయము నందు డిప్లొమా కోర్సు, సర్టిఫికేటు కోర్సు, ప్రారంభింపబడినవి. ఉస్మా నియా విశ్వవిద్యాలయ డిప్యూటీ గ్రంథపాలకులయిన బి. పి. షెనాయ్ గారు డిప్లొమా కోర్సు, సర్టిఫికేటు కోర్సు శిక్షణలు ప్రారంభించుటకు మిగుల తోడ్పడిరి. కొన్ని సంవత్సరములు రాఘవరెడ్డిగారు గ్రంథా లయ నిర్వహణాది అంశముల గురించి బోధించిరి. ఈ గ్రంథాలయ శాస్త్ర శిక్షణ కొరకు ప్రతి సంవత్సరము పదివేల రూపాయలను గ్రాంటుగా ఉస్మానియా విశ్వవిద్యాలయమునకు మంజూరు చేయించిరి.

శిక్షణ ప్రారంభకాలమున ఉస్మానియా విశ్వవిద్యాలయము నందు శిక్షణకు సంబంధించిన పుస్తకములు తగినన్ని లేకుండినవి. జిల్లా కేంద్ర గ్రంథాలయ కార్యకర్తలతోను రాష్ట్ర కేంద్ర గ్రంథా లయాధికారులతోను రాఘవరెడ్డిగారు చర్చించి జిల్లా కేంద్ర, రాష్ట్ర కేంద్ర గ్రంథాలయములు కూడ గ్రంథాలయములందు శాస్త్ర శిక్షణకు సంబంధించిన పుస్తకముల కొనుగోలు చేయవలసినదిగా తెలియజేసిరి. గ్రంథాలయ శాఖ డైరెక్టరువారి కార్యాలయమునందు కూడ గ్రంథాలయ శాస్త్ర శిక్షణకు సంబంధించిన పుస్తకములను వుంచిరి.

ఉస్మానియా విశ్వవిద్యాలయమునకు సర్టిఫికేటు కోర్సునకు వెళ్ళు అభ్యర్థుల శిక్షణా వ్యయమును లోకల్ లైబ్రరీ అథారిటీలే భరించు చుండినవి. డిప్లొమా కోర్సునకు వెళ్ళు ప్రతి అభ్యర్థికి ప్రభు

త్వము 1959–60 సంవత్సరము మాసమునకు 115 రూ॥లు మంజూరు చేసినది. ఈ విధముగా 1959 - 60 సం॥ నుండి ప్రభుత్వ సహాయమున డిప్లొమా కోర్సునందు శిక్షణ పొందిన అభ్యర్థులు జిల్లా కేంద్ర గ్రంథాలయము లందును, జిల్లా లోకల్ లైబ్రరీ అథారిటీల సహాయమున సర్టిఫికేటు కోర్సునందు శిక్షణ పొందిన అభ్యర్థులు శాఖా గ్రంథాలయములందు గ్రంథ పాలకులుగా నియమింపబడిరి. 1960 - 61 సం॥లో జిల్లా గ్రంథాలయ సంస్థలు సర్టిఫికేటు కోర్సుకు 22 మందిని, డిప్లొమా కోర్సుకు 15 మందిని ఎన్నుకొని ప్రభుత్వ జిల్లా గ్రంథాలయ సంస్థల వ్యయముతో విశ్వవిద్యాలయమునకు శిక్షణకు పంపినవి. 1962 - 63 సం॥ కూడ రూ. 115 స్టైఫండ్ తో ఐదుగురిని లోకల్ లైబ్రరీ అథారిటీలు శిక్షణకు విశ్వవిద్యాలయమునకు పంపినవి. రాష్ట్రమునందు సర్టిఫికేటు కోర్సునందు శిక్షణ పొందిన వారి సంఖ్య క్రమాభివృద్ధి చెందినది. స్థాపించబడిన శాఖా గ్రంథాలయములందును వీరిని నియమించడము కూడ జరిగినది. కేంద్ర ప్రభుత్వముచే నియమింపబడిన సలహా సంఘ నివేదికయందు గ్రంథాలయము సంఘములే సర్టిఫికేటు కోర్సు శిక్షణ నొసగవలెనని సూచించబడినందున ఉస్మానియా విశ్వవిద్యాలయమునందు సర్టిఫికేటు కోర్సు శిక్షణ నిర్వహణను మానివేసిరి. కావున ఈ బాధ్యతలను గ్రంథాలయ సంఘముల కప్పగించడం జరిగినది.

28—2—1964 న జరిగిన రాష్ట్ర గ్రంథాలయ కమిటీ సమావేశమున గ్రంథాలయ శాస్త్రమునందు డిగ్రీ కోర్సును ఉస్మానియా విశ్వవిద్యాలయమున ప్రారంభించ వలసిన ఆవశ్యకతను గురించి రాఘవరెడ్డిగారు వివరించగా అందులకు గ్రంథాలయ కమిటీ సభ్యులు అంగీకరించి ఏకగ్రీవముగా బి. ఎల్. ఎస్. సి. శిక్షణ విశ్వవిద్యాలయమున ప్రారంభించవలెనని తీర్మానించిరి. 1965 సం॥ ఉస్మానియా విశ్వవిద్యాలయ మందలి డిప్లొమా కోర్సును డిగ్రీ కోర్సుగా

రూపొందించిరి. డిప్లొమా కోర్సునకగు వ్యయము ప్రభుత్వముచే ప్రతి సం॥ కేటాయించబడుచుండిన పదివేల రూపాయల గ్రాంటును బి. ఎల్. ఎస్. సి. ప్రారంభించిన తరువాత ఇరువది వేల రూపాయలకు హెచ్చించ వలసినదని రాఘవరెడ్డిగారు ప్రభుత్వమునకు ప్రస్ఫుట పరచగా ప్రభుత్వ మందులకు అంగీకరించి ఇరువదివేల రూపాయలు 1967 – 68 లో మంజూరు చేసినది.

## గ్రంథాలయశాస్త్ర శిక్షణకై ప్రత్యేక గ్రాంట్లు మంజూరు:

కాలక్రమేణ, శాఖా గ్రంథాలయముల సంఖ్య వృద్ధిచెందుటచే గ్రంథాలయములందు శిక్షణ పొందిన గ్రంథ పాలకుల ఆవశ్యకత ఏర్పడినది. ఆంధ్ర ఉస్మానియా విశ్వ విద్యాలయములందు సర్టిఫికేటు కోర్సు శిక్షణ నిలుపుదల చేయుట ఒక సమస్యగా పరిణమించినది. రాఘవరెడ్డిగారు ఈ సమస్యను తొలగించుట కొరకు ఒక కోర్సుకు వేయి రూపాయల చొప్పున గ్రాంటు మంజూరుచేయించి ఆంధ్ర విశ్వవిద్యాలయం వారిచే తిరిగి మూడు జట్లుగా సర్టిఫికేటు కోర్సులను నిర్వహింప జేసిరి. ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘమునకు హైదరాబాదులోని గ్రంథాలయ శాస్త్ర శిక్షణ కేంద్రమునకు (Institute of library Science) వేయి రూపాయల చొప్పున కోర్సు నిర్వహణ నిమిత్తమై ప్రత్యేక గ్రాంటుగా మంజూరు చేయించిరి.

గ్రంథాలయ శాస్త్ర శిక్షణకు సంబంధించిన పుస్తకముల సంఖ్య తెలుగునందు మిగుల స్వల్పము. గ్రంథాలయ శాస్త్ర శిక్షణకు సంబంధించిన పుస్తకములు తెలుగునందు వెలువడడం ఎంతో అవసరము. శిక్షణకు సంబంధించిన కొన్ని వ్యాసములు పత్రికలయందు వెలువడుచుండినవి. వెలగా వెంకటప్పయ్య, పాతూరి నాగభూషణం మున్నగువారు తెలుగునందు గ్రంథాలయ శాస్త్రమును గురించి కొన్ని పుస్తకములను రచించియున్నారు. అయినప్పటికి యివి చాలవు. శాస్త్రి

శిక్షణకు వలయు పుస్తకములు తెలుగునందు కావలసినన్ని లేకపోవ డము వలన శిక్షణ పొందువారికి కష్టముగా నుండినది. రాఘవరెడ్డి గారు ఈ విషయమును గుర్తించి శిక్షణకు సంబంధించిన పుస్తకములు తెలుగునందు వ్రాయగల సామర్థ్యము కలవారికి తగు ప్రోత్సాహము కల్గించిరి. ఆంగ్లమునందు కల గ్రంథాలయశాస్త్ర సంబంధిత పుస్తక ములను కూడ ఆంధ్రీకరించుకొనవచ్చునని రెడ్డిగారు తెలియజేసిరి. ప్రభుత్వము కూడ తెలుగునందు గ్రంథాలయ శాస్త్ర శిక్షణకు సంబంధించిన రచనలు వెలువడుటకు తగిన గ్రాంట్లను మంజూరు చేయవలసిన అవసరము కూడ ఎంతేని కలదు.

## పట్టభద్రులకు గ్రంథాలయ శిక్షణ-ఆర్థిక సహాయ ఉపసంహరణ- అసమంజస నిర్ణయము:

రాఘవరెడ్డిగారు గ్రంథాలయ శాఖ డిప్యూటీ డైరెక్టరుగాను డైరెక్టరుగా నున్న కాలమున లోకల్ లైబ్రరీ అథారిటీల వ్యయముతో గాని లేదా రాష్ట్ర ప్రభుత్వముయొక్క వ్యయముతో గాని పెక్కుమంది సర్టిఫికేటు కోర్సు, డిగ్రీ కోర్సునందు శిక్షణను పొందుచుండిరి. రాఘవరెడ్డిగారు 1969 జనవరిలో ప్రభుత్వ సర్వీసు నుండి పదవీ విరమణ చేసిన అనంతరము 27—10—1969 న రాష్ట్ర గ్రంథాలయ కమిటీ సమావేశ మొకటి ఏర్పాటు చేయబడినది. ఈ కమిటీ సమావేశమునందు డిగ్రీ కోర్సునందు శిక్షణపొందు అభ్యర్థులు తమ తమ స్వంత ఖర్చుతోడనే శిక్షణ పొందవలెను, లేదా జిల్లా గ్రంథాలయ సంస్థలు ఈ శిక్షణావ్యయమును భరించవచ్చునని, ఈ శిక్షణకు ప్రభుత్వము పైకమును వెచ్చించ కూడదని తీర్మానించ డము జరిగినది. ఈ విధముగా రాష్ట్ర గ్రంథాలయ కమిటీ తీర్మా నించడము కొంతమంది గ్రంథపాలకులకు మిక్కిలి బాధాకరమైన విషయమైనది. ఈ విధముగా తీర్మానించడము సమంజసము కాదని

తమ అభిప్రాయమును ప్రకటించిరి. గ్రంథాలయోద్యమములో పాల్గొను వారు గ్రంథాలయాభిమానులు పెక్కురు ఆర్థికముగా వెనుకబడి యుండుటవలన, డిగ్రీ కోర్సు శిక్షణకు స్వంత ఖర్చుతో వెళ్ళ జాలరు కాన, ఈ విధముగా తీర్మానించడము గ్రంథాలయ శాస్త్రాధ్యయనమునం దుత్సాహవంతులయిన వారికి గొడ్డలిపెట్టు వంటిదని చెప్పవచ్చును. డిగ్రీ కోర్సు నందు శిక్షణ పొందినవారు రాష్ట్రము నందెక్కువగా కలరని కాన, జిల్లా గ్రంథాలయ సంస్థలు తమ వ్యయముతో అభ్యర్థులను డిగ్రీ కోర్సుకు పంపకూడదని, అభ్యర్థులు డిగ్రీ శిక్షణకు వెళ్ళదలచుకొన్న వారి స్వంత ఖర్చులతోనే వెళ్ళవలెనని గ్రంథాలయ శాఖ డైరెక్టరుగారు 1972 లో నిర్ణయించిరి.

## శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయములో గ్రంథాలయ శాస్త్ర శిక్షణ ప్రారంభము :

రాఘవరెడ్డిగారు ప్రభుత్వ సర్వీసు నుండి రిటైరయిన తరువాత కొంతకాలము ఉస్మానియా విశ్వవిద్యాలయమునందు గ్రంథాలయ శాఖకు అధ్యక్షులుగాను, వ్యవసాయ విశ్వవిద్యాలయమునందు ప్రత్యేకాధికారిగా నుండిన తరువాత 6–1–1971 న శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయమునందు డెవలప్‌మెంటు ఆఫీసర్‌గా నియమితులైరి. గ్రంథాలయ సంఘములే సర్టిఫికేటు కోర్సును నిర్వహించవలెనని రాఘవరెడ్డిగారి అభిప్రాయము, కాని యీవిశ్వవిద్యాలయ ప్రాంతములందు గ్రంథాలయ సంఘములేవియు లేకుండుటచేత యీ విశ్వవిద్యాలయమే వీటిని ప్రారంభింపవలసి వచ్చినది. మొట్టమొదట సర్టిఫికేటు కోర్సును ప్రారంభించిరి. సర్టిఫికేటు కోర్సును కొంత కాలము పాటు నిర్వహించి అనంతరము డిప్లొమా కోర్సును ప్రారంభించిరి.

## గ్రంథాలయ శాస్త్రములో యం. ఎల్. ఎస్. సి. కోర్సు స్థాపించుటకై రాఘవరెడ్డిగారి ప్రయత్నము :

రాఘవరెడ్డిగారు గ్రంథాలయ శాఖకు డైరెక్టరుగ నున్నపుడు ఉస్మానియా విశ్వవిద్యాలయమునందు బి. ఎల్., ఎస్. సి., డిగ్రీ కోర్సు మాత్రమేగాక ఎమ్. ఎల్. ఎస్. సి. కోర్సును గూడ ప్రారంభించవలె నని అభిప్రాయమును కల్గియుండిరి. ఈ కోర్సునందు శిక్షణ పొందిన వారికి అడ్వాన్స్ బైబ్లియోగ్రఫిని తయారుచేయుటకు, పుస్తకముల వర్గీకరణ సూచీకరణను సులభముగా రూపొందించుటకు వీలగును. మఱియు వీరిని ప్రాంతీయ గ్రంథాలయాల, జిల్లా కేంద్ర గ్రంథాలయాల గ్రంథ పాలకులుగ నియమించినచో తమ గ్రంథాలయములందు ఆధునిక పద్ధతులను సులభముగా ప్రవేశపెట్టుటకు వీలేర్పడును.

28—2—1964 న ఏర్పాటు చేయబడిన రాష్ట్ర గ్రంథాలయ కమిటి సమావేశమున ఉస్మానియా విశ్వవిద్యాలయమునందు ఎమ్. ఎల్. ఎస్. సి. కోర్సు స్థాపనావశ్యకతను గురించి చర్చించి, యీ కోర్సును ఉస్మానియా విశ్వవిద్యాలయమునందు ప్రారంభించవలెనని, తీర్మానించి యిందులకు ప్రభుత్వము అదనముగా సం॥నకు రూ. 15000 గ్రాంటును మంజూరు చేయవలెనని సూచించడమైనది. నాల్గవ పంచ వర్ష ప్రణాళికయందు కూడ ఈ విషయమును ప్రధానముగా పేర్కొనడము జరిగినది. కాని ఆర్థిక పరిస్థితుల రీత్యా రాష్ట్ర ప్రభుత్వము పౌర గ్రంథాలయములకు సాధారణముగా మంజూరు చేయు గ్రాంటును కూడ తగ్గించినది. ఉస్మానియా విశ్వవిద్యాలయమునకు కూడ తగిన సిబ్బంది లేకుండినది. ఇటీవల ఆర్థిక పరిస్థితులు మెరుగుపడుటచే ఉస్మానియా విశ్వవిద్యాలయమునందు యీ కోర్సు ప్రారంభించుట మిగుల సంతోషకరమైన విషయము.

## గ్రామీణ గ్రంథాలయాల నిర్వాహకులకు తర్ఫీదు:

పుస్తక పంపిణీ కేంద్రములందు పనిచేయు ఉపాధ్యాయులకు, పంచాయితీ, సహాయక మున్నగు గ్రంథాలయములలో పనిచేయు గ్రంథ పాలకులకు కూడ కొంతవరకు గ్రంథాలయ శాస్త్ర శిక్షణ నివ్వవలెనని రాఘవరెడ్డిగారి ఆకాంక్ష. జిల్లా కేంద్ర, శాఖా గ్రంథాలయముల నుండి పంపబడు పుస్తకముల నేవిధముగా వారి గ్రంథాలయములందమర్చుకొనుట, గ్రంథాలయములకు విచ్చేయు పాఠకులకు కావలసిన పుస్తకముల జాబితాను రూపొందించి జిల్లా కేంద్ర గ్రంథాలయమునకు పంపుట, పుస్తకములను గ్రంథాలయ సభ్యుల కరువిచ్చు విధానము, అరువు కొనిపోబడిన పుస్తకముల గ్రంథాలయములు వాపసు పొందు విధానము, సాంఘిక సేవా సంస్కర్తలలో గ్రామీణ గ్రంథ పాలకుల సహకార విధానము, మొదలగు అంశముల గురించి ఈ గ్రంథాలయములలో పని చేయువారికి శిక్షణ నివ్వవలెను. గ్రంథాలయముల ఆశయముల గురించి, గ్రంథాలయ కార్యకలాపముల గురించి కూడ వీరికి తెలియజేయవలెను. పుస్తక పంపిణీ కేంద్రములను నిర్వహించు ఉపాధ్యాయులు, పంచాయతీ, తదితర గ్రామీణ ప్రాంత గ్రంథాలయములందు పని చేయు గ్రంథ పాలకులు గ్రంథాలయ నిర్వహణయందు కొంతవరకు అనుభవము పొందిన వారినే నియమించడం జరిగినది. కావున జిల్లా గ్రంథాలయాధికారులు – శాఖా గ్రంథాలయాధికారులు పై తెలిపిన గ్రంథాలయముల తనిఖీకి వెళ్ళినప్పుడు వారికి పై విషయముల గురించి కూడ చక్కగా బోధించెడివారు. జిల్లా కేంద్ర గ్రంథాలయ పాలకులు గ్రంథాలయ నిర్వహణయందు మంచి అనుభవమును పొందిన వారును, గ్రంథాలయ శాస్త్ర శిక్షణ పొందిన వారును అగుటచే వీరు గ్రామీణ గ్రంథాలయములందు పని చేయు గ్రంథ పాలకులకు పై విషయములను చక్కగా బోధించి వారి సమస్యల నివృత్తి చేయుచుండిరి. పుస్తక పంపిణీ

కేంద్ర నిర్వాహకులు పుస్తకముల నరువు గైకొనుటకు జిల్లా కేంద్ర లేదా శాఖా గ్రంథాలయములకు వచ్చునపుడు వారి సమస్యలను కూలంకషముగా వివరించి గ్రంథాలయ నిర్వహణాది అంశముల గురించి కూడ జిల్లా కేంద్ర, శాఖా గ్రంథాలయముల పాలకులతో చర్చించి తగు సలహాలను పొందుచుండిరి. పంచాయతీ, యితర గ్రామీణ ప్రాంత గ్రంథాలయ పాలకులు కూడ పుస్తకముల నరువు పొందుట కీ గ్రంథాలయములకు వచ్చునపుడు వారి సందేహములు నివృత్తి చేసికొని వెళ్ళుచుండెడివారు. గ్రామీణ ప్రాంతములలో పని చేయు గ్రంథపాలకులకు శిక్షణ నిచ్చుటకు తగు నిధులు లేక పోయి నప్పటికి, కొద్ది వ్యయముతోడనే వారికి పై విధముగా శిక్షణ నివ్వడం జరిగినది. గ్రంథాలయ నిర్వహణ విషయములో మంచి అనుభవము పొందిన శ్రీ కె. ఎస్. ప్రకాశం, (అనంతపురం) శ్రీ వెంకటరామి రెడ్డి, (నెల్లూరు) శ్రీ జి. వెంకటసుబ్బయ్య (కడప) శ్రీ రమణమూర్తి, (తూ॥ గోదావరి) తదితర లోకల్ లైబ్రరీ అథారిటీల కార్యదర్శులు, వీరికి మంచి తర్ఫీతు నిచ్చుటకు ఏర్పాట్లు చేసిరి.

## కార్యాలయ సిబ్బందికి గ్రంథాలయ శిక్షణ :

రాష్ట్ర పౌర గ్రంథాలయశాఖ కార్యాలయమునందును, రాష్ట్ర కేంద్ర, జిల్లా కేంద్ర, ప్రాంతీయ గ్రంథాలయముల కార్యాలయములందును పనిచేయు సిబ్బంది కూడ గ్రంథాలయశాస్త్రము నందు శిక్షణ పొందిన వారుగ నుండిన, సాంకేతిక విషయములను చక్కగా గ్రహించ గలిగి వారి పనులను సక్రమముగా నిర్వహించ గలరని, అందువలన వారికి గ్రంథాలయశాస్త్ర శిక్షణ యివ్వడము ఎంతో అవసరమని రాఘవరెడ్డిగారి ఉద్దేశ్యము. గ్రంథాలయ కార్యాలయములలో పనిచేయు పరిపాలనా యంత్రాంగ సిబ్బంది కూడ గ్రంథాలయశాస్త్ర శిక్షణ పొందుటకెంతో ఉత్సాహమును

కల్గియుండిరి. హైదరాబాదునందలి సెక్రటేరియట్‌లో పనిచేయు గ్రంథాలయశాఖ కార్యకలాప పర్యవేక్షకులు కూడ గ్రంథాలయ శాస్త్రి శిక్షితులు కావలెనని కోరెడివారు. ఈ విషయమును గురించి 1967 సం॥ రాఘవరెడ్డిగారు ప్రభుత్వమునకు వివరించగా ప్రభుత్వము కూడ యిందులకు అంగీకరించినది. తదనంతరము పౌర గ్రంథాలయ శాఖ కార్యాలయమునందలి సిబ్బందిలోని కొందరు, సెక్రటేరియట్ నందలి గ్రంథాలయశాఖ కార్యకలాప పర్యవేక్షకులు కొందరు ఉస్మానియా విశ్వవిద్యాలయమున 'గ్రంథాలయ శాస్త్రము నందు శిక్షణపొందిరి. వీరికి సాంకేతికముగా గ్రంథాలయాల నిర్వహణ, తదితర గ్రంథాలయ కార్యకలాపములను సులభముగా నిర్వహించుటకు వీలయినది. కాని సెక్రటేరియట్‌లోని గ్రంథాలయశాఖ కార్యకలాప నిర్వాహకులు మాత్రము తమ గ్రంథాలయశాస్త్ర శిక్షణానంతరము ఇతరశాఖలలో నియమింపబడుటచే, వారికి గ్రంథాలయ శాస్త్ర శిక్షణ గొప్పప్రయోజనకరముగా లేకపోయినది. 1967 సం॥ నుండి పౌర గ్రంథాలయశాఖ కార్యాలయ సిబ్బందిలోని కొందరు గ్రంథాలయశాస్త్ర శిక్షణకు వెళ్ళుచున్నారు.

## ఉన్నతపాఠశాలల అధ్యాపకులకు గ్రంథాలయ నిర్వహణ తర్ఫీదు :

రాఘవరెడ్డిగారు గ్రంథాలయశాఖ డైరెక్టరుగా నున్నప్పటికిని పౌర గ్రంథాలయములందే గాక పాఠశాలల, కళాశాలల, ఇతర విద్యాసంస్థల గ్రంథాలయములలో కూడ శిక్షణ పొందిన గ్రంథపాలకు లుండవలెనని వారి అభిమతము. శ్రీ వేంకటేశ్వర ఉస్మానియా విశ్వవిద్యాలయములలో నిర్వహింపబడు గ్రంథాలయశాస్త్ర శిక్షణ కభ్యర్థుల నెన్నుకొనునప్పుడు పాఠశాలలలో, కళాశాలలలో పనిచేయు శిక్షణ పొందని గ్రంథపాలకుల పెక్కురిని ఎన్నుకొని శిక్షణకు పంపిరి.

ఈ విధముగా రాఘవరెడ్డిగారిచే ఎన్నుకొనబడి శిక్షణకు పంపబడిన వారు ఈనాటికిని పాఠశాలల - కళాశాలల గ్రంథాలయాలలో పెక్కురు పని చేయుచున్నారు.

1966 లో పట్టభద్రులయిన ఉన్నతపాఠశాలల ఉపాధ్యాయులకు గ్రంథాలయ శాస్త్రమునందు శిక్షణ నొసగవలెనని కేంద్ర ప్రభుత్వమొక పథకమును రూపొందించినది. ఈ పథకము ప్రకారము ఉన్నతపాఠశాలలలోని పట్టభద్రులగు 40 మంది ఉపాధ్యాయుల నెన్నుకొని, రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమునందు వీరికి శిక్షణ నివ్వడం జరిగినది. రాఘవరెడ్డిగారు కూడ పాఠశాలల గ్రంథాలయములో పని చేయువారికి గ్రంథాలయ శాస్త్ర శిక్షణ నొసగవలెనను అభిప్రాయమును యిదివరకే వ్యక్తీకరించి యుండుటచే వారి అభిమతము సిద్ధించినదని జెప్పవచ్చును. ఈ శిక్షణకాలము 5 వారముల వ్యవధికలిగినది. ఈ శిక్షణా కేంద్రమునకు రాఘవరెడ్డిగారు డైరెక్టరుగా నుండిరి. రాష్ట్రగ్రంథాలయ పాలకులయిన శ్రీ టి.వి. రమణయ్య, రాష్ట్ర కేంద్ర గ్రంథాలయ సహాయ గ్రంథపాలకులయిన శ్రీ వేదామృతంగార్లు సహాయ అధ్యాపకులుగానుండిరి. గ్రంథాలయ నిర్మాణము, నిర్వహణ, వర్గీకరణ, సూచీకరణ మొదలగు అంశములను ఈ 5 వారముల శిక్షణ కాలమున బోధించిరి. 30-3-1966 నుండి 5-5-66 వరకు యీ శిక్షణ నిర్వహింపబడినది. శిక్షణ పొందు ఉపాధ్యాయులు పట్టభద్రులగుటచే వారికీ అంశములను గ్రహించుట కూడ సులభతరమైనది. ఈ విధముగా శిక్షణ పొందిన ఉపాధ్యాయులు వారివారి పాఠశాలల గ్రంథాలయముల అభివృద్ధికి కొంతవరకు కృషిసల్పిరి. ఇట్టి ప్రయోజనకరమైన శిక్షణ ప్రతి ఏటా నిర్వహించవలెనని, ప్రతి పాఠశాల గ్రంథాలయమునందును గ్రంథపాలకులు గ్రంథాలయ శాస్త్రమున శిక్షణ పొందినవారుగా నుండవలెనని రాఘవరెడ్డిగారి కోరిక.

## గ్రంథాలయ శాస్త్ర బోధనలో రాఘవరెడ్డిగారి నైపుణ్యము:

మదరాసులో సైదాబాదు ఉపాధ్యాయ శిక్షణా కళాశాల లోను, ఇంగ్లాండునందలి లీడ్సు విశ్వవిద్యాలయము నందును, బోధనా పద్ధతుల గురించి చక్కగా శిక్షణ పొందిన వారగుటచేత, 1951 నుండి సుమారు 500 మంది పట్టభద్రులయిన ఉపాధ్యాయులకు దృశ్య శ్రవణ పరికరములతో నవీన బోధనా పద్ధతులయందు శిక్షణ నిచ్చిన వారగుటచేత రాఘవరెడ్డిగారు గ్రంథాలయ శాస్త్రములో సర్టిఫికేటు, డిప్లొమా కోర్సులందు శిక్షణ పొందు వారికి, వారి వారి గ్రంథాలయ నిర్వహణ అనుభవమును, వారి వారి మేధాశక్తులను దృష్టి యందుంచుకొని బోధించుచుండిరి. రాఘవరెడ్డి గారిచే సర్టిఫికేటు, డిప్లొమా కోర్సులందు శిక్షణ పొందినవారు, రాఘవరెడ్డిగారి సులభ గ్రాహ్య బోధనాపద్ధతుల నీ నాటికిని పలువురు ప్రశంసించుచున్నారు. ఈ విధముగా రాఘవరెడ్డిగారు అత్యంత నైపుణ్యముగా బోధించుచు సాంకేతిక విషయములకు తగు ప్రాముఖ్యత నిచ్చి సందర్భావసరములబట్టి శిక్షణాకాలమున చర్చలను, సదస్సులను కూడ నిర్వహించుచుండిరి.

రాఘవరెడ్డిగారు డిప్యూటీ డైరెక్టరుగాను, డైరెక్టరుగాను నున్న కాలమున వందలకొలది పౌర గ్రంథాలయోద్యోగులు, జిల్లా గ్రంథాలయ సంస్థల వ్యయముతోడను, ప్రభుత్వ వ్యయముతోడను, సర్టిఫికేటు కోర్సు, డిప్లొమా కోర్సులందు, శిక్షణ పొంది పౌర గ్రంథాలయములందు పదవీ బాధ్యతల నిర్వహించుచున్నారు. రాఘవరెడ్డిగారు ఈ శిక్షణకు చేకూర్చిన సదుపాయముల గురించి, వారి కృషిని గురించి నేటికిని పలువురు గ్రంథపాలకులు కొనియాడుచున్నారు.

## గ్రంథాలయ శాస్త్ర శిక్షణలో ఆంధ్రప్రదేశ్ అగ్రగామి:

అవిభక్త మదరాసు రాష్ట్రములో తమిళ ప్రాంతము నందును, ఆంధ్ర ప్రాంతమునందును పౌర గ్రంథాలయ చట్టము ఒకే మారు

అమలులోనికి వచ్చినప్పటికిని గ్రంథాలయ శాస్త్రమున శిక్షణ పొందిన వారి సంఖ్య మనరాష్ట్రమున కన్న మదరాసు రాష్ట్రమునందు మిగుల స్వల్పము. అంతేగాక దేశమునందు పౌర గ్రంథాలయ చట్టము అమలునందుగల మహారాష్ట్ర, కర్నాటక రాష్ట్రములతోను, దేశము నందలి యితర రాష్ట్రములతోను పోల్చినప్పటికిని మన రాష్ట్రమునందు పౌర గ్రంథాలయాలలో పని చేయు – సిబ్బందికి కల్పించబడినట్టి వసతులు మరేరాష్ట్రమునందును కల్పించబడలేదని చెప్పవచ్చును. మఱియు పౌర గ్రంథాలయాలలో అన్ని రాష్ట్రములకన్న మన రాష్ట్ర మునందే శిక్షణ పొందినవారు అధికముగా కలరని తెలియుచున్నది.

"మన దేశములో గ్రంథాలయ సేవ" అను అంశముపై జరిపిన సర్వేలో డి. ఆర్. కాలియాగారు ఆంధ్ర ప్రదేశ్‌లో రాష్ట్ర కేంద్ర గ్రంథాలయము మరియు జిల్లా గ్రంథాలయ సంస్థలలో శిక్షణ పొందిన గ్రంథపాలకులు 1963 - 64 లో 17 + 60 = 77 మంది కల రనియు, ఇంత మంది శిక్షణ పొందిన గ్రంథపాలకులు ఆ సంవత్సర మున మరే రాష్ట్రములోను లేరనియు తెలిపియున్నారు. ఇటువంటి వస తులను కలుగ జేయుటకు కృషి సల్పిన శ్రీ రాఘవ రెడ్డిగారు ధన్యులు.

1—10—1953 నాటికి ఆంధ్ర రాష్ట్రమునందు, కొన్ని జిల్లా కేంద్ర గ్రంథాలయాలలో మాత్రము డిప్లొమా కోర్సునందు శిక్షణ పొందినవారు పని చేయుచుండిరి. పౌర గ్రంథాలయాలలో నియ మించుటకుగాను 1953 - 54 సం॥న నల్గురిని డిప్లొమా కోర్సునందు శిక్షణ పొందు నిమిత్తము పంపిరి. 31—3—1954 నాటికి ఆంధ్ర రాష్ట్రము నందలి అన్ని జిల్లా కేంద్ర గ్రంథాలయములందును డిప్లొమా కోర్సునందు శిక్షణ పొందినవారు పని చేయుచుండిరి. 1954 - 55 సం॥న కూడ సర్టిఫికేటు కోర్సునందు శిక్షణ పొందు నిమిత్తం కొందరు పంపబడిరి.

1—11—1956 నాటికి ఆంధ్ర ప్రాంతమునందు పదకొండు జిల్లా కేంద్ర గ్రంథాలయాలలో 11 మంది డిప్లొమా కోర్సునందు శిక్షణ పొందినవారును, 64 మంది సర్టిఫికేటు కోర్సునందు శిక్షణ పొందినవారును పని చేయుచుండిరి, ఆనాటికి తెలంగాణ ప్రాంతము నందు జిల్లా కేంద్ర గ్రంథాలయములు ప్రారంభింపబడలేదు. అసఫియా గ్రంథాలయమునందును, పబ్లిక్ గార్డెన్స్‌లోని బాలల గ్రంథా లయమునందును మాత్రము డిప్లొమా కోర్సునందు శిక్షణ పొందిన వారు ఆరుగురు పని చేయుచుండిరి. తెలంగాణ ప్రాంతమునందలి పౌర గ్రంథాలయాలలో సర్టిఫికేటు కోర్సునందు శిక్షణ పొందినవారు లేకుండిరి.

31—3—1969 నాటికి రాష్ట్రములో 89 మంది డిప్లొమాను కల్గినవారు, 317 మంది సర్టిఫికేటు కల్గినవారు పౌర గ్రంథాలయా లలో పని చేయుచుండిరి. ఇందు 39 మంది డిప్లొమా కల్గినవారు 84 మంది సర్టిఫికేటు కల్గినవారు తెలంగాణ ప్రాంతమునకు చెందినవారు.

## గ్రంథాలయ శాస్త్ర శిక్షణలో రాఘవరెడ్డిగారి కృషిపై ప్రముఖ గ్రంథాలయ శాస్త్రవేత్తల ప్రశంస :

దేశమునందు గ్రంథాలయశాస్త్ర శిక్షణకు వసతులను కలుగ జేయుటకు కృషిసల్పిన రాఘవరెడ్డిగారిని గురించి దేశమునందలి పలువురు గ్రంథాలయ శాస్త్రవేత్తలు ప్రశంసించియున్నారు.

27–9–1967 న రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమున ఏర్పాటు కావింపబడిన గ్రంథ పాలకుల సమావేశమున, భారతదేశమునందలి గ్రంథాలయాభివృద్ధిని గురించి చక్కగా పరిశీలించిన డా॥ డోరతీ పార్కర్ గారు [Associate Director Rock-feller foundation New yark] ఆంధ్రప్రదేశ్‌నందు జరిగిన గ్రంథాలయాభివృద్ధిని

గురించి, గ్రంథాలయ సిబ్బందికి శిక్షణకై కలుగజేసిన సదుపాయములను గురించి కొనియాడుచు, ఈరాష్ట్రములో గ్రంథాలయ శాస్త్రముల శిక్షణపొందినవారు కావలసినంతమంది కలరు గనుక, గ్రంథాలయాలలో ఆధునిక పద్ధతుల నవలంబించుటకు వీలయినదని ప్రశంసించిరి.

పై సమావేశమునందే యునెస్కో నిపుణులు – అఖిల భారత గ్రంథాలయ సంఘ అధ్యక్షులు డి. ఆర్. కాలియాగారు ఈ రాష్ట్రమునందు గ్రంథాలయ శాస్త్ర శిక్షణకు తగు వసతుల కల్పించడం జరిగినదని, ప్రధానముగా ఈ వసతులను కలుగజేయుటకు శ్రీ రాఘవరెడ్డిగారు బహువిధముల కృషి సల్పిరని యీ క్రింది విధముగా పేర్కొనిరి.

"I am singularly happy to note the system of deputing Librarians Departmentally to under go the Library Training courses at State cost"

అదే సమావేశములో రాష్ట్రమునందు పౌరగ్రంథాలయములు గొప్ప అభివృద్ధిలోనికి వచ్చినవని, ఇందులకు రాఘవరెడ్డిగారు పలు సంవత్సరములుగా సల్పుచున్న కృషి ముఖ్యకారణమని చెప్పుచు యీ క్రింది విధముగా డి. ఆర్. కాలియాగారు రాఘవరెడ్డిగారి కృషిని గురించి కొనియాడిరి.

"But for the unstinted and devoted service to the cause of Public Libraries and the initiative Mr. Raghava Reddy took, Andhra Pradesh would not have been what it is Today".



# ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయాలలో సిబ్బంది - నైతిక విలువలను పెంపొందించుటకు కృషి:

## గ్రంథ పాలకుల విధి నిర్వహణకు తగు ప్రోత్సాహము అవసరము:

పౌర గ్రంథాలయములకు విచ్చేయు పాఠకులు-ఒక వర్గము, ఒక మతము, ఒక అభిప్రాయము కలవారై యుండరు. వివిధ అభిరుచులు, అభిలాషలు, అభిప్రాయములు కల విభిన్న మనస్తత్త్వము కలవారై యుందురు. జ్ఞానాభివృద్ధిని కాంక్షించు నిరక్షరాస్యుడు మొదలు విశ్వ విద్యాలయ పట్టభద్రుడు వరకు, సామాన్య పాఠకుడు మొదలు పండితునివరకు, ఎందరో గ్రంథాలయాలలో తమ అభిరుచికి, ప్రవృత్తికి తగిన గ్రంథములను పఠించు ఉద్దేశ్యముతో విచ్చేయు చుండుట సహజము. ఇట్టి ఎడల గ్రంథపాలకులు మంద బుద్ధులయినచో గ్రంథాలయ సేవ కుంటుపడగలదు. గ్రంథపాలకులు తమ గ్రంథాలయములకు అరుదెంచిన పాఠకుల అభిరుచులను గుర్తెఱింగి, వారి వారికి తగిన గ్రంథములను నందించుటలో తగు నేర్పఱితనము ప్రదర్శింపవలసి యున్నది. గ్రంథపాలకులు పాఠకుల మనస్తత్త్వము గ్రహించే వారుగా నుండుటయే గాక, గ్రంథ పరిజ్ఞానము గలిగి సేవా తత్పరతతో స్నేహ శీలురుగా యుండవలసి యున్నది. ఇట్టి కీలక పాత్ర వహించగల గ్రంథపాలకులుగా, అమెరికా, ఇంగ్లాండు డెన్మార్కు-స్వీడను మున్నగు పాశ్చాత్య దేశములలో తగు అర్హతలు గలవారిని నియమించుచున్నారు. గురుతరమైన బాధ్యతగల గ్రంథపాలకులకు తగినట్లుగా వేతనములు, ఉద్యోగములో ప్రమోషను తదితర సౌకర్యములు పొందగల అవకాశములు కల్పించియుండుటచే, పాశ్చాత్య

దేశములలో గ్రంథపాలకులు చురుకుగా యుంటూ ఉత్సాహముతో సేవాసక్తితో తమ విధ్యుక్త ధర్మమును నెరవేర్చుచున్నారు. గ్రంథపాలకులు తమ విధిని చక్కగా నిర్వర్తించుటకు వీలుగా వారికి ప్రభుత్వము తగు వేతనము, ప్రోత్సాహము నివ్వవలసియున్నది.

## గ్రంథపాలకులుగా శిక్షణ పొందిన వారినే నియమించుటకు నిర్ణయము :

1948 మదరాసు పౌర గ్రంథాలయ చట్టము మేరకు రాష్ట్రమునందు జిల్లా కేంద్ర గ్రంథాలయములను, శాఖాగ్రంథాలయములను స్థాపించడము జరిగినది. ప్రారంభములో గ్రంథపాలకులు పట్టభద్రులు గాకపోయినను, సామాన్య విద్యార్హతలు కలిగియుండిన చాలు ననే అభిప్రాయ ముండెడిది. కాని అప్పటి విద్యాశాఖ, గ్రంథాలయ శాఖ డైరెక్టరుగాయున్న డి. ఎస్. రెడ్డిగారు జనార్దనంనాయుడి గారితోను రాఘవరెడ్డిగారితోను సంప్రతించి, దూరదృష్టితో వ్యవహరించి గ్రంథపాలకులుగా గ్రంథాలయ స్థాయికి తగిన అర్హతలు కల వారినే నియమించవలెనని భావించినందున గ్రంథాలయ నిర్వహణ కెంతో ప్రయోజనము కలిగినది. వారి నిర్ణయము మేరకు పట్టభద్రులై, గ్రంథాలయ శాస్త్రమునందు డిప్లొమా లేదా డిగ్రీకోర్సు నందు శిక్షణ పొందినవారిని జిల్లా కేంద్ర గ్రంథాలయ గ్రంథపాలకులుగాను, గ్రంథాలయ శాస్త్రమునందు సర్టిఫికేటు కోర్సునందు శిక్షణ పొంది, మెట్రిక్యులేషన్, ఇంటర్మీడియట్ విద్యార్హత గలవారిని శాఖాగ్రంథాలయ గ్రంథపాలకులుగను నియమించుటకు నిర్ణయించడమైనది. శ్రీయుత డి. ఎస్. రెడ్డిగారి సముచిత నిర్ణయముతో, గ్రంథాలయ సేవకు, గ్రంథపాలకులకు ఒక విశిష్టమైన గుర్తింపు కలిగినది.

## గ్రంథ పాలకులకు అవసరమైన విద్యాయోగ్యతలకు, అర్హతలకు నిర్ణయము:

1948 మదరాసు పౌర గ్రంథాలయ చట్టము ప్రకారము ఏర్పాటయిన జిల్లా కేంద్ర గ్రంథాలయములకు, శాఖా గ్రంథాలయములకు గ్రంథపాలకులు ఈ దిగువ అర్హతలు కలిగిన వారై యుండునట్లు నిర్ణయించారు.

| గ్రంథాలయ స్థాయి | సామాన్య విద్యార్హతలు | వృత్తిలో అర్హత |
|---|---|---|
| 1. జిల్లా కేంద్ర గ్రంథాలయము | పట్టభద్రుడు | డిప్లొమా లేదా డిగ్రీ కోర్సు |
| 2. శాఖా గ్రంథాలయము గ్రేడ్ II | ఇంటర్ మీడియట్ | సర్టిఫికేటు కోర్సు |
| 3. శాఖా గ్రంథాలయము గ్రేడ్ III | మెట్రిక్యులేషన్ | సర్టిఫికేటు కోర్సు |
| 4. శాఖా గ్రంథాలయము | మెట్రిక్యులేషన్ | 5 సం॥ గ్రంథాలయ సేవానుభవము. |

## గ్రంథ పాలకుని నియామకములో అనుసరించిన విధానము:

గ్రంథాలయ శాసనము అమలునకు రాగానే జిల్లా కేంద్రములలో జిల్లా కేంద్ర గ్రంథాలయములు ఏర్పాటయినవి. కాని శిక్షణ పొందిన గ్రంథపాలకులు తగినంతమంది లేని కారణమున గ్రంథ పాలకులకు అవసరమైన విద్యార్హతలుండవలెనని పట్టభద్రులయిన వారిని ఎన్నుకొని వారిని ప్రభుత్వ ఖర్చుతో మదరాసు, ఆంధ్ర విశ్వవిద్యాలయములలో గ్రంథాలయ శాస్త్ర డిప్లొమా కోర్సుకు పంపిరి. శిక్షణ పొంది ఉత్తీర్ణులయిన వారిని జిల్లా కేంద్ర గ్రంథాలయ గ్రంథపాలకులుగా నియమించడము జరిగినది. తమ స్వంత ఖర్చులతోనే గ్రంథా

లయ శాస్త్రమునందు డిప్లొమా కోర్సులో ఉత్తీర్ణులయిన వారిని కూడా అవసరమునుబట్టి జిల్లా కేంద్ర గ్రంథాలయ గ్రంథ పాలకులుగా నియమించడము జరిగినది. జిల్లాలలో శాఖా గ్రంథాలయములు ఏర్పాటయిన తర్వాత స్థానిక ఉద్యోగ కల్పనా సంస్థల ద్వారా పంపబడిన విద్యార్హతలు గల వారినుండి ఎన్నిక చేసి వారిని కూడా లోకల్ లైబ్రరీ అథారిటీల ఖర్చుతో సర్టిఫికేటు కోర్సుకు పంపిరి. శిక్షణ పొందిన వారిని శాఖా గ్రంథాలయములకు గ్రంథపాలకులు గా నియమించిరి. విద్యార్హతలతో పాటు గ్రంథాలయ శాస్త్రము నందు సర్టిఫికేటు శిక్షణ పొందినవారు లభ్యమయినచో వారిని కూడ అవసరమును బట్టి గ్రంథ పాలకులుగా నియమించడము జరిగినది.

## తెలంగాణలో గ్రంథపాలకుల నియామకముపై అనుసరించిన విధానము :

తెలంగాణలో హైదరాబాదు పౌర గ్రంథాలయ చట్టము 1955 సం॥నందు అమలునకు వచ్చినది. చట్టము ప్రకారము ఆంధ్ర ప్రదేశ్ అవతరణానంతరము హైదరాబాదు నగరమునందు నగర కేంద్ర గ్రంథాలయముతో పాటు మిగత తొమ్మిది జిల్లా కేంద్రములందు జిల్లా కేంద్ర గ్రంథాలయములు ఏర్పాటయినవి. ఈ పది గ్రంథాలయ ములకు పదిమంది గ్రంథపాలకులను నియమించు అవసర మేర్పడినది. ఇందుకై అభ్యర్థుల నుండి దరఖాస్తులను కోరుతూ పత్రికా ప్రకటన జరిగినది. అభ్యర్థులను ఎన్నుకొనుటకు ప్రభుత్వము ఒక కమిటీని నియమించినది. ఇందులో ప్రధాన సభ్యులుగా గ్రంథాలయ శాస్త్ర ప్రవీణులయిన కె. రాఘవరెడ్డిగారుండిరి. అభ్యర్థుల నియామకములో యువకులను, ఉత్సాహవంతులను ఎన్నిక చేయడము జరిగినది. పది మందిని ఎన్నిక చేసి వీరిని ప్రభుత్వ వ్యయముతో గ్రంథాలయ శాస్త్ర డిప్లొమా శిక్షణకు పంపిరి. శిక్షణానంతరము వీరిని గ్రంథపాలకులుగా నియమించడము జరిగినది. శాఖా గ్రంథాలయములు నెలకొల్పి

నప్పుడు అందుకు తగిన అభ్యర్థులను ఎన్నికచేసి ఆంధ్రప్రాంతములో వలెనే డైరెక్టరు వీరిని శిక్షణకు పంపి, శిక్షణానంతరము ఆయా జిల్లాలలో శాఖాగ్రంథాలయ గ్రంథపాలకులుగా నియమించడము జరిగినది.

## గ్రంథాలయాలలో ఇతర సిబ్బంది నియామకముపై గైకొనిన విధానము:

జిల్లా కేంద్ర గ్రంథాలయాలతో పాటు ఆయా జిల్లాలలో శాఖా గ్రంథాలయాలు ఏర్పాటయిన తర్వాత వీటికి గ్రంథములు, పత్రికలు ప్రతిసంవత్సరము అధికముగా చేర్చడము జరిగినది. గ్రంథాలయాలలో గ్రంథములను వర్గీకరించి, సూచీకరించు సాంకేతిక భారమెక్కువయ్యి నది. జిల్లా కేంద్ర గ్రంథాలయ గ్రంథపాలకునకు తతిమ పనులతో పాటు సాంకేతిక పరమైన అనగా గ్రంథ వర్గీకరణ, సూచీకరణ చేయుటకు తగు వ్యవధి లేకపోవుచుండేను. అందుకై జిల్లా కేంద్రగ్రంథాలయములో ప్రథమ శ్రేణి గ్రంథపాలకుని స్థాయిలో అనగా గ్రేడ్ I లైబ్రేరియన్ (డిప్యూటీ లైబ్రేరియన్)గా పట్టభద్రులై, డిప్లొమో కోర్సు శిక్షణ పొందిన వారిని నియమించడము జరిగినది. గ్రంథపాలకులకు సహకరించుటకు జిల్లా గ్రంథాలయ సంస్థలలో, కార్యాలయములలో అవసరమైన గుమాస్తా, అటెండరు, బంట్రోతులను స్థానిక ఉద్యోగకల్పనా సంస్థల ద్వారా పంపబడిన అభ్యర్థుల నుండి ఎన్నికచేసి ఆయా గ్రంథాలయ సంస్థల చైర్మేన్‌లు నియమించిరి. ఈ ఉద్యోగాల అర్హతలు తతిమ ప్రభుత్వ సంస్థలలోని ఉద్యోగార్హతలకు సమానమైనవిగా వుండాలని నిర్ణయించారు.

## గ్రంథ పాలకుల వేతనములు:

మదరాసు రాష్ట్రములోని గ్రంథాలయోద్యోగుల జీతముల వలె ఆంధ్ర ప్రదేశ్‌లో కూడ గ్రంథాలయోద్యోగుల జీతములు తగి

నంత ప్రోత్సాహ కరముగా లేకుండెను. 1952 లో జిల్లా కేంద్ర గ్రంథాలయ గ్రంథ పాలకులకు వేతనము రూ. 75—5—145 మరియు ఇతర అలవెన్సులు నుండినవి. 1955 లో వీరి వేతనము రూ. 85 - 5 - 125 - 10 - 175 లకు పెంచబడినది.

1955 లో శాఖా గ్రంథాలయములందు రెండవ గ్రేడు లైబ్రేరియన్ జీతము రూ. 65—5—125 లు, మూడవ గ్రేడ్ లైబ్రేరియన్ జీతము రూ. 45-3-60-2-90 లు. వేతనముగా నిర్ణయించడమైనది.

రెండవ గ్రేడు లైబ్రేరియన్లకు తమ విద్యార్హతకు కొంత ప్రోత్సాహము లభించి నట్లయినది. వారిలో కొంత సంతృప్తి కలిగినది.

1—11—1958 లో గ్రేడ్ I గ్రంథపాలకులకు, 1960 లో గ్రేడ్-2 మరియు గ్రేడ్-3 గ్రంథ పాలకులకు వేతనములు కొంత సవరించడము జరిగినది. కాని గ్రంథపాలకుల బాధ్యతలకు తగినట్లుగా వారి వేతనములు పెరుగలేదు.

1961 సం॥మున ప్రచురింపబడిన కేంద్ర ప్రభుత్వ నియమిత సలహా సంఘముచే తయారు చేయబడిన రిపోర్టునందు పౌర గ్రంథాలయ ములందలి గ్రంథ పాలకులకు విద్యాశాఖలో పనిచేయు అధ్యాపకులకు వలెవారివారి సమాన అర్హతల ననుసరించి ఒకే వేతన ముండుట సమంజసమని సూచించిరి. అనగా విద్యాశాఖలో బి. ఎ., బి. ఇ. డి.; అర్హతలు గలిగిన అధ్యాపకునికి బి. ఎ , బి. ఎల్. ఎస్. సి. అర్హతలు గలిగిన గ్రంథ పాలకునకు ఒకే జీతముండవలెనని సూచించినారు. ఈ సూచనకు పౌర గ్రంథాలయ పాలకులు తమ అసమ్మతిని తెలిపిరి. గ్రంథాలయ పాలకులకు గ్రంథముల కాపాడు బాధ్యతతో పాటు, గ్రంథాలయములలో ఉదయము, సాయంకాలము పని చేయుటచే వారు కొన్ని సౌకర్యములు కోల్పోవు చున్నారు. గ్రంథాలయో

ద్యోగులకు సెలవు దినములు తక్కువ. సెలవు దినములలో సైతము గ్రంథాలయాలు కొంత సమయము పని చేయవలసి యున్నది. ఈ కారణములచే ఉపాధ్యాయుల కంటె గ్రంథపాలకుల కెక్కువ వేతన ముండుట సమంజసమని భావించిరి.

రాష్ట్ర ప్రభుత్వము గ్రంథాలయోద్యోగుల వేతనముల పరిశీలన నిమిత్తము ఒక కమిటీని 1963 డిసెంబరులో నియమించినది. ఈ కమిటీకి కె. రాఘవరెడ్డిగారు చైర్మెన్‌గా నియమింపబడిరి. ఈ కమిటీ 4 పర్యాయములు సమావేశమై వివిధ కోణముల నుండి పరిశీలించి ప్రభుత్వమునకు క్రింది సిఫార్సులను చేసినది.

1. జిల్లా కేంద్ర గ్రంథాలయ గ్రంథ పాలకులకు, ఉపగ్రంథ పాలకులకు రూ. 180 – 7½ – 210 – 10 – 290 – 15 – 350 లు వేతనముగా చెల్లించవలెను.

2. రాష్ట్రములోని ప్రథమశ్రేణి గ్రంథాలయ గ్రంథపాలకులలో (జిల్లా కేంద్ర గ్రంథపాలకులు మరియు ఉపగ్రంథపాలకులు) నాలుగవ వంతు సెలక్షను గ్రేడుగా నుండవలెను.

3. సెలక్షను గ్రేడు గ్రంథపాలకులకు (గ్రేడ్ I) రూ॥లు 220 – 10 – 290 – 15 – 425 వేతనముగా చెల్లించవలెను.

4. మూడు సంవత్సరముల సర్వీసు సంతృప్తికరముగా నిర్వహించిన గ్రంథపాలకులకు ఒక ఇంక్రిమెంటును అదనంగా చెల్లించవలెను,

5. మూడవ గ్రేడ్ లైబ్రేరియన్లకు రూ. 90 – 4 – 110 – 5 – 150 లు, వేతనముగా చెల్లించవలెను.

6. గ్రంథాలయాలలో పని చేయు గుమాస్తాలకు, అటెండర్లకు నాల్గవ తరగతి సిబ్బందికిచ్చు ప్రభుత్వ వేతన స్కేళ్ళను నిర్ణయించవలెను.

ప్రభుత్వము ఈ కమిటీ సిఫారసులను పరిశీలించి విద్యాశాఖ తోను, ఆర్థికశాఖతోను చర్చలు జరిపిన అనంతరము 1–5–1966 వ తేదీన ఈ క్రింది విధముగా పౌర గ్రంథాలయోద్యోగుల వేతనములను నిర్ణయించినది.

| | గ్రంథపాలకులు | సవరణకు ముందుండిన వేతనములు | సవరింపబడిన వేతనములు |
|---|---|---|---|
| 1. | జిల్లా కేంద్ర గ్రంథాలయాధికారులు జి॥ గ్రం॥ సం॥ కార్యదర్శులు | 125 – 5 – 160 – 7½ – 220 | 220 – 20 – 400 – 25 – 500 |
| 2. | గ్రేడ్ I గ్రంథపాలకులు (ఉప గ్రంథపాలకులు) | ,, | 180 – 7½–210– 10 – 280 – 15 – 400 |
| 3. | గ్రేడ్ II గ్రంథపాలకులు | 100–4–130– 5–150–7½–180 | 110–4–130– 5–150–7½–180 |
| 4. | గ్రేడ్ III గ్రంథపాలకులు | 80–4–100– 5–150 | 90–4–110– 5–150 |

కానీ ఈ సవరించిన వేతనములు గ్రంథపాలకులకు ఆశించినంత ప్రోత్సాహకరంగా లేదు. పుస్తకపంపిణీ కేంద్రములలో పని చేయు గ్రంథాలయ నిర్వాహకులకు చాల సంవత్సరములుగా నెలకు రూ. 7–50 రెమ్యునరేషన్ ఇచ్చుచుండిరి. దీనిని 1968 సం॥రమున నెలకు రూ. 12/– ల మేరకు పెంచడము జరిగినది.

## గ్రంథాలయ సిబ్బందిని ప్రభుత్వోద్యోగులుగా గుర్తించుటకు జరిగిన ప్రయత్నము :

రాష్ట్ర కేంద్ర గ్రంథాలయ, ప్రాంతీయ గ్రంథాలయాల, ఏలూరు సంచార గ్రంథాలయము యొక్క సిబ్బందిని మాత్రము

ప్రభుత్వోద్యోగులుగా గుర్తించడము జరిగినది. కాని దురదృష్టవశాత్తు అదే శాఖలో పని చేయు జిల్లా గ్రంథాలయ సంస్థల గ్రంథాలయోద్యోగులను ప్రభుత్వోద్యోగులుగా గాని, స్థానికసంస్థల ఉద్యోగులుగా గాని గుర్తించలేదు. వీరు ఏ తరగతికి చెందిన ఉద్యోగు లనువిషయము గ్రంథాలయ చట్టములో స్పష్ట పరచలేదు. గ్రంథాలయ శాఖలో పని చేయు గ్రంథాలయోద్యోగు లెల్లరినీ ప్రభుత్వోద్యోగులుగా గుర్తించడము సబబని గ్రంథాలయోద్యోగులతో పాటు గ్రంథాలయ కార్యకర్తలు, గ్రంథాలయాభిమానులు భావించి ప్రభుత్వమునకు సూచించిరి. మదరాసు పౌరగ్రంథాలయ చట్టములోనే గాక 1955లో అమలునకు వచ్చిన హైదరాబాదు పౌర గ్రంథాలయ చట్టమునందు కూడ గ్రంథాలయోద్యోగుల సర్వీసును గూర్చి స్పష్టపరచలేదు. ఇది ప్రధానమైనలోపముగా భావించ వచ్చును. ఈ లోపకారణంగా జిల్లా గ్రంథాలయ సంస్థలలో పని చేయు గ్రంథాలయోద్యోగులు చాల కాలము ప్రభుత్వోద్యోగులు, స్థానిక సంస్థల ఉద్యోగులు పొందు, తతిమ సౌకర్యములు పొందక పోగా సకాలములో మాసిక వేతనములు కూడ కొన్ని సందర్భములలో పొందలేకుండిరి. ఆంధ్ర రాష్ట్ర అవతరణానంతరము జరిగిన గ్రంథాలయ సదస్సులందు, జిల్లా గ్రంథాలయ సంస్థ చైర్మన్, కార్యదర్శుల సమావేశములలో జిల్లా గ్రంథాలయసంస్థ ఉద్యోగుల నెల్లరినీ ప్రభుత్వోద్యోగులుగా గుర్తించవలెనని తీర్మానములు జరిగినవి. డైరెక్టరు కె. రాఘవరెడ్డిగారు తీర్మానమును బలపరచుచూ తనసిఫార్సులతో గ్రంథాలయోద్యోగుల నెల్లరినీ ప్రభుత్వోద్యోగులుగా గుర్తించుట సమంజసమని ప్రభుత్వమునకు తెలుపుచుండిరి.

రాష్ట్ర కేంద్ర గ్రంథాలయ కమిటీ సభ్యులు మాత్రము, ప్రారంభములో గ్రంథాలయ సంస్థలలో పనిచేయు జిల్లా కేంద్ర గ్రంథాలయాధికారులను (కార్యదర్శులను) ప్రభుత్వోద్యోగులుగా

గుర్తించి తర్వాత క్రమముగా తతిమ ఉద్యోగులను ప్రభుత్వోద్యోగులుగా పరిగణించ వచ్చునని అభిప్రాయపడిరి.

1961 లో కేంద్ర ప్రభుత్వముచే నియమింపబడిన సలహా సంఘ సభ్యులు తమ రిపోర్టులో జిల్లా కేంద్ర గ్రంథాలయ సంస్థ ఉద్యోగులెల్లరినీ ప్రభుత్వోద్యోగులుగా గుర్తించడము సమంజసమని సిఫార్సు చేశారు. ఈ నివేదికలోని సిఫార్సు ననుసరించి కె. రాఘవరెడ్డిగారు జిల్లా గ్రంథాలయ సంస్థ ఉద్యోగుల నెల్లరినీ ప్రభుత్వోద్యోగులుగా గుర్తించడము ఇటు గ్రంథాలయోద్యోగుల సంక్షేమమునకు, గ్రంథాలయోద్యమ వ్యాప్తికి శ్రేయోదాయకమని గట్టిగా ప్రభుత్వమును కోరారు. ప్రభుత్వము మాత్రము గ్రంథాలయ చట్టమును సవరించిన గాని, గ్రంథాలయోద్యోగులను ప్రభుత్వోద్యోగులుగా గుర్తించడము వీలుకాదని తెలిపినది. ఇందుకు అనుగుణంగా 1963-64 లో సవరణ బిల్లును రూపొందించి ప్రజాభిప్రాయ సేకరణ కొఱకు ప్రకటించారు. గ్రంథపాలకులకు ప్రత్యేక గ్రంథాలయ సర్వీసు (Separate Library Service) ఏర్పాటు చేయవలెనని ఈ సవరణయందు సూచించడము జరిగినది. అసెంబ్లీలో ఈ సవరణా చట్టము చర్చకు వచ్చిన సందర్భములో పెక్కుమంది అసెంబ్లీ సభ్యులు గ్రంథాలయోద్యోగులను ప్రభుత్వోద్యోగులుగా గుర్తించడము సముచితమని తెలియజేశారు. విద్యామంత్రిగారు సభ్యుల అభిప్రాయముతో ఏకీభవించి, ఈ సవరణ సముచితమైనదని వివరించారు. సవరణా ఏకగ్రీవముగా ఆమోదింపబడినది. 28-2-1964 న జరిగిన రాష్ట్ర కేంద్ర గ్రంథాలయ కమిటీ సమావేశములో కూడ జిల్లా గ్రంథాలయ సంస్థ ఉద్యోగుల నెల్లరినీ ప్రభుత్వోద్యోగులుగా పరిగణించాలని కమిటీసభ్యులు తీర్మానించారు.

సవరణ చట్ట ప్రకారము గ్రంథాలయోద్యోగులను ప్రభుత్వోద్యోగులుగా గుర్తించ వలెననుటలో సందేహమునకు తావు లేదు.

ఈ సవరణ ననుసరించి గ్రంథాలయోద్యోగుల సేవా నిబంధనలను రూపొందించి (Service Rules) డైరెక్టరుగారు ప్రభుత్వ ఆమోదమునకు పంపిరి. ప్రభుత్వము ఈ నిబంధనలను పరిశీలించి గ్రంథాలయ సంస్థ ఉద్యోగులను వెంటనే ప్రభుత్వోద్యోగులుగా గుర్తించ వీలుకాదని తెలియజేసిరి. ప్రభుత్వ నిర్ణయమునకు ప్రతీక్షించుచుండిన గ్రంథాలయోద్యోగులేగాక గ్రంథాలయ కార్యకర్తలు కూడా నిరుత్సాహపడిరి. కాని నిరాశ జెందని గ్రంథాలయోద్యోగులు పట్టువిడువకుండా తరచుగా జరుగు సమావేశములందు, సదస్సులందు, ఉద్యోగుల సంఘములందు తీర్మానములు చేస్తూ ప్రభుత్వమునకు వినతి పత్రములను పంపుచుండిరి.

జిల్లా గ్రంథాలయ సంస్థ కార్యదర్శిగా పదవీ విరమణ జేసిన శ్రీ ఎన్. యం. రెడ్డిగారు చట్టములోని 19 ఎ. సెక్షను మేరకు తాను ప్రభుత్వోద్యోగినే అంటూ తనకు పెన్షను, గ్రాచ్యుటీ రావలెనని దావా వేశారు. వీరికి అనుకూలంగా హైకోర్టు తీర్పు నిచ్చినది.

1965 మైసూరు పౌర గ్రంథాలయ చట్టమునందును, 1967 మహారాష్ట్ర పౌర గ్రంథాలయ చట్టమునందును, గ్రంథాలయోద్యోగులను ప్రభుత్వోద్యోగులని స్పష్ట పఱచబడియున్నది. ఈ చట్టములోని ఈ విషయమును ప్రత్యేకంగా గుర్తు చేసి కె. రాఘవరెడ్డిగారు గ్రంథాలయోద్యోగులను ప్రభుత్వోద్యోగులుగా గుర్తించుటలో జాప్యము చేయరాదని ప్రభుత్వమునకు తెలియ జేశారు. కాని యింతవరకు గ్రంథాలయోద్యోగులను ప్రభుత్వోద్యోగులుగా గుర్తించలేదు.

ఆంధ్రప్రదేశ్ జిల్లా గ్రంథాలయ సంస్థ ఉద్యోగుల సంఘము చేసిన కృషివల్ల, జిల్లా గ్రంథాలయ సంస్థ ఉద్యోగులెల్లరికి పెన్షను, గ్రాచ్యుటీ సౌకర్యము కల్పించి, వారి వేతనముల ఖర్చును ప్రభు

త్వము గ్రాంటుగా యిచ్చి భరించుటకు 1975 సం॥మున అంగీక రించినది. ఇందువల్ల గ్రంథాలయోద్యోగులకు కొంత ఊరట లభించినదేగాని వారి చిరకాల వాంఛ నెరవేరలేదు,

1976 సం॥మున గ్రంథాలయాభివృద్ధికి తీసికోదగు చర్యలను గూర్చి ఒక రిపోర్టును రూపొందించ వలసినదిగా ప్రభుత్వము ఒక ఒక రివ్యూ కమిటీని నియమించినది. ఇందులో శ్రీ. రాఘవరెడ్డిగారు సభ్యులు. వీరు రివ్యూకమిటీ సభ్యులతో ఈ విషయము చర్చించి గ్రంథాలయోద్యోగులను ప్రభుత్వోద్యోగులుగా గుర్తించు విధంగా రివ్యూ రిపోర్టులో పేర్కొనునట్లు కృషి చేశారు. ఈ రిపోర్టును ప్రభుత్వమునకు పంపడమైనది. కర్నాటక రాష్ట్రమునందములులో గల పౌర గ్రంథాలయ చట్టము ప్రకారము, గ్రంథాలయ సిబ్బందికి తగు వసతులు కల్పించబడు విధముగా, ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ చట్టమును రూపొందించవలెనని వివరించుచు రాఘవరెడ్డిగారు పంపిన నివేదికలో, ఈ క్రింది విధముగా తెలియజేసిరి.

1. "The State Government shall establish Andhra Pradesh State Library Service and appoint persons there to;

2. "All members of the said service shall be Government servants and their recruitment and conditions of service shall, subject to the provisions under the Article 309 of the constitution, be regulated by such rules as may be prescribed.

3. The Salary, allowance, gratuity, Pension and other benifits of the members of the Andhra Pradesh State Library Serevice shall be met from the consolidated fund of the state."

# నైతిక విలువలను పెంపొందించుటకు కృషి

## విద్యాశాఖాధికారులు కాకుండా, గ్రంథ పాలకులే సాంకేతిక సూచన లొసంగు బాధ్యతలు వహించునట్లు ఏర్పాటు:

1948 మద్రాసు పౌర గ్రంథాలయ చట్టము ప్రకారము, లోకల్ లైబ్రరీ అథారిటీ కార్యదర్శులుగా ఆయా జిల్లా విద్యా శాఖాధికారులు నియమింపబడిరి. వీరు గ్రంథాలయ శాస్త్రములో శిక్షణ పొందిన వారు కారు. గ్రంథాలయ శాస్త్రములో శిక్షణ పొందిన జిల్లా కేంద్ర గ్రంథ పాలకులు సాంకేతిక విషయాలలో అనుభవము లేని విద్యాశాఖాధికారులనుండి సలహాలను పొందడము ఉచితముగా లేకుండెను. పరస్పర అవగాహన లేని కారణంగా గ్రంథాలయాలను సాంకేతికంగా అభివృద్ధి పరచుటలో అవరోధములు ఏర్పడుచుండెను. ఈ విషయమును దృష్టిలో యుంచుకొని 1960 సం॥ములో సవరింపబడిన చట్టములో సాంకేతికమైన విషయాలలోనే కాకుండా జిల్లాలో గ్రంథాలయాల పరిపాలన, ఉద్యోగుల సెలవు మంజూరు, బడ్జెటు రూపొందించుట, పుస్తకముల కొనుగోలు మున్నగు విషయములపై జిల్లా విద్యాశాఖాధికారి నుండి అధికారములను జిల్లా కేంద్ర గ్రంథపాలకునికి మార్చడము జరిగినది.

ఈ విధముగా జిల్లా గ్రంథాలయ పరిపాలనాధికారము, సాంకేతికమైన నిర్ణయములను గైకొను అధికారములను జిల్లా కేంద్ర గ్రంథాలయాధికారులకే యివ్వడము దేశమునందు ప్రప్రథమంగా మన రాష్ట్రములోనే జరిగడము గర్వకారణముగా పేర్కొన వచ్చును. తద్వారా గ్రంథాలయాధి కారులలో నైతిక విలువలు పెంపొంది వారిలో ఆత్మ విశ్వాసము ఏర్పడినదని భావింప వచ్చును.

## జిల్లా కేంద్ర గ్రంథపాలకులను జిల్లా గ్రంథాలయాధికారులుగా (District Library officer) నియమించుటకు సూచన:

జిల్లా విద్యాశాఖాధికారి విద్యా సంబంధమైన వ్యవహారములకే తమ కాలము నుపయోగింపవలసి వచ్చుటవలనను, జిల్లా గ్రంథ సంస్థ కార్యకలాపములు గూడ పర్యవేక్షించడము కష్ట సాధ్యముగా యున్నందునను గ్రంథాలయ శాస్త్రములో సాంకేతిక శిక్షణ పొందిన జిల్లా కేంద్ర గ్రంథాలయాధికారులే జిల్లా గ్రంథాలయ సంస్థ కార్యదర్శులుగా యుండడము సమంజసమని ప్రభుత్వము గుర్తించినది. ఆ మేరకు జిల్లా కేంద్ర గ్రంథాలయాధికారులే జిల్లా గ్రంథాలయ సంస్థ కార్యదర్శులుగా వ్యవహరించుటకు ప్రభుత్వము ఉత్తర్వు చేసినది. ఆ రీతిగ గ్రంథాలయ చట్టమును సవరించడము జరిగినది. జిల్లా గ్రంథాలయ సంస్థ కార్యదర్శులుగా వ్యవహరిస్తున్నవారు జిల్లా కేంద్ర గ్రంథాలయాధికారులుగా పిలువబడుట కంటె జిల్లా గ్రంథాలయాధికారులుగా (District Library Officer) పిలువబడడము సమంజసమని రాఘవరెడ్డిగారు సిఫార్సు చేశారు. ఈ విధమైన మార్పుకు ప్రభుత్వమున కేవిధమైన వ్యయము కాదనియు, ఈ విధమైన మార్పువల్ల గ్రంథాలయోద్యోగులలో నూతన చైతన్యము కలిగి వారిలో నైతిక విలువలు పెంపొందుట కిదొక మార్గమని చెప్పారు. ఇదే విధముగా గ్రేడు II, గ్రేడ్ III గ్రంథాలయాధికారుల హోదాను కూడా ఆకర్షణీయంగా మార్చవలెనని సూచించారు.

## జిల్లా కేంద్ర గ్రంథాలయాలలో గ్రంథ వర్గీకరణ, సూచీకరణ జరుగుటకు ప్రథమ శ్రేణి గ్రంథాలయాధికారుల ప్రత్యేక నియామకము:

జిల్లా గ్రంథాలయ సంస్థలలో పనిచేయు గ్రంథాలయోద్యోగులలో చాలమంది పట్టభద్రులయి యుండి, గ్రంథాలయ శాస్త్ర

ములో డిప్లొమా శిక్షణ పొంది యుండిరి. కాని వీరు ప్రమోషను లేక గ్రేడ్ II లేదా గ్రేడ్ III గ్రంథాలయాధికారులుగానే యుండిరి. వీరిలో నిరుత్సాహ మేర్పడి నిరాశలతో గడుపు చుండిరి. దీనికి తోడు గ్రంథాలయాలలో వర్గీకరణ, సూచీకర ణకు సంబంధించిన సాంకేతికమైన పని చురుకుగా సాగకయుండెను. అందువలన రాఘవరెడ్డిగారు గ్రంథాలయోద్యోగులకు ప్రమోషను లభించి ఉన్నతస్థితి పొందగలుగు అవకాశముండునట్లుగా ప్రతి జిల్లా కేంద్ర గ్రంథాలయమందు ఉప గ్రంథాలయాధికారి పదవిని కలుగచేసి ఆ పదవులకు అర్హులైన గ్రంథాలయోద్యోగులను నియ మించారు. ఇంతే కాకుండా జిల్లాలలో అవసరమైనచోట్ల పెద్ద శాఖా గ్రంథాలయాలలో కూడ గ్రేడ్ I లైబ్రేరియన్‌లను నియ మించుటకు ప్రమోషను అవకాశము కల్పించారు. ఈ అవకాశము ద్వారా ఎంతోమంది పట్టభద్రులయి, డిప్లొమా లేదా డిగ్రీ కోర్సు శిక్షణ పొందిన గ్రేడ్ II గా వున్నవారు ప్రమోషను పొందారు.

## ద్వితీయ, తృతీయ శ్రేణి గ్రంథాలయాధికారులకు ప్రోత్సాహము :

పై స్థాయికి ప్రమోషను అవకాశము కల్పించినందున గ్రంథా లయోద్యోగులలో నూతనోత్సాహము కలిగినది. రాఘవరెడ్డిగారు గ్రంథాలయోద్యోగులకు ఇంటర్‌మీడియట్, డిగ్రీ పరీక్షలకు ప్రయివే టుగా కూర్చొనుటకు అనుమతి నిప్పించారు. గ్రంథాలయ శిక్షణలో సర్టిఫికేటు, డిప్లొమాకోర్సులలో శిక్షణపొందుటకు, డెప్యుటేషన్ ద్వారా పంపబడుటకు అవకాశము కల్పించారు. ఇందువల్ల గ్రేడ్ II లైబ్రే రియన్లు డిప్యూటీ లైబ్రేరియన్లుగాను, గ్రేడ్ III లైబ్రేరియన్లు గ్రేడ్ II లైబ్రేరియన్లుగను, పైస్థాయికి ప్రమోటు కాగల అవకాశము లభించినది. శాఖా గ్రంథాలయ పరిధిలోనున్న సహాయక గ్రంథాల యాల పర్యవేక్షణ, వార్షిక తనిఖీ బాధ్యతలను ఆయా శాఖా

గ్రంథాలయాధికారులకే సంక్రమింప జేయడమువలన వారిలో ఆత్మ విశ్వాసము, నైతికవిలువలు పెంపొందినవి.

**ఇతర సిబ్బందికి ప్రోత్సాహము :**

గ్రంథాలయ సంస్థలలో పనిచేయు అటెండరు, బంట్రోతు (నాల్గవ తరగతి ఉద్యోగులు) కూడ తమ విద్యార్హతలు పెంచుకొను అవకాశము కల్పించి, వారికి ప్రమోషను లభించు అవకాశములు కల్పించడమైనవి. ఇందుకు అనుగుణమైన సేవా నిబంధనలను 1966 లో రూపొందించారు. ఈ సదవకాశమును సద్వినియోగపరచుకొన్న గ్రంథాలయోద్యోగు లెందరో కలరు. ఉదాహరణకు: అనంతపురం జిల్లాలో ఆరవ తరగతి మాత్రము చదివిన ఎస్. రసూల్‌ఖాన్ బంట్రోతుగా చేరి స్వయంకృషితో ప్రయివేటుగా మెట్రిక్యులేషన్ పరీక్షచేసి, తర్వాత సాయంకళాశాలలో పి. యు. సి. చదివి ఉత్తీర్ణుడయి గ్రంథాలయశాస్త్రములో సర్టిఫికేటుకోర్సు శిక్షణ పొంది ఇప్పుడు గ్రేడ్ II లైబ్రేరియన్‌గా పని చేయుచుండుట అభినందనీయ విషయము.



**బంట్రోతుగా ప్రవేశించి ప్రయివేటుగా పట్టభద్రుడై చోడవరంలో గ్రేడ్ I లైబ్రేరియన్‌గా పని చేయుచున్న శ్రీ యం. సాంబమూర్తి.**

విశాఖజిల్లాలో బంట్రోతుగా ప్రవేశించిన శ్రీ యం, సాంబమూర్తి ప్రథమ శ్రేణి గ్రంథాలయాధికారిగాను, నల్గొండ జిల్లాలో కంటిన్ జెంట్ ఉద్యోగిగా చేరిన కె. చంద్రమౌళి ద్వితీయశ్రేణి గ్రంథాలయాధికారిగాను, పౌరగ్రంథాలయ శాఖ కార్యాలయమందు బంట్రోతుగా చేరిన శ్రీ ఆనందరావు అప్పర్ డివిజన్ గుమాస్తాగాను ప్రమోషను పొందినారు.



**పౌర గ్రంథాలయశాఖ డైరెక్టరు కార్యాలయమునందు బంట్రోతుగా ప్రవేశించి ప్రయివేటుగా విద్యార్హతలను పొంది యు.డి, సి.గా పని చేయుచున్న శ్రీ ఆనందరావు.**

వీరెల్లరూ తమ స్వయంకృషితో విద్యార్హతలను పెంచుకొని పై పదవులను చేపట్టిన వారే. రాఘవరెడ్డిగారు యీ విధముగా ఉన్నత విద్యార్హతలను పొందినవారి కధికమైన ప్రోత్సాహమిచ్చి అవకాశమున్నపుడు ప్రమోషను లభింపజేసెడివారు. రాష్ట్రములో ఇటువంటి సదుపాయములు పొందిన ఎందరో గ్రంథాలయోద్యోగులు ఆత్మవిశ్వాసముతో పని చేయుచున్నారు.

రివ్యూ కమిటీలో రాఘవరెడ్డిగారు గ్రంథాలయోద్యోగులను ఒక పదవిలో చాల కాలము ప్రమోషను లేకుండ వుంచడము

మంచిదికాదనియు అది గ్రంథాలయ ఉద్యమవ్యాప్తికే అవరోధము కాగలదనియు భావించి కొన్ని పై పదవులను సృష్టించాలని సూచించినారు.

## రాష్ట్ర కేంద్ర గ్రంథాలయ సిబ్బంది కొసంగిన ప్రోత్సాహము :

జిల్లా గ్రంథాలయ సంస్థ ఉద్యోగులవలె రాష్ట్ర కేంద్ర గ్రంథాలయములో పని చేయు ఉద్యోగులు కూడా చాల కాలము ప్రమోషనులు లేక నిరాశతో యుండిరి. రాఘవరెడ్డిగారు వీరి విషయములో కూడా అదేవైఖరి అవలంబించి పట్టభద్రులయి గుమాస్తాలుగా నున్నవారిని గ్రంథాలయ శాస్త్రములో డిప్లొమా కోర్సునందు శిక్షణ పొందుటకు ప్రభుత్వ వ్యయముతో పంపిరి. శిక్షణ జయప్రదము చేసిన ఉద్యోగులెల్లరినీ అవకాశమును బట్టి రాష్ట్ర కేంద్ర గ్రంథాలయములో ప్రథమ శ్రేణి గ్రంథాలయాధికారులుగా నియమించారు. రాష్ట్రములో ప్రాంతీయ గ్రంథాలయములను ఏర్పాటుచేసి అందులో అవసరమైనంత వరకు వీరి నుండి ప్రమోటుచేసి నియమించారు. రాష్ట్ర కేంద్ర గ్రంథాలయ గ్రంథపాలకుని స్థాయిని పెంచి అధికారములను విస్తృత పఱచడమైనది. వారికి సంవత్సర బడ్జెటు తయారు చేయుటలోను, పుస్తకముల జాబితా తయారు చేయుటలోను, గ్రంథాలయములో కొన్ని స్థాయిల వరకు ఉద్యోగ నియామకములు చేయుటలోను అధికార మివ్వడమైనది. రాష్ట్ర కేంద్ర గ్రంథాలయ సలహా కమిటీకి గ్రంథపాలకునే సెక్రటరీగా నియమించుటతో రాష్ట్ర కేంద్ర గ్రంథాలయ గ్రంథ పాలకునిలో ఆత్మ విశ్వాసము, నైతిక విలువ పెంపొందినది.

## ప్రాంతీయ గ్రంథాలయాలలో సిబ్బంది నైతిక విలువల పెంపుదలకై యొసంగిన ప్రోత్సాహము:

ప్రాంతీయ గ్రంథాలయ గ్రంథపాలకునకు కూడ కొన్ని స్వతంత్ర అధికారము లొసంగబడినవి. బడ్జెటు తయారు చేయుటలోను, పుస్తకముల జాబితా తయారు చేయుటలోను, పుస్తక నిర్ణయ కమిటీ ఎన్నిక చేసిన తరువాత, వాటిని కొనుగోలు చేయుటలోను, కొన్ని ఉద్యోగాల నియామకములో ప్రాంతీయ గ్రంథాలయాధికారికి కొంత స్వేచ్ఛ యివ్వబడినది. ఈ విధంగా ప్రాంతీయ గ్రంథాలయాధికారులకు తగు ప్రోత్సాహము లభించినది. వీరికి ప్రోత్సాహము నివ్వవలెనని నాల్గవ పంచవర్ష ప్రణాళికయొక్క డ్రాప్టునందు సూచింపబడినది.

## విశ్వవిద్యాలయములలో ప్రయివేటుగా విద్య నభ్యసించుటకు కలిగించిన వసతులు:

జిల్లా గ్రంథాలయ సంస్థలలో పనిచేయు గ్రంథాలయోద్యోగులకు విశ్వవిద్యాలయ స్థాయిలో ఉన్నత విద్యను ప్రయివేటుగా అభ్యసించు అవకాశము లేకుండెను. రాఘవ రెడ్డిగారు ఉస్మానియా విశ్వవిద్యాలయ, శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయాధిపతులతో చర్చించి, గ్రంథాలయాలలో రెండు సంవత్సరముల అనుభవము కలవారెల్లరు ప్రయివేటుగా విశ్వవిద్యాలయ స్థాయిలో డిగ్రీపరీక్షలకు హాజరగుటకు అవకాశము కల్పించిరి. ఈ సదవకాశముతో పలు గ్రంథాలయోద్యోగులు పట్టభద్రులు, మాష్టరు డిగ్రీలు కూడ పొందగలిగిరి.

ఆంధ్ర, ఉస్మానియా విశ్వవిద్యాలయమువారు సర్టిఫికేటు కోర్సును కొంతకాలము తర్వాత నిర్వహించుట నిలిపివేశారు. కొంత

మంది సర్టిఫికేటు కోర్సులలో ఉత్తీర్ణులు కాని గ్రంథాలయోద్యోగుల సాంవత్సరిక ఇంక్రిమెంట్లు చెల్లించుటలో పేచీవచ్చినది. సర్టిఫికేటు శిక్షణలో ఉత్తీర్ణులయితే గాని ఇంక్రిమెంట్లు ఇవ్వరాదని నిలిపి చేయడమైనది. రాఘవరెడ్డిగారు ఏ పరిస్థితులలోను ఇంక్రిమెంట్లు ఆపుదల చేయరాదని ఆదేశములిచ్చి గ్రంథాలయోద్యోగులను ఆదుకొన్నారు.

## గ్రంథాలయ సిబ్బందిని తరచుగా బదిలీ చేయడము సమంజసము కాదు :

గ్రంథాలయాధికారులను తరచుగా బదిలీ చేసినచో ఇబ్బందులకు గురియగుటయేగాక, వారు పాఠకులతో సన్నిహితమును కోల్పోయి క్రొత్త ప్రాంతములలో గ్రంథాలయ నిర్వహణ సక్రమంగా నిర్వహించలేరని తఱచుగా బదలీలు జరుగకుండా చూచెడివారు.

## గ్రంథ పాలకుల నుండి సెక్యూరిటీ డిపాజిట్లును వసూలు చేయుటను నిలుపుదల చేయుట :

జిల్లా గ్రంథాలయ సంస్థలలో గ్రంథాలయోద్యోగులుగా నియమింపబడిన వారి నుండి సెక్యూరిటీ డిపాజిట్టు వసూలు చేసెడివారు. ఈ సెక్యూరిటీ డిపాజిట్టు నుండి గ్రంథాలయములో తస్కరింపబడిన గ్రంథ మూల్యమును వసూలు చేసెడివారు. ఈ పద్ధతి సమంజసమైనది కాదనియు, గ్రంథాలయోద్యోగులను శంకించినట్లు కాగలదనియు రాఘవరెడ్డిగారు ఈ సెక్యూరిటీ డిపాజిట్టు వసూలు చేయు పద్ధతిని రద్దుపరచుచు ఉత్తర్వులు చేశారు.

ఈ విధంగా గ్రంథాలయోద్యోగులలో ఆత్మ విశ్వాసము, నైతిక విలువలు పెంపొందుటకు రాఘవరెడ్డిగారు అధికమైన కృషి సల్పిరి.

# ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయాలలో సిబ్బంది - వృత్తి నైపుణ్యాభి వృద్ధికి జరిగిన కృషి:

గ్రంథాలయాధికారులు గ్రంథాలయ శాస్త్రములో శిక్షణ పొందినంత మాత్రమున సర్వకాలము గ్రంథాలయ నిర్వహణ అత్యాధునికముగా యుండజాలదు. చైతన్య వంతముగా కూడ యుండదు. అనుదినము మారుతున్న సమాజములో, నవీన విజ్ఞాన యుగములో ఎప్పటి కప్పుడు నూతన విధానము ననుసరించవలసి యున్నది. గ్రంథ పాలకులు మారుతున్న విలువలను గుర్తిస్తూ వృత్తి నైపుణ్యమును పెంపొందించికొని నప్పుడే వారు సమాజసేవ చేయగలుగుదురు. ఈ నగ్నసత్యమును గుర్తించియే రాఘవరెడ్డిగారు గ్రంథాలయోద్యోగులు, మారుతున్న ప్రపంచములో అమలు నందున్న ఆధునిక విధానములను తెలిసికొనవలెనని కోరారు. అందుకు తమ వృత్తి నైపుణ్యమును పెంపొందించు కొనవలెనని అభిలషించారు. ప్రపంచములో గ్రంథాలయ శాస్త్రములో అనగా గ్రంథ వర్గీకరణ, సూచీకరణ, ఆచూకీ సేవ, బిబ్లియోగ్రఫీ, డాక్యుమెంటేషన్ మున్నగు విషయములలో మార్పులు జరుగుచున్నవి. వీటిని ఎప్పటి కప్పుడు గ్రంథాలయాధికారులు తెలుసుకొని ఆధునిక పద్ధతులను తమ గ్రంథాలయాలలో ప్రవేశ పెట్టవలసి యున్నది.

ఇందుకై గ్రంథాలయ శాస్త్రములో వివిధ అంశములపై కను గొనిన నూతన విధానములపై ప్రచురింపబడిన పత్రికలను, సంచికలను, గ్రంథాలయ శాస్త్ర గ్రంథములను తెప్పించి గ్రంథాలయోద్యోగులు ఆధునిక పద్ధతులను తెలిసి కొనులాగున రాఘవరెడ్డిగారు ఉత్తర్వు చేశారు.

రాష్ట్ర పౌర గ్రంథాలయశాఖ కార్యాలయములో కూడ గ్రంథాలయ శాస్త్ర గ్రంథములను తెప్పించి, వాటిని తరచుగా జరుగు గ్రంథపాలకుల సమావేశముల సదస్సులలో పాల్గొను వారి కుప యోగ పడునట్లు అందుబాటులో వుంచారు.

గ్రంథ పాలకుల జ్ఞానాభి వృద్ధికి వృత్తి నైపుణ్యమును పెంపొందించు సంచికలను ముఖ్యముగా అఖిల భారత గ్రంథాలయ సంఘము ప్రకటించు I. L. A. బులెటెన్, ఆం॥ ప్ర॥ గ్రంథాలయ సంఘము ప్రచురించు గ్రంథాలయ సర్వస్వము మున్నగు వాటిని గ్రంథాలయోద్యోగు లెల్లరు చదువుకొని గ్రంథాలయ నిర్వాహ ణలో ఆధునిక పద్ధతులను అవలంబించుటకు వీలుగా ప్రతి గ్రంథా లయము వాటిని తెప్పించుకొనుటకు రాఘవరెడ్డిగారు ఉత్తర్వు చేశారు.

రాష్ట్రములోని గ్రంథాలయములు సాధించిన, సాధించవలసిన ప్రగతి కార్యక్రమములను గూర్చి వివరిస్తూ నూతన విధానములపై ప్రముఖుల వ్యాసములను ప్రచురించు నిమిత్తము పౌర గ్రంథాలయ శాఖ పక్షమున ఒక బులెటెన్ ప్రచురించుటకు రాఘవరెడ్డిగారు సంకల్పించారు. ఇందుకు తగిన నిధుల సమకూర్చడము ఒక సమ స్యగా తయారైయినందున ఈ సంకల్పమును తాత్కాలికముగా మానుకొనిరి. దీనికి ప్రత్యామ్నాయముగా ఆంధ్రప్రదేశ్ గ్రంథా లయ సంఘము ప్రచురించు 'గ్రంథాలయ సర్వస్వము'నందే పై అంశ ములకు ప్రాముఖ్యత యివ్వవలయునని కోరిరి.

పత్రికలను, సంచికలను, గ్రంథాలయ శాస్త్ర గ్రంథములనెన్ని పఠించినను ప్రత్యక్షంగా పదిమంది చేరి, తమ అనుభవములను, వారు ఎదుర్కొను సమస్యలను గూర్చి చర్చించుటకు వాటిపరిష్కారములకు మార్గముల నన్వేషించుటకు సదస్సులు, సమావేశములెంతో తోడ్ప డును. ఇట్టి సమావేశములు జాతీయ స్థాయిలో, రాష్ట్రస్థాయిలో,

జిల్లాస్థాయిలో ఏర్పాటు చేసి వాటిలో గ్రంథాలయ శాస్త్ర విజ్ఞాన విషయములను చర్చించుట మిగుల ప్రయోజనకారి కాగలదు.

జాతీయ స్థాయి సదస్సులకు కేంద్ర ప్రభుత్వము, రాష్ట్ర స్థాయి సదస్సులకు రాష్ట్రప్రభుత్వము, జిల్లాస్థాయి సమావేశములకు జిల్లా గ్రంథాలయ సంస్థలు ఆర్థికంగా తోడ్పడుతూ, స్వయంగా నిర్వహిస్తూ గ్రంథాలయోద్యోగుల వృత్తి నైపుణ్యమును పెంపొందించవలెను.

ఇట్టి గ్రంథాలయ శాస్త్ర విజ్ఞాన వికాసమార్గములను రాఘవ రెడ్డిగారు ప్రవేశపెట్టుట వలన రాష్ట్రములో గ్రంథ పాలకులెందరో తమ వృత్తి నైపుణ్యమును పెంపొందించుకొనడమే గాక, గ్రంథాలయ శాస్త్రములో గ్రంథాలయోద్యోగుల కుపకరించు రచనలు గావించుట ప్రశంసనీయమైన విషయము.

ఉదాహరణకు : శ్రీ వెలగా వెంకటప్పయ్య, శ్రీ అమళ్ళదిన్నె గోపీనాథ్, శ్రీ జె. కృష్ణాజీ, శ్రీ ఆళ్ళ రాఘవయ్య గారలను, ఇట్టి రచనలు చేసినవారలలో ముఖ్యంగా పేర్కొనవచ్చును.

## జాతీయ స్థాయిలో జరిగిన కొన్ని ముఖ్యమైన గ్రంథపాలకుల సదస్సులు: సమావేశములు :

అఖిల భారత గ్రంథాలయ సంఘము ఏటేటా జాతీయస్థాయిలో దేశములో పలుప్రాంతములలో జాతీయ గ్రంథాలయ సదస్సులను నిర్వహించినది. ఈ సమావేశములు ఏ రాష్ట్రములో జరిగినను, అందులో పాల్గొనుటకు రాఘవరెడ్డిగారు, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రముల గ్రంథపాలకులను ప్రోత్సహించారు. గ్రంథాలయ చట్టములో 13 వ సెక్షను ప్రకారము జిల్లా గ్రంథాలయ సంస్థ ఛైర్మెన్, కార్యదర్శులను ఈ సదస్సులకు పంపు అధికారము డైరెక్టరుగారికి వుండే

డిది. ఈ మేరకు జాతీయస్థాయిలో, రాష్ట్రస్థాయిలో జరిగెడి గ్రంథాలయ సదస్సులకు వెళ్ళుటకు చైర్మెన్, కార్యదర్శులకు రాఘవరెడ్డిగారు ఉత్తర్వు లిచ్చెడివారు. వీరి ప్రయాణ వ్యయమును ఆయా జిల్లా గ్రంథాలయ సంస్థలు భరించుచుండినవి: సమావేశములకు హాజరయిన దినములు ప్రయాణముచేయు దినములను డ్యూటీ పీరియడుగా పరిగణించడము జరిగినవి. ఈ కారణంగా దేశములో ఏ ప్రాంతములో జరిగెడి గ్రంథాలయ సదస్సుల కయినా ఆంధ్రప్రాంతములోని జిల్లా గ్రంథాలయ సంస్థ కార్యదర్శులు, చైర్మెన్‌లు అధికసంఖ్యలో ఉత్సాహంగా పాల్గొనెడివారు. సదస్సులలోని చర్చనీయాంశములను గూర్చి, తాము గడించిన శాస్త్రజ్ఞానమును గూర్చి గ్రంథపాలకులతో రాఘవ రెడ్డిగారు చర్చించెడివారు. జాతీయ సదస్సులకు అధికసంఖ్యలో కార్యదర్శులు ఆంధ్రప్రాంతము నుండి రాగలుగు చున్నందులకు ప్రఖ్యాత గ్రంథాలయ శాస్త్రనిపుణులు డాక్టర్ కాలియా, సోహన్‌సింగ్, బి. ఎస్. కేశవన్ మున్నగువారు ప్రశంసిస్తూ అందుకు కారణభూతులయిన రాఘవరెడ్డిగారిని అభినందించారు.

## సాంఘిక విద్య - గ్రంథాలయాల పాత్రపై జరిగిన సదస్సు:

"సాంఘిక విద్య - గ్రంథాలయాల పాత్ర" అను అంశముపై ఢిల్లీలో 1955 సెప్టెంబరు 26 నుండి అక్టోబరు 5 వరకు ఒక సదస్సు జరిగినది. ఈ సదస్సుకు ఆంధ్ర ప్రాంతమునుండి పలువురు గ్రంథపాలకులతో పాటు రాఘవరెడ్డిగారు కూడ హాజరైరి. ఈ సదస్సులో ప్రధానంగా జాతీయస్థాయి మొదలు గ్రామీణ స్థాయి వరకు గ్రంథపాలకులు - సాంఘిక సేవా కార్యకర్తలు ఒకరి కొకరు ఏ విధంగా సహకరించుకొని గ్రంథాలయ విస్తరణ కార్యక్రమములను చేపట్టవలెనన్న అంశముపై చర్చలు జరిగినవి. ఈ చర్చల వలన ఆంధ్ర ప్రదేశ్ లో గ్రంథపాలకుల - సాంఘిక సేవా కార్యకర్తల మధ్య

సహకారము పెంపొంది సమిష్టిగా సాంఘిక సేవా కార్యక్రమములను చేపట్టుటకు వీలయినదని చెప్పవచ్చును.

### బిబ్లియోగ్రఫీ తయారు వాటి ఏర్పాటుపై జరిగిన సదస్సు:

ఈ సదస్సు కలకత్తా నగరమందు 12—2—1962 వ తేదీన నిర్వహింప బడినది. ఈ సదస్సుకు ఆంధ్ర ప్రాంతమునుండి గ్రంథ పాలకు లధిక సంఖ్యలో హాజరయ్యారు. ఈ సదస్సు కలకత్తాలో జరుగుటవల్ల గ్రంథపాలకులెల్లరికి కలకత్తాలోని జాతీయ గ్రంథాలయమును సందర్శించుటకు, అందలి విభాగములను, సూచీకరణ విధానమును మున్నగు వాటిని గూర్చి తెలిసికొనుటకు వీలయినది.

### ప్రత్యేక గ్రంథాలయాలు - సమాచార కేంద్రముల సంఘము జరిపిన సదస్సు:

భారతీయ ప్రత్యేక గ్రంథాలయాలు - సమాచార కేంద్రముల సంఘము హైదరాబాదులో 17—12—66 నుండి 20—12—66 వరకు ఒక సదస్సును నిర్వహించినది. ఈ సమావేశము స్వరాష్ట్రములో జరిగిన కారణంగా జిల్లా గ్రంథాలయ సంస్థల కార్యదర్శులతో పాటు, ఉప గ్రంథాలయ పాలకులు సైతము ఉత్సాహముతో ఈ సమావేశములో పాల్గొన్నారు. ఈ సదస్సులో ఒకానొక ముఖ్య సమావేశమునకు రాఘవరెడ్డిగారు అధ్యక్షత వహించి పౌర గ్రంథాలయాలు - ప్రత్యేక గ్రంథాలయాల మధ్య యుండవలసిన సహకారముపై చక్కగా ఉద్బోధించారు. ఈ సదస్సు రాష్ట్రములో జరిగినందున ప్రభుత్వమునుండి రెండు వేల రూపాయల గ్రాంటును కూడా మంజూరు చేయించారు.

### బెంగుళూరులో డాక్యుమెంటేషన్‌పై జరిగిన సమావేశము:

1968 వ సం॥మున బెంగుళూరులో జరిగిన ఈ సమావేశమునకు జిల్లా గ్రంథాలయ సంస్థ కార్యదర్శులు హాజరయ్యారు. ఈ సమా

వేశమును డాక్యుమెంటేషను మరియు రీసర్చ్ అండ్ ట్రైనింగు సెంటరు వారు ఏర్పాటు చేశారు. డాక్యుమెంటేషను వివరములతో పాటు వర్గీకరణ, సూచీకరణ విధానములను గూర్చి చర్చించడము జరిగినది.

## ఇండోర్‌లో జరిగిన సదస్సు :

1968 డిసెంబరు 27 నుండి 30 వరకు అఖిల భారత గ్రంథాలయసంఘు మొక సదస్సు నేర్పాటు చేసినది. ఈ సదస్సులో 'పౌర గ్రంథాలయాలకు ఇతర గ్రంథాలయాల సహకారము' అను అంశము ప్రధానాంశముగా చర్చింపబడినది. ఈ సమావేశమునకు జిల్లా కేంద్ర గ్రంథాలయాధికారులు ఆంధ్రప్రాంతము నుండి అధిక సంఖ్యలో పాల్గొన్నారు.

రాఘువరెడ్డిగారు రిటైరయిన తర్వాత కూడ జాతీయ స్థాయిలో జరిగెడు సదస్సులకు హాజరగుతూ తమ అనుభవములను గూర్చి తెలుపుచున్నారు. ఈ సదస్సులలో పాల్గొను వారి సంఖ్య క్రమముగా తగ్గిపోవుచున్నది. గ్రంథాలయ సదస్సులలో జిల్లా గ్రంథాలయ సంస్థ కార్యదర్శులకే కాక సాంకేతిక బాధ్యతలు నిర్వహిస్తున్న ప్రథమశ్రేణి గ్రంథాలయాధికారులు మున్నగువారికి కూడా పాల్గొనే అవకాశమును కల్పించవలసి యున్నది.

## రాష్ట్ర స్థాయిలో జరిగిన కొన్ని ముఖ్యమైన గ్రంథాలయ సదస్సులు, గోష్ఠులు :

ఆంధ్రప్రదేశ్‌లో రాష్ట్రప్రభుత్వము, పౌర గ్రంథాలయ శాఖ, ఇతరసంస్థలు ఎన్నోసదస్సులను, సమావేశములను ఏర్పాటు చేసినది. పౌరగ్రంథాలయశాఖ స్వయంగా సదస్సులు నిర్వహించడమే గాక ఇతరసంస్థలు నిర్వహించిన గ్రంథాలయ సదస్సుల నిర్వహణకై ఆర్థికంగా గ్రాంట్లను మంజూరు చేసి ప్రోత్సహించినది.

## ఆంధ్రప్రదేశ్‌లో పౌర గ్రంథాలయాల నిర్మాణ - నిర్వహణపై జరిగిన సదస్సు :

'ఆంధ్రప్రదేశ్‌లో పౌర గ్రంథాలయాల నిర్మాణము - నిర్వహణ' అను అంశముపై 1962 సం॥రము మార్చి 23 నుండి 28 వరకు ఒక సదస్సును రాఘవరెడ్డిగారు ఏర్పాటు చేశారు. ఈ సదస్సుకు డాక్టర్ ఎస్. ఆర్. రంగనాథన్‌గారు డైరెక్టరుగాను, రాఘవరెడ్డిగారు జాయింట్ డైరెక్టరుగా వ్యవహరించారు. ఈ సదస్సులో పాల్గొనిన గ్రంథపాలకులు సుదీర్ఘ చర్చలు జరిపి, తీర్మానములను చేశారు. వానిలో ముఖ్యమైనవి యీ క్రింద పేర్కొన బడినవి.

1. లక్ష జనాభా గలిగిన ప్రతినగరమునకు ప్రత్యేకంగా నగర గ్రంథాలయ సంస్థను ఏర్పాటు చేయవలెను.
2. భూమిశిస్తు మీద గ్రంథాలయ సెస్సును వసూలు చేయవలెను.
3. వసూలయిన గ్రంథాలయ సెస్సును జమకట్టి మూడు రసీదులను తీసికొని అందులో ఒక రసీదును సరాసరి జిల్లా గ్రంథాలయ సంస్థకు పంపవలెను.
4. జిల్లా గ్రంథాలయ సంస్థలు సంవత్సరాంతమున గ్రంథముల కొనుగోలు చేయక సంవత్సరారంభము నుండియే చేయవలెను.
5. సహాయక గ్రంథాలయములను జిల్లా గ్రంథాలయ సంస్థల ఆధీనములోనికి చేర్చి వాటిని శాఖా గ్రంథాలయములుగా పరిగణించవలెను.
6. పుస్తక వర్గీకరణ - సూచీకరణలు రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమునందు జరుగవలెను.
7. Indian Standards Institution భారతీయ ప్రామాణిక సంస్థ నిర్ణయించిన మేరకే గ్రంథాలయాల కవసరమైన ఫర్నీచరు కొనవలెను.

8. గ్రంథాలయ శాస్త్రమందు నిర్వహించుచున్న సర్టిఫికేటు కోర్సు కాలవ్యవధిని మూడు మాసములనుండి నాలుగు మాసములకు పెంచవలెను. ఈ శిక్షణ 6 మాసములకు మించరాదు.

9. గ్రంథ పాలకుల నుండి ఉద్యోగ నియామకములో సెక్యూరిటీ డిపాజిట్టును వసూలు చేయరాదు.

10. జిల్లా గ్రంథాలయ సంస్థలు వసూలుచేసిన గ్రంథాలయ సెస్సుకు మూడురెట్లు మొత్తమును ప్రభుత్వము గ్రాంటుగా ఇవ్వవలెను.

ఈ పై తీర్మానములలో చాల వాటిని ఇదివరకే అమలుపరచి యున్నారు. కొన్ని సూచనలను ఇదివరకే ప్రభుత్వానుమతికి రాఘవ రెడ్డిగారు పంపియుండిరి. ఈ విషయములను కూడ సదస్సులో చర్చించడమైనది.

పై తీర్మానములను బలపరచుచు ప్రభుత్వ ఆమోదమునకు, అమలుకు సిఫార్సు చేస్తూ రాఘవరెడ్డిగారు పంపినారు. కాని ప్రభుత్వము ఆర్థికవనరులు సరిగా లేని కారణంగా తీర్మానములలో కొన్నింటిని అంగీకరించ లేదు.

ఈ సదస్సులో ప్రధానంగా చర్చించబడిన మరో అంశము - "గ్రంథాలయాలలో డ్యూయీ దశాంశ వర్గీకరణ విధానమా? లేక కోలన్ వర్గీకరణ విధానమా?" రాష్ట్రములోని జిల్లా గ్రంథాలయ సంస్థ గ్రంథపాలకు లెల్లరూ డ్యూయీ దశాంశ వర్గీకరణ విధానములోనే శిక్షణ పొందియున్న కారణంగా దానినే పాటించుట సబబనియు,సులభసాధ్యమని తెలుపుతూ కోలన్ వర్గీకరణవిధానమును ప్రవేశపెట్టుట సాధ్యము కాదని తమ అభిప్రాయమును తెలిపిరి.

బాలలు చదువుకొను వసతులు కల్పించు బాధ్యత విద్యాశాఖదే గనుక బాలల గ్రంథాలయాల ఏర్పాటు కూడ విద్యాశాఖయే నిర్వహించడము సమంజసమని ఆ సదస్సులో సూచింపబడినది. ఐతే గ్రంథ

పాలకులెల్లరూ యీ సూచనను తిరస్కరించి పౌరగ్రంథాలయాలలోనే బాలలవిభాగము లేర్పాటు చేయటము సముచితమని గట్టిగా తెలిపిరి.

## రాష్ట్రస్థాయిలో జిల్లాగ్రంథాలయ సంస్థల చైర్మెన్, కార్యదర్శుల సమావేశము :

జిల్లా గ్రంథాలయ సంస్థలయందు గ్రంథాలయాల నిర్వహణలో కీలకపాత్ర వహించువారు జిల్లా గ్రంథాలయ సంస్థ చైర్మెన్ మరియు కార్యదర్శి కావున రాష్ట్రములో యీ గ్రంథాలయ పాలన, నిర్వహణ విషయములలో ఉత్పన్నమగు సమస్యల పరిష్కారమునకు సంవత్సరమున కొక పర్యాయము రాష్ట్రస్థాయిలో చైర్మెన్, కార్యదర్శుల సమావేశము ఏర్పాటుచేయుట అత్యంత అవసరమని రాఘవరెడ్డిగారు భావించారు. ఇందుకు అనుగుణంగా 29-12-65 తేదీన రాష్ట్ర కేంద్ర గ్రంథాలయ కమిటీ సమావేశములో తీర్మానము గావించిరి. హైదరాబాదు జిల్లా గ్రంథాలయ సంస్థ చైర్మెన్ గారైన శ్రీ ఎస్. చెన్నారెడ్డిగారి సూచన మేరకు 1966 సం॥రము మార్చి 19, 20 తేదీలలో రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమందు సమావేశము ఏర్పాటు చేశారు. ఈ సమావేశమునకు జిల్లా గ్రంథాలయ సంస్థ చైర్మెన్ కార్యదర్శులు హాజరయి పెక్కు సమస్యలను చర్చించారు.

సమావేశములో క్రింది తీర్మానములను చేశారు.

1. తెలంగాణ ప్రాంతమునందు గ్రంథాలయముల అభివృద్ధికి తెలంగాణ ప్రాంతీయ కమిటీ నుండి గ్రాంట్లను పొందవలెను.

2. ఉస్మానియా విశ్వవిద్యాలయమందు గ్రంథాలయశాస్త్రమునందు మాష్టరు డిగ్రీకోర్సును (M. L. Sc.,) ప్రారంభించవలెను.

3. రాష్ట్రమునందు Chamber of Chairmen of Zilla Grandhalaya Samsthas ను స్థాపించవలెను.

4. సహాయక గ్రంథాలయములకు మంజూరుచేయు గ్రాంట్లను పెంచవలెను.

5. గ్రంథాలయ భవన నిర్మాణములకు గ్రాంట్లను మంజూరు చేయవలెను.

పై సూచనలను పెక్కింటిని అమలుపరచడం జరిగినది.

అనంతపురం జిల్లా గ్రంథాలయ సంస్థ చైర్మెన్ శ్రీ కె. వి. వేమారెడ్డిగారి సలహా మేరకు 1967 జూలై 26, 27 తేదీలలో హైదరాబాదులో సమావేశము ఏర్పాటు చేయడమైనది. ఇందులో గ్రంథాలయ సెస్సు సక్రమంగా వసూలగుటకుగాను చైర్మెన్, కార్యదర్శులు తీసికోవలసిన చర్యలను గూర్చి, గ్రంథాలయ సంస్థలలోని గ్రంథాలయోద్యోగుల వేతనములను గూర్చి, గ్రంథాలయ సక్రమ నిర్వహణ చైర్మెన్, కార్యదర్శుల మధ్యగల సహకారమును గూర్చి చర్చలు జరిపారు.



27-7-1967 న హైదరాబాదులో జరిగిన జిల్లా గ్రంథాలయసంస్థ చైర్మెన్ కార్యదర్శుల సమావేశములో ప్రసంగిస్తున్న కె. రాఘవరెడ్డిగారు. ఆసీనులయిన వారు శ్రీ కె. వి. వేమారెడ్డి, శ్రీ బి. వి. సుబ్బారెడ్డి, శ్రీ టి. వి. రాఘవులు, శ్రీ ఎన్. రమేశన్.

ఈ సందర్భమున ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి గారు, "...... The Departmemt of Public Libraries constituted in January 1961, has grown in terms of efficiency and useful service to the public" అని సందేశ మిచ్చిరి.

1969 వ సం॥రములో రాఘవరెడ్డిగారు రిటైరయిన తర్వాత కూడ రాష్ట్ర స్థాయిలో చైర్మెన్, కార్యదర్శుల సమావేశములు జరుగుచునే యున్నవి. 1970 వ సం॥మున హైదరాబాదులోనే ఆంధ్ర సారస్వత పరిషత్ లో జరిగిన సమావేశములో గ్రంథాలయాల అభివృద్ధిని గూర్చి సమీక్షించడము జరిగినది.

రాష్ట్రి పౌర గ్రంథాలయ శాఖతో పాటు గ్రంథాలయ సంఘాలు, తదితర గ్రంథాలయ సేవా సంస్థలు ఇట్టి సమావేశములు జరిపి గ్రంథాలయ ఉద్యమ సమస్యలు, ఉద్యోగుల సమస్యలు, విస్తరణ సేవా కార్యక్రమాలను గూర్చి చర్చించుట సమంజసము. ఇట్టి సమావేశములను పాశ్చాత్య దేశములలో ప్రభుత్వమే కాకుండ ప్రయివేటు సంస్థలు, గ్రంథాలయ సంఘాలు చక్కగా నిర్వహించి నిర్మాణాత్మక సూచనలు చేయుచున్నవి. మన రాష్ట్రిములో కూడ గ్రంథాలయ సంఘములవారు, అకాడెమీ ఆఫ్ లైబ్రరీ సైన్సువారు సమావేశముల నేర్పాటుచేసి సమస్యలను చర్చించుచున్నారు.

ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘము 7—2—1961 తేదీన విజయవాడలో ఒక ముఖ్యసమావేశమును ఏర్పాటు చేసినది. ఈ సమావేశమునకు జిల్లా గ్రంథాలయ సంస్థల చైర్మెన్ లు, కార్యదర్శులతో పాటు రాష్ట్రిములోని గ్రంథాలయ కార్యకర్తలు పలువురు హాజరయిరి. ఈ సమావేశములో ఈ దిగువ తీర్మానములు చేయబడినవి.

1. పౌర గ్రంథాలయ శాఖకు ప్రత్యేకంగా డైరెక్టరు నియామకము జరుగవలెను.
2. గ్రంథ పాలకుల వేతనములను పెంచవలెను.
3. జిల్లా గ్రంథాలయ సంస్థ సభ్యుల కాల పరిమితిని మూడు సంవత్సరముల నుండి ఐదు సం॥ ముల వరకు పొడిగించవలెను.

## జిల్లా స్థాయిలో జరిగిన కొన్ని ముఖ్యమైన గ్రంథాలయ సమావేశములు:

రాష్ట్రస్థాయిలో, జాతీయ స్థాయిలో జరిగే మహాసభలలో, సదస్సులలో జిల్లా గ్రంథాలయ సంస్థల చైర్మెన్‌లు, కార్యదర్శులు పాల్గొనే అవకాశము కల్పింప బడినది. జిల్లా స్థాయిలో ప్రతి సంవత్సరము అవకాశమును బట్టి శాఖా గ్రంథాలయోద్యోగుల సమావేశములను, పునశ్చరణ తరగతులను ఏర్పాటుచేసి వారిలో నూతనోత్సాహము కల్పించ వలసిన బాధ్యత లోకల్ లైబ్రరీ అథారిటీలపై కూడ నున్నదని రాఘవరెడ్డిగారు తెలిపారు. జిల్లా స్థాయిలో పునశ్చరణ తరగతుల నిర్వహణకై లోకల్ లైబ్రరీ అథారిటీలకు గ్రాంట్లు మంజూరు చేయబడినవి. లోకల్ లైబ్రరీ అథారిటీ, కడప 21—5—61 నుండి 23—5—61 వరకు జిల్లా స్థాయిలో ఒక సదస్సు నేర్పాటు చేసినది. జిల్లాలోని గ్రంథాలయోద్యోగు లెల్లరూ ఉత్సాహముతో పాల్గొని తమ సమస్యలను చర్చించుకొని గ్రంథాలయాభివృద్ధి కార్యక్రమములను గూర్చి వివరించుకొన్నారు. ఇదే రీతిగా మహబూబ్ నగర్, విజయవాడ, నల్గొండ మున్నగు పట్టణములందు జిల్లా స్థాయిలో పునశ్చరణ తరగతులను నిర్వహించారు. 1966 - 67 సంవత్సరమందు జిల్లా స్థాయిలో పునశ్చరణ తరగతులను నిర్వహించుటకు గాను ప్రభుత్వము లోకల్ లైబ్రరీ అథారిటీలకు 51,000 రూ.లు గ్రాంటు మంజూరు చేసినది.

సహాయక గ్రంథాలయ నిర్వాహకులకు సైతము గ్రంథాలయ నిర్వహణ సామర్థ్యము పెంపొందునటుల, వారిలో ఉత్సాహము కలుగు నటుల, జిల్లా గ్రంథాలయాధికారులు, శాఖా గ్రంథాలయాధికారులు తాము తరచుగా వారికి తనిఖీకి వెళ్ళు సమయములందు గాని, గ్రంథముల అరువుకై విచ్చేయునపుడుగాని తగు సూచన లివ్వవలెనని రాఘవరెడ్డిగారు కోరారు. ఆ విధముగనే జరుగుచుండెడిది.

## గ్రంథాలయ సమావేశములు, సదస్సులు, గోష్ఠులు మున్నగు కార్యక్రమముల నిర్వహణకై రాష్ట్ర స్థాయిలో ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ లైబ్రరీ సైన్సు (Instiute of Library Science) ఏర్పాటు :

రాష్ట్రములో తరచుగా సదస్సులు, సమావేశములు, గోష్ఠులు నిర్వహించుటకు వీలుగా ఒక శాశ్వత సంస్థ వుండినట్లయిన మిగుల ప్రయోజన కరముగా యుండగలదు. గ్రంథాలయోద్యోగుల వృత్తి నైపుణ్యము పెంపొంది, గ్రంథాలయోద్యమము విస్తరించి నవీన పద్ధతులలో చైతన్యవంతమైన రీతిలో గ్రంథాలయ నిర్వహణ రూపొందాలంటే సదస్సులు, సమావేశములు అత్యంత ఆవశ్యకమైనవని రాఘవరెడ్డిగారు గ్రంథపాలకులకు తెలిపెడివారు. ఇందుకై రాష్ట్ర స్థాయిలో ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ లైబ్రరీ సైన్సు (Institute of Library Science) స్థాపించాలని భావించారు. దీని స్థాపనకై రిటైరయినప్పటికీ రాఘవరెడ్డిగారు రాష్ట్ర కేంద్ర గ్రంథాలయ సలహా సంఘము, సమావేశములలో సభ్యులతో యీ విషయమై ప్రస్తావిస్తూ, ప్రయత్నిస్తూ యుండిరి. ప్రభుత్వము యీ సూచనను పరిశీలించు నిమిత్తము ఒక కమిటీని నియమించినది. ఈ కమిటీ అధ్యక్షులుగా రాష్ట్ర విద్యాశాఖ కార్యదర్శిగారు నియమింపబడిరి. ఈ కమిటీలో రాఘవరెడ్డిగారు, శాంసన్ రామకృష్ణయ్యగారలు సభ్యులు. వీరు

విద్యాశాఖ కార్యదర్శిగారి కార్యాలయమందే సమావేశమై ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ లైబ్రరీ సైన్సు ఏర్పాటును గూర్చి రాఘవరెడ్డిగారి ప్రతిపాదనలను పరిశీలించారు.

రాఘవరెడ్డిగారు యీ సందర్భంగా, యీ క్రింది సూచనలను చేశారు.

1. గ్రంథాలయములందవలంబింపబడు ఆధునిక పద్ధతుల గురించి అప్పటికప్పుడు గ్రంథపాలకులకు తెలియజేయవలెను. ఈ పద్ధతులను ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ లైబ్రరీ సైన్సు ద్వారా సులభంగా తెలుప వీలగును.

2. ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ లైబ్రరీ సైన్సునందు గ్రంథపాలకులకు డాక్యుమెంటేషన్‌ను గూర్చి, ముఖ్యముగా డాక్యుమెంటేషన్ లిస్టులు తయారుచేయుటను గూర్చి శిక్షణ ఇవ్వవలెను.

3. గ్రంథాలయ శాస్త్రములో పరిశోధన గావింపగోరు గ్రంథపాలకులకు తగు వసతులు కల్పింపవలెను.

4. ఈ సంస్థ ద్వారా వయోజన విద్యా సంబంధ కార్యక్రమములందు, దృశ్య-శ్రవణ విద్యా విధానములందు గ్రంథ పాలకులకు శిక్షణ యొసంగవలెను.

5. గ్రంథాలయ శాస్త్ర గ్రంథములను, ప్రత్యేక బులిటెన్‌లను ప్రచురింపవలెను.

6. జిల్లా గ్రంథాలయ సంస్థ ఛైర్మెన్, కార్యదర్శుల సమావేశముల, సదస్సుల నేర్పాటు చేయవలెను.

శాఖా గ్రంథాలయ గ్రంథపాలకుల (గ్రేడ్ II మరియు గ్రేడ్ III) పునశ్చరణ తరగతులను జిల్లా కేంద్ర గ్రంథాలయము మం

దును, గ్రామీణ గ్రంథాలయ నిర్వాహకుల పునశ్చరణ తరగతులను శాఖా గ్రంథాలయ మందు లేదా జిల్లా కేంద్ర గ్రంథాలయములందు జరుపుటే సముచితము, గావున ఈ స్థాయిలో పునశ్చరణ తరగతులను ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ లైబ్రరీ సైన్సు నిర్వహించ నవసరము లేదు.

సర్టిఫికేట్ కోర్సుల నిర్వహణ గ్రంథాలయ సంఘములకు సాధ్యము కానియెడల ఈ కోర్సులను ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ లైబ్రరీ సైన్సు నిర్వహించ వచ్చును. ప్రభుత్వము ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ లైబ్రరీ సైన్సు స్థాపనకు అంగీకరించ లేదు.

ఈ విషయమై మరోమారు రాఘవరెడ్డిగారు 1979 మార్చి 9, 10 తేదీలలో హైదరాబాదులో జరిగిన ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సదస్సునందు ప్రతిపాదించి, దీని స్థాపనావశ్యకతను నొక్కి వక్కాణించారు. సదస్సునందు ఈ ప్రతిపాదనను ఏకగ్రీవముగా అంగీకరించి బలపరచడమైనది. గ్రంథపాలకుల వృత్తి నైపుణ్యమునకు గ్రంథాలయాలు ఆధునిక విధానము ననుసరించుటకు ఈ సంస్థ ఏర్పాటు అత్యవసరము. ఆంధ్రప్రదేశ్‌లో గ్రంథపాలకుల వృత్తి నైపుణ్యాభివృద్ధికై రాఘవరెడ్డిగారు చేసిన కృషి ప్రశంసనీయము.



# పౌర గ్రంథాలయాలలో వర్గీకరణ సూచీకరణ విధానము

1948 మదరాసు పౌర గ్రంథాలయ చట్టము అమలులోనికి వచ్చిన యనంతరము రెండు సంవత్సరముల వరకు, గ్రంథాలయముల స్థాపన జరుగలేదు. దీనికి ముఖ్యకారణము గ్రంథాలయ సెస్సు వసూలు సక్రమముగా జరుగక పోవుటయే యని ఇదివరకే చెప్పబడినది. 1952 – 53 సంవత్సరము సెస్సు వసూలులో కొంత మెరుగు కన్పించినందున ఆంధ్ర ప్రాంతములోని పదకొండు జిల్లాలలోను జిల్లా కేంద్ర గ్రంథాలయములను స్థాపించడము జరిగినది.

## గ్రంథాలయాలలో దశాంశ వర్గీకరణ - నిఘంటు సూచీకరణ విధానము ననుసరించుటకు నిర్ణయము:

అదృష్ట వశాత్తు ప్రతి జిల్లా కేంద్ర గ్రంథాలయమునందు గ్రంథాలయ శాస్త్ర శిక్షణ పొందిన వారిని గ్రంథపాలకులుగా నియమించడము జరిగినది. వీరందరు పట్టభద్రులు. వీరిలో కొందరు ఆంధ్ర విశ్వవిద్యాలయము నందును, మరి కొందరు మదరాసు విశ్వవిద్యాలయము నందును శిక్షణ పొంది యుండిరి. కావున వీరికి వర్గీకరణ - సూచీకరణ సులభ సాధ్యమైనది. 1953 సం॥ సెస్సు వసూలులో కొంత మెరుగు కన్పించినది. కాన ప్రభుత్వము కూడ చట్ట ప్రకారము వసూలైన సెస్సునకు సమాన మొత్తమును మంజూరు చేసినది. అందువలన పుస్తకముల కొనుగోలు జరుగుటచే గ్రంథాలయములలోని పుస్తకముల అమరికలో ఏ విధమైన వర్గీకరణ - సూచీకరణ విధానముల నవలంబించవలెనన్న సమస్య గ్రంథ భాండాగారులకు

ఉత్పన్నమైనది. వీరు ఈ సమస్యను పరిష్కరించుటకై ప్రత్యేకాధికారియైన రాఘవరెడ్డి గారిని సంప్రదించిరి. రాఘవరెడ్డిగారు ప్రపంచములోని పలుదేశములలో పౌర గ్రంథాలయములందు, సాధారణ పాఠకులు కూడ గ్రహించుటకు వీలయినటువంటి, డ్యూయీ దశాంశ వర్గీకరణ విధానము మరియు నిఘంటు సూచీకరణ విధానము అమలునందున్నవనియు దానినే మన రాష్ట్రములోని పౌర గ్రంథాలయములయందు ప్రవేశపెట్టుట ప్రయోజనకరముగా నుండునని అభిప్రాయపడి, ఆ రోజులలో ప్రముఖ గ్రంథపాలకులుగా పేరు గాంచిన అబ్బూరి రామకృష్ణరావు, ఆర్. జనార్దనంనాయుడుగార్లతో సంప్రదించిరి. వారు కూడ ఈ పద్ధతులనే అవలంబించవలెనని రాఘవరెడ్డి గారితో తమ అభిప్రాయమును తెలియబరచుటయే గాక, ప్రభుత్వము కోరిన సందర్భమున కూడ ఈ విధానములనే అవలంబించుట ప్రయోజనకరమని తెలియజేసిరి. ఆంధ్ర విశ్వవిద్యాలయమునందు గ్రంథాలయ శిక్షణలో పై పద్ధతులనే విపులంగా తెలియజేయుచుండిరి. ఆంధ్ర విశ్వవిద్యాలయ గ్రంథాలయాలలో కూడ పై పద్ధతులనే అవలంబించుచుండిరి. ఈ పద్ధతులందు శిక్షణ పొందిన గ్రంథపాలకులు ప్రభుత్వ నిర్ణయమును హర్షామోదములతో స్వీకరించిరి. రాష్ట్రములోని పలు కళాశాలల, పాఠశాలలలోని గ్రంథాలయాలలోను కూడ పుస్తక వర్గీకరణ, సూచీకరణకు డ్యూయీ దశాంశ వర్గీకరణ విధానము, మరియు నిఘంటు సూచీకరణ విధానములే ఆచరణలో నుండెను. ఈ పద్ధతులనే పౌర గ్రంథాలయములయందు కూడ ప్రవేశపెట్టినచో రాష్ట్రములోని అన్ని గ్రంథాలయములలో ఒకే పద్ధతి యుండుట వలన పరస్పర సహకారమునకు వీలగునని పౌర గ్రంథాలయ పుస్తక భాండాగారులు, తదితర గ్రంథాలయాభిమానులు ఈ పద్ధతులు ప్రవేశ పెట్టుటకు సుముఖతను వ్యక్తపరచిరి.

## జిల్లా కేంద్ర గ్రంథాలయాల ద్వారా వర్గీకరణ - సూచీకరణల ఏర్పాటు :

ఆంధ్రరాష్ట్రము ఏర్పడిన తరువాత ఆంధ్రప్రాంతమున పలు శాఖా గ్రంథాలయములు ప్రారంభింపబడినవి. ఈ శాఖాగ్రంథాలయములలో గ్రంథాలయ శాస్త్రమునందు శిక్షితులైనవారు కూడ గ్రంథపాలకులుగా నుండిరి. వీరు శాఖా గ్రంథాలయములకు కొనుగోలు చేసిన పుస్తకములను తామే వర్గీకరణ-సూచీకరణలను కావించుకొనుటకు అనుమతి కోరగా, రాఘవరెడ్డిగారు మద్రాసు పౌరగ్రంథాలయ చట్టములో శాఖాగ్రంథాలయములలోని పుస్తకములకన్నిటికి జిల్లా కేంద్ర గ్రంథాలయములందే వర్గీకరణ, సూచీకరణ చేయవలెనన్న సూచన లేకపోయినప్పటికి, ఈ పని జిల్లా కేంద్ర గ్రంథాలయాలలోనే జరుగవలెనని స్పష్టపరచిరి. అంతేగాక ముఖ్యముగా ఏశాఖాగ్రంథాలయము కొన్న పుస్తకములను ఆ శాఖా గ్రంథాలయమే వర్గీకరణ, సూచీకరణలను చేసికొన్న, జిల్లా కేంద్ర గ్రంథాలయమునందలి పుస్తకములు, శాఖా గ్రంథాలయములలో పుస్తకములు, ఒకేరికమైనప్పటికి వర్గీకరణ సంఖ్యలో, అమరికలో వ్యత్యాసము లేర్పడుటకు అవకాశము గలదు. కావున శాఖాగ్రంథాలయములు, తదితర గ్రంథాలయములకు కొనుగోలు చేసిన పుస్తకములన్నింటిని జిల్లా కేంద్ర గ్రంథాలయమునందే వర్గీకరణ, సూచీకరణ గావించవలెనని రాఘవరెడ్డిగారు తెలియజేయుచుండెడివారు.



**హైదరాబాదు నగర కేంద్ర గ్రంథాలయములో జరుగుతున్న వర్గీకరణ, సూచీకరణ విధానమును ఉపగ్రంథపాలకుడు శ్రీ కృష్ణాజీ, కె. రాఘవరెడ్డి గారికి వివరిస్తున్న దృశ్యం.**

ఢిల్లీ, మదరాసు విశ్వవిద్యాలయములందు వర్గీకృత సూచీకరణ విధానమును గురించి ఎక్కువగా బోధించుచుండిరి. ఈ విశ్వవిద్యాలయ ములందు శిక్షితులైన ఒకరిద్దరు జిల్లా కేంద్ర గ్రంథాలయపాలకులు ఈ పద్ధతియందు శిక్షితులైనవారు కాన వీరు వారి గ్రంథాలయములలోని పుస్తకముల సూచీకరణకు, వర్గీకృతసూచీకరణ విధానము నవలంబిం చెదమని రాఘవరెడ్డిగారిని కోరగా, రాష్ట్రములోని అన్ని పౌర గ్రంథాలయాలలో ఒకేరకమైన వర్గీకరణ – సూచీకరణ విధానముండుట సమంజసమని, దాని ప్రయోజనములను తెలిపి వర్గీకృత సూచీవిధాన మును వాడుటకు వీలులేదని వారు తెలియజేసిరి. దాదాపు అన్ని జిల్లా కేంద్ర గ్రంథాలయాలలో ఒకే పద్ధతినే అవలంబించిరి. కాని గుంటూరు పౌరగ్రంథాలయ గ్రంథభాండాగారులకు, ఒకటి రెండు

జిల్లా కేంద్ర గ్రంథాలయముల గ్రంథపాలకులకు వర్గీకృత సూచీకరణ విధానమునందే అనుభవముండుటచే, వారు వర్గీకృత సూచీవిధానము నకే ప్రాధాన్యత నొసగిరి. ఇప్పటికైనా నిఘంటు సూచీవిధానమునకు మార్చుకొనుట సమంజసము.

1953 సం॥ తరువాత జిల్లా కేంద్ర గ్రంథాలయములందు, మరి కొన్ని పెద్ద శాఖా గ్రంథాలయములయందు కార్డు పద్ధతి వాడుకలో యుండినది. తక్కిన చిన్న శాఖా గ్రంథాలయాలలో లెడ్జర్ పద్ధతి వాడుకలో యుండినది.

## ఆంధ్రప్రాంతమునందలి గ్రంథాలయములలో పుస్తక వర్గీకరణ-సూచీకరణ:

1960 సం॥ ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ చట్టము అమలు లోనికి వచ్చేవరకు ఆంధ్రప్రాంతములో ప్రతిసంవత్సరము జిల్లా కేంద్ర గ్రంథాలయములకు, శాఖా గ్రంథాలయములకు కొనుగోలు చేసిన పుస్తకముల వర్గీకరణ,సూచీకరణ ఆలస్యము లేకుండ జరుగుచుండినది. జిల్లా గ్రంథాలయ పుస్తక భాండాగారులు శిక్షణ పొందినవారగుటచే జాప్యము లేకుండ పుస్తకములను కొనుగోలు జేసిన వెంటనే పుస్తక వర్గీకరణ - సూచీకరణలను కావించెడివారు. వీరికి పుస్తక వర్గీకరణ, సూచీకరణకు తగినకాలము లేనప్పుడు శిక్షణ పొందిన శాఖా గ్రంథాలయ భాండాగారుల సహాయముతో పుస్తక వర్గీకరణ, సూచీ కరణములను సకాలములో కావించెడివారు. 1960 సం॥ పూర్వము పుస్తకములు కొనుగోలు కూడ చాల తక్కువగా నుండినది. రాఘవరెడ్డిగారు అప్పుడప్పుడు తనిఖీకి వెళ్ళినప్పుడు పుస్తక భాండా గారులకు పుస్తక వర్గీకరణనుగూర్చి సముచిత సలహాల నిచ్చుచుండిరి.

# తెలంగాణ ప్రాంతమునందలి పౌర గ్రంథాలయములలో వర్గీకరణ - సూచీకరణ:

1—7—1955 నుండి తెలంగాణలో హైదరాబాదు పౌర గ్రంథాలయాల చట్టము అమలులో యుండినది. కాని గ్రంథాలయ సెస్సు వసూలు సక్రమముగా జరుగకపోవుటచే జిల్లా కేంద్ర గ్రంథాలయాల స్థాపన 1958 వరకు జరుగలేదు. 1958 - 59 సంవత్సరములో ప్రభుత్వముచే మంజూరు చేయబడిన ప్రత్యేక గ్రాంట్ల సహాయముతో తెలంగాణ ప్రాంతము నందు జిల్లా కేంద్ర గ్రంథాలయములు స్థాపించబడినవి. తెలంగాణ ప్రాంతము నందలి జిల్లా కేంద్ర గ్రంథాలయములలో ఆంధ్ర ప్రాంతము నందు వలె డ్యూయీ దశాంశ వర్గీకరణ విధానము, నిఘంటు సూచీకరణ విధానము అమలు జరుగవలెనని తెలియజేయడమైనది. ఆంధ్రప్రదేశ్‌లోని అన్ని పౌర గ్రంథాలయములందు పుస్తకముల వర్గీకరణ, సూచీకరణ ఒకే పద్ధతిలో నుండుటవలన ఐక్యత, సమానత సాధించవచ్చునను అభిప్రాయంతో రాఘవరెడ్డిగారు ఆ విధముగా తెలియచేసిరి. ప్రభుత్వ గ్రాంట్లతో గ్రంథాలయములకు కావలసిన కార్డ్ క్యాబినెట్‌లను, గ్రంథ సూచి కార్డులను కొనడము జరిగినది. కొంత కాలమునకు శాఖా గ్రంథాలయములను ప్రారంభించిరి. ఈ శాఖా గ్రంథాలయాలకు కొనుగోలు చేయబడిన పుస్తకాల వర్గీకరణ, సూచీకరణ ఆంధ్ర ప్రాంతములోవలె తెలంగాణలో కూడ జిల్లా కేంద్ర గ్రంథాలయములందే జరుగవలెనని రాఘవరెడ్డిగారు తెలియజేసిరి.

1958 - 59, 1959 - 1960 సంవత్సరములలో జిల్లా కేంద్ర గ్రంథాలయాలు, శాఖా గ్రంథాలయాలు స్థాపింపబడినప్పటికి, శిక్షణ పొందనటువంటివారిని కూడ పుస్తక భాండాగారులుగా నియమించడం జరిగినది. వీరిని 1959 - 60 సంవత్సరములో ఉస్మానియా

విశ్వవిద్యాలయమునకు గ్రంథాలయ శాస్త్రమునందు శిక్షణకు పంపిరి. 1960 వ సంవత్సరములో శిక్షణానంతరము జిల్లా కేంద్ర గ్రంథాలయములందు నియమింపబడిన పిదప, వారు పుస్తక వర్గీకరణ, సూచీకరణలను సక్రమముగా చేసిరి. వీరు క్రొత్తగా శిక్షణ పొంది వచ్చినవారు గాన, ఆసక్తితో చురుకుగా సకాలములో వర్గీకరణ, సూచీకరణలను గావించిరి.

1960 సం॥ వరకు లోకల్ లైబ్రరీ అథారిటీలకు జిల్లా విద్యాశాఖాధికారులు సెక్రటరీలుగా వుండెడివారు. వీరు విద్యావంతులైనప్పటికి గ్రంథాలయ శాస్త్రమునందు తగు అనుభవము పొందినవారు కారు. కాన లోకల్ లైబ్రరీ అథారిటీలకు పుస్తకముల వర్గీకరణ, సూచీకరణలలో తగు సలహాలను యివ్వజాలక పోయెడివారు. అటువంటి సందర్భాలలో ప్రత్యేకాధికారిగారైన రాఘవరెడ్డిగారు తనిఖీకి వెళ్ళినపుడు పుస్తకభాండాగారులకు పుస్తక వర్గీకరణ, సూచీకరణ గురించి కావలసిన సలహాల నిచ్చుచుండిరి.

## గ్రామీణ గ్రంథాలయాలు తదితర గ్రంథాలయాలలో వర్గీకరణ - సూచీకరణ ఏర్పాటు:

ఈ విధముగా జిల్లా కేంద్ర గ్రంథాలయముల యందును, శాఖా గ్రంథాలయముల యందే గాక, పంచాయతీల, సహాయక తదితర గ్రామీణ గ్రంథాలయములయందును డ్యూయీ దశాంశ వర్గీకరణ విధానము, నిఘంటు సూచీకరణ విధానములనే అవలంబించవలెనని 1960 సం॥ లో రాఘవరెడ్డిగారు తెలియజేసిరి. కాని చాల గ్రంథాలయాలలో ఆర్థిక పరిస్థితుల వలన ఈ పద్ధతుల నవలంబించుటకు వీలులేక పోయినది. పంచాయతీ సహాయక, గ్రంథాలయాలు కొన్ని మాత్రము కార్డు పద్ధతి నవలంబించు చుండినవి. మరికొన్ని గ్రంథాలయాలలో లెడ్జర్ పద్ధతి అమలులో వుండెను.

గ్రామీణ, తదితర ప్రాంతములందలి గ్రంథాలయములందును, చిన్న శాఖాగ్రంథాలయముల యందునుకల పుస్తకములసంఖ్య మిగుల స్వల్పము. ఈ గ్రంథాలయములకు ఆర్థిక వనరులు తగినంతగా లేక పోవడము వలన, సంవత్సరమునకు 50 పుస్తకములను కూడ కొనుటకు వీలులేక పోయినది. మఱియు ఈ పద్ధతికి కావలసిన కార్డుల ఖరీదు ఎక్కువగా వుండుటవలన, ఈ గ్రంథాలయములు లెడ్జర్ పద్ధతిని అవలంబించినవి. ఈ గ్రంథాలయములు పుస్తకముల నధికముగా కొనగల స్థితికి చేరుకొని తగినంత నిధులను సమకూర్చుకొన్న యనంతరము కార్డు పద్ధతి నవలంబించుటకు పూనుకొన వచ్చును. పుస్తకములు తగినంతగా కలిగిన కొన్ని గ్రంథాలయముల యందు మాత్రము కార్డులను, కార్డు కేబినెట్లను కొనుగోలు చేసి పాఠకులు సులభముగా తెలిసికొనుటకు వీలుగా నుండునట్లు కార్డుల యందు చక్కగా వ్రాసి కేబినెట్లందు సక్రమముగా అమర్చబడినవి. ఉదా॥ వేటపాలెం సహాయక గ్రంథాలయము.

జిల్లా కేంద్ర గ్రంథాలయములందును, పెద్ద శాఖా గ్రంథాలయములందును పుస్తకవర్గీకరణ, సూచీకరణ పద్ధతులు సక్రమముగా కొనసాగినవి.

జిల్లా కేంద్ర గ్రంథాలయ పాలకులు తనిఖీ నిమిత్తమై పంచాయతీ గ్రంథాలయాలకు, సహాయక గ్రంథాలయాలకు, తదితర గ్రామీణ గ్రంథాలయాలకు వెళ్ళినపుడు, అచ్చటి గ్రంథపాలకులకు ఈ పద్ధతుల నవలంబించుట వలన కలుగు ప్రయోజనములను, ఈ పద్ధతులలో పుస్తక విభజన చేయుటకు అవసరమైన సలహాలను కూడ నిచ్చుచుండిరి.

## రాష్ట్ర కేంద్ర గ్రంథాలయములో వర్గీకరణ సూచీకరణ ఆవశ్యకత:

1—4—1960 న ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ చట్టము అమలులోనికి వచ్చినది. ఈ చట్టమునందు గ్రంథ వర్గీకరణ, సూచీ

కరణను గూర్చి సూచించడం జరిగినది. కాని పుస్తకముల వర్గీకరణ, సూచీకరణ రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమునందు చేయవలెనా లేక జిల్లా కేంద్రగ్రంథాలయమునందు చేయవలెనా అను సమస్య ఏర్పడి నది. పాశ్చాత్య దేశాలలో ఆచరణలోనున్న వర్గీకరణ, సూచీకరణ విధానములలో అనుభవమున్న రాఘవరెడ్డిగారు ఈ పని రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమునందే జరుగవలెనని అభిప్రాయపడిరి. జిల్లా కేంద్ర గ్రంథాలయములకు ప్రత్యేకాధికారిగా వీరు తనిఖీకి వెళ్ళినపుడు ఈ వర్గీకరణ, సూచీకరణలలో వారికి కొన్ని లోపాలు కన్పించినవి.

ఒక జిల్లాలో ఒకరచయిత వ్రాసిన పుస్తకానికి ఒక వర్గీకరణ సంఖ్య వున్నచో అదే పుస్తకమునకు వేరొకజిల్లాలో మరొక వర్గీకరణ సంఖ్య యుండెడిది. ఇదే విధముగా మరికొన్ని లోపాలుకూడ వారి దృష్టిలో పడినవి. కాన ఈ లోపములను తొలగించుటకు వర్గీకరణ, సూచీకరణ రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమునందు కావించవలసిన ఆవశ్యకత ఎంతేని కలదు. ఈ విధమైన పద్ధతి నవలంబించుట వలన ఒక పుస్తకమునకు ఏ వర్గీకరణ సంఖ్య రాష్ట్ర కేంద్ర గ్రంథాలయము నందుండునో అదే వర్గీకరణ సంఖ్య రాష్ట్రములోని జిల్లా కేంద్ర గ్రంథాలయములయందును, శాఖాగ్రంథాలయములందును, తదితర సహాయక గ్రంథాలయములయందును యుండుటకు వీలగును. తద్వారా పాఠకు డేగ్రంథాలయమున కేగినను వర్గీకరణ సంఖ్యలలో మార్పు లేకుండుట వలన గ్రంథమును జాప్యము లేకుండ పొందగలుగును.

ఈ విధముగా రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమునందు వర్గీకరణ, సూచీకరణ జరిగినచో, గ్రంథాలయములకు ప్రతిసంవత్సరము వెచ్చించు మొత్తములో కొంత పొదుపు సాధించవచ్చును. ఆర్థిక ముగా వెనుకబడిన మనదేశము ఈ పద్ధతి నుపయోగించుట మిగుల

శ్రేయోదాయకము. ఈ విధముగా మిగల్చబడిన పైకమును ఇతర త్రా గ్రంథాలయాభి వృద్ధికి, ఉపయోగించు కొనవచ్చును. ఆర్థికంగా ముందంజ వేసినటువంటి పాశ్చాత్య దేశాలలో కూడ ఈ పద్ధతి నవలంబించుట ద్వారా పొదుపైన మొత్తమును గ్రంథాలయ వ్యాప్తికి ఉపయోగించుచున్నారు. ఈ పద్ధతిని ఆర్థిక ముగా వెనుక బడిన మన దేశంలో అవలంబించకపోవుట మిగుల శోచనీయము.

జిల్లా కేంద్ర గ్రంథాలయములలో నుండెడి కొందరు డిప్యూటి లైబ్రేరియన్లు యీ పద్ధతి రాష్ట్ర కేంద్ర గ్రంథాలయాలలో అవలం బించినచో తాము చేయు పని తగ్గిపోవునని, సూచీకరణ, వర్గీకరణ విధానములనుకూడ వారు మరచిపోవుటకు అవకాశము కలదని వారి అభిప్రాయమును వ్యక్తముచేసిరి. రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమునందు వర్గీకరణ, సూచీకరణలను ప్రారంభించినచో, జిల్లా కేంద్ర గ్రంథా లయములందు ఉపయోగకరమగు పుస్తకముల జాబితా (రీడింగ్ లిస్ట్) తయారుచేయుట; అప్పుడప్పుడు కొనుగోలు చేసిన పుస్తకముల జాబితాలను తయారు చేసి, ఆ జాబితాలను ఇతర గ్రంథాలయము లకు పంపుట; ఒక విషయానికి సంబంధించిన పుస్తకముల జాబితా (Class list) ను తయారు చేయుట; పలువిధములైన గ్రంథ సూచీ లను తయారు చేయుట, ఆచూకీ సేవ నందించుట మొదలైన వాటికి వారి కాలమును సద్వినియోగము చేసుకొనవచ్చునని రాఘవరెడ్డి గారు తెలిపెడివారు. వారికి మిగిలెడి కొంత కాలమును శాఖా గ్రంథా లయాల, సహాయక గ్రంథాలయాల, పంచాయతీ గ్రంథాలయాల తనిఖీకి ఉపయోగించు కొనవచ్చునని కూడ తెలిపెడివారు. నైపుణ్యము, అనుభవముగల డిప్యూటిగ్రంథపాలకుల సేవలను రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమునందు వినియోగించుకొనవచ్చునని రాఘవరెడ్డి గారు అభిప్రాయ పడెడివారు. ఈ పద్ధతుల ఉపయోగములను తెల్పుతూ, వీటిని రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమునందు అవలంబించ వలెనని 1960-61 లో రాఘవరెడ్డిగారు ప్రభుత్వమునకు తెలియజేసిరి.

దీనిపై సమగ్ర పరిశీలన జరిపి ఈ పద్ధతులను కొన్ని సంవత్సరముల తర్వాత ప్రవేశ పెట్టవచ్చునని ప్రభుత్వము అభిప్రాయ పడినది. ఈ పద్ధతుల నవలంబించడము వలన గ్రంథాలయోద్యమములో ముందంజ వేసిన మన రాష్ట్రమునకు శాశ్వత యశస్సు చేకూర గలదు. కావున యీ పద్ధతులను రాష్ట్ర కేంద్ర గ్రంథాలయము నందు ప్రవేశ పెట్టవలెనని ప్రభుత్వమునకు రాఘవరెడ్డిగారు పదవీ విరమణ వరకు తరచు విన్నవించుచునే యుండిరి.

ప్రస్తుతము ఈ పద్ధతుల నవలంబించుటకు కావలసిన సదుపాయములు కూడ కలవు. రాష్ట్రములో ఏ ప్రచురణ కర్త అయినా, ఏ గ్రంథకర్త యైనా తమ పుస్తకముల ప్రతులను ఒకటికి తక్కువ గాకుండ రాష్ట్ర కేంద్ర గ్రంథాలయానికి చట్ట ప్రకారము తప్పని సరిగా పంపవలెను. జిల్లా కేంద్ర, శాఖా, సహాయక, పంచాయతీ గ్రంథాలయాలలో వున్న పుస్తకాలలో ఏవేని రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమునందు లేని పక్షమున వాటిని రాష్ట్ర కేంద్ర గ్రంథాలయము కొనుగోలు చేసికొనుటకు అవకాశమున్నది. ఆ పుస్తకములను సమకూర్చుకొనుటకు వీలులేకున్న పై గ్రంథాలయాల నుండి ఆ పుస్తకాల వివరాలను తెలిసికొని వర్గీకరణ – సూచీకరణ చేయుట కవకాశము కూడ రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమున కున్నది.

## కొన్ని తెలుగు గ్రంథాల వర్గీకరణకు కమిటీ తయారు చేసిన షెడ్యూలు:

స్వర్గీయ మెల్‌విల్ డ్యూయీ రూపొందించిన దశాంశ వర్గీకరణ పట్టికలో భారతీయ భాషలలోని కొన్ని విషయములకు సంబంధించిన గ్రంథములకు; అందు ముఖ్యముగా ప్రత్యేకించి తత్వశాస్త్రమునకు సంబంధించిన పుస్తకములు, మత గ్రంథములు, సాహిత్య పుస్తకములు; చరిత్ర గ్రంథములు మున్నగు వానిని వర్గీకరించుటకు, కావల

నిన సూక్ష్మ విభాగములు లేవు. ఈ వివరములు యింపులో తేలక పోవుటచే దశాంశ వర్గీకరణలో కొన్ని మార్పులను చేసికొని ఆయా గ్రంథాలయ పుస్తక భాండాగారులు వారికి తోచిన విధముగా వర్గీకరించుకొనుచుండిరి. కాన ఈ వర్గీకరణలో భిన్నత్వము ఏర్పడి వర్గీకరణలో ఒకేవిధానము లేకపోయినది. ఈ విధమైన అసమానతలతో కూడిన పద్ధతులను గ్రంథాలయాల తనిఖీ సమయములలో గుర్తించి వీటిని తొలగించుటకు రాఘవరెడ్డిగారు 1965 సం॥ ఫిబ్రవరిలో ఒక కమిటీని నియమించిరి. ఈ సంఘములోని సభ్యులు.

1. శ్రీ కె. రాఘవరెడ్డి, గ్రంథాలయాల డిప్యూటి డైరెక్టరుగారు, (అధ్యక్షులు)
2. శ్రీ టి. వి. రమణయ్య, రాష్ట్ర కేంద్ర గ్రంథాలయాధికారి, హైదరాబాదు.
3. శ్రీ జి. సత్యం, ప్రభుత్వ ప్రాంతీయ గ్రంథాలయాధికారి, గుంటూరు.
4. శ్రీ. ఎన్. ఎమ్. రెడ్డి, జిల్లా కేంద్ర గ్రంథాలయాధికారి, విశాఖపట్టణము.
5. శ్రీ కె. వి. రమణమూర్తి, జిల్లా కేంద్ర గ్రంథాలయాధికారి, కాకినాడ.
6. శ్రీ జి. వెంకటసుబ్బయ్య, జిల్లా కేంద్ర గ్రంథాలయాధికారి, కడప.
7. శ్రీ వి. వెంకటప్పయ్య, శాఖా గ్రంథాలయాధికారి, తెనాలి.
8. శ్రీ. కె. ఎస్. ప్రకాశం, జిల్లా కేంద్ర గ్రంథాలయాధికారి, అనంతపురము.
9. శ్రీ కె. జనార్ధనరెడ్డి, జిల్లా కేంద్ర గ్రంథాలయాధికారి, సంగారెడ్డి.
10. శ్రీ కె. దామోదరరావు, జిల్లా కేంద్ర గ్రంథాలయాధికారి, కరీంనగర్,

ఈ సంఘము రాఘవరెడ్డిగారి అధ్యక్షతన 24—4—1965 వ పౌర గ్రంథాలయ శాఖ డైరెక్టరు గారి కార్యాలయమునందు ప్రథమ సమావేశము జరిపినది. రాష్ట్రములోని పౌర గ్రంథాలయాలలో తెలుగు భాషలోని గ్రంథముల వర్గీకరణలో ఏర్పడిన అసమానతల తొలగించి ఏకత్వము సాధించుటకు ఈ క్రింది నిర్ణయములు చేకొనబడినవి.

1. మన రాష్ట్రము నందలి పౌర గ్రంథాలయములలోని తెలుగు గ్రంథముల వర్గీకరణలో జరిగిన అసమానతలను తొలగించవలయును.

2. తెలుగు గ్రంథముల వర్గీకరణకు డ్యూయీ దశాంశ వర్గీకరణ పద్ధతినే ప్రాతిపదికగా తీసికొనవలెను.

3. డ్యూయీ దశాంశ వర్గీకరణ పట్టీలో లేని కొన్ని క్రొత్తవిభాగములు తయారుచేయవలయును.

4. పుస్తక సంఖ్యను ఏర్పరచుటలో 'కట్టర్ గుర్తు'కు మారుగా సులభ పద్ధతిని రూపొందించవలెను.

5. కేవలము తెలుగులోని గ్రంథముల వర్గీకరణ నిమిత్తమై ఈ సంఘము ఈ నిర్ణయములను చేకొన్నప్పటికి ఈ నిర్ణయాలు సంస్కృతము, మున్నగు ఇతర భారతీయ భాషలలో రచించబడిన సాహిత్య, చరిత్ర, పురాణ, మతగ్రంథముల వర్గీకరణకు కూడ ఉపయోగకరముగా నుండవలయును.

తెలుగు గ్రంథాల వర్గీకరణ కొరకు కొన్ని మార్పులతో రూపొందించిన ఈ దశాంశ వర్గీకరణ పట్టీని (Schedule) ప్రచురించి రాష్ట్రములోని అన్ని గ్రంథాలయములకు పంపడమైనది. ఈ విధముగా పౌర గ్రంథాలయాలలో వర్గీకరణలో ఏకత్వమును సాధించు

టకు కృషి సల్పిన ఈ సంఘ సభ్యులకృషి కొనియాడదగినది. రాష్ట్రము లోని చాల గ్రంథాలయాలలో యీ పద్ధతి నవలంబించడము జరిగి నది. ప్రస్తుతము యీ పెడ్యూలునందు కొన్ని మార్పులు చేయ వలసిన అవసరమెంతేని గలదు.

## ఉర్దూ, అరబ్బీ, పర్షియన్ గ్రంథాల వర్గీకరణకు కమిటి :

ఉర్దూ, అరబ్బి, పర్షియన్ భాషలలోని పెక్కు గ్రంథములు హైదరాబాదు నగరమునందలి రాష్ట్ర కేంద్ర గ్రంథాలయములోను, రాష్ట్రములోని కొన్ని ఇతర ప్రాంతములలో గల గ్రంథాలయములలో నున్నవి. ఈ భాషల యందలి గ్రంథముల వర్గీకరణలో కూడ తెలుగు భాషా గ్రంథముల వర్గీకరణలోని సమస్యయే తలెత్తినది. డ్యూయీ దశాంశ వర్గీకరణ పెడ్యూలునందు యీ భాషలలోని కొన్ని గ్రంథము లను ఏవిధముగా వర్గీకరించవలెనని సూచించబడలేదు. కావున తెలుగు గ్రంథముల వర్గీకరణ కావించిన విధముగా యీ భాషలలో కూడ గ్రంథముల వర్గీకరణ పెడ్యూలు తయారుచేయుటకు రాఘవ రెడ్డిగారు ఒక కమిటీని నియమించిరి. ఈ కమిటీలోని సభ్యులు.

1. శ్రీ అబ్దుల్ ఖాదర్ - ప్రాంతీయ గ్రంథాలయాధికారి, వరంగల్లు.

2. శ్రీ సయ్యద్ హమిదాలీ, సహాయక పుస్తక భాండాగారి, రాష్ట్ర కేంద్ర గ్రంథాలయము, హైదరాబాదు.

ఈ కమిటీ సభ్యులు తెలుగు పుస్తకముల వర్గీకరణకు సూచింప బడిన పెడ్యూలు ప్రకారము ఉర్దూ, అరబ్బీ, పర్షియన్ భాషలలోని గ్రంథముల వర్గీకరణ పెడ్యూలును రూపొందించిరి.

తొలిసారిగా భారత దేశములో ఆంధ్రరాష్ట్రముననే వర్గీకరణలో ఏకత్వమును సాధించుటకు కృషి జరిగినది. గ్రంథాలయ నిపుణులే

గాక, గ్రంథాలయ నిర్వహణలో అనుభవజ్ఞులైన పాశ్చాత్యదేశ ప్రముఖులుకూడ ఆంధ్రప్రాంతమున వర్గీకరణలో ఏకత్వమును సాధించుటకై జరుగుచుండిన కృషిని మిగుల శ్లాఘించిరి.

1967 సంవత్సరము సెప్టెంబర్ మాసమున ప్రసిద్ధ గ్రంథాలయ శాస్త్రవేత్తయగు డోరతీ పార్కర్ గారు (Rock Feller Foundation U.S.A.)మరియు డి.ఆర్. కాలియాగారు(UNESCO Expert) రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమునందు గ్రంథపాలకులతో చర్చించుచు రాష్ట్రము నందలి గ్రంథాలయాలలో అవలంబించు వర్గీకరణ, సూచీకరణ విధానము మిగుల ప్రయోజనకరముగా నున్నదని కొనియాడిరి.

## గ్రంథాలయాలలో బేగైడ్స్, షెల్ఫ్‌గైడ్స్ మున్నగు ఏర్పాటులు:

వర్గీకరించబడిన పుస్తకములను డ్యూయీ వర్గీకరణ పట్టిక వరుసలో అమర్చెడివారు. పాఠకులు వారికి కావలసిన పుస్తకములను సులభముగా కనుగొని, తీసికొనుటకు బేగైడ్స్, షెల్ఫ్‌గైడ్స్ మున్నగువాటి ఆవశ్యకత కలదు. లోకల్ లైబ్రరీ అథారిటీవారికి కూడ గ్రంథాలయమున ప్రత్యేకించబడిన పుస్తక గదియందు బేగైడ్స్, షెల్ఫ్‌గైడ్స్‌ల నుంచుకొనుటకు రాఘవరెడ్డిగారు ప్రభుత్వము నుండి కొన్ని సందర్భాలలో ప్రత్యేక గ్రాంట్లను కూడ మంజూరు చేయించిరి. ఈ విధమైన గైడ్స్ లేకుండినచో చదువరులకు కావలసిన పుస్తకములను కనుగొనుటకు ఆలస్యము జరిగెడిది.

రాష్ట్రములోని పౌర గ్రంథాలయాల తనిఖీకి రాఘవరెడ్డిగారు వెళ్ళినపుడు ఆ గ్రంథాలయాలలో పుస్తక వర్గీకరణ, సూచీకరణ పద్ధతులు సక్రమముగా జరుగుచున్నవా లేదా యన్న విషయమును తెలిసికొని వారికి తగు సూచనల నిచ్చుచుండెడివారు. పాఠకులకు అమిత ఉపయోగకరమైన రీడింగ్ లిస్టు, క్లాస్ లిస్ట్, మున్నగు వాటిని తయారుచేయమని కోరేవారు. కొన్ని పౌర గ్రంథాలయాలలో ఈ

పద్ధతులకు తగిన అనుకూల వసతులుండుటచే రీడింగ్ లిస్టులు, క్లాస్ లిస్టులను తయారు చేయడము జరిగినది.

సాంకేతికముగా గ్రంథాలయములను నిర్వహించినచో గ్రంథాలయ నిర్వాహకులకు, గ్రంథాలయశాఖకు గొప్ప గౌరవము కల్గును. గ్రంథాలయసేవ ఆధునిక విధానములలో నిర్వహింప బడవలెనన్న వర్గీకరణ, సూచీకరణ నిర్వహణ అత్యంతావశ్యకమని రాఘవరెడ్డిగారు గ్రంథాలయ నిర్వాహకులకు వివరించుచుండెడివారు.

## వర్గీకరణ - సూచీకరణలో సాధించిన ప్రగతి:

1960 సం॥ నుండి పుస్తకముల వర్గీకరణ, సూచీకరణ అనుభవము కల్గిన గ్రంథపాలకుల కృషిచే మెఱుగవుతూ వచ్చినది. ఉదా॥ 1965-66 సం॥ 158068 పుస్తకముల వర్గీకరణ జరుగగా 1967-68 సం॥ 6,22,057 పుస్తకముల వర్గీకరించడము జరిగినది. దీనినిబట్టి రాష్ట్రమునందు వర్గీకరణ, సూచీకరణ ప్రతిసంవత్సరము ఒక క్రమపద్ధతిలో జరుగుట గణనీయము. పుస్తక వినియోగమే ప్రాముఖ్యముగా నెంచిన ఆధునిక గ్రంథాలయాలకు, గ్రంథ వర్గీకరణ, సూచీకరణ ఆయువు పట్టు లాంటివి. పాఠకులకు ఉపయుక్తమగు సేవ నందచేయ దలచిన గ్రంథాలయాలన్నింటికి ఇవి చాల అవసరమని వర్గీకరణ, సూచీకరణ లేని గ్రంథాలయము ఒక కీకారణ్యము వంటిదనియు; సక్రమముగా వర్గీకరణ, సూచీకరణవున్న గ్రంథాలయము ఒక ఉద్యానవనము వంటిదనియు; రాఘవరెడ్డిగారు వివరించుచుండెడివారు. ఆధునిక పద్ధతులలో గ్రంథాలయముల నెంత చక్కగా తీర్చిదిద్దిననూ, వర్గీకరణ, సూచీకరణ క్రమపద్ధతిలో తాజాగా వుంచజాలకపోయిన, చేసినకృషి సర్వమూ వృథా యగునని భావించవలెను. సాంకేతికంగా గ్రంథాలయాలను క్రమపద్ధతులలో నుంచుటకు అవసరమైన సిబ్బందిని నియమించవలయును.



# ఆంధ్రప్రదేశ్‌లో గ్రంథ సూచీల తయారు చేయుటకు ప్రాముఖ్యత:

ఇంగ్లాండు దేశములో 1950 వ సంవత్సరము 'బ్రిటన్ జాతీయ గ్రంథసూచి' రూపొందించ బడినది. ఈ గ్రంథ సూచీయందు గ్రంథ కర్తయొక్క నామము, గ్రంథనామము తదితర వివరములు సమగ్రముగా సూచింపబడి యుండుటచే జాతీయ గ్రంథ సూచి గ్రంథ పాలకులకే గాక పాఠకులకు కూడ మిక్కిలి ఉపయుక్తముగా యున్నది. ఈ గ్రంథ సూచీలో పుస్తకముల గూర్చి వివరములు మిగుల ప్రయోజన కరముగా నుండుట వలన యీ సూచీలు యితర దేశస్థులకు ఆదర్శ ప్రాయంగా నున్నదని కూడ చెప్పవచ్చును. అమెరికాలో గ్రంథ పాలకులు కూడ "అమెరికా జాతీయ గ్రంథ సూచీ"ని తయారు చేసిరి. ఇది అమెరికాలోని గ్రంథపాలకులకు, పాఠకులకు మిగుల ప్రయోజన కరముగా నున్నది. ఇతర దేశములలోని గ్రంథ పాలకులకు కూడ యీ గ్రంథ సూచి ప్రయోజన కరముగా నున్నది. ఇదే విధముగా మన దేశమునందు వివిధ భాషలలో ప్రచురించబడు పుస్తకముల వివరములకు సంబంధించిన జాతీయ గ్రంథ సూచీలను తయారు చేయవలెనని కేంద్ర ప్రభుత్వము తలపెట్టినది.

మన రాష్ట్రమునందలి పలువురు గ్రంథపాలకులతో రాఘవ రెడ్డి గారు జాతీయ గ్రంథ సూచీని తయారు చేయవలసిన ఆవశ్యకతను గురించి చర్చలు జరిపిరి. తెలుగు పుస్తకములకు రాఘవరెడ్డిగారు ఇంగ్లీషు, సంస్కృతము మినహా మిగిలిన భాషలకు సంబంధించిన గ్రంథ సూచీలను తయారు చేయవలెనన్న అంశమును ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ డ్రాఫ్టు బిల్లునందు కూడ సూచించిరి. ఈ సూచన ప్రభుత్వ ఆమోదము పొందినది.

## గ్రంథ సూచీల తయారుచేయుట - కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల సమిష్టి బాధ్యత:

ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ చట్టము ప్రకారము రాష్ట్రమునందు ప్రచురించ బడిన ఇంగ్లీషు, సంస్కృతము మినహా తక్కిన భాషలకు చెందిన గ్రంథ సూచీలను తయారు చేయు బాధ్యత ఆంధ్ర ప్రదేశ్ పౌర గ్రంథాలయశాఖ డైరెక్టరు గారిది. కాని అన్ని భాషలకు సంబంధించిన గ్రంథ సూచీల తయారుచేయు బాధ్యతను, కేంద్ర ప్రభుత్వము కలకత్తాలోని జాతీయ గ్రంథాలయమున కప్పగించినది. తెలుగు భాషయందు ప్రచురించబడిన పుస్తకముల జాతీయ గ్రంథ సూచీని తయారుచేయు బాధ్యత కూడ జాతీయ గ్రంథాలయముపై బడినది. కేంద్ర ప్రభుత్వ ఉత్తర్వుల మేరకు వివిధ భాషలకు సంబంధించిన గ్రంథ సూచీలను జాతీయ గ్రంథాలయము రూపొందించి, ముద్రణకు ఆయా రాష్ట్ర ప్రభుత్వముల కప్పగించవలెను. ఆంధ్ర ప్రదేశ్‌లో పౌర గ్రంథాలయశాఖ డైరెక్టరు తెలుగు పుస్తకముల సూచీలను ప్రచురించి రాష్ట్రము నందలి గ్రంథాలయములకు పంపిణీ చేయవలెను.

1958 వ సంవత్సరము నుండి 1962 వ సంవత్సరము వరకు జాతీయ గ్రంథాలయ పుస్తక భాండాగారి ప్రతి ఏటా జాతీయ గ్రంథ సూచీని (తెలుగు విభాగము) రూపొందించి ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ శాఖ డైరెక్టరుకు పంపుచుండిరి. పౌర గ్రంథాలయ శాఖ డైరెక్టరు యీ గ్రంథ సూచీని ముద్రించి ఉచితముగా గ్రంథాలయములకు పంపిణీ చేయుచుండిరి.

1958 - 59, 1959 - 1960 సంవత్సరములలో జాతీయ గ్రంథాలయము రూపొందించిన గ్రంథ సూచీలను (తెలుగు విభాగము) ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ శాఖ డైరెక్టరుకు పంపిన వెంటనే

వారు జాప్యము లేకుండ ముద్రించి, రాష్ట్రము నందలి గ్రంథాలయ ములకు పంపిరి.

## ఆంధ్రప్రదేశ్‌లో గ్రంథ సూచీల సత్వరముగా తయారు చేయ బడుటను గూర్చి శ్రీ కేశవన్‌గారి ప్రశంస:

1960 - 61 లో జాతీయ గ్రంథాలయము రూపొందించి పంపి నటువంటి గ్రంథ సూచీలను పౌర గ్రంథాలయ శాఖ డైరెక్టరుగారు 1961 - 62 లో ముద్రించి గ్రంథాలయములకు ప్రతులను సత్వర ముగా పంపిణీ చేసిరి. పౌర గ్రంథాలయ శాఖ డిప్యూటీ డైరెక్టరు రాఘవరెడ్డిగారు జాతీయ గ్రంథాలయము నుండి గ్రంథ సూచీలు తమకు అందిన వెంటనే జాప్యము చేయక ప్రభుత్వ ప్రచురణాలయము వారితో సంప్రదించి, గ్రంథ సూచీలను వెంటనే ముద్రించవలసిన ఆవశ్యకతను వారికి తెలియజేసి, ఆలస్యము లేకుండ గ్రంథ సూచీలను ముద్రింపజేసి, ప్రతులను రాష్ట్రమునందలి గ్రంథాలయములకు సక్రమ ముగా పంపిణీచేయుట యందు ప్రశంసనీయమైన పాత్రను వహించు చుండిరి. రాఘవరెడ్డిగారి కృషిని గురించి మన దేశములో గ్రంథా లయ శాస్త్ర ప్రవీణులైనటువంటి కలకత్తా జాతీయ గ్రంథాలయ పుస్తక భాండాగారి శ్రీ బి. ఎస్. కేశవన్ 24—11—60 న రాఘవరెడ్డి గారికి వ్రాసిన లేఖలో యీ విధముగా కొనియాడిరి.

"Thanks to your initative and imaginativeness. It was possible for getting the annual volume of the Telugu bibliography printed in time. May I say very few people have revealed the sense of responsibility and sense of urgency which you showed, when we entrusted the responsibility to you."

1961 - 62 లో పంపిన గ్రంథసూచీని 1962 - 63 లో ముద్రించి గ్రంథాలయములకు పంపడము జరిగినది. ఈ విధముగా

1963 వరకు గ్రంథసూచీలు సకాలంలో ముద్రింపబడి గ్రంథాలయములకు పంపబడు చుండుటచేత యీ సూచీలు పుస్తకముల ఎన్నికకు, వర్గీకరణకు, సూచీకరణకు, పుస్తకములను సులభముగా అరువు పొందుటకు మిక్కిలి ప్రయోజనకరముగా నుండినది.

## గ్రంథసూచీల తయారుచేయు బాధ్యత రాష్ట్ర కేంద్ర గ్రంథాలయము స్వీకరించుట సమంజసము :

1963 సం॥ నుండి జాతీయ గ్రంథాలయము గ్రంథసూచీలను తయారు చేయుటలో జాప్యము చేయుచుండినది. ఈ గ్రంథ సూచీని జాతీయ గ్రంథాలయమునందు తయారుజేసి హైదరాబాదునందలి ప్రభుత్వ ముద్రణాలయమున ముద్రింపబడవలె నన్నచో ఈ సూచీని రూపొందించిన జాతీయ గ్రంథాలయోద్యోగి ఈ ముద్రణాలయమున యుండవలసివచ్చును. సుమారు ఒక నెల కాలమైన ఈ ముద్రణకు పట్టును. ఆ ఉద్యోగి ఒక నెల కాలము నగరమునందుండుట ఇబ్బందికరముగా నుండును. కావున యీ గ్రంథసూచీని తయారు చేయు బాధ్యతను రాష్ట్రమున కప్పగించినచో యిటువంటి ఇబ్బందులకు అవకాశ మేర్పడకుండును. సాధారణముగా ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ చట్టము ప్రకారము రాష్ట్రమునందు ప్రచురింపబడు ప్రతిపుస్తకముయొక్క ప్రతిని రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమునకు పంపవలెను. కాన రాష్ట్రమునందు ప్రచురింపబడిన పుస్తకముల వివరములు రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమునందుండుటచే గ్రంథసూచి తయారుచేయు బాధ్యతను ఆ గ్రంథాలయమున కప్పగించినచో యీ జాప్యమునకు అవకాశముండదని రాఘవరెడ్డిగారి యభిప్రాయము.

ఇతర రాష్ట్రములలో ముద్రింపబడు తెలుగు పుస్తకములు స్వల్పము. జాతీయ కేంద్ర గ్రంథాలయము ఈ పుస్తకములను రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమునకు తరలించినచో దేశమునందు ప్రచు

రించబడు తెలుగు పుస్తకముల జాబితాను రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమునందే సులభతరముగా తయారుచేయవచ్చును. దీనివలన జాతీయ గ్రంథసూచీని తెలుగునందు ఆలస్యము లేకుండ రూపొందించవచ్చును.

1963 సం॥ తర్వాత జాతీయ గ్రంథాలయము గ్రంథసూచీల వ్రాతప్రతులను కొంత ఆలస్యముగా పంపుచుండుటచేత, ముద్రించుటయందు ప్రభుత్వ ముద్రణాలయము కూడ కొంత జాప్యము చేయుచుండినది. పౌర గ్రంథాలయశాఖ డిప్యూటి డైరెక్టరుగానైనటువంటి రాఘవరెడ్డిగారు యీ విధముగా గ్రంథసూచీలను ముద్రించుటలో ఆలస్యము చేయరాదని ప్రభుత్వముద్రణాలయమువారికి తెలియజేయుచు, ఆలస్యముగా ముద్రించినచో అవి ఆశించినంత ప్రయోజనకరములు కాజాలవని వివరించుచుండిరి. ప్రభుత్వముద్రణాలయమువారు ఈ ముద్రణ బాధ్యతలను ప్రయివేటు ముద్రణాలయముల కప్పగించుటలో కూడ తగిన ప్రయత్నము చేయకపోయిరి. అంతేగాక ప్రభుత్వ ముద్రణాలయమువారు గ్రంథసూచీల ముద్రణవ్యయమును రాష్ట్ర పౌరగ్రంథాలయశాఖయే భరించవలెనని తెలియజేయుచుండిరి. గ్రంథాలయములకు కావలసిన పుస్తకముల కొనుగోలు చేయుటకే తగిన నిధులు లేని పౌర గ్రంథాలయశాఖ యీ అదనపు భారమును వహించుటకు సిద్ధముగా లేదు. పై రెండు కారణముల వలన 1963 సం॥ నుండి గ్రంథసూచీని గ్రంథాలయములకు పంపిణీచేయడములో ఆలస్యమైనది. ఇప్పటికైనా యీ బాధ్యతను రాష్ట్ర కేంద్రగ్రంథాలయమునకు అప్పగించుట సమంజసమని, అట్లు చేసిన గ్రంథసూచి ప్రచురణ సత్వరముగా జరుగగలదని రాఘవరెడ్డిగారి అభిప్రాయము.

## బాలసాహిత్యముపై ప్రత్యేక గ్రంథ సూచి:

1941 సం॥ రాఘవరెడ్డిగారు పాఠశాలల తనిఖీ ఆఫీసరుగానున్నప్పుడు రాష్ట్రమునందు, కొన్ని ప్రాథమిక పాఠశాలల యందు

మాత్రమే గ్రంథాలయము లుండెడివి. కాని ప్రాథమిక పాఠశాలల విద్యార్థులకు ప్రయోజనకరమైన పుస్తకములు కూడ తగు సంఖ్యలో లేకుండెడివి. అంతేగాక పాఠశాలలలోని ఉపాధ్యాయులు కూడ ఆ నాడు బాలలకు సంబంధించిన యే యే పుస్తకములు గ్రంథాలయము లందు వుండ తగినవి అను విషయమును కూడ గ్రహించ లేకుండిరి. సహాయక గ్రంథాలయములలో కూడ బాలలకు కావలసిన పుస్తకములు లేకుండినవి. రాఘవరెడ్డిగారు పాఠశాలల గ్రంథాలయ సర్వేక్షణ సందర్భము నందీ విషయమును గ్రహించి ఈ ఇబ్బందులను తొలగించుటకు, సులభముగా బాలలకు ప్రయోజనకరమైన పుస్తకములను ఎన్నుకొనుటకు ఒక గ్రంథ సూచీని రూపొందించ వలసిన ఆవశ్యకత ఎంతేని కలదని గుర్తించిరి.

రాఘవరెడ్డిగారు పౌర గ్రంథాలయ శాఖలో డిప్యూటీ డైరెక్టరుగా పదవీ బాధ్యతలను స్వీకరించిన అనంతరము గట్టి పట్టుదలతో బాలలకు సంబంధించిన పుస్తకముల జాబితాను తయారు చేయించి, 1963 సం॥ "బాల సాహితీమాల" ప్రతులను రాష్ట్రము నందలి అన్ని గ్రంథాలయములకు పంపిరి. భారత దేశములో యిటువంటి బాల సాహితీమాల వెలువడడము ప్రప్రథమముగా ఆంధ్రప్రదేశ్ నందే జరిగినదని చెప్పవచ్చును.

బాల సాహితీ మాలయందు గ్రంథనామము, గ్రంథకర్త యొక్క నామము, గ్రంథము ముద్రించబడిన కాల ప్రాంత వివరములు సమగ్రముగా సూచింపబడియున్నవి. కాన బాల సాహితీమాల, పుస్తకముల నెన్నుకొనుట యందు గ్రంథ పాలకులకు, పాఠశాలల ఉపాధ్యాయులకు మాత్రమే గాక బాలసాహిత్యాభిమానులకు, గ్రంథాలయ పాఠకులకు ప్రయోజన కరముగా నున్నది.

## బాల సాహిత్యముపై గిడుగు సీతాపతిగారి అభినందనలు:

బాల సాహితీమాలకు పరిచయ వాక్యముల వ్రాసిన బహుముఖ ప్రజ్ఞా సంపన్నులును, బాలల వాఙ్మయమునకు పితామహులైన గిడుగు సీతాపతిగారు "నా ఆనందమునకు ముఖ్యమైన కారణ మేమంటే 65 సంవత్సరముల క్రిందట తెలుగులో బాల సాహిత్యము కావలెనన్న కోరిక ఈ నా జీవిత కాలములో నెరవేరుట" అని హర్షమును వ్యక్తపరచిరి.

గుంటూరు ప్రభుత్వ ప్రాంతీయ గ్రంథాలయమునందు తయారు చేయబడిన ఈ బాల సాహితీమాల రూపకల్పనలో ప్రధాన పాత్ర వహించిన ప్రాంతీయ గ్రంథాలయోద్యోగులైన శ్రీ దేవదాస్ మరియు దేవదానంల కృషి ప్రశంసింప దగినది. బాల సాహితీమాల రూపకల్పనకు సముచిత సదుపాయముల కల్పించి, వారికి కావలసిన సలహాల నొసగి ఈ గ్రంథ సూచి సత్వరావిష్కరణకు బహువిధముల కృషి సలిపిన రాఘవరెడ్డి గారిని గురించి గిడుగు వేంకట సీతాపతిగారు ప్రశంసించుచూ "ఈ గ్రంథ సంపాదకత్వమునకు, ప్రకటనకు ఎక్కువగా కృషి సల్పి కృతార్థులైన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ గ్రంథాలయ శాఖ డిప్యూటి డైరెక్టర్ శ్రీ కె. రాఘవరెడ్డి, **B. A., B. Sc. L. T., Dip. in Edn (Leeds) (U. K.), D. L. Sc.** గారికి నా హృదయ పూర్వకమైన అభినందనములు సమర్పిస్తూ ఉన్నాను" అని ప్రకటించిరి. దేశమునందలి పలువురు గ్రంథపాలకులు కూడ ఈ బాల సాహితీమాలను పలువిధముల కొనియాడి యున్నారు.

ఈ విధముగా పలువురి ప్రశంసలను పొందిన బహుళ ప్రయోజనకారియగు బాల సాహితీమాలను ప్రతి ఏటా ఆయా సంవత్సరమున ప్రచురింపబడు బాలల పుస్తకములను చేర్చి ప్రచురించ వలసిన ఆవశ్యకత ఎంతేని కలదు. కావున పుస్తక సేకరణ బాధ్యతలను కల్గిన గుంటూరు ప్రభుత్వ ప్రాంతీయ గ్రంథాలయోద్యోగులు కూడ

ఈ ఆవశ్యకతను గుర్తించి 1964 నుండి బాల సాహిత్యమునకు సంబంధించి వెలువడిన పుస్తకముల వివరములను సేకరించి, ప్రతి సంవత్సరము బాలల పుస్తకముల జాబితాను ప్రచురించ వలయును. ప్రభుత్వ ముద్రణాలయము వారు కూడ బాల సాహితీ మాల ప్రతులను జాప్యము చేయక ప్రచురించి సకాలమున వాటిని గ్రంథాలయములకు పంపిణీ చేయవలసిన అవసర మెంతేని గలదు. ఈ నాటికైనా ఈ సూచీలో 1980 సం॥ వరకు ప్రచురింపబడిన బాలసాహిత్య వివరములను సేకరించి ముద్రణ కార్యక్రమమును చేపట్టి, సత్వరముగా గ్రంథాలయములకు పంపిణీ చేసినచో మిగుల ప్రయోజన కరముగా నుండగలదు. ఆ విధముగ జరిగినచో గ్రంథపాలకులు, ఉపాధ్యాయులు మున్నగువారు సంతసించెదరు.

## బాల సాహిత్యముపై ప్రత్యేక గ్రంథ సూచి ఆవశ్యకత:

గ్రంథాలయాలలో బాల సాహిత్యమునకు మిగుల ప్రాధాన్యము గలదు. పౌర గ్రంథాలయాలకు విచ్చేయు పాఠకులలో ఏబది శాతము పిల్లలే యనుట అతిశయోక్తి కాదు. వారికి పఠనాసక్తి మెండు. దేశములో బాలసాహిత్య ప్రచురణ తక్కువగానే యున్నది. ఏ విషయములపైన యే గ్రంథములు ప్రచురింపబడినవో తెలియుట లేదు. అందుచేత పౌర గ్రంథాలయాలకు, పాఠశాలల గ్రంథాలయాలకు అవసరమైన బాల సాహిత్యమును ఎన్నుకొనుటకు, వాటిని కొనుగోలు చేయుటకు ప్రత్యేక గ్రంథ సూచి తయారుచేయు అవసర మేర్పడెను. దీని ప్రాధాన్యమును గుర్తించిన రాఘవరెడ్డిగారు పట్టుదలతో ప్రప్రథమంగా ఆంధ్రప్రదేశ్ నందు బాలల సాహిత్యముపై గ్రంథ సూచీని రూపొందించిరి. దీనివలన గ్రంథపాలకులు, ప్రచురణ కర్తలు, రచయితలు కూడ ఎంతో ప్రయోజనము పొంది అవసరమగు బాల సాహిత్యమును ప్రచురించుటకు ముందుకు వచ్చిరి.

## "ఉర్దూ బాల సాహితీమాల" గ్రంథ సూచి)

ఆంధ్రప్రదేశ్ నందు వాడుకలో కల భాషలలో తెలుగు భాష తర్వాత ఉర్దూ భాషను పేర్కొన వచ్చును. ఆంధ్రప్రదేశ్ లో ఉర్దూ భాష నుపయోగించు వారి ప్రయోజనార్థము ఉర్దూ భాషలోని బాలల పుస్తకముల వివరములను తెలియ జేయు గ్రంథసూచీని ముద్రించ వలసిన అవసరము కూడ కలదని చెప్ప వచ్చును. ఢిల్లీ, లక్నో మున్నగు పట్టణముల యందు ఉర్దూ భాష ఎక్కువ వాడుక యందున్నప్పటికి ఆ ప్రాంతములందు కూడ ఉర్దూ బాల సాహితీమాల రూపొందింపబడలేదు. కాని మన రాష్ట్రము నందైన ఉర్దూ బాల సాహితీమాలను రూపొందించ వలయునని రాఘవ రెడ్డిగారు నిశ్చయించిరి. ఈ బాధ్యతలను రాష్ట్ర కేంద్ర గ్రంథాలయ సిబ్బందికి అప్పగించిరి. శ్రీ హమీదాలీ, శ్రీ ఎం. ఎ. ఖాదరుగార్లు ఈ గ్రంథ సూచి తయారీకి గొప్ప కృషి సల్పి 1967 – 68 లో పూర్తి చేసిరి. కాని ఈ గ్రంథ సూచి యీ నాటికిని ప్రచురింపబడలేదు.

## తెలుగు పుస్తకముల సమీకృత గ్రంథసూచి: (యూనియన్ కేటలాగ్)

మన రాష్ట్రములో మరియు దేశమునందలి యితర రాష్ట్రము లలో తెలుగులో అనేక పుస్తకములు వెలువడుచున్నవి. ఈ తెలుగు పుస్తకముల వివరముల తెలిసికొనవలెనన్న యిందులకు సంబంధించిన ఒక గ్రంథసూచీని రూపొందించ వలసిన అవసరమెంతేని కలదు.

ఈ ఆవశ్యకతను గుర్తించిన రాఘవరెడ్డిగారు దేశములో ప్రచురింపబడు తెలుగు పుస్తకములయొక్క వివరములను సేకరించి సమీకృత (యూనియన్ కేటలాగు) గ్రంథసూచీని రూపొందించవలసి నదిగా తెలుగునందు బాలసాహితీమాల రూపొందించిన గుంటూరు ప్రభుత్వ ప్రాంతీయ గ్రంథాలయోద్యోగులైన దేవదాస్, దేవదానం

గార్లకు 1960 సం॥ తెలియజేసిరి. ఈ సమీకృత సూచివలన దేశము నందు ప్రచురించబడిన తెలుగు పుస్తకములయొక్క వివరములు స్పష్ట మగుటయే గాక, యితర రాష్ట్రములలోని గ్రంథాలయములందున్న పుస్తకముల ఉనికిని గూర్చి తెలుపును. ఇందువలన అరువు పద్ధతి ద్వారా ఈ పుస్తకములను ఒక గ్రంథాలయము మరొక గ్రంథా లయము నుండి గ్రహించుటకు వీలగును. గుంటూరు ప్రభుత్వ ప్రాంతీయ గ్రంథాలయాధికారి 24—8—1964 న జిల్లా కేంద్ర గ్రంథాలయాధికారుల సమావేశపరచి, జిల్లా కేంద్ర గ్రంథాలయ ములు కొనుగోలుచేసిన పుస్తక వివరములను సమగ్రముగ కార్డు లందు లిఖించి సకాలంలో ప్రాంతీయ గ్రంథాలయమునకు పంపవలెనని, తదావశ్యకతా ప్రయోజనముల గురించి వివరించిరి. 1964 – 65 సం॥ (31—1—1965 నాటికి) 14,109 తెలుగు పుస్తకముల వివరముల సేకరించి సమీకృత గ్రంథ సూచియందు పొందుపరచిరి. రాఘవరెడ్డిగారి సలహాలను అప్పుడప్పుడు పొందుచుండిరి. జిల్లా కేంద్ర గ్రంథాలయముల యందుండు తెలుగు పుస్తకముల వివరములను సంపూర్ణముగ అందజేయ వలసినదని రాష్ట్రమునందలి అన్ని జిల్లా కేంద్రగ్రంథాలయ పుస్తక భాండాగారులకు రాఘవరెడ్డిగారు తెలియ జేసిరి. జిల్లా కేంద్ర గ్రంథాలయములు కొనుగోలుచేయు తెలుగు పుస్తకముల యొక్క వివరములను కార్డులందు లిఖించి వానిని గుంటూరు ప్రభుత్వ ప్రాంతీయ గ్రంథాలయమునకు పంపవలెనని స్పష్టపరచిరి. కొన్ని సందర్భములలో ప్రాంతీయ గ్రంథాలయాధి కారులు జిల్లా కేంద్ర గ్రంథాలయములకు వెళ్ళి తెలుగుపుస్తకముల వివరములను సేకరించుకొనుచుండిరి. జిల్లా కేంద్ర గ్రంథాలయములు తెలుగు పుస్తకముల వివరములను సంపూర్ణముగా అందివ్వని సంద ర్భములందు ప్రభుత్వ ప్రాంతీయ గ్రంథాలయమువారే శాఖాగ్రంథా లయములకు, తదితర గ్రంథాలయములకు వెళ్ళి ఆగ్రంథాలయములం దుండు తెలుగు పుస్తకముల వివరములను సేకరించుకొనుచుండిరి.

ఈ విధముగా 1968 సం॥వరకు తెలుగు పుస్తకముల సమీకృత సూచీ రూపకల్పన చక్కగా సాగినది. రాఘవరెడ్డిగారు ప్రభుత్వ పదవిని విరమించిన తర్వాత కూడ తెలుగు పుస్తకముల సమీకృత గ్రంథ సూచి త్వరగా ప్రచురించవలసిన ఆవశ్యకతను గ్రంథాలయ డైరెక్టరులకు వివరించి, ముద్రణలో ఆలస్యము జరుగకూడదని తెలియ పరచిరి. రాష్ట్ర గ్రంథాలయ కమిటీ సమావేశములలో కూడ ఈ విషయమును పలుమారులు వారు ప్రస్తావించిరి.

## గ్రంథ సూచీల తయారీలో స్తబ్ధత :

1969 సం॥ తరువాత ఈ పుస్తక వివరముల సేకరణ సక్రమముగా జరుగకపోవుట విచారకరము. గ్రంథపాలకులు కొందరు తాము కొనుగోలు చేసిన పుస్తక వివరములను సకాలములో గుంటూరు ప్రాంతీయ గ్రంథాలయాధికారులకు తెలియజేయలేదని తెలియుచున్నది. ప్రభుత్వ ముద్రణాలయమువారు కూడ సమీకృత సూచీలను సకాలములో ముద్రించుటకు తగు చర్యలు గైకొనలేదని తెలియుచున్నది. జిల్లా కేంద్ర గ్రంథాలయములు తాము కొనుగోలు చేసిన పుస్తకవివరముల నెప్పటికప్పుడు ప్రభుత్వ ప్రాంతీయ గ్రంథాలయమునకు పంపుచుండినచో ప్రతి సంవత్సరము సేకరింపబడు తెలుగు పుస్తకముల జాబితాను సకాలములో తయారుచేయుట సులభతరము.

ఈ విధముగా సకాలములో సమీకృత సూచీని రూపొందించు నిమిత్తము 1960-61 లో గ్రంథపాలకుల నిరువురిని ప్రాంతీయ గ్రంథాలయములో నియమించడము జరిగినది సమీకృత సూచి రూపకల్పనకు బాధ్యతను స్వీకరించిన ప్రభుత్వ ప్రాంతీయ గ్రంథాల యోద్యోగులు యిప్పటికైనా పౌర గ్రంథాలయ డైరెక్టరును సంప్రదించి జాబితాల రూపకల్పనకు సత్వర చర్యలను గైకొనవలయును.

ప్రభుత్వ ముద్రణాధికారులుకూడ సూచీ ముద్రణకు ప్రాముఖ్యత నిచ్చి ఆలస్యము చేయక సకాలములో ముద్రించవలసిన అవసర మెంతేని కలదు. ఈ సూచీని సత్వరముగా ముద్రణ చేయించి, గ్రంథాలయములకు పంపిణీ చేసినచో యిప్పటికిని మిగుల ప్రయోజన కరముగా నుండగలదు. గ్రంథపాలకులు, పాఠకులు మున్నగువారు కూడ సంతోషించెదరు.

## సమీకృత సూచి (యూనియన్ కేటలాగు) ప్రయోజనములు:

ఈ విధముగా తయారు చేయబడిన తెలుగు పుస్తకముల సమీకృత సూచి ప్రచురింపబడి యుండినచో అంతర్ గ్రంథాలయ అరువు విధానమునకు బహుముఖ ప్రయోజనకారిగా నుండి యుండగలదని చెప్పవచ్చును. జిల్లా గ్రంథాలయ సంస్థలు గ్రంథాలయములకు కొను గోలు చేయవలసిన పుస్తకముల జాబితాను సులభతరముగా తయారు చేసికొనుటకు కూడ ఈ సూచి అమిత ప్రయోజనకారిగా నుండెడిది. మనదేశమునం దేభాషయందు కూడ ఇటువంటి సూచీ వెలువడడము జరుగలేదు. కాన దేశమునందలి పలువురు బహుముఖ ప్రజ్ఞావంతులు, గ్రంథాలయశాస్త్రజ్ఞులు కూడ అఖిలభారత గ్రంథాలయ సమావేశము లందు ఈ పథకమును ప్రారంభించిన రాఘవరెడ్డిగారి కృషిని బహు విధముల శ్లాఘించి యున్నారు.

## గ్రంథకర్తల సూచీలు విషయ సూచీలు, తదితర గ్రంథసూచీల తయారుకు సంకల్పము :

తెలుగు పుస్తకముల సమీకృత సూచిని మాత్రమే గాక, రచయితల పేర్ల ననుసరించి గ్రంథ సూచీలను, (Author bibliography) విషయముల ననుసరించి గ్రంథ సూచీలను (Subject Bibliography)) వయోజనులకు ప్రయోజనమును గొల్పుపుస్తక

ముల సూచీలను గ్రంథపాలకులకు మరియు పాఠకులకు కావలసిన తదితర సూచీలను, రూపొందించవలెనని రాఘవరెడ్డిగారి ఆకాంక్ష. ఈ ధ్యేయంతోనే గ్రంథసూచీల తయారీకి నాలుగవ పంచవర్ష ప్రణాళిక ప్రాప్తునందు కూడ 25 వేల రూపాయల మొత్తమును కేటాయించవలెనని సూచించిరి. కాని, ఆర్థిక పరిస్థితు లనుకూలించనందు వలన యీ సూచీలు తయారు చేయబడలేదు. ఇప్పటికైనా యీ సూచీలు తయారు చేయబడినచో మిగుల ప్రయోజనకరముగా నుండును.

ఈ విధముగా మన రాష్ట్రమునందలి గ్రంథాలయముల అభివృద్ధి కార్యక్రమములకు మాత్రమేగాక, బాలసాహితీ మాలను తయారు చేయడములోను దేశమునందలి పుస్తకముల సమీకృత గ్రంథసూచి రూపకల్పనలోను గణనీయమైన కృషి సల్పిన రాఘవరెడ్డి గారి కృషి చిరస్మరణీయము.



# ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయాలు - ప్రచార కార్యకలాపాలు :

## గ్రంథాలయ ప్రచారము (1953-1956)

1948 మదరాసు పౌర గ్రంథాలయ చట్టము, 1950 సంవత్సరము నుండి అమలులోనికి వచ్చినప్పటికి, 1952 వ సంవత్సరము వరకు ఆంధ్ర ప్రాంతమున గ్రంథాలయాల స్థాపన జరుగలేదు. 1952-1953 సంవత్సరము నుండి గ్రంథాలయములు స్థాపింపబడుచూ వచ్చినవి. ఈ గ్రంథాలయములందు పాఠకులు చదువుకొనుటకు తగినన్ని పుస్తకములు లేకుండెను. కొన్ని జిల్లా కేంద్ర గ్రంథాలయములందు పుస్తకములు తక్కువగా నుండినవి. ఉదాహరణకు : శ్రీకాకుళం, చిత్తూరు మున్నగు జిల్లాలయందలి జిల్లా కేంద్ర గ్రంథాలయములయందు 1952 వ సంవత్సరము కడపటికి పుస్తకములు రెండు వేలకు తక్కువగా యుండినవి. ఆంధ్రప్రదేశ్ ఏర్పడు నంతవరకు గ్రంథాలయములందు పుస్తకములు తక్కువగా నుండి ఆ ప్రాంతీయులకే చాలీ చాలక యుండుటవలన ఆంధ్ర ప్రాంతమున పౌర గ్రంథాలయముల యందున్న పుస్తకముల గూర్చి ప్రచారము కూడ 1956 సంవత్సరము వరకు తగినంతగా జరుగలేదు.

ఆనాడు గ్రంథాలయాలకు ఆర్థిక వనరులు సరిగా లేని కారణమున ప్రచార కార్యకలాపాలు కూడ తగిన రీతిలో నిర్వహింప బడలేదు. అయినను ఆంధ్ర ప్రాంతములో కొన్ని గ్రంథాలయాలందు ఉపన్యాసములు, పుస్తక ప్రదర్శనలు ఏర్పాటు చేసి పాఠకులను గ్రంథాలయాలకు ఆకర్షించేవారు.

అప్పటికి జిల్లా కేంద్ర గ్రంథాలయాలలో దృశ్య-శ్రవణ విద్యాసాధనాలు లేవు. స్థానిక పౌర సంబంధ శాఖ వారి సౌజన్య

ముతో ఫిల్ము ప్రదర్శనలు కొన్ని గ్రంథాలయములలో ఏర్పాటు చేసెడి వారు. అనంతపురం జిల్లా కేంద్ర గ్రంథాలయములో గాంధీ జయంతి, నెహ్రూ జన్మదినోత్సవము మున్నగు పవిత్ర దినములందు సభలు, వక్తృత్వ పోటీలు, ఫిల్ము ప్రదర్శనలు జరుగు చుండెడివి. పాఠకులను గ్రంథాలయాలకు ఆకర్షించుటకు గాను ఏలూరు, గుంటూరు, కృష్ణా మున్నగు జిల్లా కేంద్ర గ్రంథాలయాలలో కూడ ఇటువంటి కొన్ని కార్యక్రమములను చేపట్టెడివారు.

ఆంధ్ర ప్రాంతములోని సహాయక గ్రంథాలయాలలో కూడ పుస్తకములు మిగుల తక్కువగా యుండినవి. ఆ గ్రంథాలయాలలో నున్న పుస్తకముల గురించిన ప్రచారము కూడ ఆ నాడు తక్కువగా యుండినది. గౌతమీ గ్రంథాలయము, రాజమండ్రి; రామమోహన్ గ్రంథాలయము, విజయవాడ; సరస్వతీ నికేతన్, వేటపాలెం; మున్నగు గ్రంథాలయ కార్యకర్తలు ఉత్సాహముతో వారి గ్రంథాలయాలలోనున్న పుస్తకముల గురించి తగు ప్రచారముచేసి గ్రంథాలయ సేవ జేసిరి. ఆ రోజులలో ఉన్నత పాఠశాలల గ్రంథ పాలకులలో కొందఱు ప్రజలకు కావలసిన పుస్తకముల నిచ్చుచు తమ పాఠశాల విద్యార్థులకే గాక యితరులకు కూడ గ్రంథాలయ సేవ జేసిరి.

1955 వ సంవత్సరములో హైదరాబాదు పౌర గ్రంథాలయ చట్టము అమలులోనికి వచ్చినను, తెలంగాణ ప్రాంతమునందు 1957-1958 సంవత్సరము వరకు జిల్లా కేంద్ర గ్రంథాలయాలు స్థాపించబడి యుండలేదు.

తెలంగాణ ప్రాంతమునందు 1956 సంవత్సరము నాటికి కొన్ని సహాయక గ్రంథాలయములు ప్రారంభింపబడి యుండినప్పటికి ఈ గ్రంథాలయాలలో పుస్తకములు మిగుల తక్కువగా నుండినవి. పుస్తక

ప్రచారము కూడ ఆంధ్ర ప్రాంతము నందువలె తగినంతగా లేకుండి నది. కాని శ్రీ కృష్ణదేవరాయ ఆంధ్ర భాషానిలయము; మరాఠీ హిందీ పుస్తకాలయము; భారత గుణవర్ధన సంస్థ మున్నగు గ్రంథా లయ కార్యకర్తలు మాత్రము ఉత్సాహముతో తమ గ్రంథాలయా లలోని పుస్తకముల గురించి తగు విధముగా ప్రచారము చేసి ప్రజ లకు గ్రంథాలయ సేవ జేసిరి.

## గ్రంథాలయ ప్రచారము (1956–1960) :

ఆంధ్రప్రదేశ్ అవతరణానంతరము ఆంధ్ర ప్రాంతములోని గ్రంథాలయములకు నూతనముగా కొన్ని పుస్తకముల కొనుగోలు చేయుట జరిగినది. పుస్తకముల సంఖ్య పెరుగుట వలన పాఠకుల నాకట్టుకొనుట కొఱకు గ్రంథాలయ ప్రచారముయొక్క అవసరము కూడ ఏర్పడినది. గాంధీ జయంతి, రిపబ్లిక్ డే మొదలగు జాతీయో త్సవ దినములందు కొన్ని పౌర గ్రంథాలయములలో సమావేశముల నేర్పరచు చుండిరి. ఆ సందర్భములందు కొన్ని జిల్లా కేంద్ర, శాఖా తదితర పౌర గ్రంథాలయములందు నూతనముగా కొనుగోలు చేసిన పుస్తకముల గురించి ప్రజలకు తెలియజేయుచుండిరి. ఉదా॥ కడప, గుంటూరు, తూర్పు గోదావరి, సంగారెడ్డి, వికారాబాద్, నిర్మల్, తిరుపతి, తెనాలి, మున్నగు పట్టణములందలి గ్రంథాలయాలు.

ఆంధ్ర ప్రాంతములోని కొన్ని జిల్లా కేంద్ర, శాఖా గ్రంథా లయాలలో సాంఘిక విద్య సాంస్కృతిక కార్యక్రమములు, చలన చిత్ర ప్రదర్శనలు, నాటక ప్రదర్శనలు, వ్యాసరచన పోటీలు తదితర కార్యక్రమములు నిర్వహింపబడినవి. ఈ కార్యక్రమములు ప్రధాన ముగా పాఠకులను గ్రంథాలయములకు ఆకర్షించుట కొరకు, వారి జ్ఞాన వికాసము కొఱకు నిర్వహింపబడుచుండినవి. ఈ కార్యక్రమము లను నిర్వహించునపుడు తమ గ్రంథాలయములందు గల పుస్తకము

లను గురించి పాఠకులకు కల్పించిన వసతులను గురించి ప్రచారము చేయుచుండిరి. ఉదా॥ రాయదుర్గము, విజయవాడ, తెనాలి, రాజమండ్రి, కరీంనగర్, ఖమ్మం, మున్నగు గ్రంథాలయములందు 1960 సంవత్సరమునందే గ్రంథాలయ వారోత్సవములు జరిపి, సభలు-సాంస్కృతిక ప్రదర్శనములు, పుస్తక ప్రదర్శనములు మున్నగు కార్యక్రమముల నేర్పాటు చేసిరి.

1958-59 సంవత్సరము నుండి తెలంగాణ ప్రాంతమున గ్రంథాలయాల స్థాపన ప్రారంభమైనది. అయినప్పటికి ఈ గ్రంథాలయములందు ఆ ప్రాంతీయులకు సరిపోవు పుస్తకములు కూడ లేకుండినవి. ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ చట్టము అమలులోనికి వచ్చునంతవరకు ఈ ప్రాంతమునందు కూడ గ్రంథాలయ ప్రచారము తగినంతగా జరుగలేదు. 1960 సంవత్సరము నుండి గ్రంథప్రచారము చక్కగా జరిగినది. గ్రంథపాలకులు కూడ తగు ఉత్సాహమును చూపించిరి.

## గ్రంథాలయాలలో నూతన వికాసము :

ఆంధ్రప్రదేశ్ అవతరణతో తెలుగువారందరూ ఏకమై ఉత్సవాలు, వేడుకలు జరుపుకొన గల్గారు. కొన్ని జిల్లా కేంద్ర గ్రంథాలయాలు మైకు సెట్లను కొనిన కారణముగా, గాంధీ జయంతి, నెహ్రూ జన్మదినోత్సవము, స్వాతంత్ర్య దినోత్సవము, రిపబ్లిక్ దినోత్సవము, ఆంధ్రప్రదేశ్ అవతరణ దినోత్సవములతోబాటు సాంఘిక సాంస్కృతిక కార్యక్రమాలు నిర్వహించెడివారు. అనంతపురం జిల్లాలోని కొన్ని గ్రంథాలయాలలో చిత్రకళా ప్రదర్శనములు 1958 సంవత్సరమున భారీఎత్తున నిర్వహింపబడినవి. 1960 సం॥ పూర్వము నుండి మహబూబ్‌నగర్, వరంగల్, ఏలూరు, గుంటూరు మొదలగు పట్టణములందు గ్రంథాలయాలలో పుస్తక ప్రదర్శనలు, సభలు

చక్కగా నిర్వహింపబడినవి. 1958 సంవత్సరములో రాయదుర్గములో మొదటి సారిగా గ్రంథాలయ వారోత్సవాలు ప్రారంభమైనవి. కవుల, నాయకుల జన్మదినోత్సవ సందర్భాలలో ఆయా కవుల, నాయకుల గురించిన గ్రంథాలు, సాహిత్య సంబంధిత పుస్తకములు ప్రదర్శింపబడుట జరిగెడిది. 1960 సం॥ నుండి కాకినాడ, ఏలూరు, సంగారెడ్డి, గుంటూరు, కరీంనగర్ మున్నగు పట్టణాలలో కేంద్ర గ్రంథాలయములందు తరచుగా ఉపన్యాసముల నేర్పాటు చేసెడివారు. చిత్తూరు, సంగారెడ్డి, ఏలూరు, ఖమ్మం మున్నగు పట్టణములందు పుస్తకప్రదర్శనలు నిర్వహించబడుచుండెడివి.

1959 సం॥ పూర్వము రాయదుర్గములో ప్రాథమిక పాఠశాల విద్యార్థులను గ్రంథాలయాలకు విజ్ఞానయాత్రగా తీసికొనివచ్చి, వారికి గ్రంథాలయాల ప్రయోజనములను గురించి తెలియజేసి బాలల సాహిత్యమునందు పరిచయము కల్గించెడివారు. అధిక సంఖ్యలో పుస్తకముల చదివిన పిల్లలకు, గ్రంథాలయమునకు క్రమముగా వచ్చెడి పిల్లలకు బహుమతుల పంచిపెట్టడము జరిగెడిది. కడప, నల్గొండ, మహబూబ్ నగర్, వికారాబాద్, నెల్లూరు, కర్నూలు, ఏలూరు, విశాఖపట్టణము మున్నగు పట్టణములలోని జిల్లా కేంద్ర గ్రంథాలయాలలోను, రాయదుర్గం, తిరుపతి, తెనాలి మున్నగు శాఖాగ్రంథాలయాలలోను వయోజన విద్యా కార్యక్రమములు సక్రమముగా నిర్వహింపబడుచుండెను.

## 1960 సంవత్సరము నుండి ఉధృతంగా జరిగిన గ్రంథాలయ ప్రచారము :

ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ చట్టము అమలులోనికి వచ్చిన నాటినుండి గ్రంథాలయముల యందలి పుస్తకముల సంఖ్య కూడ వృద్ధిచెందుచూ వచ్చుటచే ఆనాటి నుండి గ్రంథాలయ ప్రచార

కార్యక్రమములు కూడ ఉత్సాహముతో నిర్వహించబడినవి. పౌరగ్రంథాలయాధికారులు కేవలము సమావేశముల ద్వారా - సాంఘిక విద్యా - సాంస్కృతిక, చలనచిత్ర, నాటకప్రదర్శనాది కార్యక్రమముల ద్వారా మాత్రమేగాక కొన్ని గ్రంథాలయములందు నూతనముగా కొన్న పుస్తకములను గ్రంథాలయ ప్రవేశ ద్వారము చెంతయుంచి పాఠకుల నాకర్షించెడివారు. మఱియు కొన్ని గ్రంథాల యాలలో యిటువంటి పుస్తకములను గ్రంథాలయముల వెలుపల వెళ్ళుచున్నవారిని కూడ ఆకర్షించు విధముగా కిటికీలయం దమర్చెడి వారు. ఉదాహరణకు; గుంటూరు, చిత్తూరు, శ్రీకాకుళం మున్నగు పట్టణములలో జిల్లా కేంద్ర గ్రంథాలయములందు ఈ విధముగా పుస్తకములను ప్రదర్శించెడివారు, అంతేగాక పాఠశాలలకు వెళ్ళి క్రొత్తగా కొనుగోలుచేసిన పుస్తకములను గురించి ఉపాధ్యాయులకు, విద్యార్థులకు తెలియజేయువారు కూడ యుండిరి. కడప, చిత్తూరు, ఖమ్మం మున్నగు పట్టణముల జిల్లా కేంద్ర గ్రంథాలయ గ్రంథ పాలకులు యింటింటికి వెళ్ళి పాఠకులకు వారి గ్రంథాలయములందు గల పుస్తక ములను గురించి వివరించుచుండిరి. ఈ విధముగా ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయచట్టము అమలులోనికి వచ్చిన యనంతరము గ్రంథా లయ ప్రచారము మెరుగుపడినది. రాఘవరెడ్డిగారు కూడ పాఠ శాలలను సందర్శించు సందర్భములందు అచటి ఉపాధ్యాయులను పౌర గ్రంథాలయాలలో గల పుస్తకములను గురించి విద్యార్థులకు తెలియ జేయవలసినదిగా కోరెడివారు.

రాష్ట్ర కేంద్ర గ్రంథాలయోద్యోగులు నూతనముగా గ్రంథా లయములకు కొనుగోలు చేసిన పుస్తకముల జాబితాను వార్తాపత్రిక లందు ప్రచురించెడివారు. గ్రంథాలయములకు విచ్చేయు పాఠకులకు కేవలము క్రొత్తగా కొనుగోలు చేసిన పుస్తకములను గురించి మాత్రమే గాక, ప్రయోజనకరమయిన పాతపుస్తకములను గురించి

కూడ గ్రంథాలయ అధికారులు వివరించి వాటి ప్రయోజనమును గురించి స్పష్టపరచి ఆ పుస్తకములను పఠించుటకు తగు అభిరుచిని కల్పించెడివారు.

పాశ్చాత్య దేశములందువలె సాధారణముగా మన దేశమునందు ప్రచురించబడు పుస్తకములు పాఠకుల నాకట్టుకొను విధముగా నుండుటలేదు. గ్రంథపాలకులు ఎక్కువగా ప్రచారము కావించవలసిన యవసరమేర్పడినది. కొందరు గ్రంథాలయోద్యోగులు తమ గ్రంథాలయ పాఠకుల అభిరుచులను గ్రహించి వారికి కావలసిన పుస్తకములు తమ గ్రంథాలయములందు కలవని పాఠకులకు తెలియజేసెడివారు. ఉదాహరణకు, చిత్తూరు పట్టణమునందలి జిల్లా కేంద్ర గ్రంథాలయ గ్రంథ పాలకుడయిన శ్రీ పురుషోత్తం ఈ విధముగా పరిశోధనా విద్యార్థులకు సహాయము నందించుచుండెను. గ్రంథాలయాధికారులు గ్రంథాలయమునకు విచ్చేయు పాఠకులతో స్నేహముగా నుండి వారికవసరమగు పుస్తకములను గురించి గ్రహించి, అటువంటి పుస్తకములను వారి కందించెడివారు. షాద్‌నగర్, భువనగిరి, గుంటకల్, తిరుపతి, జనగాం, తెనాలి, మున్నగు శాఖా గ్రంథాలయములందలి యధికారులు కూడ తగు ప్రచారముచేసి పాఠకులకు సేవచేసిరి. ఈ విధముగా ఆంధ్రప్రదేశ్ పౌరగ్రంథాలయ చట్టము అమలులోనికి వచ్చిన యనంతరము గ్రంథాలయాధికారులు గ్రంథాలయములకు విచ్చేయు పాఠకులతో సహకరించి వారి వారి అభిరుచుల మేరకు పుస్తకముల నందించుచు తగిన విధముగా గ్రంథాలయ ప్రచారమును కొనసాగించి పాఠకుల నాకర్షించిరి.

## 1960—'68 సం॥లలో దృశ్య-శ్రవణ విద్యా ప్రచారాలు:

1960 సం॥ తర్వాత జిల్లా కేంద్ర గ్రంథాలయాలకు మాత్రమే గాక పలు శాఖా గ్రంథాలయాలకు కూడ రేడియోలు పంపిణీ కాబడి

నవి. రేడియోల ద్వారా వార్తా ప్రసారములతో బాటు పిల్లల కార్యక్రమములు, ప్రత్యేక ప్రకటనలు మున్నగు వానిని వినిపించెడి వారు. యుద్ధ సమయమునందు ఎప్పటి కప్పుడు వార్తలు, జాతీయ సమైక్యతకు – దేశరక్షణకు సంబంధించిన ఉపన్యాసములు వినిపించెడి వారు. ఎన్నికల సమయాలలో మైకుల ద్వారా ఫలితాలను వినిపిస్తూ బోర్డులపై వాటి వివరములను తెలియబరచు చుండెడివారు. కర్నూలు, కడప, విశాఖపట్టణము, వికారాబాదు, సంగారెడ్డి, నల్గొండ, ఖమ్మం మున్నగు పట్టణములందు పౌర సంబంధ శాఖవారు ఫిల్ము ప్రదర్శనలను ముమ్మరంగా ప్రదర్శించెడివారు. కృష్ణా, ఆదిలాబాదు, అనంతపురములోని గ్రంథాలయములు తమ స్వంత ప్రొజెక్టర్ల ద్వారా చలనచిత్ర ప్రదర్శనల నిర్వహించెడివి. గుంటూరు, ఏలూరు, కాకినాడ, విజయవాడ, నిజామాబాదు, వికారాబాదు, కరీంనగర్ మున్నగు పట్టణములలో సభలు, చర్చలు విరివిగా జరుగు చుండినవి. గుంటూరు, కృష్ణా, ఖమ్మం, కరీంనగర్, వరంగల్లు, ఆదిలాబాదు మొదలగు పట్టణములందు ఉపన్యాసముల నేర్పాటుచేసి గ్రంథాలయోద్యమ వ్యాప్తికి పలువురు గ్రంథాలయ కార్యకర్తలు తోడ్పడినారు. ఈ విధమయిన ప్రచారముల వలన గ్రంథాలయాలకు విచ్చేయు పాఠకుల సంఖ్య కూడ పెరిగినది.

పైన పేర్కొన్నవన్నియు ఉదాహరణములు మాత్రమే. రాష్ట్రములోని జిల్లాల యందంతటను గ్రంథాలయ ప్రచార కార్యక్రమములు 1960—69 సం॥ల మధ్య సక్రమముగా జరిగినవి. ప్రచారము చేయుటలో పలువిధములయిన పద్ధతుల ననుసరించడం జరిగినది. ఈ ప్రచార కార్యక్రమముల, నిర్వహణకు రాఘవరెడ్డిగారు గ్రంథాలయ కార్యకర్తలకు తదితరులకు మిగుల ప్రోత్సాహము నిచ్చెడివారు.

పెక్కు శాఖా గ్రంథాలయములందు గూడ ఈ ప్రచార కార్యక్రమములు రేడియోలు, పటములు, పోస్టర్లు, మైకులు, మున్నగు

వాటిద్వారా విరివిగా జరిగినవి. ఈ విధమయిన ప్రచార కార్యక్రమములు వలన పలువురు పాఠకులు ఆకర్షితులై అధిక సంఖ్యలో గ్రంథాలయములకు వచ్చుచుండిరి. కొన్ని సమయములందు గ్రంథాలయములందు కూర్చొనుటకు కూడ స్థలము లేనప్పటికి నిలుచుకొనియే చదువుకొను చుండెడివారు. ఉదాహరణకు, రాజమండ్రి, తెనాలి, నిర్మల్, తిరుపతి మున్నగు శాఖా గ్రంథాలయాలలో పై విధముగా పాఠకులు విశేషముగా వచ్చెడివారు.

## చైనా జరిపిన దాడి సందర్భముగా గ్రంథపాలకుల ప్రచారము – దృఢదీక్ష:

1963 వ సంవత్సరమున చైనా భారత దేశముపై దాడి సల్పిన సమయాన రాష్ట్రమునందలి గ్రంథపాలకులు, లోకల్ లైబ్రరీ అథారిటీల చైర్మన్లు, తదితర గ్రంథాలయాభిమానులు దేశరక్షణ కార్యక్రమములను గురించి గొప్పగా ప్రచారములు చేసిరి. రాఘవ రెడ్డిగారు కూడ వారికి తగు ఉత్సాహమును కల్పించిరి. ఈ విధముగా దేశరక్షణకుగాను దృఢ దీక్ష వహించి, తగు ప్రచారము చేసిన వారి కృషిని గురించి కూడ కొంతవరకు తెలిసికొనుట ఎంతేని అవసరము.

1963 వ సంవత్సరమున చైనా భారత దేశముపై సల్పిన దాడిని ప్రతిఘటించుటకు దేశములోని ప్రతిపౌరుడు సాహసముతో ఎదుర్కొన వలసిన అవసర మేర్పడినది. దాడి సల్పుచున్నటువంటి వైరుల నణగ ద్రొక్కవలెనని, దేశరక్షణకుగాను ఎటువంటి త్యాగమునైనను చేయుటకు సిద్ధపడవలెనని ప్రతి పౌరుడు నిశ్చయించుకొన్నాడు.

గ్రంథాలయ కార్యకర్తలకు ప్రజలకు అవినాభావ సంబంధ ముండుటచే, అత్యవసర పరిస్థితుల దృష్ట్యా ప్రజలకు వారి కర్తవ్యమును గురించి తెలియజేసి తగిన యుద్ధ ప్రచారమును చేయవలెనని,

మన రాష్ట్రములోని గ్రంథ పాలకులు నిశ్చయించిరి. దేశమునందు హింసాకాండలు, అత్యాచారములు నెలకొన్న సందర్భాలలో ప్రజలను మేలుకొలిపి వారిని కర్తవ్యోన్ముఖులుగా చేయు బాధ్యత తమపై ఎంతేని గలదని గ్రంథపాలకులు గ్రహించిరి. 'విజ్ఞాన నిలయములు గ్రంథాలయములు' కాన దేశమునందు సంభవించు సమస్యల తదితర విషయములకు సంబంధించిన సంపూర్ణ జ్ఞానమును గ్రంథపాలకులు పొంది యుందురు. కావున చైనా భారత దేశముపై దాడి సలిపినపుడు ప్రజల కర్తవ్యమును గుర్తించి ధైర్య సాహసాదులను గురించి ప్రజలలో తగు ప్రచారము చేయు బాధ్యత తమదేనని గ్రంథపాలకులు గ్రహించిరి.

గ్రంథాలయములందలి పుస్తకముల సహాయమున ప్రజలకు యుద్ధ సంబంధిత విషయములను గురించి బోధించుట పుస్తక భాండాగారుల తక్షణ కర్తవ్యము. ప్రస్తుత దేశ పరిస్థితులను గుర్తించి ఆర్థిక బలహీనతను దృష్టి యందుంచుకొని, క్రొత్తగా పుస్తకములను కొని పుస్తకముల తోడను, చిత్రపటముల సాయమునను దేశ సమస్యలను గురించి, యుద్ధ పరిస్థితులను గురించి తగు విధమయిన ప్రచారములను జేసి, ప్రజలను కర్తవ్యోన్ముఖులుగా చేయు బాధ్యత గ్రంథపాలకులదే నని రాష్ట్రమునందలి చిన్న చిన్న గ్రంథాలయములందు పనిచేయువారు కూడ గ్రహించి తమ తమ కర్తవ్యములను చక్కగా నిర్వర్తించిరి. లోకల్ లైబ్రరీ అథారిటీల చైర్మన్లు కొందరు యుద్ధ సమయములో గొప్ప త్యాగము చేసిరి.

## ప్రచారము - కర్తవ్యపాలనలపై గ్రంథపాలకులకు రాఘవరెడ్డిగారి సూచనలు :

రాఘవరెడ్డిగారు 1963 లో యుద్ధప్రచార విషయమున గ్రంథపాలకులు నిర్వహించవలసిన విధులను గూర్చి యీ క్రింది కొన్ని సూచనల నిచ్చిరి.

1. యుద్ధమునకు సంబంధించిన విషయములు పొందుపరచ బడియున్న పుస్తకములను, కరపత్రములను గ్రంథాలయములందు ప్రత్యేక విభాగములో చక్కగా అమర్చి అందఱును పఠించుటకు వీలుగా తగు ఏర్పాట్లు చేయవలెను. గ్రంథపాలకులు పాఠకులకు కావలసిన పుస్తకములను వెనువెంటనే అందించు చుండవలెను. గ్రంథాలయాలకు రాలేని వారలకు యుద్ధ సంబంధిత విషయ జ్ఞానమును వివరించు పుస్తకములను వారి గృహములకు స్వయముగా వెళ్ళి యిచ్చుచు ప్రశంసనీయమైన గ్రంథాలయ సేవ చేయవలెను.

2. దేశ పరిస్థితులను దృష్టియందుంచుకొని యుద్ధ సంబంధిత విషయములను వివరించు పుస్తక రచనలకొరకు రచయితలకు తగు ప్రోత్సాహమును కల్పించవలెను. యుద్ధమునకు సంబంధించిన పుస్తకముల జాబితాను, యుద్ధసమయములందు పాటింపవలసిన 'జాతీయ పొదుపు'నకు సంబంధించిన పుస్తకముల జాబితాను తయారుచేసి ఈ జాబితాలను గ్రంథాలయముల కేతెంచు పాఠకుల కెల్లఱకును అందుబాటు నందుండునట్లు గ్రంథాలయములయందలి ముఖద్వారమునకు సమీపమునందు అమర్చవలెను. గ్రంథాలయముల కేతెంచు పాఠకులు ముఖద్వారమున ఆకర్షణీయముగా అమర్చబడియున్న ఈ జాబితాలను తిలకించి ఆ పుస్తకములను పఠించవలయుననెడి అభిలాషను పొందునట్లు చేయుటయే ఈ జాబితాల రూపకల్పనయొక్క ఉద్దేశ్యము.

3. పాఠకులకు నవీన పద్ధతులలో బోధించుట కుపయోగపడు 16 ఎమ్. ఎమ్. ఫిల్ము ప్రొజెక్టర్లు, 35 ఎమ్. ఎమ్. ఫిల్ముస్ట్రిప్ ప్రొజెక్టర్లు మరియు రేడియోలు, టేప్‌రికార్డర్లు మున్నగునవి రాష్ట్రములోని కొన్ని జిల్లా కేంద్ర గ్రంథాలయములందు గలవు. అనేక పౌర గ్రంథాలయములందు దేశపటములు, గ్లోబులు, స్లైడ్లు మున్నగు పరికరములు గలవు. ప్రస్తుత దేశ అత్యవసర పరిస్థితులను

దృష్టియందుంచుకొని పై యుపకరణముల మూలమున యుద్ధసమయము లందు పౌరులెట్టి బాధ్యతలను వహింపవలెనన్న విషయములను గురించి తెలియజేసి తగు ప్రోత్సాహమును కల్పించవలెను.

4. యుద్ధసమయములందు ప్రజలు అవలంబించవలసిన పొదుపు పద్ధతులను, యితర విషయములను గూర్చి తెలియజేయు 16 ఎమ్. ఎమ్. చలనచిత్రములను ప్రదర్శించవలెను.

ప్రొజెక్టర్లను కలిగిన లేక ప్రొజెక్టర్లను అరువుగా పొందగల్గిన పౌర గ్రంథాలయముల కార్యకర్తలు హైదరాబాదు నగరమునందలి ఖైరతాబాదునందుగల చలనచిత్ర విభాగ విషయ వివరణాలయము నుండి యుద్ధమునకు సంబంధించినటువంటి చలనచిత్రములను ప్రభుత్వ ఉత్తర్వుల మేరకు ఉచితముగా తీసికొనివెళ్ళి, ప్రదర్శించి తగుప్రచార మును కావించవలెను. ఈ విధమైన ప్రచారము చేయునపుడు గ్రంథ పాలకులు జిల్లా పౌరసంబంధ శాఖాధికారి నుండి కావలసిన సహాయ సహకారములను పొందవచ్చును. ఎన్. సి. సి., ఎ. సి. సి. బాల భటుల శిక్షణకు సంబంధించిన చలనచిత్రములను గూడ గ్రంథాలయ అధికారులు పట్టణ, తదితర ప్రాంతములందు ప్రదర్శించవలెను.

5. గ్లాస్ స్లైడ్లు, ఫిల్మ్‌స్లైడ్లు మున్నగువాటి ఖరీదు 16 ఎమ్.ఎమ్. చలనచిత్రములకన్న చాల తక్కువే అయినప్పటికి కొన్ని సందర్భము లలో యుద్ధమునకు సంబంధించిన విషయములను గురించి ప్రజలకు బోధించుటకు యివి 16 ఎమ్. ఎమ్. చలనచిత్రములకన్న మిగుల ప్రయోజనకరమైనవి. ప్రజల నాకర్షించి వారిని కర్తవ్యోన్ముఖుల జేయుటకు "తక్కువగా మాట్లాడుము" "ఎక్కువగా శ్రమించుము." "వదంతుల వినకు - వదంతుల వ్యాప్తిచేయకు" "వస్తూత్పత్తిని పెంచు - వృథావ్యయముల తగ్గించు" మొదలగు ప్రచార నినాద ములను, గ్లాస్ స్లైడ్లయందును, ఫిల్మ్‌స్లైడ్లయందును ఆకర్షణీయముగా

లిఖించి ప్రదర్శించవలెను. ఈ విధమైన అత్యవసర నినాదములను గ్రామీణ ప్రాంతములందు విశేషముగా ప్రచారము చేయవలెను. "సెప్టెంబర్ 8 రేఖ" "చైనావారి ఆధీనములోనున్న సరిహద్దు రేఖ" మొదలగు అంశములను గూర్చిన నినాదవాక్యములను స్లైడ్లయందు ఆకర్షణీయముగా లిఖించి ప్రజల ఎదుట ప్రదర్శించుచూ ప్రజలలో దేశరక్షణకు తగు ఉద్రిక్తతను రేకెత్తించ వలెను.

6. యుద్ధమునకు సంబంధించిన అత్యవసర పరిస్థితిని గురించి ఉదాహరణ పూర్వకముగాను, చిత్రపటముల ద్వారాను ప్రజలకు తెలియజేసినచో వారి హృదయమునందు ఆ భావములు స్థిరముగా నిలచి, వారు తగు బుద్ధికుశలతలతో ఆలోచించి కర్తవ్యోన్ముఖులగుట కవకాశ మేర్పడును.

7. యుద్ధభూములందు సైనికులు సల్పు వీరోచిత కృత్యములను తెలియజేయు చిత్రపటములను ప్రజల ఎదుట ప్రదర్శించిన, వారు యుద్ధ వాతావరణములను గురించి చక్కని అవగాహన కల్గించుకొనుట కవకాశ మేర్పడును. ఇటువంటి చిత్రపట ప్రదర్శనములను గ్రామీణ ప్రాంతములం దెక్కువగా ఏర్పాటు చేయవలెను.

8. 1959 సంవత్సరమున చైనా - భారత దేశముల సరిహద్దు రేఖల గురించి పలువురు సందిగ్ధావస్థలో నుండిరి. ఇటువంటి క్లిష్ట పరిస్థితులలో గ్రంథపాలకులు ప్రపంచ పటములద్వారా సరిహద్దు రేఖల గురించి ప్రజలకు వివరించవలెను.

9. యుద్ధమునకు సంబంధించిన పెద్ద ప్రకటనల ఆకర్షణీయమైన పోస్టర్లను ఎక్కువ జన సంచారముండు ప్రాంతములందు అంటించవలెను ప్రజలు వాటిని చూచిన తోడనే ప్రేరేపితులై, ఆ ప్రకటనా భావముల నాకళింపు జేసికొని ప్రతిక్రియకు పూనుకొనునట్లు చేయుటయే ఈ ప్రకటనల ఉద్దేశ్యము. ప్రభుత్వముచే ప్రచు

చితమై యున్నటువంటి అనేక యుద్ధ ప్రచార పటములను గ్రంథాలయ ములందు అమర్చవలెను.

10. రాష్ట్రమునందలి పలు పౌరగ్రంథాలయములందు రేడియోలు గలవు ప్రచారముల కత్యంతోపయోగకరములయిన సాధనములగు రేడియోలను కల్గిన పౌరగ్రంథాలయ పాలకులు ఆకాశవాణి ద్వారా ప్రసారమగు కార్యక్రమములను పౌరులు వినగల్గుటకు తగు వసతులను కలుగజేయవలెను. ఈ రేడియోలయందు వెలువడు అత్యవసర పరిస్థితికి సంబంధించిన కొన్ని కార్యక్రమాలను టేపురికార్డు చేసి వాటిని కాలానుగుణముగా ఉపయోగించుచుండవలెను. ఈ విధముగా చేయుటవలన సరిహద్దులందు ఏక్షణమేమి జరుగునో గ్రహించుటకు, యుద్ధమునకు సంబంధించిన యితర ప్రధానాంశములను గురించి తత్క్షణమే గ్రహించుటకు వీలేర్పడును.

11. జాతీయ అత్యవసర పరిస్థితిని గుర్తించి, ప్రస్తుతదేశ పరిస్థితుల కనుగుణమైన విషయముల గురించి పిల్లలకు, వయోజనులకు, విద్యార్థులకు, తదితరులకు గ్రంథాలయాలలో వేర్వేరుగా ఉపన్యాసముల నేర్పాటు చేయవలెను. పాఠశాలలకు వెళ్ళేడి బాల బాలికలను సాంఘిక సేవాభిలాషులను, తదితరులను గ్రంథాలయములకు ఆహ్వానించి వారికి దేశపరిస్థితులను గురించి ఉపన్యాసముల నివ్వవలెను. ఇటువంటి ఉపన్యాసములను పట్టణ ప్రాంతములలోనే గాక గ్రామీణ ప్రాంతములందు కూడ ఏర్పాటుచేసి దేశపరిస్థితుల గురించి ప్రతి పౌరునికి తెలియజేయవలసిన బాధ్యత గ్రంథపాలకులపై ఎంతేని గలదు. ప్రముఖ ఉపన్యాసకుల నాహ్వానించి వారిచే, యుద్ధమును గురించి, యుద్ధమున కనుసంబంధిత విషయములైన వ్యవసాయోత్పత్తి, జాతీయ రక్షణ నిధికి విరాళములు – జాతీయ పొదుపు మున్నగు ప్రధానాంశములపై ఉపన్యాసముల నేర్పాటు చేయవలెను.

12. ప్రస్తుతము దేశ మెదుర్కొనుచున్న పరిస్థితులకు ప్రాధాన్యము నొసగి, జాతీయ అత్యవసర పరిస్థితిని గురించి విశదముగా సమాచారములను సేకరించి, ప్రజలు తెలిసికొనదగు సమాచారములను వారికి వెంటనే తెలియజేయవలెను.

భారతదేశముపై చైనా దురాక్రమణకు తలపడి సరిహద్దు రేఖల నతిక్రమించి ప్రవేశించుచున్నను, యిదివరకు నిర్ణయించబడియున్న సరిహద్దురేఖల వివరములను గురించి, మఱియు చైనాచేయు యుద్ధవిరమణకు సంబంధించిన అసత్య ప్రకటనలను గురించి ప్రజలలో తగినంత ప్రచారము జరుగుటలేదు. కావున గ్రంథ పాలకులు ముందంజవేసి యుద్ధసంబంధిత యథార్థ విషయముల ప్రచారములకు ప్రాముఖ్యత నివ్వడము అత్యవసరము. ఈ విధముగా యథార్థప్రచారములను చేయుటవలన ప్రజలు సత్యమును గ్రహించి దేశరక్షణ నిమిత్తము కార్యదీక్షులగుట కవకాశమేర్పడును. దేశపరిస్థితులకు సంబంధించినటువంటి యథార్థవార్తలను ప్రకటనల ద్వారాను, మఱియు పత్రికల ద్వారాను విరివిగా ప్రచారము చేయవలెను.

13. పౌర గ్రంథాలయ కార్యకర్తలు, గ్రంథాలయోద్యోగులు 'గ్రంథాలయ పాలకుల రక్షణ – సంక్షేమ దళము'ల నేర్పాటు చేసి, దేశరక్షణకు కంకణము కట్టుకొని సమరము సాగించు సైనికుల కుటుంబ సంక్షేమమునకు తోడ్పడవలెను. సమరమున పోరాడుచున్న సైనికులయొక్క పిల్లలను గ్రంథాలయములందు నిర్వహించబడు సాంస్కృతిక కార్యక్రమముల కాహ్వానించి గ్రంథాలయముల నుండి వారికి కావలసిన పుస్తకముల నుచితముగా అందివ్వవలెను. యుద్ధభూమియందున్న సైనికులకు వారు తమ విరామ సమయములందు చదువుకొనుట కొఱకు వారిని ఉత్సాహవంతులజేయు పత్రికలను, పుస్తకములను పంపవలెను. సైనికుల కొఱకు రక్తదానము చేయునట్లు గ్రంథపాలకులు ప్రజలకు తగు ప్రోత్సాహమును కల్పించవలెను.

కేంద్ర ప్రభుత్వము ప్రతిపట్టణమునందును, ట్రాఫిక్ మఱియు రక్షణ దళములకు తోడ్పడునట్లు చేయు ఉద్దేశ్యముతో 'హోమ్‌గార్డు' లను నియమింప దలపెట్టినది. ఈవిధమైన బాధ్యతలను స్వీకరించుటకు ప్రభుత్వమునుండి పిలుపు వచ్చినచో గ్రంథపాలకు లందులకు సంసిద్ధులుగా నుండవలెను. అవసరమైనచో అత్యవసర చికిత్స "విమాన దాడులనుండి రక్షణకై తీసికొనవలసిన జాగ్రత్తలు, " మున్నగు వాటిలో శిక్షణ పొందుటకు కూడ సిద్ధముగా నుండవలెను.

14. దేశరక్షణ కొఱకు కేటాయించిన జాతీయాదాయము నందలి 2½ శాతమును అత్యవసర పరిస్థితుల దృష్ట్యా పెంచవలసిన ఆవశ్యకత ఎంతేని గలదు. కాని, దేశముయొక్క ఆర్థిక స్థితిగతు లందులకు అనుకూలముగా లేకున్నను, దేశరక్షణ ప్రస్తుత అత్యవసర కర్తవ్యము గాన, ప్రభుత్వము కూడ ఈ శాతమును హెచ్చించుటకు వెనుకాడదు. ఈ శాతమును పెంచుటవలన ఏ విధమయిన సమస్యలు రాకుండునట్లుగా గ్రంథపాలకులు ప్రచారము చేయవలెను. యుద్ధ సమయములందు చేయు విరాళ సేకరణలో గ్రంథపాలకులు జిల్లా అధికారులకు, తదితరులకు సహాయ సహకారముల నందివ్వవలసిన ఆవశ్యకత ఎంతేని గలదు. ప్రతి గ్రంథాలయ పాలకుడు తన నెలసరి జీతమునుండి కొంత శాతమును జాతీయ రక్షణ నిధికి విరాళముగా నిచ్చుట మిగుల సమంజసము.

15. ప్రస్తుతయుద్ధ పరిస్థితులచే ప్రజలు అధైర్యపడకుండునట్లు చేయు బాధ్యత గ్రంథపాలకులపై గూడ కలదు. తప్పుడు వదంతులను, దుష్ప్రచారములను వినరాదని గ్రంథపాలకులు ప్రజలకు తెలియ జేయుచుండవలెను.

16. వ్యవసాయోత్పత్తులను, పారిశ్రామికోత్పత్తులను అధికము చేయుటవలన ధరలస్థాయిని అదుపు నందుంచుటకు వీలగునని గ్రంథపాలకులు ప్రజలకు తెలియబరచి, వ్యవసాయోత్పత్తి నధికము చేయుట

కుపయోగకరమయిన పుస్తకములను వ్యవసాయదారుల కందజేసి తగువిధముగా తోడ్పడవలెను. వృథావ్యయముల తగ్గించి, పొదుపును వృద్ధి చేసికొనుటకు గురించి ప్రజలకు వివరముగా తెలియజేయవలెను. శరీరదార్ఢ్యమున్న పౌరులు సైన్యమునందు చేరునట్లు చేయుటకు పౌరులకు తగిన ఉత్సాహములను గ్రంథపాలకులు కల్పించవలెను.

17. యుద్ధపరిస్థితులందు, సమాచార కేంద్రములైన గ్రంథాలయములు తగు విధముగా ప్రచారములను గావించి, ప్రజలకన్నివిధములయిన సహాయ సహకారముల నందించుచు వారిని కార్యశూరులుగా, దేశరక్షణ కంకణ ధారులుగా చేయవలెను. ఈ సమయాన ప్రతి గ్రంథాలయ పాలకుడు పౌరునికి సన్నిహితుడుగాను, జ్ఞానబోధకుడుగాను, సన్మార్గోపదేశకుడుగాను, కర్తవ్యోపదేశకుడుగాను మెలగవలెను.

## ప్రచారములో గ్రంథపాలకుల విశిష్ఠసేవ:

చైనా భారతదేశముపై దాడి సల్పిన సందర్భమున భారతీయ సైనికులు ధైర్యసాహసములతో ఎదుర్కొనిరి. వారి కండదండలుగా ప్రజలంతా ఒక్కటై నిలిచిరి. ఆ సమయమున గ్రంథాలయోద్యోగులు ప్రదర్శించిన సేవాధర్మములు మిగుల కొనియాడ దగినవి. రాష్ట్ర పౌరగ్రంథాలయ డిప్యూటీ డైరెక్టరు రాఘవరెడ్డిగారు పై సూచనలను రాష్ట్రమునందలి యన్ని గ్రంథాలయములకు పంపిరి. గ్రంథ పాలకులను గూడ కలసికొని యుద్ధసమయములందు వారి కర్తవ్యమును గురించి వివరించిరి.

గ్రంథాలయోద్యోగుల కెల్లరకు వారి సూచనలు ఒకశంఖారావముగా వినిపించినది. అందరిలో జాగృతి కల్పించినది. పలు గ్రంథాలయములు సమాచార కేంద్రాలుగా, సేవా కేంద్రాలుగా ప్రజల నుత్తేజితులజేయు చైతన్యకేంద్రాలుగా మారినవి.

రాష్ట్రమునందలి అనేక గ్రంథాలయాలు యుద్ధవార్తలను, చైనా దుండగుల దురాగతాలను, భారతీయ సైనికుల వీరోచిత పోరాటములను కన్నులకు గట్టినట్లుగా గోడ వార్తాపత్రికలలో వివరించారు. యుద్ధ వృత్తాంతములను, చిత్రపటములను ఆల్బమ్స్‌గా తయారుచేసి ప్రజల ముందుంచారు.

ప్రభుత్వము ప్రకటించిన పోస్టర్లను గ్రంథాలయాలలో ప్రదర్శించారు.

రేడియోల ద్వారా వార్తాప్రసారముల నెప్పటికప్పుడు వినిపించారు.

గ్రంథాలయోద్యోగు లనేకులు దేశరక్షణ నిధికి ఒకదిన వేతనమును విరాళముగా సమర్పించారు.

కొందరు గ్రంథాలయోద్యోగులు తమ విలువైన బంగారు ఉంగరములను రక్షణ నిధికి విరాళముగా పంపారు. యుద్ధవీరులకు విశ్రాంతి సమయములందు ఉల్లాసమును కల్గించు గ్రంథములను విరాళ రూపమున సేకరించి పంపారు.

రాఘవరెడ్డిగారొసగిన ఉపదేశము మేరకు అవసరమయినచో యుద్ధమునందు నిలబడి పోరాడుటకు కూడ గ్రంథాలయోద్యోగు లనేకులు తమ సమ్మతిని తెలియజేశారు. కడపజిల్లాయందలి గ్రంథాలయోద్యోగు లెల్లరు యుద్ధభూమియందు పోరాడుటకు సమ్మతిస్తూ అట్టి అవకాశము సంభవించినచో తామెల్లప్పుడు సంసిద్ధులేనని ప్రకటించిరి. కొందరు గ్రంథాలయోద్యోగులు రక్తదానము చేసిరి.

పెక్కు గ్రంథాలయోద్యోగుల ఉత్తేజపూరిత ఉపన్యాసముల వలన ప్రజలు దృఢవిశ్వాసమును పొంది, ఉత్తేజితులై దేశరక్షణకై తమ ప్రాణముల సైతము అర్పించుటకు సంసిద్ధులైరి.

ఈ విధమైన కార్యక్రమాలతో రాఘవరెడ్డిగారు రాష్ట్రము లోని లోకల్ లైబ్రరీ అథారిటీల చైర్మెన్లు, గ్రంథపాలకులు దేశరక్షణలో గ్రంథాలయాలపాత్ర విశిష్టత ఫలప్రదమగునట్లు చేశారు. గ్రంథాలయాభిమానులు కూడ యిటువంటి సేవ చేసిరి.

ఉదా॥ శ్రీనివాసరావు - వేటపాలెం, బాలకృష్ణరావు - ఆదిలాబాదు, బి. సుబ్బారెడ్డి - కర్నూలు, మల్లికార్జునరావు - శ్రీకాకుళం, చెన్నారెడ్డి - హైదరాబాదు, రంగారావు - నల్గొండ, వాసుదేవరెడ్డి - వరంగల్లు, శరణు రామసామిచౌదరి - గుంటూరు మున్నగువారు.

## జాతీయ గ్రంథాలయ దినము - జాతీయ గ్రంథాలయ వారోత్సవాలు - అఖిలభారత గ్రంథాలయ సంఘ ప్రకటన :

ప్రపంచ జనాభాలో సుమారు పదిశాతము నిరక్షరాస్యుల కల్గిన మనదేశమునందు అక్షరాస్యుల శాతమును పెంచు ప్రధానోద్దేశ్యముతోను, ప్రస్తుతమున్న అక్షరాస్యుల విజ్ఞానమును మరింత వృద్ధిచేయుటకు, గ్రంథాలయోద్యమ వ్యాప్తికి "అఖిలభారత గ్రంథాలయ సంఘము" జాతీయ గ్రంథాలయ దినోత్సవమును, జాతీయ గ్రంథాలయ వారోత్సవమును నిర్వహింప నిశ్చయించినది. ఈ విషయమును దేశములోని వివిధ గ్రంథాలయములకు సెప్టెంబరు 1968 సం॥ తెలియబరచి, నవంబరు 14 వ తారీఖును జాతీయ గ్రంథాలయ దినముగాను, నవంబరు 14 వ తారీఖు నుండి 20 వ తారీఖు వరకు జాతీయ గ్రంథాలయ వారముగాను పాటించవలెనని ప్రకటించినది.

మదరాసు నగరమునందలి గోఖలే హాలునందు ప్రప్రథమ అఖిలభారత గ్రంథాలయ సర్వసభ్య సమావేశము నవంబరు 14 వ

జరుగుట వలనను, మఱియు గ్రంథాలయాభిమాని, పిల్లలన్న అమిత ప్రేమాదరములు గల శ్రీ పండిత జవహర్‌లాల్ నెహ్రూగారి జన్మ దినము నవంబరు 14 అగుటవలనను జాతీయ గ్రంథాలయ దినోత్సవ మును నవంబరు 14 న జరుపవలసినదిగా నిర్ణయింపబడినది.

## జాతీయ గ్రంథాలయ వారోత్సవాల కార్యక్రమముపై అఖిల భారత గ్రంథాలయ సంఘ సూచనలు:

జాతీయ గ్రంథాలయ దినోత్సవ - వారోత్సవములను గ్రంథా లయములు, విశ్వవిద్యాలయములు, కళాశాలలు, పాఠశాలలు, జాతీయ పుస్తక సంస్థలు, పిల్లల పుస్తక సంస్థలు, సాహిత్య అకాడ మీలు, సాహిత్య సాంస్కృతిక సంస్థలు, పుస్తక వ్యాపార సంస్థలు పాటించవలెనని అఖిల భారత గ్రంథాలయ సంఘము స్పష్టపరచినది.

ఈ జాతీయ గ్రంథాలయ దిన - వారోత్సవములందు గ్రంథా లయాలు, గ్రంథాలయ సంస్థలు, సమావేశములను, సదస్సులను, ఉపన్యాసములను, పుస్తక ప్రదర్శనలను, చలనచిత్ర ప్రదర్శనము లను, తదితర కార్యక్రమముల నేర్పాటు చేయవలెనని అఖిలభారత గ్రంథాలయ సంఘము సూచించినది.

ఈ సంఘముయొక్క సూచనల మేరకు దేశము నందలి గ్రంథా లయ సమాఖ్యలు ఆయా ప్రాంతములందు సమావేశముల నేర్పరచి గ్రంథాలయముల వలన కలుగు ప్రయోజనములను ప్రజలకు వివరించి, ప్రతి పౌరుడు గ్రంథాలయమునుండి విజ్ఞానము నార్జించునట్లు, తగు ప్రచారము చేయవలెను. ప్రధానముగా యువకులకు, పిల్లలకు సంబం ధించిన ప్రత్యేక సమావేశముల నేర్పాటుచేసి గ్రంథాలయాల అభి వృద్ధిని గురించి, గ్రంథాలయములందు పుస్తకములను హెచ్చు సంఖ్యలో నుంచుటవలన కలుగుప్రయోజనములను గురించి ప్రచారము జేసి, గ్రంథాలయాభివృద్ధికి తగు ఆసక్తిని వారిలో కలుగజేయవలెను,

## ఆంధ్రప్రదేశ్‌లో రాఘవరెడ్డిగారి పర్యవేక్షణలో 1968 లో జరిగిన జాతీయ గ్రంథాలయ వారోత్సవాలు:

రాఘవరెడ్డిగారు 1968 సంవత్సరమున ప్రథమ జాతీయ గ్రంథాలయ వారోత్సవములు జయప్రదముగాను, ఆకర్షణీయము గాను నిర్వహింపబడుటకు కృషి చేసిరి. వారోత్సవాల ప్రధానోద్దేశ మును గ్రహించి, అఖిలభారత గ్రంథాలయ సంఘము రూపొందించిన కార్యక్రమము ప్రకారము ఆంధ్రప్రదేశ్‌లోని లోకల్ లైబ్రరీ అథారిటీ ఆధీనములోనున్న పౌర గ్రంథాలయాలు పాఠశాలల, కళాశాలల, విశ్వవిద్యాలయాల గ్రంథాలయాలు మఱియు ప్రత్యేక గ్రంథాలయాలు జాతీయ గ్రంథాలయ వారోత్సవములను జయప్రదముగా నిర్వహించినవి.

## ఆంధ్రప్రదేశ్‌లో గ్రంథపాలకులు జరిపిన వారోత్సవ కార్యకలాపములు – ప్రచారము:

ప్రయోజన విద్యయందు దృశ్య – శ్రవణ పరికరముల ద్వారా విద్యాబోధనయందు శిక్షణానుభవములను పొందిన, దేశ విదేశాలలో గ్రంథాలయ ప్రచారము ఏ విధముగా సాగుచున్నదో స్వయముగా పరిశీలించిన రాఘవరెడ్డిగారు గ్రంథాలయాలలో ప్రచార కార్యక్రమాల ఆవశ్యకతను గుర్తించారు. అదృష్టవశాత్తు 1968 సంవత్సర మునుండి జాతీయ గ్రంథాలయ వారోత్సవములు నిర్వహింపబడుటకు నిశ్చయింపబడెను.

ఈ వారోత్సవాలు ఒక క్రమబద్ధముగాను, ప్రయోజనాత్మకము గాను జరుపవలెనని రాఘవరెడ్డిగారు గ్రంథపాలకులకు వివరించిరి. ఈ వారోత్సవాలలో నవంబరు 14 ను బాలల దినోత్సవముగాను, ఆ వారమున ఒక దినమును మహిళా దినోత్సవముగాను, మరొక దిన మును సాంఘిక విద్యా దినోత్సవముగాను విధిగా జరుపవలెనని ఆ దే

శించిరి. ఈ వారోత్సవాలలో గ్రంథాలయ సెస్సు వసూళ్ళపై గోష్ఠి కార్యక్రమము నేర్పాటు చేయవలెనని కోరారు. ఈ కార్యక్రమముల నిర్వహణకుగాను గ్రంథాలయ సంస్థలు బడ్జెట్టులో కొంత కేటాయించు కొనుటకు కూడ తగు ఏర్పాటుచేయుట జరిగినది. మన రాష్ట్రములో గ్రామీణ గ్రంథాలయము మొదలు జిల్లా కేంద్ర గ్రంథాలయము వరకు ఈ వారోత్సవములను ఎంతో ఉత్సాహవంతముగాను, వేడుక గాను జరుపుకొనుచున్నవి.

ఈ వారోత్సవాలలో పలు పౌర గ్రంథాలయములందు జరుగు ఉపన్యాసములు, చర్చలు, సదస్సులు, పుస్తక ప్రదర్శనలు, సభలు, సమావేశాలు, ఫిల్ము ప్రదర్శనలు, వక్తృత్వ, వ్యాసరచన, చిత్ర లేఖన, సంగీత పోటీలు మున్నగు వివిధ కార్యక్రమములందు ఆబాల గోపాలము పాల్గొనుట ముదావహము. కొన్ని గ్రంథాలయాలలో సమ్మేళనాలు, అవధానాలు, నాటకాలు, సంగీత కచ్చేరీలు మున్నగు కార్యక్రమములు సక్రమముగా నిర్వహింప బడినవి.

గ్రంథాలయాలు అక్షరాస్యులకు, మాత్రమేగాక నిరక్ష రాస్యులకు సైతము ఉపయోగపడే విధముగా చలన చిత్ర ప్రదర్శనలను, యితర కార్యక్రమాలను రూపొందించ వలెననెడి రాఘవరెడ్డిగారి అభీష్టము గ్రంథాలయ వారోత్సవాల ద్వారా నెర వేరినది.

హైదరాబాదులో రాష్ట్ర కేంద్ర గ్రంథాలయము నందును, హైదరాబాదు నగర కేంద్ర గ్రంథాలయమునందును వారోత్సవ ములు జయప్రదముగా జరిగినవి. ఈ వారోత్సవాలలో ఉపన్యాస ములు, చలనచిత్ర ప్రదర్శనలు, పుస్తక ప్రదర్శనలు మున్నగు కార్యక్రమములు చక్కగా నిర్వహింపబడినవి. ఈ చలనచిత్ర ప్రద ర్శనములకు నిరక్షరాస్యులు కూడ తండోప తండములుగా విచ్చేసెడి వారు.

గుంటూరు, తిరుపతి, వరంగల్లు మున్నగు పట్టణము లందలి గ్రంథాలయాలలో గూడ యీ వారోత్సవములు చక్కగా నిర్వర్తించ బడినవి. బాలల పోటీలు, పుస్తక ప్రదర్శనలు, ఉపన్యాసములు మఱియు చలనచిత్ర ప్రదర్శనములు కూడ నిర్వహించబడినవి.

అనంతపురం, కడప జిల్లా కేంద్ర గ్రంథాలయాధికారులు ప్రయోజనకర పరిశోధనా, ఆచూకీ గ్రంథాలను విరాళరూపముగా సేకరించారు.

అనంతపురం, కడప జిల్లా కేంద్ర గ్రంథాలయాల వారోత్సవ కార్యకలాపములు ఆకాశవాణి ద్వారా ప్రసారము చేయబడినవి.

రాష్ట్రములోని దాదాపు అన్ని పౌర గ్రంథాలయములందును గ్రంథాలయ వారోత్సవములు మిగుల ఉత్సాహముతో నిర్వహింప బడినవి. ఆయా జిల్లాలలోని చైర్మెన్‌లు, గ్రంథపాలకులు, గ్రంథాలయాభిమానులు యీ కార్యక్రమములను నిర్వహించుటలో మిగుల ఆసక్తిని చూపించారు. వారి కృషి ప్రశంసనీయము.

ఈ విధముగా జాతీయ గ్రంథాలయ వారోత్సవాలు మన దేశమంతటా జరుగుచున్నవి. ఆంధ్రప్రదేశ్‌లో 1968 నుండి ద్విగుణీకృతోత్సాహముతో ప్రతి సంవత్సరము జరుగుచున్నవి.



# ఆంధ్రప్రదేశ్‌లో గ్రంథాలయ సంఘాలు - కమిటీలు :

అమెరికా, ఇంగ్లాండు మున్నగు పాశ్చాత్య దేశములలో గ్రంథాలయోద్యమము చాల ముందంజవేసినది. అచటి గ్రంథపాలకుల స్థితిగతులు కూడ మెరుగుపడుటకు, గ్రంథాలయోద్యమము ముందంజవేయుటకు అచటి గ్రంథాలయ సంఘములే కీలకపాత్రను వహించినవని చెప్పక తప్పదు. ఆ దేశములలో గ్రంథపాలకులే గాక గ్రంథాలయములందు పనిచేయు యితరసిబ్బంది, తదితర గ్రంథాలయాభిమానులు గ్రంథాలయ వ్యాప్తికి, అభివృద్ధికి బహువిధముల కృషిచేసిరి.

మనదేశమునందు 1933 వ సంవత్సరమున ఏర్పాటు కావింపబడిన అఖిలభారత గ్రంథాలయ సంఘము కూడ గ్రంథాలయ వ్యాప్తికి, గ్రంథాలయోద్యోగుల స్థితిగతుల అభివృద్ధికి ప్రశంసనీయమైన కృషి సల్పినది. మనదేశమునందు దాదాపు అన్నిరాష్ట్రములందును గ్రంథాలయ సంఘములు స్థాపింపబడి, ఆయారాష్ట్రములలో గ్రంథాలయ వ్యాప్తికి తోడ్పడుచున్నవి. పాశ్చాత్యదేశములందలి పెక్కు గ్రంథాలయ సంఘములు ఆయాదేశ ప్రభుత్వముల గ్రాంటును పొందుచూ గ్రంథాలయ వ్యాప్తికి ఉత్సాహముతో సేవచేయుచున్నవి. అదే విధముగా మనదేశమునందు కూడ కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వములు గ్రంథాలయ సంఘములకు యిప్పటికంటె అధికముగా గ్రాంట్లు మంజూరు చేసి, గ్రంథాలయముల వ్యాప్తికి ప్రోత్సాహమును కల్పించవలసిన ఆవశ్యకత యెంతేని గలదు.

1931 వ సం॥ నుండి మదరాసు విశ్వవిద్యాలయ గ్రంథాలయమునకు తరచుగా వెళ్ళుచుండిన రాఘవరెడ్డిగారు అవిభక్త మదరాసు

రాష్ట్రములో గ్రంథాలయోద్యమ తీరుతెన్నులను గురించి గ్రహించిరి. 1941 వ సం॥ నుండి పాఠశాలల తనిఖీ అధికారిగా నుండినప్పుడు వీరు మదరాసు విశ్వవిద్యాలయ గ్రంథాలయమునకు, గ్రంథాలయ శాఖ డైరెక్టరువారి కార్యాలయమునకు తరచుగా వెళ్ళుచు, అచటి వారితో గ్రంథాలయోద్యమమునుగూర్చి చర్చించి పాఠశాలలయందు జరుగుచున్న గ్రంథాలయ కార్యక్రమముల గురించి వారికి వివరించు చుండిరి. 1949 వ సం॥ వీరు విద్యాశాఖ డైరెక్టరువారి కార్యాలయ మునకు బదిలీ అయినప్పటి నుండి మదరాసునగర గ్రంథాలయోద్య మమునందు చురుకుగా పాల్గొనుటకు అవకాశము లేర్పడినవి.

## మదరాసు గ్రంథాలయ సంఘ సభ్యులతో రాఘవరెడ్డిగారి పరిచయము :

1931 లో రాఘవరెడ్డిగారు మదరాసులో విద్యార్థిగా నున్న పుడు మదరాసు గ్రంథాలయసంఘ సభ్యులు గ్రంథాలయోద్యమము నందు అమితోత్సాహముతో పాల్గొనుచుండిరి. వేసవి సెలవులందును, క్రిస్మస్ సెలవులందును గ్రంథాలయ సంఘ సభ్యులు గ్రంథాలయ శాస్త్రోపన్యాసముల నేర్పాటు చేయుచుండిరి. 1951 సం॥ మదరాసు గ్రంథాలయ సంఘమునకు రావుబహదూర్ కె. వి. కృష్ణస్వామి అయ్యర్ గారు అధ్యక్షులుగా నుండిరి. అప్పటి నుండి గ్రంథాలయో ద్యమ కార్యక్రమములు రెట్టింపుగా నిర్వహింపబడినవి. ఈ సంఘము నకు ఉపాధ్యక్షులుగా గొప్పరాజకీయ వేత్తలైన సర్. ఎ. రామ స్వామి మొదలియార్, సర్. మొహమ్మద్ ఉస్మాన్, శ్రీ టి. ఆర్. వేంకట్రామశాస్త్రి మున్నగువా రుండిరి. వీరు గొప్పమేధావులగుటచే మదరాసు గ్రంథాలయ సంఘమునకు గొప్ప గౌరవము దక్కినది. శ్రీ ఎస్. ఆర్. రంగనాథన్, మరియు ఎస్. ఎమ్. ఫాసిల్ గారు ఈ సంఘమునకు కార్యదర్శులుగా నుండిరి. ఎస్. ఆర్. రంగనాథన్ గారు గ్రంథాలయశాస్త్ర పురోభివృద్ధికి ప్రాధాన్యత నివ్వగా ఫాసిల్ గారు

గ్రంథాలయ వ్యాప్తికి కృషి సల్పిరి. మదరాసులో విద్యార్థిగా నున్నపుడే రాఘవరెడ్డిగారికి రంగనాథన్ గారితోను, ఫాసిల్ గారితోను పరిచయము గల్గినది.

## ఆంధ్ర గ్రంథాలయ సంఘ సభ్యులతో పరిచయము:

మదరాసు గ్రంథాలయ సంఘమువారు తమిళ ప్రాంతంలో గ్రంథాలయోద్యమమునకు ఏ విధముగా కృషి సల్పిరో, అదే విధముగా 1914 వ సం॥ స్థాపించబడిన ఆంధ్ర గ్రంథాలయ సంఘము వారు ఆంధ్ర ప్రాంతమున గ్రంథాలయోద్యమమునకు ఎనలేని సేవ చేసిరి. శ్రీ గాడిచర్ల హరి సర్వోత్తమరావుగారు ఆంధ్ర ప్రాంతమునందు గ్రంథాలయోద్యమమునకు కృషి సల్పిన వారిలో ప్రముఖులు. రాఘవరెడ్డిగారు 1931 సంవత్సరము నుండి 1940 సం॥ వఱకు మదరాసులో నున్నప్పుడు కూడ ఆంధ్ర ప్రాంతమున జరుగుచుండిన గ్రంథాలయోద్యమములను గురించి, ఉద్యమమునందు పాల్గొనుచుండిన శ్రీ అయ్యంకి వెంకటరమణయ్య, ఇతర ప్రముఖులు నిర్వహించు గ్రంథాలయ కార్యక్రమములను గురించి తెలుసుకొనుచుండెడివారు.

1953 వ సంవత్సరము రాఘవరెడ్డిగారు విద్యాశాఖ డైరెక్టరు కార్యాలయమునందు గ్రంథాలయముల ప్రత్యేకాధికారిగా నియమింపబడిన తరువాత ఆంధ్ర గ్రంథాలయ సంఘమునకు అధ్యక్షుడగు గాడిచెర్ల హరిసర్వోత్తమరావుగారితోను, కార్యదర్శి యగు పాతూరి నాగభూషణం గారితోను, శ్రీఅయ్యంకి వారితోను పరిచయమేర్పడినది. ఆంధ్రప్రదేశ్ అవతరణానంతరము కూడ రాఘవరెడ్డిగారు గ్రంథాలయాల ప్రత్యేకాధికారిగా కొనసాగిరి. రాఘవరెడ్డిగారు గ్రంథాలయ సమావేశములకు, సదస్సులకు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము తరపున హాజరగుచుండినపుడు శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమ

రావు, శ్రీ పాతూరి నాగభూషణం, అయ్యంకి వేంకటరమణయ్యగారి తోను గ్రంథాలయోద్యమ తీరు తెన్నులను గురించి అప్పుడప్పుడు చర్చించెడివారు.

## హైదరాబాదు గ్రంథాలయ సంఘము:

ఆంధ్రప్రదేశ్ ఏర్పడక పూర్వము రూపొందిన హైదరాబాదు గ్రంథాలయ సంఘముయొక్క సభ్యులు కూడ గ్రంథాలయోద్యమ మున చురుకుగా పాల్గొను చుండిరి. ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తరువాత శ్రీ ఉజ్లంకర్, ఆర్. ఎస్. శాస్త్రి, అబ్దుల్ హై మున్నగు యువకులైన గ్రంథాలయ సంఘ సభ్యులతో రాఘవరెడ్డిగారికి పరిచయ మేర్పడి నది. ఈ గ్రంథాలయ సంఘములో ముఖ్య సభ్యులైన కోదాటి నారాయణరావుగారు తెలంగాణ ప్రాంతమునలో ఎనలేని గ్రంథాలయ సేవ జేసిరి.

## ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘము:

ఆంధ్రప్రదేశ్ అవతరణానంతరము హైదరాబాదు గ్రంథాలయ సంఘము, ఆంధ్ర గ్రంథాలయ సంఘము విలీనమై ఆంధ్ర ప్రదేశ్ గ్రంథాలయ సంఘముగా అవతరించినది. ఈ గ్రంథాలయ సంఘమునకు శ్రీ గాడిచెర్ల హరిసర్వోత్తమరావు అధ్యక్షులుగాను, శ్రీ కోదాటి నారాయణరావు ఉపాధ్యక్షులుగాను, పాతూరి నాగ భూషణంగారు కార్యదర్శిగా నుండిరి. వీరు రాష్ట్ర గ్రంథాలయ కమిటీ సమావేశముల నిమిత్తము హైదరాబాదు వచ్చుచుండిన సమయ మున రాఘవరెడ్డిగారితో గ్రంథాలయముల అభివృద్ధి, రాష్ట్ర గ్రంథా లయ సంఘముల కార్యకలాపముల గురించి చర్చించుచుండిరి.

ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘము బ్రిటిష్ గ్రంథాలయ సంఘమువలె గ్రంథాలయాభి వృద్ధికి కృషి చేయవలెనని, ఇంగ్లాండు

నందు విద్యాభ్యాస కాలమున అచట జరుగుచుండిన గ్రంథాల యోద్యమమును గురించి గ్రహించిన రాఘవరెడ్డిగారు సంఘ సభ్యులకు వివరించుచుండిరి. ఆ నాడు బ్రిటిష్ గ్రంథాలయ సంఘమువారు బ్రిటిష్ ప్రభుత్వమునకు గ్రంథాలయ శిక్షణను గురించి, పాఠ్యాంశముల గురించి, పరీక్షల నిర్వహణను గురించి, గ్రంథాలయోద్యోగుల ఆర్థిక స్థితిగతుల గురించి, తదితర విషయముల గురించి సలహాల నిచ్చుచుండిరి. ఈ సలహాలను అచటి ప్రభుత్వము చాలామేరకు ఆమోదించు చుండెడిది. ఇంగ్లాండు నందు జరిగిన గ్రంథాలయముల అభివృద్ధికి బ్రిటిష్ గ్రంథాలయ సంఘము బహు విధముల కృషి సల్పినది. బ్రిటిష్ గ్రంథాలయ సంఘము సాధించిన ఘనతను గురించి ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘ సభ్యులకు, గ్రంథపాలకులకు సందర్భావసరములబట్టి రాఘవరెడ్డిగారు వివరించుచుండిరి. ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘ సభ్యులకు రాష్ట్ర గ్రంథాలయ కమిటీయందు, జిల్లా గ్రంథాలయ సంస్థలయందు సభ్యత్వముండవలెనని 1960 సం॥ రూపొందింపబడిన ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ డ్రాఫ్టు బిల్లు నందు రాఘవరెడ్డిగారు సూచించిరి. ప్రభుత్వము కూడ యిందులకు సమ్మతించినది. 1960 వ సంవత్సరము ఏప్రెల్ నెల 1 వ తేదిన ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ చట్టము అమలులోనికి వచ్చిన తొలిరోజులలో చట్టము ననుసరించి ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘములోని యిరువురు సభ్యులు రాష్ట్ర గ్రంథాలయ కమిటీయందు సభ్యులుగా నుండిరి. కొంతకాలము తర్వాత ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘమునకు ఎక్కువ ప్రాముఖ్యము నిచ్చుటకై చట్టమును సవరించి, రాష్ట్ర గ్రంథాలయ కమిటీకి ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘము నుండి ముగ్గురిని సభ్యులుగా నియమించడము జరిగినది. నేటికిని ఇదే పద్ధతి యమలు నందున్నది. ప్రతి జిల్లా గ్రంథాలయ సంస్థకు ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘము (జిల్లా బ్రాంచి) వారు ఇరువురిని సభ్యులుగా ఎన్నుకొనవలెను.

ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ చట్టమునందు, ఆంధ్ర ప్రదేశ్ గ్రంథాలయ సంఘమునకు రాష్ట్ర గ్రంథాలయ కమిటీ యందును, జిల్లా లోకల్ లైబ్రరీ అథారిటీల యందును కల్పించిన ప్రాధాన్యత మహారాష్ట్ర, కర్ణాటక, తమిళనాడు రాష్ట్రముల యందు అమలునందున్న పౌర గ్రంథాలయ చట్టములలో ఆయా రాష్ట్ర గ్రంథాలయ సంఘములకు కల్పించబడలేదు.

1950 సంవత్సరమునకు పూర్వము గూడ ఎందరో ప్రముఖులు ఆంధ్ర గ్రంథాలయ సంఘమునందు సభ్యులుగా నుండి సేవజేసిరి. గాడిచెర్ల హరిసర్వోత్తమరావు, అయ్యంకి వేంకటరమణయ్య, వావిలాల గోపాలకృష్ణయ్య, పాతూరు నాగభూషణం, ఎన్. హరిశ్చంద్రా రెడ్డి, కల్లూరు సుబ్బారావు మున్నగు వారు 1950 సంవత్సరము తరువాత గూడ గ్రంథాలయ సంఘ సభ్యులుగా నుండి మెనలేని సేవ జేసిరి. కోదాటి నారాయణరావు, యం. భోజిరెడ్డి మున్నగు వారు ఆంధ్ర రాష్ట్రావతణానంతరము యీ సంఘ సభ్యులుగా నుండి గ్రంథాలయ సేవ చేసిరి. ఈ నాటికిని వీరు తమ అమూల్యమైన సేవ నందించుచున్నారు.

మన రాష్ట్రమునందు ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘమే గాక ప్రభుత్వ గ్రంథాలయాల పుస్తక భాండాగారుల సంఘము, జిల్లా గ్రంథాలయ సంస్థ ఉద్యోగుల సంఘము, కళాశాలల గ్రంథపాలకుల సంఘము మొదలగునవి యుండుటచే రాష్ట్ర గ్రంథాలయ కమిటీకి ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘము నుండి మాత్రమే గాక యితర గ్రంథాలయ సంఘముల నుండి కూడ సభ్యులను ప్రతిపాదించవలెనని కొన్ని గ్రంథాలయ సంఘములు కోరుచున్నవి.

## జిల్లా గ్రంథాలయ సంస్థ ఉద్యోగుల సంఘము:

జిల్లా గ్రంథాలయ సంస్థలలో పనిచేయువారి సంఘము 1964 వ సంవత్సరమునందు స్థాపింపబడినది. ఈ సంఘము జిల్లా గ్రంథాలయో

ద్యోగుల సంఘము అని పిలువబడుచున్నది. ఈ సంఘము నిర్వహించు సమావేశములలో గ్రంథాలయముల అభివృద్ధి మార్గముల గురించి, గ్రంథాలయోద్యోగుల స్థితిగతుల గురించి చర్చించు చుండిరి. ఎమ్. ఎల్. సి. గారైన కొల్లూరి కోటేశ్వరరావుగారు గ్రంథాలయో ద్యోగుల స్థితిగతుల మెరుగు పరచుటకు మిగుల సహకరించిరి.

## ప్రభుత్వ గ్రంథాలయాల పుస్తక భాండాగారుల సంఘము:

ప్రభుత్వముచే నిర్వహింపబడు పౌర గ్రంథాలయములలో పని చేయు ఉద్యోగులచే ఇది స్థాపించబడినది. పటిష్టమైన గ్రంథాలయ సేవను చదువరుల కందజేయుటకై నిరంతర కృషి సలుపుచున్నది. ఉద్యోగుల స్థితిగతుల మెరుగు పరచి సమాన విద్యార్హతలు గలవారి కందరకును సమాన వేతనమును సాధించుట ఈ సంఘముయొక్క ప్రధానోద్దేశ్యము.

## కళాశాలల గ్రంథపాలకుల సంఘము:

ఈ సంఘము 1965 లో కళాశాలల గ్రంథాలయోద్యోగుల స్థితిగతుల మెరుగు పరచుట కొరకు యేర్పాటు చేయబడినది. కళాశాలలలోని గ్రంథాలయముల అభివృద్ధిని గురించి ఈ సంఘ సభ్యులు తరచుగా చర్చల నిర్వహించుచుండిరి. ఈ సంఘ సభ్యులకు రాఘవరెడ్డి గారు అప్పుడప్పుడూ సలహాల నొసగి గ్రంథాలయముల అభివృద్ధికై ప్రోత్సహించుచుండిరి.

## అకాడమీ ఆఫ్ లైబ్రరీ సైన్స్:

1965 సం॥నందు స్థాపించబడిన "అకాడమీ ఆఫ్ లైబ్రరీ సైన్స్ అండ్ డాక్యుమెంటేషన్ సంఘము" నందు పెక్కురు గ్రంథాలయ శాస్త్రవేత్తలు సభ్యులుగా నున్నారు. వీరు సందర్భావసరముల బట్టి సమావేశముల నేర్పాటుచేసి గ్రంథాలయ సమస్యలను చర్చించి

పరిష్కరించుకొనుచుండిరి. వీరు గ్రంథాలయ శాస్త్రమున కవసరమగు కొన్ని పుస్తకముల నిదివరకే ప్రచురించియున్నారు. గ్రంథాలయశాస్త్ర పట్టభద్రులయొక్క జ్ఞాన వికాసమునకు ఈ అకాడమీ బహువిధముల తోడ్పడుచున్నది.

## ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయాల సంఘము:

'కాలేజి ఆఫ్ లాంగ్వేజెస్' (భాషలకళాశాల) అనే సంస్థ కూడ గ్రంథాలయ శాస్త్రములో సర్టిఫికేటు కోర్సును ఆంగ్లమునందు కొంత కాలముపాటు నిర్వహించినది. తదనంతరము ప్రారంభించ బడిన పౌర గ్రంథాలయ సంఘమునకు ఇటీవలనే ప్రభుత్వముయొక్క గుర్తింపు లభించినది. డా॥ ఎమ్. ఎ. మజీద్‌ఖాన్‌గారు దీనికి కార్యదర్శి. ఈ సంఘమువారు గ్రంథాలయ శాస్త్రమునందు శిక్షణ తరగతుల నిర్వహించుటతో పాటు ఒక పత్రికను కూడ ప్రచురించుచున్నారు.

## గ్రంథాలయ సర్వస్వమునకు ప్రభుత్వ సహాయము:

ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘమువారు కొన్ని సంవత్సరములుగా "గ్రంథాలయ సర్వస్వము" అను పత్రికను నిర్వహించుచున్నారు. ఈ పత్రికను నడపుటకు, యితర కార్యకలాపముల నిర్వహణకు తగు గ్రాంట్లను మంజూరు చేయుటకు కూడ రాఘవరెడ్డిగారు కృషిసల్పిరి. ఉదా:- 1960 - 61 సం॥ ఈ పత్రికను ప్రచురించుటకు 2000-/ రూపాయల గ్రాంటు యివ్వబడినది. 1966 - 67 సంవత్సరమున కూడ యిదే మొత్తమును గ్రాంటు క్రింద యివ్వడము జరిగినది. ఈ పత్రిక యందు ప్రచురించుట కొరకై గ్రంథాలయశాఖ డైరెక్టరు మఱియు గ్రంథాలయ పాలకులు, గ్రంథాలయాభివృద్ధి కార్యక్రమములను గూర్చి, విధానముల గురించి సమాచారమును అందజేయ వలసినదిగా రాఘవరెడ్డిగారు తెలియ జేసిరి.

ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘము ప్రచురించు గ్రంథాలయ సర్వస్వమునకు చందా చెల్లించ వచ్చునని ప్రభుత్వము జిల్లాపరిషత్తులకు, పంచాయతీ సమితులకు, పురపాలక సంఘములకు ఉత్తర్వులను జారీచేసినది. పౌరగ్రంథాలయములు కూడ గ్రంథాలయ సర్వస్వమునకు చందా చెల్లించవచ్చునని రాఘవరెడ్డిగారు జిల్లాగ్రంథాలయ సంస్థలకు తెలియజేసిరి. రాష్ట్ర కేంద్ర గ్రంథాలయము, ప్రాంతీయ గ్రంథాలయములు, జిల్లా కేంద్ర గ్రంథాలయములు, తదితర గ్రంథాలయములు గ్రంథాలయ సర్వస్వమునకు 1969 మునుపటి వఱకు సంవత్సర చందా 25 రూపాయలను చెల్లించుచుండిరి. 1969 లో సంవత్సరమునకు 35 రూపాయలను చెల్లించవలసినదిగా ప్రభుత్వము పౌరగ్రంథాలయములకు తెలియజేసినది.

గ్రంథాలయ సంఘముల కీలక పాత్రవలననే గ్రంథాలయోద్యమము త్వరితముగా వ్యాప్తి చెందగలదని రాఘవరెడ్డిగారి అభిప్రాయము. రాష్ట్రమునందలి గ్రంథాలయ సంఘములు ప్రభుత్వ గుర్తింపు పొందుటకు, అవి ప్రభుత్వగ్రాంటు పొందుటకు, కొన్ని నిబంధనలను 1970 లో ప్రభుత్వము రూపొందించినది.

## ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘ గౌరవాధ్యక్షులుగా రాఘవరెడ్డిగారు :

ప్రభుత్వము నుండి పదవిని విరమించిన తరువాత రాఘవరెడ్డిగారిని 2—12—1973 విజయవాడ యందు కోదాటి నారాయణరావుగారి అధ్యక్షతన ఏర్పాటు కావింపబడిన ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘ సర్వసభ్య సమావేశమున ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘమునకు గౌరవాధ్యక్షులుగా ఎన్నుకొనిరి. ఈ విషయమును 16—12—73 న ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘ కార్యదర్శియగు

నాగభూషణంగారు రాఘవరెడ్డిగారికి తెలియజేయగా, వారందులకు సమ్మతించి, నాగభూషణంగారికి, కోదాటి నారాయణరావుగారికి తదితర గ్రంథాలయసంఘ సభ్యులకు కృతజ్ఞతల తెలియజేసిరి. ఇదివరకు కడప కోటిరెడ్డిగారు, ఎస్. జి. రంగాగారు, శ్రీమతి దుర్గాబాయ్ దేశ్‌ముఖ్ గారు, తదితర ప్రముఖులు గౌరవాధ్యక్షులుగా నుండిరి. గ్రంథాలయ డిప్యూటీ డైరెక్టరుగాను, డైరెక్టరుగాను గ్రంథాలయములకు విశిష్టసేవ సల్పి, విదేశీప్రముఖుల ప్రశంసలకు పాత్రులైన రాఘవరెడ్డిగారి సేవను గుర్తించి వారిని ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘమునకు గౌరవాధ్యక్షులుగా ఎన్నుకొనిరి. ఇది యెంతయు సమంజసము.

**అఖిలభారత గ్రంథాలయసంఘము-రాఘవరెడ్డిగారి పరిచయము:**

1933 లో స్థాపించబడినటువంటి అఖిలభారత గ్రంథాలయ సంఘమువారు ప్రచురించెడి కొన్ని పత్రికలను 1935 – 1939 సంవత్సర కాలమున మదరాసు నగరమునందు రాఘవరెడ్డిగారు కన్నెమారా గ్రంథాలయమునందును, మదరాసు గ్రంథాలయ సంఘ కార్యాలయమునందును తరచుగా పఠించుచుండిరి.

1941 వ సంవత్సరము నుండి ప్రాథమిక పాఠశాలల తనిఖీ అధికారిగా నుండిన కాలమున, 1949 వ సం॥ విద్యాశాఖ డైరెక్టరు వారి కార్యాలయమునకు బదిలీఅయిన అనంతరము అఖిలభారత గ్రంథాలయ సంఘ కార్యక్రమములను పత్రికల ద్వారా తరచుగా తెలిసికొనుచు వచ్చిరి. మదరాసు నగరములో గ్రంథాలయోద్యమమునందు అప్పుడప్పుడు పాల్గొనుటకు అవకాశము లభించినది.

1953 సం॥ ఆంధ్రరాష్ట్రావతరణానంతరము ఢిల్లీనగరమునందలి గ్రంథాలయములను సందర్శించి, అవి అవలంబించుచున్న ఆధునిక

పద్ధతులను పరిశీలించి రావలసినదిగా ప్రత్యేకాధికారిగా నుండిన రాఘవరెడ్డిగారిని 1953 సంవత్సరము ప్రభుత్వము కోరినది.

1953 లో భారతదేశ గ్రంథాలయ సంఘమునందు చురుకుగా పాల్గొనుచుండిన శ్రీ బి. ఎస్. కేశవన్, శ్రీ డి. ఆర్. కాలియా, శ్రీ ఒ. పి. త్రిఖా, శ్రీ సోహన్‌సింగ్ మున్నగువారితో రాఘవరెడ్డి గారికి పరిచయ మేర్పడినది. గ్రంథాలయశాస్త్ర శిక్షణాసౌకర్యముల కలుగజేయుటకు, గ్రంథాలయోద్యోగుల జీతముల మెఱుగు పరచుటకు ఈ సంఘ సభ్యులు కృషిచేయుచు, సదస్సుల, సమావేశ ముల నేర్పాటుచేసి గ్రంథాలయాభివృద్ధి కార్యక్రమ విషయముల చర్చించి, తీర్మానముల దేశమునందలి గ్రంథాలయములకు పంపుచు దేశములోని గ్రంథాలయముల అభివృద్ధికి తోడ్పడుచుండిరి. ఈ సభ్యులు భారతదేశ గ్రంథాలయ సంఘమునకు స్థిరత్వమును కల్పించి బలపరచవలసినదిగా రాఘవరెడ్డిగారికి తెలియజేయుచుండిరి.

**అఖిల భారత గ్రంథాలయ సంఘాభివృద్ధికి రాఘవరెడ్డిగారి కృషి:**

ప్రభుత్వాదేశానుసారము ఢిల్లీ నగరమునందలి పలు గ్రంథాలయములను సందర్శించి అచటి గ్రంథాలయము లనుసరించుచున్న ఆధునిక పద్ధతుల గ్రహించిన రాఘవరెడ్డిగారు భారతదేశ గ్రంథాలయ సంఘమునకు తగు పటుత్వమును కల్గించుటకు కృషిచేసి, పౌర గ్రంథాలయములలో పనిచేయువారికి మరియు పెక్కుమంది యితర గ్రంథాలయాభిమానులకు కూడ ఈ సంఘమునందు సభ్యులుగా చేరుటకు తగు ప్రోత్సాహము నొసగిరి.

దేశమునందలి గ్రంథాలయముల స్థితిగతులు మెరుగు పడుటకు, గ్రంథాలయోద్యోగుల సమస్యల, సందేహముల నివృత్తి చేయుటకు భారతదేశ గ్రంథాలయ సంఘము కీలక పాత్రను వహించినదని

చెప్పక తప్పదని రాఘవరెడ్డిగారు రాష్ట్రమునందు నిర్వహింపబడు గ్రంథాలయ సమావేశము లందు పేర్కొనుచుండిరి. భారతదేశ గ్రంథాలయ సంఘముయొక్క సమావేశములు, చర్చలు ఏ ప్రాంతమునందు నిర్వహింపబడు చుండినను అచటికి రాష్ట్రములోని పలు లోకల్ లైబ్రరీ అథారిటీల చైర్మన్‌లను, కార్యదర్శులను రాఘవరెడ్డిగారు పెద్దసంఖ్యలో పంపుచుండిరి. సాధారణముగా ఏరాష్ట్రము కూడ ఈ సంఘ సమావేశములకు ఇంత పెద్ద సంఖ్యలో ప్రతినిధులను పంపుచుండెడిది గాదు. ఈ విషయమును గురించి శ్రీ సోహాన్ సింగ్, శ్రీ కాలియాగారు రాఘవరెడ్డిగారిని ప్రశంసించి యున్నారు.

## అఖిల భారత గ్రంథాలయ సంఘ ఉపాధ్యక్షులుగా, కార్యవర్గ సభ్యులుగా రాఘవరెడ్డిగారి సేవలు:

1974 వ సంవత్సరమున భారతదేశ గ్రంథాలయ సంఘు అధ్యక్ష, ఉపాధ్యక్ష, కార్యదర్శుల, తదితర పదవులకు పోటీలు జరిగినవి. ఈ ఎన్నికలలో ఉపాధ్యక్ష పదవికి పోటీ చేయవలసినదిగా మన రాష్ట్రములోని గ్రంథపాలకులేగాక యితర రాష్ట్రములలోని గ్రంథాలయ శాస్త్రవేత్తలు, గ్రంథాలయాభిమానులు పలువురు రాఘవరెడ్డిగారిని కోరిరి. వారు అందులకు సమ్మతించి ఉపాధ్యక్షపదవికి అభ్యర్థిగా నిలిచిరి. అఖిలభారత గ్రంథాలయసంఘములో ప్రముఖ గ్రంథపాలకులు, గ్రంథాలయ శాస్త్రవేత్తలు, గ్రంథాలయాభిమానులు, విద్యావేత్తలు మున్నగువారు సభ్యులు. రాఘవరెడ్డిగారి బహుముఖ సేవను గుర్తించి, యీ సభ్యులు వారిని అత్యధిక మెజారిటీతో రహస్య బ్యాలెట్ ద్వారా గెలిపించిరి. ఇది యెంతయో ముదావహము. వివిధ పత్రికలు కూడ రాఘవరెడ్డిగారి విజయమును బహువిధముల కొనియాడినవి. ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘమువారు కూడ 1975 ఫిబ్రవరి నెల 6–వ తేదిన రాఘవరెడ్డిగారు ఉపాధ్యక్షపదవికి

ఎన్నికైనందులకు అభినందన తీర్మానమును ఈ క్రింది విధముగా ప్రకటించి రాఘవరెడ్డిగారికి సమర్పించిరి.

"సంఘ గౌరవాధ్యక్షులు రాఘవరెడ్డిగారు ఇండియన్ లైబ్రరీ అసోసియేషన్ ఉపాధ్యక్షులుగా ఎన్నికైనందులకు వారిని సంఘము వారు అభినందించుచు తమ సంతోషమును ప్రకటించుచున్నారు."

2—2—1975 న ఢిల్లీ పౌర గ్రంథాలయమునందు అఖిల భారత గ్రంథాలయ సంఘ కౌన్సిల్ సమావేశము జరిగినది. ఈ సమావేశమునందు రాఘవరెడ్డిగారు అఖిల భారత గ్రంథాలయ సంఘ ఎగ్జిక్యూటివ్ కమిటి సభ్యులుగా కూడ ఎన్నుకొనబడిరి.



XXII ALL-INDIA LIBRARY CONFERENCE, DELHI
(Jan. 17-20, 1976)

ఢిల్లీలో 1976 లో జరిగిన అఖిలభారత గ్రంథాలయ సమావేశమును భారత ఉపరాష్ట్రపతి శ్రీ బి. డి. జెట్టి ప్రారంభోత్సవము చేస్తున్న దృశ్యం. అఖిలభారత గ్రంథాలయ సంఘ ఉపాధ్యక్షులు శ్రీ కె. రాఘవరెడ్డిగారు, శ్రీ గోయెల్‌గారు వేదికపై కలరు.

## అన్ని రాష్ట్రములలో అఖిలభారత గ్రంథాలయ సంఘకమిటీల ఏర్పాటుకు నిర్ణయము :

అఖిలభారత గ్రంథాలయ సంఘముయొక్క బాధ్యతలు, విధులు ఎక్కువైనవి. కాన ప్రతి రాష్ట్రమునందు ఒక కమిటీని ఏర్పాటుచేసి ఈ కమిటీలకు కొన్ని అధికారముల నప్పగించుట సముంజసమని, మరియు ప్రతిరాష్ట్రమునందును రాష్ట్రకమిటీతో బాటు సబ్ కమిటీలను కూడ ఏర్పాటు చేయడము వలన ఎక్కువమందిని సభ్యులుగా చేర్చుకొనుటకు వీలగునని, అందువలన అఖిలభారత గ్రంథాలయ సంఘముయొక్క గ్రంథాలయ కార్యక్రమముల నిర్వహణ కూడ మెరుగుపడుటకు వీలగునని సంఘ అధ్యక్షులైన కాలియాగారు సంఘ సభ్యులకు సూచించిరి. ఇందులకు ఉపాధ్యక్షులైన రాఘవరెడ్డిగారు, తదితర సభ్యులు సమ్మతించిరి. అఖిలభారత గ్రంథాలయ సంఘ ఉపాధ్యక్షులుగా బాధ్యతల చేపట్టిన రాఘవరెడ్డిగారు తమ కర్తవ్యమును నిర్వర్తించు నిమిత్తము మన దేశములో దాదాపు అన్ని రాష్ట్రములలోని గ్రంథాలయాలను సందర్శించిరి. గ్రంథపాలకుల సమస్యల పరిష్కారమునకు కూడ తగుకృషి సల్పిరి. కొన్ని గ్రంథాలయాలలో ఉపన్యాసముల కూడ నొసగిరి. పౌర గ్రంథాలయ చట్టము అమలులో లేని రాష్ట్రములలో చట్టము నమలులోనికి తీసికొని రావలసిన ఆవశ్యకతను గురించి ఆయా రాష్ట్ర గ్రంథపాలకులకు, గ్రంథాలయ సంఘ సభ్యులకు కూడ విశదీకరించిరి. ఈ విధముగా వీరు ఇతర రాష్ట్రములలో కూడ గ్రంథాలయసంఘ సభ్యులతోను, గ్రంథపాలకులతోను ప్రయోజనకరమయిన చర్చలు జరుపుటయందు ఎక్కువ కాలమును, వెచ్చించిరి. ఆంధ్రరాష్ట్రి అవతరణానంతరము ఆంధ్రప్రదేశ్ నందు ఈ విధముగా దేశమునందలి వివిధ రాష్ట్రముల పర్యటన జేసినవారు రాఘవరెడ్డిగా రొక్కరే. కావున, వారిపర్యటనగురించి సంగ్రహముగా

నుడువుట కూడ అవసరము. ప్రప్రథమముగా దక్షిణాది రాష్ట్రములకు అనగా ఆంధ్రప్రదేశ్, తమిళనాడు, కర్నాటక, పాండిచ్చేరి, కేరళ రాష్ట్రములలో రాష్ట్ర కమిటీల నేర్పాటుచేయవలసినదిగా భారత దేశ గ్రంథాలయ సంఘమువారు రాఘవరెడ్డిగారిని కోరిరి.

## దక్షిణాది రాష్ట్రములలో అఖిలభారత గ్రంథాలయ కమిటీల ఏర్పాటు:

రాఘవరెడ్డిగారు దక్షిణాది రాష్ట్రములకు వెళ్ళి అచటి గ్రంథాలయ కార్యనిర్వాహకులతో చర్చించి రాష్ట్ర కమిటీల నేర్పాటు చేయుటకు తోడ్పడిరి. ఈ రాష్ట్ర కమిటీల యందు గ్రంథాలయాభిమానులను, నిపుణులను సభ్యులుగా నియమించిరి. గ్రంథాలయ శాస్త్ర శిక్షణకు, పౌర గ్రంథాలయములకు, తదితర విషయములకు సంబంధించిన సబ్ కమిటీలను ప్రతి రాష్ట్రమునందు మేనెల 1975 వ సంవత్సరములో ఏర్పాటుచేసిరి. ప్రప్రథమముగా 1975 వ సంవత్సరమునందు ఆయా రాష్ట్ర కమిటీలకు చైర్మన్‌లుగా, కన్వీనర్‌లుగా క్రింది వారిని నియమించడము జరిగినది.

| రాష్ట్రము | చైర్మన్ | కన్వీనర్ |
|---|---|---|
| 1. తమిళనాడు | శ్రీ వి. తిల్లానాయగం, పౌర గ్రంథాలయ శాఖ డైరెక్టరు, తమిళనాడు. | శ్రీ వి. ఎం. సౌందర రాజన్, రాష్ట్ర కేంద్ర గ్రంథాలయ గ్రంథ పాలకుడు, తమిళనాడు. |
| 2. కేరళ | శ్రీ పి. వి. వర్గీస్, రాష్ట్ర కేంద్ర గ్రంథ పాలకుడు, తిరువనంత పురము, కేరళ. | శ్రీ పి. వాసుదేవన్, సహాయ గ్రంథపాలకుడు, పౌర గ్రంథాలయము, తిరువనంతపురము. |

| రాష్ట్రము | ఛైర్మన్ | కన్వీనర్ |
|---|---|---|
| 3. ఆంధ్రప్రదేశ్ | శ్రీ శ్యామ్‌సన్ రామ కృష్ణయ్యా, పౌర గ్రంథాలయశాఖ, డైరెక్టరు, ఆంధ్రప్రదేశ్, | శ్రీ కె. ఎస్. ప్రకాశం, రాష్ట్ర కేంద్ర గ్రంథాలయ గ్రంథ పాలకుడు, హైదరాబాదు. |
| 4. కర్ణాటక | శ్రీ ఎన్. డి. బగరి, రాష్ట్ర కేంద్రగ్రంథాలయ గ్రంథపాలకుడు, కర్నాటక. | శ్రీ కెంపణ్ణ, రాష్ట్ర కేంద్రగ్రంథాలయము, బెంగుళూరు. |
| 5. పాండిచ్చేరి | శ్రీ కె. వి. వి. సత్య నారాయణ, ప్రభుత్వ న్యాయ కళాశాల గ్రంథ పాలకుడు, పాండిచ్చేరి. | శ్రీ కె. సౌందరం, ఉప గ్రంథ పాలకుడు, విద్యాశాఖ డైరెక్టరు కార్యాలయము, పాండిచ్చేరి. |

## దక్షిణాది రాష్ట్రాలలో రాఘవరెడ్డిగారి విస్తృత పర్యటన:

రాష్ట్ర కమిటీల నిర్మాణము జరిగిన తర్వాత భారత దేశ గ్రంథాలయ సంఘముయొక్క ఆదేశము మేరకు 1976 వ సంవత్సరములో రాఘవరెడ్డిగారు దక్షిణాది రాష్ట్రములలో పెక్కు గ్రంథాలయములకు వెళ్ళి గ్రంథ పాలకులతోను, కార్యకర్తలతోను అనేకాంశములపై చర్చలు జరిపి, తగు సూచన లిచ్చిరి.

తమిళనాడు రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమునందు, తమిళనాడు గ్రంథాలయ డైరెక్టరుచే మదరాసులో ఏర్పాటు చేయబడిన సమావేశములో పాల్గొని, తదనంతరము మధురై, తిరుచినాపల్లి, కోయంబత్తూరు మున్నగు జిల్లాల కేంద్ర గ్రంథాలయములను సందర్శిం

చిరి. మధురలో జిల్లా గ్రంథాలయ పాలకులేర్పాటు చేసిన సమావేశమునందు ఉపన్యసించిరి. వారితో గ్రంథాలయ సమస్యలను గురించి చర్చించిరి. ఈ సమావేశములందు ఆ రోజులలో ఆంధ్ర గ్రంథాలయోద్యోగుల స్థితిగతులు, తమిళనాడు గ్రంథాలయోద్యోగుల స్థితిగతులకన్న మెరుగుగా నున్నవని తమభావన వ్యక్తపరచిరి. తిరుచినాపల్లి వెళ్ళిన సందర్భమున తమిళనాడు కళాశాలల గ్రంథపాలకుల సంఘ కార్యదర్శిగారైన సౌందరరాజన్‌గారిని కలిసికొని, కళాశాల గ్రంథపాలకుల స్థితిగతుల మెరుగుపరచుటకు వారు గావించిన కృషిని రాఘవరెడ్డిగారు కొనియాడిరి.

రాఘవరెడ్డిగారు ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయముల డిప్యూటీ డైరెక్టర్‌గాను, డైరెక్టర్‌గా నున్న కాలమునందు కూడ బెంగుళూరు, మైసూరు నందుగల పౌర గ్రంథాలయములను సందర్శించుటయే గాక, అచటి గ్రంథాలయము లేర్పరచిన సమావేశములందు కూడ పాల్గొనుచుండిరి. భారతదేశ గ్రంథాలయ సంఘ ఉపాధ్యక్షులుగా ఎన్నికైన తర్వాత కూడ కర్ణాటక ప్రాంత పౌర గ్రంథాలయములను సందర్శించిరి. మంగుళూరు, హాసన్, ధార్వాడ్ మున్నగు ముఖ్య పట్టణములలో పౌర గ్రంథాలయములను సందర్శించి గ్రంథాలయ కార్యకర్తలకు భారతదేశ గ్రంథాలయ సంఘముయొక్క స్థిరత్వమునకు కృషి చేయవలెనని తెలియబరచిరి.

తిరువనంతపురములో కేరళ రాష్ట్ర కమిటి (ఐ. ఎల్. ఎ.) ఏర్పాటుచేయుటకు వెళ్ళిన రాఘవరెడ్డిగారు కేరళ రాష్ట్ర గ్రంథాలయమును, విశ్వవిద్యాలయ గ్రంథాలయమును సందర్శించిరి. అంతేగాక, కొచ్చిన్ నందలి కొన్ని ప్రయివేటు గ్రంథాలయములను సందర్శించి, గ్రంథాలయ కార్యకర్తలతో గ్రంథాలయోద్యమమును గురించి కూడ చర్చించిరి.

భారతదేశ గ్రంథాలయ సంఘ దక్షిణ విభాగ సమావేశము 1976 వ సంవత్సరము మేనెల 7, 8, 9, తేదీలలో కేరళలో కృష్ణన్ ఆసన్, పి. వి. వర్గీస్ గార్లచే ఏర్పాటు చేయబడినది, ఈ సమావేశమునకు శ్రీ డి. ఆర్. కాలియా, శ్రీ ఓ. పి. త్రిఖా, దక్షిణాది నుండి రాఘవరెడ్డిగారు, మఱియు కొందఱు గ్రంథాలయాభిమానులు హాజరైరి. ఈ సమావేశమునందు ప్రధానముగా గ్రంథాలయ నిర్వహణ గురించి చర్చలు జరిగినవి. కేరళలో పౌర గ్రంథాలయముల కన్న ప్రయివేటు గ్రంథాలయములు అధికసంఖ్యలో నుండినవి. పౌరగ్రంథాలయ పాలకులు కొందరు కర్నాటక, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రములలో వలె కేరళ పౌర గ్రంథాలయ చట్టము రూపొందింప బడవలెనని వివరించగా, ప్రయివేటు గ్రంథాలయ నిర్వాహకులు తమకే ఎక్కువ అధికారము లుండునట్లుగా చట్టములో సూచింప వలెనని పట్టుబట్టిరి. ఏమైనప్పటికి పౌర గ్రంథాలయ చట్టమును త్వరితముగా రూపొందించ వలసినదిగా సమావేశమునకు హాజరైన గ్రంథాలయ శాస్త్ర వేత్తలు కేరళ గ్రంథాలయ సంఘ సభ్యులకు సూచించిరి.

ఆంధ్రప్రదేశ్ లో కూడ రాఘవరెడ్డిగారు రాష్ట్రకమిటీని ఏర్పరచిరి. మొట్టమొదటి సారిగా 1975 వ సంవత్సరము జూలై నెల, 20 వ తేదీన రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమున ఈ కమిటీ సమావేశమును సాంసన్ రామకృష్ణయ్యగారు ఏర్పాటు చేసిరి. రాఘవరెడ్డిగారు కూడ యీ సమావేశమున పాల్గొనిరి. పలువురు గ్రంథాలయ సంఘ సభ్యులుగా చేరి, భారతదేశ గ్రంథాలయ సంఘ అభివృద్ధికి తోడ్పడవలసినదిగా గ్రంథాలయ కార్యకర్తలకు, తదితరులకు రాఘవరెడ్డిగారు, సాంసన్ రామకృష్ణయ్యగారు ఈ సమావేశమునందు సూచించిరి.

## ఇతర రాష్ట్రములలో రాఘవరెడ్డిగారి విస్తృత పర్యటన:

దేశమునందలి ఇతర రాష్ట్రములలో గ్రంథాలయ నిర్వహణ విధానముల పరిశీలించ వలెనను తలంపు కల్గిన రాఘవరెడ్డిగారు ఢిల్లీ, కలకత్తా, బొంబాయి నగరములందలి గ్రంథాలయముల పెక్కింటిని గ్రంథాలయశాఖ డైరెక్టరుగా, డిప్యూటి డైరెక్టరుగా నున్న కాలముననే సందర్శించి వాటి నిర్వహణ పద్ధతులను గ్రహించియున్నారు. భారతదేశ గ్రంథాలయ సంఘు ఉపాధ్యక్షులుగా ఎన్నుకొనబడిన తర్వాత కూడ దేశమునందలి ఇతర రాష్ట్రములలో గ్రంథాలయములను సందర్శించు అవకాశము కలిగినది. 1976 – 77, 1977 – 78 సంవత్సరములలో ఇతర రాష్ట్రములలో పెక్కు గ్రంథాలయముల సందర్శించిరి.

1976 లో అఖిలభారత గ్రంథాలయ సంఘు సమావేశమునకు ఢిల్లీనగరమునకు వెళ్ళి, అనంతరము రాఘవరెడ్డిగారు కాశ్మీర్‌నందలి శ్రీనగర్‌లో విశ్వవిద్యాలయ గ్రంథాలయమును, రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమును, హిమాచల్ ప్రదేశ్‌నందలి సిమ్లాలోని విశ్వవిద్యాలయ గ్రంథాలయమును, పంజాబ్‌నందలి చండీఘుర్ విశ్వవిద్యాలయ గ్రంథాలయమును మరియు ఆ ప్రాంతములందలి కొన్ని పౌర గ్రంథాలయములను కూడ సందర్శించిరి. పై రాష్ట్రములలో విశ్వవిద్యాలయ గ్రంథాలయములు సాధించిన ప్రగతిని, పౌర గ్రంథాలయములు వెనుకబడియుండుటను గ్రహించి, ఈ రాష్ట్రములందు గ్రంథాలయముల అభివృద్ధికి పౌరగ్రంథాలయచట్టము నమలుపరచవలెనని గ్రంథాలయ కార్యకర్తలకు సూచించిరి. ఆ తరువాత రాజస్థాన్‌లో జైపూర్, ఉదయపూర్ విశ్వవిద్యాలయ గ్రంథాలయములను మరియు ఈ రెండు నగరములందలి కొన్ని ప్రయివేటు గ్రంథాలయములను సందర్శించిరి. జైపూర్ విశ్వవిద్యాలయ గ్రంథాలయములో

విద్యార్థుల, అధ్యాపకుల సభలో ఆంధ్రప్రదేశ్ నందు జరిగిన గ్రంథాలయాభివృద్ధిని గురించి ఉపన్యసించిరి.

గుజరాత్ లోని అలహాబాద్, సూరత్, బరోడానగరములందలి పౌర గ్రంథాలయముల కొన్నిటిని 1976 సంవత్సరమునందు సందర్శించిరి. ఈ నగరములందలి కొన్ని గ్రంథాలయములు చాల వరకు అభివృద్ధి చెంది, నవీనపద్ధతుల నవలంబించుచుండినవి. బరోడా మహారాజు గ్రంథాలయములకు విశేషముగా గ్రాంట్లను మంజూరుచేసి గ్రంథాలయముల అభివృద్ధికి యెనలేని కృషిచేసి ప్రసిద్ధిగాంచిరి. అటువంటి కృషిచేసిన మహనీయుని ఘనతను గుర్తెరిగినవారీ నాటికి కలరు. గ్రంథాలయములకు విశిష్ట సేవ గావించిన బరోడా మహారాజు గారి ప్రాంతమునందే గ్రంథాలయ చట్టమును అమలులోనికి తీసికొని రాకపోవుట వలన పౌర గ్రంథాలయములు వెనుకబడి యుండినవి. ఈ విషయము మిగుల శోచనీయము. బరోడా మహారాజు స్థాపించిన బరోడా పౌర గ్రంథాలయము తగు విధముగా అభివృద్ధి చెందియుండ లేదు. ఈ విషయమును గుర్తించిన రాఘవరెడ్డిగారు కూడ మిగుల విచారించి పురాతన గ్రంథాలయమైన ఈ బరోడా పౌరగ్రంథాలయమునకు ప్రభుత్వము తగు గ్రాంట్లను మంజూరుచేసి, దీని అభివృద్ధికి తగుశ్రద్ధను గైకొనవలసిన అవసరమెంతేని కలదని గ్రంథాలయ పాలకులకు విశదీకరించిరి.

మహారాష్ట్రలోని బొంబాయి నగరమునందు గల రాష్ట్రకేంద్ర గ్రంథాలయమునే గాక నాసిక్, ఔరంగాబాద్ మున్నగు పట్టణములందలి పౌర గ్రంథాలయములను, తదితర గ్రంథాలయములను కూడ 1977 సం॥ నందు సందర్శించి విద్యార్థుల, అధ్యాపకుల కోరిక మేరకు ఔరంగాబాద్ విశ్వవిద్యాలయ గ్రంథాలయమునందు ఆంధ్రప్రదేశ్ రాష్ట్రము సాధించిన గ్రంథాలయ ప్రగతిని గురించి ఉపన్యసించిరి.

1977 వ సంవత్సరము పాట్నాలోని రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమును, విశ్వవిద్యాలయ గ్రంథాలయమును మరికొన్ని పౌరగ్రంథాలయాలను సందర్శించిరి. విశ్వవిద్యాలయ గ్రంథాలయము ఆధునిక పద్ధతులలో నిర్వహింపబడు చుండుటను జూచి మిగుల సంతసించిరి. రాష్ట్ర కేంద్ర గ్రంథాలయ భవనమునందు తగు స్థలము లేకుండినది. కాన అందు కొన్ని ఆధునిక పద్ధతుల నిర్వహణకు వీలులేకపోయినది. బీహారులో పౌరగ్రంథాలయ చట్టమును అమలులోనికి తీసికొని రావలసిన ఆవశ్యకతను గురించి పాట్నాలోని గ్రంథపాలకులకు కూడ వివరించిరి.

ప్రభుత్వోద్యోగము నందున్న కాలమునను, భారత దేశ గ్రంథాలయ సంఘ ఉపాధ్యక్షులుగా ఎన్నిక కాబడిన తరువాతను గ్రంథాలయ సమావేశముల నిమిత్తము కలకత్తా నగరమునకు రాఘవరెడ్డిగారు తరచుగా వెళ్ళుచుండిరి. ఈ సమయముననే కలకత్తా నగరము నందలి విశ్వవిద్యాలయ గ్రంథాలయమునే గాక భారత జాతీయ, తదితర గ్రంథాలయములను కూడ కొన్నిటిని సందర్శించిరి. 1977 లో బుర్ద్వాన్, డార్జిలింగ్, సిలిగురి మున్నగు పట్టణముల లోని కొన్ని ప్రైవేటు గ్రంథాలయముల కూడ దర్శించిరి. ఈ గ్రంథాలయములు చక్కగా నిర్వహింపబడుచుండినవి. పౌర గ్రంథాలయ చట్టము అమలునందు లేనప్పటికి పశ్చిమ బెంగాల్ గ్రంథాలయ సంఘ సభ్యులు గ్రంథాలయముల అభివృద్ధికి మిగుల కృషి చేయుచుండిరి.

బర్మా సరిహద్దు కొండ ప్రాంతములందలి చిన్న చిన్న రాష్ట్రములలోగల గ్రంథాలయములను కూడ దర్శించవలెనని, వాటి అభివృద్ధిని గ్రహించ వలెనన్న కోరిక రాఘవరెడ్డి గారికి కలిగినది: కలకత్తా నగరము నందలి గ్రంథాలయముల సందర్శనానంతరము 1977 లో కలకత్తా నుండి మేఘాలయ, మిజోరం, నాగాలాండ్, సిక్కిమ్

రాష్ట్రములకు వెళ్ళి అచటి గ్రంథాలయములను సందర్శించిరి. ఆ గ్రంథాలయాలలో పనిచేయు సిబ్బందికి గ్రంథాలయ నిర్వహణాది అంశములయందు తగు సూచనల నొసగిరి. అవసరమున్నప్పుడు వ్రాత పూర్వకముగా కూడ వారికి సలహాల నిచ్చుచుండిరి. ఈరాష్ట్రములందు గ్రంథాలయములు చాల తక్కువ సంఖ్యలో నుండెడివి. మిజోరాంలో స్థాపించబడిన రాష్ట్ర కేంద్ర గ్రంథాలయము మిగుల చిన్న భవనములో నున్నప్పటికి, ఆ గ్రంథాలయము అవలంబించుచుండిన నవీన పద్ధతుల పరిశీలించిన రాఘవరెడ్డిగారు మిగుల సంతసించిరి. నాగాలాండ్ నందు రాష్ట్ర కేంద్ర గ్రంథాలయము లేకుండినది. నాగాలాండ్ ముఖ్యపట్టణమైన కొహిమా యందు పౌర సంబంధ శాఖ వారి యాజమాన్యమున ఒక గ్రంథాలయ ముండినది. ఈ గ్రంథాలయములో పనిచేయువారు శిక్షణ పొందని వారైనప్పటికి, గ్రంథాలయ సేవను ఉత్సాహముతో చేయుచుండిరి. సిక్కిమ్‌నందు కూడ రాష్ట్ర కేంద్ర గ్రంథాలయము లేకుండినది. సిక్కిమ్ నందలి గ్యాంగ్‌టాక్ నందు కమ్యూనిటీ అభివృద్ధికొరకు ప్రభుత్వముచే ఒక గ్రంథాలయము నడుపబడుచుండినది. గ్యాంగ్‌టాక్ నందలి వారికిది మిగుల ప్రయోజన కరముగా నుండినది. ఈ గ్రంథాలయములో శిక్షణ పొందిన గ్రంథపాలకులు లేరు. గ్రంథాలయములందు శిక్షణ పొందిన గ్రంథపాలకులుండవలసిన ఆవశ్యకతను గురించి, గ్రంథాలయములు సాధించవలసిన ప్రగతి పథకముల గురించి రాఘవరెడ్డిగారు ఆయా గ్రంథాలయముల నిర్వాహకులకు నొక్కి వక్కాణించిరి.

కొహిమానుండి కలకత్తా తిరిగివచ్చు సమయమున రాఘవరెడ్డిగారు గౌహతి విశ్వవిద్యాలయ గ్రంథాలయమును, గౌహతినుండి హైదరాబాదుకు తిరిగివచ్చు సమయమున భువనేశ్వర్ విశ్వవిద్యాలయ గ్రంథాలయమును, ఒరిస్సా రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమును సందర్శించిరి. రాష్ట్ర కేంద్ర గ్రంథాలయము అంతగా అభివృద్ధి చెంది యుండ లేదు.

ఈ నాటికిని రాఘవరెడ్డిగారు ఆంధ్రప్రదేశ్ నందలి పౌర గ్రంథాలయములను, ఇతర గ్రంథాలయములను సందర్శించుచు భారతదేశ గ్రంథాలయ సంఘ కార్యక్రమముల వివరించుచూ ఈ సంఘ అభివృద్ధికి కృషిచేయుచున్నారు. వీరి కృషిని గురించి భారత దేశ గ్రంథాలయ సంఘ సభ్యులు పలువిధములుగా కొనియాడి యున్నారు.


XXII ALL-INDIA LIBRARY CONFERENCE, DELHI
(Jan. 17-20, 1976)

ఢిల్లీలో 1976 సంవత్సరము నిర్వహింపబడిన అఖిల భారత గ్రంథాలయ సంఘ సమావేశమున శ్రీ డి. ఆర్. కాలియాగారు ఉపన్యసిస్తున్న దృశ్యం. ఉపాధ్యక్షులు శ్రీ రాఘవరెడ్డిగారు, గోయెల్‌గారు, కార్యదర్శి త్రిఖాగారు వేదికపై గలరు.

## రాష్ట్రస్థాయిలో, జిల్లాస్థాయిలో గ్రంథాలయ ఉద్యమ వ్యాప్తికి, వయోజన విద్యావ్యాప్తికి రాఘవరెడ్డిగారి కృషి :

జాతీయస్థాయిలోనే గాక రాష్ట్ర జిల్లాస్థాయిలలో కూడ రాఘవ రెడ్డిగారు పౌర గ్రంథాలయముల అభివృద్ధికి విశేషకృషి చేయు

చున్నారు. 1970 సంవత్సరము నుండి ప్రభుత్వము వీరిని జిల్లాగ్రంథాలయ సంస్థ సభ్యులుగా నియమించు చున్నది.

చిత్తూరుజిల్లాలో వయోజన విద్యాసంఘమును ఏర్పాటుచేయుట కొరకు, జిల్లా విద్యాశాఖాధికారి వేంకటసుబ్బారెడ్డిగారి కృషిచే, వయోజన విద్యా కార్యకర్తల తోడ్పాటుతో 1977 వ సంవత్సరము నవంబర్ నెల 22 వ తేదీన ఒక సమావేశ మేర్పాటు చేయబడినది. శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయమునందలి వయోజన విద్యాశాఖాధికారియైన శ్రీ వి. ఎల్. ఎన్. రెడ్డిగారు చర్చలలో వయోజన విద్యకు సంబంధించిన సలహాలను కూడ నొసగిరి. చిత్తూరుజిల్లాలో వయోజన విద్యను ఏవిధముగా అభివృద్ధి చేయవలెనన్న అంశముపై చర్చలు జరిగినవి. ఈ చర్చల అనంతరము చిత్తూరు జిల్లా వయోజన విద్యా సంఘ కార్యకర్తల ఎన్నిక జరిగినది. సుమారు ఏడు సంవత్సరముల కాలము రాష్ట్ర వయోజన విద్యాశాఖకు అధికారిగానుండి వయోజన విద్యయందు విశేషానుభవము గడించిన రాఘవరెడ్డిగారిని అధ్యక్షులుగా ఏకగ్రీవముగా ఎన్నుకొనిరి. గొప్ప రచయితయినటువంటి కె. సభాగారు కార్యదర్శిగాను, స్వాతంత్ర్యసమరయోధుడైన శ్రీని వాసఅయ్యంగార్ కోశాధికారిగాను ఎన్నికైరి. ఈ విధముగా 1977 న ఏర్పాటు గావింపబడిన వయోజన విద్యాసంస్థ రిజిష్టరు చేయబడినది. సంఘ స్థాపన జరిగిన తర్వాత వయోజనవిద్యా కార్యక్రమములు నిర్వహింపబడినవి.

ప్రస్తుతము వీరు రాష్ట్ర వయోజన విద్యా సంఘమునకు ఉపాధ్యక్షులుగాను, కార్యవర్గసభ్యులుగాను యున్నారు. రాఘవరెడ్డిగారు 1953 సంవత్సరము నుండి 1969 సంవత్సరము వరకు రాష్ట్ర కేంద్ర గ్రంథాలయ కమిటీ కార్యదర్శిగా నుండిరి. 1953 సంవత్సరము నుండి రాష్ట్రములో పెక్కు గ్రంథాలయ కమిటీలకు, ఉపకమిటీలకు కార్యదర్శిగాను, చైర్మన్ గాను నుండెడివారు. పౌరగ్రంథాలయ శాఖ

డైరెక్టరుగా పదవిని విరమించిన అనంతరముకూడ రాష్ట్రగ్రంథాలయ కమిటీకి, రాష్ట్ర కేంద్ర గ్రంథాలయ సలహా కమిటీకి సభ్యులుగా ప్రభుత్వము వీరిని నియమించినది. ఈ సమావేశములలో రాఘవరెడ్డి గారు గ్రంథాలయాలలో ఆధునిక పద్ధతుల నవలంబించవలెనని ప్రయోజనకర సూచనల నిచ్చెడివారు.

## రాష్ట్ర గ్రంథాలయ చట్ట పునః పరిశీలన కమిటీ :

ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ చట్టము 1960 అమలు పఱచబడుచున్న విధానమును పరిశీలించి చట్టములో కావలసిన సవరణల సూచించి ఒక నివేదికను సమర్పించ వలసినదిగా 1976 వ సంవత్సరము ఫిబ్రవరినెల 25 వ తేదీన ప్రభుత్వ మొక కమిటీని నియమించినది. ఆంధ్రప్రదేశ్ మాజీ ప్రధానన్యాయమూర్తియు, గొప్ప విద్యావేత్తయైన గోపాలరావు ఎక్బోటే గారిని ఈ కమిటీకి చైర్మన్‌గా నియమించడము జరిగినది.



ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయాల రివ్యూ కమిటీ సభ్యులు.

గ్రంథాలయ నిర్వహణాది అంశములయందు విశేషానుభవము గడించిన రాఘవరెడ్డిగారిని ప్రభుత్వము ఈ కమిటీయందు సభ్యులుగా నియమించినది. కమిటీ చైర్మన్‌గారు యితర సభ్యులతో కలిసి బొంబాయి, మదరాసు, కొచ్చిన్, కలకత్తా మున్నగు నగరములను సందర్శించి అచటి గ్రంథపాలకులతో గ్రంథాలయములు పని చేయు విధానమును గురించి వివరముగా చర్చించిరి. చర్చల సందర్భములలో కూడ రాఘవరెడ్డిగారు తగు సూచన లిచ్చుచుండెడివారు. చైర్మన్ గారి అభిప్రాయము మేరకు రాఘవరెడ్డిగారు హైదరాబాదునందే యుండి ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయముల గురించి సమాచారమును సేకరించుటకై ప్రశ్నావళిని తయారుచేయుటలో కీలకపాత్ర వహించిరి. ఈ రివ్యూకమిటీ రిపోర్టును రూపొందించు సందర్భమునకూడ చైర్మన్ గారికి కావలసినపుడు తమ అభిప్రాయములను తెలుపుచుండిరి.

## జాతీయ స్థాయిలో వివిధ కమిటీలలో సభ్యత్వము:

రాఘవరెడ్డిగారి విశిష్ట గ్రంథాలయ సేవను గుర్తించి జాతీయ కమిటీల యందు కూడ కేంద్ర ప్రభుత్వము వీరిని సభ్యులుగా నియమించినది. 1955 సం॥ వీరు కలకత్తా జాతీయ కేంద్ర గ్రంథాలయ కమిటీకి సభ్యులుగా నియమింపబడిరి. ఈ జాతీయ కేంద్ర గ్రంథాలయ కమిటీకి గ్రంథాలయ శాస్త్రమునందు నిపుణుడైన జాతీయ కేంద్ర గ్రంథాలయ పుస్తక భాండాగారి బి, ఎస్. కేశవన్‌గారు కార్యదర్శిగా నుండిరి. 1956 సంవత్సరము అక్టోబరు 15 వ తేది జరిగిన కమిటీ సమావేశమునందు రాఘవరెడ్డిగారు జాతీయ కేంద్ర గ్రంథాలయమును గురించి కొన్ని అభిప్రాయముల ప్రకటించగా, కేంద్ర విద్యాశాఖ కార్యదర్శియగు కె. జి. సయదీనిగారు రాఘవరెడ్డిగారి అభిప్రాయములకు సంతసించి వారిని కొనియాడిరి. ఒక సంవత్సర

కాలము జాతీయ కేంద్ర గ్రంథాలయ కమిటీకి రాఘవరెడ్డిగారు ఉపాధ్యక్షులుగా కూడ ఏకగ్రీవముగా ఎన్నికైనారు. ఆంధ్రప్రదేశ్ లో మరెవ్వరును, యింతవరకు, కలకత్తాలోని జాతీయ గ్రంథాలయ కమిటీ సభ్యులుగా కాని, ఉపాధ్యక్షులుగా కాని ఎన్నుకొనబడలేదు. అప్పటి కేంద్ర విద్యాశాఖమంత్రి యీ కమిటీకి అధ్యక్షులు.

1953 వ సంవత్సరమున 3 సంవత్సరముల కాలము వరకు రాఘవరెడ్డిగారిని జాతీయదృశ్య-శ్రవణవిద్యాబోర్డులో(Audio-visual Education Board) సభ్యులుగా కూడ కేంద్రప్రభుత్వము నియమించినది. కేంద్ర గ్రంథాలయ సంఘ నియమిత సలహా సంఘ నివేదిక 1959 సం॥ ప్రచురించబడిన తరువాత జాతీయ గ్రంథాలయ బోర్డునందు (National Board for libraries) సభ్యులుగా నియమింపబడిరి.

1972 సంవత్సరమునందు కేంద్ర ప్రభుత్వము జాతీయ గ్రంథాలయ బోర్డుయొక్క డ్రాఫ్టు బిల్లును రూపొందించి అభిప్రాయ సేకరణ నిమిత్తమై, జాతీయ గ్రంథాలయ సభ్యులకు, యితర గ్రంథాలయ శాస్త్రవేత్తలకు బిల్లుయొక్క ప్రతులను పంపినది. జాతీయ గ్రంథాలయ సభ్యులుగా నుండి నటువంటి రాఘవరెడ్డిగారు డ్రాఫ్టు బిల్లుప్రతిని బాగుగా పరిశీలించి, ఈ జాతీయ గ్రంథాలయ బోర్డునందు, గ్రంథాలయ శాస్త్రమునందు నిపుణులైన నలుగురు సభ్యులుగా నుండవలెనని, బోర్డు కాలపరిమితి 3 సంవత్సరములు గాక 5 సంవత్సరములుగా నిర్ణయింపబడవలెనని, జాతీయ గ్రంథాలయ డైరెక్టరుయొక్క అధికారముల విస్తరింపజేయవలెనని కేంద్రప్రభుత్వమునకు సూచించిరి.

## హైదరాబాదులో జరిగిన అఖిలభారత ప్రత్యేక గ్రంథాలయముల సమాచార కేంద్రముల సంఘ సమావేశమునకు తోడ్పాటు :

మనదేశమునందు 1955 వ సంవత్సరము ప్రత్యేక గ్రంథాలయముల, సమాచార కేంద్రముల (Special libraries and infor-

mation centres) సంఘము స్థాపించబడినది. ఈ సంఘ సభ్యులు సందర్భావసరములనుబట్టి సమావేశముల నేర్పాటు చేయుచు ప్రత్యేక గ్రంథాలయముల, సమాచార కేంద్రముల అభివృద్ధికి కావలసిన సూచనల గైకొని తగువిధముగా కృషిసల్పుచున్నారు. ఈ సంఘ సమావేశములందు ప్రత్యేక గ్రంథాలయములు పౌర గ్రంథాలయములతో ఏవిధమైన సంబంధము కలిగియుండవలెనన్న అంశముపై తీర్మానములు గైకొన్న సందర్భాలలో, రాఘవరెడ్డిగారు ఈ తీర్మానముల పరిశీలించి వాటిని పౌర గ్రంథాలయములందమలుపరచెడివారు.

రాఘవరెడ్డిగారు ప్రభుత్వపదవీ విరమణ చేయుటకు మునుపు హైదరాబాదు నగరమునందు, ప్రత్యేక గ్రంథాలయముల, సమాచార కేంద్రముల అఖిలభారత సంఘసమావేశము ఏర్పాటు కావింపబడినది. ఆ సమావేశములో తొలుత ప్రత్యేక గ్రంథాలయముల, సమాచార కేంద్రముల ప్రగతిని గురించి చర్చలు జరిగినవి. తదనంతరము సమావేశమునకు హాజరైన సభ్యులు ఆంధ్రప్రదేశ్ నందు గ్రంథాలయోద్యమము చక్కగా వ్యాప్తిచెందినదని, పౌర గ్రంథాలయముల గురించి చర్చలు జరుపవలెనని కోరగా, రెండుగంటల కాలము ఆంధ్రప్రదేశ్ లోని గ్రంథాలయముల అభివృద్ధిని గురించి చర్చించుటకు ఒక సమావేశము ఏర్పాటు కావింపబడెను. ఈ సమావేశము రాఘవరెడ్డిగారి అధ్యక్షతన జరిగినది. రాఘవరెడ్డిగారు ఆంధ్రప్రదేశ్ నందు జరిగిన గ్రంథాలయ వ్యాప్తిని, అభివృద్ధిని గురించి చక్కగా విపులీకరించిరి. పలురాష్ట్రముల నుండి సమావేశమునకు విచ్చేసిన గ్రంథాలయ ప్రముఖులు కూడ రాష్ట్రమునందు పౌర గ్రంథాలయ అభివృద్ధికి గైకొనవలసిన చర్యల గురించి సలహాల నొసగిరి. ఈ సమావేశము చక్కగా నిర్వహింపబడుటకు రాఘవరెడ్డిగారు ప్రభుత్వము నుండి రెండువేల రూపాయల గ్రాంటును ఈ సంఘమునకు మంజూరు చేయించిరి.

రాఘవరెడ్డిగారు 1978 వ సంవత్సరమునందు అఖిలభారత గ్రంథాలయ సంఘమునకు ఉపాధ్యక్షులుగా రెండవమారు కూడ ఏకగ్రీవంగా ఎన్నుకొనబడిరి. ఈ నాటికిని అఖిలభారత గ్రంథాలయ సంఘ సభ్యులుగా కొనసాగుచున్నారు.



బెంగుళూరులో జరిగిన అఖిలభారత గ్రంథాలయ సభలో ప్రసంగిస్తున్న శ్రీ డి. ఆర్. కాలియా, శ్రీ కె. రాఘవరెడ్డిగారు కూడ వేదికపై గలరు.

రాఘవరెడ్డిగారు జిల్లా, రాష్ట్ర స్థాయిలలో అనేక బాధ్యతల వహించుటయేగాక, జాతీయ స్థాయిలో కూడ పెక్కు అధికార, అనధికార పదవుల నలంకరించిరి. జాతీయ స్థాయిలో ఈ విధముగా అత్యధిక పదవుల నలంకరించిన ఘనత ఆంధ్రప్రదేశ్ లో రాఘవరెడ్డి గారికి ఒక్కరికే దక్కినది.

# ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయాలు - ఇతర గ్రంథాలయాల మధ్య సహకారము:

## గ్రంథాలయాల మధ్య సహకారము – దాని ఆవశ్యకత:

పౌర గ్రంథాలయాలకు హాజరగు పాఠకుల సంఖ్య రోజు రోజుకు పెరుగుచున్నది. పాఠకులలో పఠనాసక్తి కూడా పెరుగుచున్నది. చిన్నపిల్లలు మొదలు వయోవృద్ధుల వరకు ఎందరో పాఠకులు గ్రంథాలయములకు విచ్చేయుచున్నారు. వీరిలో చాలమంది డిపాజిట్ కట్టి సభ్యులుగా చేరి ఇండ్లకు గ్రంథములను అరువుగా తీసికొని వెళ్ళుచుందురు. గ్రంథపాలకులు పాఠకుల అభిరుచులు, అవసరములను బట్టి గ్రంథములను అందజేస్తూ వుండవలెను. పాఠకులు కోరిన గ్రంథము లన్నియు గ్రంథాలయములో లభించవు. ప్రచురింపబడు పుస్తకములన్నింటిని ప్రతి గ్రంథాలయము వుంచజాలదు, కొనజాలదు. కావున పాఠకుల అవసరములను తీర్చుటకు ఇతర గ్రంథాలయములనుండి గ్రంథముల నరువుగా తెప్పించు బాధ్యత గ్రంథపాలకులదై యున్నది. ఇందుకు గ్రంథాలయాల మధ్య సహకార మవసరమై యున్నది.

గ్రంథాలయ సంస్థల ఆర్థిక వనరులు సరిగాలేని కారణంగా అవి అధిక ధరలుగల గ్రంథములను, ఆ చూకీ గ్రంథములను కొనజాలవు. ఇట్టి గ్రంథములను విశ్వవిద్యాలయ గ్రంథాలయములు, రాష్ట్ర కేంద్ర గ్రంథాలయము, కొన్ని యితర గ్రంథాలయములు మాత్రము కొనగలుగుచున్నవి. ఇట్టి గ్రంథములను చదువగోరు పాఠకులకు, ఆయా గ్రంథాలయ పాలకులు; అవి లభించు విశ్వవిద్యాలయ, రాష్ట్ర కేంద్ర యితర గ్రంథాలయాలనుండి అరువుగా పొంది అందించవలసి యున్నది.

పౌర గ్రంథాలయ చట్టములు అవిభక్త మదరాసు రాష్ట్రము నందు (1948), హైదరాబాదు (1955) రాష్ట్రమునందు అమలునకు రాకపూర్వమే ఎన్నో ప్రాచీన గ్రంథాలయాలు అమూల్యమైన, ప్రస్తుతము ప్రచురింపబడని గ్రంథములను కలిగియున్నవి. వీటిని పఠింపగోరు పాఠకులు ఈ గ్రంథాలయాలపై ఆధారపడవలసి యున్నది.

అరుదైన, ప్రామాణిక, ప్రాచీన గ్రంథాలను ఆంధ్ర దేశములో ఎన్నో సహాయక గ్రంథాలయాలు కలిగియుండుట మిగుల గర్వకారణము. అట్టి వాటిలో ప్రధానముగా పేర్కొనదగిన కొన్ని గ్రంథాలయాలు:

1. గౌతమీ గ్రంథాలయము: రాజమహేంద్రవరము.
2. ఎడ్వర్డు కారనేషన్ రీడింగు రూం & సరస్వతీ నిలయము: ధర్మవరము.
3. సరస్వతీ సమాజము: నెల్లూరు.
4. రామమోహన గ్రంథాలయము: విజయవాడ.
5. శ్రీకృష్ణదేవరాయ ఆంధ్ర భాషానిలయము: హైదరాబాదు.
6. ఎడ్వర్డు రీడింగు రూమ్: కోయిలకుంట్ల.
7. సరస్వతీ నికేతన్ గ్రంథాలయము: వేటపాలెం.
8. హిందూ రీడింగు రూమ్: విశాఖపట్టణము.
9. ప్రాచ్యలిఖిత ప్రతుల గ్రంథాలయము: తిరుపతి.
10. రాజ రాజ నరేంద్ర గ్రంథాలయము: హనుమకొండ.
11. భారత గుణవర్ధన సంస్థ: హైదరాబాదు.

ఆంధ్ర, తెలంగాణ ప్రాంతములలో లోకల్ లైబ్రరీ అథారిటీలు గ్రంథాలయ శాసనము అమలునకు వచ్చిన తర్వాత పౌర గ్రంథాలయాలను స్థాపించినవి కావున ప్రాచీన గ్రంథాలను, అమూల్యమైన లిఖిత ప్రతులను, తాళపత్ర గ్రంథములను తమ పాఠకులకు

అందించుటకు పైన పేర్కొనిన గ్రంథాలయాలపై తప్పని సరిగా ఆధారపడవలసి యున్నది. ఇందుకు వీటిమధ్య సహకార మవసరము.

పర్షియన్, అరబిక్ భాషలకు చెందిన ప్రాచీన లిఖిత ప్రతులను రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమునుండి వేరుపరచి, ప్రాచీన పత్ర పరిరక్షణశాఖ ఆధ్వర్యమున ప్రత్యేక గ్రంథాలయంగా ఏర్పాటు చేయడమైనది. ఈ గ్రంథములకై రాష్ట్రములోని అన్ని గ్రంథాలయములు ఈ గ్రంథాలయముపై ఆధారపడవలసి యున్నది.

అమెరికా, మున్నగు పాశ్చాత్య సంపన్న దేశములందు కూడ ప్రభుత్వము గ్రంథాలయముల కెంత ఉదారముగా గ్రాంట్లను మంజూరు చేసిననూ, ప్రపంచములో వెలువడు గ్రంథముల నన్నింటిని కొనజాలవు. కనుక ఆ దేశములలో సైతము గ్రంథాలయములు పరస్పర సహకారమును అపేక్షించుచున్నవి. ఇట్టి పరిస్థితులలో భారత దేశములో, ముఖ్యముగా ఆర్థికంగా వెనుకబడిన మన రాష్ట్రములో, గ్రంథాలయాల మధ్య పరస్పర సహకార మెంతేని అవసరమై యున్నది. రాఘవరెడ్డిగారు ఈ విషయమై ప్రత్యేకశ్రద్ధ వహించి గ్రంథాలయాల మధ్య సహకారము పాటించినచో ఆర్థిక వనరుల లోటును, వసతుల లోపమును కొంతవరకు అధిగమించ వచ్చునని గ్రంథపాలకులకు, గ్రంథాలయ కార్యకర్తలకు వివరించెడివారు.

## గ్రంథాలయాల మధ్య సహకారావశ్యకతపై రాఘవరెడ్డిగారి ప్రోత్సాహము :

విదేశములలో విద్య నభ్యసించిన రాఘవరెడ్డిగారు లీడ్సు, మాంచెష్టర్, ఎడిన్‌బరో మున్నగు పట్టణాలలోని పౌర గ్రంథాలయా లేవిధముగా పరస్పరము సహకరించుకొంటూ తమ గ్రంథాలయాల పాఠకులకు తోడ్పడుచున్న దనువిషయమును గమనించారు.

ఈ గ్రంథాలయ సహకారము వలని ప్రయోజనములను అవగాహన చేసుకున్నారు. ఈ విధానములో పాటించవలసిన విషయములను పరిశీలించారు. ఢిల్లీలో గల పౌర గ్రంథాలయాలు కూడా ఇతర గ్రంథాలయాల నుండి అవసరమైన గ్రంథములను, అరువుగా తెప్పించి పాఠకులకు అందజేస్తున్న విధానమును కూడా రాఘవరెడ్డిగారు చక్కగా గ్రహించారు.

మన రాష్ట్రములో గూడ ఈ విధానమును అనుసరించిన కలుగు ప్రయోజనములను గ్రంథ పాలకులకు వివరించారు. గ్రంథాలయాల మధ్య సహకారమునకు ఎంతగానో ప్రోత్సహించారు.

పౌర గ్రంథాలయాలకు పుస్తకాల కొనుగోలు చేయునపుడు కొన్ని అంశములను పాటించవలెనని స్పష్టపరిచిరి. గ్రంథముల కొను గోలుకు ప్రభుత్వమొసంగు గ్రాంటు చాల తక్కువ గనుక కొను గోలులో మిగుల జాగ్రత్తను పాటించవలసి యున్నది. పాఠకుల అభిరుచులు, ఆవశ్యకతలను ముఖ్యంగా దృష్టియందుంచుకొనవలసి యున్నదని తరచుగా జరిగెడు గ్రంథపాలకుల సమావేశములలో స్పష్టపరచుచుండిరి.

గ్రంథాలయాల మధ్య సహకారమును పాటించినచో గ్రంథ ముల కొనుగోలులో ఎంతో సర్దుబాటు చేసుకొనవచ్చును. తద్వారా జిల్లాలోని, రాష్ట్రములోని గ్రంథాలయాలన్నియు ఒకే రకమైన గ్రంథాలు కొన నవసరము లేదు. తక్కువ వ్యయముతో ఎక్కువ గ్రంథాలు చదువుకొన గలిగే సదుపాయము గ్రంథాలయాల మధ్య పాటించు సహకారముపై ఆధారపడియున్నది.

రాష్ట్రములోని గ్రంథాలయాలు, రాష్ట్రములోని మరో గ్రంథాలయము నుండి తమకు కావలసిన గ్రంథములను పొందుట కును, రాష్ట్రములో లభింపని గ్రంథములను కలకత్తాయందలి జాతీయ

కేంద్ర గ్రంథాలయము నుండి రాష్ట్ర కేంద్ర గ్రంథాలయము ద్వారా తెప్పించుకొనుటకును వీలుగా రాఘవరెడ్డిగారు ఉత్తర్వులు చేసిరి.

ఒక పౌర గ్రంథాలయమునందు సభ్యుడుగా నున్న పాఠకుడు తన గుర్తింపు కార్డుతో రాష్ట్రములోని ఏ పౌర గ్రంథాలయము నుండైననూ పుస్తకములను పొందగలుగు ఏర్పాటులు కూడా చేసుకొన నగునని రాఘవరెడ్డిగారు అభిప్రాయపడిరి. కాని యీ విధానము కొంతకాలమైన తరువాత యమలుపరచవచ్చునని, కొందఱు గ్రంథపాలకులు భావించిరి.

జిల్లా కేంద్ర, శాఖా గ్రంథాలయములు, సహాయక గ్రంథాలయములతో సహకరింప వలెనని; జిల్లా పరిషత్తులు, పంచాయతీ సమితులు తమ యధీనము నందలి గ్రంథాలయములకు పుస్తకములు కొనుగోలు చేయునపుడు జిల్లా కేంద్ర గ్రంథాలయాధికారిని సంప్రతించవలెనని, రాఘవరెడ్డిగారు 1960 లో ఉత్తర్వులు జారీ చేసిరి. పౌర గ్రంథాలయాధికారులు మఱియు ఉన్నత పాఠశాలల, కళాశాలల యధికారులు, తమ గ్రంథాలయములకు పుస్తకములు కొనుగోలు చేయునపుడు పరస్పరము సంప్రతించుకొనవలెనని రాఘవరెడ్డిగారు 1962 లో ఉత్తర్వులు జారీ చేసిరి. ఈ విధమైన సంప్రతింపుల వలన ఒక గ్రంథాలయమునందున్న పుస్తకములే యితర స్థానిక గ్రంథాలయము లందుండుట కవకాశముండదు. ఒక గ్రంథాలయము నందు లేని పుస్తకములను మఱియొక స్థానిక గ్రంథాలయము నుండి పొందుట కవకాశము కల్గును.

ఈ సహకార విధానము వలన పాఠకుడు తనకు కావలసిన గ్రంథములను తన గ్రంథాలయములో లేకపోయినను మరే గ్రంథాలయము నుండైనను పొందగలుగుటకు అవకాశమున్నది. తన గ్రంథాలయములో లేని గ్రంథములను, ఇతర గ్రంథాలయములనుండి

తెప్పించి ఇచ్చుట వలన పాఠకుడు గ్రంథాలయాలపై గౌరవాభిమానములనేగాక, పెక్కు గ్రంథములను చదువ గలుగు ఆసక్తిని కూడ పెంపొందించుకొనును.

## పౌర గ్రంథాలయాలు – సహాయక గ్రంథాలయాల మధ్య ఆంధ్ర ప్రాంతములో సహకారము (1956 వరకు)

గ్రంథాలయ శాసనము అమలులోనికి రాకమునుపు రాష్ట్రములో పెక్కు సహాయక గ్రంథాలయము లుండెడివి. వీటిలో కొన్ని గ్రంథాలయములు ఉత్తమ గ్రంథములను కలిగియుండినవి. అయితే చాల గ్రంథాలయములలో నామమాత్రముగానే గ్రంథము లుండినవి. స్థానికముగా గల అధికారులకు, ప్రముఖులకు, డిపాజిట్ కట్టిన సభ్యులకు మాత్రము సాధారణముగా యీ గ్రంథాలయములోని పుస్తకముల నిచ్చుచుండిరి. స్థానికావసరములనే సర్దుకొనలేని ఈ సహాయక గ్రంథాలయములు ఇతర గ్రంథాలయములకు సహకరించలేని స్థితిలో యుండినవి. వీటి కంతటికి ప్రధాన కారణము వాటి ఆర్థిక స్తోమత సరిగా లేకపోవటమే. ఇట్టి గ్రంథాలయములకు పౌర గ్రంథాలయాలు మిగుల తోడ్పడవలసియున్నదనియు, సహాయక గ్రంథాలయాలు ఇతర గ్రంథాలయములు పరస్పరము సహకరించుకొనవలసిన ఆవశ్యత కలదనియు రాఘవరెడ్డిగారు తెలుపుతూ వారి పర్యటన తనిఖీ సమయములలో సందేహములను తీర్చుచూ గ్రంథపాలకులను ప్రోత్సహించిరి. వీరి ప్రోత్సాహముతో సహాయక గ్రంథాలయములు ఈ సహకార విధానము ననుసరించి ఎంతో ప్రయోజనకరమైన సేవ చేసినవి. 1956 వరకు ఈ సహాయక గ్రంథాలయములు అరువుగా ఎక్కువ గ్రంథములను అందించలేక పోయినను, క్రమేణా ప్రభుత్వగ్రాంటులతో, ప్రోత్సాహముతో గ్రంథాలయ సేవ చేసినవి. ఉదా;– సరస్వతీ నికేతన్, వేటపాలెం; గౌతమీ గ్రంథాలయము, రాజమండ్రి;

శారదా గ్రంథాలయము, అనకాపల్లి; ఎడ్వర్డు కారొనేషన్ రీడింగ్ రూము, ధర్మవరం; మున్నగునవి.

## తెలంగాణ ప్రాంతములో గ్రంథాలయాల మధ్య సహకారము (1960 వరకు)

తెలంగాణ ప్రాంతములో సైతము గ్రంథాలయ చట్టము రాకపూర్వమే సహాయక గ్రంథాలయములు గ్రంథాలయసేవ చేయుచుండినవి. వీటిలో కొన్ని గ్రంథాలయములలో మాత్రము తగినన్ని గ్రంథము లుండెడివి. ఆర్థిక యిబ్బందుల వలన మిగిలిన గ్రంథాలయములలో గ్రంథముల సంఖ్య అతి స్వల్పముగా నుండినది. ఆంధ్ర ప్రాంతములో వలె ఇవి కూడా చట్టము రాకపూర్వము ఒక దానితో మరొకటి తగినంత సంబంధము లేక వాటికున్న పరిమితమైన గ్రంథములతోనే గ్రంథాలయసేవ చేయుచుండినవి.

1955 లో హైదరాబాదు పౌర గ్రంథాలయ చట్టము అమలులోనికి వచ్చినప్పటికి దాదాపు మూడు సంవత్సరములు జిల్లా కేంద్ర గ్రంథాలయములుగాని, శాఖా గ్రంథాలయములుగాని స్థాపింపబడలేదు. ఆంధ్ర ప్రాంతములో వలె ఇచ్చట కూడా స్థానిక అధికారులు, విద్యావేత్తలు, ప్రముఖులు, డిపాజిట్ కట్టిన సభ్యులు మున్నగువారు గ్రంథములను ఈ సహాయక గ్రంథాలయముల నుండియే పొందుచుండిరి. 1956 వరకు ఈ సహాయక గ్రంథాలయములు పరస్పరము తగినంతగా సహకరించుకొనలేదు.

ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తరువాత రాఘవరెడ్డిగారు తీసికొనిన ప్రోత్సాహక చర్యల వలన తెలంగాణ ప్రాంతములో జిల్లా కేంద్ర గ్రంథాలయములు శాఖా గ్రంథాలయములు స్థాపింప బడినవి. రెడ్డిగారు జిల్లావిద్యాశాఖాధికారులతో, గ్రంథాలయ కార్యకర్త

లతో జరిపిన చర్చలలో గ్రంథాలయాల మధ్య వుండదగు సహకార విధానములను గూర్చి, వాటి ప్రయోజనములను గూర్చి వివరించారు. గ్రంథాలయాల ఆవశ్యకతను గుర్తించిన వరంగల్ జిల్లా విద్యా శాఖాధికారి శ్రీ వెంకటేశ్వరరావు, మహబూబ్ నగరు జిల్లా విద్యా శాఖాధికారి శ్రీ సోమసుందరం, పాఠశాలల ఉప తనిఖీ అధికారి శ్రీ రామారావు మున్నగువారు జిల్లా కేంద్ర గ్రంథాలయములు, శాఖా గ్రంథాలయములు సత్వరంగాఏర్పాటు చేశారు. గ్రంథాలయముల మధ్య సహకార విధానములను గూడ ప్రవేశపెట్టి గ్రంథాలయ ఉద్యమ వ్యాప్తికి, పాఠకులు కోరిన ఇతర గ్రంథాలయము లందలి గ్రంథములను తెప్పించి తోడ్పడుటకు, కృషి చేశారు.

తెలంగాణ ప్రాంతమందు కూడ జిల్లా గ్రంథాలయ సంస్థ కార్యదర్శులుగా జిల్లా విద్యాశాఖాధికారులే నియమితులై యుండిరి. తమ విద్యాశాఖ కార్యకలాపాలకే ఎక్కువ కాలము కేటాయించుట వలన వీరికి గ్రంథాలయోద్యమ కార్యక్రమములకు తగు వ్యవధి లేకుండినది. పరస్పరము గ్రంథాలయాలు గ్రంథములను అరువు తెచ్చుకొనుటకు, అరువు పంపుటకు కాగల ఖర్చును భరించుటకు కూడా ఆర్థిక స్తోమత లేకుండెను. అందుచేత తెలంగాణలో సైతము ప్రారంభములో ఇంచుమించు 1958 వరకు పౌరగ్రంథాలయములు, యితర గ్రంథాలయాల మధ్య సహకారము ఆశించినట్లుగా లేకపోయినది. కృష్ణదేవరాయ ఆంధ్రభాషా నిలయం, భారత గుణవర్ధన సంస్థ, మొదలగు గ్రంథాలయములు మాత్రము యితరగ్రంథాలయములతో సహకరించినవి.

## ఆంధ్రప్రాంతములో గ్రంథాలయాల మధ్య సహకారము (1960 వరకు:)

ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తరువాత గ్రంథాలయాల మధ్య సహకారము కొంత వరకు పెంపొందినది. ఆంధ్రప్రాంతములో జిల్లా

కేంద్ర గ్రంథాలయము, తదితర శాఖా గ్రంథాలయాలలో నియమింపబడిన గ్రంథపాలకులు గ్రంథాలయ శాస్త్రములో శిక్షణపొందినవారే. వీరెల్లరూ గ్రంథాలయ ఉద్యమవ్యాప్తికి కుతూహలముతో పాటుబడిరి. ఆర్థిక వనరులు సరిగా లేని కారణంగా గ్రంథముల కొనుగోలు అంతంత మాత్రంగానే వుండినను పరస్పరము గ్రంథాలయములు అరువుగా గ్రంథములను తెచ్చుకుంటూ, పంపుతూ తమ పాఠకులను సంతృప్తి పరచుట అభినందనీయ విషయము. 1960 సంవత్సరమునకు మునుపే లోకల్ లైబ్రరీ అథారిటీ యాజమాన్యమున గల గ్రంథాలయాల మధ్య సహకారము సహాయక గ్రంథాలయాలకు కూడా విస్తరించినది.

తెలంగాణలో కూడ శిక్షణపొందిన వారినే గ్రంథపాలకులుగా నియమించడము జరిగినది. వారు సైతము ఉత్సాహవంతులై తమ గ్రంథాలయముల నుండి అవసరమైన గ్రంథములను వీలున్నపుడు ఇతర సహాయక గ్రంథాలయములకు అరువుగా పంపుతూ, తమకు కావలసిన గ్రంథములను వాటినుండి అరువుగా తెప్పించుకొనుచుండిరి. 1960 సంవత్సరమున గ్రంథాలయములందలి పుస్తకములసంఖ్య పెరుగుటచే, గ్రంథాలయముల మధ్య సహకారము కూడ పెంపొందినది.

## గ్రంథాలయాల చట్టము అమలునకు వచ్చిన తరువాత ఆంధ్రప్రదేశ్‌లో గ్రంథాలయాల మధ్య సహకారము :

గ్రంథాలయ చట్టము అమలులోనికి వచ్చిన తర్వాత గ్రంథాలయాల మధ్య సహకారము మెరుగుపడుతూ వచ్చినది. జిల్లా కేంద్ర గ్రంథాలయముల నుండి శాఖా గ్రంథాలయములు, శాఖా గ్రంథాలయముల నుండి పుస్తకపంపిణీ కేంద్రములు అవసరమును బట్టి గ్రంథములను అరువుగా తీసికొనుచూ వచ్చినవి.

1960 సం॥రము నుండి గ్రంథాలయములు పరస్పరము అరువుగా యిచ్చి పుచ్చుకొను గ్రంథముల సంఖ్య క్రమేణా పెరుగుతూ వచ్చినది. గ్రంథాలయముల మధ్య సహకారముకూడా పెంపొందినది.

జిల్లా లోకల్ లైబ్రరీ అథారిటీల గ్రంథాలయముల నుండి, విశ్వవిద్యాలయ, కళాశాలల, పాఠశాలల గ్రంథాలయములకు, సహాయక గ్రంథాలయములకు, పుస్తకపంపిణీ కేంద్రములకు అరువుగా ప్రతి సం॥రము పంపుచున్న పుస్తకముల జాబితాను; ఈ గ్రంథాలయముల నుండి లోకల్ లైబ్రరీ అథారిటీలు అరువు పొందుచుండిన గ్రంథముల జాబితాను; ప్రతిసంవత్సరము తయారుచేసి పౌర గ్రంథాలయశాఖకు పంపవలసినదిగా రాఘవరెడ్డిగారు ఉత్తర్వులను జారీచేసిరి. ఈ ఉత్తర్వుల ద్వారా గ్రంథాలయాలమధ్య సహకారము మరింతగా పెంపొందినదని చెప్పవచ్చును.

విదేశములలో మరియు మన దేశములో అవలంబింపబడుచున్న గ్రంథాలయాల మధ్య సహకార విధానమును చక్కగా పరిశీలించిన రాఘవరెడ్డిగారు ఆంధ్రప్రదేశ్ లో ఈ విధానమును జయప్రదముగను, ఫలప్రదముగను అమలుపరచుటకు తమ అనుభవ పూర్వకమైన సలహాల నిచ్చుచూ, ఉత్సాహపరచిరి.

గ్రంథాలయ చట్టములోని 25 వ సెక్షను ప్రకారము పౌర గ్రంథాలయశాఖ డైరెక్టరు రాష్ట్రములోని గ్రంథాలయముల జాబితాను తయారు చేయవలెను. ఈ విధముగా తయారు చేయబడిన జాబితాను రాష్ట్రములోని కొన్ని గ్రంథాలయములకు అప్పుడప్పుడు పంపుట ద్వారా గ్రంథాలయముల మధ్య సహకారము మరింతగా పెంపొందినది. గ్రంథాలయములు విస్తృత ప్రాతిపదికలో పరస్పరము సహకరించుకొనుటకు తోడ్పడినది.

బాలసాహిత్యముపై తయారయిన గ్రంథసూచి, జాతీయ గ్రంథసూచీల ద్వారా గ్రంథాలయాల మధ్య సహకారము, అరువు విధానము 1969 సం॥రము వరకు చక్కగా జరిగినది.

## ప్రాథమిక పాఠశాలల గ్రంథాలయాలు - పౌరగ్రంథాలయాల మధ్య సహకారము :

జనసంఖ్యతోపాటు పాఠశాలల సంఖ్య కూడా పెరుగుతూ వచ్చినది. ప్రతిగ్రామమందు ప్రాథమిక పాఠశాలను ఏర్పాటుచేయడము జరుగుచున్నది. కాని ఈ ప్రాథమిక పాఠశాలలలో గ్రంథాలయాలు ఏర్పాటుకాలేదు. పాఠశాల గల ప్రతిగ్రామమందు పౌర గ్రంథాలయముండుట కవకాశము లేదు. కావున పాఠశాలలలోనే గ్రంథాలయమును తగినట్లుగా ఏర్పాటుచేయవలెను. బాల్యమందే పిల్లలకు గ్రంథపఠనాభిలాషను కల్పించవలెను. పసితనమందీ అలవాటు తప్పిపోయినచో విద్యార్థి పెరిగి పెద్ద అయిన తరువాత గ్రంథాలయాలను సద్వినియోగపరచుకొనలేడు. అందుచేత రాఘవరెడ్డిగారు తాము పాఠశాలల తనిఖీ అధికారిగాయున్న రోజులలోనే గ్రంథాలయాల ఆవశ్యకతను గూర్చియు, పాఠశాలలలో వాటి ఏర్పాటును గూర్చియు ఉపాధ్యాయులతోను, పాఠశాలల మేనేజిమెంటులతోను చర్చించి వాటి ఏర్పాటుకు ప్రోత్సహించిరి.

ఆర్థిక ఇబ్బందులతో చాలమంది విద్యార్థులు ప్రాథమిక విద్యతోనే చాలించుచూ ఉన్నత విద్య నభ్యసింపలేక పోవుచున్నారు. ఇట్టివారు ప్రాథమిక పాఠశాలలలో తాము నేర్చిన ఆ కొద్దిపాటి జ్ఞానమును కూడ మఱచిపోయి నిరక్షరాస్యులగు ప్రమాదమున్నది. కావున యిట్టివారు ప్రాథమిక పాఠశాలలోనే కొన్ని గ్రంథములు చదివియుండిన ఆ అనుభవముతోను, ఆ అలవాటుతోను ప్రాథమిక పాఠశాలలు వదలిననూ గ్రంథ పఠనాభిలాషతో గ్రంథాలయములకు

విచ్చేయుచుందురు. ఇట్టివారికి ఉచిత ప్రవేశ వసతులను కల్పించి పాఠశాలల గ్రంథాలయాలు తోడ్పడవలసియున్నది. ప్రాథమిక విద్యనభ్యసించు విద్యార్థులకును, పాఠశాల విద్యను ముగించిన పాత విద్యార్థులకును ప్రయోజనకరంగా ప్రాథమిక పాఠశాలల గ్రంథాలయాలను తీర్చి దిద్దవలెను. పౌర గ్రంథాలయాలలో కూడ వీరికి కావలసిన పుస్తకముల నుంచవలెను.

రాఘవరెడ్డిగారు పాఠశాలల తనిఖీ అధికారిగా ఒంగోలు, కాకినాడ మున్నగు పట్టణములందు స్థానిక పురప్రముఖులను కలుసుకొని ప్రాథమిక పాఠశాలల గ్రంథాలయాల తోడ్పాటుకై వారి సహకారమును కోరారు. వీరి సూచన మేరకు పెక్కు గ్రంథాలయములకు పుస్తకములు విరాళముగా లభించినవి. ఉదా:– కాకినాడ పట్టణమందు శ్రీ దొడ్డి వీరాస్వామి, చిత్తూరునందు శ్రీగోవిందస్వామి మున్నగు ప్రాథమిక పాఠశాలల యజమానులు గ్రంథాలయముల కవసరమగు పెక్కు గ్రంథములను విరాళముగా పొందిరి. ప్రాథమిక పాఠశాలల అధ్యాపకులు స్థానిక పురప్రముఖుల నుండి, గ్రంథాలయాభిమానులనుండి గ్రంథములను విరాళముగా పొంది, పాఠశాల గ్రంథాలయాల నభివృద్ధి పరచవలెనని ప్రోత్సహించుచుండిరి. పరస్పర సహకారాభిలాషతో ప్రాథమిక పాఠశాలలు కొన్ని చుట్టుప్రక్కల గల ప్రాథమిక పాఠశాలలకు అరువుగా గ్రంథములను యిచ్చుచుండినవి. ఇట్టి పాఠశాలలు నామమాత్రమే.

ప్రాథమిక పాఠశాలలలో అన్నిటియందును గ్రంథాలయాలు లేవు. ఉన్నవాటిలోనైనా గ్రంథములు చాలా తక్కువగా యుండెడివి. కావున వీటికి పౌర గ్రంథాలయముల సహకారము అత్యవసరమైయున్నది. పౌర గ్రంథాలయములు 1953 సం॥ నుండి శాఖా గ్రంథాలయముల ద్వారాను, కొన్ని పుస్తక పంపిణీ కేంద్రముల ద్వారాను

ప్రాథమిక పాఠశాలలకు గ్రంథములను అరువు యొసంగుచున్నవి. 1953 సం॥నుండి ఆంధ్ర ప్రాంతమందును, 1959 సం॥నుండి తెలంగాణ ప్రాంతమందును లోకల్ లైబ్రరీ అథారిటీలు స్థాపించిన జిల్లా కేంద్ర గ్రంథాలయములు, శాఖా గ్రంథాలయములు, పిల్లల కుపయుక్తమగు గ్రంథములను వీలైనప్పుడు సరఫరా చేసినవి.

పౌర గ్రంథాలయములకు, పాఠశాలల గ్రంథాలయములకు మధ్య పరస్పర సన్నిహిత సంబంధములను గూర్చి కొన్ని పాశ్చాత్య దేశముల పౌర గ్రంథాలయ చట్టములలో స్పష్టముగా పేర్కొనడము జరిగినది. ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ చట్టములో కూడా పై విధముగా సూచింపబడియున్నచో పౌర గ్రంథాలయములకు, పాఠశాలల గ్రంథాలయములకు మధ్య సహకారము పెంపొంది ప్రయోజనకరముగా యుండగలదని రాఘవరెడ్డిగారు అభిప్రాయపడిరి.

మన రాష్ట్రమునం దమలునందున్న చట్టములో గ్రంథాలయాల మధ్య పరస్పర సహకార విధానము పేర్కొనబడక పోయినప్పటికి, లోకల్ లైబ్రరీ అథారిటీల యాజమాన్యమున ఏర్పాటయిన పౌర గ్రంథాలయా లన్నింటిలో పిల్లల విభాగము లేర్పాటు చేయబడినవి. అందులో పిల్లల కుపయుక్తమగు బాలసాహిత్య గ్రంథములను చేర్చి, ప్రాథమిక పాఠశాలల విద్యార్థులకు తోడ్పడుచున్నవి. ప్రతి జిల్లా కేంద్రములో బాలల గ్రంథాలయము ప్రత్యేకంగా కూడా ఏర్పాటయి యున్నది. పౌర గ్రంథాలయాలను సుమారు ఏబది శాతము వరకు బడిపిల్లలే ఉపయోగించుకొనుచున్నారు.

## మాధ్యమిక పాఠశాలల గ్రంథాలయాలు – పౌర గ్రంథాలయాల మధ్య సహకారము :

రాష్ట్రములో ప్రాథమిక పాఠశాలల గ్రంథాలయాలతో పోల్చినపుడు మాధ్యమిక పాఠశాలల గ్రంథాలయాలు చాల తక్కువ. మాధ్యమిక పాఠశాలలలో గ్రంథాలయములు ఏర్పాటు చేసిన

అందు విద్య నభ్యసించు విద్యార్థులకెంతో ప్రయోజనకరముగా యుండును. ఈ గ్రంథాలయాలకు తగిన గ్రంథములు లేని కారణంగా రాఘవరెడ్డిగారు పౌర గ్రంథాలయాల నుండి అరువుగా గ్రంథములు పొందు సౌకర్యము కల్పించాలని సూచించారు. వీరి సూచనల మేరకు ఆయాజిల్లాలలోని పౌర గ్రంథాలయాలు వీటికి కొంతవరకు తోడ్పడు చుండినవి. కొన్ని మాధ్యమిక పాఠశాలల గ్రంథాలయాలు పాఠశాలలలోని విద్యార్థులకే గాక పాఠశాలలను వదిలివేసిన వారికి, స్థానిక పాఠకులకు కొందఱికి గూడా తోడ్పడుచుండెడివి. అటువంటి గ్రంథాలయములు నామమాత్రమే.

## ఉన్నతపాఠశాలల గ్రంథాలయాలు, పౌర గ్రంథాలయాల మధ్య సహకారము :

ఆంధ్ర, తెలంగాణ ప్రాంతములలో గల ఉన్నతపాఠశాలలలో చాలవాటిలో గ్రంథాలయాలుండినవి. వీటిలో గ్రంథాలు తక్కువనే చెప్పవచ్చును కాని ప్రాథమిక పాఠశాలల, మాధ్యమిక పాఠశాలల గ్రంథాలయాలకంటె మెరుగని చెప్పవచ్చును. అయితే వీటిని నిర్వహించుటకు శిక్షణ పొందిన గ్రంథాలయాధికారులు పెక్కు గ్రంథాలయములలో లేకుండిరి. ఈ ఉన్నత పాఠశాలల విద్యార్థులను నిర్లక్ష్యము చేయక వారి విజ్ఞానాభివృద్ధికి గ్రంథాలయసేవ అవసర మని రాఘవరెడ్డిగారు జిల్లా కేంద్ర గ్రంథాలయముల నుండి, శాఖా గ్రంథాలయముల నుండి గ్రంథముల నరువిస్తూ ఉన్నతపాఠశాలల గ్రంథాలయముల నుండి పరస్పరము గ్రంథములు అరువుతెచ్చుకొనే సౌకర్యము పొందాలని కోరారు. ప్రారంభదశలో ఈ పరస్పర సహకారము ప్రాముఖ్యము వహించకపోయినా 1960 తర్వాత మెరుగైనదని చెప్పవచ్చును.

ఇంగ్లండునందలి యార్క్‌షైర్‌లో పౌర గ్రంథాలయములకు, సెకండరీపాఠశాలల గ్రంథాలయములకు గల చక్కని పరస్పర సహ

కారమును ప్రత్యక్షముగా చూచి దాని ప్రయోజనములను గ్రహించిన రాఘవరెడ్డిగారు ఆంధ్రప్రదేశ్ లో గూడా ఈ విధాన మనుసరించవలసిన యవసరము ఎంతేనియున్నదని గ్రంథపాలకులకు తెలియజేసిరి.

రాఘవరెడ్డిగారు యిచ్చిన ఉత్తర్వుల మేరకు పౌరగ్రంథాలయాలు, ఉన్నత పాఠశాలల గ్రంథాలయాలు పరస్పరము సహకరించుకొనుచుండినవి సెకండరీ పాఠశాలల పెక్కు గ్రంథాలయాలలో శిక్షణ పొందిన గ్రంథాలయాధికారులు, నియమింపబడక పోవడముతో ఈ విధానము విస్తృతంగా అమలుజరుగ లేదు. కాని రెడ్డిగారి చొరవతో 1969 వరకు ఈ విధానము జయప్రదంగానే నిర్వహింపబడినదనే చెప్పవచ్చును.

'సెకండరీ ఎడ్యుకేషన్ కమీషన్' విడుదల చేసిన రిపోర్టునందు పౌర గ్రంథాలయాల, పాఠశాలల గ్రంథాలయాల మధ్య పరస్పర సహకార ముండాలని తెలిపినది. ఈ విధముగా పౌర గ్రంథాలయాలు వీలున్నంత వరకు పాఠశాలలకు అవసరమైన గ్రంథములను అరువుగా యిస్తూ తోడ్పడుతూ వచ్చినవి. గ్రంథాలయ చట్టము అమలుకు వచ్చిన తర్వాత లోకల్ లైబ్రరీ అథారిటీ సభ్యులుగా కొంతమంది సెకండరీ పాఠశాలల ప్రధానోపాధ్యాయులు నియమింపబడిరి. సభ్యులయిన ప్రధానోపాధ్యాయులు గ్రంథాలయాలలో ఉండదగు పాఠశాలల కవసరమైన గ్రంథముల కొనుగోలుకు సూచనలిస్తూ యుండిరి. వారి సలహా మేరకు గ్రంథములను తెప్పించడము జరుగుచుండెను. 1960 తర్వాత కొన్ని జిల్లా కేంద్ర గ్రంథాలయాలలో పాఠ్యపుస్తక విభాగములు కూడా ఏర్పాటుచేయడము జరిగినది.

1960 తర్వాత జరిగిన గ్రంథాలయ సమావేశములలో పౌర గ్రంథాలయాల, సెకండరీ పాఠశాలల గ్రంథాలయాల మధ్య నుండదగు సహకారమును గూర్చి రాఘవరెడ్డిగారు వివరించేవారు.

29—12—1965 వ తేదీన జరిగిన రాష్ట్ర గ్రంథాలయ కమిటీ సమావేశములో ఈ విషయమును గూర్చి స్థూలంగా చర్చించి, కొన్ని ప్రతిపాదనలను ప్రభుత్వమునకు పంపారు. ఇందు ముఖ్యంగా పాఠశాలల గ్రంథాలయాలలో సామాన్య ప్రజానీకమునకు (పాఠకులకు) గూడ ప్రవేశము కల్పించాలని కోరారు. వీరి సూచనను ప్రప్రథమంగా పాటించినవారు హైదరాబాదు జిల్లా పరిషత్ చైర్మన్ శ్రీ యం. భోజిరెడ్డిగారు. వీరు షాంషాబాద్ లోని పాఠశాలల గ్రంథాలయములందు తొలిసారిగా సామాన్య ప్రజానీకమునకు కూడ ప్రవేశ వసతులను కల్పించారు. ఈ విధానమును అమలు పరచినవారు చాల తక్కువ. ఇందుకు కారణము పాఠశాలల గ్రంథాలయాలకు శిక్షణ పొందిన గ్రంథాలయాధికారులు లేక పోవడము, పాఠశాలలలో తగు వసతులు లేకపోవడమని చెప్పనగును.

శాఖా గ్రంథాలయములు లేనిచోట పాఠశాలల గ్రంథాలయములనే శాఖా గ్రంథాలయములుగా ప్రకటించి, పాఠకులందరూ ప్రవేశించుట కవకాశము కల్గించాలని రాఘవరెడ్డిగారి సంకల్పము. 1960 సం॥ ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ చట్టమునందిందుకు తగిన అవకాశము కూడా కల్పింపబడినది. అయితే పాఠశాలల పాలక సంస్థలు తగిన వసతులు లేనందున, ఈ అభిప్రాయముతో ఏకీభవించలేదు. కొన్ని పాఠశాలలలో మాత్రము యీ వసతులు కొంత వరకు కల్గింప బడినవి.

పెక్కు పాఠశాలల గ్రంథాలయములకు గ్రంథాలయ శాస్త్రమునందు శిక్షణ పొందినవారు గ్రంథపాలకులుగా నియమింపబడలేదు. వీలున్న సమయములలో ఉపాధ్యాయులే ఈ గ్రంథాలయాలను నిర్వహించడము పరిపాటి. ఈ గ్రంథాలయాలను గ్రంథాలయ శాస్త్రమునందు శిక్షణ పొందిన అధికారులు తనిఖీ చేయడము లేదు. అందుచేత ఈ గ్రంథాలయాల సక్రమ నిర్వహణగాని, వాటి పురోభివృద్ధి కాని

సక్రమముగా జరుగలేదు. ఈ పాఠశాలల గ్రంథాలయాలు సక్రమంగా నిర్వహింపబడునట్లు వారికి అవసరమైన సలహాలొసంగి, పర్యవేక్షించుటకు జిల్లా పౌర గ్రంథాలయాధికారుల కధికార మొసంగిన ప్రయోజన కరముగ యుండగలదని పౌర గ్రంథాలయాధికారులు భావించారు. ఈ ప్రతిపాదనను ఎస్. ఎమ్. హాష్మి మున్నగు గ్రంథపాలకులు రాష్ట్ర గ్రంథాలయ కమిటీలో చర్చించారు. పలువురు సభ్యులు ఈ సలహాను బలపరచారు. ఈ సూచనను ప్రభుత్వ మామోదించిన పౌర గ్రంథాలయములకు, పాఠశాలల గ్రంథాలయాలకు సన్నిహిత సంబంధము పెంపొంది గ్రంథాలయ సేవ విస్తృతంగా నెరవేరగలదు.

## కళాశాలల, విశ్వవిద్యాలయాల గ్రంథాలయాలు – పౌర గ్రంథాలయాల మధ్య సహకారము:

కళాశాలల, విశ్వవిద్యాలయాలలలో గ్రంథాలయాలకు గ్రంథాలయశాస్త్ర శిక్షణ పొందినవారే గ్రంథపాలకులుగా యున్నారు. పాఠశాలల గ్రంథాలయాలతో పోల్చినపు డివి ఎంతో మెరుగుగా యున్నవి. విశ్వవిద్యాలయ గ్రంథాలయాలలో ఆధునిక శాస్త్రీయ విధానములలో, సుశిక్షితులయిన గ్రంథపాలకులతో, తగిన వసతులతో చక్కని గ్రంథాలయ సేవ జరుగుచున్నది. అయితే 1960 వరకు కళాశాలల, విశ్వవిద్యాలయాల గ్రంథాలయాల సేవ ఆయా విద్యాలయాల విద్యార్థులకే పరిమితమై యుండెను. ఇతరులకు ప్రవేశార్హత లేకుండెను.

కళాశాలల గ్రంథాలయాలు, విశ్వవిద్యాలయ గ్రంథాలయాలు ఆధునిక వసతులతోను, శిక్షితులయిన గ్రంథపాలకులతోను, తగినంత ఆర్థిక వనరులతోను మంచి స్థితిలోయున్న కారణంగా పౌర గ్రంథాలయాలకు, ఇతర గ్రంథాలయాలకు సహకరించుటకు క్షోమత కలిగియున్నవి.

ఇంగ్లాండునందలి పౌర గ్రంథాలయ చట్టము ప్రకారము అచ్చటి గ్రంథాలయ సలహా సంఘమునకు పౌర గ్రంథాలయములకే గాక విశ్వవిద్యాలయ కళాశాలల గ్రంథాలయాలు, సాంకేతిక గ్రంథాలయాలకు, ఇతర గ్రంథాలయాలన్నింటికి అవసరమగు సలహాల నొసంగుటకు అవకాశము కలదు. ఈ సంఘము సలహాల మేరకు ఇంగ్లాండు దేశమునందలి వివిధ గ్రంథాలయాల మధ్య సహకార మేర్పడి గ్రంథాలయోద్యమము ఫలప్రదముగా సాగుచున్నది. మన రాష్ట్రము నందు కూడా రాష్ట్ర గ్రంథాలయ కమిటీకి ఈ అధికారము లుండునట్లు గ్రంథాలయ చట్టమునందే సూచించి యుండిన కళాశాలల, విశ్వవిద్యాలయాల గ్రంథాలయములకు పౌర గ్రంథాలయముల మధ్య సహకారము పెంపొందుటకు చక్కని అవకాశ ముండెడిది.

జెకోస్లావేకియా మున్నగు దేశములందలి విశ్వవిద్యాలయ గ్రంథాలయాలు విశ్వవిద్యాలయ విద్యార్థులకే గాక యితర పౌరులకు కూడ గ్రంథాలయ సేవను అందజేయు చున్నవి. ఇదేవిధముగా మన రాష్ట్రమునందు గూడ విశ్వవిద్యాలయాలు ప్రజలకు కూడా ప్రవేశార్హతను కలిగించి గ్రంథాలయ ప్రయోజనము పొందుటకు అవకాశములు కొంతవఱకు కల్పించినవి. ఈ విషయము అందఱికీ తెలియని కారణమున ఈ వసతిని కొద్దిమంది మాత్రమే ఉపయోగించుకొను చున్నారు.

చదువునందు అభిలాష మోజు కలవారైన విద్యార్థులకేగాక యితరులకు కూడా గ్రంథాలయములలో ప్రవేశార్హతను కలిగించి అందుబాటులో యుంచుటకు వీలును కల్పించెదమని, ఆంధ్ర, ఉస్మానియా విశ్వవిద్యాలయములు కేంద్ర ప్రభుత్వమునకు తెలిపినవి. విశ్వవిద్యాలయాధికారులు తమ గ్రంథముల, జాబితాను పౌర గ్రంథాలయముల కుపయోగపడునట్లు రాష్ట్ర, కేంద్ర గ్రంథా-

లయములకు పంపెదమని కూడా తెలిపిరి. ఉస్మానియా విశ్వ విద్యాలయము సామాన్య ప్రజానీకమునకు కొంతవరకు గ్రంథాలయ వసతులను కల్పించినది. తగినంత ప్రచారము లేక విశ్వవిద్యాలయము కల్పించిన గ్రంథాలయ వసతులను తగినంతమంది సామాన్య ప్రజలు పొందలేక పోవుచున్నారు. ఇందుకు తగినంత ప్రచార మవసరమై యున్నది.

కళాశాల, విశ్వవిద్యాలయ గ్రంథాలయాలలోని గ్రంథము లలో కొంత శాతము నిరుపయోగముగా నుండును. వీటిని పౌర గ్రంథాలయాలకు తరలించిన, లేక కొన్ని నెలలవఱకు అరువుగా నిచ్చిన ప్రయోజన కరముగా నుండగలదు. పౌర గ్రంథాలయము అందఱికీ అందుబాటులోయున్న కారణంగా కళాశాల, విశ్వవిద్యాలయ విద్యార్థులు కూడా ఈ గ్రంథాలయముల నుపయోగించు కొనవచ్చును. అందుచేత విశ్వవిద్యాలయ గ్రంథాలయములందు నిరుపయోగముగా నున్న గ్రంథములను పౌర గ్రంథాలయములకు తరలించుట, లేక కొన్ని నెలల వరకు అరువుగా నిచ్చుట సమంజసమని రాఘవరెడ్డిగారి అభిప్రాయము.

మన రాష్ట్రమునందలి విశ్వవిద్యాలయ గ్రంథాలయాలలో పౌరులకు కూడా కొంతవరకు గ్రంథాలయ వసతులను కల్పించుటచే 1960 తర్వాత గ్రంథాలయ సహకారము పెంపొందినది.

మన రాష్ట్రమునందు ప్రయివేటుగాను, తపాలా ద్వారాను డిగ్రీ పరీక్షలకు తయారవుతూ పరీక్షలకు కూర్చొనువారి సంఖ్య రోజు రోజుకు పెరుగుచున్నది. వీరు పౌరగ్రంథాలయాలపై ఆధారపడు చున్నారు. ఇట్టివారికి రాష్ట్ర కేంద్ర గ్రంథాలయములో, యితర పౌర గ్రంథాలయాలలో అవసరమగు పాఠ్యపుస్తకములను వుంచడ మైనది. ఈవిధముగా కళాశాల, విశ్వవిద్యాలయ గ్రంథాలయములు, పౌర గ్రంథాలయాలు పరస్పరము కొంతవఱకు సహకరించుకొను చుండినవి.

## ప్రత్యేక గ్రంథాలయాలు - ఇతర గ్రంథాలయాల మధ్య సహకారము :

రాఘవరెడ్డిగారు కళాశాల, విశ్వవిద్యాలయ గ్రంథాలయాలతోపాటు ప్రత్యేక గ్రంథాలయాలను తరచుగా సందర్శించెడువారు. ప్రత్యేక గ్రంథాలయాలలో గల గ్రంథములలో పెక్కు పుస్తకములు నిరుపయోగముగా నుండెడివి. రాఘవరెడ్డిగారు యీ విధముగా నిరుపయోగముగానున్న పుస్తకములను కళాశాలల, విశ్వవిద్యాలయ గ్రంథాలయములకు, పౌర గ్రంథాలయములకు తరలించిన లేక అరువుగా నిచ్చిన ప్రయోజనముగా యుండగలదని అభిప్రాయపడిరి. కాని ప్రత్యేక గ్రంథాలయాల నియమావళి అనుకూలముగా లేనందున యితర గ్రంథాలయములు పుస్తకముల నఱువుగా పొందుటకు వీలుపడలేదు. 1960 సం॥రము తరువాత కొన్ని ప్రత్యేక గ్రంథాలయములు కొంతవరకు ఇతర గ్రంథాలయములతో సహకరించినవి.

## రాష్ట్ర కేంద్ర గ్రంథాలయము - ఇతర గ్రంథాలయాల - మధ్య సహకారము:

మదరాసులోని కన్నెమారా ప్రభుత్వ గ్రంథాలయము దేశములోనే ప్రసిద్ధి జెందినది. ఇది రాష్ట్ర ప్రభుత్వ గ్రంథాలయము. ఇందులోని గ్రంథములు ప్రాచీనమైనవి, అమూల్యమైనవి. గ్రంథములుకూడా అధిక సంఖ్యలో వుండినవి. ఈ గ్రంథాలయము రాష్ట్రములోని ఇతర గ్రంథాలయములకు ఆంధ్ర రాష్ట్రావతరణకు మునుపు కూడ గ్రంథములను అరువుగా యిచ్చుచుండెను. అయితే ఈ సంఖ్య పరిమితమే. ఈ గ్రంథాలయమునందు రిజిష్టరయిన సభ్యులకేగాక ఇతరులకు గూడ ప్రవేశముండినది,

1953 సంవత్సరమున ఆంధ్రరాష్ట్ర మేర్పడుటచే విశాఖపట్టణమున రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమును ఏర్పాటు చేయడమైనది. ఈ గ్రంథాలయమునుండి ఇతర గ్రంథాలయములకు అరువు సౌకర్యము కల్పించక మునుపే ఆంధ్రప్రదేశ్ ఏర్పడడము, హైదరాబాదు నగరమునందలి అసఫియా గ్రంథాలయమును ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర గ్రంథాలయముగా గుర్తించడమైనది. అసఫియా గ్రంథాలయము కూడా రాష్ట్ర కేంద్ర గ్రంథాలయముగా గుర్తింప బడక మునుపే కొన్ని సమయములలో ఇతర గ్రంథాలయములకు గ్రంథములను అరువుగా యిచ్చుచుండెడిది.

ఆంధ్రప్రదేశ్ అవతరణానంతరము రాష్ట్రములోని జిల్లా కేంద్ర గ్రంథాలయములు రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమునుండి అరువుగా గ్రంథములను పొందుచుండినవి. ప్రారంభములో తగిన అరువు నిబంధనలు రూపొందని కారణంగా, అరువుగా పొందబడిన గ్రంథములు పరిమిత సంఖ్యలో నుండినవి. 1963 లో నిబంధనలను రూపొందించిన తర్వాత రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమునుండి ఇతర గ్రంథాలయములు విశేషముగా గ్రంథములను అరువుగా తెప్పించుకొనుచున్నవి. రూపొందించిన అరువు నిబంధనల మేరకు జిల్లా కేంద్ర గ్రంథాలయములు 30 రోజుల వ్యవధితో రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమునుండి అరువు పొంద వచ్చును. తడవకు పది హేను గ్రంథముల వరకు అరువు పొందనగును. అరువుగా పంపబడు గ్రంథముల రవాణా వ్యయమును రాష్ట్ర కేంద్ర గ్రంథాలయము, అరువుగా తీసికొనిన గ్రంథములను వాపసు చేయునపుడు జిల్లా కేంద్ర గ్రంథాలయములు భరించవలసి యున్నది. గ్రంథములు పాడైనగాని, గ్రంథములు పోగొట్టుకొనబడిన గాని దాని ఖర్చును, వాటి మూల్యమును అరువుగా పొందిన గ్రంథాలయములే భరించవలసి యున్నది. ఈ నిబంధనలకు లోబడి జిల్లా కేంద్ర గ్రంథాలయములు రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమునుండి తమకు కావలసిన గ్రంథములను అరువుగా పొందుచుండినవి.

రాష్ట్ర కేంద్ర గ్రంథాలయము నుండి కావలసిన గ్రంథముల నెన్నుకొనుటకు వీలుగా గ్రంథముల జాబితాలను జిల్లా కేంద్ర గ్రంథాలయములకు పంపవలసియున్నది. జిల్లా కేంద్ర గ్రంథాలయములకే గాక రాష్ట్రమునందలి వివిధసాంస్కృతిక సంస్థలకు గూడ పంపడము అవసరము. రాష్ట్రములోని సాంస్కృతిక సంస్థల గ్రంథముల జాబితాను కూడా రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమునం దుంచుకొనవలసి యున్నది.

కొంతకాలము రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమునకు చేర్చబడుచుండిన గ్రంథముల వివరములను వార్తాపత్రికలలో ప్రకటించి విశేష ప్రచారము సలుపుచుండిరి.

కలకత్తా నగరమందు జాతీయ గ్రంథాలయము గలదు. ఇందులో మన భారతీయ ప్రధాన భాషలలో వెలువడు గ్రంథములన్నియు యున్నవి. మన దేశములోని పౌరసత్వము పొందిన భారతీయు డెవరైననూ జాతీయ గ్రంథాలయము నుండి తమకు కావలసిన గ్రంథమును రాష్ట్ర కేంద్ర గ్రంథాలయము ద్వారా పొందవచ్చును. ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర గ్రంథాలయము అవసర మేర్పడినపుడల్లా జాతీయ గ్రంథాలయము నుండి అరువుగా గ్రంథములను పొందుచుండినది.

## ప్రభుత్వ ప్రాంతీయ గ్రంథాలయాలు – ఇతర గ్రంథాలయాల మధ్య సహకారము :

రాష్ట్రమునందు ప్రప్రథమంగా గుంటూరులో ప్రాంతీయ గ్రంథాలయము 1960 లో స్థాపింపబడినది. తరువాత విశాఖపట్టణము, తిరుపతి, వరంగల్, నిజామాబాద్ నగరములందు ప్రభుత్వ ప్రాంతీయ గ్రంథాలయాలు ఏర్పాటయినవి. వీటి ఆర్థిక వనరులు స్వల్పము. గ్రంథముల కొనుగోలు గూడా పరిమితమే కావున ఆ ప్రాంతీయ పరిధిలోగల అన్ని పౌరగ్రంథాలయాలకు అరువుగా పుస్తకములు పంపే స్తోమత వాటి కుండెడిదికాదు. అయినను విశ్వవిద్యాలయ,

కళాశాలల విద్యార్థుల కవసరమైన గ్రంథముల నెక్కువగాకొని వాటిని విద్యార్థుల కుపయోగపడునట్లు అరువుగా యిచ్చుచుండిరి. గుంటూరు, తిరుపతి, వరంగల్లు పట్టణములందలి ప్రాంతీయ గ్రంథాలయములు, ఆయా ప్రాంతములందలి వివిధకళాశాలల విద్యార్థుల కవసరమైన పాఠ్యపుస్తకములను, యితర పుస్తకములను లభించునట్లుగా చేసి ప్రశంసనీయమైన సేవ చేసినవి.

## ఏలూరు ప్రభుత్వసంచార గ్రంథాలయము – ఇతర గ్రంథాలయాల మధ్య సహకారము :

పశ్చిమగోదావరిజిల్లా ఏలూరుపట్టణమున గల ప్రభుత్వసంచార గ్రంథాలయము వివిధ గ్రంథాలయాలకు ముఖ్యంగా గ్రామీణ ప్రాంతములకు గ్రంథములను అరువుగా యిచ్చుచున్నది. ఇతర గ్రంథాలయములతో గూడా సహకారము పెంపొందించుకొని అందుకు తగు అరువు విధానము ననుసరించుచున్నది.

## జిల్లా కేంద్ర గ్రంథాలయములు – శాఖాగ్రంథాలయముల మధ్య సహకారము :

జిల్లా కేంద్ర గ్రంథాలయములు – శాఖా గ్రంథాలయముల మధ్య సహకార విధానములు ప్రశంసనీయముగా నిర్వహింపబడినవి. శాఖా గ్రంథాలయ పాలకుడు జిల్లా కేంద్ర గ్రంథాలయమునకు సుమారు పదిహేను రోజుల కొకమారువచ్చి కొన్నిపుస్తకములను తీసికొనివెళ్ళి, పదిహేను రోజుల యనంతరము ఆ పుస్తకములను జిల్లా కేంద్ర గ్రంథాలయమునకు చేర్చి, తిరిగి కొన్నిపుస్తకములను తీసుకొనుచుండెడివారు. దాదాపు అన్నిజిల్లాలయందును యిట్టి సహకారము సంతృప్తికరముగా నుండినది.

శాఖా గ్రంథాలయ పాలకులు, పుస్తకపంపిణీ కేంద్రములకు గూడ గొప్ప సహకారము నందించెడివారు. అంతేగాక సహాయక గ్రంథాలయాలకు గూడ కావలసినపుడు సంతోషముగ వారి సహకారము నందించెడివారు.

## గ్రంథాలయముల మధ్య అరువు విధానమునకు అవరోధాలు :

ఈ విధానములోని ప్రయోజనము లెంత ఉన్నతమైనవైననూ ఆచరణలో కొన్ని అవరోధాలు తప్పలేదు. ముఖ్యంగా జిల్లా కేంద్ర గ్రంథాలయాలు, శాఖా గ్రంథాలయాలలో గల గ్రంథముల సంఖ్య పరిమితము. గ్రంథాలయ సంస్థల ఆర్థికవనరులు స్వల్పము. ప్రభుత్వ గ్రాంటులు స్వల్పము. కావున జిల్లా కేంద్ర గ్రంథాలయములు, శాఖా గ్రంథాలయములు తమ గ్రంథాలయాల పాఠకుల అవసరాలకే తగినన్ని గ్రంథాలను కలిగియుండనందున ఇతర గ్రంథాలయాలకు అరువుగా పంపుటకు చాలా సమయములలో వీలు లేకుండెను. ఇక తతిమా సహాయక గ్రంథాలయాల ఆర్థిక స్తోమత కూడ చాలకుండెను. గ్రంథాలను అరువుగా తెప్పించుటలో కాగల రవాణావ్యయము, తపాలా వ్యయము కూడా భరించగల స్తోమత లేని కారణంగా అరువు సహకారము తగినంత పొందలేకుండినవి. గ్రంథాలయ చట్టములో పౌర గ్రంథాలయాలకు, కళాశాల, విశ్వవిద్యాలయాల కుండవలసిన అన్యోన్య సంబంధమును గూర్చి స్పష్టపరచక పోవుటచే కొన్ని కళాశాలల, విశ్వవిద్యాలయాల గ్రంథాలయాలు ఈ విధానమునకు సుముఖతను చూపలేదు.

కొన్ని సహాయక గ్రంథాలయములు స్వతంత్ర ప్రతిపత్తి గలిగినవని భావించి, అవి ఇతర గ్రంథాలయాలకు అరువుగా గ్రంథముల నొసంగు బాధ్యత లేదని తెలియ జేయుచుండినవి. కానీ, ఈ భావన సరియైనది కాదు. సహాయక గ్రంథాలయములు ప్రభుత్వ గ్రాంటును పొందుచున్న కారణంగా అవి పౌర గ్రంథాలయాలే గనుక పరస్ప

రము, సహకరించు కొనక తప్పదని రాఘవ రెడ్డిగారు స్పష్టపరచిరి. అయినను సహాయక గ్రంథాలయములలోని గ్రంథములు అతిస్వల్పము. వాటిని నిర్వహించు సిబ్బందిలో గూడ పలువురు గ్రంథాలయ శాస్త్ర శిక్షణ పొందిన వారుకారు. పైగా వారికి చెల్లించు వేతనములకే వారివనరులు చాల కుండెడివి. అయినను, ఆంధ్ర ప్రదేశ్ పౌర గ్రంథాలయ చట్టము అమలులోనికి వచ్చిన తరువాత, గ్రంథపాలకులు గ్రంథాలయోద్యమములో చురుకుగా పాల్గొనుట వలన, పౌర గ్రంథాలయాలు యితర గ్రంథాలయములతో సహకారమును పెంపొందించు కొన్నవి.

## రాష్ట్రములో గ్రంథాలయాల మధ్య అరువు విధానములో సాధించిన అభివృద్ధి:

1960 అనంతరము రాఘవ రెడ్డిగారి ప్రోత్సాహముతో గ్రంథాలయాల మధ్య సహకారము క్రమంగా పెంపొందినది. ఉదా:- 1963 - 64 సంవత్సరమున రాష్ట్రములో గ్రంథాలయాల మధ్య అరువు విధానము ద్వారా ఒకలక్షా ముప్పదివేల గ్రంథములు అరువుగా యివ్వబడగా, 1968 - 69 లో ఈ సంఖ్య మూడులక్షల ఎనుబదివేల నాలుగు వందలకు పెరిగినదనిన, ఈ అరువు విధానము క్రమంగా పెంపొందినదని స్పష్టమగుచున్నది.

## గ్రంథాలయాల మధ్య అరువు విధానము సఫలీకృత మగుటకు కొన్ని సూచనలు:

ఈ విధానము జయప్రదమగుటకు, విస్తృత పరచుటకు ఈ క్రింది ముఖ్య సూచనలను అమలు పరచవలసి యున్నది.

1. బిబ్లియోగ్రఫీ, యూనియన్ కేటలాగులను తయారు చేసి ప్రచురించవలెను.

ఉదా:— గుంటూరు ప్రాంతీయ గ్రంథాలయము తయారు చేసిన తెలుగు యూనియన్ కేటలాగును వెంటనే ప్రచురించి గ్రంథాలయాలకు సరఫరా చేయవలెను.

ప్రచురింపబడిన బాలసాహిత్యమాలకు అనుబంధంగా ఇదివరకు ప్రచురించిన పుస్తకముల జాబితాను జతచేసి సరఫరా చేయవలెను.

అన్ని భాషలలో ప్రకటించబడిన జాతీయ గ్రంథముల సూచీలను కలకత్తా నుండి తెప్పించుకొనవలెను.

2. గ్రంథాలయాలకు క్రొత్తగా చేర్చిన గ్రంథములను ఎప్పటికప్పుడు పత్రికలలో ప్రకటించవలెను.

3. ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ చట్టములో పౌర గ్రంథాలయాలకు, కళాశాలల, విశ్వవిద్యాలయ గ్రంథాలయాలకు, యితర గ్రంథాలయాల కుండవలసిన పరస్పర సహకార విధానమును స్పష్టముగా పేర్కొనవలయును.

4. అరువుగా పంపబడు గ్రంథముల రవాణా ఖర్చుల, తపాలా ఖర్చులను మినహాయింపు చేయవలెను.

5. రాష్ట్రము నందలి విశ్వవిద్యాలయములు, రాష్ట్ర పరిశోధనా సంస్థలు తమ గ్రంథాలయాల గ్రంథముల జాబితాను, పత్రికల సంచికల జాబితాను తయారుచేసి పౌర గ్రంథాలయ శాఖకు యితర గ్రంథాలయములకు పంపవలెను. ఇందులకు కేంద్ర ప్రభుత్వము తగు ఆర్థిక సహాయ సహకారముల నందించ వలసిన అవసరము కలదు.



# ఆంధ్రప్రదేశ్‌లో బాలల గ్రంథాలయాలు - పిల్లల విజ్ఞాన వికాసమునకు వసతులు:

పాశ్చాత్య దేశములందు అమలునందున్న కొన్ని పౌరగ్రంథాలయముల చట్టములలో బాలల గ్రంథాలయముల అభివృద్ధిని గురించి ప్రస్తావన కలదు. కాని మదరాసు పౌరగ్రంథాలయ చట్టము 1948 నందుగాని, హైదరాబాదు పౌరగ్రంథాలయ చట్టము 1955 నందు గాని, ఆంధ్రప్రదేశ్ పౌరగ్రంథాలయ చట్టము 1960 నందుగాని ఈ ప్రస్తావన లేదు. ఈ పౌర గ్రంథాలయ చట్టములలో బాలల గ్రంథాలయములకు సంబంధించిన ప్రస్తావన లేకపోయినప్పటికి 1950 నుండి బాలల గ్రంథాలయముల స్థాపనకు, వాటి అభివృద్ధికి కృషి జరుగుచునే యుండినది.

యునెస్కో (UNESCO) వారు ప్రపంచములో ఏ దేశమునందైనను పౌర గ్రంథాలయములకు సంబంధించిన సభలు, సమావేశములు జరిపినపుడు, ఈ సమావేశములకు హాజరగు గ్రంథాలయ నిపుణులు, బాలల గ్రంథాలయముల అభివృద్ధికి తగు చర్యలను తీసికొనవలెనని బాలలు చదువుకొనుటకు కావలసిన వసతులను కలుగ జేయు బాధ్యత పౌర గ్రంథాలయములదేనని తెల్పుచుండిరి.

## పిల్లలయొక్క పఠనాసక్తి - పౌర గ్రంథాలయాల బాధ్యత :

యునెస్కోవారు 1955 సం॥ ఢిల్లీపట్టణమునందు ఆసియాలో పౌర గ్రంథాలయాలు (Public libraries for Asia) అను ఒక సదస్సును ఏర్పాటు చేసిరి. ఈ సమావేశమునకు విచ్చేసిన వారిలో మన దేశమునకు చెందిన పలువురు విద్యావేత్తలు, గ్రంథాలయాభిమానులు మాత్రమే గాక విదేశములకు చెందిన గ్రంథాలయశాస్త్ర వేత్తలు కూడా పలువురు కలరు.

ఈ సదస్సునందు పాల్గొన్న పలువురు గ్రంథాలయ నిపుణులు, బాలల మరియు యువకుల విద్యాసంస్కృతులను పెంపుజేయు పుస్తకములను, బాలల గ్రంథాలయములకు పంపిణీచేయు బాధ్యత మరియు ఈ పుస్తకములను బాలలచే పఠింపజేయు కర్తవ్యము పౌర గ్రంథాలయములదేనని తీర్మానించారు. ఈ తీర్మానమునకు మన రాష్ట్రములోని గ్రంథపాలకులు తమ హర్షమును ప్రకటించిరి.

## గ్రంథాలయాల అభివృద్ధికై ప్రాథమిక ఉపాధ్యాయులకు ప్రోత్సాహము:

1941 నుండి కొంత కాలము పాటు ప్రాథమిక పాఠశాలల తనిఖీ అధికారిగా రాఘవరెడ్డిగారుండిరి. ప్రాథమిక పాఠశాలల ఉపాధ్యాయుల సమావేశములకు వెళ్ళినపుడు వీరు ప్రతి ప్రాథమిక పాఠశాలలోను బాలలకు సంబంధించిన పుస్తకములు తప్పని సరిగా ఉండవలెనని రెండవ తరగతినుండి ఐదవ తరగతి వఱకున్న పాఠశాల విద్యార్థులచేత సంవత్సరమునకు పది పుస్తకములకు తక్కువ గాకుండ పఠింపజేయు బాధ్యత ఉపాధ్యాయులదే ననిరి. ఈ విధముగా చేసిన,



పుత్తూరు తాలూకా కొత్తపల్లిమిట్ట ప్రాథమిక పాఠశాలా గ్రంథాలయమును నభివృద్ధి చేసిన ఎస్. రాజారెడ్డి.

ప్రతి విద్యార్థి తన ప్రాథమిక పాఠశాల విద్యాభ్యాసము ముగియు నాటికి నలుబది పుస్తకములకు పైగా చదివి విజ్ఞానము పెంపొందించు కొనుటకు వీలగుననిరి. ప్రాథమిక పాఠశాలల యందలి కొందఱు ఉపాధ్యాయులు, విద్యార్థులచే ఐదవ తరగతి విద్యాభ్యాసము పూర్తి యగు నంతలో, 60 పుస్తకములకు పైగా పఠింపచేసిరి. ఉదా:— దొడ్డి వీరాసామి, కాకినాడ; ఎస్. రాజారెడ్డి కొత్తపల్లిమిట్ట, పుత్తూరు తాలూకా, చిత్తూరుజిల్లా; మున్నగువారు. విద్యార్థులు తమ ప్రాథమిక విద్యాభ్యాస కాలమున నిరంతర పఠనము చేయుటచే అక్షర జ్ఞానము చెరిగిపోక నిలువగలదు. కొందరు పేద విద్యార్థులు తగిన ఆర్థిక స్తోమత లేనివారగుటచే ప్రాథమిక విద్య ముగిసీ ముగియకనే విద్యాభ్యాసమునకు స్వస్తి చెప్పవలసివచ్చును. ఇటు వంటి వారికి ఆ ప్రాంతములోనున్న పౌర గ్రంథాలయమున బాలలకు సంబంధించిన పుస్తకములను తప్పనిసరిగా వుంచవలెనని తెలియజేయు చుండిరి.

రాఘవరెడ్డిగారి ప్రోత్సాహముతో కొందరు గ్రామస్థులు బాలలకు సంబంధించిన పుస్తకముల కొన్నిటిని ప్రాథమిక పాఠశాలలకు విరాళముగా కూడ యిచ్చిరి. బాలల విద్యాభివృద్ధి యెడల శ్రద్ధ కలిగిన కొందరు సంపన్నులు బాలలకు సంబంధించిన పుస్తకముల కొన్నింటిని ఈ గ్రంథాలయములకు విరాళముగా యిచ్చి, తమ ఉదారతను ప్రకటించు కొనుచుండిరి. అట్టివారు ఈనాటికిని లేకపోలేదు. ప్రతి ఉపాధ్యాయుడు ఆర్థిక స్తోమత చక్కగానున్న వారికడకు వెళ్ళి వారికి, బాలలకు సంబంధించిన పుస్తకములను గురించి తెలిపి, ఉదారతతో వారిచ్చెడి పుస్తకములను తీసికొని, ఈ గ్రంథాలయములందుంచ వలెనని రాఘవరెడ్డిగారు తెలియజేసెడివారు వారే స్వయముగా పై సదభిప్రాయములు కల్గిన కొందరివద్దకు వెళ్లి వారినుండి కొన్ని బాలల సాహిత్య, తదితర పుస్తకములను విరాళముగా పొంది ప్రాథమిక

విద్య నభ్యసించువారికి, తదితరులకు చదువుకొనుటకు వీలుగా, గ్రంథాలయములం దుంచిరి. రాఘవరెడ్డిగారి సూచన మేరకు కొందరు ఉపాధ్యాయులు కూడా బాలల విద్యాభివృద్ధులకు యిటువంటి కృషి చేసి సఫలీకృతులైరి. అట్టివారిలో కొందఱు:

1. శ్రీ డి. వీరాస్వామి - ఎయిడెడ్ ఎలిమెంటరీ పాఠశాల. కాకినాడ.
2. శ్రీ గోవిందస్వామి-జ్యోతి రామలింగ పాఠశాల, చిత్తూరు.
3. శ్రీ ఎ. అశ్వర్థప్ప - ప్రాథమిక పాఠశాల, బుక్కరాయ సముద్రం, అనంతపురం జిల్లా.
4. ఎస్. రాజారెడ్డి - కొత్తపల్లిమిట్ట - పుత్తూరు తాలూకా, చిత్తూరు జిల్లా.

**బాలల గ్రంథముల కొనుగోలుకు బడ్జెట్‌లో ప్రత్యేక కేటాయింపు:**

1953 లో ఆంధ్రరాష్ట్రావతరణానంతరము పౌర గ్రంథాలయముల అభివృద్ధి బాధ్యతలను కూడ ప్రత్యేకాధికారిగా నున్న రాఘవరెడ్డిగారు స్వీకరించిరి. లోకల్ లైబ్రరీ అథారిటీవారు బాలలకు సంబంధించిన పుస్తకముల కొనుగోలుకు కొంత శాతము బడ్జెట్‌లో తప్పనిసరిగా కేటాయించవలెనని, వీరు ఉత్తర్వులు జారీచేయుచుండిరి. వీరు పౌర గ్రంథాలయముల అభివృద్ధి బాధ్యతలను స్వీకరించినప్పటి నుండి ప్రతి పౌరగ్రంథాలయమునందును బాలలకు సంబంధించిన పుస్తకములను ప్రవేశపెట్టడము జరిగినది. శ్రీ గిడుగు వేంకటసీతాపతి పంతులుగారి సాయమున 1963 లో పిల్లలకు సంబంధించిన పుస్తకముల జాబితాను తయారుచేయించి లోకల్ లైబ్రరీ అథారిటీవారికి పంపిరి. ఈ జాబితాలో పిల్లలకు సంబంధించిన పుస్తకములు 175 కు పైగా కలవు. పుస్తకములను ఎన్నికచేయుటకుగాను ప్రభుత్వము ప్రచురించిన 'బాలసాహితీమాల' ప్రతులను కూడా 1963 సం॥ లోకల్ లైబ్రరీ అథారిటీలకు పంపిరి.

## బాల సాహిత్య గ్రంథాల కొనుగోలు:

బాలల మానసిక ప్రవృత్తిపై సమగ్ర పరిశీలన జరిపిన నిపుణుల చేతను, బాలల విద్యాభివృద్ధులకు తోడ్పడువారి చేతను సూచింపబడిన బాల సాహిత్య పుస్తకములను లోకల్ లైబ్రరీ అథారిటీ వారు కొనుగోలుచేసి, జిల్లా కేంద్ర గ్రంథాలయములలోని బాలల గ్రంథాలయ విభాగ మందుంచుచుండిరి. ఈ పుస్తకములలో ముఖ్యముగా బాలలకు సంబంధించిన బొమ్మల పుస్తకములు, చిన్న కథల పుస్తకములు, రంగుల పుస్తకములు మున్నగునవి యుండినవి. కొందరు గ్రంథపాలకులు బాలలకు సంబంధించిన పుస్తకములను గురించి వివరించి, వాటిపై ఉపన్యాసముల నిచ్చి, ఆ పుస్తకములను చదువుటకు కావలసిన ప్రోత్సాహమును కూడా కల్పించుచుండిరి. శారీరికముగా, మానసికముగా కొన్ని లోపములున్న పిల్లలకు తగిన పుస్తకములను కొనుటకు తగినంత ఆర్థిక స్తోమత లేకపోవుటచే, ఈ పుస్తకములను కొన్ని లోకల్ లైబ్రరీ అథారిటీలవారు మాత్రము గ్రంథాలయములలోని బాలల గ్రంథాలయ విభాగములందుంచిరి. రాష్ట్ర కేంద్ర గ్రంథాలయములలో మాత్రము యిట్టి పుస్తకములను కొంతవరకు ఉంచడము జరిగినది. బాలలకు విద్యా – సాంస్కృతిక – నాగరికత విషయములను తెలియజేయు వివిధ రకముల పుస్తకములు, సత్ప్రవర్తనను గురించి తెలియజేయు పలుపుస్తకములు, మనోల్లాసమును, ఆహ్లాదమును కలుగజేయు పుస్తకములు, నీతి పుస్తకములు, బాలురు తమ భావిజీవితములను ఏవిధముగా మలచుకొనవలెనో తెలియజేయు ప్రయోజనకర పుస్తకములు బాలల గ్రంథాలయము నందుండినవి. రాఘవరెడ్డిగారు గ్రంథాలయముల తనిఖీకి వెళ్లెడు సందర్భాలలో బాలల గ్రంథాలయ విభాగాధికారికి పిల్లల మానసిక ప్రవృత్తికి సంబంధించిన పుస్తకముల నెక్కువగా చదివి, మంచి అనుభవమును గడించినగాని, గ్రంథపాలకులు బాలలకు గొప్ప గ్రంథాలయ

సేవ చేసినట్లు కాదని నొక్కి చెప్పుచుండిరి. ఆంధ్రప్రదేశ్ ఏర్పడు నాటికి బాలలకు సంబంధించిన పుస్తకములు లేని పౌర గ్రంథాలయ ములు చాలా అరుదని చెప్పవచ్చును.

బాలల గ్రంథాలయములోని పుస్తకములను కొన్నిటిని యువ జన సంఘములకు, ప్రాథమిక పాఠశాలలకు, కొన్ని లోకల్ లైబ్రరీ అథారిటీలు పంపుచుండినవి. బాలల గ్రంథాలయములందు కల పుస్తకములను గురించి తరచుగా కొందరు గ్రంథపాలకులు ప్రాథమిక పాఠశాలలకు తెలియజేసెడివారు. ఈ పద్ధతి ప్రాథమిక పాఠశాలలలోని విద్యార్థులకు ప్రయోజనకరముగా యుండినదని చెప్పక తప్పదు.

## గ్రంథాలయములలో బాలలకు ప్రత్యేక విభాగము:

అమెరికాలోను, గ్రంథాలయాభివృద్ధిని సాధించిన యితర పాశ్చాత్య దేశములలోను, గ్రంథాలయ భవనములు విశాలముగా నున్నవి. కాన అందు పెద్దల గ్రంథాలయశాఖ ఒక వైపు, బాలల గ్రంథాలయ శాఖ మరొకవైపు ఉండుటయే గాక, యీ రెండు శాఖ లకు ప్రవేశములు కూడ వేరు-వేరుగనే యున్నవి. కాని మన రాష్ట్ర మున యిటువంటి సువిశాలమైన గ్రంథాలయ భవనములు పెక్కు జిల్లాలలో లేవు. కాని అనంతపురము, గుంటూరు కాకినాడ, విశాఖ పట్టణము, వరంగల్లు మున్నగు పట్టణములలోని జిల్లా కేంద్ర గ్రంథా లయ భవనములు కొంత విశాలముగా నుండుటవలన బాలలకు, పెద్ద లకు గ్రంథాలయ శాఖలను ప్రత్యేకించడము జరిగినది. 1960 లో ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ చట్టము అమలుకు వచ్చిన అనంత రము మన రాష్ట్రములో ముఖ్యముగా హైదరాబాదు - వికారా బాదు - సంగారెడ్డి మున్నగు పట్టణములలోని జిల్లాకేంద్ర గ్రంథా లయములలో బాలలకు ప్రత్యేకముగా ఒక గ్రంథాలయ శాఖను, పెద్దలకు ఒక గ్రంథాలయ శాఖను ఏర్పాటు చేయడము జరిగినది.

ఈవిధముగా ప్రత్యేకించబడిన బాలల గ్రంథాలయములకు తగిన ఫర్నిచర్‌ను కూడా లోకల్ లైబ్రరీ అథారిటీవారు పంపిణీ చేసిరి.

## శాఖా గ్రంథాలయాలలో బాలల విభాగములు :

మన రాష్ట్రములోని శాఖాగ్రంథాలయ భవనములందు బాలలకు, పెద్దలకు గ్రంథాలయ విభాగములను ప్రత్యేకముగా ఏర్పాటు చేయుటకు చాలావరకు వీలులేకపోవుట వలన, పలు శాఖా గ్రంథాలయములలో బాలలకు సంబంధించిన పుస్తకములను ప్రత్యేక బీరువాలయందుంచి, బాలురు చదువుకొనుటకు తగిన సౌకర్యమును కల్పించిరి. రాష్ట్రములోని కొన్ని శాఖాగ్రంథాలయములలో మాత్రము (ఉదా:- రాయదుర్గము, తెనాలి, తిరుపతి, రాజమండ్రి మున్నగునవి) పెద్దలకు పిన్నలకు వేర్వేరుగా శాఖలను ఏర్పాటు చేయుటకు వీలుండినది. కాని జిల్లా కేంద్ర గ్రంథాలయములలో బాలలకున్నంత ఫర్నిచర్, తదితర వసతులు ఈ శాఖాగ్రంథాలయములలో బాలలకు లేకపోయినవని చెప్పవచ్చును. దీనికి లోకల్ లైబ్రరీ అథారిటీ వారికి తగిన ఆర్థిక స్తోమత లేకపోవుట మరియు ఈ శాఖాగ్రంథాలయ భవనములందు స్థలము తక్కువగా నుండుట ప్రధాన కారణములు. శాఖాగ్రంథాలయములకు ఈ విధమైన అసౌకర్యము లున్నప్పటికి, పిల్లలకు సంబంధించిన పుస్తకములు లేని శాఖాగ్రంథాలయములు నామమాత్రమే.

## బాలలకు ప్రత్యేక ఫర్నిచరు :

ఇంగ్లాండు అమెరికా మున్నగు పాశ్చాత్య దేశములందలి బాలల గ్రంథాలయములలోని కుర్చీలు, మేజాలు, బల్లలు, తదితర ఫర్నిచర్ బాలలకు తగినట్లు ప్రత్యేక కొలతలలో తయారుచేయబడి యున్నవి. అదేవిధముగా మనరాష్ట్రములోని బాలల గ్రంథాలయ విభాగములలో కూడ బాలలకు తగిన ప్రత్యేక ఫర్నిచర్ ఏర్పాటుచేయవలెనని

ఆ కొలతల జాబితా వివరములను విశదముగా 1955 వ సం॥న రాఘవ రెడ్డిగారు లోకల్ లైబ్రరీ అథారిటీ వారి కందజేసిరి. లోకల్ లైబ్రరీ అథారిటీవారు అటువంటి కొలతలలోనున్న ఫర్నిచర్ ప్రత్యేకముగా తయారు చేయించి, వాటిని బాలల గ్రంథాలయములందు చక్కగా అమర్చిరి. చాలావరకు గ్రంథాలయ శాస్త్రమున శిక్షణ పొందిన వారినే బాలల గ్రంథాలయ గ్రంథపాలకులుగా నియమించడం జరిగినది.

## బాలల విభాగమునకు ప్రత్యేక అలంకరణలు :

కొన్ని జిల్లా కేంద్ర గ్రంథాలయములలోని బాలల గ్రంథాలయములను, కొన్ని ప్రత్యేక బాలల గ్రంథాలయములను రమణీయముగా తీర్చిదిద్దుచుండిరి. ఉదా:- వికారాబాదు, అనంతపురము, గుంటూరు, మున్నగు జిల్లా కేంద్ర గ్రంథాలయము లందలి బాలల విభాగములు.

పిల్లలను గ్రంథాలయములు ఆకర్షించుటకు వీలుగా బాలల గ్రంథాలయములను సాధ్యమైనంతవరకు సుందరముగా అలంకరించుచుండిరి. ఈ గ్రంథాలయములలో బాలలకు సంబంధించిన సుందరమైన చిత్రపటములను, బొమ్మలను చక్కగా అమర్చెడివారు. బాలలకు సంబంధించిన ఆటవస్తువులగు చదరంగము, క్యారంబోర్డు మున్నగు వాటిని కూడ కొన్ని గ్రంథాలయములం దుంచుచుండిరి.

## గ్రంథాలయాలలో పిల్లల ప్రత్యేక కార్యక్రమాలు:

బాలలకు కొన్ని కథలను కూడా, పలు జిల్లా కేంద్ర గ్రంథాలయములందును, కొన్ని శాఖా గ్రంథాలయముల యందును గ్రంథపాలకులు చెప్పుచుండిరి. మరియు విజ్ఞానదాయకమైన కొన్ని చలన చిత్రములను కూడా పెక్కు గ్రంథాలయములందు చూపడము జరిగినది. ఈ ప్రదర్శనలను పౌర సంబంధ శాఖవారు ఏర్పాటు చేయుచుండిరి.

అంతేగాక కొన్ని జిల్లా కేంద్ర గ్రంథాలయ గ్రంథపాలకులు బాలలకు సంబంధించిన నాటక ప్రదర్శనములను కూడా నిర్వహించిరి. ఉదా:—చిత్తూరు, గుంటూరు కేంద్ర గ్రంథాలయములు, రాయదుర్గము నందలి శాఖా గ్రంథాలయము. పెక్కు జిల్లా కేంద్ర గ్రంథాలయముల లోను, కొన్ని శాఖా గ్రంథాలయములలోను పుస్తక ప్రదర్శనలు జరుపబడినవి. ఉదా:— హైదరాబాదులోని రాష్ట్ర కేంద్ర గ్రంథాలయము, అనంతపురము మఱియు చిత్తూరు లోని జిల్లా కేంద్ర గ్రంథాలయములు. బాలలకు చదువునందు మక్కువను పెంచుటకు చాలా జిల్లా కేంద్ర గ్రంథాలయములలో వ్యాస రచన పోటీలు, వక్తృత్వపు పోటీలు మున్నగు వివిధ రకముల పోటీలు జరిగెడివి. ఈ పోటీలలో పాల్గొని విజేతలయిన బాలలకు ఆ గ్రంథాలయ గ్రంథపాలకులు బహుమతులను కూడా యిచ్చుచుండిరి. దీనివలన బాలలు ఈ పోటీలలో పాల్గొనుటకు ఆసక్తి చూపుటయే గాక, బాలల విద్యాభివృద్ధులకు ఈ పోటీలు మిగుల శ్రేయోదాయకములైనవి. కొన్ని జిల్లా కేంద్ర గ్రంథాలయములు ఈ విధముగా పిల్లలను చక్కగా ఆకర్షించి, చదువుకొనుటకు తగిన ప్రోత్సాహమును కల్పించినవి.

పలు శాఖా గ్రంథాలయములలో ఈ పద్ధతులను ప్రవేశపెట్టుటకు వీలులేక పోయినప్పటికి, కొన్ని శాఖా గ్రంథాలయములలో మాత్రము, ఈ పద్ధతులలో కొన్నిటిని ప్రవేశ పెట్టడము జరిగినది. ఉదా: రాయదుర్గము, రాజమండ్రి, తెనాలి, నిర్మల్ మున్నగు శాఖా గ్రంథాలయములు.

చిత్ర లేఖన ప్రదర్శనములు కూడా కొన్ని గ్రంథాలయముల యందు పిల్లలకు ప్రయోజన కరముగా ఏర్పాటు చేయబడినవి. 'జల్ దీప్' అను హిందీ చలన చిత్రము పిల్లలకు మిగుల ప్రయోజనకరముగా నుండినది. ఆంధ్రప్రదేశ్ అవతరణానంతరము ఈ చిత్రమును తెలుగులోనికి తర్జుమా చేసి పిల్లలకు మరింత ప్రయోజనమును చేకూర్చడం జరిగినది. బాలల కార్యక్రమములు అన్ని జిల్లా

కేంద్ర గ్రంథాలయాలలోను చక్కగా నిర్వహింపబడినవి. ఈ కార్య క్రమముల నిర్వహణలో వేంకటేశ్వర్లు, రాఘవయ్య (గుంటూరు), ఆనందం (వరంగల్లు), పాండురంగారెడ్డి (హైదరాబాదు), బాలకృష్ణా రెడ్డి (మహబూబ్‌నగర్), దామోదరరావు (కరీంనగర్), రామా రావు (ఆదిలాబాదు), తదితరులు గట్టి కృషి చేసిరి.

## బాలల విభాగముల అభివృద్ధికి ప్రత్యేక గ్రాంటులు:

బాలల గ్రంథాలయ స్థాపనాభివృద్ధులకు తగినంత ఆర్థిక స్తోమత లోకల్ లైబ్రరీ అథారిటీలకు లేకపోవుటచే కొన్ని సమయ ములలో ప్రభుత్వము ప్రత్యేకగ్రాంట్లను మంజూరు చేయడం జరిగినది. ఉదా:ఆంధ్రప్రాంతములో 1960-61 లో నూతన బాలల గ్రంథాలయ స్థాపనకుగాను, అదివరకు స్థాపించిన బాలల గ్రంథాలయముల అభి వృద్ధులకుగాను ప్రభుత్వము రూ. 13,500 ల గ్రాంటును మంజూరు



వికారాబాద్ కేంద్ర గ్రంథాలయములో పిల్లల విభాగమును పర్యవేక్షిస్తూ పిల్లలతో ఆసక్తితో ముచ్చటిస్తున్న శ్రీ కె. రాఘవరెడ్డిగారు.

చేసినది. 1960-61 లో తెలంగాణలోని తొమ్మిది జిల్లా కేంద్ర గ్రంథాలయములలోని బాలల గ్రంథాలయముల అభివృద్ధి నిమిత్తమై ప్రభుత్వము ప్రతి జిల్లాకు రూ. 1,500 ల చొప్పున లోకల్ లైబ్రరీ అథారిటీలకు మంజూరు చేసినది.

## హైదరాబాదు పబ్లిక్ గార్డెన్స్‌లో బాలల గ్రంథాలయము :

రాష్ట్ర కేంద్ర గ్రంథాలయము, ప్రాంతీయ గ్రంథాలయములు మాత్రమే గాక హైదరాబాదు పబ్లిక్ గార్డెన్స్‌లో యుండినటువంటి బాలల గ్రంథాలయము కూడా ప్రభుత్వ ఆధీనములో యుండినది. ఈ గ్రంథాలయము 1954 లో స్థాపింపబడినది. 1961 మార్చి వరకు ఈ గ్రంథాలయ శాఖ నిర్వహణ బాధ్యత విద్యాశాఖ డైరెక్టరుపై యుండినది. 1961 మార్చి నుండి ఈ బాధ్యతను పౌర గ్రంథాలయ డైరెక్టరుకు అప్పగించడము జరిగినది. 1961 మార్చి వరకు పుస్తకములను అరువు తెచ్చుకొనుటకు గ్రంథాలయ పాఠకులు చెల్లించుచుండిన 5 రూపాయల డిపాజిట్టు పైకమును, ఈ బాలల గ్రంథాలయ బాధ్యతను పౌర గ్రంథాలయశాఖ స్వీకరించిన అనంతరము, రాఘవరెడ్డిగారు 3 రూపాయలకు తగ్గించిరి. దీనివలన యీ గ్రంథాలయమునందు పుస్తకములను అరువు తీసికొనువారి సంఖ్య, గ్రంథాలయ పాఠకుల సంఖ్య పెరిగినది. బాలలకు ప్రయోజనకరమైన బాలసాహిత్య పుస్తకములు మరియు పాఠ్యపుస్తకములు ఈ గ్రంథాలయమున యుంచబడినవి. హైదరాబాదునందు ఇంగ్లీషు, తెలుగు, ఉర్దు, మరాటీ, కన్నడము మున్నగు భాషలయందు గల బాలల పుస్తకములను ఈ గ్రంథాలయమున యుంచడము జరిగినది. బాలల కనువైన ఫర్నీచర్‌ను కూడా ఈ గ్రంథాలయమున అమర్చడము జరిగినది.

## జవహర్ బాలభవన్:



జవహర్ బాల భవన్, హైదరాబాదు.

1966 లో ఢిల్లీలో ఒక బాల భవన్‌ను స్థాపించిరి. అదే విధముగా హైదరాబాదు నగరమునకూడా ఒక బాల భవన్‌ను స్థాపించవలెనని అప్పటి ఆర్థిక శాఖామాత్యులగు డాక్టర్ ఎం. చెన్నారెడ్డిగారు నిర్ణయించిరి. హైదరాబాదు పబ్లిక్ గార్డెన్స్ లోని ఆరోగ్యసంబంధ వస్తు ప్రదర్శనశాలను మరొక భవనమునకు తరలించి ఆ భవనమున బాలభవన్‌ను స్థాపించవలెనని చెన్నారెడ్డిగారు నిశ్చయించిరి. ఈ బాల భవన్ స్థాపన కమిటీకి శ్రీ ఎం. చెన్నారెడ్డిగారు అధ్యక్షులుగాను, డిప్యూటి డైరెక్టరుగా వుండిన రాఘవరెడ్డిగారు కన్వీనరుగాను వుండిరి. 23-6-1966 న ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరాగాంధీగారిచేత ఈ బాల భవన్ ప్రారంభింపబడినది. దీనికి 'జవహర్ బాల భవన్' అని నామకరణము చేసిరి. ఈ జవహర్ బాల భవన్ స్థాపనానంతరము పబ్లిక్ గార్డెన్స్‌లోని బాలల గ్రంథాలయ

మును బాల భవన్‌లో కలిపివేయడం జరిగినది. ఈ బాల భవన్ లో బాలలకు సంబంధించిన ఆటలు, సంగీతము – నృత్యము, తదితర కార్య కలాపములను ప్రవేశపెట్టిరి. గ్రంథాలయములలో చేర్చవగు విజ్ఞాన, చారిత్రిక సాంఘిక శాస్త్ర సాహిత్య సంబంధమైన పుస్తకములను మరియు బాలల ప్రాథమిక విద్యాభ్యాసమునకు సంబంధించిన పుస్తకములను ప్రవేశపెట్టిరి. ఈ బాల భవన్ ప్రత్యేకించి బాలలకు అమితప్రయోజన కారిగ యున్నదనుటలో అతిశయోక్తి లేదు. ఈ బాలభవన్‌ను స్థాపించిన అనంతరము కొద్ది నెలలకు రాఘవరెడ్డిగారు దీని నిర్వహణ బాధ్యతలను కూడా చేపట్టిరి. వీరు సాయంసమయములలో ఈ బాల భవన్‌కు వెళ్ళి అచ్చట చదువుకొనెడి బాలలకు తగిన ప్రోత్సాహ మునుకల్పించిరి. దీనివలన బాలభవన్‌కు వచ్చెడి బాలల సంఖ్యకూడా పెరిగినది. బాలలకు సంబంధించిన విజ్ఞానదాయకమైన చలనచిత్ర ములను కూడా వీరు ఈ బాల భవన్‌నందు ప్రదర్శింపజేసిరి. బాలలకు సంబంధించిన అనేక యితర కార్యక్రమాలను కూడా ప్రవేశపెట్టిరి. ఈ బాల భవన్‌కు రాఘవరెడ్డిగారు నిర్వహణాధికారిగా కొద్ది నెలలు మాత్రమే వున్నప్పటికి, బాల భవన్ అభివృద్ధికి వీరు గట్టి కృషి చేసిరి.

## బాలల గ్రంథాలయాలపై సదస్సు:

బాలలు చదువుకొనుటకు కావలసిన వసతులను కలుగజేయు బాధ్యత ఏ శాఖకు చెందినదను సమస్య తరచుగా చర్చలలోకి వచ్చు చుండెను. ఈ సందర్భమును పురస్కరించుకొని రాఘవరెడ్డిగారు 1961 లో హైదరాబాదు కేంద్ర గ్రంథాలయమునందు ఒక సదస్సు ఏర్పాటు చేసిరి. పౌర గ్రంథాలయముల అభివృద్ధికి ముఖ్యముగా బాలలు చదువుకొనుటకు వలయు వసతులను కలుగజేయు బాధ్యతల నిర్వహణను, ఏ శాఖలోనికి చేర్చవలయునను విషయములను చర్చించు టకు ఈ సదస్సులో ప్రాధాన్యత యొసంగబడెను. ఈ సదస్సునకు

యస్. ఆర్. రంగనాథన్‌గారు డైరెక్టరుగాను, రాఘవరెడ్డిగారు జాయింట్ డైరెక్టరుగాను వుండిరి. ఈ సదస్సునందు యస్.ఆర్. రంగనాధన్ గారు మరియు కొందరు గ్రంథపాలకులు బాలలకు సంబంధించిన గ్రంథాలయముల నిర్వహణ బాధ్యత, బాలలు చదువుకొనుటకు తగు వసతులను కలుగజేయు బాధ్యత విద్యాశాఖ వారిదేనని అభిప్రాయమును వెలిబుచ్చిరి. కాని రాష్ట్రీయమునుండి ఈ సదస్సునకు హాజరయిన గ్రంథపాలకులు, గ్రంథాలయాభిమానులు ఈ అభిప్రాయముతో ఏకీభవించలేదు. దీనికి ఈ క్రింది ముఖ్యకారణములు పేర్కొనిరి.

1. ఇంగ్లాండు తదితర పాశ్చాత్య దేశములలో పౌర గ్రంథాలయములే బాలల గ్రంథాలయ నిర్వహణ బాధ్యతలను చేపట్టి ఎంతో అభివృద్ధిని సాధించినవి. కాన మన రాష్ట్రమున కూడ బాలల గ్రంథాలయ నిర్వహణ బాధ్యతలను పౌర గ్రంథాలయములే చేపట్ట వలసిన ఆవశ్యకత ఎంతేని కలదు.

2. మన రాష్ట్రములో విద్యాశాఖవారు ఇదివరకు ప్రాథమిక పాఠశాలలలోని గ్రంథాలయములకు తగు వసతులను కలుగజేయలేదు. పౌర గ్రంథాలయ శాఖవారే ఈ బాలల గ్రంథాలయ నిర్వహణ బాధ్యతలను చక్కగా నిర్వహింపగలరు. కాన ఈ బాధ్యతలను పౌర గ్రంథాలయశాఖ చేపట్టడము మిగుల శ్రేయోదాయకము.

ఈ సదస్సునకు హాజరయిన లోకల్ లైబ్రరీ అథారిటీ సభ్యులు, విద్యాశాఖ, పాఠశాలలలోని గ్రంథాలయముల అభివృద్ధికి తగిన మొత్తమును కేటాయించడంలేదని, జిల్లా గ్రంథాలయసంస్థలే బాలల గ్రంథాలయములకు కావలసిన వసతులను కలుగజేయ గలవను, పుస్తక భాండాగారుల సూచనలను సమ్మతించిరి. విద్యాశాఖలో అనుభవమున్న రాఘవరెడ్డిగారు కూడా విద్యాశాఖ ప్రాథమిక పాఠశాలలలోని గ్రంథాలయముల అభివృద్ధికి తగినశ్రద్ధ తీసుకొనలేక పోవు

టచే, పౌర గ్రంథాలయములే బాలల గ్రంథాలయ నిర్వహణ బాధ్యతల స్వీకరించుట అమిత ప్రయోజనకరమని సూచించిరి.

ఈ విధముగా పలురకములయిన చర్చల అనంతరము రాఘవ రెడ్డిగారి సూచన మేరకు యీ సదస్సునందు పౌర గ్రంథాలయములే బాలల గ్రంథాలయ నిర్వహణ బాధ్యతల స్వీకరించడము సముచితమని తీర్మానించడము జరిగినది.

## బాలలకు గ్రంథాలయ వసతి — ప్రత్యేక విభాగములు — ప్రత్యేక గ్రంథాలు:

బాలల గ్రంథాలయములను జిల్లా కేంద్ర పౌర గ్రంథాలయములోని ఒక భాగముగా గుర్తించ వలెనా? లేక ఒక ప్రత్యేక భవనమున యీ బాలల గ్రంథాలయము లుండవలెనా? అను విషయముపై గూడ తరచుగా పలు గ్రంథాలయ సమావేశములలో చర్చలు జరుగు చుండినవి. గ్రంథాలయముల స్థాపనలో అభివృద్ధిని సాధించిన అమెరికా, ఇంగ్లాండు మున్నగు దేశములందు బాలల గ్రంథాలయములు ఒక ప్రత్యేక విభాగముగా పౌర గ్రంథాలయములం దున్నవి. రష్యా మరియు కొన్ని దేశములందు బాలలకు సంబంధించిన కొన్ని ప్రత్యేక గ్రంథాలయములు కూడ లేక పోలేదు. మన రాష్ట్రము లోని పెక్కు జిల్లా కేంద్ర గ్రంథాలయ భవనములు అద్దె భవనములే. ఆ భవనములలో తగిన స్థలము లేనందు వలన బాలల గ్రంథాలయములు ప్రత్యేక భవనములం దుండవలయునన్నచో వాని కొరకు ప్రత్యేకముగా భవనములను అద్దెకు తీసికొనవలసి వచ్చును. ఆర్థికముగా వెనుకబడిన మన రాష్ట్రము యీ విధముగా బాలల గ్రంథాలయ స్థాపనకు ప్రత్యేక భవనములను అద్దెకు తీసుకొను స్థితిలో లేనందువలన, చాలావరకు బాలల గ్రంథాలయములు జిల్లా కేంద్ర మరియు శాఖా గ్రంథాలయ భవనములలో భాగములుగా వున్నవి.

జిల్లా కేంద్ర పౌర గ్రంథాలయములలో నున్న బాలల గ్రంథాలయ ములు బాలలకు తగినంత వసతిని కలిగి యుండక పోవుటచే ఆంధ్ర రాష్ట్రావతర ణానంతరము పదునొకండు జిల్లా కేంద్రములలో, ప్రత్యేక భవనములలో బాలల గ్రంథాలయములను స్థాపించుటచే బాలలకు, అమిత ప్రయోజనమును కల్పించి నట్లైనది.

## 'బాల్ కంజీ బారి'కి తోడ్పాటు :

1963 – 64 సంవత్సరమున అఖిల భారత బాలల సంక్షేమ సంస్థ (All India Balkangi Bari) వారు పిల్లల సంక్షేమము కొఱకు ఉద్దేశింపబడిన కొన్ని ప్రత్యేక విభాగములను గ్రంథాలయ ములలో ప్రవేశపెట్టవలెనని గ్రంథాలయశాఖ వారిని కోరిరి. ముఖ్యముగా పిల్లలయందు భౌతిక, మానసిక, సత్ప్రవర్తనాభివృద్ధు లను కలుగజేయుట. నీతి సూత్రములను తెలిసికొనునట్లు జేయుట మున్నగు ప్రధానోద్దేశ్యములతో ఈ అఖిల భారత బాలల సంక్షేమ సంస్థ ఢిల్లీలో ఏర్పాటయినది. ఈ సంస్థ ఇతర ముఖ్యోద్దేశ్యములు: 1. సాంఘిక సేవా సదస్సుల నేర్పాటు చేసి అందు బాలల సంక్షేమ నిమిత్తమై ఎటువంటి శ్రద్ధ వహించవలెనో తెలియజేయుట. 2. సంగీ తము, చిత్రలేఖనము, నాటకము మున్నగు లలితకళలను పిల్లలకు నేర్పుట, 3. విరామ సమయములందు బాలలు ఏవిధమైన కార్యకలాప ములలో పాల్గొనవలెనో తెలియజేయుట.

"బాల్ కంజీ బారీ" సంస్థవారు ఈ సూచనలను చేయక మునుపటి నుండియే, మనరాష్ట్రములో బాలలకు సంబంధించిన కొన్ని గ్రంథాలయములయందు ఈ కార్యకలాపములు కొంతవరకు అమ లులో వుండినవి. ఉదా:— ఏలూరు, చిత్తూరు మున్నగు జిల్లా కేంద్ర గ్రంథాలయములయందలి బాలల విభాగములు.

## గ్రంథాలయములలో యువకులకు సౌకర్యములు :

1955 లో ఢిల్లీయందు జరిగిన యునెస్కో వారి "ఆసియాలో పౌర గ్రంథాలయాలు" అను సదస్సునందు బాలల గ్రంథాలయము లందు బాలలకువలె యువకులకు కూడ, తగిన సౌకర్యములను కలుగజేయు బాధ్యత పౌర గ్రంథాలయముల దేనని తీర్మానించడము జరిగినది. యునెస్కో వారు తరచుగా ఈ అభిప్రాయమునే ప్రకటించుచుండిరి. ప్రపంచములోని గ్రంథాలయ నిపుణులు ఇదే అభిప్రాయము కలిగియుండి గ్రంథాలయ సదస్సులలో తెలుపుచుండిరి. ఈ తీర్మానాని కనుగుణముగా ఆంధ్ర రాష్ట్రావతరణము తరువాత కొన్ని జిల్లా కేంద్ర గ్రంథాలయములందు యువకులకు కావలసిన సౌకర్యములను కొంతవరకు కలుగజేయడము జరిగినది. అనువైన స్థలమున్నచోట కొన్ని జిల్లా కేంద్ర గ్రంథాలయములందు యువకులకు ప్రత్యేక సౌకర్యములను ఏర్పాటుచేసిరి. స్థలము చాలని కొన్ని జిల్లా కేంద్రగ్రంథాలయములందు యువకులకు సంబంధించిన పాఠ్యపుస్తకములు, తదితర ప్రయోజనకర పుస్తకములను ప్రత్యేకించబడిన 'స్టాక్ రూమ్' (Stack Room) లలో పెట్టడము జరిగినది. కొన్ని శాఖాగ్రంథాలయములందు కూడా యువకులకు ఇటువంటి సేవ చేయడము జరిగినది.

రాష్ట్రములోని రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమున యువకులకు ముఖ్యముగా కళాశాలల, విశ్వవిద్యాలయ విద్యార్థులకు ప్రత్యేక విభాగము నేర్పాటుచేసిరి. ఈ విభాగము ఉదయం 8 గం॥ నుండి రాత్రి 12 గం॥ వరకు మొత్తము దినమునకు 16 గంటలు పని చేయుచున్నది. దీనివలన నగరములోని కళాశాలల, విశ్వవిద్యాలయ విద్యార్థులకు, ముఖ్యముగా పాఠ్యపుస్తకములను కొనలేని స్థితిలో నున్నటువంటి పేద విద్యార్థులకు అమిత ప్రయోజనము చేకూరుచున్నది. గుంటూరు, వరంగల్లు, తిరుపతి మున్నగు పట్టణముల

లోని ప్రాంతీయ పౌర గ్రంథాలయములందు యువకులకు సంబంధించిన వివిధరకములయిన పాఠ్య, తదితర పుస్తకములుండుటచే ఈ ప్రాంతములలోని కళాశాలల, విశ్వవిద్యాలయముల విద్యార్థులు ముఖ్యముగా పేదవిద్యార్థులు మిగుల ప్రయోజనము పొందుచున్నారు. ఈ విశ్వవిద్యాలయములు నిర్వహించు పరీక్షలకు ప్రయివేటుగా కూర్చొనువారికి ఈ పాఠ్యపుస్తకములు మిగుల ఉపయోగపడుచున్నవి. వారికే గాక, correspondence course ద్వారా విద్య నభ్యసించువారికి కూడా ఈ ప్రాంతీయ గ్రంథాలయములందు పాఠ్య పుస్తకములుండుట సర్వదా ప్రయోజనకరమని చెప్పక తప్పదు.

ప్రాంతీయ పౌర గ్రంథాలయ గ్రంథపాలకులు వారి గ్రంథాలయములకు కానలసిన పుస్తకములను కొనుగోలు చేయునపుడు సాధారణముగా ఆ ప్రాంత విశ్వవిద్యాలయ, కళాశాలల గ్రంథపాలకులతో చర్చించి, ఆ గ్రంథాలయములలో లేని పాఠ్యపుస్తకములను కొని, ప్రాంతీయ గ్రంథాలయములయందుంచుచుండిరి. ఈ విధముగా పేద విద్యార్థుల విద్యాభ్యాసమునకు పౌర గ్రంథాలయ గ్రంథపాలకులు మిగుల సేవ చేసిరనుట అతిశయోక్తి కాదు.

ఆంధ్రరాష్ట్రము, ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన నాటినుండి బాలల గ్రంథాలయ స్థాపనాభివృద్ధులు చాలా సక్రమముగా జరిగినవని చెప్పక తప్పదు.

ప్రభుత్వము ఈ గ్రంథాలయాభివృద్ధికి తగినంత గ్రాంట్లను మంజూరు చేయనప్పటికి, లోకల్ లైబ్రరీ అథారిటీవారికి తగినంత ఆర్థిక స్తోమత లేకపోయినప్పటికి వారు బాలల గ్రంథాలయ స్థాపనాభివృద్ధులకు మరియు గ్రంథాలయములలో యువకులకు తగిన వసతులను కలుగజేయుటకు మిగుల కృషి చేసిరి.

ఈ విధముగా గ్రంథపాలకుల మరియు రాఘవరెడ్డిగారి కృషిచేత బాలల గ్రంథాలయముల స్థాపన, యువకుల కొఱకు పాఠ్య పుస్తకముల సేకరణ జరిగినవి. తద్వారా పేదవిద్యార్థుల విద్యాభివృద్ధికి వీరు చేసిన కృషి చిరస్మరణీయము.



# ఆంధ్రప్రదేశ్‌లో సహాయక గ్రంథాలయముల అభివృద్ధి:

## (1—4—1960 నుండి 31-3-1969 వరకు)

ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయముల చట్టము 1960, అమలు లోనికి వచ్చిన నాటినుండి సహాయక గ్రంథాలయముల స్థితి కొంత వరకు చక్కబడినది. ప్రభుత్వము కూడ 1960 సం॥ తరువాత సహాయక గ్రంథాలయముల స్థాపన, మఱియు వాటి అభివృద్ధికై మునుపటి కంటె గ్రాంట్లను ఎక్కువగా మంజూరు చేయుచు, గ్రంథాలయ కార్యకర్తలకు 1960 సం॥నకు మునుపటికన్న అధిక ప్రోత్సాహమును కల్గించుచు వచ్చినది. దీని వలన సహాయక గ్రంథాలయముల స్థితి గతులు కొంతవరకు మెరుగుపడినవి. ఈ గ్రంథాలయములందలి పుస్తక భాండాగారులు కూడ గ్రంథాలయముల అభివృద్ధికి, గ్రంథాలయ సేవకు తగు ఉత్సాహమును, కనబరచిరి. 1—4—1960 ఆంధ్ర ప్రదేశ్ పౌర గ్రంథాలయముల చట్టప్రకారము, లోకల్ లైబ్రరీ అథారిటీలకు సెక్రెటరీలుగా జిల్లా విద్యాశాఖాధికారులు గాక, శిక్షణ పొందిన జిల్లా కేంద్ర గ్రంథాలయాల గ్రంథపాలకు లుండిరి. వీరు తమ జిల్లాల యందు గ్రంథాలయముల అభివృద్ధిపరచు ఆశయముతో పుస్తక వర్గీకరణ, సూచీకరణ, పద్ధతులను సహాయక గ్రంథాలయ పుస్తక భాండాగారులకు వివరించి, వాటిని కొన్ని సహాయక గ్రంథాలయముల యందు ప్రవేశపెట్టునట్లు తోడ్పడిరి. సహాయక గ్రంథాలయములకు అవసరమైన పుస్తకములను కూడ జిల్లా కేంద్ర గ్రంథాలయముల నుండి, శాఖా గ్రంథాలయముల నుండి వీలైనప్పుడు సరఫరా చేయుచు, సహాయక గ్రంథాలయముల అభివృద్ధికి తోడ్పడిరి. 1960 నుండి ప్రతి సంవత్సరము, సహాయక గ్రంథాలయముల సంఖ్య పెరుగుటయేగాక, తగు సౌకర్యము లున్నటువంటి కొన్ని సహాయక

గ్రంథాలయములయందు కొన్ని ఆధునిక పద్ధతులను ప్రవేశపెట్టుటకు కూడ వీలైనది. ఉదా:- వేటపాళెం, ధర్మవరం, అనకాపల్లి, మున్నగు పట్టణములయందలి సహాయక గ్రంథాలయములు.

## సహాయక గ్రంథాలయాలకు అధిక గ్రాంటులు:

గ్రంథాలయాల డిప్యూటీ డైరెక్టరైన రాఘవరెడ్డిగారు గ్రంథాలయ శాఖాధికారులతోను, మంత్రులతోను, సహాయక గ్రంథాలయముల నిర్వహణాభివృద్ధులకు ప్రభుత్వము తగు విధముగా గ్రాంట్లను మంజూరు చేయవలసిన ఆవశ్యకత ఎంతేని కలదని, పలుమార్లు వివరించుచుండిరి. కొంత కాలమునకు ప్రభుత్వముయొక్క ఆర్థికస్థితి కొంతవరకు మెరుగుపడుటచే సహాయక గ్రంథాలయముల అభివృద్ధికి, రాఘవరెడ్డిగారి సూచనమేరకు గ్రాంట్లును, 1965 నుండి ఎక్కువ చేసినది. 1965 సంవత్సరమునకు మునుపు వాటి నిర్వహణకు ప్రభుత్వము సాలీన ఒక లక్ష రూపాయలను మాత్రము మంజూరు చేయుచుండినది. 1965 సం॥ నుండి ప్రభుత్వము యీ గ్రాంటును రెండు లక్షలకు పెంచినది. ఈ గ్రాంటు ప్రోత్సాహకరముగా లేకపోయినప్పటికి, గ్రంథాలయ కార్యకర్తలు కొద్దిపాటిగానైనా గ్రాంటును పెంచినందులకు సంతసించిరి.

## ఆంధ్ర ప్రాంతములో గ్రంథాలయములకు ప్రభుత్వము మంజూరు చేసిన గ్రాంట్ల వివరములు.

| గ్రంథాలయ వివరము | 1965 సం॥నకు మునుపు ప్రభుత్వము ప్రతిసం॥ మంజూరు చేసిన గ్రాంట్ల వివరము. | 1965 సం॥ నుండి ప్రభుత్వము ప్రతి సం॥ మంజూరు చేయవలసిన గ్రాంట్ల వివరము. |
|---|---|---|
| 1. పంచాయతీ గ్రంథాలయమునకు. | రూ. 65/- వరకు | రూ. 100/-వరకు |

| | | |
|---|---|---|
| 2. ప్రయివేటు సంస్థల నిర్వహణలోని గ్రంథాలయమునకు | రూ. 150/- ,, | రూ. 200/- ,, |
| 3. గ్రామ సంఘం గ్రంథాలయమునకు | రూ. 40/- ,, | రూ. 75-/ ,, |
| 4. సహకార గ్రంథాలయమునకు. | రూ. 150/- ,, | రూ. 200/- ,, |

ఈ విధముగా ప్రభుత్వము గ్రాంట్లను పెంచిననాటి నుండి, పైన కనబరచిన గ్రంథాలయముల పుస్తక భాండాగారులు కూడ గ్రంథాలయములను చక్కగా నిర్వహించుటకు ఉత్సాహముతో పూనుకొనిరి.

ప్రభుత్వము సహాయక గ్రంథాలయములకు ధనరూపమున గాక, పుస్తకముల రూపముగా, యిచ్చిన సరిపోవునని కొందరు గ్రంథాలయాభిమానులు సూచించిరి. అందులకు సహాయక గ్రంథాలయముల కార్యకర్తలు ఎక్కువమంది సుముఖతను చూపలేదు.

**సహాయక గ్రంథాలయాలకు మంజూరుచేయబడిన ప్రత్యేక గ్రాంట్లు:**

సహాయక గ్రంథాలయముల నిర్వహణకే గాక వాటియందు అధికసంఖ్యలో వివిధ భాషల పుస్తకములను ప్రవేశపెట్టుటకు మరియు వాటిని అభివృద్ధిపరచుటకు కొన్ని సందర్భములందు ప్రభుత్వము ప్రత్యేక గ్రాంట్లను కూడ మంజూరు చేసినది.

ఈ గ్రాంట్లతో కేవలము తెలుగు, ఇంగ్లీషు పుస్తకములనే గాక యితర భాషల పుస్తకములనుకూడ కొని, గ్రంథాలయ కార్యకర్తలు తగు ప్రోత్సాహమును చూపిరి. ఉదా॥ హైదరాబాదునందలి ఖవాతీన్-ఇ-దక్కన్ గ్రంథాలయము (Khawateen - e - Deccan Library) నకు ఉర్దూ భాషాపుస్తకముల కొనుటకు, 1960 – 61 లో 500/- రూ॥ల ప్రత్యేక గ్రాంటును ప్రభుత్వము మంజూరు చేసినది.

'లుతుఫ్ - యుద్ - దౌల' ప్రాచ్యపరిశోధనాసంస్థ గ్రంథాలయము (LUTUF - UD - DOULA ORIENTAL RESEARCH INSTITUTE LIBRARY) నకు ఉర్దూ పుస్తకములను కొనుటకును, ఉర్దూ లిఖిత ప్రతులను బైండు చేసికొనుటకును 1964 - 65 సం॥లో రాష్ట్రప్రభుత్వము రూ. 6,000/- గ్రాంటును మంజూరు చేసినది.

కొన్ని గ్రంథాలయములు విద్యార్థులకు సంబంధించిన పుస్తకములను కొనుగోలుచేసి, ముఖ్యముగా బీద విద్యార్థులకు సహాయకరముగా నుండినవి. అటువంటి గ్రంథాలయములలో పేర్కొనదగినది హైదరాబాదు పాఠ్యపుస్తకముల అరువిచ్చు గ్రంథాలయము.

ఈ గ్రంథాలయమునకు 1964 - 65 సం॥ పుస్తకముల కొనుగోలుకు 5000/- రూ. ప్రత్యేకగ్రాంటు మంజూరు చేయబడినది.

రాష్ట్రమునందు సాహిత్య సంస్థలు కొన్ని గొప్ప గ్రంథాలయసేవ చేయుచుండినవి. ఈ సంస్థలయందు సాహిత్యాభిమానులు, విద్యావేత్తలు, పండితులు సభ్యులుగా నుండిరి. ఉదా॥ హైదరాబాదు లిటరరీ సొసైటీ. ఈ సొసైటీకి రాష్ట్రప్రభుత్వము 1966-67 సం॥ పుస్తకముల కొనుగోలు నిమిత్తము ప్రత్యేకగ్రాంటు క్రింద 5000/- రూపాయలను మంజూరు చేసినది.

కొన్ని సహాయక గ్రంథాలయముల కార్యకర్తలు, గ్రంథాలయాభిమానులు ప్రజలకు తగు విధముగా గ్రంథాలయసేవ చేయుటకు ముందంజవేసిరి. అట్టి సహాయక గ్రంథాలయముల అభివృద్ధికి కూడ ప్రత్యేక గ్రాంట్లను రాష్ట్రప్రభుత్వము మంజూరు చేసినది. ఉదా॥ తూర్పుగోదావరిజిల్లాలోని తాళ్ళరేవునందలి డా॥ అంబేద్కర్ స్మారక గ్రంథాలయము (1000/-రూ.), హైదరాబాదునందలి లాల్ బహదూర్ స్మారకగ్రంథాలయము (1000/- రూ.), హైదరాబాదు

నందలి శ్రీకృష్ణదేవరాయ ఆంధ్రభాషా నిలయము (5000/- రూ.) ప్రభుత్వము నుండి ప్రత్యేక గ్రాంట్లుగా 1967-68 లో పొందినవి.

కొన్ని సహాయక గ్రంథాలయ కార్యకర్తలు గ్రంథాలయములకు పాఠకులకు తగినటువంటి పుస్తకములను, ప్రత్యేకముగా పిల్లలకు ప్రయోజనకరముగా నుండు పుస్తకములను కొనుగోలు చేయవలయునను ఉత్సాహమును కల్గియుండిరి. అట్టి సహాయక గ్రంథాలయములు కూడ 1968 - 69 లో ప్రభుత్వము నుండి ప్రత్యేక గ్రాంట్లను పొందినవి.

| ఉదా॥ గ్రంథాలయము పేరు. | పొందిన గ్రాంటు మొత్తం. |
|---|---|
| 1. హైదరాబాదులోని మలక్ పేట కాలనీ నివాస స్థల సమాఖ్య గ్రంథాలయము | రూ. 2000-00 |
| 2. ఆంధ్ర గ్రంథాలయము, హైదరాబాదు | రూ. 5000-00 |
| 3. ఎడ్వర్డు కారోనేషన్ రీడింగురూము మరియు సరస్వతీ నిలయము, ధర్మవరం, అనంతపురం జిల్లా | రూ. 2000-00 |
| 4. శ్రీకృష్ణదేవరాయ ఆంధ్రభాషానిలయము. హైదరాబాదు | రూ. 5000-00 |
| 5. డా॥ అంబేద్కర్ స్మారక గ్రంథాలయము, తూర్పుగోదావరిజిల్లా | రూ. 1000-00 |

ఈ విధముగా 1960 సం॥ నుండి రాష్ట్ర ప్రభుత్వము సహాయక గ్రంథాలయములకు సాధారణముగా ప్రతి సంవత్సరము మంజూరు చేయు గ్రాంట్లును మాత్రమే గాక, పలు గ్రంథాలయములకు సందర్భానుసారములను బట్టి ప్రత్యేక గ్రాంట్లను కేటాయించుచుండినది.

హైదరీగ ష్తీ కుతుబ్ ఖాన (Hyderi Circulating Library), సయీదియా గ్రంథాలయము (Sayeedia Library) మొదలగు గ్రంథాలయాలు చక్కని గ్రంథాలయ సేవను అందచేసినవి. శ్రీ అహ్మానుల్లా ఖాదరీ, మున్నగువారు గ్రంథాలయాల అభివృద్ధికి గణనీయమైన సేవ చేసినారు. భారత గుణవర్ధకసంస్థ గ్రంథాలయము, మరాఠీ గ్రంథ సంగ్రహాలయ గ్రంథాలయము ఇతర భాషల లోనేగాక, మరాఠీ భాషలో పుస్తకములను తగుసంఖ్యలో సేకరించి, చదువరులను ప్రోత్సహించి తగు విధముగా గ్రంథాలయ సేవను అందజేసినవి. శ్రీ పి. యమ్. జోషి మున్నగువారు గణనీయమైన గ్రంథాలయసేవ చేసిరి.

## కేంద్ర ప్రభుత్వము మంజూరు చేసిన గ్రాంట్లు:

రాష్ట్ర ప్రభుత్వము సహాయక గ్రంథాలయములకు ప్రత్యేక గ్రాంట్లను మంజూరు చేయునట్లుగానే, కేంద్ర ప్రభుత్వము కూడా గ్రంథాలయముల అభివృద్ధికి ప్రత్యేక గ్రాంట్లను మంజూరు చేయవలయునని, గ్రంథాలయ కార్యకర్తలు రాష్ట్ర ప్రభుత్వము ద్వారా దరఖాస్తులను పెట్టుకొనెడివారు. కేంద్ర ప్రభుత్వము వాటిని పరిశీలించి ప్రత్యేక గ్రాంట్ల క్రింద కొన్ని సహాయక గ్రంథాలయములకు కొంత మొత్తమును అప్పుడప్పుడు అందించుచుండినది. ఉదా॥ కేంద్ర ప్రభుత్వమునుండి ప్రత్యేక గ్రాంట్లను పొందిన సహాయక గ్రంథాలయములలో ఈ క్రింది వాటిని పేర్కొనవచ్చును.

1. వెలదండ్ల హనుమంతరాయ గ్రంథాలయము 1965–66 సం॥ రూ. 8040/-
2. భారత్ ఉన్నత పాఠశాల 1965–66 సం॥ రూ. 2, 500/-

## లోకల్ లైబ్రరీ అథారిటీలు సహాయక గ్రంథాలయాలకు చేసిన సహాయము:

కొన్ని సహాయక గ్రంథాలయములు ఆర్థికముగా వెనుకబడుటచే వాటి నిర్వాహకులు వాటిని మూసివేయుటకు సంకల్పించిరి. గ్రంథాల

యాల డిప్యూటీ డైరెక్టరుగారు గ్రంథాలయములను మూసివేయుటకు అంగీకరించలేదు. అట్టి పరిస్థితులలో లోకల్ లైబ్రరీ అథారిటీ వారు ముందంజవేసి, 1960 సం॥నకు పూర్వమువలె ఆర్థికముగా వెనుకబడిన సహాయక గ్రంథాలయములను తమ ఆధీనములోనికి తీసికొనుటకు అంగీకరించిరి. ఉదా:-1961-62 సం॥ 4 సహాయక గ్రంథాలయములను, 1963-64 సం॥ 9 సహాయక గ్రంథాలయములను, 1964-65 సం॥ 13 సహాయక గ్రంథాలయములను, 1967-68 సం॥ 6 సహాయక గ్రంథాలయములను, 1968-69 సం॥ 2 సహాయక గ్రంథాలయములను తమ ఆధీనములోనికి తీసికొన్నవి.

ఈ విధముగా ఆర్థికముగా వెనుకబడి నిర్వాహణ కష్టతరమై, మూతపడు స్థితిలో నుండినటువంటి సహాయక గ్రంథాలయములను లోకల్ లైబ్రరీ అథారిటీలు తమ ఆధీనము లోనికి తీసికొని తమ నిధులతో యీ గ్రంథాలయములను కూడ నిర్వహించుచు వాటి అభివృద్ధికి మిగుల కృషిచేసి మన్ననలను పొందినవి.

ఆర్థికముగా వెనుకబడి నిర్వహణాసామర్థ్యము కుంటుపడిన సహాయక గ్రంథాలయములను లోకల్ లైబ్రరీ అథారిటీవారు తమ ఆధీనములోనికి తీసికొనుచుండుటయే గాక, సహాయక గ్రంథాలయములు చక్కగా నిర్వహించబడు ప్రాంతములందు లోకల్ లైబ్రరీ అథారిటీవారు వేరుగా గ్రంథాలయములను స్థాపించ నవసరము లేదని భావించిరి.

కొన్ని లోకల్ లైబ్రరీ అథారిటీలు తమ నిధులనుండి కూడ సహాయక గ్రంథాలయములకు కొంతవరకు గ్రాంట్లను మంజూరు చేయుచుండినవి. ఉదా:- గుంటూరు లోకల్ లైబ్రరీ అథారిటీ వేటపాళెంలోని సారస్వత నికేతన్ అను సహాయక గ్రంథాలయమునకు, అనంతపురం లోకల్ లైబ్రరీ అథారిటీ, ధర్మవరం లోని ఎడ్వర్డ్ కారొనేషన్ రీడింగ్ రూమ్ అను సహాయక గ్రంథా

లయమునకు తమ నిధుల నుండి గ్రాంట్లను మంజూరు చేసినవి. హైదరాబాదు నగర లోకల్ లైబ్రరీ అథారిటీ కూడ నగరములోని పలు సహాయక గ్రంథాలయములకు గ్రాంట్లను అందించి, వాటి అభివృద్ధికి మిగుల తోడ్పడినది. ఉదా:— 1967–68 సం॥ ఈ నగర లోకల్ లైబ్రరీ అథారిటీ, నగరములోని సహాయక గ్రంథాలయముల అభివృద్ధికి రూ. 70,000 కు పైగా గ్రాంటు మంజూరు చేసినది. 1969–70 సం॥లో కూడ రూ. 68,000 వరకు మంజూరు చేసి సహాయపడినది.

ఈ విధముగా రాష్ట్రములోని కొన్ని లోకల్ లైబ్రరీ అథారిటీలు తమ ఆధీనములోని గ్రంథాలయముల అభివృద్ధికేగాక, సహాయక గ్రంథాలయములకు కూడ చేయూత నిచ్చి, తగు గ్రాంట్లను తమ నిధులనుండి మంజూరుచేసి, వాటి అభివృద్ధికి ఇప్పటికిన్ని తోడ్పడుచున్నవి.

## సహాయక గ్రంథాలయాలలో పాఠకుల నుండి వసూలుచేయు చందా పద్ధతికి స్వస్తి:

కొందరు గ్రంథాలయ కార్యకర్తలు చందాలను వసూలుచేసి కొన్ని గ్రంథాలయములను నిర్వహించు చుండిరి. ఇవి కొందరు వ్యక్తుల సహాయముతో నడుపబడే గ్రంథాలయములు. చందాదారులు మాత్రము యిందు సభ్యులుగా నుందురు. 1948 మదరాసు పౌర గ్రంథాలయాల చట్టము అమలులోనికి రాక మునుపటి నుండి యీ విధమైన సహాయక గ్రంథాలయములు రాష్ట్రమునందు నిర్వహింపబడుచున్నవి. ఇట్టి గ్రంథాలయములందు ప్రజల కందరికి ఉచిత ప్రవేశము లేకుండినది. డిప్యూటీ డైరెక్టరు గారైన రాఘవ రెడ్డిగారు ఈ గ్రంథాలయములందు అందరికి ఉచిత ప్రవేశము కల్పించవలెనని, పౌర గ్రంథాలయముల వలెనే చందాలను వసూలు చేయక నిర్వహింప బడవలెనని మిగుల ప్రయత్నించిరి. కాని ప్రభు

త్వము ఆర్థికముగా వెనుకబడియుండుటచేత, యీ గ్రంథాలయము లకు తగు విధముగా గ్రాంట్లను మంజూరు చేయలేక పోవుటచేత, గ్రంథాలయ నిర్వాహకులు కొందరు మాత్రము వీటియందు అందరికి ఉచిత ప్రవేశమును కల్పించక పోయిరి. అయినప్పటికి రాఘవరెడ్డిగారి సలహా మేరకు పెక్కు సహాయక గ్రంథాలయముల నిర్వాహకులు ఉదారముగా ఉచిత ప్రవేశము కల్పించిరి. నేటికి కొన్ని సహాయక గ్రంథాలయములు మాత్రమే చందా వసూలు చేయుచున్నవి. కాని అవి నామ మాత్రమే. ఏనాటికైనా యీ పద్ధతిని రద్దుచేయ వలసిన అవసరము ఎంతేని కలదు.

## స్రకమంగా నిర్వహింపబడు సహాయక గ్రంథాలయాలను లోకల్ లైబ్రరీ అథారిటీలు తమ యాధీనములోనికి తీసికొనరాదు:

పౌర గ్రంథాలయాలకు, సహాయక గ్రంథాలయాలకు మధ్య సన్నిహిత సంబంధ ముండవలెనని, ఈ గ్రంథాలయాల నిర్వహణ పద్ధతులలో ఏకత్వము సాధించ వలెనని, పౌర గ్రంథాలయములలో అందరికి ఉచిత ప్రవేశము కల్పించి, ఉచిత గ్రంథాలయ సేవ చేసినటుల సహాయక గ్రంథాలయములందు కూడ సభ్యులకే గాక, పౌరులందరికి ఉచిత ప్రవేశమును కల్పించి, సహాయక గ్రంథాలయములకు జిల్లా గ్రంథాలయ సంస్థ గ్రంథాలయములతో సమానముగా ఆర్థిక సహాయ మును అందచేసి, సహాయక గ్రంథాలయాల అభివృద్ధికి ప్రభుత్వము తోడ్పడవలెనని రాఘవరెడ్డిగారి సంకల్పము. వీరి అభిమతమును దృష్టి యందుంచుకొని ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ చట్టము సెక్షన్ 2. (9) (డి) నందు ఏ గ్రంథాలయము నైనను పౌర గ్రంథా లయముగా ప్రకటించ వచ్చునని స్పష్ట పరచడమైనది. ఈ చట్టము రాక పూర్వము పెక్కు సంవత్సరముల నుండి కొన్ని సహాయక గ్రంథాలయములు ప్రశంసనీయమైన గ్రంథాలయ సేవ చేయుచూ

వచ్చుచుండినవి. ఈ గ్రంథాలయము లందు పెక్కు ప్రాచీన లిఖిత ప్రతులు కూడ ఉండినవి. ప్రభుత్వము తగు గ్రాంట్లను మంజూరు చేయలేక పోయినప్పటికి, ఈ గ్రంథాలయములు పలు సంవత్సరములుగా రాష్ట్రమునందు గొప్ప గ్రంథాలయ సేవ జేసినవి. ఈ నాటికిని అటువంటి గ్రంథాలయములు ప్రతి జిల్లాయందును గలవు.

| ఉదా:- గ్రంథాలయము పేరు | స్థాపింపబడిన సంవత్సరము. |
|---|---|
| 1. గౌతమీ గ్రంథాలయము, రాజమండ్రి | 1898 సం॥ |
| 2. కె. ఆర్. వి. కె. గ్రంథాలయము, కాకినాడ | 1895 సం॥ |
| 3. ఎడ్వర్డ్ పత్రికా విభాగము మఱియు గ్రంథాలయము, కోయిలకుంట్ల | 1911 సం॥ |




శ్రీ కృష్ణదేవరాయ ఆంధ్ర భాషానిలయమును సందర్శించి వెళ్ళుచున్న శ్రీ కె. రాఘవరెడ్డిగారు.

4. శ్రీకృష్ణదేవరాయ ఆంధ్రభాషానిలయము,
హైదరాబాదు 1901 సం॥

5. రాజరాజనరేంద్ర ఆంధ్రభాషానిలయము,
హనుమకొండ 1904 సం॥

6. వర్ధమాన సమాజము వారిచే స్థాపించబడిన
తిక్కన గ్రంథాలయము, నెల్లూరు 1911 సం॥

ఇటువంటి గ్రంథాలయములను జిల్లా గ్రంథాలయ సంస్థలు తమ ఆధీనములోనికి తీసికొనకూడదని రాఘవరెడ్డిగారి అభిప్రాయము.

మదరాసు పౌరగ్రంథాలయ చట్టము 1948, అమలులోనికి రాక పూర్వము, స్థాపించబడి ఈనాటికిని చక్కగా నిర్వహింపబడు సహాయక గ్రంథాలయములను, ఆ గ్రంథాలయముల నిర్వాహకులకు సమ్మతమైనచో మాత్రమే చట్టము ప్రకారము పౌర గ్రంథాలయములుగా ప్రకటించవలెనని, డిప్యూటీ డైరెక్టరుగారు వివరించెడివారు. ఉదా॥ 1898 లో స్థాపించబడిన గౌతమీ గ్రంథాలయ నిర్వాహకులు తాము గ్రంథాలయమును నడుపు స్థితిలో లేమని, కాన ఈ గ్రంథాలయ నిర్వహణా బాధ్యతలను ప్రభుత్వము స్వీకరించవలెనని విన్నపము చేసికొనగా, ప్రభుత్వము గౌతమీ గ్రంథాలయ నిర్వహణా బాధ్యతలను చేపట్టినది.

ఈ విధముగా ప్రతి సం॥ సహాయక గ్రంథాలయముల నిర్వాహకులకు ఆర్థిక పరిస్థితి కుంటుపడినపుడు, ప్రభుత్వము అనుమతి నిచ్చినపుడు, ఆయా గ్రంథాలయములను మాత్రము లోకల్ లైబ్రరీ అథారిటీలు తమ యాజమాన్యములోనికి తీసికొనుచుండినవి.

## సహాయక గ్రంథాలయాల గ్రాంట్-ఇన్-ఎయిడ్ కోడ్ ప్రచురణలో జాప్యము

కొన్ని సహాయక గ్రంథాలయములు పౌర గ్రంథాలయముల చట్టము అమలులోనికి రాకమునుపటినుండి పెక్కు సంవత్సరములుగా

ప్రశంసనీయమైన గ్రంథాలయ సేవచేయుచు, మన్ననలను పొంది తెలుగునాడునందు ఈనాటికిని ఆదర్శంగా విజ్ఞాన నిలయములై వెలుగొందుచున్నవి. రాఘవరెడ్డిగారు రూపొందించిన గ్రాంట్ - యిన్ - ఎయిడ్ కోడ్‌ను ముద్రించి సహాయక గ్రంథాలయములకు మరింత ప్రయోజనకరముగా నుండునట్లు చేయవలెనని గ్రంథాలయ కార్యకర్తలనేకులుకోరిరి. రాఘవరెడ్డిగారు డైరెక్టరుగానున్నపుడు గ్రాంట్-ఇన్-ఎయిడ్ కోడ్ (డ్రాఫ్టు) ను రూపొందించి ప్రభుత్వమునకు పంపిరి. ఆంధ్రప్రదేశ్ పౌరగ్రంథాలయ చట్టమునందు కూడ గ్రాంట్-యిన్-ఎయిడ్ కోడ్‌ను అమలు పరచవలెనని తెలియ జేయబడినది. ఈనాటికైనను తగునిధుల కేటాయించి ఈ గ్రాంట్-యిన్-ఎయిడ్ కోడ్‌ను అమలుపరచుటకు పూనుకొన్నచో సహాయక గ్రంథాలయములు అభివృద్ధి చెందగలవు.

## సహాయక గ్రంథాలయాలు – ఉత్సాహవంతులైన కార్యకర్తలు:-

తెలుగునాడునందు మొలకెత్తిన గ్రంథాలయోద్యమమునకు సారథ్యమును వహించిన గ్రంథాలయ కార్యకర్తలు, గ్రంథాలయాభిమానులు పెక్కురు కలరు. వీరిలో ఎందరో తమ జీవితములనే గ్రంథాలయోద్యమ సేవ కంకితము చేసినవారు కలరు. గాడిచెర్ల హరిసర్వోత్తమరావు, కొండా వేంకటరంగారెడ్డి, మాడపాటి హనుమంతరావు, సురవరం ప్రతాపరెడ్డి, వావిలాల గోపాలకృష్ణయ్య, అయ్యంకి వేంకటరమణయ్య, మామిడి భోజిరెడ్డి, కోదాటి నారాయణరావు, పాతూరి నాగభూషణం, ఇంకను అనేకులు ఎన్నో సంవత్సరములుగా గ్రామీణ ప్రాంతములలో గ్రంథాలయాల అభివృద్ధికి అమూల్యమైన సేవచేసిరి.

ప్రభుత్వము నుండి తగినంత నిధులను పొంద లేకున్నప్పటికి, మిగుల ఉత్సాహముతో గొప్పగా గ్రంథాలయ సేవచేసిన త్యాగశీలురు ప్రతి జిల్లాయందును లేకపోలేదు. ఉదా:- (1) శ్రీ శ్రీనివాస

రావు, ఎస్. ఎస్. ఆర్. గ్రంథాలయము, మహబూబ్‌నగర్ జిల్లా. (2) శ్రీ బత్తుల వేంకట్రామరెడ్డి, శారదామిత్ర గ్రంథాలయము, అనంతపురంజిల్లా. (3) శ్రీ ఎ. ఆర్. ఎస్. హరినాథ్, ఎడ్వర్డు కారనేషన్ రీడింగు రూము మరియు సరస్వతీ నిలయము. ధర్మవరం. (4) శ్రీ అడుసుమిల్లి శ్రీనివాసరావు, సరస్వతీ నికేతనము, వేట పాళెం, (5) శ్రీ కె. ఎల్. నరసింహారావు, సహకార గ్రంథాలయము, రేపాల, నల్గొండజిల్లా.

ఈ క్రింది వారు కూడ గొప్పసేవ చేసియున్నారు. డాక్టర్ స్వామి, [ఆదిలాబాదు]; నారాయణశాస్త్రి, [అనంతపురం]; మహీధర జగన్మోహనరావు, [తూర్పుగోదావరి;] భూపతిరాజు, తిరుపతిరాజు, [పశ్చిమగోదావరి]; బి. వేంకట్రామరావు; [కరీం నగర్]; పి. వి. రంగారావు, రావి నారాయణరెడ్డి [నల్గొండ]; వాసుదేవరెడ్డి, కాళోజీ నారాయణరావు, [వరంగల్]; లక్ష్మయ్య గుప్త, నాగభూషణాచార్యులు, వై. వి. నర్సిరెడ్డి; శరణు రామస్వామి చౌదరి, [గుంటూరు]; కలపాక సూర్యప్రకాశరావు, [కృష్ణ]; హరి పురం వేంకట్రామయ్య, [మెదక్]; రుక్మారెడ్డి, [నిజామాబాదు]; ఎస్. చెన్నారెడ్డి [హైదరాబాదు జిల్లా]; మల్లికార్జునస్వామి. [శ్రీకా కుళం]; ఈ విధముగా పలు జిల్లాలలో గ్రంథాలయ సేవజేసిన వారెం దరో ఉండిరి.

ఆంధ్ర దేశములో భాషా ఉద్యమమునకు, రాజకీయ ఉద్యమము నకు సహాయక గ్రంథాలయములు కీలక పాత్ర వహించినవి. ప్రభు త్వము ఈ సహాయక గ్రంథాలయములు మునుపటివలె సేవా విధా నము నలవరచుకొనుటకు తగు ప్రోత్సాహమును కల్పించి, గ్రంథా లయములు ఆధునిక పద్ధతులలో నిర్వహింప బడుటకు ఇప్పటికంటె ఎక్కువ ఆర్థిక సహాయము అందజేయ వలసిన అవసరము కలదు.



# ఆంధ్రప్రదేశ్‌లో
# (ఎ) వయోజన విద్యా కార్యక్రమములకు పౌర గ్రంథాలయాల సహకారము

ఆంధ్ర గ్రంథాలయ సంఘ సభ్యులు వయోజన విద్యావ్యాప్తికి కొన్ని సంవత్సరములుగా ప్రాముఖ్యత నిచ్చుచుండిరి. ఆంధ్ర ప్రాంతమునందు వయోజన విద్యావ్యాప్తికి ఎక్కువగా కృషి సల్పుచుండిన వారిలో శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావు అగ్రగణ్యులు. ఆంధ్ర ప్రాంతమునందు వయోజన విద్యావ్యాప్తికై జరుగుచుండిన కృషిని, రాఘవరెడ్డిగారు మదరాసు క్రైస్తవ కళాశాలయందు విద్య నభ్యసించు కాలమున పత్రికల ద్వారా గ్రహించుచుండిరి. 1937 సంవత్సరములో భారతీయ మంత్రివర్గము గొప్ప పట్టుదలతో వయోజన విద్యావ్యాప్తికి కృషి సల్పినది. డాక్టర్ ఎస్. ఆర్. రంగనాథన్, అవినాశిలింగం చెట్టియార్ మున్నగు విద్యావేత్తలు వయోజన విద్య గురించి మదరాసునందు గొప్ప ప్రచార, ప్రసంగముల నిచ్చుచుండిరి. ఇటువంటి ప్రసంగములను రాఘవరెడ్డిగారు శ్రద్ధతో వినుచుండెడివారు. అప్పటినుండి రాఘవరెడ్డిగారికి వయోజన విద్యావ్యాప్తికి కృషి చేయవలెనని ఆసక్తి యుండెడిది.

### పాఠశాలల తనిఖీ అధికారిగా గ్రామ ప్రాంతాలలో రాఘవరెడ్డిగారి వయోజన విద్యా ప్రచారము:

1941 సంవత్సరములో ప్రాథమిక పాఠశాలల తనిఖీ అధికారిగా నియమితులైన రాఘవరెడ్డిగారు పాఠశాలలకు తనిఖీకి వెళ్ళినపుడు సాయం వేళలయందు గ్రామములలో వయోజన విద్యావ్యాప్తిని గురించి, గ్రంథాలయముల అభివృద్ధిని గురించి కూడ ఉప

న్యాసముల నిచ్చెడివారు. గ్రామీణ ప్రాంతములలోని పౌర గ్రంథాలయములలో, వయోజన విద్యాకేంద్రములలో వయోజన విద్యకు సంబంధించిన పుస్తకములను తగు సంఖ్యలో ప్రవేశ పెట్టవలసిన ఆవశ్యకతను గురించి ఉపాధ్యాయులకు వివరించుచుండిరి.

కొన్ని గ్రంథాలయములలో ఉపన్యాసముల అనంతరము వయోజన విద్యయొక్క ఆవశ్యకతను గురించి చర్చలు జరిగేవి. ఈ చర్చలలో కొందరు ఉపాధ్యాయులు, గ్రామస్థులు దేశము ఆర్థికముగా వెనుకబడి యున్నదని, ఆర్థికముగా ముందంజ వేయుటకు తగు చర్యల గైకొనవలెనని. వయోజన విద్యకు బదులు ప్రాథమిక విద్యకే ఎక్కువగా ప్రాముఖ్యత నిచ్చుట సమంజసమని తెలియజేయుచుండిరి. ఈ అభిప్రాయ మేమాత్రము సబబు కాదని రాఘవరెడ్డిగారు తెలియజేయుచు వయోజనులను, విద్యావంతుల జేసిన వారు, తమ పిల్లలకు విద్య గరపుదురనియు, వయోజన విద్యను నిర్లక్ష్యము చేయరాదని, పిల్లల విద్యాభివృద్ధులకు యిప్పటికన్న ఎక్కువ కృషి సల్పవలెనని, ప్రాథమిక విద్యను నిర్బంధ విద్యగా ప్రవేశ పెట్టడము కూడ ఎంతో అవసరమని రాఘవరెడ్డిగారు వివరించుచుండిరి.

''విద్యావంతుడయిన వయోజనుడు ఆర్థికముగాను, సాంఘికముగాను ముందుకు వెళ్ళగలడు. వయోజనుడు విద్యావంతుడయినచో పరిశ్రమల నభివృద్ధి పరచుకొనుచు సత్పౌరుడు కాగలడు. ఉదాహరణకు, రష్యా దేశములో నిరక్షరాస్యత నిర్మూలింపబడిననాడే దేశము అభివృద్ధి చెందగలదని ఉద్దేశించి, అందులకై హెచ్చు మొత్తములను వెచ్చించి నిరక్షరాస్యతను నిర్మూలించినారు. ఆ కారణముననే ఆ దేశము అన్నివిధముల అభివృద్ధి చెందియున్నద''ని రాఘవరెడ్డిగారు ఉపాధ్యాయులకు, గ్రామీణ ప్రజలకు సమావేశములలో తెలియజేయుచుండిరి. ఈ అభిప్రాయముతో పెక్కండ్రు ఉపాధ్యాయులు,

గ్రామస్థులు కూడ ఏకీభవించి, వయోజన విద్యావ్యాప్తికి గొప్ప కృషి చేయుటకు పెక్కు గ్రామములలో పూనుకొన్నారు.

అవిభక్త మదరాసు రాష్ట్రమునందు చదువురాని వయోజనుల కొఱకు, కొన్ని రాత్రి పాఠశాలలు 1950 సంవత్సరమునకు పూర్వము కూడ నడుపబడు చుండెడివి. కాని, వీటి నిర్వహణకు తగిన నిధులు లేని కారణమున వీటిని మూసివేయ తలంచు చుండిరి. ఇవి వయోజనులకు ప్రయోజనకరముగా నుండుటచే వీటిని మూసివేయరాదని, వీటియందు వయోజనులకు ప్రయోజనకరమయిన పుస్తకములను కూడ ఉంచవలెనని రాఘవరెడ్డిగారు వాటి నిర్వాహకులకు వివరించు చుండిరి. 1953 సంవత్సరమునకు పూర్వము ప్రాథమిక పాఠశాలలు, సహాయక గ్రంథాలయాలు వయోజన విద్యావ్యాప్తికి కొంతవరకు తోడ్పడినవి. 1953 సంవత్సరమునకు తరువాత లోకల్ లైబ్రరీ అథారిటీలు కూడ వయోజన విద్యావ్యాప్తికి మిగుల తోడ్పడినవి.

## తెలంగాణ ప్రాంతములో ఆంధ్రప్రదేశ్ రాష్ట్రావతరణకు పూర్వము వయోజన విద్యా కార్యక్రమములు:

ఆంధ్ర ప్రాంతమునందు వలె తెలంగాణ ప్రాంతమునందు గూడ వయోజన విద్యావ్యాప్తికి 1950 సంవత్సరమునకు పూర్వము అనేక ప్రయత్నములు జరిగినవి. ప్రభుత్వము తగు ఆర్థిక సహాయము చేయుటకు వీలులేక పోవుటవలన వయోజన విద్యావ్యాప్తి తెలంగాణలో తగినంతగా జరుగలేదు. వయోజన విద్యావ్యాప్తికి గాను తెలంగాణ ప్రాంతమునందు గూడ కొన్ని రాత్రి పాఠశాలల నిర్వహించుట జరిగినది. 1950 సంవత్సరమునకు పూర్వము వయోజన విద్యావ్యాప్తి కత్యంత శ్రద్ధతో కృషి సల్పుచుండిన వారిలో మాడపాటి హనుమంతరావు, సురవరం ప్రతాపరెడ్డి మున్నగు వారిని పేర్కొనవచ్చును.

## సాంఘిక విద్యకు ప్రత్యేకాధికారిగా రాఘవరెడ్డిగారి నియామకము:

1953 సంవత్సరము రాఘవరెడ్డిగారిని సాంఘిక విద్యకు ప్రత్యే కాధికారిగా నియమించుట జరిగినది. గ్రంథాలయముల అభివృద్ధి బాధ్యతనే గాక, రాష్ట్రములో వయోజన విద్యావ్యాప్తి బాధ్యతలను కూడ వీరి కప్పగించుట జరిగినది.

1947-48 సంవత్సరమున ఇంగ్లాండునందలి యార్క్‌షైర్, లాంక్‌షైర్ లోని పౌర గ్రంథాలయములలో, పరిశ్రమలలో, కారా గారాలలో చలన చిత్రములు మున్నగు వాటిని వయోజనుల కొఱకు ప్రదర్శించు చుండెడివారు. ఈ విషయమును రాఘవరెడ్డిగారు గుర్తించిరి.

ఇంగ్లాండు నందలి నిరక్షరాస్యులు నామమాత్రమే. అయినప్ప టికి విద్యను తక్కువగా అభ్యసించినటువంటి వారి ప్రయోజనమునకై వయోజన విద్యా కార్యక్రమముల నమలుపరచుచుండిరి. వయో జనులకు కావలసిన పుస్తకములు కూడా గ్రంథాలయము లందుండి నవి. రాఘవరెడ్డిగారు వయోజన విద్యను గురించి ఇంగ్లాండునందు విద్యాభ్యాస కాలమున అనుభవమును గడించిన వారగుటచే 1953 సంవత్సరమున వయోజన విద్యావ్యాప్తి బాధ్యత వారి కప్పగించ బడినది.

## ప్రథమ పంచవర్ష ప్రణాళికా కాలమున వయోజన విద్యా కేంద్రముల స్థాపన:

ప్రథమ పంచవర్ష ప్రణాళికా కాలమున అనగా 1951-1956 సంవత్సరముల కాలములో కేంద్ర ప్రభుత్వము వయోజన విద్యా కేంద్రములను స్థాపించుటకు కొద్ది మొత్తమును కూడ గ్రాంటుగా కేటాయించినది. ఈ మొత్తముతో ఆంధ్ర ప్రాంతము నందు

వయోజన విద్యా కేంద్రములను స్థాపించుట జరిగినది. వయోజన విద్యా కేంద్రములను చాలవరకు వెనుకబడిన ప్రాంతములందు స్థాపించుట జరిగినది. కమ్యూనిటీ డెవలప్‌మెంట్ అధికారులవలనను, విద్యా శాఖాధికారుల వలనను మఱియు ప్రజల ఉత్సాహము వలనను ప్రథమ పంచవర్ష ప్రణాళికాంతమునకు వయోజన విద్యా కేంద్రముల సంఖ్య 2,659 కి పెరుగుటయే గాక, 77,947 మంది నిరక్షరాస్యులు కూడ ఈ కేంద్రములలో విద్యాభ్యాసము చేయుచుండిరి. పౌర గ్రంథాలయములు వయోజనులకు కావలసిన పుస్తకములను లభింపజేసి వయోజన విద్యావ్యాప్తికి కొంతవరకు కృషి చేసినవి.

ఆంధ్ర ప్రాంతమునందువలె తెలంగాణ ప్రాంతమునందు కూడ వయోజన విద్యా కేంద్రములు విద్యాశాఖ అజమాయిషీ యందుండినవి. దీనికొక ప్రత్యేకాధికారి కూడ ఉండెడివారు. తెలంగాణ ప్రాంతమునందు ప్రభుత్వముచే తగినన్ని వయోజన విద్యా కేంద్రములు స్థాపింపబడక పోయినప్పటికి, ప్రజల ఉత్సాహముతో స్థాపించబడిన వయోజన విద్యా కేంద్రములు మాత్రము చక్కగా నిర్వహింపబడినవి.

## వయోజన విద్యా కేంద్రముల అధ్యాపకులకు శిక్షణ:

ప్రథమ పంచవర్ష ప్రణాళికా కాలమున రాష్ట్రమునందు వయోజన విద్యావ్యాప్తి ప్రోత్సాహకరముగా జరుగుటకు, పాఠశాలల తనిఖీ అధికారులకు వయోజన విద్యను గురించి 10 రోజుల శిక్షణ యిచ్చుట జరిగినది. అట్లే వయోజన విద్యా కేంద్ర ఉపాధ్యాయులకు కూడ, వయోజన విద్యాబోధనా పద్ధతుల గురించి 40 రోజుల శిక్షణ యివ్వడము జరిగినది. బాలలకు బోధించు పద్ధతిలో వయోజనులకు బోధించుట సరికాదు. కావున, ఈ శిక్షణ ఉపాధ్యాయులకు అవసరమైనది. తూర్పు గోదావరి జిల్లాలోని అనపర్తిలోను. తదనంతరము

విజయవాడలో నొక శిక్షణ కేంద్రమును స్థాపించి, ఉపాధ్యాయులకు శిక్షణ నిచ్చుట జరిగినది. ప్రతి సంవత్సరము రెండు వందలకు పై బడి ఉపాధ్యాయులు ఈ కేంద్రములలో శిక్షితు లయ్యెడివారు. ఈ శిక్షణ పొందు వారికి వయోజన విద్యావశ్యకతను బోధించుటయే గాక, పౌర గ్రంథాలయములకు, వయోజన విద్యా కేంద్రములకు ఎటువంటి సంబంధ సహకారము లుండవలెనన్న విషయాదులను గురించి కూడ, శిక్షణా కేంద్రములకు తనిఖీ వెళ్ళెడు సందర్భాలలో రాఘవ రెడ్డిగారు వివరించుచుండిరి.

## జడ్‌చర్లలో వయోజన విద్యాశిక్షణ కేంద్రము ఏర్పాటు:

రెండవ పంచవర్ష ప్రణాళికా కాలమున తెలంగాణ ప్రాంత మునందు జడ్‌చర్లలో రాఘవరెడ్డిగారి కృషిచే, అప్పటి విద్యా శాఖాధికారి సహకారముతో ఒక వయోజన విద్యా శిక్షణా కేంద్ర మును స్థాపించుట జరిగినది. తెలంగాణ ప్రాంతములో వయోజన విద్యా కేంద్రములలో పనిచేయువారిలో, ఎక్కువ శాతము ఈ శిక్షణ కేంద్రములో శిక్షణ పొందిన వారేనని చెప్పవచ్చును. ఆంధ్ర ప్రదేశ్ అవతరించిన యనంతరముగూడ ఆంధ్ర-తెలంగాణ ప్రాంతము లందు వయోజన విద్యా కేంద్రములు కొంతకాలము చక్కగా నిర్వహింపబడినవి.

## ఆంధ్రప్రదేశ్‌లో వయోజన విద్యాశిక్షణకు సమగ్రమైన పాఠ్యాంశముల రూపకల్పనకు కమిటీ అధ్యక్షులుగా రాఘవరెడ్డిగారి నియామకము:

ఆంధ్ర ప్రాంతములోను, తెలంగాణ ప్రాంతములోను నిర్వహింప బడుచున్న వయోజన విద్యా కేంద్రములలో పాఠ్యాంశములు ఒకే విధముగా నుండవలెనని రాఘవరెడ్డిగారి కోరిక. ఇందులకై ప్రభు త్వము 1961 సంవత్సరములో ఒక కమిటీని నియమించినది. ఈ కమి

టీకి రాఘవ రెడ్డిగారు అధ్యక్షులుగాను, మహబూబ్ నగర్ జిల్లా విద్యా శాఖాధికారి శ్రీ సోమసుందరంగారు మఱియు విద్యాశాఖయందు పదవీ విరమణ చేసియుండిన శ్రీ పిల్లారిశెట్టి సత్యనారాయణగారు సభ్యులుగా నుండిరి. ఈ కమిటీ సమావేశమై, కమిటీ స్థాపనకు మునుపు నిర్వహింపబడు చుండినటువంటి మూడు సంవత్సరముల వయోజన విద్యాశిక్షణ కాలమును ఒక సంవత్సరమునకు తగ్గించి, ఈ సంవత్సర కాలములో 4 మాసములు వయోజనులను అక్షరాస్యులుగా చేయుటకు, 8 మాసములు వారి విజ్ఞానమును పెంపొందించుటకు వినియోగించిన. ప్రయోజన కరముగా నుండునని అభిప్రాయ పడినది. 4 మాసముల పాటు శిక్షణ నిర్వహింపబడిన తరువాత పరీక్షలను నిర్వహించెడివారు. ఒక నిరక్షరాస్యుని అక్షరాస్యునిగా చేసిన ఉపాధ్యాయునికి అదనముగా ఒక రూపాయను బహూకరించుచుండిరి. ఈ విధముగా నిర్వహింపబడు చుండిన, వయోజన విద్యా కార్యక్రమములు మిగుల ప్రయోజన కరముగా నున్నదని వయోజన విద్యలో అనుభవజ్ఞులు పలువురు అభిప్రాయ పడిరి. ఆంధ్ర, తెలంగాణ ప్రాంతముల యందలి వయోజన విద్యా కేంద్రము లందంతటను ఈ కమిటీ నిశ్చయించిన పాఠ్యాంశములనే ప్రవేశ పెట్టుట జరిగినది. రాష్ట్రములోని పౌర గ్రంథాలయములలో క్రొత్తగా అక్షరాస్యులైన వారికి చదువు కొనుటకు తగు సౌకర్యములు కలిగించబడినవి.

వయోజనులకు చదువుట, వ్రాయుట అలవడిన చాలునని, ఇతర వయోజన విద్యా కార్యక్రమముల ప్రమేయము అంతగా లేదని కొందరు వయోజన విద్యా కార్యకర్తలు సూచించిరి. కాని, వయోజనులు కేవలము అక్షర జ్ఞానమును మాత్రము పొందిన చాలదని, వారికి తగు విజ్ఞానమును కల్గించుటకుగాను వయోజన విద్యా కేంద్రముల యందును, పౌర గ్రంథాలయముల యందును వయోజన విద్యా కార్యక్రమములను ప్రవేశ పెట్టవలసిన ఆవశ్యకత ఎంతేని కలదని

రాఘవరెడ్డిగారు వివరించెడివారు. ఆ నాటినుండి ఈ నాటివరకు కూడ మన రాష్ట్రములో పౌర గ్రంథాలయములందు ఈ విధమయిన వయోజన విద్యా కార్యక్రమములకు ప్రాముఖ్యత ఒసగబడుచున్నది.

## వయోజన విద్యావ్యాప్తికి ప్రజలలో చైతన్యము:

1956 వ సంవత్సరము కేంద్ర ప్రభుత్వముయొక్క గ్రాంటు పొందని వయోజన విద్యా కేంద్రములను మూసివేయడము జరిగినది. ఈ విధముగా మూసివేయుట ఏ మాత్రము సమంజసము కాదని, రాష్ట్ర ప్రభుత్వమునుండి యైన గ్రాంటును పొంది వీటిని నిర్వహించ వలెనని పలువురు విద్యావేత్తలు పట్టుదల వహించిరి. అయినప్పటికి ఆర్థిక యిబ్బందుల వలన కొన్ని వయోజన విద్యాకేంద్రములను మూసివేయవలసి వచ్చినది. తక్కిన వయోజన విద్యాకేంద్రములు మాత్రము సక్రమముగా నిర్వహింపబడినవి. ఈ వయోజన విద్యా కేంద్రములకు ప్రజల సహకారము కూడ ప్రోత్సాహకరముగా నుండి నది. ఈ వయోజన విద్యాకేంద్ర కార్యకర్తలు గూడ ప్రజలతో సంప్రదించి కార్యక్రమములను నిర్ణయించెడివారు. వయోజన విద్యా కేంద్రముల మూసివేత సమంజసము కాదని ప్రజలు కూడ వ్యతి రేకించిరి. వయోజన విద్యావ్యాప్తికి ప్రజలలో గల చైతన్యము ఈ విషయముల ద్వారా విదితమగుచున్నది.

## వయోజన విద్యావ్యాప్తికి యితర ప్రభుత్వ శాఖల సహకారము:

ఈ విధముగా నిర్వహింపబడు చుండిన వయోజన విద్యాకేంద్ర ముల అభివృద్ధికి యితర శాఖల సహకారముకూడ మిగుల అవసరము. పంచాయతీశాఖ, వ్యవసాయశాఖ, ఆరోగ్యశాఖ మున్నగు శాఖలు కూడ వయోజన విద్యాశాఖకు సహకారము నందించి యుండినచో వయోజనవిద్య మరింతశీఘ్రముగా వ్యాప్తి చెందుట కవకాశముండెడిది.

కాని ఈ శాఖల సహకారము నామమాత్రముగానే యుండెను. పౌర గ్రంథాలయశాఖ మఱియు కొంతవరకు పౌర సంబంధ శాఖ, వయోజన విద్యావ్యాప్తికి సహకారము నందించినవి.

## గ్రంథపాలకుల - వయోజన విద్యా కార్యకర్తల మధ్య సహకారము:

పౌర గ్రంథాలయ పుస్తక భాండాగారులు – వయోజన విద్యా కార్యకర్తలు పరస్పరము సహకార భావమును కల్గియుండవలెనని రాఘవరెడ్డిగారు 1953 వ సంవత్సరమునుండి సమావేశములలో తరచు నొక్కి చెప్పుచుండెడివారు. వయోజన విద్యా కార్యకర్తలు, పుస్తక భాండాగారులను సంప్రదించి గ్రామములలో వయోజన విద్యా కార్యక్రమముల నేర్పాటు చేసికొనవలెనని చెప్పుచుండెడివారు. జిల్లా కేంద్ర గ్రంథాలయ పుస్తక భాండాగారులు, జిల్లా వయోజన విద్యాధికారులు కూడ పౌర గ్రంథాలయాలలో ఏర్పాటుచేయు కార్యక్రమములను గురించి, వయోజన విద్యా కేంద్రములలో ఏర్పాటు చేయవలసిన కార్యక్రమములను గురించి పరస్పరము చర్చించుకొని, ఈ కార్యక్రమములను నిర్వర్తించవలెనని చెప్పెడివారు. వయోజన విద్యా కార్యకర్తలు, పౌర గ్రంథాలయ నిర్మాణ, నిర్వహణాది విషయములను గురించి, పౌర గ్రంథాలయ పుస్తక భాండాగారులు వయోజన విద్యా కార్యక్రమములను గురించి చక్కగా గ్రహించవలెను. ఇట్టి సహకారము లేనిచో వయోజన విద్యావ్యాప్తి సక్రమముగా జరుగదని సమావేశములందు రాఘవరెడ్డిగారు గ్రంథపాలకులకు, వయోజన విద్యా కార్యకర్తలకు వివరించెడివారు.

క్రొత్తగా అక్షరాస్యులయిన వయోజనుల కే విధమయిన పుస్తకములపై ఆసక్తి యుండునన్న విషయముపై గ్రంథపాలకులు, వయోజన విద్యా కార్యకర్తలు కలసి పరిశీలన జరిపి, వారి యాసక్తిని

గ్రహించి, తగిన పుస్తకముల ప్రచురించ వలసినదిగా ప్రచురణా కర్తలకు తెలియజేయవలసిన యవసరము కూడ ఎంతేని గలదు.

ఢిల్లీలో 26—9—1955 నుండి 5—10—1955 వరకు "వయోజన విద్యావ్యాప్తిలో గ్రంథాలయాల పాత్ర" (Role of Libraries in Adult Education) అను అంశముపై ఒక సదస్సు జరుపబడినది. వయోజన విద్యావ్యాప్తికై గ్రంథపాలకులు నిర్వహించ వలసిన పాత్రను, వయోజనులకు కావలసిన పుస్తక ప్రచురణ మున్నగు వాటిని గురించి గ్రహించు నిమిత్తము రాఘవరెడ్డిగారు జిల్లా కేంద్ర గ్రంథపాలకులను ఈ సమావేశమునకు బంపిరి. ఇందువలన గ్రంథ పాలకులకు, వయోజన విద్యావ్యాప్తికి పౌర గ్రంథాలయము లెటువంటి కీలక పాత్ర వహించవలెనన్న అంశమును చక్కగా గ్రహించుటకు వీలయినది.

1950 సం॥ తరువాత ఆంధ్ర, తెలంగాణ ప్రాంతములందు గ్రంథాలయములతో బాటు, వయోజన విద్యా కేంద్రములను గూడ స్థాపించడము జరిగినది. ఆ నాడు పౌర గ్రంథాలయముల నిర్వహణా బాధ్యతల కల్గియుండిన విద్యాశాఖాధికారులు గూడ, వయోజన విద్యావ్యాప్తికై కృషి సల్పుచుండిరి. వయోజన విద్యావ్యాప్తికి విద్యా శాఖలోని పలువురు అధికారులు గ్రంథ పాలకులతో సహకరించి గొప్ప కృషి సల్పియున్నారు. వారిలో శ్రీ పిల్లారిశెట్టి సత్యనారాయణగారు పేర్కొనదగినవారు. వీరు వయోజన విద్యావ్యాప్తికి కృషి చేయడమేగాక పుస్తక భాండాగారుల, వయోజన విద్యా కార్యకర్తల మధ్య యుండవలసిన సహకారమును గురించి కూడ గ్రంథపాలకులకు, వయోజన విద్యా కార్యకర్తలకు నొక్కి చెప్పుచుండెడివారు. అదేవిధముగా మహబూబ్‌నగర్ జిల్లా విద్యా శాఖాధికారియైన శ్రీ సోమసుందరం గారు కూడ తెలంగాణ ప్రాంతమునందు వయోజన విద్యా వ్యాప్తికి గొప్ప కృషి సల్పు చుండుటయే

గాక పరస్పర సహకార విధానముల గురించి కూడ పుస్తక భాండాగారులకు, వయోజన విద్యా కార్యకర్తలకు పదేపదే తెలియజేయుచుండెడివారు. ప్రాథమిక పాఠశాలల తనిఖీ అధికారిగా నుండిన రామారావు నగర కేంద్ర గ్రంథాలయమునకు కొంతకాలము గ్రంథపాలకుడుగా నుండిరి. వీరు తెలంగాణ ప్రాంతమునందు వయోజన విద్యావ్యాప్తికి గొప్ప కృషి చేసిరి.

ఆంధ్రప్రదేశ్ అవతరణానంతరము జిల్లా కేంద్ర గ్రంథాలయ పాలకులే గాక, సహాయక గ్రంథాలయ పుస్తక భాండాగారులు కూడ కొందరు వయోజన విద్యా కార్యకర్తలతో సహకరించి, వయోజన విద్యా కార్యక్రమముల నిర్వహించుచుండిరి. వేటపాలెం గ్రంథాలయ కార్యకర్త శ్రీనివాసరావు మున్నగువారు ఈ విధమయిన కృషి సల్పిరి. అదే విధముగా శాఖా గ్రంథాలయ పుస్తక భాండాగారులు కూడ, పలువురు వయోజన విద్యా కార్యకర్తలతో సన్నిహిత సంబంధములు కల్గి, గ్రంథాలయములందు వయోజన విద్యావ్యాప్తి కార్యక్రమముల పెక్కింటిని నిర్వహించిరి. ఉదాహరణకు:- రాఘవయ్య, (గుంటూరు), ఏ. గోపీనాథ్ (అనంతపురం), కృష్ణాజీ (హైదరాబాదు), శ్రీ రాజు (షాద్‌నగర్, మహబూబ్‌నగర్ జిల్లా.)

## పౌర గ్రంథాలయాలలో నిర్వహించిన వయోజన విద్యా కార్యక్రమాలు :

పౌర గ్రంథాలయములు కేవలము అక్షరాస్యులకే ప్రయోజనకరములని భావించుట పొరబాటు. ఆంధ్రప్రదేశ్ నందు పౌర గ్రంథాలయశాఖ ప్రత్యేక శాఖగా పరిగణింపబడిన యనంతరము కూడ పౌర గ్రంథాలయాలలో అక్షరాస్యులకే గాక, నిరక్షరాస్యులకు కూడ ప్రయోజనకరమయిన వయోజన విద్యా కార్యక్రమములు జరుపబడినవి. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వముల అభిప్రాయము ప్రకా

రము 1-12-1960 వ తేదీన వయోజన విద్యా దినోత్సవముగా ప్రకటింప బడినది. ఆ నాటినుండి ప్రతి ఏటా డిసెంబరు నెల మొదటి తేదీన నిర్వహింపబడు ఈ దినోత్సవమున అక్షరాస్యులకే గాక, నిరక్షరాస్యులకు కూడ ప్రయోజన కరమైన ఉపన్యాసములు, చలన చిత్ర ప్రదర్శనలు, తదితర కార్యక్రమములు ఆంధ్రప్రదేశ్‌లోని కొన్ని పౌర గ్రంథాలయాలలో నిర్వహింపబడినవి.

కొన్ని సమయములలో నిరక్షరాస్యుల కొరకు పౌర గ్రంథాలయములలో పఠన కేంద్రములు (Reading Circles) కూడ ఏర్పాటు చేయబడినవి. గ్రామీణ ప్రాంత ప్రజలు నిరక్షరాస్యులైనను వివేకమును, సమయోచిత జ్ఞానమును కల్గినవారే. నిరక్షరాస్యులకు తగు సహాయమును కల్పించుట కూడ పౌర గ్రంథాలయముల ప్రధాన కర్తవ్యము. కొన్ని గ్రంథాలయములలో పుస్తక భాండాగారిమైనను లేదా గ్రామస్థులలో ఒక విద్యావంతుడు లేదా వయోజన విద్యా కార్యకర్తమైన పుస్తకములను, పత్రికలను నిరక్షరాస్యులకు చదివి వినిపించెడివారు. అందువలన విద్య నభ్యసింప వలెనన్న భావము నిరక్షరాస్యులలో మొలకెత్తును. వారి విజ్ఞానము పెంపొందుటకు కూడ వీలు కలుగును.

విద్యావంతులకుగాను చర్చా సమావేశముల అవసరమున్నప్పుడు నిర్వహించడము జరిగినది. పరస్పరము అభిప్రాయముల గ్రహించుటకుగాను ఈ చర్చా సమావేశముల నిర్వహించుట జరిగినది.

నిరక్షరాస్యులకు, అక్షరాస్యులకు ప్రయోజన కరమైన ఉపన్యాసములు కూడ పెక్కు గ్రంథాలయాలలో ఏర్పాటు చేయబడినవి. ఉదా:- పరిశుభ్రత, వయోజన విద్య, ఆర్థికాభివృద్ధి, నాగరికత, సంస్కృతి మొదలగు అంశములపై ఉపన్యాసముల విరివిగా నిర్వహించుట జరిగినది.

అక్షరాస్యులకే గాక నిరక్షరాస్యులకు కూడ వినోదోల్లాసముల కల్గించుటకు నాటకము - నాట్యము - సంగీతము - చలన చిత్రములు మున్నగు కార్యక్రమములను గూడ కొన్ని గ్రంథాలయాలలో ఏర్పాటు చేయుట జరిగినది.



**నాటకములలో పాల్గొనుచు వయోజన విద్యావ్యాప్తికి కృషి చేయుచున్న ఇ. ఎస్. ఆర్. కుమార్.**

రేడియో ప్రసారముల వినుటకు సదుపాయములను పెక్కు- శాఖా గ్రంథాలయాలలో కూడ కల్పించెడివారు. రేడియో ప్రసార ముల అనంతరము వీటిపై కొన్ని గ్రంథాలయములందు చర్చలు జరిగేవి.

ఆంధ్రప్రదేశ్ లోని పౌరగ్రంథాలయములు వ్యక్తుల (Individuals) వర్గముల (Groups) సమస్యలను గ్రహించి, వారికి కావలసిన సాహిత్య సదుపాయముల కల్గించుచుండినవి. ఆ విధముగా యువక సంఘములకు, మహిళా మండలులకు, తదితర సంస్థలకు, కావలసిన పుస్త కములను పంపిణీచేసి, కొంతవరకు వయోజన విద్యావ్యాప్తికే గాక, సాహిత్య సేవను కూడ సల్పుచుండినవి.

పెక్కు గ్రంథాలయములలో పుస్తక ప్రదర్శనముల నిర్వహించుట కూడ జరిగినది. ముఖ్యముగా జాతీయ గ్రంథాలయ వారము, గాంధీజయంతి, నెహ్రూ జన్మదినము మొదలగు దినములలో ఈ ప్రదర్శనముల నిర్వహించెడివారు. గాంధీజీ శతజయంతి ఉత్సవ సందర్భాన గాంధీగారు రచించిన పుస్తకములను, గాంధీగారిపై వ్రాయబడిన పుస్తకములను కొన్ని పౌర గ్రంథాలయములు ప్రదర్శించినవి.

అఖిల భారత స్థాయిలో, నిర్వహించబడు ప్రదర్శనలలో మన రాష్ట్రములోని పౌర గ్రంథాలయములు కూడ పాల్గొనవలెనని రాఘవరెడ్డిగారు సూచించుచుండిరి. వారి సలహా మేరకు హైదరాబాదులో 1—1—1967 నుండి 10—2—1967 వరకు జరిగిన అఖిల భారత పారిశ్రామిక ప్రదర్శన (All India Industrial Exhibition) లో మన రాష్ట్రములోని పౌర గ్రంథాలయములు కూడ పాల్గొన్నవి. 1968 సంవత్సరమున నిర్వహింపబడిన 28 వ అఖిల భారత పారిశ్రామిక ప్రదర్శనలో కూడ రాష్ట్రమునందలి కొన్ని పౌర గ్రంథాలయములు పాల్గొన్నవి.

రాష్ట్రమునందలి ఆర్థికముగా వెనుకబడి యుండిన కొన్ని లోకల్ లైబ్రరీ అథారిటీలు వయోజన విద్యా కార్యక్రమముల నిర్వర్తించుటకు, తమవద్ద తగిన నిధులు లేవని తెలియజేయుచుండినవి. నిధులు లేనప్పటికి, ఈ క్రింది కొన్ని కార్యక్రమములను నిర్వర్తింపవచ్చునని 20—11—1960 లో రాఘవరెడ్డిగారు విశదీకరించిరి.

1. పఠన కేంద్రములు 2. చర్చా సమావేశములు 3. ఉపన్యాసములు 4. పుస్తక ప్రదర్శనలు మున్నగునవి.

ఇటువంటి కార్యక్రమములను వ్యయములేకయే ఏర్పాటుచేసిన గ్రంథపాలకులు పలువురు గలరు. పెక్కు సహాయక గ్రంథాలయాలలో గూడ ఈ కార్యక్రమముల నిర్వర్తింపజేయుట జరిగినది.

గోపీనాథ్ (రాయదుర్గం); వెలగా వేంకటప్పయ్య (గుంటూరు); ఎన్. వి. రామిరెడ్డి (నెల్లూరు); సి. గోవిందరావు (పశ్చిమ గోదావరి); ఎ. రాఘవయ్య (గుంటూరు); కె. యస్. ప్రకాశం (అనంతపురం); జనార్ధనరెడ్డి (సంగారెడ్డి); ఆనందం (వరంగల్లు); పాండురంగారెడ్డి (హైదరాబాదు); ఇక్బల్ (వికారాబాదు); రామారావు (ఆదిలాబాదు); నాగేశ్వరరావు(ఖమ్మం); బాలకృష్ణారెడ్డి(మహబూబ్ నగర్) విఠల్ శాస్త్రి (కృష్ణా); గోపాలకృష్ణమూర్తి (శ్రీకాకుళం) రామారావు (ఆదిలాబాదు) మున్నగు గ్రంథపాలకులు వయోజన విద్యా కార్యకలాపాల నిర్వహణలో మిగుల ఉత్సాహమును కనబరచిరి.

## క్రొత్తగా అక్షరాస్యులైన వయోజనులకు అవసరమైన సాహిత్యము:-

మొదటి పంచవర్ష ప్రణాళికా కాలముననే వయోజన విద్యా కేంద్రములు స్థాపింప బడినప్పటికి, క్రొత్తగా అక్షరాస్యులయిన వయోజనుల కవసరమైన పుస్తకములు తగినన్ని లేకుండినవి. ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్రమునందు వ్యవసాయముపైననే ఆధారపడినవారు 75% పైగా కలరు. కాన వ్యవసాయ విజ్ఞానమునకు సంబంధించిన పుస్తకముల నెక్కువగా గ్రంథాలయములందు, వయోజన విద్యా కేంద్రములందు ప్రవేశ పెట్టవలెను. వయోజన విద్యలో గొప్ప శ్రద్ధను గైకొన్నటువంటి గాడిచర్ల హరిసర్వోత్తమరావు, హరి ఆదిశేషు, కారంపూడి నాగేంద్రుడు, వెలగా వేంకటప్పయ్య మున్నగువారు వయోజనులకు ప్రయోజన కరమయిన పుస్తకములను కొన్నింటిని రచించిరి. వయోజనులకు సంబంధించిన పుస్తకములను రచింపవలెనని రాఘవరెడ్డిగారు కూడ రచయితలకు ప్రోత్సాహ మిచ్చెడివారు. రాఘవరెడ్డిగారు లోకల్ లైబ్రరీ అథారిటీలకు గ్రాంట్లు మంజూరు

చేయు సందర్భమున వయోజన విద్యా కార్యక్రమముల నిర్వర్తించు టకు, వారి కుపయోగపడు పుస్తకములను కొనుగోలు చేయుటకు కొంత మొత్తమును కేటాయించెడివారు. సహాయక గ్రంథాలయము లలో కూడ కొన్నిటియందు వయోజన విద్యకు సంబంధించిన పుస్తక ములను కొనుగోలు చేసిరి. పౌర గ్రంథాలయాలలో నుండెసి వయో జన విద్యకు సంబంధించిన పుస్తకములను పలు వయోజన విద్యా కేంద్ర ముల ఉపాధ్యాయులు అరువు పొంది, మిగుల ప్రయోజనమును పొందిరి. పౌర గ్రంథాలయముల పుస్తక భాండాగారులు గ్రామముల లోని వయోజనులకు కావలసిన పుస్తకములను సైకిళ్ళద్వారా కూడ పంపుచుండిరి. ఈ విధముగా కేంద్ర రాష్ట్ర ప్రభుత్వములు కోట్ల కొలది ధనమును వెచ్చించి, పలు వయోజన విద్యా కేంద్రముల స్థాపించుచూ, వయోజన విద్యావ్యాప్తికి పలువిధముల కృషి చేయుచుండగా, లోకల్ లైబ్రరీ అథారిటీలు వయోజన విద్యకు సంబంధించిన పుస్తకములను కొనుగోలు చేయనిచో, వయోజన విద్యా కేంద్రముల ద్వారా అక్షరాస్యులైనటువంటి వయోజనులకు చదువుకొనుటకు తగిన పుస్తకములు గ్రంథాలయములలో లభ్యము కాజాలవు. కొంత కాలమైన తరువాత, వారు తిరిగి నిరక్షరాస్యు లగుట కవకాశము కలదు. ఈ విధముగా వీరు నిరక్షరాస్యు లైనచో, కేంద్ర రాష్ట్ర ప్రభుత్వములు వెచ్చించిన ధనము వృథా కాగలదని, గ్రంథపాలకులు వయోజనులకు చదువుకొనుటకు తగు సౌకర్యములను కలుగ జేయవలెనని రాఘవరెడ్డిగారు విశదీకరించు చుండిరి. నిరక్షరాస్యులను అక్షరాస్యులుగా జేయుటకు గ్రంథ పాలకులు త్యాగము చేయవలెనని రాఘవరెడ్డిగారు వివరించెడివారు. పౌర గ్రంథాలయములు లేని కొన్ని ప్రాంతములందలి వయోజన విద్యా కేంద్రములందు అక్షరాస్యులైన వారికి తగు పుస్తకములు లేని కారణమున వారు కొంత కాలమునకు తిరిగి నిరక్షరాస్యు లైనట్లు కూడ తెలియుచున్నది.

1978-79 సంవత్సరములో గొప్ప విద్యావేత్తయినటువంటి కేంద్ర విద్యామంత్రిగా నుండిన శ్రీ ప్రతాప్ చంద్ర చందూర్ గారు వయోజన విద్యావ్యాప్తికి అమిత శ్రద్ధను గైకొని, దేశమునందు పలు వయోజన విద్యా కేంద్రముల స్థాపించి, వీటి నిర్వహణకు కావలసిన మొత్తమును కేటాయించిరి. ఈ వయోజన విద్యా కేంద్రములలో అక్షరజ్ఞానమును పొందినవారు పలువురు కలరు. వీరు పొందిన అక్షర జ్ఞానము నశించకుండుటకుగాను రాష్ట్రములందలి గ్రంథాలయములలో వయోజన విద్యకు సంబంధించిన పుస్తకములను కొనుగోలు చేయవలసిన యవసర మెంతేని గలదు. ఈ బాధ్యతను నిర్వహించుట రాష్ట్ర వయోజన విద్యాశాఖ కర్తవ్యము. వయోజనులకు సంబంధించిన పుస్తకములను, పత్రికలను తయారు చేయవలసిన అవసరము కూడ ఎంతేని గలదు. వయోజన విద్యాశాఖ కూడ వయోజనులకు సంబంధించిన పుస్తకములను, దృశ్య, శ్రవణ పరికరములను కూడ గ్రంథాలయములలో ఉచితముగా లభింప జేయవలసిన అవసర మెంతేని గలదు.

వయోజన విద్యా కార్యక్రమములను రాష్ట్ర కేంద్ర గ్రంథాలయ, జిల్లా కేంద్ర గ్రంథాలయములలోనే గాక, యితర గ్రంథాలయములలో గూడ ఉత్సాహముతో నిర్వహించిన పలువురు గ్రంథపాలకులు ఈనాటికిని లేకపోలేదు. అటువంటి కృషి సల్పిన వారిలో ఉదాహరణకు ఈక్రిందివారిని పేర్కొనవచ్చును.

**1. శ్రీ వెలగా వేంకటప్పయ్య [పశ్చిమ గోదావరి] :-** గుంటూరు, కడప తదితర గ్రంథాలయాలలో పనిచేసిన వీరు వయోజన విద్యయందు తగు మక్కువాభిలాషలు కలవారే గాక, గ్రంథాలయ సభలను, సమావేశములను ఏర్పాటుచేసి గ్రంథాలయములలోని పుస్తకములను గురించి పాఠకులకు చక్కగా వివరించెడివారు. కవులను, మేధావులను గ్రంథాలయముల కాహ్వానించి ఉపన్యాసముల నేర్పాటు

చేసెడివారు. పుస్తక ప్రదర్శనములను, చర్చా గోష్ఠులను నిర్వహించెడి వారు. వయోజన విద్యా సంబంధ పుస్తక రచనలో రచయితలకు తగు ప్రోత్సాహము కల్పించెడివారు. ఇతర వయోజన విద్యా కార్య క్రమములను గూడ మిగుల సామర్థ్యముతో నిర్వహించి పలువురి ప్రశంసలకు పాత్రులైరి. వయోజనుల కుపయుక్తమైన రచనలు గావించి ప్రభుత్వ అవార్డులు కూడ పొందిరి.



వెలగా వేంకటప్పయ్య.

**2. శ్రీ గోపీనాథ్:-** అనంతపురంజిల్లా కేంద్ర గ్రంథాలయము నందును రాయదుర్గం శాఖాగ్రంథాలయములోను పని చేసినటువంటి శ్రీగోపీనాథ్ గారు వయోజన విద్యావ్యాప్తికి ప్రశంసనీయమైన సేవచేసి పలుగ్రంథాలయ వార్షికోత్సవాలు, గ్రంథాలయ గోష్ఠులు, నాటక ప్రదర్శనములు, కవిసమ్మేళనములు, తదితర కార్యక్రమములను నిర్వహించి కీర్తిగడించిరి. వీరు మంచి రచయిత మఱియు ప్రసిద్ధ హాస్య నటుడు. గ్రంథాలయాలలో రాత్రులలో వయోజన పాఠశాలలను చాల సంవత్సరములు నిర్వహించారు.



ఎ. గోపీనాథ్

3. శ్రీ ఈశ్వరరెడ్డి:- గుంటూరు ప్రాంతీయ గ్రంథాలయములో పని చేయు చుండిన వీరు వయోజన విద్యా కార్యక్రమముల పెక్కింటిని చక్కగానిర్వహించి, గుంటూరులోని ప్రాంతీయ గ్రంథాలయమునకు పాఠకులను ఆకర్షింప జేయుటకు ప్రశంసనీయమైన కృషి సల్పిరి.



ఎన్. బి. ఈశ్వరరెడ్డి.

విధముగా గ్రంథాలయాలలో మిగుల సామర్థ్యముతో వయోజన విద్యా కార్యక్రమముల నిర్వహించినవారనేకులు ప్రతిజిల్లాలోను గలరు. పలువురు విద్యావేత్తలు వయోజన విద్యా వ్యాప్తికై మన రాష్ట్రములో పౌరగ్రంథాలయాలు చేసిన కృషిని ప్రశంసించారు.

## పౌర గ్రంథాలయాలకు - వయోజన విద్యకు ఒకే శాఖ ఆవశ్యకత:

రాష్ట్రములోని పౌర గ్రంథాలయ శాఖ, వయోజన విద్యాశాఖ ఒకే శాఖగా నుండవలెనని రాఘవరెడ్డిగారి ఆకాంక్ష. పౌరగ్రంథాలయ పుస్తక భాండాగారులు, వయోజన విద్యాకార్యకర్తలు పలువురు కూడ ఈ రెండు శాఖలను ఒకే శాఖగా పరిగణించవలెనను అభిప్రాయమును కల్గియుండిరి. ఇందులకు కారణములు లేకపోలేదు. సాధారణముగా పౌరగ్రంథాలయ కార్య క్రమములు, వయోజన విద్యా కార్యక్రమములు చాలావరకు సామ్యము కల్గియుండును. వయోజన విద్యాకేంద్రములు నిరక్షరాస్యులను అక్షరాస్యులుగా చేయును. వయోజనులు పొందినటువంటి అక్షరజ్ఞానమును వృద్ధిచేసి వారికి తగు విజ్ఞాన వివేకములను కలుగచేయుటలో పౌరగ్రంథాలయములు తోడ్పడును. కావున ఈ రెండింటిని ఒకేశాఖగా పరిగణించుట అవసరమని పలు విద్యావేత్తల అభిప్రాయము. ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర గ్రంథాలయ కమిటీ సభ్యులు కూడ పలు గ్రంథాలయ సమావేశములలో ఈ రెండు శాఖలను ఒకేశాఖగా పరిగణించవలెనని తమ అభిప్రాయములను వెలిబుచ్చుచుండిరి. 29—12—1965 తేదీన జరిగిన రాష్ట్ర గ్రంథాలయ కమిటీ సమావేశములో కర్నూలు లోకల్ లైబ్రరీ అథారిటీ చైర్మెన్ శ్రీ బి. సుబ్బారెడ్డిగారు ఈ రెండు శాఖలు ఒకటిగా పరిగణించవలసిన ఆవశ్యకత ఎంతేని కలదని వివరించిరి. వై. సి. రంగారెడ్డి, అహమ్మదుల్లా ఖ్వాద్రి మున్నగు

సభ్యులు కూడ శ్రీ సుబ్బారెడ్డిగారి అభిప్రాయముతో ఏకీభవించిరి. నిరక్షరాస్యతా నిర్మూలనకు పౌరగ్రంథాలయముల పాత్ర యెంతేని కలదని, కావున ఈ రెండుశాఖలు ఒకేశాఖగా పరిగణింపబడవలసిన అవసరము కలదని శ్రీ అహమ్మదుల్లా ఖాద్రిగారు నొక్కి చెప్పిరి.

5—5—1967 వ తేది జరిగిన రాష్ట్ర గ్రంథాలయ కమిటీ సమావేశమునందు కూడ కమిటీ సభ్యులైన శ్రీ కోదాటి నారాయణరావు, శ్రీ ఆంథోనిరెడ్డి మున్నగువారు కూడ ఈ రెండుశాఖల నొకేశాఖగా గుర్తించవలసిన ఆవశ్యకతను గూర్చి నొక్కి చెప్పిరి.

ఈ విధముగా పలువురు ప్రముఖులు ఈ రెండు శాఖలను ఒకే శాఖగా గుర్తించవలెనని ఏకాభిప్రాయమును కల్గియుండినప్పటికి, ప్రభుత్వము ఈ విషయమును కొంతకాలము తరువాత పరిశీలించుటకు అభిప్రాయపడినది.

ఆంధ్రప్రదేశ్ పౌరగ్రంథాలయ చట్టము 1960, ప్రకారము పౌర గ్రంథాలయశాఖ ప్రత్యేకించుట జరిగిన తర్వాత, రాఘవరెడ్డిగారికి పౌర గ్రంథాలయ శాఖ బాధ్యతలు మాత్రము అప్పగించబడినవి. వయోజన విద్యాశాఖను విద్యాశాఖకు చెందినవారు నిర్వహించుచుండిరి. 1960 సంవత్సరము తరువాత 1968 సంవత్సరము వరకు కాలక్రమేణ రాష్ట్రమునందు వయోజన విద్యావ్యాప్తి కార్యక్రమములు సక్రమముగా జరుగలేదు. తగుగ్రాంట్లను ప్రభుత్వము మంజూరు చేయలేకపోవుటయే యిందులకు ప్రధాన కారణము. రాష్ట్రములోని పౌర గ్రంథాలయములు మాత్రము క్రొత్తగా అక్షరాస్యులైన వయోజనులకు ప్రయోజనకరమైన పుస్తకముల నందించుచుండినవి.

## వివిధ వృత్తులకు సంబంధించిన సాహిత్యము ద్వారా వయోజన విద్యాబోధన జరుగవలెనని కేంద్ర విద్యామంత్రి శ్రీ ప్రతాప్ చంద్ర చందూర్‌గారి సూచన:

అదృష్టవశాత్తు కేంద్ర విద్యాశాఖామాత్యులైన శ్రీ ప్రతాప్ చంద్ర చందూర్‌గారు ప్రజలు నిరక్షరాస్యులుగానున్నచో ప్రజా ప్రభుత్వమున కేనాటికైన ముప్పు వాటిల్లవచ్చునని, ప్రభుత్వమునకు కూడ యిది శ్రేయోదాయకము కాదని యెంచి, వయోజన విద్యా వ్యాప్తికి అమిత ప్రోత్సాహమును కలిగించి, దేశమంతట పలు వయోజన విద్యాకేంద్రములను స్థాపించుటకు తోడ్పడిరి. 1965 సంవత్సరములో టెహరాన్‌లో జరిగిన వయోజన విద్యా సదస్సులో వయోజన విద్యకు సంబంధించిన పుస్తకములను Functional literacy ని దృష్టియందుంచుకొని తయారుచేసినచో వయోజనులకు మిగుల ప్రయోజనకరముగా నుండునని తీర్మానింపబడినది. ఇదేవిధముగా మన దేశములో వయోజన విద్యాకేంద్రములందు కూడ యిట్టి ప్రాముఖ్యత పాటించవలెనని కేంద్ర విద్యాశాఖామంత్రి సూచించిరి. మంత్రిగారి ప్రోత్సాహమువలన ఇప్పుడు దేశములో వయోజన విద్యాకేంద్రములందు Functional literacy కి ప్రాముఖ్యత నివ్వడము జరుగుచున్నది. Functional literacy కి ఎక్కువ ప్రాముఖ్యత నిచ్చినచో అక్షరాస్యుల సంఖ్య వృద్ధిచెందుటతోబాటు వయోజనులు వృత్తులలో పురోగమనము చెందగలరు.

## పౌరగ్రంథాలయ చట్టములో వయోజన విద్యావ్యాప్తికి సూచన:

ఆంధ్రప్రదేశ్ పౌరగ్రంథాలయ చట్టము 1960 నందు పౌర గ్రంథాలయములకే కాక, వయోజన విద్యా కార్యక్రమములకు కూడ గ్రాంట్లను మంజూరుచేయునట్లు సూచించబడవలెనని రాఘవరెడ్డిగారి కోరిక. ఆ ప్రకారము చట్టమునందు కూడ కొంతవరకు సూచించడము

జరిగినది. వయోజన విద్యా కేంద్రాల కేగాక కమ్యూనిటీ కేంద్రాలకు, తదితరసంస్థలకుకూడ ఆర్థికముగా అనుకూలపరిస్థితులలోనున్న లోకల్ లైబ్రరీ అథారిటీలు గ్రాంట్లు నిచ్చినచో ప్రయోజనకరముగా నుండు నని వీరి యభిప్రాయము. పాశ్చాత్య దేశములందలి కొన్ని పౌరగ్రంథాలయ చట్టములందు వయోజన విద్యా కార్యక్రమములను పౌర గ్రంథాలయాలలో నేర్పాటు చేయవలెనని స్థూలముగా సూచించ బడినది. ఉపన్యాసములు, చలనచిత్రములు, తదితర సాంస్కృతిక కార్యక్రమములను పౌర గ్రంథాలయములు చేపట్టుటకు ఆంధ్రప్రదేశ్ పౌరగ్రంథాలయ చట్టమునందు కూడ సూచించబడినచో మిగుల ప్రయోజనకరముగా నుండును.

### వయోజన విద్యావ్యాప్తికి విశ్వవిద్యాలయాలు చేయుచున్న కృషి:

వయోజన విద్యా కార్యక్రమములు ప్రవేశపెట్టు బాధ్యత తమది కాదను అభిప్రాయముగల విశ్వవిద్యాలయాధికారులు కొందరు లేకపోలేదు. కాని శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు డాక్టర్ జగన్నాథరెడ్డిగారు విశ్వవిద్యాలయములు ఈ బాధ్యతను వహించవలెనని భావించిరి.

పౌర గ్రంథాలయాల డిప్యూటీ డైరెక్టరుగాను, డైరెక్టరుగాను వయోజన విద్యావ్యాప్తికి బహువిధముల కృషి సల్పిన శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ అభివృద్ధి అధికారియైన (Development Officer) రాఘవరెడ్డిగారికి కూడ విశ్వవిద్యాలయమునందు వయోజన విద్యా విభాగమును స్థాపించ వలెనను కోరిక కల్గినది. విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు కూడ యిందులకు మిగుల ఉత్సాహముతో అంగీకరించిరి. యు. జి. సి. వారు కూడ ఈ పథకమును అంగీకరించి, వయోజన విద్యాశాఖలో పరిశోధన - బోధన - ప్రచారము అను మూడు విభాగముల నేర్పరచుటకు కూడ సమ్మతించిరి. ఈ విధముగా

నెలకొల్పబడిన వయోజన విద్యాశాఖ రాయలసీమ ప్రాంతములో వయోజన విద్యావ్యాప్తి కెంతో తోడ్పడుచున్నది. ఈ వయోజన విద్యాశాఖ డైరెక్టరుగారైన డా॥ వి. ఎల్. ఎన్. రెడ్డిగారు మఱియు ఆ శాఖ అధ్యాపకులు సందర్భావసరముల పురస్కరించుకొని, రాయలసీమలోని జిల్లాలకు వెళ్ళి వయోజన విద్యావ్యాప్తి కమిత కృషి సల్పుచున్నారు. ఉస్మానియా, ఆంధ్ర విశ్వవిద్యాలయముల లోని వయోజన విద్యాశాఖలు కూడ వయోజన విద్యా వ్యాప్తికి తోడ్పడుచున్నవి.

గ్రంథపాలకులకు వయోజన విద్యనుగురించి చక్కని అవగాహన కలుగ చేయవలెనను ఉద్దేశముతో రాఘవరెడ్డిగారు శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయము నందలి గ్రంథాలయ శాస్త్ర శిక్షణ యందలి పాఠ్యాంశములలో వయోజన విద్యకు సంబంధించిన విషయములను కూడ చేర్చిరి.

**విశ్వ విద్యాలయాలలో పదవీ విరమణ తరువాత వయోజన విద్యా వ్యాప్తికి రాఘవరెడ్డిగారు సల్పుచున్న కృషి :**

రాఘవరెడ్డిగారు విశ్వవిద్యాలయముల నుండి పదవిని విరమించిన అనంతరము కూడ వయోజన విద్యావ్యాప్తికి మిగుల కృషి చేయుచు, కళాశాలలలోను, గ్రామములలోను వయోజన విద్యా కార్యక్రమములను గురించి ఉపన్యాసముల నిచ్చుచున్నారు. వీరు ప్రస్తుతము చిత్తూరుజిల్లా వయోజన విద్యా సంఘమునకు అధ్యక్షులుగా మాత్రమేగాక, రాష్ట్ర వయోజన విద్యా సంఘమునకు ఉపాధ్యక్షులుగాను మఱియు కార్యవర్గ సభ్యులుగాను కూడ వ్యవహరించుచున్నారు. ఈ విధముగా రాఘవరెడ్డిగారు వయోవృద్ధులయినప్పటికి, రాష్ట్రమునందలి పలు ప్రాంతములకు వెళ్ళి ఈ నాటికిని పలు ఉపన్యాసముల నొసగుచూ, వయోజన విద్యా వ్యాప్తికి శాయశక్తుల కృషి చేయు చుండుట ప్రశంసనీయమైన విషయము.



26—5—1982 తేదీన శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయములో వయోజన విద్యా విభాగమునందు రాఘవరెడ్డిగారికి డైరెక్టరు శ్రీ వి. ఎల్. ఎన్. రెడ్డిగారు సన్మానము చేసి మెమెంటోను సమర్పిస్తున్న దృశ్యం.

# (బి) పౌరగ్రంథాలయాలలో దృశ్య-శ్రవణ విద్యా కార్యక్రమములు :

గ్రంథాలయములందు పుస్తకములు, పత్రికలు మున్నగునవి మాత్రమే గాక, దృశ్య - శ్రవణ విద్యకు సంబంధించిన పరికరములు అనగా 16 మి. మి. ఫిల్ములు, టేప్‌రికార్డర్‌లు, రేడియోలు మున్నగు వాని నుంచవలసిన యవసరము కూడ ఎంతేని గలదు. విజ్ఞాన వికాసాభివృద్ధికి గ్రంథాలయాలలో ప్రధానముగా నుండవలసినవి పుస్తకములే. కావున గ్రంథాలయములలో కేవలము తగినన్ని పుస్తకములు, పత్రికలు మాత్రిమున్న సరిపోవునని కొందరి అభిప్రాయము

విజ్ఞానార్జనకు పుస్తకములు ప్రధానముగా ప్రయోజనకరములైనను రేడియో, ఫిల్ములు మున్నగు దృశ్యశ్రవణ పరికరములు కొన్నిసమయములలో విజ్ఞానాభివృద్ధికి అత్యంత ప్రయోజనకరము లను విషయము గ్రహించదగినది. కేవలము పుస్తకములు, పత్రికలు మాత్రమేగాక ఫిల్ములను; రేడియోలను, టేప్‌రికార్డర్‌లను, ఫిల్మ్‌స్ట్రిప్స్‌ను మున్నగు వాటిని కొన్నిసమయాలలో ఉపయోగించి తద్వారా విజ్ఞాన విస్తరణ వికాసముల కల్గించవలసిన బాధ్యత పౌర గ్రంథాలయముల పైని ఎంతేని గలదు.

## పౌర గ్రంథాలయాలలో ఆధునిక దృశ్య-శ్రవణ విద్యాపరికరముల ఆవశ్యకత :

రెండవ ప్రపంచయుద్ధకాలములో అమెరికాలో ఫిల్ముల సహాయమున యుద్ధశిక్షణను గరపి, స్వల్పకాలమునందే పెక్కువేల మందిని యుద్ధవీరులుగా జేసిరి. ఫిల్ముల సహాయము తీసికొనకున్నచో తక్కువ కాలమున అనేకులను శిక్షితుల జేయుటకు అవకాశముండెడిది గాదు. యుద్ధానంతరము గ్రంథాలయములకు, పాఠశాలలకు కూడ ఫిల్ములను, టేప్‌రికార్డర్‌లను, రేడియోలను పంపిణీ చేసి, ఈ నవీన పరికరముల ద్వారా సత్వర జ్ఞానవికాసాభివృద్ధికి కృషి చేసిరి. ఇంగ్లండు మున్నగు యితర పాశ్చాత్యదేశీయులు కూడ ఈ నవీన పరికరములను పాఠశాలలలో, గ్రంథాలయములలో ఉపయోగించుచూ వచ్చిరి. ఈ విషయములను గురించి క్రొత్తగా స్థాపించబడిన గ్రంథాలయములందలి గ్రంథపాలకులకు రాఘవరెడ్డిగారు తెలియజేయుచూ వాటి ప్రయోజనములను గురించి వివరించుచుండిరి. గ్రంథపాలకులు కూడ యిటువంటి నవీన పరికరముల నుపయోగించి, గ్రంథాలయముల నభివృద్ధి పరచుటయే గాక, పాఠకులకు కావలసిన విజ్ఞాన వికాసమును కూడ కల్గించవలెనను అభిలాషను కల్గియుండిరి. కాని, ఆధునిక దృశ్య - శ్రవణ

పరికరములు ఎక్కువ వెల కల్గినవి. కావలసిన పుస్తకములనే కొనలేని స్థితిలోనున్న గ్రంథాలయములు ఈ పరికరములను కొను స్థితిలో లేకుండినవి.

1956 సంవత్సరము నాటికి అనగా ఆంధ్రప్రదేశ్ అవతరణ నాటికి, పెక్కు గ్రంథాలయములు మాత్రము గ్లోబులను, చార్టులను మున్నగు పరికరములను మాత్రము కల్గియుండినవి. కొన్ని గ్రంథాలయములు మాత్రము రేడియోలను కూడ కల్గియుండినవి. పౌర సంబంధ శాఖవారు కొన్ని గ్రంథాలయాలలో మాత్రము చలనచిత్ర ప్రదర్శనముల నిచ్చుచుండిరి. 1956 సం॥ పూర్వము చలనచిత్రముల ప్రదర్శించు చుండిన గ్రంథాలయములు నామమాత్రము గానే యుండినవి.

## ఆంధ్రప్రదేశ్ అవతరణానంతరము పౌరగ్రంథాలయములలో దృశ్య – శ్రవణ పరికరముల సేకరణ :

ఆంధ్రప్రదేశ్ అవతరణానంతరము గ్రంథాలయములయందలి రేడియోల సంఖ్య క్రమముగా పెరిగినది. చిన్నశాఖా గ్రంథాలయములయందును రేడియోల నుంచడము జరిగినది. రేడియో ప్రసార కార్యక్రమములపై ప్రజలకు కూడ మక్కువ పెరిగి, బహుళ సంఖ్యలో గ్రంథాలయములకు వచ్చి ప్రసార కార్యక్రమములను శ్రద్ధతో వినెడివారు. అక్షరజ్ఞానము లేనివారికి కూడ, ఈ రేడియో ప్రసార కార్యక్రమములు మిగుల ప్రయోజనకరమని గ్రంథాలయ పాలకులు గుర్తించి, వారికి వినుటకు తగిన సౌకర్యములను కలుగజేయుచుండిరి.

జిల్లా కేంద్ర గ్రంథాలయములకే గాక, శాఖాగ్రంథాలయములకు కూడ దేశపటములు, గ్లోబులు తదితర పరికరములు పంపిణీ చేయబడినవి. పాఠకుల కివి కూడ మిగుల ప్రయోజనకరముగా నుండినవి. గ్రంథపాలకులకు ఫిల్ములను, టేప్‌రికార్డర్‌లను గ్రంథాలయము

లందు ప్రవేశపెట్టవలెననెడి కుతూహల ముండినది. ఆర్థిక పరిస్థితు లను కూలముగా లేనందున ఈ గ్రంథాలయములు ఆధునిక పరికరముల కొనుగోలుకు నోచుకోనలేక పోయినవి. పౌరసంబంధ శాఖవారు గ్రంథాలయములందు చలనచిత్ర ప్రదర్శనముల నిచ్చుచుండిరి. 1956 సంవత్సరమునకు పూర్వముకన్న ఈ శాఖవారు ఏర్పాటుచేసిన చలన చిత్రముల సంఖ్య పెరిగినది.

## గ్రంథాలయాలలో చలనచిత్ర ప్రదర్శనములకు ఉన్నత పాఠశాలల సహకారము :

అవిభక్త మదరాసు రాష్ట్రమునందును, ఆంధ్రరాష్ట్రము ఏర్ప డిన తరువాతను మఱియు ఆంధ్రప్రదేశ్ అవతరణానంతరము రాఘవ రెడ్డిగారు ఐదు వందలకు పైగా ఉన్నతపాఠశాలలలో పనిచేయు ఉపా ధ్యాయులకు దృశ్య - శ్రవణ పరికరముల నుపయోగించు విధానము లను గురించి శిక్షణలనిచ్చిరి. పలు పాఠశాలలయందు కూడ 16 ఎమ్. ఎమ్. ప్రొజెక్టర్లు, ఫిల్ములు గూడ వుండినవి. రాఘవరెడ్డిగారు వారి దగ్గర శిక్షణ పొందిన ఉపాధ్యాయులకు మఱియు ప్రధానోపాధ్యాయు లకు వారిపాఠశాలలలోనున్న ఫిల్ముప్రొజెక్టర్‌లను, ఫిల్ములను అరువు యివ్వవలసినదిగా కోరుచుండెడివారు. గ్రంథపాలకు లీ ఉపాధ్యాయుల సహకారముతో గ్రంథాలయములందు చలనచిత్ర ప్రదర్శనముల నేర్పాటు చేసికొనవలెనని రాఘవరెడ్డిగారు వివరించుచుండిరి. ఉదా హరణకు, నెల్లూరుజిల్లా కేంద్ర గ్రంథపాలకుడు ఎన్. వి. రామిరెడ్డి నెల్లూరు ఉన్నతపాఠశాలలో వున్న ఫిల్ము ప్రొజెక్టరును, ఫిల్మును అరువు తీసికొని ఫిల్ముప్రదర్శనల నేర్పాటు చేసిరి. ఎన్. వి. రామిరెడ్డి (నెల్లూరు) కె. యస్. ప్రకాశం (అనంతపురం), రామారావు (ఆదిలా బాదు), చంద్రశేఖరరావు (మచిలీపట్నం) తదితరులు ఫిల్ము ప్రదర్శన లను ఏర్పాటుచేయుటలో ప్రశంసనీయమైన కృషి చేసిరి.

## 1960 ఆంధ్రప్రదేశ్ పౌరగ్రంథాలయ చట్టము అమలులోనికి వచ్చిన యనంతరము గ్రంథాలయాలలో దృశ్య – శ్రవణ విద్యావిస్తరణ కార్యకలాపములు :

1960 సంవత్సరము తరువాత ఫిల్ముప్రొజెక్టర్లను గ్రంథాలయములకు కొనుటకు గ్రంథపాలకులలో ఉత్సాహము పెరిగినది. అనంతపురము, ఆదిలాబాదు, కృష్ణా మున్నగు జిల్లాల లోకల్ లైబ్రరీ అథారిటీలు కూడ ఫిల్ముప్రొజెక్టరులను కొనుగోలు చేసినవి. ప్రభుత్వము ఐదువేల రూపాయలను కృష్ణాజిల్లాకు ప్రొజెక్టర్ కొనుగోలు నిమిత్తము మంజూరు చేసినది. రాష్ట్ర కేంద్రగ్రంథాలయమునకు, గుంటూరు ప్రాంతీయ గ్రంథాలయమునకు కూడ ప్రభుత్వము ఫిల్ముప్రొజెక్టర్లను పంపిణీ చేసినది.

1960 సంవత్సరము తరువాత ప్రొజెక్టర్లు లేని గ్రంథాలయములందు పౌర సంబంధశాఖవారు చలనచిత్ర ప్రదర్శనములను విరివిగా నిచ్చుచూ వచ్చిరి. మారుమూల ప్రాంతములందలి కొన్ని శాఖా గ్రంథాలయములందు కూడ చలనచిత్ర ప్రదర్శనముల నిచ్చుచు వచ్చిరి. ఈ విధముగా పౌర సంబంధశాఖవారు అమిత శ్రద్ధతో చలనచిత్ర ప్రదర్శనముల మూలమున ప్రొజెక్టర్లు లేని గ్రంథాలయములకందించిన సహాయము చేసినసేవ ప్రశంసనీయము.

ప్రొజెక్టరులున్న గ్రంథాలయాలకు వెళ్ళినటువంటి సందర్భములందు పిల్లల కెటువంటి ఫిల్ములను చూపవలెను, పెద్దల కెటువంటి ఫిల్ములను చూపవలె ననువిషయములను గురించి రాఘవరెడ్డిగారు గ్రంథపాలకులకు తెలియజేయుచుండిరి. వినోద, ఉల్లాసకరమయిన చలనచిత్రములను గ్రంథాలయములయందు ప్రదర్శించుటవలన ఇటువంటి చిత్రములను తిలకించుట కనేకులు వచ్చెడివారు. వీరు కేవలము చలన చిత్రములను చూచుటయే గాక ఈ అవకాశము ద్వారా

పుస్తకములను కూడ పఠించుట కలవాటుపడి, తరచు గ్రంథాలయా లకు వచ్చుటకు ఉత్సాహవంతులగు చుండిరి. గ్రంథాలయ పాఠకుల సంఖ్య కూడ వృద్ధిచెందుచుండుట వలన, పుస్తక భాండాగారులు వినోదోల్లాసకర చిత్రములను ప్రదర్శించుటను తమ బాధ్యతగా గుర్తించవలెనని కూడ రాఘవరెడ్డిగారు గ్రంథపాలకులకు విశదీకరించు చుండిరి.

## పౌర గ్రంథాలయాలలో నిరక్షరాస్యులకు దృశ్య – శ్రవణ విద్యా కార్యక్రమములు :

రాష్ట్రమునందు 70% పైగా నిరక్షరాస్యులు కలరని, వీరికి ప్రయోజనకరమయిన చలనచిత్రములను కూడ గ్రంథాలయములందు ప్రదర్శించవలెనని, ఈ విధమయిన ప్రదర్శన లిచ్చుట ద్వారా నిరక్షరాస్యులు జ్ఞానవికాసమును పొందగలరని రాఘవరెడ్డిగారు గ్రంథపాలకులకు వివరించుచుండిరి. కేంద్ర సమాచారశాఖవారు తయారు చేసిన ఫిల్ములను కొందరు గ్రంథపాలకులు అరువు పొంది ప్రదర్శించు చుండిరి.

చదువరులకు కూడ ప్రయోజన కరమైన బోధనా చలన చిత్రములు (Teaching films), చారిత్రాత్మక చలన చిత్రములు (Historical films), యాత్రలకు సంబంధించిన చలన చిత్రములు (Travel films) మున్నగు చలన చిత్రములను కూడ ప్రదర్శించెడి వారు.

మదరాసులోని యు. ఎస్. ఐ. ఎస్. కేంద్రము నుండి, ఆంధ్ర ప్రదేశ్ సమాచార శాఖనుండి, పాఠశాలల నుండి ఫిల్ములను అరువు పొంది, కొన్ని గ్రంథాలయములందు ప్రదర్శించుచుండిరి.

16 యం. యం. ఫిల్ములనే గాక 35 యం. యం. ఫిల్మ్ స్ట్రిప్‌లను కూడ కొనవలెనని, రాఘవరెడ్డిగారు గ్రంథ పాలకులకు వివ

రించుచుండిరి. 35 యం. యం. ఫిల్ము స్ట్రిప్‌లు ప్రదర్శించుటవలన తెరపైనున్న దృశ్యములను గురించి చర్చలు జరిపి, వాటిని గురించి ప్రజలకు విశదముగా తెలియజేయవచ్చునని వీరు స్పష్టపరచు చుండిరి. ఈ విధమయిన ఫిల్ము స్ట్రిప్‌లు కల్గిన గ్రంథాలయముల సంఖ్య నామ మాత్రమే.

ప్రొజెక్టర్‌లు లేని జిల్లా కేంద్ర గ్రంథాలయముల యందే గాక. పలు శాఖా గ్రంథాలయముల యందు కూడ చలనచిత్రములను రాష్ట్ర సమాచార శాఖవారు ప్రదర్శించిరి. గ్లోబులను, చిత్రపటములను మున్నగు వాటిని చాలా శాఖా గ్రంథాలయాలలో కూడ ఎక్కువగా ఉపయోగించిరి.

1960 సంవత్సరము తరువాత చిన్న శాఖా గ్రంథాలయముల యందు కూడ రేడియోలను ప్రవేశపెట్టుట జరిగినది. ఈ రేడియో కార్యక్రమములకు పెక్కుమంది విచ్చేసెడివారు. ఈ కార్యక్రమములు ముగిసిన యనంతరము, కార్యక్రమములను విన్నటువంటి శ్రోతలు అప్పుడప్పుడు గ్రంథపాలకులతో కార్యక్రమములను గురించి చర్చించు చుండిరి. ఈ విధముగా చర్చించి శ్రోతలు తమ విజ్ఞానమును పెంపొందించు కొనుచుండిరి. ఉదా :- చిత్తూరు జిల్లా కేంద్ర గ్రంథాలయము.

## రాష్ట్ర కేంద్ర గ్రంథాలయములో దృశ్య - శ్రవణ విద్యా కార్యక్రమాలు:

1960 సంవత్సరము తరువాత ప్రభుత్వము ఫిల్ము ప్రొజెక్టర్, టేప్‌రికార్డరు, పబ్లిక్ అడ్రస్ పరికరములు మున్నగు ప్రచార సాధనములను రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమునకు పంపిణీ చేసినది. అప్పటి నుండి చలనచిత్ర ప్రదర్శనములు రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమందు తరచుగా జరుగు చుండినవి. పెద్దలు, పిల్లలు విద్యావంతులు, నిరక్షరాస్యులు మున్నగు పలువురికి ఈ ప్రదర్శనలు వారి జ్ఞానమును మరింత పెంపొందింప జేసికొనుటకు వీలయినది. నిరక్షరాస్యు లధిక

సంఖ్యలో వచ్చి యీ ప్రదర్శనలను తిలకించి ఆనందించు చుండెడివారు. వీరి జ్ఞాన వికాసమునకు ప్రయోజనకరమయిన చిత్రములను కూడ అప్పుడప్పుడు ప్రదర్శించడము జరుగుచుండినది. పిల్లలు పాడెడి పాటలను టేప్‌రికార్డర్ నందు రికార్డుచేసి తిరిగి పిల్లలకు వినిపించు చుండెడివారు. దీని వలన పిల్లలు మిగుల ఆనందభరితు లగుచుండిరి. గ్రంథాలయ వారోత్సవ సందర్భాలలో రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమునందు చలన చిత్రములు విరివిగా ప్రదర్శింప బడినవి. గొప్ప విద్యావంతుల, మేధావుల ప్రసంగములను రికార్డుచేసి గ్రంథాలయములందు అక్షరాస్యులకేగాక నిరక్షరాస్యులకు కూడ వినిపించు చుండెడివారు.



రాష్ట్ర కేంద్ర గ్రంథాలయములో వివిధభాగముల యభివృద్ధికి కృషిచేసిన
టి. వి. రమణయ్య.

## గుంటూరు ప్రభుత్వ ప్రాంతీయ గ్రంథాలయములందు దృశ్య - శ్రవణ విద్యా కార్యక్రమములు :

గుంటూరు ప్రభుత్వ ప్రాంతీయ గ్రంథాలయమునకు కూడ టేప్‌రికార్డరు, ఫిల్ము ప్రాజెక్టరు, రేడియో, పబ్లిక్ అడ్రస్ పరికరములు మున్నగువాటిని ప్రభుత్వము పంపిణీ చేసినది. సాధారణముగా వార

మునకు రెండు పర్యాయములు చలన చిత్రములను ఈ ప్రాంతీయ గ్రంథాలయమందు ప్రదర్శించుచుండిరి. ప్రజలకు మిగుల ఉపయోగకరమైన చలనచిత్రముల నీ గ్రంథాలయమునందు ప్రదర్శించుటచే అనేకులు ఈ ప్రదర్శనలకు వచ్చుచుండిరి. గుంటూరు పట్టణములోని నిరక్షరాస్యులకు గూడ ఈ ప్రదర్శనలు మిగుల ప్రయోజనకరముగా నుండి, వారికి జ్ఞానవికాసమును కల్గించుటకు కూడ మిగుల తోడ్పడినవి. జాతీయ పర్వదినములయందును, గాంధీజయంతి, గ్రంథాలయ వారోత్సవములు మున్నగు పవిత్రదినములందును చలనచిత్ర ప్రదర్శనము లెక్కువగా ఏర్పాటు చేయుచుండిరి. ఈ గ్రంథాలయమునకు మదరాసులోని యు. ఎస్. ఐ. ఎస్. గ్రంథాలయము నుండి, మఱియు ప్రభుత్వ సమాచార శాఖనుండి ఫిల్ములను కావలసినప్పుడు అరువు పొందుచుండిరి.

రేడియో ప్రసార కార్యక్రమములను ఈ ప్రాంతీయ గ్రంథాలయమునందు చక్కగా అమలుజరుపుచుండిరి. ఈ కార్యక్రమములవలన కూడ గ్రంథాలయ పాఠకులు మిగుల ప్రయోజనమును పొందినారని చెప్పక తప్పదు. మేధావుల ఉపన్యాసములను, దేశభక్తి గేయములను టేప్ రికార్డరు ద్వారా వినిపించుచుండిరి. గుంటూరు ప్రాంతీయ గ్రంథాలయమునందు వయోజన విద్యా విభాగాధికారి బాధ్యతలను కల్గియుండిన శ్రీ ఎన్. బి. ఈశ్వరరెడ్డిగారు కూడ, అమితశ్రద్ధతో ప్రాంతీయ గ్రంథాలయమునందు పైనుడివిన కార్యక్రమములను చక్కగా నిర్వహించి గ్రంథాలయ పాఠకులకు ప్రయోజనకరమయిన దృశ్య - శ్రవణ విద్యా కార్యక్రమములను కూడ పెక్కింటిని నిర్వహించి, పాఠకులకు బహుముఖ శ్రేయోదాయక సేవ సల్పిరి. రాష్ట్రమునందలి ఇతర ప్రాంతీయ గ్రంథాలయములందు దృశ్య-శ్రవణ విద్యా కార్యక్రమములకు సంబంధించిన పరికరములు లేనందున పౌర సంబంధ శాఖవారు చలనచిత్ర ప్రదర్శనములను తరచు ఏర్పాటు చేసెడివారు. ఈ ప్రాంతీయ గ్రంథాలయములందు గ్లోబులు,

చిత్రపటములు మున్నగునవి వీలయినంతవరకు ఉపయోగింపబడు చుండెడివి.

### ఏలూరు సంచార గ్రంథాలయము ద్వారా దృశ్య – శ్రవణ విద్యా కార్యక్రమములు :

1956 సంవత్సరములో స్థాపించబడిన ఈ సంచార గ్రంథాలయము పగటివేళలందు గ్రామములలో పుస్తకములను అరువిచ్చుచుండినది. ఈ గ్రంథాలయమునకు కూడ ప్రభుత్వమొక ఫిల్ము ప్రొజెక్టరును పంపిణీ చేసినది. ఈ సంచార గ్రంథాలయ గ్రంథపాలకుడు సాయంవేళలయందు గ్రామ ప్రాంతములందు చలనచిత్ర ప్రదర్శనముల నేర్పాటు చేసెడివాడు. ఈ గ్రంథాలయ అధికారి ఆరోగ్యము, వ్యవసాయము మున్నగువాటికి సంబంధించిన చలన చిత్రముల నెక్కువగా ప్రదర్శించుచుండెను. ఈ విధమయిన ప్రదర్శనలు పశ్చిమగోదావరి జిల్లాలోని పలు గ్రామీణులకు మిగుల ప్రయోజనకరముగా నుండినవి.

### దృశ్య – శ్రవణ విద్యావ్యాప్తికవసరమగు పరికరముల కొనుగోలుకు ప్రభుత్వగ్రాంటు – ఆవశ్యకత:

ఇంగ్లండు తదితర పాశ్చాత్యదేశములందు దృశ్య – శ్రవణ విద్యా విధానములో అనుభవమును పొందిన రాఘవరెడ్డిగారు మన రాష్ట్రములో పౌరగ్రంథాలయములందు పాఠకులకు ప్రయోజనకరముగా ఆధునిక పద్ధతిలో దృశ్య–శ్రవణ విద్యా కార్యక్రమముల నిర్వహణయందు మిగుల శ్రద్ధను వహించి, అక్షరాస్యులకే గాక నిరక్షరాస్యులకు కూడ ప్రయోజనకరముగా నుండునట్లు కార్యక్రమములను రూపొందించి, కొన్ని గ్రంథాలయములకు ప్రభుత్వముచే ఫిల్ము ప్రొజెక్టరులను తదితర పరికరములను మంజూరు చేయించి, ఇటువంటి కార్యక్రమములు సక్రమముగా నిర్వహింపబడుటకు బహువిధముల పాటుపడిరి. వీరి కృషి ప్రశంసింపదగినది. ప్రభుత్వము గ్రంథాలయములకు కేవలము పుస్తకముల కొనుగోలునకే గాక– దృశ్య–శ్రవణ సాధనముల కొనుగోలుకు కూడ కొంత మొత్తమును కేటాయించవలసిన ఆవశ్యకత ఎంతేని గలదు.



# ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయశాఖ-సాహిత్య ప్రచురణకు ప్రోత్సాహము.

భారతీయ భాషలలో పుస్తక ప్రచురణ మిగుల స్వల్పము. భారత దేశమునందు హిందీ భాష తరువాత అధిక సంఖ్యాకులు మాట్లాడు భాష తెలుగు. ఐనను తెలుగులో సాహిత్య ప్రచురణ అంతగా అభివృద్ధి చెందలేదు. తమిళము, మరాఠీ, బెంగాలీ మున్నగు భాషలలో సాహిత్య ప్రచురణ తెలుగునందు కన్న అధికముగా నున్నది.

ఆంధ్ర రాష్ట్ర అవతరణ సం॥ 1953 - 54 లో ఆంధ్ర ప్రాంతమునందు తెలుగు ప్రచురణల సంఖ్య 493 మాత్రమే. ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన సం॥ అనగా 1956 - 57 సం॥ ఆంధ్ర ప్రదేశ్ లో తెలుగు ప్రచురణల సంఖ్య 538 మాత్రమే. 1980 సం॥ ప్రచురణల సంఖ్య 1489 కి పెరిగినది. ఈ నాటికి కూడా తెలుగు భాషలో ప్రతి ఏటా ప్రచురింపబడు పుస్తకముల సంఖ్య తగినంతగా వృద్ధి చెందలేదు. తెలుగులో ప్రచురింపబడు పుస్తకముల సంఖ్య వృద్ధి చెందుటకు తగిన శ్రద్ధను తీసికొనవలసిన అవసర మెంతేని కలదు. రాష్ట్ర ప్రభుత్వము కూడ గట్టి పట్టుదలతో తెలుగు పుస్తకముల ప్రచురణకు, తెలుగు సాహిత్యాభివృద్ధికి మునుపటికంటె ఎక్కువ ప్రాముఖ్యత నివ్వవలసిన ఆవశ్యకత ఎంతేనికలదు. తెలుగుభాషయందు తగినన్ని పుస్తకములు లేకపోవటము వలన గ్రంథపాలకులు సంతృప్తి కరముగా పుస్తకములను పాఠకులకు అందించలేకున్నారు. ఈ విషయమును గ్రహించిన రాఘవరెడ్డిగారు రచయితలకు తెలుగు నందు తగినన్ని రచనలను వెలువరచ వలసిన ఆవశ్యకతను తెలియజేసి, వారికి ప్రోత్సాహము కలుగజేసి, ప్రభుత్వమునుండి వారికి కొంత ఆర్థిక సహాయమును కూడ అందజేయుటకు కృషి చేసినారు.

## బాల సాహిత్య ప్రచురణ:

రాఘవరెడ్డిగారు విద్యాశాఖయందు ప్రాథమిక పాఠశాలల తనిఖీ అధికారిగా నుండెడి కాలమునందు, పాఠశాలల గ్రంథాలయము లందు తగినన్ని పుస్తకము లుండెడివికావు. పాఠ్యపుస్తకములు మాత్ర ముండెడివి. విద్యార్థులను తీర్చి దిద్దుటకు కేవలము పాఠ్య గ్రంథములేగాక, వారి విజ్ఞానాభివృద్ధికి, వినోదమునకు, మనోవికాసము నకు తగు పఠన సామగ్రి ఎంతో అవసరము. అట్టి పుస్తకములను గ్రంథాలయములందు లభింపజేసి పాఠశాలల విద్యార్థులకు ఉల్లాసకర ముగా నుండునట్లు గ్రంథాలయములను తీర్చి దిద్దవలెనని గ్రంథపాల కులకు, ఉపాధ్యాయులకు రాఘవరెడ్డిగారు తెలియచేయుచుండిరి.

బాలలకు సంబంధించిన తెలుగు పుస్తకముల జాబితాను తయారు చేయవలసినదిగా బాలల సాహిత్యాభిమానియగు గిడుగు వేంకట సీతాపతిగారిని, రాఘవరెడ్డిగారు కోరిరి. వారి కోరిక మేరకు గిడుగు వేంకట సీతాపతిగారు 1964 సం॥ ఆ నాటికి తెలుగులో వెలు వడి యుండిన పుస్తకముల జాబితాను రూపొందించిరి. ఈ జాబితాను బట్టి ఆనాటికి పిల్లలకు మిగుల ప్రయోజనకరముగా నుండిన పుస్తకముల సంఖ్య 200 కు తక్కువే. పిల్లలకు సంబంధించిన పుస్తకములను సుల భముగా ఎన్నిక చేయుటకు గ్రంథపాలకులకు కూడ యీ జాబితా మిగుల యుపయుక్తముగా నుండినది. ఈ జాబితాలో సూచించిన ప్రతులను కొందరు గ్రంథపాలకులు తమ గ్రంథాలయములకు సేక రించినారు.

## వయోజనులకు అవసరమైన పఠన గ్రంథాలు:

ఆంధ్ర రాష్ట్రావతరణానంతరము ప్రత్యేకాధికారిగా నుండిన రాఘవరెడ్డి గారికి వయోజన విద్యాకార్యక్రమ బాధ్యతలను కూడా

అప్పగించడము జరిగినది. క్రొత్తగా అక్షరాస్యులయిన వయోజనులకు ప్రయోజన కరమైన పుస్తకములు మన రాష్ట్రములోని గ్రంథాలయములందు చాలా పరిమితముగా నుండినవి. రాఘవరెడ్డిగారు అట్టివారికి మిగుల ప్రయోజనకరమైన పుస్తకముల జాబితాను తయారు చేయించిరి. అట్టి పుస్తకములు 1956 – 57 సం॥ 40 వరకు మాత్రమే యుండినవి. వయోజనులకు సంబంధించిన పుస్తకములు మిగుల పరిమితముగా నుండుటచే ఆనాడు కొందరు వయోజనులు గత్యంతరము లేక గ్రంథాలయము లందు బాలలకు సంబంధించిన పుస్తకముల పఠించుచుండిరి. ఈ విధముగా బాలలకు సంబంధించిన పుస్తకములను పఠించుట వయోజనులకు అంత ప్రయోజనకరము గాదు. అయినప్పటికి వయోజన విద్యా సంబంధిత పుస్తకములు తగినన్ని లేకపోవుట వలన అక్షరాస్యులయిన వయోజనులకు బాల సాహిత్యమును పఠించుట తప్పనిసరి అయినది. క్రొత్తగా అక్షరాభ్యాసమును పొందిన వయోజనులకు ప్రయోజన కరమయిన పుస్తకములు గ్రంథాలయములందు లేకపోయినచో కాలక్రమేణ వారు తిరిగి నిరక్షరాస్యులగు అవకాశము కూడ లేకపోలేదు. కావున ఇటువంటి పరిస్థితులను గ్రహించిన రాఘవరెడ్డిగారు ప్రభుత్వమున కీ విషయములను స్పష్టపరచి, వయోజనులకు సంబంధించిన పుస్తకముల వ్రాయు రచయితలకు తగు ఆర్థిక సహాయములను కల్పించవలెనని సూచించిరి.

## ఉత్తమ గ్రంథాల ప్రచురణకు బహుమతులు :

ఉత్తమ రచయితలకు ప్రభుత్వము బహుమతి ప్రదానము చేయవలెనని రాఘవరెడ్డిగారి ఆకాంక్ష. ఈ విధముగా చేసినచో రచయితలకు తగు ఉత్సాహము కల్గుటయేగాక, తద్వారా ప్రయోజనకరమైన ఉత్తమరచనలు వెలువడగలవని వారి ఉద్దేశ్యము. 1953–54 సం॥ కేంద్రప్రభుత్వము ఉత్తమ రచనలు చేసిన రచయితలకు

బహుమతి ప్రదానము చేసినది. అదే విధముగా రాష్ట్రప్రభుత్వము కూడ ఉత్తమ రచనలకు బహుమతు లొసగవలెనని రాఘవరెడ్డిగారు రాష్ట్రప్రభుత్వమునకు సూచించిరి. వీరి అభిమతము మేరకు రాష్ట్ర ప్రభుత్వము కూడ ఒక్కొక్క ఉత్తమ రచనకు 500 రూ॥ల బహుమతిని ప్రకటించినది. బహుమతిని పొందిన ఉత్తమ పుస్తకములు : 1. బొమ్మరిల్లు, 2. లక్కపిడతలు, 3. పిల్లల బొమ్మల భారతము.

## బహుమతి గ్రహీతలకు ప్రోత్సాహము :

కేంద్రప్రభుత్వము బహుమతుల నందుకొన్న పుస్తకముల ప్రతులను రాష్ట్రప్రభుత్వమునకు ఉచితముగా పంపుచుండెడిది. రాష్ట్రప్రభుత్వ మీ పుస్తకములను రాష్ట్రములోని జిల్లా కేంద్ర, తదితర గ్రంథాలయములకు ఉచితముగా పంపుచుండెడిది. 1956-57 సం॥ రాష్ట్రప్రభుత్వ బహుమతుల నందుకొన్న పుస్తకముల వేయి ప్రతుల చొ॥న కొనుగోలు చేసి జిల్లా కేంద్ర, శాఖా తదితర గ్రంథాలయములకు వుచితముగా పంపినది. ఇదే విధముగా రాష్ట్రప్రభుత్వము ప్రతిఏటా బహుమతి పొందిన పుస్తకములను పంపు చుండినది. 1956-57 సం॥ రాష్ట్రప్రభుత్వము నుండి గ్రంథాలయములు ఉచితముగా పొందిన పుస్తకముల సంఖ్య 8,150 కి, పెరిగినది.

## పుస్తకప్రచురణ సంస్థలకు ప్రోత్సాహము :

జాతీయస్థాయిలో రెండు ప్రధానమైన పుస్తకప్రచురణ సంస్థలు కలవు. అవి : 1. కేంద్రసాహిత్య అకాడమీ; 2. భారతజాతీయ పుస్తకసంస్థ (National Book Trust of India)

1. కేంద్రసాహిత్య అకాడమీ:— ఈ సంస్థ 1954- సం॥ కేంద్రప్రభుత్వముచే స్థాపించబడినది. ఈ సంస్థ దేశములోని వివిధ భాషలయందు పుస్తకములను ప్రచురించుచున్నది. ఈ సంస్థ ప్రచు

రించిన పుస్తకములలో ఉత్తమమయిన వాటికి కేంద్రప్రభుత్వము బహుమతి ప్రదానము చేయుచున్నది. కేంద్రప్రభుత్వము యొక్క బహుమతిని పొందిన పుస్తకములను గ్రంథాలయములకు తప్పక తెప్పించవలెనని రాఘవరెడ్డిగారు గ్రంథపాలకులకు తెలియజేయు చుండిరి. పెక్కు లోకల్ లైబ్రరీ అథారిటీవారు తమ గ్రంథాలయ ములకు ఈ పుస్తకముల ప్రతులను సేకరించినారు.

2. భారత జాతీయ పుస్తక సంస్థ:- 1957 సం॥ ములో స్థాపించబడిన ఈ పుస్తక ప్రచురణ సంస్థ వివిధ రకములయిన పుస్తక ములను ప్రచురించుచున్నది. తెలుగుభాషలో కూడ ఈ సంస్థ పుస్తక ముల ప్రచురించుచున్నది. బాలసాహిత్య సంబంధమైన పుస్తకములను కూడా ఈ సంస్థ ముద్రించుచున్నది. ఈ సంస్థ ప్రచురణలలో ఉత్తమ మైన వాటికి కూడ కేంద్ర ప్రభుత్వము బహుమతి ప్రదానము చేసి నది. ఈ విధముగా బహుమతు లందుకొన్న పుస్తక ప్రతులను కూడ మన రాష్ట్ర ప్రభుత్వము కొనుగోలుచేసి, రాష్ట్రములోని పౌరగ్రంథా లయ ములకు పంపిణీ చేయవలెనని రాఘవరెడ్డిగారు ప్రభుత్వమును కోరెడివారు. ప్రభుత్వము రాఘవరెడ్డిగారి సూచనను ఆమోదించినది.

ఆంధ్రప్రదేశ్ నందు కూడ కొన్ని పుస్తక ప్రచురణ సంస్థలు స్థాపించబడినవి. వాటిలో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, ఆంధ్ర సారస్వత పరిషత్, తెలుగు భాషాసమితి మున్నగు ప్రచురణ సంస్థ లను ప్రధానముగా పేర్కొన వచ్చును. ఈ ప్రచురణ సంస్థలు వెలు వరచు ఉత్తమ రచనలను, రాష్ట్ర ప్రభుత్వ బహుమతుల నందుకొన్న పుస్తకములను గ్రంథాలయములకు తెప్పింపవలెనని రాఘవరెడ్డిగారు లోకల్ లైబ్రరీ అథారిటీలకు తెలియజేసిరి. పెక్కు లోకల్ లైబ్రరీ అథారిటీవారు రాఘవరెడ్డిగారి సూచన మేరకు ఇట్టి గ్రంథములను కొనుగోలు చేసినారు.

కేంద్ర, రాష్ట్రప్రభుత్వ బహుమతుల నందుకొన్న పుస్తకముల కొనుగోలుకు, బాలలకు, వయోజనులకు సంబంధించిన పుస్తకముల కొనుగోలుకు ప్రతి సంవత్సరము గ్రంథాలయ నిధులలో కొంత భాగ మును ప్రత్యేకముగా కేటాయించ వలెనని రాఘవరెడ్డిగారు లోకల్ లైబ్రరీ అథారిటీలకు సూచనలు చేయుచుండిరి. ఆ ప్రకారము లోకల్ లైబ్రరీ అథారిటీలు కూడ, ప్రతి సంవత్సరము బహుమతు లందుకొన్న పుస్తకములను బాలలకు మరియు వయోజనులకు సంబంధిం చిన పుస్తకములను కొనుగోలు చేయుచుండినవి. రాష్ట్రములోని జిల్లా కేంద్ర గ్రంథాలయము లన్నింటియందును, పలు శాఖా గ్రంథాల యములందును ఈ పుస్తకములు లభింప జేయబడి యుండిన కారణంగా, క్రొత్తగా విద్య నభ్యసించు వయోజనులకుకూడ ఈ గ్రంథా లయములు మిగుల ప్రయోజనకరముగా నుండినవి.

## లోకల్ లైబ్రరీ అథారిటీలచే పుస్తక ప్రచురణ:

ఆంధ్రప్రదేశ్ పౌరగ్రంథాలయ చట్టము 1960 అమలులోనికి వచ్చిన అనంతరము బాలలకు, వయోజనులకు ప్రయోజన కరమైన పుస్తకములను ముద్రించు బాధ్యత లోకల్ లైబ్రరీ అథారిటీలు కూడ గైకొనవలసిన అవసరమెంతేని కలదని రాఘవరెడ్డిగారు తెలియ జేసిరి. కాని ఆర్థిక యిబ్బందుల వలన, రాష్ట్రప్రభుత్వము యొక్క గ్రాంటు పరిమితముగా నుండుటవలన, రాష్ట్రమునందలి అన్ని లోకల్ లైబ్రరీ అథారిటీలు ఈ బాధ్యతను నిర్వర్తించలేక పోయినవి. కడప, హైదరాబాదుజిల్లా లోకల్ లైబ్రరీ అథారిటీలకుమాత్రము ఒక్కొక్క సంస్థకు రూ॥ 2,250 చొ॥ న పుస్తకముల ప్రచురణ నిమిత్తము ప్రభు త్వము ఆర్థికసహాయము చేసినది. కడప లోకల్ లైబ్రరీ అథారిటీ ప్రోత్సాహమువలన శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులుగారు 'ఆంధ్రుల చరిత్రను' శ్రీపాలా వేంకటసుబ్బయ్యగారు 'విజ్ఞానదీపికను'

రచించిరి. హైదరాబాదు లోకల్ లైబ్రరీ అథారిటీవారి కృషివలన 'పరిణామాలు - నిర్మాణాలు' అను పుస్తకము రచించబడినది. ఈ రచయితల కిచ్చిన ప్రతిఫలము స్వల్పమయినప్పటికి వారు రచించిన పుస్తకములు మాత్రము గ్రంథాలయములందు మిగుల ప్రయోజనకరముగా నున్నవి. ఈ పుస్తకములను రాష్ట్రములోని అన్నిగ్రంథాలయములకు ఉచితముగా పంపిణీ చేసిరి. వయోజనులకు సంబంధించిన పుస్తకములను రూపొందించుటకు వీలులేని పక్షమున ఇతర ప్రయోజనకర పుస్తకముల కొనుగోలు చేయుటకు గాను 1961 సం॥ రూ॥ 38,000 మొత్తమును రాష్ట్రప్రభుత్వము లోకల్ లైబ్రరీ అథారిటీలకు మంజూరు చేసినది. అదే సంవత్సరమున రాష్ట్రములోని తొమ్మిదిజిల్లాలలో లోకల్ లైబ్రరీ అథారిటీలకు జిల్లాకేంద్ర గ్రంథాలయములలోని పిల్లల విభాగముల నభివృద్ధిపరచుకొను నిమిత్తము ప్రతి లోకల్ లైబ్రరీ అథారిటీకి 1,500 రూపాయల మేరకు కేటాయించడం జరిగినది.

### ఉత్తమ రచయితలకు ఆర్థిక సహాయము :

ఆర్థికముగా యిబ్బంది గల రచయితలకు రాఘవరెడ్డిగారి దృఢప్రయత్నము వలన రాష్ట్రప్రభుత్వము వారి రచనల ముద్రణకు సహాయము అందజేసినది.

| ఉదా॥ రచయిత పేరు | రచన పేరు | మంజూరుచేసిన మొత్తము |
|---|---|---|
| 1. శ్రీ బి. రామరాజు, రీడర్, ఉస్మానియా విశ్వవిద్యాలయము, హైదరాబాదు | జానపదగీతములు | రు. 5000/- |
| 2. శ్రీ పి. యస్. ఆర్. అప్పారావు, పుస్తకముల జాతీయకరణ ప్రత్యేకాధికారి, హైదరాబాదు. | నాట్యశాస్త్రము | రు. 4.000/- |

3. శ్రీ దివాకర్ల వెంకటావధాని, రీడర్, ఉస్మానియా విశ్వవిద్యాలయము, హైదరాబాదు } ప్రాఙ్నన్నయయుగము రు. 4000/-

శ్రీ స్వామి వివేకానందవారి రచనలు ఆంధ్రీకరించుటకుగాను శ్రీరామకృష్ణ మఠమునకు 1960-61 సం॥ 10,000 రూ.ల మొత్తమును ప్రభుత్వము మంజూరు చేసినది.

## బాల సాహిత్య శిక్షణా శిబిరములు :

ఆంధ్రప్రదేశ్ అవతరణానంతరము బాలలకు సంబంధించిన రచనల పెంపొందించు నిమిత్తము, రెండు రచనాలయములు నిర్వహించడము జరిగినది. రచనాలయములందు పిల్లలకు సంబంధించిన పుస్తకముల రచించుటలో మెళకువలను, ప్రయుక్తులను గురించి రచయితలకు శిక్షణ యివ్వడము జరిగినది. ఈ విధముగా నిర్వహించబడిన ప్రతిరచనాలయమునందును ఇరువది మంది రచయితలు శిక్షణ పొందినారు. ఈ రచనాలయములు రెండు సంవత్సరములు నిర్వహింపబడినవి. ఈ రచనాలయములలో శిక్షణ పొందినవారిచే 45 పుస్తకములు రచింపబడినవి. వాటిలో ఇరువది పుస్తకములు ప్రచురింపబడినవి.

## ఉత్తమ సాహిత్య ప్రచురణకై చట్టములో అవకాశమునకు సూచన – దాని ఆవశ్యకత :

తెలుగులో సాహిత్యము తగినంతగా ప్రచురింపబడనందువలన దాని అభివృద్ధి నిమిత్తము బాలలకు, తదితరులకు సంబంధించిన రచనలు కావించు నిమిత్తము, రచయితలకు తగు ప్రోత్సాహమును కల్పించు నిమిత్తము నాల్గవ పంచవర్షిక ప్రణాళిక ద్రాఫ్టునందు రూ॥ 75,000 మొత్తమును మంజూరు చేయవలసినదిగా రాఘవరెడ్డి

గారు సూచించిరి. రచయితలకు, అనువాదకులకు ప్రోత్సాహము కల్పించునట్లు, ఉత్తమ రచనలకు బహుమతుల నొసగునట్లు ఆంధ్ర ప్రదేశ్ పౌర గ్రంథాలయ చట్టమునందు కూడ సూచింపబడ వలెనని రాఘవరెడ్డిగారి అభిప్రాయము. అంతేగాక పుస్తకముల కొనుగోలు నిధులందు 10% తక్కువ గాకుండ బహుమతుల నందుకొన్న ఉత్తమ రచనల, పిల్లలకు సంబంధించిన పుస్తకముల కొనుగోలు నిమిత్తము కేటాయించ బడవలెనని రాఘవరెడ్డిగారి అభిప్రాయము. ఈ విధముగా ఆంధ్రప్రదేశ్ పౌరగ్రంథాలయ చట్టమునందు సూచన కల్పింపవలె నని రాఘవరెడ్డిగారి అభిలాష.



# ఆంధ్రప్రదేశ్‌లో గ్రంథాలయ భవనములు:- పరికరములు:

గ్రంథాలయముల స్థాపన జరిగినంత మాత్రమున గ్రంథాలయోద్యమము ముందంజ వేసిన దనుట సరికాదు. గ్రంథాలయములకు తగిన భవనములు చాలా అవసరము. తగిన భవనములున్నచో గ్రంథాలయములు పాఠకుల నాకర్షింప గలవు. ఆధునిక పద్ధతులలో గ్రంథాలయములను నిర్వహింప వచ్చును.

## గ్రంథాలయ భవన నిర్మాణమునకు తక్కువ కేటాయింపులు:

1948 మదరాసు పౌర గ్రంథాలయ చట్టము, మరియు 1955 హైదరాబాదు పౌర గ్రంథాలయ చట్టము అమలులోనికి వచ్చినపుడు, రాష్ట్రమునందు గ్రంథాలయాల స్థాపన ప్రారంభదశ యందుండినదని చెప్పవచ్చును. గ్రంథాలయములు పలువురికి ప్రయోజనకరముగా నుండవలయునన్నచో తగు విశాలముతో కూడిన సుందరమగు భవనములు మిగుల అవసరము. కాని మన రాష్ట్రమునందు మొదటి, రెండవ పంచవర్ష ప్రణాళికలయందు లోకల్ లైబ్రరీ అథారిటీల ఆధీనములోని గ్రంథాలయములకు కేటాయించబడిన నిధులలో గ్రంథాలయ భవన నిర్మాణమునకు తగిన ప్రాముఖ్యత నివ్వలేదు. కాన భవనముల నిర్మాణము జరుగక పోయినది. మూడవ పంచవర్ష ప్రణాళిక యందు మాత్రము జిల్లా కేంద్ర గ్రంథాలయ భవనముల నిర్మాణమునకు కొంత మొత్తమును కేటాయించడము జరిగినది. అయినప్పటికిని యిది మిగుల స్వల్పమని చెప్పక తప్పదు. ఇట్టి పరిస్థితులలో వేరు గత్యంతరము లేకపోవుటచే అద్దె భవనముల యందు గ్రంథాలయములను స్థాపించ వలసిన అవసర మేర్పడినది. మహబూబ్ నగర్ నందు మాత్రమే జిల్లా కేంద్ర గ్రంథాలయము విరాళముగా పొందిన భవనమునందు ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ చట్టము అమలులోనికి రాకపూర్వమే స్థాపించడం జరిగినది. రాష్ట్రమునందలి తక్కిన జిల్లాల యందలి కేంద్ర గ్రంథాలయ భవనము లన్నియు అద్దె భవనములే యని చెప్పవచ్చును.

## రాష్ట్ర కేంద్ర గ్రంథాలయ భవన విస్తరణ:

నిజాం ప్రభుత్వ కాలమున స్థాపించబడిన హైదరాబాదులోని అసఫియా గ్రంథాలయ భవనము మాత్రము అద్దె భవనము కాదు. ఇది ప్రభుత్వమునకు చెందిన భవనము. నిజాం ప్రభువులు ఈ గ్రంథాలయ భవనమును మిగుల సుందరముగా నిర్మించి యుండిరి. రెండవ పంచవర్ష ప్రణాళికయందు ఈ భవన విస్తరణ నిమిత్తము తొమ్మిది లక్షల రూపాయలు కేటాయించడం జరిగినది. ఈ మొత్తముతో నిజాం ప్రభువులు నిర్మించియున్న అసఫియా గ్రంథాలయ భవన ప్రాంగణము నందు మరింత రమణీయముగా, విశాలముగా మరియొక భవనమును నిర్మించడం జరిగినది. 1961 వ సంవత్సరమున దీనికి ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి గారిచేత ప్రారంభోత్సవము చేయించడము జరిగినది.



రాష్ట్ర కేంద్ర గ్రంథాలయము వెలుపల ఉద్యానవనమును తిలకించుచున్న రాఘవరెడ్డిగారు.

పబ్లిక్ గార్డెన్స్‌లో నున్నటువంటి బాలల గ్రంథాలయము కూడ సొంత భవనములో యుండినది.

**గుంటూరులో ప్రభుత్వ ప్రాంతీయ గ్రంథాలయ స్వంత భవనము:**

విశాఖ పట్టణములోని ప్రభుత్వ కేంద్ర గ్రంథాలయమును గుంటూరుకు తరలించినపుడు మొదట అద్దె భవనములో ఏర్పాటు చేయడము జరిగినది. తర్వాత గుంటూరు నందలి జార్జిపుర మందిరమును ప్రభుత్వము రూ/- 31048-40 పైసల మొత్తమునకు కొనుగోలుచేసి కావలసిన మరమ్మతులను చేయించిన పిదప యీ భవనములోనికి యీ గ్రంథాలయము తరలింపబడినది.

**ఇతర ప్రాంతీయ గ్రంథాలయాలకు అదె భవనములు:**

రాష్ట్రములోని విశాఖపట్టణము, నిజామాబాద్, వరంగల్లు, తిరుపతి ప్రాంతీయ గ్రంథాలయములు అద్దె భవనము లందుండినవి. నాల్గవ పంచవర్ష ప్రణాళికయందు ప్రాంతీయ గ్రంథాలయ భవనముల నిర్మాణాభి వృద్ధులకు కొంత మొత్తమును కేటాయించ వలెనని ప్రభుత్వమునకు సూచించగా, ఆర్థిక యిబ్బందుల వలన ప్రభుత్వమిందులకు సమ్మతించ లేకపోయినది. కలెక్టర్లు కూడ ప్రాంతీయ గ్రంథాలయ భవనములకు సరిపడు స్థలమును కేటాయించక పోయిరి. ప్రాంతీయ గ్రంథాలయములను అద్దె భవనముల నుండి సొంత భవనములలోనికి మార్పు చేయుటకు వీలులేక పోవుటవలన, తదితర కారణముల వలన వాటి కార్యక్రమముల కొన్నింటిని సక్రమముగా నిర్వర్తింపలేక పోయినవి.

**జిల్లా కేంద్ర గ్రంథాలయాలు - అద్దె భవనములు:**

ప్రభుత్వము గ్రంథాలయ భవనములకు సరిపడు మొత్తమును కేటాయించక పోవుటకు వీలు లేనందున పంచవర్ష ప్రణాళికల కాల

మున కూడ గ్రంథాలయ భవన నిర్మాణాభివృద్ధులకు తగిన ప్రాతి నిధ్యము నివ్వనందువలన, గ్రంథాలయ సెస్సు కూడ సంతృప్తి కర ముగా లేనందువలన జిల్లా కేంద్ర గ్రంథాలయములు అద్దెభవనములలో నుండినవి. అయినప్పటికి జిల్లా కేంద్ర గ్రంథాలయ పుస్తక భాండా గారులు శిక్షణ పొందిన వారగుటచే ఉన్నటువంటి గ్రంథాలయ భవన ముల యందే స్థలమును విభజించుకొని పిల్లల విభాగము, పుస్తక ముల అరువిచ్చు విభాగము, సాంకేతిక సేవా విభాగము, ఆచూకీ విభాగముల, వయోజన విద్యా విభాగము, తదితర కొన్ని ముఖ్య విభాగముల నేర్పాటుచేసి, నవీన పద్ధతుల అవలంబనకు పునాదులు వేయ దొడగిరి. రాఘవరెడ్డిగారు పర్యవేక్షణ నిమిత్తము గ్రంథా లయములకు వెళ్ళినపుడు కూడ అద్దె భవనములందు ఆధునిక పద్ధతుల నవలంబించుటకు సముచిత సలహాల నొసగుచుండిరి.

1960 ఆంధ్రప్రదేశ్ పౌరగ్రంథాలయ చట్టము అమలులోనికి వచ్చిన నాటినుండి, జిల్లా కేంద్ర గ్రంథాలయములకు సొంత భవనముల నిర్మించుకొన వలెనను కుతూహలము రాష్ట్రములోని లోకల్ లైబ్రరీ అథారిటీల వారిలో ప్రబలినది.

రాష్ట్రమునందు 31—1—1961 నాటికి రెండు జిల్లా కేంద్ర గ్రంథాలయములు మాత్రము సొంత భవనముల కల్గియుండినవి. 31—3—1968 నాటికి రాష్ట్రమునందలి 7 లోకల్ లైబ్రరీ అథారి టీలు కొంతవరకు ప్రభుత్వము గ్రాంటును పొంది, సొంత జిల్లా కేంద్ర గ్రంథాలయ భవనముల నిర్మించుకొన గలిగినవి. మరికొన్ని లోకల్ లైబ్రరీ అథారిటీలకు కూడ 1968 కి పూర్వమే గ్రంథాలయ భవన నిర్మాణములకుగాను ప్రభుత్వము గ్రాంట్లను మంజూరు చేసినది. వాటిలో కొన్ని లోకల్ లైబ్రరీ అథారిటీలు 1968 తరువాత కొంత కాలమునకు సొంత గ్రంథాలయ భవనములు నిర్మించు కొన్నవి.

రాష్ట్రమునందు ఈ విధముగా గ్రంథాలయ భవనముల నిర్మాణము ఆలస్యముగా జరుగుటకు లోకల్ లైబ్రరీ అథారిటీల మరియు ప్రభుత్వ ఆర్థిక పరిస్థితులే కారణము.

భారత ప్రామాణిక సంస్థ (Indian Standard Institution) వారి సూచనల మేరకు గ్రంథాలయములకు డిప్యూటి డైరెక్టరుగాను, డైరెక్టరుగా నుండినటువంటి రాఘవరెడ్డిగారు గ్రంథాలయమునందు ఏ ఏ విభాగముల నేర్పరుచవలెను, ఆ విభాగముల కెంతెంత స్థలమును కేటాయించవలెను, ఏ విధముగా పాఠకులకు గ్రంథాలయముల యందు ప్రవేశ, తదితర వసతుల కల్గించవలెనన్న విషయములపై ఆంధ్రప్రదేశ్ పట్టణప్రణాళికా డైరెక్టరు వారికి తగు వివరముల నొసగగా, వారు జిల్లా కేంద్ర గ్రంథాలయ భవన నిర్మాణపథకమును రూపొందించిరి. ఈ భవనములను, ఆకర్షణీయముగా, రమణీయముగా నుండునట్లు తీర్చిదిద్దుటకు వాస్తుశాస్త్రజ్ఞుని (Architect) సహాయమును కూడ పొందిరి. భవిష్యత్తునందు గ్రంథాలయములు అభివృద్ధిని సాధించి, మరింత విస్తృతము చెందవలసిన అవసర మేర్పడినపుడు, గ్రంథాలయములను విస్తృత పరచుటకు కూడ వీలుండునట్లు నిర్మాణ పథకములను రూపొందించిరి. ఈ విధముగా, ఆంధ్రప్రదేశ్ పట్టణ ప్రణాళికా డైరెక్టర్ గారు రూపొందించిన నిర్మాణపథకముయొక్క ప్రతులను రాష్ట్రమునందు సొంత గ్రంథాలయ భవనముల నిర్మాణమునకు సిద్ధముగా నున్నటువంటి లోకల్ లైబ్రరీ అథారిటీలకు పంపడం జరిగినది. ఈ ప్రణాళికయందు సూచింపబడిన విధముగా నిర్మింపబడిన భవనములలో నీ క్రింది వాటిని ప్రధానముగా నుదహరింపవచ్చును.

1. హైదరాబాదు నగర కేంద్రగ్రంథాలయ భవనము.
2. అనంతపురము జిల్లా కేంద్రగ్రంథాలయ భవనము.
3. మెదక్ జిల్లా కేంద్రగ్రంథాలయ భవనము.

4. వరంగల్లు జిల్లా కేంద్ర గ్రంథాలయ భవనము.
5. హైదరాబాదు జిల్లా కేంద్ర గ్రంథాలయ భవనము.

పైన పేర్కొనిన గ్రంథాలయములు ఆయా ప్రాంత ప్రజల కందుబాటులో నుండినవి. కాని వరంగల్లు జిల్లా కేంద్ర గ్రంథాలయము మాత్రము పట్టణమునకు కొద్ది దూరము నందుండుట వలన వరంగల్లు నందు రెండు శాఖా గ్రంథాలయముల స్థాపించవలసిన అవశ్యకత కలదని, లోకల్ లైబ్రరీ అథారిటీవారికి రాఘవరెడ్డిగారు స్పష్టపరచిరి.

విశాఖపట్టణములోని పబ్లిక్ వర్క్సు డిపార్టుమెంటుకు చెందిన ప్రధాన ఇంజనీరుగారు జిల్లా కేంద్ర గ్రంథాలయ భవన ప్రణాళికను రూపొందించిరి. రాఘవరెడ్డిగారు ప్రణాళికలో వివరించిన మేరకు జిల్లా కేంద్ర గ్రంథాలయ భవనమును, అందులోని విభాగములను నిర్మించుకొనుటకు లోకల్ లైబ్రరీ అథారిటీలకు తెలియజేసిరి.

## గ్రంథాలయ భవన నిర్మాణమునకు సెంటేజ్ చార్జీలు వసూలు చేయరాదని రాఘవరెడ్డిగారి సూచన :

పబ్లిక్ వర్క్సు డిపార్టుమెంటు, వారిచే నిర్మించునటువంటి లోకల్ లైబ్రరీ అథారిటీల గ్రంథాలయ భవనములపై సెంటేజ్ చార్జీల (centagecharges)ను వసూలు చేయుచుండినది. ఈచార్జీలను మినహాయించు కొనవలసినదిగా లోకల్ లైబ్రరీ అథారిటీలు ప్రభుత్వమును కోరినవి. ప్రభుత్వ మందులకు వెంటనే అంగీకరించక పోవుటచే సొంత భవనముల నిర్మించు కొనవలెనను అభిప్రాయము కూడ కొంతవరకు లోకల్ లైబ్రరీ అథారిటీలకు సన్నగిల్లినది.

పౌరగ్రంథాలయముల డైరెక్టరు కార్యాలయమునందు ఇంజనీరింగ్ విభాగము నేర్పరచి, ఆ విభాగము ద్వారానైన గ్రంథాలయ భవన నిర్మాణములకు పూనుకొన వలసినదని లోకల్ లైబ్రరీ అథా

రిటీలు కోరగా, నూతనముగా నియమింపబడు ఇంజనీరింగ్ సిబ్బందికి జీతముల నొసగు స్థితి లేదని, అందులకు సుముఖతను చూపలేదు. కొంత కాలానంతరము ప్రభుత్వము లోకల్ లైబ్రరీ అథారిటీలు భవన నిర్మాణశాఖకు చెల్లించు సెంటేజ్ చార్జీలను రద్దుచేసినది. ప్రభుత్వము 1960 సంవత్సరమునకు మునుపే ఈ సెంటేజ్ చార్జీలను రద్దు చేసియుండిన లోకల్ లైబ్రరీ అథారిటీలు మరికొన్ని గ్రంథాలయ భవనములను నిర్మించుకొని యుండెడివి.

## హైదరాబాదు, మెదక్ జిల్లాలలో జిల్లా కేంద్ర గ్రంథాలయాలకు స్వంత భవనములు :

తెలంగాణ ప్రాంతములో హైదరాబాదు నగర లోకల్ లైబ్రరీలు మినహా తక్కిన అన్ని జిల్లాలలోను లోకల్ లైబ్రరీ అథారిటీలు ఆర్థికముగా వెనుకబడి యుండినందువలన, తగిన పుస్తకములను కూడ కొనునటువంటి పరిస్థితులలో లేవు. ముఖ్యముగా హైదరాబాదు మెదక్, ఆదిలాబాద్, నల్గొండ జిల్లాల లోకల్ లైబ్రరీ అథారిటీలు ఆర్థికముగా చాల వెనుకబడి యుండినవి. రాఘవరెడ్డిగారీ విషయమును ప్రభుత్వదృష్టికి తీసికొనివచ్చి హైదరాబాదు, మెదక్ జిల్లాల లోకల్ లైబ్రరీ అథారిటీలకు 1961–62లో రూ. 50,000లను ఒక్కొక్క జిల్లా కేంద్ర గ్రంథాలయ భవనముల నిర్మాణ నిమిత్తము మంజూరు చేయించిరి. ఈ మొత్తముతో హైదరాబాదు జిల్లాలోని వికారాబాదునందును, మెదక్ జిల్లాలోని సంగారెడ్డినందును జిల్లా కేంద్ర గ్రంథాలయ భవనములు 1964–65కు తుది రూపురేఖలు దిద్దుకొన్నవి. మెదక్ జిల్లాలోని సంగారెడ్డి పట్టణములో నిర్మింపబడిన జిల్లా కేంద్ర గ్రంథాలయ భవనమునకు ఆంధ్రప్రదేశ్ గవర్నర్ శ్రీ పట్టంతాను పిళ్ళైగారు 28-1-1965 న ప్రారంభోత్సవము గావించిరి. హైదరాబాదు జిల్లాయందలి వికారాబాదునందు నిర్మింపబడిన జిల్లా కేంద్ర

గ్రంథాలయ భవనమునకు ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రిగారైన కాసు బ్రహ్మానందరెడ్డిగారు 18-9-1964 న ప్రారంభోత్సవము చేసిరి.



హైదరాబాదుజిల్లా వికారాబాదు, జిల్లాకేంద్ర గ్రంథాలయ భవనమునకు ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డిగారు ప్రారంభోత్సవం చేస్తున్న దృశ్యం. ఇందులో శ్రీ కె. రాఘవరెడ్డిగారిని కూడ చూడవచ్చును.

ఈ విధముగా సువిశాలముగా నిర్మింప బడినటువంటి హైదరాబాదు, మెదక్ జిల్లాల యందలి జిల్లా కేంద్ర గ్రంథాలయ భవనములు ఆదర్శ వంతముగా వన్నెకెక్కుటయేగాక, ఆ గ్రంథాలయములలో ఆధునిక పద్ధతులు సులభతరముగా ప్రవేశ పెట్టబడుటకు కూడ అనువుగా నుండినవి.

వికారాబాదులో హైదరాబాదు జిల్లా కేంద్ర గ్రంథాలయ భవన నిర్మాణమునకు ఇక్బాల్ గారును, సంగారెడ్డిలో మెదక్ జిల్లా కేంద్ర గ్రంథాలయ భవన నిర్మాణమునకు జనార్దనరెడ్డిగారును గొప్ప కృషి సల్పిరి.

## జిల్లా కేంద్ర గ్రంథాలయ భవన నిర్మాణమునకు గ్రాంటులు:

ఆంధ్రప్రదేశ్ లోని శ్రీకాకుళం, చిత్తూరు జిల్లాల లోకల్ లైబ్రరీ అథారిటీలు కూడ ఆర్థికముగా వెనుకబడి యుండుటచే రాఘవ రెడ్డిగారు ఒక్కొక్క దానికి 25 వేల రూపాయలను మంజూరు చేయించిరి. ఈ మొత్తమునకు ఆయా జిల్లాల లోకల్ లైబ్రరీ అథారిటీలు తమతమ గ్రంథాలయ నిధులను జతజేసికొని సొంత గ్రంథాలయ భవనముల నిర్మించుకొనవలెనని, గ్రంథాలయ నిధులు చాలినంత లేకున్న పక్షమున గ్రంథాలయశాఖ డైరెక్టరుగారికి తెలిపి, ఈశాఖయే నిధుల నుండియైన తగిన మొత్తమును పొంది, సొంత గ్రంథాలయ భవనముల నిర్మించు కొనవలసినదిగాను తెలియజేసిరి. కాని తగు స్థలములు లభ్యము కానందున ఈ జిల్లాల లోకల్ లైబ్రరీ అథారిటీలు సొంత గ్రంథాలయ భవనములను నిర్మించు కొనలేక పోయినవి. ఇది ఆయా జిల్లాల దురదృష్టమేనని చెప్పక తప్పదు.

రాఘవరెడ్డిగారు, అనుకూల పరిస్థితుల పురస్కరించుకొని, పలు జిల్లా లోకల్ లైబ్రరీ అథారిటీలకు గ్రంథాలయ భవనముల నిర్మాణ నిమిత్తము కొంత మొత్తమును ప్రభుత్వము ద్వారా మంజూరు చేయించిరి. విశాఖపట్టణము లోకల్ లైబ్రరీ అథారిటీకి 1964 - 65 లో పదివేల రూపాయలను మంజూరు చేయించిరి. విశాఖ పట్టణ లోకల్ లైబ్రరీ అథారిటీయొక్క ఆర్థిక పరిస్థితులు గ్రంథాలయ భవన నిర్మాణమునకు అనుకూల స్థితిలో నుండుటచే, విశాఖ పట్టణము జిల్లా లోకల్ లైబ్రరీ అథారిటీ సెక్రటరీ, జిల్లాకేంద్ర గ్రంథాలయ పుస్తక భాండాగారియగు శ్రీ గోవిందరావు తగు శ్రద్ధను గైకొనుటచే గ్రంథాలయ భవన నిర్మాణము చురుకుగా సాగి తుది మెరుగులు దిద్దుకొన్నది.

అనంతపురము జిల్లాయందలి అనంతపురముజిల్లా వస్తు ప్రదర్శన (Museum) నిర్వాహకుల ఆధీనములోని భవనమును, అనంతపురము లోకల్ లైబ్రరీ అథారిటీవారు 32 వేల రూపాయలకు కొనుగోలు జేసి, ఆ భవనమునందు జిల్లా కేంద్ర గ్రంథాలయమును ఏర్పాటు చేసిరి. ఆనాటి ధరలతో పోల్చుకున్న ఈ భవనము ఖరీదు మిగుల స్వల్పమని చెప్పక తప్పదు. ఆనాటి అనంతపురం జిల్లా లోకల్ లైబ్రరీ అథారిటీ సెక్రటరీ గారైన కె. ఎస్. ప్రకాశంగారు యీ భవన క్రయమునకు అన్నివిధముల కృషి చేసిరి. ఈ విధముగా కొనుగోలుచేసి స్థాపించ బడినటువంటి అనంతపురము జిల్లా కేంద్ర గ్రంథాలయ భవనము విశాలముగా నుండుటయేగాక, ఈ గ్రంథాలయములో ఆధునిక పద్ధతులను ప్రవేశ పెట్టుటకు కూడ అనువుగా నుండుట యెన్నదగిన విషయము. ఈ భవనము అభివృద్ధి పరచుకొను నిమిత్తము 1964 - 65 లో ప్రభుత్వము 10 వేల రూపాయలను మంజూరు చేసినది. 1965 - 66 లో ఖమ్మం జిల్లా లోకల్ లైబ్రరీ అథారిటీకి 7 వేల రూపాయలను, నల్గొండ జిల్లా లోకల్ లైబ్రరీ అథారిటీకి 6 వేల రూపాయలను గ్రంథాలయ భవనములను అభివృద్ధి చేసికొను నిమిత్తము రాఘవరెడ్డిగారు మంజూరు చేయించిరి. 1967 - 68 లో నూతన భవనముల నిర్మాణమునకు లేదా ఉన్నటువంటి భవనముల విస్తృత పరచుటకొరకు ఈ క్రింద కనపరచిన జిల్లాల లోకల్ లైబ్రరీ అథారిటీలకు ప్రభుత్వము నుండి 1.15 లక్షల రూపాయలను మంజూరు చేయించిరి.

అనంతపురము, కర్నూలు, వికారాబాదు, సంగారెడ్డి, మహబూబ్‌నగర్. వరంగల్లు, నెల్లూరు, విశాఖపట్టణము మొదలగునవి.

1968 - 69 లో జిల్లా కేంద్ర గ్రంథాలయ భవనముల అభివృద్ధి పరచుకొనుటకు గాను 1.05 లక్షల రూపాయలను కేటాయించిరి.



హైదరాబాదు జిల్లా కేంద్ర గ్రంథాలయ భవనము, వికారాబాదు

కర్నూలు, విశాఖపట్టణము మున్నగు జిల్లాలయొక్క జిల్లా కేంద్ర గ్రంథాలయ భవన ప్రణాళికలను కూడ రాఘవరెడ్డిగారే పరిశీలించి ఆమోదించిరి.

తూర్పు గోదావరి, కర్నూలు, విశాఖపట్టణము మున్నగు జిల్లాలలోని లోకల్ లైబ్రరీ అథారిటీలు జిల్లా కేంద్ర గ్రంథాలయ భవన స్థాపన కనువగు స్థలమును కేటాయించుకొని, భవన నిర్మాణ మునకు సిద్ధముగా నుండగా, ప్రభుత్వముయొక్క ఆర్థిక పరిస్థితు లను కూలముగా లేనందున లోకల్ లైబ్రరీ అథారిటీలే వారి గ్రంథాలయ నిధులనుండి గ్రంథాలయ భవనముల నిర్మించు కొనవలసినదిగా తెలియజేసి, భవన నిర్మాణమునకు పూనుకొన్న వారిని రాఘవరెడ్డి గారు తగు విధముగా ప్రోత్సహించిరి. తగిన ఆర్థిక స్థోమత గల ఈ లోకల్ లైబ్రరీ అథారిటీలు సమధికోత్సాహముతో గ్రంథాలయ భవనముల నిర్మాణమునకు పూనుకొని, కొంత కాలమునకు సొంత గ్రంథాలయ భవనముల నిర్మించు కొనగలిగినవి.

## హైదరాబాదు నగర కేంద్ర గ్రంథాలయమునకు స్వంత భవనము :

ఈ గ్రంథాలయ భవన ప్రణాళిక రూపకల్పనలో అమిత శ్రద్ధను గైకొని నటువంటి రాఘవరెడ్డిగారు భవన ప్రణాళిక ఆమోదము పొందుటకు కూడ సహకరించిరి. పౌర గ్రంథాలయ శాఖ డైరెక్టరుగా నున్న కాలమున హైదరాబాదు నగర గ్రంథాలయ భవన ప్రణాళికా రూపకల్పనలో నగర లోకల్ లైబ్రరీ అథారిటీకి చేదోడు వాదోడుగా నుండిరి. ఈ గ్రంథాలయ భవనమునకు 9—10—1969 న భారత రాష్ట్రపతి వి. వి. గిరి గారు శంకుస్థాపన గావించిరి.




హైదరాబాదు నగర కేంద్ర గ్రంథాలయ భవనము.

రాఘవరెడ్డిగారు డైరెక్టరుగా నుండిన కాలమునందే నెల్లూరు లోకల్ లైబ్రరీ అథారిటీ చైర్మన్ గారైన ఎన్. హరిశ్చంద్రా రెడ్డి

గారు నెల్లూరు నందు గ్రంథాలయ భవనమును నిర్మింప వలెనను పట్టుదలను కల్గియుండిరి. అదృష్ట వశమున, వీరి కృషివలన నెల్లూరు నందు ప్రస్తుతము సుమారు 10 లక్షల రూపాయలకు పైగా విలువ కల్గినటువంటి భవనమును శ్రీమతి రేబాల సుజాతమ్మ గారినుండి లక్ష రూపాయలకే విరాళముగా పొందడము జరిగినది. ఈ విధముగా స్వల్ప మొత్తమునకు విరాళముగా భవనమును పొందుటలో ప్రధాన పాత్ర ధారులైన లోకల్ లైబ్రరీ అథారిటీ అధ్యక్షులు హరిశ్చంద్రా రెడ్డిగారి కృషి మరియు సెక్రటరీ గారైన ఎన్. వి. రామిరెడ్డిగారి యొక్క కృషి ప్రశంసనీయము. అమూల్యమైన తమ భవనమును సహృదయతతో నామ మాత్రపు ధరకు విరాళముగా అందజేసిన శ్రీమతి రేబాల సుజాతమ్మగారు అభినంద నీయురాలు.

## శాఖా గ్రంథాలయ భవనములు :

లోకల్ లైబ్రరీ అథారిటీల ఆర్థిక పరిస్థితు లనుకూలముగా లేనందున సొంత గ్రంథాలయ భవన నిర్మాణములకు పూనుకొనుటకు తగినశక్తి లేకుండుటవలన, అద్దెలేని భవనములందు వీలైనంతవరకు తమశాఖా గ్రంథాలయములను స్థాపించుటకు ప్రయత్నింప వలెనని, లోకల్ లైబ్రరీ అథారిటీలకు రాఘవరెడ్డిగారు తెలియజేయుచూ వచ్చిరి. గ్రామస్థుల ఆదరాభిమానములతో కొన్ని అద్దెలేని భవనములను విరాళముగా పొంది, అందు శాఖాగ్రంథాలయములను స్థాపించుచూ వచ్చినవి. కొన్ని లోకల్ లైబ్రరీ అథారిటీలు గ్రంథాలయాల స్థాపనార్థము, గ్రామస్థుల నుండి విరాళముగా కొన్ని భవనములను పొందినవి. హైదరాబాదు జిల్లాపరిషత్ ఛైర్మన్ గారైన ఎమ్. భోజి రెడ్డిగారు జిల్లాపరిషత్ నిధులతో పెక్కు శాఖాగ్రంథాలయ భవన ముల నిర్మించి, ఆ భవనములను హైదరాబాదుజిల్లా లోకల్ లైబ్రరీ అథారిటీవారికి స్వాధీనపరచిరి.

హైదరాబాదు జిల్లాలో పెక్కు శాఖా గ్రంథాలయములు అద్దె లేని భవనములందు స్థాపింపబడినవి. ఇందులకు శ్రీ భోజ్‌రెడ్డిగారి కృషియే ప్రధాన కారణము. వీరు హైదరాబాదు నగరములో కూడ అద్దెలేని భవనములయందే గ్రంథాలయముల నిర్వహించుటకు మిగుల ప్రయత్నిస్తున్నారు. ఈ విధముగా అద్దె లేని భవనముల యందు గ్రంథాలయముల స్థాపనకు రాష్ట్రమునందు కృషిచేసిన వారిలో భోజ్ రెడ్డిగారు ముఖ్యులు. వీరు గ్రంథాలయోద్యోగులకు, జీతములను సకాలములో యిచ్చుటకును, జిల్లా కేంద్ర గ్రంథాలయ భవనముల నిర్మాణమునకు ప్రభుత్వమునుండి గ్రాంట్లు మంజూరగుటకును, గొప్ప కృషిచేసిరి. వీరి గ్రంథాలయ సేవ, కృషి ప్రశంసనీయము.



హైదరాబాదు నగర గ్రంథాలయ సంస్థ చైర్మెన్ శ్రీ ఎమ్. భోజ్‌రెడ్డిగారు

1961 వ సంవత్సరము మార్చినాటికి ఆంధ్రప్రదేశ్‌నందు లోకల్ లైబ్రరీ అథారిటీలు 25 సొంత గ్రంథాలయ భవనములను, 102 ఉచిత అద్దెభవనములను కలిగియుండినవి. 1969 నాటికి 52 శాఖాగ్రంథాలయములు సొంత భవనములను కలిగియుండినవి. అద్దె లేని శాఖాగ్రంథాలయములు 187 వుండినవి. పౌర గ్రంథాలయముల శాఖ డైరెక్టరుగారైన రాఘవరెడ్డిగారు 1968 వ సంవత్సరము గ్రంథాలయముల పర్యవేక్షణకు వెళ్ళిన సందర్భమున, రాష్ట్రములోని పలువురు గ్రంథాలయాభిమానులు దాదాపు 70 నుండి 80 వరకు భవనములను శాఖాగ్రంథాలయముల స్థాపనార్థము జిల్లా గ్రంథాలయ సంస్థలకు అద్దె లేకుండ యిచ్చుటకు సుముఖతను వ్యక్తపరచిరి.



**ఆదిలాబాదు జిల్లా మంచిరియల్‌లో శాఖాగ్రంథాలయ స్థాపనకు విరాళముగా యివ్వబడిన గ్రంథాలయ భవనము**

## సహాయక గ్రంథాలయాలు – భవనములు :

సహాయక గ్రంథాలయములు ప్రారంభ దశనుండి సాధారణముగా సొంత భవనములనే కల్గియుండినవి. కొన్ని మాత్రము అద్దె

లేని భవనములందు నడుపబడు చుండినవి. 1969 మార్చినాటికి సొంత భవనములందు నిర్వహింపబడుచుండిన సహాయక గ్రంథాలయ ముల సంఖ్య 502 కు, అద్దె లేని భవనములందు నిర్వహింపబడు చుండిన సహాయక గ్రంథాలయముల సంఖ్య 732 కు హెచ్చినది.

మన రాష్ట్రమునందు పౌర గ్రంథాలయ చట్టము అమలు లోనికి వచ్చి చాల కాలమైనప్పటికి, యింకను లోకల్ లైబ్రరీ అథా రిటీ యాజమాన్యము నందున్న పలు గ్రంథాలయములు సొంత భవన ములకు నోచుకొనలేదు. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వము లిందు నిమి త్తము తగు చర్యల గైకొని, సొంత భవన నిర్మాణమునకు తగు గ్రాంట్లను మంజూరుచేసి, జిల్లా కలెక్టర్ల ద్వారా, పట్టణాభివృద్ధి సంస్థల ద్వారా ఆయా ప్రాంతములందు గ్రంథాలయ భవనముల కను వగు స్థలముల కేటాయించి, గ్రంథాలయ భవన నిర్మాణములకు తగు చేయూత నివ్వవలసిన అవసర మెంతేని కలదు. ప్రతి గ్రంథాలయము సొంత భవనమును కల్గిననాడే ప్రజలకు తగిన సేవ నందించుటకు వీలుండు ననుట గుర్తించ వలసిన విషయము.

## గ్రంథాలయాలలో, పరికరములు:

1948 మదరాసు పౌర గ్రంథాలయ చట్టము మేరకు స్థాపించ బడినటువంటి గ్రంథాలయములకు, కావలసిన పరికరముల నిమిత్తమై ఆర్థిక పరిస్థితులు సరిగా లేనందున ప్రభుత్వము గ్రాంట్లను మంజూరు చేయలేదు. 1955 హైదరాబాదు పౌర గ్రంథాలయ చట్టము మేరకు తెరువబడిన గ్రంథాలయములకు మాత్రము పరికరముల కొనుగోలు నిమిత్తము నామమాత్రపు గ్రాంటును ఆరంభదశలో మంజూరు చేసినది. వసూలగు గ్రంథాలయ సెస్సు తక్కువైనప్పటికి, గ్రంథా లయ సెస్సుకు ప్రభుత్వము సమానముగా కేటాయించు పైకము కూడ తక్కువైనప్పటికి, కొన్ని లోకల్ లైబ్రరీ అథారిటీలు గ్రంథా

లయములకు పుస్తకములను కొనుగోలు చేయు సందర్భములందే జిల్లా కేంద్ర గ్రంథాలయములకు, కొన్ని శాఖా గ్రంథాలయములకు బుక్ రాక్స్‌ను, అవసరమగు కేబినెట్‌లను, తదితర పరికరములను కొనుగోలు చేయుచుండినవి. పాఠకుల సంఖ్య యధికమగు చున్నందున కుర్చీలను, బల్లలను కూడ కొనుగోలు చేయుచుండినవి. ఈ విధముగా పరికరముల కొనుగోలు చేయుటయందు పలు లోకల్ లైబ్రరీ అథారిటీలు భారత ప్రామాణిక సంస్థ (Indian Standards institution) వారి సలహాలను పాటించుచుండినవి.

శాఖా గ్రంథాలయ భవనములు తక్కువ వైశాల్యమును కల్గిన వగుటచే ఈ గ్రంథాలయములకు కొన్న పరికరములు కూడ స్వల్పమేయని చెప్పవచ్చును. అయినప్పటికి లోకల్ లైబ్రరీ అథారిటీలు సాధ్యమైనంత వరకు అన్ని శాఖా గ్రంథాలయములకు బుక్ రాక్స్‌ను మాత్రము కొనుగోలు చేసినవి. కొన్ని శాఖా గ్రంథాలయములందు తివాచీ (చాప) లపై కూడ, కొందరు పాఠకులు కూర్చొని గ్రంథ పఠనము చేయుచుండిరి. గ్రంథాలయముల వసరుల లోపే యిందులకు కారణమని చదువరులు యెంచి, అభ్యంతరము తెలుపక నేలపైన, అరుగులపైన కూర్చొని చదువుకొనుట ప్రశంసించ దగిన విషయము. ఇందు మూలమున వారికి గ్రంథాలయములపై కల అభిమానము కూడ వ్యక్తమగు చున్నది. తెనాలి, రాజమండ్రి, నంద్యాల, తిరుపతి, నిర్మల్ మున్నగు పట్టణములలోని శాఖా గ్రంథాలయములందు పరికరములు కొంత మెఱుగుగా నుండినవి. ప్రభుత్వము ఒకటి, రెండు మార్లు పరికరముల నిమిత్తము లోకల్ లైబ్రరీ అథారిటీలకు ప్రత్యేక గ్రాంట్లను మంజూరు చేసినది.

గ్రంథాలయములందు 'కౌంటర్' (Counter) ను ఏర్పాటు చేయు నిమిత్తము 1967 – 68 లలో ప్రభుత్వము 58,000 రూపాయల

మొత్తమును లోకల్ లైబ్రరీ అథారిటీలకు కేటాయించినది. హైదరాబాదు నగరము తప్ప మిగిలిన తెలంగాణ ప్రాంత జిల్లా గ్రంథాలయ సంస్థలకు పుస్తకముల కొనుగోలు చేయు నిమిత్తమేగాక, పరికరములు కూడ కొనుగోలు చేయు నిమిత్తము 1968 – 69 లలో 1.71 లక్షల రూపాయలను ప్రభుత్వము కేటాయించినది.

పైన నుడివిన విధముగా గ్రంథాలయములందు బుక్ రాక్స్, కార్డ్ కాబినెట్స్, కుర్చీలు, బల్లలు మొదలగు పరికరములేగాక దృశ్య-శ్రవణ పరికరములు మొదలగునవి కూడ ఉండవలసిన అవసర మెంతేని కలదు. 1969 నాటికి హైదరాబాదు నందలి రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమునందును, గుంటూరు ప్రభుత్వ ప్రాంతీయ గ్రంథాలయము నందును, ఏలూరు సంచార గ్రంథాలయము నందును మరియు రాష్ట్రమునందలి ఆరు జిల్లా కేంద్ర గ్రంథాలయము లందును దృశ్య – శ్రవణ పరికరములు (16 ఎమ్. ఎమ్. సినిమా ప్రొజెక్టర్లు, టేపు రికార్డర్లు, రేడియోలు) కూడ ఉండినవి. పలు శాఖా గ్రంథాలయ ములందు రేడియో లుండుట గమనింప దగిన విషయము.

గ్రంథాలయములందు శిక్షణ పొందిన సిబ్బంది, ఉత్తమ సాహిత్యము, ఆధునిక విజ్ఞాన, శాస్త్రీయ, సాహిత్య పత్రికలు, సంచికలతో పాటు పాఠకులు సాఫీగా కూర్చొని చదువుకొనుటకు, అనువైన ఫర్నిచర్ యుండిననాడు గ్రంథాలయాలు మరింత గ్రంథాలయ సేవ చేయగలవు.



# పౌర గ్రంథాలయాల పర్యవేక్షణ - వార్షిక తనిఖీలు:

## గ్రంథాలయాల పర్యవేక్షణ, వార్షిక తనిఖీల ఆవశ్యకత:

పౌరగ్రంథాలయా లనగా పౌరులతో సంబంధము కలవి యని స్పష్టముగా తెలియుచున్నవి. ఈ గ్రంథాలయాలలో జాతి, మత, వర్గ, విభేదము లేకుండా పౌరులకందరికి ప్రవేశము కలదు. గ్రంథపాలకులు పాఠకుల అభిరుచులకు తగిన గ్రంథములు యెన్నిక చేసి ఇవ్వడమే గాకుండా, వారి వారి మనస్తత్వమును బట్టి వ్యవహరిస్తూ యుండవలయును. గ్రంథాలయ మొక సహాకార, సమాచార కేంద్రముగానే గాక, విజ్ఞాన, వినోద, వికాస కేంద్రముగా కూడ పని చేయాలి. ఇందుకు తగిన గ్రంథాలయ శాస్త్రములో శిక్షణ పొందిన వారు గ్రంథపాలకులుగాను, వారికి సహాయకులుగా మరికొంతమంది సిబ్బంది నియమింపబడ వలయును. వీరు తమ విధ్యుక్తధర్మమును నెరవేరుస్తూ, గ్రంథాలయ ఆశయములను నెరవేర్చవలసి యున్నది. ఒక ప్రక్క పాఠకులకు అవసరమైన గ్రంథములను, సమాచారముల నందజేస్తూ, మరొకప్రక్క వారు నిర్వర్తించుచున్న సేవా కార్యక్రమములను, పై అధికారులకు అవసరమగు గ్రంథాలయ సేవావివరములను పంపవలసి యుండును. ఈ వ్యవహారమంతా సకాలములో సక్రమంగా, సవ్యంగా జరుగుతున్నదా లేదా యని తెలుసుకొనుటకు ఆధునిక పద్ధతుల నవలంబింప జేయుటకు, అందులకు తగిన సలహాల నిచ్చుటకు తరచుగా పర్యవేక్షణ అవసరమైయుండును. గ్రంథాలయాలకు తరచుగా పర్యవేక్షణ లేనిచో, వాటి నిత్యవ్యవహారములు సక్రమముగా జరుగక పోవుట కవకాశము కలదు. కావుననే యితర సంస్థలకు వలె గ్రంథాలయాలకు కూడా తరచుగా పర్యవేక్షణ అవసరమైనదని గుర్తించడమైనది.

పర్యవేక్షణలు, వార్షిక తనిఖీలు అవసరమనుట నిర్వివాదాంశమే యైననూ, ఆయా సందర్భాలలో గమనించవలసిన విషయాలేమి? ఇవ్వదగు సలహాలేమి? పరిశీలించవలసిన అంశాలేవి? అనునది గొప్ప సమస్య. దీనికి విశేషానుభవము, ప్రజ్ఞాపాటవాలు అవసరము.

## వార్షిక తనిఖీపై రాఘవరెడ్డిగారు రూపొందించిన ప్రణాళిక :

రాఘవరెడ్డిగారు ప్రాథమిక పాఠశాలలు మొదలు ఉన్నత పాఠశాలల వరకును, గ్రామీణ గ్రంథాలయము మొదలు రాష్ట్ర కేంద్ర గ్రంథాలయాల వరకును పర్యవేక్షించి, దేశ, విదేశాలలో పర్యటించి గ్రంథాలయ నిర్వహణయందు అనుభవజ్ఞులై యుండుట మన అదృష్టము. గ్రంథాలయాల నిర్వహణలో అందులోని సాధక బాధకములను క్షుణ్ణముగా తెలిసిన రాఘవరెడ్డిగారు గ్రంథాలయాల నెల్లు తనిఖీ చేయాలి? ఏ విషయాలను పర్యవేక్షించాలి? వివిధ సమస్యల నెదుర్కొనుటలో పరిష్కార మార్గాలేవి? వారివ్వదగు సలహాలెవ్వి? యను వివిధ అంశములను దృష్టియందుంచుకొని, వీటి కొక సమగ్రమైన వార్షిక తనిఖీ ప్రణాళికలను రూపొందించుటలో రాఘవరెడ్డిగారు కృషిసల్పి కృతకృత్యులయ్యారు.

ఈ పర్యవేక్షణలు రెండు రకాలు. 1. ఆకస్మిక తనిఖీ. 2. వార్షిక తనిఖీ. ఇందులో ఆకస్మిక సందర్శన ద్వారా గ్రంథాలయ సిబ్బంది సక్రమంగా హాజరయి, తమ విధులను నెరవేర్చుచున్నారా లేదా యని తెలిసికొనుటకు, సిబ్బందికి కావలసిన సలహాల నిచ్చుటకు వీలగును. వార్షిక తనిఖీలద్వారా ప్రతి సంవత్సరము గ్రంథాలయ సమగ్ర సేవా వివరాలను, క్షుణ్ణముగా తెలిసికొనుటకు అందుకు నిర్ణయించిన రికార్డులను అన్నింటిని పరిశీలన చేయుటకు సిబ్బంది సమస్యల పరిష్కారము, గ్రంథాలయాభివృద్ధి కార్యక్రమముల గూర్చి తగిన సలహాల నిచ్చుటకు వీలగును.

**వెనుకటి గ్రంథాలయాల పర్యవేక్షణా విధానము :**

గ్రంథాలయ చట్టము 1960 అమలులోకి రాకపూర్వము ఆంధ్రప్రాంతమందు, తెలంగాణ ప్రాంతమందు గ్రంథాలయాలు తగినన్ని స్థాపింపబడియుండలేదు. కొన్నిప్రాంతములలో అచ్చటచ్చట పంచాయితీ గ్రంథాలయాలు, సహాయక గ్రంథాలయాలు వుండెడివి. వీటిని విద్యాశాఖకు జెందిన స్కూళ్ళ డిప్యూటీ ఇన్స్పెక్టర్లు తనిఖీ చేసెడి వారు. వీరి సిఫార్సు మేరకు వాటికి ఆర్థికసహాయమును ప్రభుత్వము మంజూరు చేసెడిది.

**గ్రంథాలయ శిక్షణ పొందిన వారిచే పర్యవేక్షణ, వార్షిక తనిఖీల అవశ్యకత:**

మద్రాసు పౌర గ్రంథాలయాల చట్టము 1948 మేరకు ఆంధ్ర ప్రాంతములోను, హైదరాబాదు పౌర గ్రంథాలయాల చట్టము 1955 మేరకు తెలంగాణ ప్రాంతమందును జిల్లా కేంద్ర గ్రంథాలయాలు, శాఖా గ్రంథాలయాలు, డెలవరీ స్టేషన్సు (పుస్తక పంపిణీ కేంద్రములు) స్థాపింప బడినవి. గ్రంథాలయ శాస్త్రములో శిక్షణ పొందిన గ్రంథపాలకులే వీటి పర్యవేక్షణాధికారమును కలిగి వుండడము సముచితమని, అప్పటి రాష్ట్ర గ్రంథాలయాల ప్రత్యేకాధికారి రాఘవరెడ్డిగారు గట్టిగా విశ్వసించారు. వీరి సిఫార్సు మేరకు రాష్ట్ర ప్రభుత్వము తదనుగుణ్యముగా ఆదేశ మిచ్చినది. ఇందులకు రాఘవ రెడ్డిగారిని అభినందించ వలసియున్నది.

రాష్ట్ర ప్రభుత్వ ఉత్తర్వు మేరకు 1955 సం॥ నుండి జిల్లాలోని కేంద్ర గ్రంథాలయమును రాష్ట్ర ప్రత్యేకాధికారి, జిల్లాలోని శాఖా గ్రంథాలయములను ఆయాజిల్లాల కేంద్రగ్రంథాలయ గ్రంథపాలకులు, శాఖా గ్రంథాలయ పరిధిలో గల పుస్తక పంపిణీ కేంద్రములను

సహాయక గ్రంథాలయములను ఆయా శాఖా గ్రంథాలయాధి కారులు పర్యవేక్షణ చేయుటకు అవకాశము లభించినది.

తెలంగాణ ప్రాంతములో 1958 – 59 సం॥రము తర్వాత జిల్లా కేంద్ర గ్రంథాలయాలు, శాఖా గ్రంథాలయాలు, డెలివరీ స్టేషన్లు నెలకొల్పబడినవి. ఆంధ్ర ప్రాంతములోని పర్యవేక్షణ విధానమే తెలంగాణాకు కూడా వర్తింపబడినది.

రాష్ట్రములోని సహాయక గ్రంథాలయాలు, పంచాయతీ గ్రంథాలయాలు, గ్రామ సంఘం గ్రంథాలయాలు, తదితర గ్రంథాలయాల పర్యవేక్షణాధికారము కూడా జిల్లా గ్రంథాలయాధికారులకు, శాఖా గ్రంథాలయాధికారులకు అప్పగించడమైనది.

జిల్లా కేంద్ర గ్రంథాలయము మొదలు పుస్తకపంపిణీ కేంద్రము వరకు గల వివిధ గ్రంథాలయాలయొక్క బాధ్యతలు, సేవాపరిమితి పూర్తిగ వేరుగా లేవు. కావున వీటికి అనుగుణ్యాముగా వార్షిక తనిఖీ నివేదికలు వేరువేరుగా వుండాలని రాఘవరెడ్డిగారు భావించారు.

## గ్రంథాలయాల తనిఖీపై రాఘవరెడ్డిగారు రూపొందించిన సమగ్ర వార్షిక తనిఖీ కోడ్ :

గ్రంథాలయ ఉద్యమములో, వివిధరంగాలలో వారికి గల అనుభవము గొప్పది. ఆనైపుణ్యామును పురస్కరించుకొని విద్యా శాఖలో తాము సందర్శించి పర్యవేక్షించిన పాఠశాలలను తమ దృష్టియందుంచుకొని, రాష్ట్రములోని వివిధ గ్రంథాలయాల పర్యవేక్షణా విధానమును రూపొందించి సమగ్రవార్షిక తనిఖీ 'కోడును' తయారు చేశారు.

ఈ విధంగా తయారు కాబడిన 'కోడు'ను అన్నిజిల్లా గ్రంథాలయాలకు పంపడమైనది. ఇందులో పొందుపరచబడిన విషయాలు

పర్యవేక్షణాధికారులకు ఉపయోగపడినది. ప్రభుత్వానికి, ప్రజలకు, వివిధసంస్థలకు గ్రంథాలయాలను గూర్చి ఈ రిపోర్టులద్వారా సమగ్రంగా తెలుసుకో గలుగుటకు వీలయినది. గ్రంథపాలకులకు ఈ విధానమెంతో తోడ్పడి, సౌలభ్యముగా పరిణమించినది.

**వార్షిక తనిఖీఅధికారి పరిశీలించవలసిన కొన్ని ముఖ్యవిషయములు:**

ఇందులో ముఖ్యంగా తనిఖీ సమయములలో పర్యవేక్షణాధికారులు పరిశీలించదగు అంశములు, తీసికోదగు జాగ్రత్తలు, సందర్భానుసారముగా ఇవ్వదగు సలహాలను గూర్చి వివరంగా పేర్కొన్నారు. అందులో కొన్ని ముఖ్యమైనవి.

1. ప్రతి ఉద్యోగియొక్క సామర్థ్యము లేక విధి నిర్వహణయందు నిర్లక్ష్యము సమగ్రంగా పరిశీలించవలెను. నిర్లక్ష్య వైఖరికి తగిన హెచ్చరిక, సామర్థ్యమునకు తగిన ప్రోత్సాహము, గుర్తింపు యొసంగుటకు పర్యవేక్షణాధికారులు తగు విచక్షణతో వ్యవహరించవలెను. పర్యవేక్షణాధికారులు మార్గదర్శకంగాను, ఆదర్శప్రాయంగాను మెలగవలెను. నిరాడంబరవైఖరితో, నిష్పక్షపాత వైఖరితో వ్యవహరించుట తమ కనీస కర్తవ్యమని భావించవలెను. పర్యవేక్షణాధికారులు గ్రంథాలయమును ఆధునిక పద్ధతులలో నడుపుటకు, దాని అభివృద్ధికి తగిన సలహాల నివ్వవలెను. గ్రంథాలయములో పాఠకులకు వసతి, పరికరములు, ఆరోగ్యకరమైన వాతావరణ సౌకర్యములకు తగు అవకాశములున్నవా? లేవా? యని గమనించవలయును.

మంజూరు చేసిన ధనము ఆయా పనులకే వినియోగమై వెచ్చింపబడినదా లేదా యని పరిశీలించవలెను.

గ్రంథాలయోద్యోగులు తమ విధి నిర్వహణలో ఎదుర్కొను

సమస్యలను తెలుసుకొని వాటి పరిష్కారమునకు వీలయిన విధాన మును సూచించవలెను.

కేవలము తాము గమనించిన లోపములను, గ్రహించిన అభి ప్రాయములను రిపోర్టు నందు పేర్కొనుటయేగాక వాటిని ఆచరణలో నవరించుకొను విధానములను కూడా స్పష్ట పరచవలెను.

## గణాంక వివరములు:

వార్షిక తనిఖీ రిపోర్టు నందు వివిధ అంశములకు సంబంధించిన గణాంక వివరములను పేర్కొనుట అత్యంతావశ్యకమైన విషయంగా భావించవలెను. గ్రంథాలయ ప్రగతి, భవిష్యత్తు, రిపోర్టులందు కన బఱచిన గణాంక వివరములపై ఆధారపడి యుండును.

వార్షిక తనిఖీలకై విచ్చేసిన సందర్భములో అదేపనికే తమ రాకను పరిమితము చేయకుండా, ఆయా సందర్భాలలో స్థానిక పంచా యితీ అధ్యక్షులను, పురపాలక సంఘ కమీషనరులను, తదితర అధికారు లను కలుసుకొని స్థానిక గ్రంథాలయాభివృద్ధికి, గ్రంథాలయ సెస్సు సక్రమంగా జమకట్టుటకు వారి సహకారమును కోరుతూ, సుహృద్భావ మును పెంపొందింప జేయుటకు కృషి చేయాలని రాఘవరెడ్డిగారు పేర్కొనుచుండిరి. రాఘవరెడ్డిగారు జిల్లా కేంద్ర గ్రంథాలయము లను సందర్శించి, తనిఖీ చేయడమేగాక తరచుగా శాఖా గ్రంథాలయములను, పుస్తక పంపిణీ కేంద్రములను కూడా అకస్మా త్తుగా సందర్శిస్తూ యుండెడివారు. వారు జిల్లా కేంద్ర గ్రంథాలయ వార్షిక తనిఖీ సమయాలలోనే గాక, తరచుగా సందర్శించే సమయ ములో ఉద్యోగుల సాధక బాధకములను గమనిస్తూ, వారి ఉద్యోగ నిర్వహణలో చైతన్యంగా, ఉత్సాహంగా వుండగలిగేందుకు ప్రోత్సా హమిస్తూ వుండేవారు. ఉద్యోగులను వృత్తిలో ప్రావీణ్యము పొందా లని అభిలషిస్తూ తమ విద్యా యోగ్యతలను అభివృద్ధి పరచుకో

వలెనని కోరేవారు. వీరి ప్రోత్సాహముతో రాష్ట్రములో తక్కువ విద్యా యోగ్యతలతో బంట్రోతులుగా చేరినవారు, తమ స్వయం కృషితో విద్యాయోగ్యతలను అభివృద్ధి పరచుకొన్నారు. అటువంటి ఉద్యోగులను ప్రోత్సహించి ఉన్నత ఉద్యోగావకాశములను కల్పించి పై స్థాయికి పెంచారు. అప్పటి బంట్రోతులలో కొందఱు ఇప్పుడు గ్రంథపాలకులు యగుటకు రాఘవరెడ్డిగారి ప్రోత్సాహమే ముఖ్య కారణము.

రాఘవరెడ్డిగారు గ్రంథాలయోద్యోగులతోనే గాక, గ్రంథాలయ పాలక సభ్యులతో సమావేశములు జరిపి గ్రంథాలయాభివృద్ధికి, గ్రంథాలయ వసతి విస్తరణకు, ఉచిత భవన సేకరణకు తీసికోదగు చర్యలను గూర్చి వివరించెడివారు.

## వార్షిక తనిఖీల సందర్భంగా స్థానిక అధికార, అనధికారులతో సమాలోచనలు:

అదే సందర్భాలలో జిల్లా అధికారులను, పంచాయితీ, పురపాలక శాఖాధికారులను కలుసుకొని గ్రంథాలయ ఆర్థిక స్థోమతను అభివృద్ధి పరచుటకు గ్రంథాలయ సెస్సు వసూలు చేయుటలో అధికారుల సహకార మివ్వవలసినదిగా తెలియ జెప్పుచుండిరి. జిల్లా కేంద్ర గ్రంథాలయ భవనాలకు భూమి కేటాయింపులకై రెవిన్యూ అధికారులతో సంప్రదించెడివారు. ఈ విధంగా ఆయా స్థాయిలలో ఆయా అధికారులను, అనధికారులను సంప్రదించి గ్రంథాలయ ఉద్యమ సమగ్రాభివృద్ధికి విశేషంగా కృషిచేసిన కీర్తి రాఘవరెడ్డి గారికే దక్కినదనుట నగ్న సత్యము.

## వార్షికతనిఖీ రిపోర్టుల తయారు - అందులో పొందుపరచవలసిన ముఖ్యాంశములు :

రాఘవరెడ్డిగారు గ్రంథాలయ వార్షిక తనిఖీ నివేదికలో ముఖ్యంగా పరిశీలించదగు అంశములను క్రింది విధముగా పేర్కొనిరి.

1. వసతి :- గ్రంథాలయ భవనము కేంద్రములో నెలకొల్పబడి అన్నికులములకు, వర్గములకు అందుబాటులో యున్నదా? లేదా? గ్రంథాలయ భవనము దాని పరిసరములు పరిశుభ్రముగా వుంచబడినదా? లేదా? గ్రంథాలయములో నవీన పద్ధతుల మేరకు అన్ని శాఖలు ఏర్పాటు చేయబడినవా? లేదా? ప్రస్తుతవసతి చాలినంతగాయున్నదా? లేదా? యని గమనించవలెను.

2. పరికరములు:- గ్రంథాలయ పరికరములు తగినంతగా యున్నవా? బుక్ రాక్సు, కుర్చీలు, బల్లలు, కార్డుకాబినెట్లు మొదలగునవి సరిపోవునా?

3. సిబ్బంది:- సిబ్బంది అవసరమైనంత మంది యున్నారా? వారి యోగ్యతాపత్రాలు (సామాన్యమరియు వృత్తికి సంబంధించినవి) పరిశీలింపబడినవా?

4. రిజిష్టర్లు:-నిర్ణయించిన రిజిష్టర్లన్నియు సక్రమముగా ఏర్పాటు చేయబడినవా? నమోదు చేయబడినవా?

(1) గ్రంథపరిగ్రహణ రిజిష్టరు:- గ్రంథ పరిగ్రహణ రిజిష్టరులో జిల్లా కేంద్ర గ్రంథాలయమునకు, శాఖా గ్రంథాలయములకు కొనిన గ్రంథములను నమోదు చేయడమైనదా? కేంద్ర గ్రంథాలయమునకు, శాఖా గ్రంథాలయములకు బట్వాడా చేసిన గ్రంథములు అందులో గుర్తింపబడినవా?

(2) షెల్ఫు లిస్టు కార్డులు: ఎప్పటికప్పుడు తాజాగా షెల్ఫు లిస్టు కార్డులను తయారుచేసి యుంచడమైనదా?

(3) సంచికల రిజిష్టరు: రిజిష్టరుకు బదులుగా కార్డు విధానము ననుసరించి యుండిన యా విధానము సక్రమముగా నిర్వహింపబడు చున్నదా?

(4) టిక్కెట్లు: అరువుగా గ్రంథములను తీసికొనుటకు లెడ్జరు విధానమునకు బదులుగా టిక్కెట్టు విధానము ప్రవేశపెట్టబడినదా?

తేలిమా నిర్ణయించిన రిజిష్టర్లు సక్రమంగా వుంచబడినవా?

5. పఠన సామగ్రి: పాఠకుల అవసరాలకు, అభిరుచులకు దగిన గ్రంథాలను కొనడము జరుగుచున్నదా? ఈ గ్రంథములను తెప్పించుటలో అధికార రీత్యా ఆమోదము పొందబడినదా ?

6. వార్తాపత్రికలు మరియు సంచికలు: గ్రంథాలయమునకు తెప్పింపబడు దిన పత్రికలు, సంచికలు గ్రంథాలయమును సందర్శించు అధిక సంఖ్యాకులకు ఉపయోగ కరముగా యున్నవా ? పరిమిత ప్రయోజనము గల పత్రికలు ఏవేని కలవా ?

7. వర్గీకరణ మరియు సూచీకరణ :- గ్రంథాలయమునకు తెప్పింపబడిన గ్రంథములు సక్రమంగా వర్గీకరించి, సూచీకరింప బడి నవా ? అట్లు కానిచో అందుకు కారణములను పేర్కొనునది.

8. సెలవు దినములు మరియు పని వేళలు: సెలవు దినములు మరియు పని వేళలు అధిక పాఠకులకు అనుకూలముగా వున్నవా ?

9. అరువు శాఖ:- గ్రంథాలయము ఇతర గ్రంథాలయము నుండి అరువుగా గ్రంథములను పొందు చున్నదా? అరువు దెచ్చు కొనుటకు, అరువిచ్చుటకు తీసుకోదగు చర్యలు.

10. సాంఘిక విద్య మరియు పిల్లల కార్యక్రమాలు:- గ్రంథా లయములో అవసరమున్నపుడు సాంఘిక విద్యా కార్యక్రమాలు (ఫిల్ము ప్రదర్శనములు, ఉపన్యాసములు, చర్చాగోష్ఠులు, రేడియో కార్యక్రమాలు, వగైరాలు) మరియు పిల్లల కార్యక్రమాలు (చిత్రలేఖనము, కథలు చెప్పడము మొదలగునవి) ఏర్పాటు చేయ బడుచున్నవా?

11. గ్రంథాలయాధికారికి గ్రంథములతో ప్రత్యక్ష జ్ఞానము గలదా? గ్రంథాలయ పాఠకుల, ప్రాంతీయుల అవసరాలను బాగుగా

ఎరిగినవాడా? గ్రంథాలయాధికారి తన పరిధిలో గ్రంథాలయ ఉద్యమాభివృద్ధికి పాటుపడుతున్నాడా? పౌరులకు గ్రంథాలయాధికారికి సత్సంబంధము నెలకొని యున్నదా?

పై అంశములలో నొక్కొక్క దానినిగూర్చి తనిఖీ యధికారి తన యభిప్రాయమును వివరముగా తెలుపవలెను.

రాఘవరెడ్డిగారు తాము తయారుచేసిన వార్షిక తనిఖీ 'కోడ్' (code) యందలి అంశములను జాగ్రత్త వహించి పరిశీలించాలని కోరారు. గ్రంథాలయము సంవత్సరములో సాధించిన ప్రగతిని, సాధించవలసిన ప్రగతిని గూర్చి సమగ్రంగా తెలిసికొనుటకై గణాంక వివరములను స్పష్టముగా పేర్కొనుట కవకాశము గల వార్షిక నివేదికా నమూనా పత్రములను కూడా తయారుచేశారు. వీటిని జిల్లా కేంద్ర గ్రంథాలయము మొదలు పుస్తక పంపిణీ కేంద్రము వరకు గల వివిధ గ్రంథాలయాలకు వాటివాటి స్థాయిని బట్టి వేర్వేరుగా నివేదికలు తమ అనుభవమును పురస్కరించుకొని తయారు చేశారు.

## జిల్లా కేంద్ర గ్రంథాలయ వార్షిక నివేదిక:

జిల్లా కేంద్ర గ్రంథాలయము:- ఇది జిల్లాలోని గ్రంథాలయాల కంతా ప్రాతినిధ్యము వహించే గ్రంథాలయము. దీని బాధ్యతలు, సేవలు ఎక్కువ. ఇది ఆదర్శంగా, మార్గదర్శకంగా యుండాలి. ఇచ్చటి కేంద్ర గ్రంథాలయమునకు చేర్చబడిన గ్రంథములతో బాటు శాఖా గ్రంథాలయములకు కొనినటువంటి గ్రంథములు కూడా వర్గీకరింపబడవలసిన బాధ్యత యున్నది. తదితర సేవాకార్యక్రమములతోపాటు సాంకేతికమైన బాధ్యతలు ఎక్కువగా నుండుటచే జిల్లా కేంద్ర గ్రంథాలయ వార్షిక నివేదిక సమగ్రంగా, సంపూర్ణముగా యుండాలని రాఘవరెడ్డిగారు భావించి, అందుకు తగినట్లుగా

రూపొందించారు. ఆ నివేదిక యందు ఆచూకీసేవ, ప్రచారము, పుస్తకముల ఎన్నిక మున్నగు అంశములను గూర్చిన వివరములు కూడా యుండుట అవసరమని రాఘవరెడ్డిగారి యభిప్రాయము. రిపోర్టు చివరలో ప్రత్యేకంగాకాని, సామాన్య అభిప్రాయాలలో కాని పేర్కొనిన చాలునని కొందరు గ్రంథపాలకులు అభిప్రాయ పడిరి. రాఘవరెడ్డిగారు తయారుచేసిన వివిధములైన తనిఖీ నమూనా పత్రములు యిప్పటికిని ఉపయోగింపబడుచున్నవి. వానిలో కొంత మార్పు చేయవలసిన యువసరమున్నది. ప్రస్తుతము వార్షిక తనిఖీ 'కోడ్' (Inspection code) యందు కూడ కొన్నిమార్పులు చేయ వలసిన యవసరమున్నది.

## శాఖా గ్రంథాలయ వార్షిక తనిఖీ నివేదిక:

శాఖా గ్రంథాలయమునకు జిల్లా కేంద్ర గ్రంథాలయము కంటె బాధ్యతలు తక్కువ. పరిసరములను బట్టి బాధ్యతలతో గ్రంథాలయ సేవ చేయవలసి యుండును. అక్కడ వాతావరణమును బట్టి వ్యవహరిస్తూ, వారి సహకారమును పొందుతూ సేవ చేయవలసి యుండును. పుస్తక పంపిణీ కేంద్రములకు, సహాయక గ్రంథాలయ ములకు సక్రమంగా పుస్తకములు పంపవలసి యుండును. వార్షిక తనిఖీ పత్రమందు జిల్లా కేంద్ర గ్రంథాలయమునకు అవసరమైనన్ని వివరములు కాకుండా సంక్షిప్తముగా యుండిన చాలును.

## పుస్తక పంపిణీ కేంద్రము – వార్షిక నివేదిక:

ఇది ఏ ప్రాంతములో ఏర్పాటయినదో ఆ ప్రాంతమునకే పరి మితము. గ్రామములోని చదువరులకు గ్రంథాలయ నిబంధనల ననుస రించి సక్రమముగా యిస్తూ, తీసుకొను చుండవలయును. శాఖా గ్రంథాలయమునుండి, ఇతర గ్రంథాలయములనుండి గ్రంథములను అరువుగా తెస్తూ, పాఠకులకు సేవ చేస్తూ యుండవలయును. గ్రంథా

లయ సాంకేతిక పరిజ్ఞానము పరిమితముగాయున్న చాలును. దీనికి సంబంధించిన వార్షిక తనిఖీ పత్రము క్లుప్తముగాయున్న చాలును.

## సహాయ గ్రంథాలయము - వార్షిక నివేదిక:

కొన్ని గ్రామాలలో గ్రంథాలయములు ఉత్సాహ వంతులైన ప్రజల ప్రోత్సాహము చేత నడుపబడుచున్నవి. ఇవి సొసైటీ యాక్టు క్రింద రిజిష్టరు కాబడి గ్రంథాలయాల డైరెక్టరు గారిచే సహాయము పొందుటకు అనుమతి పొందబడినవి. వీటి సేవా బాధ్యతలు కూడా పరిమితమైనవే. ఆ గ్రామమునకే పరిమితము గనుక, వీటి వార్షిక తనిఖీ పత్రము కూడా క్లుప్తముగా యుండును. ఇందులో ప్రభుత్వము నుండి పొందబడిన గ్రాంటు వివరములకు ప్రాధాన్యత ఇవ్వబడును. ఈ తనిఖీ పత్రములే పంచాయితీ, గ్రామసంఘ, సహకార సంఘ గ్రంథాలయాలకు వర్తింపబడును.

## ప్రభుత్వ ప్రాంతీయ గ్రంథాలయాధికారిచే జిల్లా కేంద్ర గ్రంథాలయాల వార్షిక తనిఖీలు :

1963–64 సంవత్సరములో జిల్లా కేంద్ర గ్రంథాలయములను తనిఖీచేయు అధికారము ప్రభుత్వ ప్రాంతీయ గ్రంథాలయాధికారులకు అవకాశము ఇవ్వబడినది. ఆంధ్ర ప్రాంతములోని జిల్లా గ్రంథాలయములను గుంటూరు ప్రభుత్వ ప్రాంతీయ గ్రంథాలయాధికారికి, తెలంగాణ ప్రాంతములోని జిల్లా గ్రంథాలయాలను హైదరాబాదు రాష్ట్ర కేంద్ర గ్రంథాలయాధికారికి తనిఖీచేయు అధికారము ఇవ్వబడినది. గ్రంథాలయ శాస్త్రములో శిక్షణ పొందినవారే తనిఖీచేయు అధికారము పొందుట ద్వారా లోపములను గమనించి సవరించుటకు మంచి అవకాశములు కలిగినవి. వీరు తాము జరిపిన వార్షిక తనిఖీ రిపోర్టును రాష్ట్రగ్రంథాలయాల డిప్యూటీ డైరెక్టరుగారికి సమర్పించెడివారు. అప్పటి డిప్యూటీ డైరెక్టరుగారయిన రాఘవరెడ్డిగారు

వీటిని క్షుణ్ణముగా పరిశీలించి, తమ అభిప్రాయములను, సలహాలను పొందుపరచి పంపెడివారు. అంతే గాకుండా వీలయినపుడంతా రాష్ట్రములో అన్ని గ్రంథాలయాలను సందర్శిస్తూ, అప్పటికప్పుడు తాము కనుగొనిన దోషములకు నివారణోపాయములను తెలిపి, వాటి పురోభివృద్ధికి చక్కని సలహా లొసంగి గ్రంథాలయోద్యోగులను ప్రోత్సహించుచుండిరి.

## ప్రభుత్వ కేంద్ర గ్రంథాలయ, ప్రాంతీయ గ్రంథాలయాల వార్షిక తనిఖీలు :

రాఘవరెడ్డిగారు తమ పర్యవేక్షణలోయున్న రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమును పాటుపడి తీర్చిదిద్దారు. ఈ గ్రంథాలయమును ఆధునిక పద్ధతులలో తీర్చిదిద్ది, పాఠకులకు అందుబాటులో వుంచారు. ప్రభుత్వ ప్రాంతీయ గ్రంథాలయములను కూడ పర్యవేక్షించి తగు సలహాల నిచ్చుచుండెడివారు.

## జిల్లా గ్రంథాలయ సంస్థల కార్యాలయాల వార్షిక తనిఖీలు :

ఆంధ్ర ప్రదేశ్ గ్రంథాలయ చట్టము 1960 అమలులోనికి వచ్చిన తరువాత కూడా, కొంతకాలము జిల్లా లోకల్ లైబ్రరీ అథారిటీలకు (జిల్లా గ్రంథాలయ సంస్థలకు) ప్రత్యేక కార్యాలయాలు ఏర్పడలేదు. జిల్లా విద్యాశాఖాధికారి అజమాయిషీ క్రింద వారి కార్యాలయములోనే. వారి ఉద్యోగులే చూచుకొనెడివారు. జిల్లా విద్యాశాఖాధికారి కార్యాలయములను తనిఖీ చేయు డివిజనల్ ఇన్‌స్పెక్టర్ ఆఫ్ స్కూల్స్ వారే లోకల్ లైబ్రరీ అథారిటీకి సంబంధించిన రికార్డులను తనిఖీ చేయుచుండెడివారు. 1953 సం॥రము నుండి రాఘవరెడ్డిగారు కూడా జిల్లా లోకల్ లైబ్రరీ అథారిటీ కార్యాలయమును తరచుగా తనిఖీ చేసెడివారు.

గ్రంథాలయ సంస్థల సక్రమ నిర్వహణ కవసరమగు పత్రముల నమూనాలు రాఘవరెడ్డి గారిచే రూపొందింప బడినవి. అవి యీ నాటికిని ఉపయోగింప బడుచున్నవి. వీనియందు కూడ కొన్ని మార్పులు చేయవలసి యున్నవి.

1960 తరువాత జిల్లా విద్యాశాఖాధికారి ఆధిపత్యము నుండి వేరు చేయబడి, ప్రత్యేక కార్యాలయాలుగా ప్రత్యేక సిబ్బంది నియామకముతో ఏర్పాటయినవి. అప్పటినుండి జిల్లా కేంద్ర గ్రంథాలయాధి కారులే జిల్లా లోకల్ లైబ్రరీ అథారిటీ కార్యదర్శులుగా నియమింప బడినారు. అయితే వీరీ బాధ్యతలకు క్రొత్త వారయి నందున ప్రారంభములో కొన్ని సమస్య లెదురయినవి. అనుభవజ్ఞులయిన రాఘవరెడ్డిగారు వారికి సముచిత సలహాలొసంగి వారిలో ఆత్మ విశ్వాసము పెంపొందించారు.

రాష్ట్రములోను, జిల్లాలలోను గ్రంథాలయాలను తనిఖీ చేయుటకే ప్రత్యేక అధికారులను నియమించడము మంచిదని కొంత మంది గ్రంథాలయ కార్యకర్తలు సూచించారు. అయితే రాఘవరెడ్డిగారు ఈ విషయమును ముందు గ్రంథాలయాల సంఖ్య పెరిగి విస్తరించిన తర్వాత ఆలోచించ తగునని, ప్రస్తుత మీపద్ధతినే అనుసరించ దగునని సలహా యొసంగిరి. వీరి సలహా మేరకు ఈ పద్ధతి కొనసాగుతున్నది.

రాఘవరెడ్డిగారు వార్షిక నివేదికలను తయారు చేయుటలోను, వాటి నియమావళిని రూపొందించుటలోను, వాటిని ఆచరణ రీత్యా ప్రవేశ పెట్టుటలోను పాటుబడిరి. ప్రస్తుతము పొందుచున్న పాలనా సౌలభ్యము చాలా వఱకు రాఘవరెడ్డిగారి కృషి ఫలితము.



# ఆంధ్రప్రదేశ్ పౌరగ్రంథాలయచట్టము 1960: లోకల్ లైబ్రరీ అథారిటీలు - వాటి కార్యకలాపాలు :

## గ్రంథాలయచట్ట పరిధిలోని వివిధ గ్రంథాలయాలు :

ఆంధ్రప్రదేశ్ పౌరగ్రంథాలయాల చట్టము ననుసరించి ఆంధ్ర ప్రదేశ్‌లోని పౌర గ్రంథాలయములలో కొన్ని ప్రభుత్వ యాజమాన్యమునను, కొన్ని స్థానిక సంస్థల యాజమాన్యమునను, కొన్ని సహకారసంఘముల యాజమాన్యమునను, మరికొన్ని ప్రయివేటు సంస్థల యాజమాన్యమునను, తక్కినవి లోకల్ లైబ్రరీ అథారిటీల యాజమాన్యమునను నిర్వహింపబడు చున్నవి. చట్టప్రకారము విద్యాశాఖాధి కారులకు బదులు, జిల్లా గ్రంథాలయాధికారులుగా జిల్లా కేంద్ర గ్రంథాలయ గ్రంథపాలకులు వ్యవహరించుచున్నారు. పరిపాలనా సౌలభ్యము కొరకు ప్రతి రెవిన్యూ జిల్లాకు ఒకజిల్లా లోకల్ లైబ్రరీ అథారిటీని, జంటనగరములకు ఒక లోకల్ లైబ్రరీ అథారిటీని చట్టప్రకారము ఏర్పాటుచేయుట జరిగినది. ఈ విధముగా ఏర్పాటు చేయబడిన ప్రతి లోకల్ లైబ్రరీ అథారిటీ ఒక కార్పొరేట్ సంస్థ. ఈ సంస్థయందు అధికార సభ్యులకన్న, అనధికార సభ్యులు ఎక్కువగా యుందురు. పౌరగ్రంథాలయ చట్టము ప్రకారము జిల్లా కేంద్రగ్రంథాలయ పుస్తకభాండాగారి లోకల్ లైబ్రరీ అథారిటీకి కార్యదర్శిగా, మరియు జిల్లాలోని గ్రంథాలయముల పరిపాలనాధికారిగా వ్యవహరించవలెను. ఈ విధముగా జిల్లా కేంద్ర గ్రంథాలయ పుస్తకభాండాగారిని లోకల్ లైబ్రరీ అథారిటీ కార్యదర్శిగా నియమించుట, దేశమున ప్రప్రథమముగా మన రాష్ట్రమునందే జరిగినది. ఈ పరిణామమునకు దేశములోని పలుగ్రంథాలయ శాస్త్రవేత్తలు ప్రశంసించి

యున్నారు. ఉదాహరణకు, అఖిలభారత గ్రంథాలయ సంఘాధ్యక్షులైన శ్రీ సోహన్‌సింగ్‌గారు 25–10–1957 న ఆంధ్రప్రదేశ్‌లోని పౌర గ్రంథాలయాలను సందర్శించిన అనంతరము గ్రంథాలయోద్యమమును గురించి గ్రంథపాలకులతో చర్చించుచూ, ఆంధ్రప్రదేశ్‌లో గ్రంథాలయాల అభివృద్ధికి రాఘవరెడ్డిగారొనర్చిన కృషిని గూర్చి ప్రశంసించి, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమునకు మరియు జిల్లాగ్రంథాలయ సంస్థ వుద్యోగుల సంఘ అధ్యక్షుడైన శ్రీ పి. జనార్దనరెడ్డికి యీ విధముగా తెలియబరచిరి.

"I had an occasion to pay a brief visit to Hyderabad and discuss with old friends the progress of Public Libraries in Andhra Pradesh. What amazed me was that quietly, without making much noise, Andhra Pradesh had taken its place in the vanguard of Public Library movement in the country. There are a number of things I could mention, but what struck me most was the new Self-respect that the Librarians in the districts had achived. They could now Plan their Services within their means as Library technicians in their own right, and not as subordinates of Officers who had other, no doubt, worthy interests" అంతేగాక తన లేఖలో "I feel Libray workers in other states should know this" అని కూడా తెలియబరచిరి.

పౌర గ్రంథాలయ చట్టము 1960 అమలులోనికి రాక పూర్వము జిల్లా విద్యాశాఖాధికారి నిర్వహించు చుండిన, కార్యదర్శి పదవిని జిల్లా కేంద్ర గ్రంథాలయ పుస్తక భాండాగారి నిర్వహించవలెనని, పౌర గ్రంథాలయ చట్టమునందు సూచించుటలో, రాఘవరెడ్డి గారు కోదాటి నారాయణరావు మున్నగువారు సల్పిన కృషి శ్లాఘింపదగినది.

ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయచట్టము 1960, అమలులోనికి వచ్చిన యనంతరము విద్యాశాఖ డైరెక్టర్లుగా నుండిన శ్రీ ఎన్.

రామలాల్ గారు, శ్రీ వి. సి. వామన్ రావుగారు పౌర గ్రంథాలయ చట్టప్రకారము గ్రంథాలయశాఖ డైరెక్టర్లుగా కొనసాగిరి. వారిరువురు ఉత్తములని యిదివరకే పేర్కొనడమైనది. వారికున్న కాలమంతయు విద్యాశాఖ కార్యకలాపముల నిర్వహణకే సరిపోవుచుండుట వలన, గ్రంథాలయాల నిర్వహణలో గొప్ప యనుభవమును గడించిన రాఘవరెడ్డిగారిని, పౌరగ్రంథాలయాల అభివృద్ధి బాధ్యతను స్వీకరించవలసినదిగా కోరెడివారు రాఘవరెడ్డిగారు కొన్ని సమయాలలో వారితో సంప్రదించకయే స్వేచ్ఛగా కొన్ని కార్యక్రమములను చేపట్టినప్పటికి, వారు రాఘవరెడ్డిగారికి గల ఆసక్తికి మిగుల సంతసించెడివారు. రాఘవరెడ్డిగారికి కూడ వారిరువురిపై మిగుల గౌరవాదరము లుండినవి. రాఘవరెడ్డిగారు అప్పుడప్పుడు వారిని కలసికొని రాష్ట్రములోని గ్రంథాలయాభివృద్ధిని గురించి వివరించెడివారు.

## 1960 చట్టము ననుసరించి హైదరాబాదు నగర లోకల్ లైబ్రరీ అథారిటీ – నిర్మాణము:

హైదరాబాదు పౌర గ్రంథాలయ చట్టము, 1955 ప్రకారము హైదరాబాదు - సికిందరాబాదు జంట నగరములకు వేరు వేరుగా లోకల్ లైబ్రరీ అథారిటీలు ఏర్పాటు చేయబడి యుండినవి. కాని ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ చట్టము 1960 ప్రకారము జంట నగరముల రెంటికి ఒకే లోకల్ లైబ్రరీ అథారిటీని ఏర్పాటు చేయవలెను. ఈ చట్టమునందు ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘమునకు ప్రాముఖ్యము ఇవ్వబడినది. ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘము, నగర గ్రంథాలయ సంఘము నుండి యిరువురిని ఎన్నుకొని నగర లోకల్ లైబ్రరీ అథారిటీ సభ్యులుగా సూచించవలెను.

మదరాసు రాష్ట్ర పౌర గ్రంథాలయ చట్టము 1948 ప్రకారము మదరాసు నగర లోకల్ లైబ్రరీ అథారిటీకి ఒక కళాశాల

ప్రిన్సిపాల్ మఱియు ఇరువురు ప్రధానోపాధ్యాయులు సభ్యులుగా నుందురు. 1960 చట్టమునందు ఈ స్థానమున గ్రంథాలయాలకు సేవ జేసిన లేదా విద్యారంగమునకు చెందిన నల్గురిని, హైదరాబాదు నగర లోకల్ లైబ్రరీ అథారిటీకి సభ్యులుగా సూచించవలెనని పేర్కొనబడినది నగరములోని సహాయక గ్రంథాలయ నిర్వాహణ సంస్థ సభ్యులు, తమలో ఆరుగురిని నగర లోకల్ లైబ్రరీ అథారిటీ సభ్యులుగా ఎన్నుకొనవలెను.

హైదరాబాదు పురపాలక కార్పొరేషన్ సభ్యులు కూడ, తమలో ఒకరిని నగర లోకల్ లైబ్రరీ అథారిటీ సభ్యునిగా ఎన్నుకొనవలెను. అంతకు పూర్వము విద్యాశాఖాధికారి నిర్వహించు చుండిన లోకల్ లైబ్రరీ అథారిటీ కార్యదర్శి పదవిని, 1960 చట్ట ప్రకారము నగర కేంద్ర గ్రంథాలయ పుస్తక భాండాగారి స్వీకరించును. నగర లోకల్ లైబ్రరీ అథారిటీ సభ్యులందరు కలసి చైర్మన్‌ను ఎన్నుకొనవలెను.

## 1960 చట్టము మేరకు జిల్లా లోకల్ లైబ్రరీ అథారిటీల నిర్మాణము:

ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ చట్టము 1960 నందు ఆంధ్ర గ్రంథాలయ సంఘమునకుకూడ, తగు ప్రాముఖ్యము యివ్వబడిన దన్న విషయమును గురించి, యిదివరకే తెలియజేయ బడినది. ప్రతి జిల్లాలోను గ్రంథాలయ సంఘు జిల్లాశాఖ సభ్యులు, తమలో ఇరువురిని ఆ జిల్లా లోకల్ లైబ్రరీ అథారిటీకి సభ్యులుగా ఎన్నుకొనవలెను.

మదరాసు పౌర గ్రంథాలయ చట్టము ప్రకారము ప్రిన్సిపాల్‌ను లేదా ప్రధానోపాధ్యాయులలో ఐదుగురిని, గ్రంథాలయ శాఖ డైరెక్టరు, సభ్యులుగా సూచించుచుండెను. 1960 చట్ట

ప్రకారము విద్యా రంగమునందు లేదా గ్రంథాలయ ఉద్యమ మందు కృషి సల్పిన నల్గురిని, జిల్లా లోకల్ లైబ్రరీ అథారిటీ యందు సభ్యులుగా రాష్ట్ర ప్రభుత్వము సూచించవలెను. జిల్లా యందలి పురపాలకసంస్థ సభ్యులు, తమలో ఇరువురిని జిల్లా లోకల్ లైబ్రరీ అథారిటీ సభ్యులుగా సూచించవలెను. ప్రతి రెవిన్యూ విభాగములోని సహాయక గ్రంథాలయముల నిర్వహణాధి కారులు, తమలో నిరువురిని, తాలూకా స్థాయిలోని సర్పంచ్‌లు, తమలో ఒక రిని, జిల్లా లోకల్ లైబ్రరీ అథారిటీ సభ్యులుగా ఎన్నుకొనవలెను. జిల్లా కేంద్ర గ్రంథ పాలకుని (కార్యదర్శి)తోపాటు పై సభ్యులందఱు కలసి చైర్మెన్‌ను ఎన్నుకొనవలెను. ఈ విధముగా రూపొందు జిల్లా లోకల్ లైబ్రరీ అథారిటీ సభ్య లెక్కువగా నుండుటవలన, సాధారణముగా అభిప్రాయ భేదములకు తా వేర్పడుటయేగాక, గ్రంథాలయాభివృద్ధి తదితర కార్యక్రమములు త్వరితముగా జరుగుటకు వీలులేక పోవు టచే, లోకల్ లైబ్రరీ అథారిటీ సభ్యుల సంఖ్యను పరిమితము చేయ వలసిన అవసరము కలదు.

## 1960 చట్టము లోకల్ లైబ్రరీ అథారిటీలు: ఏర్పాటులో జాప్యము – కారణములు:

ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ చట్టము 1960 క్రింద రాఘవరెడ్డిగారు రూపొందించిన డ్రాఫ్టు నిబంధనలను ప్రభుత్వము పరి శీలించి, 1961 సంII న ప్రచురించినది. ఈ ప్రచురణలో కొంత జాప్యము జరుగుటచే లోకల్ లైబ్రరీ అథారిటీల సభ్యుల, చైర్మెన్‌ల ఎన్నిక లలో కూడ కొంత జాప్యము జరిగినది. చైర్మెన్ ఎన్నికలను జిల్లా విద్యా శాఖాధికారులు నిర్వహించవలెను. చైర్మెన్ ఎన్నికలయందు ఎవరెవరు పాల్గొనవలెనన్న విషయమును గురించి జిల్లా లోకల్ లైబ్రరీ అథారిటీ కార్యదర్శి స్పష్ట పరచవలెను. ఈ విషయమున

కార్యదర్శులకు కొన్ని సందేహములు కలుగుటవలన వారు తమ సందేహముల నివృత్తికిగాను డైరెక్టరు గారితో ఉత్తర ప్రత్యుత్తరముల జరుపుచుండిరి. లోకల్ లైబ్రరీ అథారిటీల నిర్మాణములో కలిగిన జాప్యమునకు యిది కూడ కొంతవరకు కారణ భూతమయినది.

1. ఏ గ్రంథాలయములు సెక్షన్ 10 (1) బి, మరియు 10 (2) బి. క్రింద వచ్చునన్న సందేహము జిల్లా విద్యాశాఖాధికారులకు కల్గినది. అందులకు రాఘవరెడ్డిగారు ఈ క్రింది గ్రంథాలయములకు పై సెక్షన్లు వర్తించునని స్పష్టము చేసిరి.

(అ) పంచాయతీ గ్రంథాలయములు (ఆ) సహాయక గ్రంథాలయములు

(ఇ) గ్రామ సంఘం గ్రంథాలయములు (ఈ) సహకార గ్రంథాలయములు

(ఉ) పురపాలక గ్రంథాలయములు (ఊ) జిల్లా పరిషత్ గ్రంథాలయములు

ఈ గ్రంథాలయముల కార్యవర్గ సభ్యులు లోకల్ లైబ్రరీ అథారిటీల ఎన్నికలలో పాల్గొనవచ్చునని రాఘవరెడ్డిగారు తెలియజేసిరి.

2. 10 (1) బి, మరియు 10 (2) బి, సెక్షన్‌ల ప్రకారము గ్రంథాలయాల కార్యవర్గ సభ్యులలో 1/3 వంతు సభ్యులు హాజరయినచో, ఎన్నికలను నిర్వహించవచ్చును. కాని తరచుగా ఈ ఎన్నికల నిర్వహణ సమయమున 1/3 వంతు సభ్యులు హాజరగుటకు వీలు కాకుండినది. కావున 1/5 వంతు సభ్యులు లేదా 50 మంది సభ్యులు హాజరయినచో ఈ ఎన్నికల జరుపవచ్చునని రాఘవరెడ్డిగారు ప్రభుత్వమునకు వివరించిరి. కాని ప్రభుత్వము మీా నిబంధనలను సవరించుటకు వీలులేదని అభిప్రాయ పడినది. తత్కారణమున జిల్లా లోకల్ లైబ్రరీ అథారిటీల ఎన్నికలలో కొంత ఆలస్యము జరిగినది.

3. మదరాసు, హైదరాబాదు పౌరగ్రంథాలయాల చట్టముల ప్రకారము నియమితులయిన లోకల్ లైబ్రరీ అథారిటీ సభ్యుల కాలపరిమితి ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ చట్టము 1960 అమలులోనికి వచ్చునాటికి ముగియకున్నందున ఈ సభ్యులు తమ కాలపరిమితి ముగియు వరకు సభ్యులుగా నుండవచ్చునా? లేక నూతనముగా లోకల్ లైబ్రరీ అథారిటీల నిర్మాణము జరుగునంతవరకు సభ్యులుగా కొనసాగవచ్చునా? యని కార్యదర్శులకు సందేహము కల్గినది. అందులకు రాఘవరెడ్డిగారు ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ చట్టము 1960 లోని సెక్షన్ 28 ననుసరించి పై రెంటియందు యేది ఎక్కువ కాలపరిమితిని కల్గియుండునో అంతవరకు సభ్యులుగా నుండ వచ్చునని తెలియపరచిరి.

4. సెక్షన్ 10 (1) బి, 10 (2)బి, లు అన్వయించు గ్రంథాలయముల కార్యవర్గ సభ్యులలోని నిరక్షరాస్యులు ఈ ఎన్నికలలో పాల్గొనవచ్చునా? కూడదా? యను సందేహము కార్యదర్శులలో కొందరికి కలుగగా, ఎన్నికల చట్టము 30—12—1961 ప్రకారము నిరక్షరాస్యులయిన సభ్యులు కూడ ఈ ఎన్నికలలో, పాల్గొనుటకవకాశము కలదని ప్రభుత్వము స్పష్టపరచినది.

5. ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ చట్టము క్రింద ప్రకటింపబడిన ఆంధ్రప్రదేశ్ పౌరగ్రంథాలయ నిబంధనలు, 1961 సం॥న విధాన మండలి యందును, విధాన పరిషత్ నందును ప్రవేశ పెట్టబడనందున, సెక్షన్ 10 (2) డి, క్రింద ఎన్నికలను నిర్వహించుటకు వీలులేదని రేపల్లె పురపాలక సంస్థ చైర్మెన్ పౌర గ్రంథాలయ శాఖ డైరెక్టరు గారికి తెలియజేసిరి. కాని ఈ నిబంధనలు చట్టము నందే సూచించబడినవి, కాన చైర్మెన్‌గారి అభిప్రాయము సరికాదని ప్రభుత్వము తెలియ బరచినది.

6. రద్దు చేయబడిన పురపాలక సంస్థల - పురపాలక కమిటీల నుండి సెక్షన్ 10 (2) బి, క్రింద సభ్యులను సూచించ వచ్చునా? యని పౌర గ్రంథాలయ అధికారులు కొందరు అభిప్రాయ పడిరి. ఆ ప్రకారము సూచించుటకు వీలు లేదని ప్రభుత్వము తెలియజేసినది.

పై కనబరచిన యిబ్బందుల వలన లోకల్ లైబ్రరీ అథారిటీల సభ్యుల ఎన్నికలలో కొంత జాప్యము జరిగినది. సభ్యుల ఎన్నికల యందు జాప్యము జరుగుటచే చైర్మన్‌ల ఎన్నికల యందు కూడ జాప్యము తప్పని సరియైనది.

ఈ విధముగా లోకల్ లైబ్రరీ అథారిటీల సభ్యుల, చైర్మన్‌ల ఎన్నికలు ఆలస్యముగా జరిగినప్పటికి ఎన్నికలు మాత్రము మిగుల సక్రమముగా జరిగినవి. ఎన్నికల సమయాన అభ్యంతరములు గాని, ఫిర్యాదులుగాని రాలేదు. అంతేగాక ఓటమిని పొందిన సభ్యులు కూడ, ఎన్నికల నిర్వహణ సక్రమముగా జరుగలేదని విమర్శించలేదు. జిల్లా పరిషత్, పురపాలక సంస్థలు, తదితర స్థానిక సంస్థల ఎన్నికలలో కోర్టుకు వెళ్ళినవారు కలరు గాని, లోకల్ లైబ్రరీ అథారిటీల ఎన్నికల యందు కోర్టుకు వెళ్ళిన సందర్భాలేమియు లేవు. ఈ విధముగా ప్రశాంత వాతావరణమును సమకూర్చిన రాఘవరెడ్డిగారి కృషి ప్రశంసనీయము.

ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ చట్టము 1960, అమలులోనికి వచ్చిన యనంతరము లోకల్ లైబ్రరీ అథారిటీల చైర్మన్‌ల, కార్యదర్శుల మధ్య సహకారము కూడ పెంపొందినది. వీరందరు రాఘవరెడ్డిగారితో వివిధ విషయములను గూర్చి సంప్రదించుచు, వారితో అన్యోన్యతను కల్గియుండిరి.

## లోకల్ లైబ్రరీ అథారిటీలు సమర్పించిన ప్రణాళికలు మరియు నియమావళి:

రాఘవరెడ్డిగారు, లోకల్ లైబ్రరీ అథారిటీల ఛైర్మెన్‌లు, కార్యదర్శులు పంపెడు గ్రంథాలయాభివృద్ధి ప్రణాళికా పథకము లను, పరిశీలించి, అవసర మున్నప్పుడు వారితో చర్చలు జరిపి ఆమో దించెడివారు. కొన్ని సందర్భాలలో కొన్ని మార్పులను చేసి, ఆ ప్రణాళికా పథకముల మరింత మెరుగు పరచెడివారు. కార్యదర్శు లకు, ఛైర్మెన్‌లకు కల్గెడి సందేహములను జాప్యము లేక పరిష్క రించు చుండెడివారు. కార్యదర్శులు, ఛైర్మెన్‌లు రాఘవరెడ్డి గారొ సగు సాంకేతిక సలహాలను చక్కగా పాటించుచుండిరి.

ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ చట్టము 1960, ప్రకారము లోకల్ లైబ్రరీ అథారిటీల ఆస్తిపాస్తులను గురించి, ఎటువంటి వారిని గ్రంథాలయ పాఠకులుగా చేర్చికొన వలెనన్న విషయాదుల గురించి ఛైర్మెన్‌లు, కార్యదర్శులు ఒక నియమావళిని రూపొందించ వలెను. ఈ విధముగా ఛైర్మెన్‌లు, కార్యదర్శులు చట్టప్రకారము రూపొందించిన నియమావళిని రాఘవరెడ్డిగారు పరిశీలించి, ఆమో దించు చుండెడివారు. కొన్ని సందర్భములందు పాఠకుల అవసరము లను బట్టి, కొలది మార్పుల గావించి ఆమోదించెడివారు.

జిల్లాల యందలి గ్రంథాలయముల అభివృద్ధికి ప్రధానపాత్ర వహించవలసిన బాధ్యత ఆయా జిల్లాల లోకల్ లైబ్రరీ అథారిటీల కార్యదర్శులపై నుండును. ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ చట్టము అమలులోనికి వచ్చిన నాటినుండి సెక్రటరీలు గ్రంథ పాఠకులకు కావల సిన సదుపాయములను కూడ సమకూర్చు చుండిరి. జిల్లా గ్రంథా లయాధికారులు శిక్షణ పొందినవా రగుట చేతను, గ్రంథాలయాల నిర్వహణలో అనుభవము కలవా రగుటచేతను రాఘవరెడ్డిగారి

సలహా సంప్రదింపులతో సాంకేతిక తదితర గ్రంథాలయాభివృద్ధి కార్యక్రమాలను చక్కగా అమలు పరచగల్గిరి.

ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ చట్టము 1960, అమలులోనికి వచ్చిన అనంతరము ఎందరో మహనీయులు, విద్యావంతులు గ్రంథాలయాల స్థాపనకు గొప్ప ఉత్సాహమును ప్రదర్శించిరి. ఉదాహరణకు, శ్రీ భగవాన్ శ్రీ సత్యసాయిబాబాగారి సహాయముతో అనంతపురం జిల్లాకు చెందిన బుక్కపట్నంనందు శాఖా గ్రంథాలయము స్థాపించబడినది.



26—11—1966 న బుక్కపట్నం నందు శాఖా గ్రంథాలయమును స్థాపించినప్పుడు ఆ గ్రామస్థులు ఆనందోత్సాహములతో శ్రీ భగవాన్ సత్యసాయిబాబా గారిని, శ్రీ కె. రాఘవరెడ్డిగారిని, శ్రీ వేమారెడ్డిగారిని ఊరేగింపుతో తోడ్కొని వస్తున్న దృశ్యము.



బుక్కపట్నం నందు శాఖా గ్రంథాలయము తెరువబడిన అనంతరము గ్రంథాలయాలను గురించి శ్రీ కె. రాఘవరెడ్డిగారు ఉపన్యసిస్తున్న ఛాయా చిత్రం. వేదికపై శ్రీ భగవాన్ శ్రీ సత్యసాయిబాబా గారిని కూడా చూడవచ్చును.

శాఖా గ్రంథాలయాధికారి తన పరిధికి చెందిన గ్రామాలకు గ్రంథాలయసేవ చేయవలసిన బాధ్యతను వహించవలెను. వీరు తమ గ్రంథాలయ ప్రాంత సరిహద్దులకు చెందిన గ్రామములలోని వారి కేటు వంటి పుస్తకము లవసరమో గుర్తించి, తన గ్రంథాలయములో లేని పుస్తకముల జాబితాను జిల్లా కేంద్ర గ్రంథాలయానికి పంపి, అచటి నుండి పుస్తకములను పొంది, గ్రామాలలోని గ్రంథాలయాలకు పంపిణీచేసి, పాఠకులకు పఠనమునం దాసక్తిని పెంపొందించుటకు కృషి చేసిరి.

గ్రామీణప్రాంతములలోని సహాయక గ్రంథాలయాలు పుస్తక పంపిణీ కేంద్రములు కూడ ఆయా ప్రాంతీయులకు చట్టము అమలు నకు వచ్చిన తర్వాత మిగుల ప్రయోజన కరముగా నిర్వ

హింపబడు చుండినవి, ఈ గ్రంథాలయాలు గ్రంథాలయ ప్రచారము నందు గూడ ప్రధాన పాత్రను వహించు చుండినవి. ఈ గ్రంథాలయ నిర్వాహకులలో కొందరు తమ గ్రంథాలయాలలో లేని పుస్తకములను యితర గ్రంథాలయాలనుండి తెప్పించి, తమ గ్రామస్థుల కందించుచు గ్రంథాలయ సేవ చేయుచుండిరి.

## 1960 చట్టము అమలుకు వచ్చిన తరువాత పునర్నిర్మాణమయిన జిల్లా లోకల్ లైబ్రరీ అథారిటీలు :

ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ చట్టము 1960, అమలులోనికి వచ్చిన తరువాత జరిగిన లోకల్ లైబ్రరీ అథారిటీ సభ్యుల, చైర్మన్‌ల, మొట్టమొదటి ఎన్నికలకన్న, రెండవమారు జరిగిన ఎన్నికలు కాలయాపన లేక జరిగినవి. 1960 సం॥నకు పూర్వము సభ్యులుగాను, చైర్మన్‌లుగాను నుండినవారు కూడ, ఈ సంవత్సరము జరిగిన ఎన్నికలలో ఎన్నికయినందున, వారు 1960 సం॥నకు పూర్వము నుండి గ్రంథాలయములలో మంచి అనుభవమును పొందిన వారగుట వలన గ్రంథాలయాభివృద్ధికి తగినంతగా తోడ్పడుటకు వీలయినది.

గ్రంథపాలకులతో బాటు, చైర్మన్ లు కూడ గ్రంథాలయాల అభివృద్ధికి మిగుల పాటుపడిరి. అటువంటి వారిలో బి. సుబ్బారెడ్డి (కర్నూలు); కల్లూరు సుబ్బారావు, వేమారెడ్డి (అనంతపురం); రామనాథం (కడప); హరిశ్చంద్రా రెడ్డి (నెల్లూరు); రామస్వామి చౌదరి (గుంటూరు); కలపాక సూర్యప్రకాశరావు (కృష్ణ); జవ్వాది లక్ష్మయ్యనాయుడు (పశ్చిమగోదావరి); కొండలరావు (తూర్పుగోదావరి); ఎస్. చెన్నారెడ్డి (హైదరాబాదుజిల్లా); వాసుదేవరెడ్డి (వరంగల్లు); వేంకట్రామారావు (కరీంనగర్); బాలకృష్ణరావు (ఆదిలాబాద్); హీరాలాల్ మోరియా (ఖమ్మం) మున్నగు వారు 1960 సం

వత్సరము తరువాత గూడ, వారి వారి జిల్లాలయందు గ్రంథాలయాల అభివృద్ధికి తగిన కృషి సల్పిరి.

1960 సంవత్స రానంతరము కూడ చైర్మెన్‌లే కాక, కార్య దర్శులు, గ్రంథాలయ కార్యకర్తలనేకులు యీ ఉద్యమవ్యాప్తి చురుకుగా పాటుపడుచుండిరి. వీరిలో కొందరు లోకల్ లైబ్రరీ అథారిటీ సభ్యులుగా కూడ నుండిరి. వారిలో భోజ్‌రెడ్డి (హైదరాబాదు జిల్లా) లక్ష్మయ్యగుప్త (గుంటూరు); బత్తుల వేంకట్రామ రెడ్డి (అనంత పురం); డా॥ స్వామి (ఆదిలాబాద్); గద్దె రామమూర్తి (పశ్చిమ గోదావరి); మల్లికార్జునస్వామి (శ్రీకాకుళం); ఎ. శ్రీనివాసరావు (వేటపాళెం); రంగారావు (నల్గొండ); వేంకట్రామయ్య (మెదక్); తదితరులు ముఖ్యులు.

## లోకల్ లైబ్రరీ అథారిటీ చైర్మెన్‌ల ప్రయాణ బత్తెము - ఇతర అలవెన్సులు :

లోకల్ లైబ్రరీ అథారిటీ చైర్మెన్‌లు కొందరు ప్రతినెల కొంత ప్రతిఫలమును చెల్లించవలసినదిగా ప్రభుత్వమును కోరిరి. కర్నూలు లోకల్ లైబ్రరీ అథారిటీ చైర్మెన్ గారగు శ్రీ బి. సుబ్బా రెడ్డిగారు మరికొందరు మాత్రము ఉచితముగా గ్రంథాలయ సేవ చేయవలెనని, ప్రతిఫలముతో ప్రమేయము లేదని యభిప్రాయమ పడిరి. ఈ విషయములను గురించి రాష్ట్ర గ్రంథాలయ కమిటీ సమా వేశములందు గూడ చర్చించడం జరుగుచుండినది. రాఘవ రెడ్డిగారు కూడ ఈ విషయమునుగురించి ప్రభుత్వమునకు వివరించగా, చైర్మెన్ లకు ప్రతిఫలమునకు మారుగ, జిల్లాపరిషత్ చైర్మెన్‌ల కిచ్చువిధముగా ప్రయాణఖర్చులను, దినసరి భత్యమును (T. A. & D. A.) యిచ్చు టకు మాత్రము ప్రభుత్వ మంగీకరించినది.

## పౌరగ్రంథాలయాలు - అధునిక విధానములందు అభివృద్ధి :

1960 సం॥ తరువాత రెండు సంవత్సరములకు గ్రంథాలయ సెస్సు వసూలు కొంత మెరుగుపడుటచే శాఖా గ్రంథాలయములను, పుస్తక పంపిణీ కేంద్రములను స్థాపించుటయే గాక, 1960 సం॥నకు పూర్వము నుండి పనిచేయు చున్నటువంటి జిల్లా కేంద్రశాఖా గ్రంథాలయాలలో కొన్ని విభాగముల ఏర్పరచుట, ఇదివరకే స్థాపించబడి యున్న విభాగముల అభివృద్ధిపరచుట కూడ జరిగినది.



ఆదిలాబాదు జిల్లా నిర్మల్ శాఖా గ్రంథాలయమున రీడింగు రూము.

## గ్రంథాలయాలలో ఆచూకీ విభాగముల అభివృద్ధి :

1960 సం॥నకు పూర్వము నుండి కూడ కొన్ని జిల్లా కేంద్ర గ్రంథాలయాలలో ఆచూకీ విభాగము లుండినవి. 1960 సం॥ తరువాత కొంత కాలమునకు ఇతర జిల్లా కేంద్ర గ్రంథాలయాలలోను,

విజయవాడ, రాజమండ్రి, తెనాలి, తిరుపతి మున్నగు పట్టణములలోని పెద్ద శాఖా గ్రంథాలయములందును కూడ ఆచూకీ విభాగములు ప్రారంభించబడినవి. ఈ విధముగా జిల్లా కేంద్ర, శాఖా గ్రంథాలయములందు ప్రత్యేక విభాగములుగా ప్రారంభింపబడిన ఆచూకీ విభాగములందు లోకల్ లైబ్రరీ అథారిటీలు విజ్ఞాన సర్వస్వాలు, నిఘంటువులు వంటి సమాచార గ్రంథములను ప్రవేశ పెట్టినవి.

1967-68 సం॥ లోకల్ లైబ్రరీ అథారిటీలు ప్రాంతీయ గ్రంథాలయాలకు ఆచూకీ గ్రంథముల కొనుగోలు చేయుటకుగాను ప్రభుత్వము రూ. 72,000/- లను మంజూరు చేసినది. పుస్తకముల నిచ్చి పుచ్చుకొనుటకు వీలుగా కౌంటర్ల నిర్మాణమునకు కూడ ప్రభుత్వము గ్రాంట్లను మంజూరు చేసినది.

గ్రంథాలయములందలి పుస్తకములపై బాగా అవగాహన గలవారు గ్రంథాలయ పాఠకులను చక్కగా ఆకర్షించి, వారి అభిరుచులను గ్రహించి తదను గుణమయిన పుస్తకముల నందించువారు, గ్రంథాలయ సేవయందు ఉత్సాహము చొరవ కల్గినవారు పలువురు ఈ ఆచూకీ విభాగములందు పని చేయుచుండిరి. సాధారణముగా కొన్ని గ్రంథాలయాలలో పరిపాలనా నిర్వహణకు ప్రాముఖ్యము నిచ్చి, తదనంతరము గ్రంథాలయ పాఠకుల అవసరములకు ప్రాధాన్యత నిచ్చుచుందురు. కాని మన రాష్ట్రమునందలి గ్రంథాలయముల పాఠకులకు కలుగజేయు వసతులకు ఎక్కువ ప్రాధాన్యత నొసగిరి. పరిపాలనా నిర్వహణలు కూడ సక్రమముగా జరుపబడినవి.

## పాఠ్య పుస్తక విభాగములు - అభివృద్ధి:

1960 సం॥ తరువాత కొన్ని పౌర గ్రంథాలయములందు ప్రధానముగా పేద విద్యార్థుల ప్రయోజనార్థము పాఠ్యపుస్తక విభాగములను ప్రారంభించుట జరిగినది.

ఉదాహరణకు, హైదరాబాదు నగర కేంద్ర గ్రంథాలయము నందును, హిమయత్ నగర్ శాఖా గ్రంథాలయము నందును, ఏలూరు జిల్లా కేంద్ర గ్రంథాలయమందును పాఠ్యగ్రంథముల విభాగము లను ప్రారంభించుట జరిగినది. తెనాలి, విజయవాడ, విజయనగరం మున్నగు పట్టణములలోని శాఖా గ్రంథాలయము లందు గూడ పేద విద్యార్థుల కొఱకు ప్రధానమయిన పాఠ్యపుస్తకములను ప్రవేశ పెట్టుట జరిగినది.

రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమునందు ప్రారంభించబడిన పాఠ్య గ్రంథ విభాగము దినమునకు 16 గం॥లు పనిచేయుచు నగరములోని విశ్వవిద్యాలయ, కళాశాలల, మొదలగు విద్యా సంస్థలకు సంబంధించిన విద్యార్థులకు అమితముగా సేవ చేసినది. విశ్వ విద్యాలయములు, కళా శాలలు సాయం సమయము 5 గం॥ల వరకు మాత్రము పనిచేయుట వలన, అచటి పేద విద్యార్థులకు పౌర గ్రంథాలయములం దేర్పరచ బడిన పాఠ్యగ్రంథ విభాగము మిగుల ప్రయోజన కరముగా నుండునని పాఠ్యగ్రంథములను పౌర గ్రంథాలయాలలో యుంచుట జరిగినది.

## పౌర గ్రంథాలయాలలో చురుకుగా సాగిన వయోజన విద్యా కార్యక్రమములు:

1960 సం॥ అనంతరము వికారాబాద్, సంగారెడ్డి మున్నగు పట్టణములందు గ్రంథాలయ భవనములు నిర్మించబడినవి. ఈ గ్రంథా లయము లందును, రాష్ట్ర కేంద్ర గ్రంథాలయము నందును మఱియు అనంతపురం, గుంటూరు, తదితర పట్టణము లందలి గ్రంథాలయము లందును గ్రంథాలయ చర్చలు, గోష్ఠులు, పుస్తక ప్రదర్శనలు, తదితర వయోజన విద్యా కార్యక్రమములు విరివిగా నిర్వహించబడినవి. క్రమముగా ఈ కార్యక్రమములు పలు శాఖా గ్రంథాలయము లందు కూడ నిర్వహింప బడినవి. పిల్ము ప్రొజక్టరు లున్న గ్రంథాలయాలలో

తరచు చలనచిత్ర ప్రదర్శనలు జరుపబడుచుండినవి. ఫిల్ము ప్రొజక్టరులు లేని శాఖా, తదితర గ్రంథాలయములందు పౌర సంబంధ శాఖ వారు 1960 సం॥ మునుపటికన్న విరివిగా ప్రదర్శనల నిచ్చుచుండిరి. రేడియో కార్యక్రమాలను వినుటకు జిల్లా కేంద్ర గ్రంథాలయముల కే గాక, శాఖా గ్రంథాలయములకు కూడ పలువురు శ్రోతలు వచ్చు చుండిరి. 1960 సం॥నకు పూర్వము వలె చార్టులు, గ్లోబులు, పోస్టర్లు మున్నగు వానిని జిల్లా కేంద్ర గ్రంథాలయము లందే గాక, పెక్కు శాఖా గ్రంథాలయములందు కూడ పాఠకులకు ప్రయోజనకరముగా ఉపయోగించుచుండిరి.

## సహాయక గ్రంథాలయాలకు లోకల్ లైబ్రరీ అథారిటీల ఇతోధిక ఆర్థిక సహాయము :

ఆర్థికముగా వెనుకబడి నిర్వహణా సమర్థత లోపించి, మూసి వేయబడుచున్న సహాయక గ్రంథాలయాలను 1960 సం॥ పూర్వము వలె లోకల్ లైబ్రరీ అథారిటీలు తమ ఆధీనములోనికి తీసికొనినవి. అవి శాఖా గ్రంథాలయములుగా నిర్వహింపబడు చుండినవి. ఉదా॥ 1964-65 సం॥ 13 సహాయక గ్రంథాలయములను, 1965-66 సం॥ 6 సహాయక గ్రంథాలయములను లోకల్ లైబ్రరీ అథారిటీలు తమ ఆధీనములోనికి తీసికొనినవి. అవి శాఖా గ్రంథాలయములుగా నిర్వహింపబడినవి. ప్రయివేటు యాజమాన్యములోని సహాయక గ్రంథాలయముల నిర్వహణకుగాను కొన్ని లోకల్ లైబ్రరీ అథారిటీలు తమ నిధుల నుండి కూడ గ్రాంట్లను మంజూరుచేయు చుండినవి. ఉదా॥ గుంటూరు, అనంతపురం, హైదరాబాదు నగర కేంద్ర లోకల్ లైబ్రరీ అథారిటీలు.

హైదరాబాదు నగర గ్రంథాలయ సంస్థ నగరములోని సహా యక గ్రంథాలయాల అభివృద్ధికి ఇతర జిల్లా గ్రంథాలయ సంస్థల కన్న

ఎక్కువ ఆర్థిక సహాయము చేయుటకు వీలయినది. కావున 1967-68 సం॥ రూ. 70,000/- లను, 1969 - 70 సం॥ రూ. 68,000/- లను గ్రాంట్ల క్రింద మంజూరు చేసినది. 1969 సం॥ యనంతరము కూడ యిటువంటి ఆర్థిక సహాయము చేయుచూ వచ్చినది.

## పుస్తక పంపిణీ కేంద్ర నిర్వాహకులకు పెంచబడిన గౌరవ వేతనము:

పుస్తక పంపిణీ కేంద్రముల గ్రంథపాలకులకు నెలసరి చెల్లించబడు ప్రతిఫలము స్వల్పమగుటచే వారియందు ఉత్సాహము సన్నగిల్లినది. కాన రూ. 8-75 లున్నటువంటి గౌరవవేతనమును 1967 సం॥ తరువాత 12 రూ. లకు పెంచుట జరిగినది. ఈ విధముగా ఈ గౌరవ వేతనము స్వల్పమయినప్పటికి, ఉత్సాహముతో గ్రంథసేవ కావించిన గ్రంథపాలకులు మన రాష్ట్రములో పెక్కుమంది లేకపోలేదు.

ఉదాహరణకు: శ్రీ ఎ. అశ్వర్థప్ప, శింగనమల-అనంతపురంజిల్లా. శ్రీ నారాయణరెడ్డి, బండమూడిపల్లె - మహబూబ్‌నగర్ జిల్లా. శ్రీ నరసింహాచారి, మునుగోడె - నల్గొండ జిల్లా. శ్రీ చావలి నరసింహమూర్తి, లకవరం-విశాఖపట్టణం జిల్లా. శ్రీ కాలనాథభట్ల, దిమిలి - విజయనగరం జిల్లా.

1960 సంవత్సరమునకు పూర్వము సైకిళ్ళద్వారా గ్రామస్థులకు పుస్తకములను పంపిణీ చేయుచుండిరి. 1960 సం॥ తరువాత కొన్ని జిల్లాలలో రిక్షాలలో పుస్తకములను తీసికొనివెళ్ళి గ్రామస్థులకు అరువు యివ్వడము జరిగినది.

## మహిళలకు గ్రంథాలయసేవ:

ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ చట్టము 1960 అమలులోనికి రాక మునుపటినుండి కూడ జిల్లా కేంద్ర, కొన్ని శాఖా

గ్రంథాలయములయందు మహిళలకు సంబంధించిన పుస్తకములను సేకరించి పెట్టుట, వారికి పఠనమునకు తగిన సౌకర్యముల కల్పించుట జరుగుచుండినవి. 1960 సం॥ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ పౌర గ్రంథాలయ చట్టము అమలులోనికి వచ్చిన యనంతరము, లోకల్ లైబ్రరీ అథారిటీల స్థితి గతులు కొంత వృద్ధి చెందుటచే పలు జిల్లా కేంద్ర గ్రంథాలయముల యందును, విశాలమైన భవనముల కల్గియున్న కొన్ని శాఖా గ్రంథాలయములయందును మహిళలకు ప్రత్యేక విభాగముల నేర్పాటు చేయుట జరిగినది. రాష్ట్ర కేంద్ర గ్రంథాలయము నందును, ప్రాంతీయ గ్రంథాలయములందును, కొన్ని జిల్లా కేంద్ర గ్రంథాలయములందును, కొన్ని శాఖా గ్రంథాలయములందును మహిళలకు సంబంధించిన చేతిపనులు, గృహశాస్త్రము, ఆరోగ్యము పారిశుధ్యము, కుట్టుపనులు మొదలగు విషయములకు సంబంధించిన పుస్తకములు కొనుగోలు చేయబడినవి.

## మహిళలకు గ్రంథాలయములలో ప్రత్యేక విభాగములు:

కర్నూలు, ఖమ్మం, మున్నగు జిల్లా లోకల్ లైబ్రరీ అథారిటీలు స్త్రీలకు ప్రత్యేక గ్రంథాలయముల స్థాపించుటయేగాక, స్త్రీలకు గ్రంథాలయములందు చదువుకొనుటకు తగు వసతులను కల్గించినవి. ఈ విధముగా రాష్ట్రమునందు గ్రంథాలయాలలో మహిళలకు ప్రత్యేక విభాగముల నేర్పాటు చేయుట గ్రంథపాలకులలో కొందరికి రుచింపలేదు. మహిళలు కూడ పురుషులతోపాటు గ్రంథాలయాలలో చదువు కొందురని, వారికై ప్రత్యేక గ్రంథాలయాలను గాని, గ్రంథాలయాలలో ప్రత్యేక విభాగములనుగాని ఏర్పాటుచేయు ఆవశ్యకత లేదని కొందరి అభిప్రాయము. పురుషులతో బాటు గ్రంథాలయములలో ప్రవేశించుట స్త్రీలకు కొంత యిబ్బంది కరముగా నుండుననీ, కాన వారికి ప్రత్యేక గ్రంథాలయముల నేర్పాటు చేయుట సమంజస

మని పలువురు గ్రంథపాలకు లభిప్రాయపడిరి. రాఘవరెడ్డిగారు గ్రంథాలయముల సందర్శించి ఈ గ్రంథాలయములకు విచ్చేయు మహిళల సంఖ్య మిగుల తక్కువయని, కొన్ని గ్రంథాలయములం దీమహిళా విభాగములు ఖాళీగా యున్నవని, అటువంటి సమయములందు ఈ విభాగాలలో బాల బాలికలకు కూడ ప్రవేశ వసతుల కలుగ జేయ వచ్చునని తెలియబరచిరి. ఉదాహరణకు:- కర్నూలు నందు 21—12—1959 న లోకల్ లైబ్రరీ అథారిటీవారు ఒక మహిళా గ్రంథాలయమును స్థాపించిరి. కాని ఈ గ్రంథాలయమునకు మహిళలు ఎక్కువగా రానందువలన, బాల బాలికలకు కూడ ఈ గ్రంథాలయమున ప్రవేశ వసతు లుండునట్లు రాఘవరెడ్డిగారు ఉత్తర్వుల జారీ చేసిరి. ఆ నాటి నుండి ఈ గ్రంథాలయమునకు మహిళలేగాక బాల బాలికలు గూడ వెళ్ళుచున్నారు. ఇదే విధముగా ఋతర జిల్లాలలో కూడ మహిళ లెక్కువగా రానటువంటి మహిళా గ్రంథాలయాలలో కూడ, బాల బాలికలకు ప్రవేశ వసతులను కలుగజేయుచున్నారు.

3—2—1964 తేదీన రాష్ట్ర మహిళా సమాఖ్య (State council for women) సమావేశమై మహిళలకు ప్రత్యేక గ్రంథాలయముల నేర్పాటు చేయవలెనని సిఫార్సు చేసినది. ఈ సిఫార్సు మేరకు కొన్ని పట్టణముల యందు మహిళలకు ప్రత్యేక గ్రంథాలయములు ప్రారంభింపబడినవి.

## సంచార గ్రంథాలయముల ద్వారా మహిళలకు గ్రంథముల అందుబాటు :

1964-65 సం॥ కడప, కృష్ణా, గుంటూరు, చిత్తూరు మున్నగు జిల్లాలలో స్త్రీలకు యిళ్ళలో పుస్తకముల నిచ్చు పద్ధతిని ప్రవేశ పెట్టుట జరిగినది. ఈ పద్ధతి ప్రకారము గ్రంథపాలకులు ఇంటింటికి వెళ్ళి, మహిళలకు కావలసిన పుస్తకముల నిచ్చి, తిరిగి వాటినుండి

ఆ పుస్తకముల వాపసుతీసికొని, నూతన పుస్తకములను వారి కందించు చుండిరి. ఈ విధానము సత్ఫలితముల నిచ్చినందువలన, యితర కొన్ని జిల్లాలయందు కూడ ఈ పద్ధతిని ప్రవేశపెట్టుట జరిగినది. సైకిళ్ళ ద్వారా పుస్తకములను మహిళల కరువిచ్చు విధానము తొలుత కృష్ణాజిల్లా యందును, సైకిల్ రిక్షా ద్వారా పుస్తకముల నరువిచ్చు విధానము తొలిసారిగా ఖమ్మంజిల్లా యందును ప్రవేశ పెట్టుట జరిగినది. వీలైనపుడు మహిళా మండలులకు కావలసిన పుస్తకములను కూడ, లోకల్ లైబ్రరీ అథారిటీలు పంపిణీ చేయు చుండినవి.

ఈ విధముగా గ్రంథాలయములు మహిళలకుచేయు గ్రంథ సేవ, విద్యా సౌకర్యములు ప్రతి సంవత్సరము వృద్ధిచెందుచున్నవి.

## సంచార గ్రంథాలయముల సేవ :

మదరాసు పౌర గ్రంథాలయ చట్టము, హైదరాబాదు పౌర గ్రంథాలయ చట్టము అమలులోనికి వచ్చిన యనంతరము 5 వేల జనాభాకు తక్కువ కల్గినటువంటి కొన్ని గ్రామములయందు పుస్తక పంపిణీ కేంద్రముల నేర్పాటుచేయుట జరిగినది. జిల్లా కేంద్రగ్రంథా లయముల నుండి, శాఖా గ్రంథాలయముల నుండి పుస్తకపంపిణీ కేంద్రములు గ్రామీణ ప్రజలకుపయోగపడు పుస్తకములను పొంది సైకిళ్ళ ద్వారా గ్రామస్థులకు సరఫరాచేసి, వారాపుస్తకములను చదివిన యనంతరము ఆ పుస్తకములను తిరిగి సైకిళ్ళ ద్వారా పుస్తకముల అరువిచ్చిన గ్రంథాలయములకు చేరవేసి, నూతన పుస్తక ములను తిరిగి గ్రామస్థులకు యథాప్రకారము పంపిణీ చేసెడివారు. కొన్ని గ్రామముల నుండి పట్టణములకు విచ్చేయు బడిపిల్లలు కూడ పట్టణములలోని గ్రంథాలయములకు వెళ్ళి తమయిళ్ళలోని వారికి కావలసిన పుస్తకముల తీసికొనివెళ్ళి వారిగృహస్థులు పఠించిన యనంత

రము తిరిగి తాము సైకొని, వచ్చిన గ్రంథాలయమునకే వానిని వాపసుచేసి నూతన పుస్తకములను తీసికొని వెళ్ళుచుండెడివారు. ఈ విధముగా గ్రంథాలయములు పాఠశాలల పిల్లల ద్వారా కూడ గ్రామస్థులకు సేవ చేయుచుండినవి. ఈ విధానము చిత్తూరు జిల్లా కేంద్ర గ్రంథాలయమునందు 1955 సం॥ నుండియే అమలు నందున్నది. గ్రామములయందు ఇంటింటికి వెళ్ళి మహిళలకు, వృద్ధులకు పుస్తకముల నందజేయవలసిన ఆవసరమెంతేని కలదని, రాఘవరెడ్డి గారు లోకల్ లైబ్రరీ అథారిటీ చైర్మెన్‌లతో, సెక్రటరీలతో వివరించుచుండెడివారు.

## కృష్ణాజిల్లాలో సంచార గ్రంథాలయ సేవ :

కృష్ణాజిల్లా యందు జిల్లా కేంద్రగ్రంథాలయము నుండి సైకిళ్ళ ద్వారా పుస్తక పంపిణీ కేంద్రములకు పుస్తకములను పంపిణీచేయు టయే గాక, ఇంటింటికి వెళ్ళి స్త్రీలకు, వృద్ధులకు, మున్నగువారికి కావలసిన పుస్తకముల నరువిచ్చుచు, వారిని గ్రంథాలయ సభ్యులుగా కూడ చేర్చుకొను చుండిరి. ఈ విధముగా కృష్ణాజిల్లా యందలి గ్రామీణ ప్రాంతములకు గ్రంథాలయసేవ బాగా జరిగినది. ఈ సైకిళ్ళు 250 పుస్తకముల నమర్చుకొని వెళ్ళుట కనువుగా నుండునట్లు ప్రత్యేక ముగా తయారుచేయబడి యుండినవి. శ్రీ కలపాక సూర్యప్రకాశ రావుగారి ప్రశంసనీయమయిన కృషిచే కృష్ణాజిల్లా యందలి గ్రామ ప్రాంతీయులకు ప్రయోజన కరమయిన గ్రంథసేవ జరిగినది. కృష్ణా జిల్లా లోకల్ లైబ్రరీ అథారిటీ కార్యదర్శియైన శ్రీ చంద్రశేఖరరావు, చైర్మెన్ గారైన శ్రీ సూర్యప్రకాశరావుగారికి గ్రామీణ ప్రాంతా లలో గ్రంథాలయాల అభివృద్ధికి మిగుల తోడ్పడిరి. శ్రీ పురుషోత్తం (చిత్తూరు) శ్రీ వెంకటరమణమూర్తి (తూర్పుగోదావరి) శ్రీ వెంకట సుబ్బయ్య (కడప) శ్రీ దామోదరరావు (కరీంనగర్) శ్రీ విఠల్ శాస్త్రి

(కృష్ణా) తదితరులు గ్రామీణ ప్రాంతీయులకు పుస్తకములను పంపిణీ చేయుటకు వారికి తగు పఠన వసతుల కల్పించుటకు గొప్పకృషి సల్పిరి.

## సైకిళ్ళ ద్వారా గ్రంథాలయ సేవ :

కరీంనగర్, కడప, చిత్తూరు, తూర్పుగోదావరి, మున్నగు జిల్లాలయందు కూడ, గ్రామీణ ప్రాంతీయులకు సైకిళ్ళ ద్వారా పుస్తకములను పంపిణీచేసి మహిళలకు, వృద్ధులకు చదువుకొను సౌకర్యములను కలుగజేసిరి. ఖమ్మంలో సైకిల్ రిక్షాయందు పుస్తకముల నమర్చుకొని, ఖమ్మం పట్టణములోని మఱియు గ్రామప్రాంతములలోని మహిళలకు, వృద్ధులకు కావలసిన పుస్తకముల నిచ్చుట జరుగుచుండినది. 1967–68 సం॥ అనంతరము కరీంనగర్, నిజామాబాద్, నల్గొండ మున్నగు జిల్లాలయందు కూడ సైకిళ్ళ ద్వారా పుస్తకముల పంపిణీచేయు విధానము ప్రవేశపెట్టబడినది. ఈ విధానము మహిళలకు, గ్రంథాలయములకు రాజాలని వృద్ధులకు మిగుల ప్రయోజనకరముగా నుండినది.

## గ్రంథాలయాలలో లిఖిత ప్రతుల విభాగము :

ప్రాచీన లిఖిత ప్రతులను భద్రపరచవలసిన యవసరమెంతేని కలదు. ఇవి పురాతన నాగరికతా సంస్కృతుల ప్రతిబింబములు. చారిత్రకాధారములుగా మిగుల ప్రయోజనకరము లయినట్టువంటివి. మన రాష్ట్రమునందలి పెక్కు సహాయక గ్రంథాలయములందు అనేక లిఖిత ప్రతులు గలవు. రాజమండ్రిలో గౌతమీ గ్రంథాలయమందును, అనకాపల్లిలో శారదా గ్రంథాలయమునందును, ధర్మవరంలో ఎడ్వర్డ్ కారొనేషన్ రీడింగ్ రూమ్ మఱియు సరస్వతీ నిలయమునందును, కరీంనగర్, జోగిపేట, వరంగల్లు మున్నగు పట్టణములలోని సహాయక గ్రంథాలయములం దనేక లిఖితప్రతులు గలవు.

హైదరాబాదు నగరములో అనేక పౌర గ్రంథాలయములందు కూడ హిందీ, ఉర్దూ భాషలయం దమూల్యమయిన లిఖితప్రతు లనేకములు గలవు. ఈ విధముగా రాష్ట్రములోని పౌర గ్రంథాలయములందును, సహాయక గ్రంథాలయములందును, తదితర గ్రంథాలయములందును యున్నటువంటి లిఖితప్రతులను రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమునకు చేరవేయవలసిన ఆవశ్యకత గలదు.

## లిఖిత ప్రతులకు రాష్ట్రకేంద్ర గ్రంథాలయములో ప్రత్యేక విభాగము :

రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమున లిఖితప్రతుల విభాగము నేర్పాటు చేయవలెనని రాఘవరెడ్డిగారి ఆకాంక్ష. ఈ లిఖిత ప్రతులు || పరిశోధకులకు మిగుల ప్రయోజనకరమయిన వగుటచే వీటన్నిటిని ఒకచోట చేర్చి, ప్రత్యేక విభాగముగా ఏర్పాటు చేయవలసిన అవవరమెంతేని గలదు. 1953 సం॥ ఆంధ్రరాష్ట్రావతరణానంతరము అవిభక్త మదరాసు రాష్ట్రము నుండి వేరుచేయబడి, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయమునకు తరలించబడిన లిఖితప్రతులను, రాష్ట్ర కేంద్రగ్రంథాలయమునందలి పర్షియన్, అరబిక్, ఉర్దూ భాషలకు చెందిన 17,500 లిఖిత ప్రతులను మఱియు రాష్ట్రములోని వివిధ జిల్లాలయందలి గ్రంథాలయములలోని లిఖితప్రతులను ప్రత్యేకించి, రాష్ట్ర కేంద్రగ్రంథాలయమునం దొక ప్రత్యేక విభాగము నందమర్చు నిమిత్తము ప్రయత్నములు కూడ జరిగినవి. తమ జిల్లాలోని పౌర గ్రంథాలయముల యందలి లిఖితప్రతులను జిల్లా కేంద్ర గ్రంథాలయములకు చేరవేయవలసినదిగా లోకల్ లైబ్రరీ అథారిటీలను కోరగా, కొన్ని లోకల్ లైబ్రరీ అథారిటీలు తమ గ్రంథాలయములలోని లిఖితప్రతులనెల్ల సమీకృత పరచి, జిల్లా కేంద్ర గ్రంథాలయములందుంచినవి.

ఈ లిఖిత ప్రతులను భద్రపరచు విధానములయందు శిక్షణ పొందు నిమిత్తము ఇరువురు గ్రంథపాలకులను 1965 - 66 సం॥న ఢిల్లీలోని ప్రాచీన పత్రి పరిరక్షణ శాఖకు పంపుట కూడ జరిగినది. నాలుగవ పంచవర్ష ప్రణాళికయొక్క డ్రాఫ్టునందు లిఖిత ప్రతుల సూచీలను రూపొందించ వలెనని, ప్రధానమయిన లిఖిత ప్రతులను ముద్రించవలెనని, యిందులకుగాను రూ. 50,000 లను ప్రభుత్వము కేటాయించవలెనని సూచించబడినది.

ఈ లిఖిత ప్రతుల పరిరక్షణ నిమిత్తము ఒక ప్రత్యేక గ్రంథాలయమును స్థాపించవలెనన్న అభిప్రాయము కలవారు కూడ లేక పోలేదు. అయినను యిందులకై ప్రత్యేక గ్రంథాలయము నేర్పాటు చేయ నవసరము లేదని, రాష్ట్రి కేంద్ర గ్రంథాలయము నందే ఒక విభాగముగా నేర్పాటుచేయుటయే సమంజసమని రాఘవరెడ్డిగారితో పాటు పలువురి యభిప్రాయము. రాష్ట్ర గ్రంథాలయ కమిటీ సమావేశముల యందు కూడ ఈ విషయములు చర్చించబడు చుండినవి. 19—7—1963, మఱియు 28—2—1964 తేదులందు జరిగిన రాష్ట్రి గ్రంథాలయ కమిటీ సమావేశములయందు లిఖిత ప్రతులను రాష్ట్రి కేంద్ర గ్రంథాలయమునం దొక విభాగము క్రింద ఏర్పాటు చేయుటయే సమంజసమని తీర్మానించడము జరిగినది. అయినను ప్రభుత్వము లిఖిత ప్రతులకు ప్రత్యేక గ్రంథాలయమును స్థాపించినది.

## అంధులకు గ్రంథాలయ సేవ:

పౌర గ్రంథాలయములందు, ముఖ్యముగా రాష్ట్రి కేంద్ర గ్రంథాలయమునందు, ప్రాంతీయ గ్రంథాలయములందు, జిల్లా కేంద్ర గ్రంథాలయములందు అంధులకు తగు గ్రంథ విభాగముల నేర్పాటు చేసి, అంధులకు తగు సేవావసతుల కలుగజేయవలెనని రాఘవరెడ్డిగారి కోరిక. ఈ విషయము గురించి నాలుగవ పంచవర్ష ప్రణాళిక యందు

ప్రస్తావించుటయేగాక, యిందులకుగాను రూ. 3.5 లక్షల మొత్తమును మంజూరు చేయవలెనని కూడ సూచించుట జరిగినది. అయినప్పటికి ప్రభుత్వ ఆర్థిక యిబ్బందుల వలన, తదితర కారణముల వలన ఈ విభాగముల నేర్పరచుటకు వీలుపడలేదు. రాష్ట్రీ కేంద్ర గ్రంథాలయమునందు ఇదివరకే స్థాపింపబడిన అంధుల విభాగమును వృద్ధి చేయుటకు కూడా వీలు కలుగలేదు.

మూగవారికి, చెవిటివారికి, ప్రయోజనకర మయినటువంటి, కళలకు సంబంధించిన మఱియు వృత్తి పనులకు సంబంధించి నటువంటి పుస్తకములు కూడ, రాష్ట్రములోని కొన్ని గ్రంథాలయములకు మాత్రము కొనుగోలు చేయబడినవి.

## వాణిజ్య, పారిశ్రామికాభివృద్ధికి గ్రంథాలయాల తోడ్పాటు:

పారిశ్రామిక సంస్థల యందు గ్రంథాలయముల స్థాపించి, పరిశ్రమల అభివృద్ధికి సంబంధించి నటువంటి పుస్తకముల నుంచవలెను. విశాఖపట్టణము, హైదరాబాదు మున్నగు పట్టణముల యందలి కొన్ని పరిశ్రమలందు యిదివరకే పారిశ్రామికాభివృద్ధికి సంబంధించిన పుస్తకముల కొద్దిగ నుంచుట జరిగినది. గ్రంథాలయములు లేని పారిశ్రామిక కర్మాగారములందు గ్రంథాలయములను స్థాపించి, అందు ఆ యా పరిశ్రమల అభివృద్ధికి సంబంధించిన పుస్తకములను పాశ్చాత్య దేశములలోవలె ఏర్పాటు చేయవలసిన ఆవశ్యకత ఎంతేని కలదని ఈవిధానము పరిశ్రమల అభివృద్ధికి మిగుల దోహదపడ గలదని రాఘవరెడ్డిగారు గ్రంథపాలకులకు సూచించెడివారు. ఈ విధముగా స్థాపించబడినటువంటి పారిశ్రామిక గ్రంథాలయములకు వాని యందు లేని పుస్తకములను పౌర గ్రంథాలయములనుండి పంపిణీ చేయు వసతుల కలుగజేయవలెనని కూడ రాఘవరెడ్డిగారు గ్రంథపాలకులకు తెలియజేసెడివారు. పారిశ్రామిక కర్మాగారములందు పనిచేయు

వారు కూడ పౌర గ్రంథాలయములకు విచ్చేయు చుందురు. అటు వంటి వారికి కూడ తమ సేవ నందించిన గ్రంథపాలకులు హైదరాబాదు, విశాఖపట్టణము, మున్నగు పట్టణములలో లేక పోలేదు.

బ్యాంకులు – జీవిత భీమా సంస్థలు – మున్నగు వాటి యందు కూడ వాణిజ్యాభివృద్ధికి గ్రంథాలయముల స్థాపించి, పాశ్చాత్య దేశము లందువలె, మనరాష్ట్రము నందు కూడ పాటు పడవలసిన అవసర మెంతైనా గలదు. మన రాష్ట్రము నందలి కొన్ని వాణిజ్య సంస్థల యం దిటువంటి గ్రంథాలయములు కొన్ని యిదివరకే స్థాపించ బడినవి. ఈ గ్రంథాలయములయందు లేని పుస్తకములను పౌర గ్రంథాలయము లీగ్రంథాలయములకు పంపిణీ చేయవలెను. అంతేగాక, పౌర గ్రంథాలయములు వాణిజ్యాభివృద్ధికి సంబంధించిన కొన్ని పుస్తకములను కూడ, కొనుగోలుచేసి వాణిజ్య సంస్థల గ్రంథాలయములకు సందర్భావసరముల బట్టి పంపిణీ చేయవలెను. పౌర గ్రంథాలయములకు విచ్చేయు వాణిజ్య సంస్థల యందు పనిచేయు వారికి కూడ, యిట్టి పుస్తకముల నందించుచు వాణిజ్యాభివృద్ధికి కొంతవరకు కృషిసల్పిన గ్రంథపాలకులు మన రాష్ట్రమునందు హైదరాబాదు, విజయవాడ, కాకినాడ, వరంగల్లు మున్నగు పట్టణములలో కొంద రుండిరి.

## రోగులకు – ఖైదీలకు గ్రంథాలయ సౌకర్యము:

ఆసుపత్రులయందు కూడ గ్రంథాలయములను స్థాపించ వలసిన అవసర మెంతేని గలదు. ఖమ్మంలోని జిల్లా కేంద్ర గ్రంథాలయము, ఆ పట్టణములో ఆసుపత్రియందు రోగులకు మిగుల ప్రయోజన కరముగా నుండినది. ఖమ్మం, ఏలూరు మున్నగు పట్టణములలో రాష్ట్రములోని యితర జిల్లాలయందలి కొన్ని ఆసుపత్రులందు కూడ, రోగులకు ఉల్లాసకర పుస్తకములను కొనుగోలుచేసి వారికి కూడ కొంత గ్రంథసేవ చేసిరి.

రాష్ట్రమునందలి కారాగారములందు కూడ గ్రంథాలయములను స్థాపించి, ఖైదీలకు ప్రయోజనకరమయినటువంటి పుస్తకముల నుంచవలెను. ప్రప్రథమముగా రాజమండ్రి కారాగారమునందొక గ్రంథాలయము ఇటీవల స్థాపించబడినది. ఈ గ్రంథాలయము అచటి కారాగార వాసులకు తగు గ్రంథపఠన వసతుల కలుగజేయుచున్నది.

ఈ విధముగా మన రాష్ట్రములో గ్రంథాలయములు పిల్లలకు, విద్యార్థులకు, పెద్దలకు మాత్రమేగాక వివిధ తరగతులకు చెందిన పౌరుల కెల్లలకు మిగుల ప్రయోజనకరముగా సేవ చేసినవి. సంతృప్తికరముగా గ్రంథ సేవ చేయుటకు గ్రంథాలయములందు తగినన్ని పుస్తకములు లేకపోయినవి. ప్రభుత్వము కూడ గ్రంథాలయములకు తగు గ్రాంట్లను మంజూరు చేయుచూ వచ్చినచో గ్రంథాలయముల యందు కావలసినన్ని పుస్తకముల ప్రవేశపెట్టి వసతుల పెంపొందింప జేసి ప్రశంసనీయమయిన గ్రంథ సేవ చేయుట కవకాశ మేర్పడును.

## లోకల్ లైబ్రరీ అథారిటీలు - పుస్తకముల కొనుగోలు చేయు విధానము :

మదరాసు, హైదరాబాదు పౌరగ్రంథాలయాల చట్టముల ననుసరించి మఱియు ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ చట్టము 1960, ననుసరించి పౌర గ్రంథాలయములకు వార్తాపత్రికలను, పుస్తకములను మున్నగువానిని పంపిణీచేయు బాధ్యత ఆయా గ్రంథాలయములకు సంబంధించిన లోకల్ లైబ్రరీ అథారిటీలది.

1960 సం॥నకు పూర్వము లోకల్ లైబ్రరీ అథారిటీలు గ్రంథాలయములకు కావలసిన పుస్తకములను టెండర్ పద్ధతి ద్వారా కొనుగోలు చేయుచుండినవి. ఈ విధానము సరియైనది కాదని ప్రచురణకర్తల నుండియే నేరుగా పుస్తకముల కొనుగోలు చేయవలెనని

1961 సం॥న ప్రభుత్వము ఉత్తర్వులను జారీచేసినది. ఆనాటి నుండి జిల్లా కేంద్ర గ్రంథాలయాల కార్యదర్శులు, శాఖా గ్రంథాలయాధికారులతో చర్చించి, పాఠకుల అభిప్రాయముల సేకరించి పుస్తకముల జాబితాను తయారుచేసెడివారు. పౌర గ్రంథాలయశాఖ డైరెక్టరు, కళాశాల అధ్యక్షులు, విద్యావంతులు మున్నగువారు సూచించిన పుస్తకముల జాబితాను రూపొందించి లోకల్ లైబ్రరీ అథారిటీలకు పంపుచుండెడివారు. అంతేగాక రాష్ట్ర కేంద్ర గ్రంథాలయము, గుంటూరు ప్రాంతీయ గ్రంథాలయం, ఏలూరు సంచార గ్రంథాలయము కొనుగోలు చేసిన పుస్తకముల జాబితాలను కూడ, డైరెక్టరు లోకల్ లైబ్రరీఅథారిటీలకు పంపుచుండిరి. 1963 సం॥ తెలుగు, ఇంగ్లీషు, ఉర్దూ, హిందీ భాషలలో గొప్ప ప్రతిభావంతులు రూపొందించిన పుస్తకముల జాబితాలను కూడ లోకల్ లైబ్రరీ అథారిటీలకు పంపుట జరిగినది. సాహిత్య అకాడమీ, దక్షిణ భారత దేశ పుస్తక సంస్థ, తదితర పుస్తకప్రచురణ సంస్థలు ప్రయోజనకరమైన పుస్తకములను ప్రచురించు చున్నవి. వీటిలో కొన్ని పుస్తకములు రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వ బహుమతులను కూడ పొందియున్నవి. ఈ విధముగా బహుమతుల నందుకొన్న పుస్తకములను కూడ గ్రంథాలయములందు ప్రవేశపెట్టవలసిన అవసరము కలదని పౌర గ్రంథాలయశాఖ డైరెక్టరు లోకల్ లైబ్రరీ అథారిటీలకు తెలియజేయుచుండిరి. శాఖా గ్రంథాలయముల నిర్వాహకులు వారి గ్రంథాలయములకు విచ్చేయు పాఠకుల అవసరముల, అభిలాషలను గ్రహించి, ఆ ప్రాంత పరిస్థితులకు, ఆ ప్రాంతీయ వృత్తులకు. భాషలకు సంబంధించిన పుస్తకముల జాబితాలను తయారుజేసి, లోకల్ లైబ్రరీ అథారిటీల కార్యదర్శులకు పంపుచుండిరి.

ఈ విధముగా వివిధ విషయములపైన అందిన పుస్తకముల జాబితాలను కార్యదర్శులు పరిశీలించి, గ్రంథాలయముల కవసరమగు పుస్తకముల జాబితాను తయారుచేసి లోకల్ లైబ్రరీ అథారిటీలు

నియమించిన పుస్తక నిర్ణయకమిటీ ముందు ఉంచెడివారు. పుస్తక నిర్ణయకమిటీ యందు గొప్ప విద్యావంతులు, కళాశాలాధ్యాపకులు మున్నగువారు కూడ సభ్యులుగా నుండిరి. వీరు ఈ జాబితాను పరిశీలించి, అవసరమయిన మార్పుల గావించి ఆమోదించెడివారు. ఈ విధముగా ఆమోదింపబడిన జాబితాలోని పుస్తకములను ఆయా లోకల్ లైబ్రరీ అథారిటీలు కొనుగోలు చేసి, తమ పరిధిలోని గ్రంథాలయములకు పంపిణీ చేసెడివారు. ఈ పుస్తకముల జాబితాలో లేని పుస్తకములను కూడ, కొనుగోలు చేయుటకు లోకల్ లైబ్రరీ అథారిటీలకు చట్టప్రకారము అధికారముండెడిది. ఈ విధానము 1968-69 సం॥ వరకు అమలునం దుండినది.

## ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ చట్టమును సవరించుటకు నిర్ణయము:

కొన్ని లోకల్ లైబ్రరీ అథారిటీలు ప్రయోజనకరమైన పుస్తకములను కొనుట లేదని ప్రభుత్వదృష్టికి రాగా, ఈ విషయ పరిశీలన నిమిత్తం ప్రభుత్వమొక కమిటీని నియమించినది. ఈకమిటీకి గౌ॥మంత్రి శ్రీ ఎం. ఆర్. అప్పారావుగారు అధ్యక్షులుగాను, విద్యాశాఖ కార్యదర్శి, శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య, శ్రీ ఎస్. కె. కుమార్ (ఉస్మానియా విశ్వవిద్యాలయము), శ్రీరామశర్మ (ఉస్మానియా విశ్వవిద్యాలయము), మున్నగువారు సభ్యులుగాను నుండిరి. 15—12—1968 తేదీన ఈ కమిటీ సమావేశమయినది. ఈ సమావేశమునందు లోకల్ లైబ్రరీ ఆథారిటీల పుస్తకముల కొనుగోలు విషయమై చర్చించిన యనంతరము, నాలుగు ఉపకమిటీల నేర్పాటుచేయుట జరిగినది. తెలుగు భాషా ఉపకమిటీకి వావిలాల గోపాలకృష్ణయ్యగారు, ఇంగ్లీషు ఉపకమిటీకి ఎస్. కె. కుమార్ గారు, హిందీ ఉపకమిటీకి శ్రీ రామశర్మగారు, ఉర్దూ ఉపకమిటీకి రఫియా సుల్తానాగారు కన్వీనర్లుగా నియమితులైరి. వీరు ఆయా భాషలకు సంబంధించిన పుస్తకముల జాబితాలను

రూపొందించవలెను. ఈ కమిటీ లోకల్ లైబ్రరీ అథారిటీలు ప్రామాణిక పుస్తకములను (Standard Works) కొనుగోలు చేయుట లేదని, ప్రామాణిక పుస్తకముల జాబితాను రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమునందు రూపొందించి, ఆ జాబితాను లోకల్ లైబ్రరీ అథారిటీలకు పంపవలెనని, ఆ జాబితాలోని పుస్తకములనే లోకల్ లైబ్రరీ అథారిటీలు కొనవలెనని తీర్మానించినది. నిపుణులచే రూపొందించ బడిన పుస్తకముల జాబితాను జాబితా 'ఎ' మఱియు జాబితా 'బి' అని రెండు జాబితాలు తయారుచేసి, జాబితా 'ఎ' లోని పుస్తకములను ప్రతి లోకల్ లైబ్రరీ అథారిటీ తప్పని సరిగా కొనుగోలు చేయవలెనని, జాబితా 'బి' లోని పుస్తకములను లోకల్ లైబ్రరీ అథారిటీలు వారి వారి అవసరములను బట్టి కొనుగోలు చేసికొన వచ్చునని కమిటీ తీర్మానించినది. ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ చట్టము సెక్షన్ 13, నందు పుస్తకముల కొనుగోలు విషయమున లోకల్ లైబ్రరీ అథారిటీలకు స్వాతంత్ర్యమున్నందున యీ కమిటీ కన్వీనర్లు సూచించిన పుస్తకముల కొనుగోలు నిమిత్తము గ్రంథాలయ చట్టమును సవరించ వలసిన అవసరము ఏర్పడినది.

## అసెంబ్లీలో ప్రవేశ పెట్టబడిన సవరణపై చర్చలు:

అసెంబ్లీ నందీ చట్టమునకు 1969 సం॥ సవరణ చేయుట జరిగినది. 1969 జనవరి 18 వ తేదీన ఆంధ్రప్రదేశ్ గెజెట్ నందు ఈ సవరణను ప్రకటించుట జరిగినది. ఈ సవరణ ప్రకారము ప్రభుత్వము ఆమోదించిన పుస్తకముల జాబితానుండియే లోకల్ లైబ్రరీ అథారిటీలు పుస్తకములను కొనుగోలు చేయవలెను. మఱియు సెక్షన్ 13, (1) (బి) ప్రకారము రాష్ట్ర గ్రంథాలయ నిధిలోని 25% నకు తక్కువ గాకుండ, ప్రభుత్వము సూచించిన జాబితాయందలి పుస్తకములను లోకల్ లైబ్రరీ అథారిటీలు తప్పక కొనుగోలు చేయవలెను.

## సవరణపై అభ్యంతరము:

అసెంబ్లీ సమావేశమునందు ఈ సవరణకు పలువురు ఆక్షేపణ లను తెలియజేసిరి. కొన్ని లోకల్ లైబ్రరీ అథారిటీలకు కూడ, ఈ సవరణ ఎంత మాత్రము తృప్తినివ్వలేదు. ఇందులకు తగు కారణ ములు కూడ లేక పోలేదు. సాధారణముగా పాఠకుల అభిరుచిని ఆయా గ్రంథాలయ పుస్తక భాండాగారులు బాగుగా గ్రహింప గలరు. ఈ కమిటీ రూపొందించిన పుస్తకముల జాబితాను ప్రభుత్వ మునకు బంపి, ప్రభుత్వము ఆమోదించిన యనంతరము ఆ పుస్తకముల కొనుగోలు ఆలస్యముతో కూడిన కార్యము. అంతేగాక ఈ కమిటీ పుస్తకముల జాబితాను సంవత్సరమున కొకటి, రెండు మార్లు సమా వేశమై రూపొందించిన సరిపోదు. ప్రచురింపబడుచున్న పుస్తకము లను దృష్టి యందుంచుకొని, సంవత్సర ప్రారంభమునుండి పుస్తకము లను కొనుగోలు చేయవలసి యుండును. కాన ఈ విధముగా పుస్త కముల జాబితాలను రూపొందించుటకు కమిటీలకు వీలుపడదని గ్రంథ పాలకులు, యితరులు అభిప్రాయపడిరి.

ప్రభుత్వ మీ విషయములను పరిశీలించి, రాష్ట్ర స్థాయిలో పుస్తకముల జాబితా తుది రూపము దాల్చుట వలన కలుగు ప్రయో జనములను కూడ, లోకల్ లైబ్రరీ అథారిటీలకు విశద పరచినది. రాష్ట్ర పుస్తక నిర్ణయ కమిటీ రూపొందించిన పుస్తకముల జాబి తాలో తమ కవసరమయిన పుస్తకములు లేవని లోకల్ లైబ్రరీ అథారిటీలు గుర్తించినచో, అటువంటి పుస్తకములను గురించి రాష్ట్ర కమిటీలకు తెలియ జేసినచో ఆ పుస్తకములను కూడ రాష్ట్ర స్థాయిలో తయారుచేయు పుస్తకముల జాబితాయందు చేర్చుట జరుగునని కూడ ప్రభుత్వము స్పష్ట పరచినది.

## కొనుగోలునకై ప్రామాణిక గ్రంథముల జాబితాను తయారు చేయుటలో జరిగిన ఆలస్యము:

డిసెంబర్ 1969 లో (Standard Works) ప్రామాణికమైన పుస్తకముల జాబితాను రూపొందించు నిమిత్తము ఒక కమిటీని ఏర్పాటు చేయుట జరిగినది. ఈ కమిటీకి గ్రంథాలయ శాఖ మంత్రి గారు అధ్యక్షులుగాను, విద్యాశాఖ కార్యదర్శి, పౌర గ్రంథాలయ డైరెక్టరు, కొందఱు గ్రంథపాలకులు మున్నగువారు సభ్యులు గాను యుందురు. తెలుంగు – ఇంగ్లీషు – ఉర్దూ–హిందీ మున్నగు భాషల యందు వివిధ విషయములకు సంబంధించిన పుస్తకముల జాబితాలను రూపొందించుటకుగాను ఉపకమిటీలు ఏర్పాటయినవి. 1969 – 70; 1970–71 సం॥ లలో పుస్తకముల జాబితాలు సకాలమున వెలువడక పోవుటచే, ఇవి వెలువడిన నాటికి ప్రచురణకర్తల చెంతగల జాబితా లోని పుస్తకములు కొన్ని అమ్ముడై యుండినవి. ఈ జాబితాలోని పుస్తకములలో కొన్ని లోకల్ లైబ్రరీ అథారిటీల ఆధీనములో నుండిన గ్రంథాలయములం దిదివరకే యుండుటచే, ఆ గ్రంథాలయ ములకు ఈ పుస్తకముల కొనవలసిన ప్రమేయము లేకపోయినది.

ఈ కమిటీయందు గ్రంథాలయాలను గురించి అవగాహన కలిగిన, పాఠకుల కవసరమగు పుస్తకముల గుర్తించ గల్గిన నేర్పుగల వారు మరికొందరు సభ్యులుగా నుండి, తగు విధమయిన పుస్తకముల జాబితాను సకాలమున రూపొందించవలసిన ఆవశ్యకత ఎంతేని గలదు. ఈ కమిటీయందు ప్రస్తుతమున్న సభ్యులే గాక ఉన్నతపాఠశాలలకు, ప్రాథమిక పాఠశాలలకు చెందిన ఉపాధ్యాయులు కూడ, ఒకరిద్దరు సభ్యులుగా నుండిన ప్రయోజనకరముగా నుండును. ఉప కమిటీ సభ్యులు తరచుగా వారమున కొకపర్యాయమైనను లోకల్ లైబ్రరీ అథారిటీలకు పుస్తకముల జాబితాను రూపొందించి డైరెక్టరుగారికి

పంపవలసిన అవసరమున్నది.

## పుస్తకముల రిజిష్ట్రారు (Registrar cf Books)

ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ చట్టము 8 (9) ప్రకారము రాష్ట్రమునందు ప్రచురించబడు పుస్తకముల జాబితాను (Bibliography) తయారుచేయు బాధ్యత, ఆ జాబితాలను రాష్ట్రము నందలి గ్రంథాలయములకు పంపు బాధ్యత పౌర గ్రంథాలయశాఖ డైరెక్టరుగారిది. డైరెక్టరు పుస్తకముల జాబితాలను రూపొందించ వలెనన్నచో పుస్తకముల రిజిష్ట్రారు పౌర గ్రంథాలయశాఖ డైరెక్టరు ఆధీనమున నుండుట సమంజసము. రాష్ట్రమునందలి ముద్రణాలయములు, ప్రచురణకర్తలు, తాము ప్రచురించెడు పుస్తకములను ప్రభుత్వ సూచనమేరకు పుస్తకముల రిజిష్ట్రారునకు పంపవలెను. ఉస్మానియా విశ్వవిద్యాలయమునకు చెందిన డా॥ రామరాజుగారు ఈ విషయములను గురించి 10—7—1963 న జరిగిన రాష్ట్ర కేంద్ర గ్రంథాలయ సమావేశమునందు చక్కగా విశదీకరించిరి. రాష్ట్ర గ్రంథాలయ కమిటీయందలి యితర సభ్యులు కూడ ఇందులకు సమ్మతించిరి. ఇందులకు సంబంధించిన తీర్మానములను 1965 సంవత్సరము సెప్టెంబర్ మాసమున ప్రభుత్వమునకు పంపగా, దీని నామోదించుటలో ప్రభుత్వము కొంత జాప్యము చేసినది. 27—3—1973 తేదీన పౌరగ్రంథాలయ డైరెక్టరు పుస్తకముల రిజిష్ట్రారుగా వ్యవహరించునట్లు ఉత్తర్వులు జారీ చేయుబడినవి. ఈ ఉత్తర్వుల ప్రకారము పౌర గ్రంథాలయశాఖ డైరెక్టరు, ప్రచురించబడు పుస్తకముల జాబితాలను తయారు చేయుటకును. గ్రంథాలయములకు పుస్తకములను సులభముగా ఎన్నుకొనుటకు, పుస్తకసూచీల రూపకల్పనకు మున్నగు వాటికి యీ జాబితా మిగుల ప్రయోజనకరముగా నుండును.

The Press and Registration of Books Act 1867 ప్రకారము, ప్రచురణ కర్తలు తాము విడుదల చేయు పుస్తకములను

సక్రమముగా పంపుటలేదు. ఇందులకై తగు చర్య గైకొనవలసి యున్నది. Delivery of Books and News Papes Act 1954 ను పాటించని ప్రచురణ కర్తలపై కూడ ప్రభుత్వము చర్యలు తీసికొన వలసి యున్నది.

పై తెలిపిన చట్టములను ప్రచురణ కర్తలు పాటింప కుండినచో వారి పుస్తకములను, పౌర గ్రంథాలయశాఖ డైరెక్టరు అనుమతి లేనిదే ఏ గ్రంథాలయము కొనుగోలు చేయరాదని గ్రంథపాలకుల అభిప్రాయము;

## పుస్తకముల నిల్వ తనిఖీ (STOCK VERIFICATION)

మదరాసు పౌర గ్రంథాలయ చట్టము 1948 ప్రకారము స్థాపించబడిన గ్రంథాలయములలో తెరువబడిన బీరువాల యందు పుస్తకముల నమర్చు విధానము సూచించబడి యుండలేదు. శిక్షణ పొందిన గ్రంథపాలకు లుండిన కొన్ని గ్రంథాలయాలలో మాత్రము 1952 - 53 వఱకు ఈ విధానము అమలునం దుండినది. కొన్ని గ్రంథాలయాలలో పుస్తకముల నిల్వగది (Stack Room) లోనికి కొద్ది మంది పాఠకులకు మాత్రము ప్రవేశము కల్గించబడి యుండినది. పుస్తకములు ధారవోయినచో ఆ పుస్తకముల మూల్యమును గ్రంథ పాలకుడు చెల్లించవలెనని నియమముండుటచే పలు గ్రంథాలయము లందు తెరువబడిన బీరువాలయందు పుస్తకముల నమర్చు విధానము ప్రవేశ పెట్టబడలేదు. చాల గ్రంథాలయాలలో పాఠకులు కోరిన పుస్తకములను పుస్తక భాండాగారులే స్వయముగా అందించేవారు. ఈ విధానము ద్వారా పాఠకులే స్వయముగా (పుస్తకములను పరిశీలించు అవకాశము లేకపోయినందున) పుస్తక విభాగమునందు ఏయే పుస్తకములు కలవన్న విషయమును తెలిసికొనుటకు కూడ వీలు లేకపోయినది.

రాఘవరెడ్డిగారు 1953 సంవత్సరంలో 'ప్రత్యేకాధికారి'గా పదవీ బాధ్యతల చేపట్టిన యనంతరము తెరువబడిన బీరువాలయందు పుస్తకముల నమర్చు విధానమును గురించి లోకల్ లైబ్రరీ అథారిటీ సభ్యులకు విశదముచేసి, క్షణపొందని గ్రంథపాలకులకుకూడ ఈ విధానము ద్వారా కలుగు ప్రయోజనములను గురించి వివరించి స్వల్పకాలముననే లోకల్ లైబ్రరీ అథారిటీ యాజమాన్యమున నుండిన గ్రంథాలయములందును యీ విధానమును ప్రవేశపెట్టిరి. ఈ విధానము ద్వారా పుస్తకములు ధారపోవుట కాస్కారము గలదు. అయినను యీ పద్ధతి పాఠకులకు మిగుల ప్రయోజన కరముగా నుండును. రాఘవరెడ్డిగారు ప్రతి సంవత్సరము గ్రంథాలయముల యందలి పుస్తకముల నిల్వ వివరముల సేకరించ వలెనని ఏప్రెల్, 1955 సం॥న ఉత్తర్వులను జారీచేసిరి. ఈ ఉత్తర్వుల ప్రకారము శాఖా గ్రంథాలయాధికారి సహాయక గ్రంథాలయాలలోని పుస్తకముల నిల్వ వివరములను పరిశీలించవలెను. జిల్లా కేంద్ర గ్రంథాలయాధికారి శాఖా గ్రంథాలయముల యందలి పుస్తకముల నిల్వ వివరములను తనిఖీ చేయవలెను. కొంత కాలమునకు ప్రభుత్వ ప్రాంతీయ గ్రంథాలయములయందును, జిల్లా కేంద్ర గ్రంథాలయముల యందు గూడ పుస్తకముల నిల్వ వివరముల పరిశీలనకుగాను ఆడిటర్లను యిరువురిని నియమించుట జరిగినది.

గ్రంథాలయములందు ధారపోవుచున్న పుస్తకముల ఖరీదును ఆయా గ్రంథాలయాల పుస్తక భాండాగారులనుండి వసూలు చేయవలెనని కొన్ని లోకల్ లైబ్రరీ అథారిటీలు అభిప్రాయపడి యుండుటచే, ఆ విధముగా వసూలు చేయుటకూడ జరిగినది. ఈ విధానము సమంజసముకాదని గ్రంథాలయములందు పాఠకుల ప్రవేశ నిష్క్రమణములకు ఒకేద్వారము నేర్పాటుచేసి, గ్రంథాలయాలలోని కిటికీలకు ఇనుపచట్రములను బిగించవలెనని, ఈ విధముగా చేసినచో

పుస్తకములు ధారపోవుట కెక్కువ అవకాశముండదని; అట్లు ధార పోయినచో విచారణానంతరము పుస్తక భాండాగారియే బాధ్యుడని నిరూపింపబడినచో, అతని నుండి పుస్తకముల ఖరీదును వసూలు చేయవలెనని రాఘవరెడ్డిగారు వివరించిరి. తెరువబడిన బీరువాలయందు పుస్తకముల నమర్చెడు విధానమువలన పుస్తకములు ధారపోవుట సర్వసాధారణ విషయము. ఈ విధానము పాఠకులకు మిగుల ప్రయోజన కరమయినది. విదేశములందుకూడ ఈ విధాన మనుసరించబడుచున్నది. మన దేశముకన్న విదేశములయందు కొన్ని గ్రంథాలయములలో ఎక్కువగా పుస్తకములు ధారబోవుచున్నను, పాఠకుల ప్రయోజనములను దృష్టియందుంచుకొని ఈ విధానమునే అనుసరించుట జరుగుచున్నది అంతేగాక ధారబోయిన పుస్తకములకు పుస్తకభాండాగారియే కారకుడా యని విచారించి, అతనే కారకుడని నిరూపింపబడినచో వాటి ఖరీదును అతని నుండి వసూలుచేయుట జరుగుచున్నది. మన గ్రంథాలయములందు గూడ ఈ పద్ధతి అనుసరించవలసిన ఆవశ్యకత ఎంతేని గలదు. 5—5—1967 తేదీన జరిగిన రాష్ట్ర కేంద్ర గ్రంథాలయ చర్చా సమావేశములలోగూడ రాఘవరెడ్డిగారీ విధానము యొక్క ప్రయోజనముల గురించి వివరించిరి. సాధారణముగా మన దేశమునందలి గ్రంథాలయములలో, ఇండ్లకు అరువివ్వబడిన వేయి పుస్తకములలో రెండు పుస్తకములు ధారబోయినయెడల దానిని గణనలోనికి గైకొనరు. 1969 సం॥ మార్చి మాసమున ఇందులకు సంబంధించిన ఉత్తర్వులనుకూడ ప్రభుత్వము జారీ చేసినది.

అమూల్యమైన అనగా ఎక్కువ వెల కల్గిన పుస్తకములను ప్రత్యేక బీరువాలయందమర్చుట వాటిని పుస్తక భాండాగారియొక్క అనుమతిని పొందిన పాఠకులకు మాత్రము అరువిచ్చుట కొన్ని గ్రంథాలయాలలో జరుగుచున్నది. ఇటువంటి గ్రంథాలయములందు తస్కరింపబడు పుస్తకముల సంఖ్యకూడ మిగుల పరిమితము.

గ్రంథాలయాలలోని ఉద్యోగులు కూడ తగు జాగ్రత్తతో నుండినచో పుస్తకములు తస్కరింపబడుటకు వీలులేకుండును. ఉదా: రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమునందు పనిచేయు శ్రీ ఖాజిం హుస్సేన్ మిగుల జాగురూకతతో మెలగి పుస్తకముల తస్కరించువారిని పట్టుకొనుచుండెడివారు. అదేప్రకారము కడపజిల్లా కేంద్రగ్రంథాలయము



హైదరాబాదు రాష్ట్రకేంద్ర గ్రంథాలయములో బంట్రోతుగా పనిచేస్తూ గ్రంథాలయము నుండి గ్రంథములను దొంగిలించు పాఠకులను జాగరూకతతో పట్టుకొన్నటువంటి శ్రీ ఖాజిం హుస్సేన్.

నందు పనిచేయు శ్రీ గురవయ్య కూడ పుస్తకముల దొంగలను కొందరిని పట్టుకొన్నాడు. ఈ విధముగా మెలకువతో వ్యవహరించు వారు గ్రంథాలయములందుండిన, పుస్తక తస్కారముకూడ తగ్గును. తస్కరింపబడు పుస్తకముల రిజిష్టరును తయారుచేయవలెను. తప్పిపోయిన పుస్తకములు తదనంతరము దొరకినచో పై రిజిష్టరు నుండి ఆ పుస్తకములను తొలగించవలెను.

గ్రంథాలయములందు పాఠకులు సర్వసాధారణముగా పఠించెడు పుస్తకములు కొలది సంవత్సరము యనంతరం జీర్ణావస్థలో కన్పించును. ఇటువంటి పుస్తకములను పుస్తకముల నిల్వ నుండి వేరుచేసి వేలము

వేయుట లోకల్ లైబ్రరీ అథారిటీల ఆచారము. ఈ విధముగా కొలది భాగము జీర్ణించిన లేదా జీర్ణావస్థలోనున్న పుస్తకములందు రకమున కొకదానిని అనగా సాధ్యమయినంతవరకు మెరుగుగా నున్న ప్రతిని ఒక ప్రత్యేక భవనములో జాగ్రత్తగా యుంచవలెను. లేనిచో రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమునకు పంపవలెనని, అటువంటి పుస్తకములను రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమున తగిన స్థలమున్నచో ఒక ప్రత్యేక గది యందమర్చవలెనని, యివి పరిశోధక విద్యార్థులకు మిగుల ప్రయోజన దాయకముగా నుండగలవని రాఘవరెడ్డిగారు స్పష్ట పఱచెడివారు. ఇదే అభిప్రాయమును గ్రంథాలయముల సమావేశ ములయందుకూడ గ్రంథపాలకులకు పలుమార్లు సూచించియున్నారు. ఇందు నిమిత్తము ప్రయత్నములుకూడ సాగుచున్నవి.

గ్రంథాలయములు పాఠకులకు గ్రంథసేవ నుచితముగా చేయ వలెనని గ్రంథపాలకుల అభిప్రాయము. పాఠకుల నుండి సభ్యత్వ రుసుమును వసూలు చేయరాదని వీరి మతము. పుస్తకములు తస్క రింపబడవన్న నమ్మకము కల్గినపుడు గ్రంథపాలకులు ధరావత్తు చెల్లించక పోయినను ఉచిత గ్రంథ సేవను పూనుకొనుట సమంజసము.

## 1960 పౌరగ్రంథాలయ చట్టము-గ్రంథాలయ సెస్సు వసూళ్ళు:

1960 ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ చట్టము ప్రకారము గ్రంథాలయ సెస్సును రూపాయకు నాలుగు నయాపైసల వంతున వసూలు చేయవలెను.

ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ చట్టము ప్రకారము వసూ లయిన సెస్సునకు సమానముగా రాష్ట్ర ప్రభుత్వము మంజూరు చేయు గ్రాంట్లు, రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వములు మంజూరు చేయు ప్రత్యేక గ్రాంట్లు, విరాళములు, సభ్యుల నుండి వసూలు చేయు

సుంకము, మఱియు పాతబడిన పుస్తకములను, వార్తాపత్రికలను అమ్మగా వచ్చిన మొత్తము గ్రంథాలయాల ఆదాయము. దీనిని లోకల్ లైబ్రరీ అథారిటీ నిధి యందురు.

1960 సం॥ పౌర గ్రంథాలయ చట్టము అమలులోనికి వచ్చిన యనంతరము గ్రంథాలయసెస్సు కొంత మెరుగుపడినది. అయినప్పటికి కొన్ని పంచాయతీలు వసూలయిన సెస్సును లోకల్ లైబ్రరీ అథారిటీల నిధికి చేర్చక తమ స్వప్రయోజనముల కుపయోగించుకొన్నవి. అదేప్రకారము కొన్ని పురపాలక సంస్థలు కూడ వసూలయిన గ్రంథాలయ సెస్సును గ్రంథాలయ నిధికి చెల్లించక తమ పురపాలక సంస్థల అభివృద్ధి కుపయోగించుకొన్నవి. కొన్ని పురపాలక సంస్థలు ఇంటిపన్ను తోటి వసూలుచేయు గ్రంథాలయ సెస్సులో కొంత భాగమును తమకు కేటాయించవలెనని కోరుచుండినవి. పురపాలక సంస్థలు వసూలుచేయు గ్రంథాలయ సెస్సులో 10% ను పురపాలక సంస్థలకు చెందులాగున చేయవలెనని Andhra Chamber of Municipal Chairmen ప్రభుత్వమును కోరిరి. కాని ప్రభుత్వ మందుల కంగీకరించ లేదు. పంచాయతీలు కూడ గ్రంథాలయ సెస్సును సక్రమముగా వసూలు చేయలేకుండినవి. అంతేగాక తమ ప్రాంతమునకు చెందిన గ్రంథాలయముల అభివృద్ధికే తాము వసూలుచేయు గ్రంథాలయ సెస్సును వినియోగించ వలెనని కూడ కోరుచుండినవి.

సెస్సు సక్రమముగా వసూలు కానందున పంచాయతీల గణన వివరముల తనిఖీచేయు ఆడిటర్సుకు, ప్రతి పంచాయతీ ఎంతెంత మొత్తమును గ్రంథాలయ నిధికి చెల్లించ వలెనన్న ఉత్తర్వుల జారీ చేయవలెనని ప్రభుత్వము తెలియ జేసినది. ఈ ప్రకారము ఫిబ్రవరి 1964 న ఉత్తర్వులు జారీచేయబడినవి. సెస్సు వసూలు మెరుగైనది.

## గ్రంథాలయ సెస్సు సక్రమంగా వసూలగు విధానమును పరిశీలించుటకు కమిటీ ఏర్పాటు

గ్రంథాలయ సెస్సు వసూలునందు కలుగుచున్న సమస్యల నివారణకు తగు సలహాల సూచించుటకుగాను ఒక కమిటీ నియమింపబడినది. ఈ కమిటీకి రాఘవరెడ్డిగారు చైర్మెన్‌గాను, శ్రీ కె. రమణమూర్తి, శ్రీ కె. రామారావు, సభ్యులుగాను నుండిరి. ఈ కమిటీ 7—5—1964 సం॥న సమావేశమై కొన్ని సిఫార్సుల చేసినది. వాటిలో యీ క్రిందివి ప్రధానమైనవి.

1. గ్రంథాలయ సెస్సును నాలుగు పైసలనుండి ఆరుపైసలకు పెంచవలెను.

2. వసూలగు గ్రంథాలయ సెస్సునకు సమముగా గాక రెండింతలుగా ప్రభుత్వము గ్రాంట్లను మంజూరు చేయవలెను.

3. తెలంగాణ ప్రాంతమునందు గ్రంథాలయములు వెనుకబడియున్నందునను అచటి ప్రతి లోకల్ లైబ్రరీ అథారిటీకి ఆంధ్ర ప్రదేశ్ గ్రంథాలయ చట్టము 1960 సెక్షన్ 21 (3) క్రింద రూ. 50,000 లకు తక్కువగాకుండ మంజూరు చేయవలెను.

ప్రభుత్వ మీ సూచనలను పరిశీలించి పంచాయతీలకు సెస్సు వసూలు విషయమై కఠినమైన ఉత్తర్వుల జారీ చేయుటయేగాక, పురపాలక సంస్థలకుగూడ గ్రంథాలయ సెస్సు వసూలుకు సంబంధించిన ఉత్తర్వులను జారీచేసినది. పురపాలక సంస్థలు తాము వసూలు చేయు గ్రంథాలయ సెస్సునందు 75% ను ఆయా సంవత్సరము లోకల్ లైబ్రరీ అథారిటీలకు చెల్లించవలెనని, మిగిలిన 25% ను మరుసటి సంవత్సరము గణన వివరముల తనిఖీ అనంతరము చెల్లించవలెనని జూలై 1965 న సూచించినది. ఆ సం॥నుండి ప్రభుత్వము ముఖ్యముగా తెలంగాణ ప్రాంతములోని లోకల్ లైబ్రరీ అథారిటీలకు ప్రత్యేక గ్రాంట్లను కూడ మంజూరు చేయుచూ వచ్చినది.

## భూమి శిస్తుపై గ్రంథాలయ పన్ను వసూలు చేయుటకు సూచన:

1962-63 సం॥ లోకల్ లైబ్రరీ అథారిటీల చైర్మెన్‌లు సమావేశమై భూమి శిస్తుమీద గ్రంథాలయ సెస్సును వసూలు చేయవలెనని సూచించిరి. కాని ప్రభుత్వ మీ సూచన నంగీకరించలేదు. మైసూరు రాష్ట్ర పౌర గ్రంథాలయ చట్టము 1965 నం దీ సూచన చేయబడినది.

## లోకల్ లైబ్రరీ అథారిటీ నిధుల నభివృద్ధి పరచుటకు రాష్ట్ర గ్రంథాలయ కమిటీ సూచనలు:

రాష్ట్ర గ్రంథాలయ కమిటీ సమావేశములందు తరచుగా సెస్సు వసూలును గురించి చర్చలు జరుగుచుండినవి. 29—12—1965 న సమావేశమయిన రాష్ట్ర గ్రంథాలయ కమిటీ సమావేశమున కమిటీ సభ్యుడయిన శ్రీ హీరాలాల్ మోరియాగారు రూ. 50,000 కు లోపున సెస్సు వసూలు చేయు లోకల్ లైబ్రరీ అథారిటీలకు మూడు రెట్లు, రూ. 50,000 కు పైబడి లక్ష రూ.లకు లోపున వసూలు చేయు లోకల్ లైబ్రరీ అథారిటీలకు రెండు రెట్లు ప్రభుత్వము మంజూరు చేయవలెనని సూచించిరి. ఈ సూచనలకు కమిటీ సభ్యులెల్లరు ఏక గ్రీవముగా ఆమోదించిరి. 1965 సం॥ తరువాత జరిగిన రాష్ట్ర గ్రంథాలయ కమిటీ సమావేశములయందు కూడ గ్రంథాలయాల అభివృద్ధికి. లోకల్ లైబ్రరీ అథారిటీలకు తగినంత గ్రాంట్లు మంజూరు చేయుచుండవలెనని ప్రభుత్వమునకు సూచన లిచ్చిరి. 10—7—1968 న జరిగిన రాష్ట్ర గ్రంథాలయ కమిటీ సమావేశమున శ్రీ బి. సుబ్బారెడ్డిగారు గ్రంథాలయ సెస్సును నాలుగు పైసలనుండి ఆరు పైసలకు పెంచవలసిన యవసర మెంతేని కలదని వివరించిరి. 27—10—1969 న ఏర్పాటయిన రాష్ట్ర గ్రంథాలయ కమిటీ సమావేశమునందు లక్ష రూపాయలకు తక్కువ గాకుండ ప్రతి వెనుకబడిన లోకల్ లైబ్రరీ అథారిటీకి గ్రాంట్లను

మంజూరు చేయవలెనని కమిటీ సూచించినది. 12—12—1970 న జరిగిన రాష్ట్ర గ్రంథాలయ కమిటీ సమావేశమున, పురపాలక సంస్థలు వసూలుచేయు వినోదపు పన్నునుండి 10% లోకల్ లైబ్రరీ అథారిటీలకు చెల్లించవలెనని సూచించడమైనది.

ఈ విధముగా రాష్ట్ర గ్రంథాలయ కమిటీ సూచించిన సూచనలను ప్రభుత్వము పరిశీలించి, గ్రంథాలయ సెస్సు వసూలుకు, తీసికొనవలసిన చర్యలను గురించి జిల్లా కలెక్టర్లకు తెలియజేసి వారి ద్వారా పురపాలక సంస్థలకు, పంచాయతీలకు ఉత్తర్వుల జారీ చేయించినది. లోకల్ లైబ్రరీ అథారిటీల చైర్మెన్‌లు, సభ్యులు, కార్యదర్శులు మున్నగు వారు కూడ పురపాలక సంస్థల అధికారులను, తనిఖీ అధికారులను కలసికొని గ్రంథాలయ సెస్సు గురించి తరచు చర్చించుచుండిరి. రాఘవరెడ్డిగారు పురపాలక సంస్థల కమీషనర్లను, పంచాయతీ అధికారులను కలసికొని సెస్సు వసూలుయొక్క ఆవశ్యకతను గురించి వివరించుచుండిరి.

ఈ విధమయిన కృషిచేత 1960 సం॥ నుండి గ్రంథాలయ సెస్సు వసూలు కొంత మెఱుగు పడినది. ఉదాహరణకు, 1960 - 61 సం॥ లోకల్ లైబ్రరీ అథారిటీలకు ముట్టిన సెస్సు, సెస్సునకు సమానముగ ప్రభుత్వము మంజూరు చేసిన గ్రాంట్లు కలసి రూ. 13, 28, 900/- కాగా ఆ మొత్తము మరు సంవత్సరమున రూ. 35,26,100/- కు పెరిగినది.

## కేంద్ర ప్రభుత్వము గ్రంథాలయాభివృద్ధికై ఆర్థిక సహాయము చేయుటకు సూచన:

రాష్ట్రము విధించు పన్నులకన్న కేంద్రము విధించు పన్నులధికము. కాన కేంద్ర ప్రభుత్వము పన్నుల ద్వారా వచ్చు ఆదాయమున కొంత భాగమును రాష్ట్ర ప్రభుత్వములకు చెల్లించినచో ఆ

పైకముతో గ్రంథాలయములకు కావలసిన ఫర్నిచర్‌ను కొనుగోలు చేసికొనవచ్చును. మఱియు భవన నిర్మాణములకు పూనుకొనవచ్చును.

ప్రస్తుత మీ యవకాశము లేనందున రాష్ట్ర ప్రభుత్వము గ్రంథాలయములకు కావలసిన ఫర్నిచర్‌ను, పుస్తకములను కూడ కొనుటకు ఆర్థికమైన యిబ్బందుల వలన వీలులేక పోవుచున్నది. అట్లుగాక ఒక కేంద్ర గ్రంథాలయ చట్టమును అమలులోనికి తెచ్చి, తద్వారా రాష్ట్ర ప్రభుత్వములకు కొంత మొత్తమును మంజూరు చేయుచూ వచ్చిన గ్రంథాలయములందు పాఠకులకు తగు వసతులను కల్పించుటకు వీలేర్పడును.

పౌర గ్రంథాలయ చట్టము ననుసరించి పౌరుల కుచిత గ్రంథ సేవ కల్పించు బాధ్యత రాష్ట్ర ప్రభుత్వమున కుండుటవలన రాష్ట్ర ప్రభుత్వము సెస్సు వసూలు సక్రమము జరుగునట్లు చేసి, కేంద్ర ప్రభుత్వమునుండి తగినంతగా గ్రాంట్లను పొంది, జిల్లా గ్రంథాలయ సంస్థలకు ఆర్థిక సహాయము చేయుచు, ప్రతి పౌరునికి గ్రంథాలయాలలో తగు వసతుల కలుగచేసి ఉచితగ్రంథసేవ చేయవలెను.

## లోకల్ లైబ్రరీ అథారిటీ నిధుల అభివృద్ధికి ఇతర సంస్థల సహాయ సహకారములకై సూచనలు:

పౌర గ్రంథాలయములు విద్యార్థులకు గూడ మిగుల ప్రయోజనకరముగా నున్నందున విద్యాశాఖ తన బడ్జట్టు నుండి 6% ను పౌర గ్రంథాలయాలకు కేటాయించ వలసిన అవసర మెంతేని గలదు. విశ్వవిద్యాలయాల గ్రాంట్ల కమీషన్ విశ్వవిద్యాలయములకు కేటాయించు బడ్జట్టు నందు 6% ను ఆయా విశ్వవిద్యాలయములు తమ గ్రంథాలయముల అభివృద్ధికి కేటాయించుచుండుట మిగుల సమంజసమయిన విషయము. 1975 సం॥న నాలుగు నయాపైసల నుండి ఆరు

నయాపైసలకు పెంచిన గ్రంథాలయ సెస్సును, ఆరు పైసల నుండి ఎనిమిది పైసలకు పెంచిన మిగుల ప్రయోజనకరముగా నుండగలదని గ్రంథపాలకులలో కొందరి యభిప్రాయము; వినోదపు పన్ను, అమ్మకపు పన్ను మొదలగు వానినుండి గూడ కొంత భాగమును గ్రంథాలయ నిధికి చేర్చవలెనని మఱికొందరి అభిప్రాయము. పురపాలక సంస్థలు, పంచాయతీలు వెనుకబడిన జిల్లా గ్రంథాలయ సంస్థలకు తగు సహాయ సహకారముల నందించి గ్రంథాలయముల అభివృద్ధికి తోడ్పడ వలసిన యవసరము గూడ ఎంతేని గలదు. జిల్లా పరిషత్తులు, పంచాయతీలు, పురపాలక సంస్థలు తమ నిధుల నుండి గ్రంథాలయాభివృద్ధికి కొంత మొత్తమును కేటాయించవలసిన ఆవశ్యకత కూడ ఎంతేని గలదు. ఉదా॥ భోజ్ రెడ్డిగారు హైదరాబాదు జిల్లా పరిషత్ చైర్మన్‌గా నున్నపుడు గ్రంథాలయాల అభివృద్ధి నిమిత్తము హైదరాబాదు జిల్లా లోకల్ లైబ్రరీ అథారిటీకి ఎంతో సహకారము నందించిరి.

## లోకల్ లైబ్రరీ అథారిటీల జమా ఖర్చుల పరిశీలనకై ఆడిటర్ల నియామకము:

1948 మదరాసు పౌర గ్రంథాలయ చట్టము అమలులోనికి వచ్చిన తరువాత లోకల్ లైబ్రరీ అథారిటీల యాజమాన్యములోని గ్రంథాలయముల గణాంక వివరములను (L. F. Accounts) వారు తనిఖీ (Audit) చేయుచున్నారు. రాష్ట్ర కేంద్ర గ్రంథాలయ, ప్రాంతీయ గ్రంథాలయముల, జిల్లా కేంద్ర గ్రంథాలయాల గణాంక వివరములను సందర్భావసరములను బట్టి తనిఖీ చేయు నిమిత్తము గొప్ప యనుభవము గడించిన ఆడిటర్‌ల నిరువురును ప్రభుత్వము 1963–64 సం॥ నియమించినది. ఈ నియామకము మిగుల సమంజసనీయము.

1960 – 69 సంవత్సరముల మధ్యకాలమున గ్రంథాలయాల అభివృద్ధికి తగిన నిధులు లేనప్పటికి గ్రంథాలయాలు అభివృద్ధి చెంది

నవని చెప్పక తప్పదు. గ్రంథాలయాల అభివృద్ధికి బాధ్యతను తీసి కొనిన వారి ఉత్సాహమే యిందులకు ముఖ్యకారణము. లోకల్ లైబ్రరీ అథారిటీ అధ్యక్షులు, సభ్యులు, కార్యదర్శులు మున్నగు వారనేకులు గ్రంథాలయాల అభివృద్ధికై మిగుల ఉత్సాహమును చూపిరి. గ్రంథాలయ కార్యకర్తలు కూడ గ్రంథాలయాల అభివృద్ధికి ఉత్సాహముతో చేయూత నిచ్చిరి.

గ్రంథాలయాల అభివృద్ధికి రాఘవరెడ్డిగారి ఉత్సాహము కూడ మిన్నగా నుండినది. అఖిల భారత గ్రంథాలయ సంఘమువారు 1967 సం॥ డిసెంబరు మాసమున వెలువరచిన తమ పత్రికయందు నిధులు తగినంతగా లేనప్పటికి, ఉత్సాహవంతులయిన అధికారులు బాధ్యతను స్వీకరించినచో గ్రంథాలయాల అభివృద్ధి చక్కగా జరుగగల దని తెల్పుచు, యిందులకు ఆంధ్రప్రదేశ్‌లో రాఘవరెడ్డిగారి కృషి ప్రముఖ నిదర్శనమని ఆ పత్రికయందు ప్రస్ఫుటబరచిరి. రాఘవరెడ్డి గారు ఉత్సాహవంతులేగాక కష్టజీవులు కూడ. ఈ విధముగా కృషితో కూడిన వీరి ఉత్సాహ కారణముననే గ్రంథాలయాల అభివృద్ధితో బాటు గ్రంథాలయాలలో ఆధునిక పద్ధతులను ప్రవేశపెట్టుట కూడ జరిగినది. ఈ విషయమును గురించి 1967 సెప్టెంబర్ 27 న రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమునకు విచ్చేసిన 'ఇండో అమెరికన్ స్టడీటీమ్' సభ్యులలో ప్రముఖ సభ్యురాలగు శ్రీమతి డోరతీపార్కర్ గారు ఆంధ్ర ప్రదేశ్‌నందు గ్రంథాలయాలు 'Modern Lines' లో నిర్వహించ బడుచున్నవని ప్రస్తుతించారు. అదే సమావేశమున యునెస్కో నిపుణు లయిన శ్రీ డి. ఆర్. కాలియాగారు మనదేశములో ఆంధ్రప్రదేశ్ యితర రాష్ట్రములకన్న గ్రంథాలయోద్యమమునందు ముందంజ వేసినదని, యిందులకు రాఘవరెడ్డిగారి కృషి ప్రధాన కారణమని శ్లాఘించిరి. ఇదేవిధముగా పలువురు గ్రంథాలయ శాస్త్రవేత్తలు కూడ రాఘవరెడ్డిగారి కృషిని గురించి కొనియాడియున్నారు.

ప్రభుత్వము నుండి పదవీ విరమణులయిన అనంతరముకూడ వీరు గ్రంథాలయాల అభివృద్ధికి పాటుపడుచున్నారు. దీనిని గుర్తించిన అనంతపురం, కడప, హైదరాబాదు తదితర ప్రాంతములలో వీరికి తగు సన్మానములు కూడ సలుపబడినవి.



హైదరాబాదు నగర జిల్లా గ్రంథాలయ సంస్థవారు మరియు హైదరాబాదు నగర గ్రంథాలయ సంఘంవారు, నగర కేంద్ర గ్రంథాలయాన ఏర్పాటు గావించిన సభలో మంత్రి శ్రీ చంద్రబాబునాయుడుగారు శ్రీ కె రాఘవరెడ్డిగారిని పుష్ప మాలాలంకృతుల గావిస్తున్న దృశ్యం.

రాఘవరెడ్డిగారు 1969 లో డైరెక్టరు పదవిని విరమించిన యనంతరము ప్రముఖ విద్యావేత్తయయిన శ్రీ ఎం. వి. రాజగోపాల్ గారు పౌర గ్రంథాలయ శాఖ డైరెక్టరు బాధ్యతలను స్వీకరించిరి. గొప్ప గ్రంథాలయాభిమాను లయినటువంటి వీరు కొంత కాలము



సన్మాన సభలో శ్రీ కె. రాఘవరెడ్డిగారు ఉపన్యసిస్తున్న సమయాన తీసిన ఛాయా చిత్రము.

మాత్రమే ఈ బాధ్యతలను వహించినప్పటికి, ప్రశంసనీయమైన గ్రంథాలయసేవ జేసిరి. వీరి యనంతరము అబ్దుల్ మహమ్మాద్ గారు ఒక సం॥నకు లోపు మాత్రము డైరెక్టరుగా పనిచేసిరి. వీరి తర్వాత విద్యాశాఖకు చెందిన అధికారులే గ్రంథాలయశాఖ బాధ్యతలను చేపట్టుచుండిరి. వీరు పాఠశాలల, కళాశాలల నిర్వహణాది అంశములందు గొప్ప అనుభవమును గడించిన వారేగాక, విద్యాసంస్థలను అభివృద్ధి పరచినవారు గూడ యని పేర్కొన వచ్చును. వీరిలో మనోహరరావుగారు గ్రామీణ ప్రాంతములలోని గ్రంథాలయాల అభివృద్ధికి పాటుబడినవారు. శాంసన్ రామకృష్ణయ్యగారు గ్రంథ పాలకులకు సకాలమున వేతనము లందుటకు తగు కృషి చేసిరి. వేంకట రెడ్డిగారు కొలది మాసములు మాత్రమే ఈ బాధ్యతను కల్గియున్న

ప్పటికీ, చురుకుగా ఉత్సాహంతో గ్రంథాలయాల అభివృద్ధికి మిగుల తోడ్పడిరి. ఎన్. సుబ్బరాజు, ఎ. సత్యనారాయణ మున్నగువారు గ్రంథాలయశాఖను చక్కగా నిర్వహించిరి. వీరందరు గ్రంథాలయాల అభివృద్ధికి కృషి చేసిన వారేగాని, సాంకేతికముగా తగు అనుభవమును గడించినవారు కాక పోవుటచే గ్రంథపాలకులకు కల్గు సాంకేతిక సమస్యలను పరిష్కరించుటకు కొన్ని సందర్భాలలో వీలుగా కుండెడిది. పౌర గ్రంథాలయ చట్టము అమలులోనున్న యితర రాష్ట్రములలో గ్రంథాలయములకు సాంకేతికముగా తగు అనుభవమును గడించినవారే డైరెక్టర్లుగా నున్నారు. మన రాష్ట్రము నందు గూడ అట్టివారు గ్రంథాలయశాఖ డైరెక్టరుగా ఎందుల కుండరాదని రాష్ట్రములోని పలు గ్రంథాలయాభిమానులు తమ అభిప్రాయమును తెలియ బరచుచున్నారు.

1969 సం॥ తరువాత గూడ రాష్ట్రములో గ్రంథాలయోద్యమ వ్యాప్తికి పాటుపడినవారు పలువురు గలరు. జిల్లా గ్రంథాలయ సంస్థల చైర్మెన్‌లు, కార్యకర్తలు మున్నగువారు గ్రంథాలయ వ్యాప్తికి కృషి జేసిరి. పెక్కు గ్రంథాలయాభిమానులు ఉత్సాహముతో గ్రంథాలయోద్యమమునందు పాల్గొనుచు, గ్రంథాలయోద్యమ వ్యాప్తికి తగు సలహాలను కూడ యిచ్చుచుండిరి. ఉదాహరణకు, గోపాలరావు, ఎగ్బోటేగారు గ్రంథాలయ సమస్యలను పరిష్కరించుటకుగాను, గ్రంథాలయ సమావేశములందు తగు సూచనల నొసగుచుండిరి. గ్రంథాలయాల అభివృద్ధికి సూచనల నిచ్చుటకుగాను ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వము నియమించిన రెవ్యూ కమిటీకి వీరు అధ్యక్షులుగా కూడ నుండిరి. ఎం. భోజ్‌రెడ్డిగారు హైదరాబాదు నగరములోని, జిల్లాలోని గ్రంథాలయాల అభివృద్ధికి మాత్రమేగాక రాష్ట్రములోని యితర గ్రంథాలయాల అభివృద్ధికి గూడ బహువిధముల

తోడ్పడిరి. వీరు రాష్ట్రమునందలి జిల్లాకేంద్ర గ్రంథాలయ భవన నిర్మాణములకు ప్రభుత్వము నుండి గ్రాంట్లు మంజూరు చేయించుట యందును, గ్రంథపాలకులకు సకాలమున వేతనముల నందింపజేయుట యందును ప్రయోజన దాయకమయిన కృషి సల్పిరి.

వై. వి. నర్సిరెడ్డి (గుంటూరు), సుబ్బారావు (కృష్ణా) ఎన్. హరిశ్చంద్రా రెడ్డి (నెల్లూరు) జగన్మోహన్ రెడ్డి (రంగారెడ్డి జిల్లా) మున్నగువారు కూడ గ్రంథాలయ వ్యాప్తికి కృషి చేసిరి. శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యగారు గ్రంథాలయ సభలలో, గ్రంథ పాలకుల సమావేశములలో, గ్రంథాలయాలలో తమకు గల అనుభవమును గురించి పేర్కొనుచు గ్రంథాలయాల అభివృద్ధికి తోడ్పడిరి. శ్రీ కోదాటి నారాయణరావుగారు గ్రామీణ ప్రాంతములకు కూడ వెళ్ళి గ్రంథాలయాల వ్యాప్తికి తగు ప్రచారము చేసిరి. కొల్లూరి కోటీశ్వరరావుగారు రాజకీయవేత్త లయినను గ్రంథాలయ వ్యాప్తికి గూడ చేయూత నిచ్చిరి.

ఈ విధముగా 1969 సం|| మునుపు వలెనే 1969 సం|| తరువాత గూడ గ్రంథాలయాభిమానులు పలువురు గ్రంథాలయాల అభివృద్ధికి పాటు బడిరి.



# ఆంధ్రప్రదేశ్‌నందు 1960 సం॥ నుండి 1969 సం॥ వరకు జరిగిన గ్రంథాలయాభివృద్ధి కార్యక్రమములు - కొన్ని ప్రధాన ఘట్టములు:

## 1960-61 సం॥ నందు జరిగిన ముఖ్యమైన గ్రంథాలయాభివృద్ధి కార్యక్రమములు:

ఆంధ్రప్రదేశ్ పౌరగ్రంథాలయ చట్టము 1960, 1—4—1960 నుండి అమలులోనికి వచ్చినది. 1961 సం॥ జనవరి మాసమున పౌర గ్రంథాలయశాఖ, విద్యాశాఖ నుండి వేరుచేయబడి ప్రత్యేక శాఖగా గుర్తింపబడినది.

ఈ విధముగా వేరుచేయబడిన యనంతరము పౌరగ్రంథాలయ చట్టము ప్రకారము హైదరాబాదు నగర కేంద్ర గ్రంథాలయ గ్రంథ పాలకుడు హైదరాబాదు లోకల్ లైబ్రరీ అథారిటీకి కార్యదర్శిగాను. జిల్లా కేంద్ర గ్రంథాలయ పుస్తక భాండాగారులు తమ తమ జిల్లా లోకల్ లైబ్రరీ అథారిటీలకు కార్యదర్శులుగాను పరిగణింపబడుదురు. హైదరాబాదు నగరమునందలి గ్రంథాలయముల అభివృద్ధిపరచు బాధ్యత ముఖ్యముగా నగర లోకల్ లైబ్రరీ అథారిటీ కార్యదర్శిది. అదేవిధముగా ఒక జిల్లాకు చెందిన గ్రంథాలయముల అభివృద్ధిపరచుట ఆ జిల్లా లోకల్ లైబ్రరీ అథారిటీ కార్యదర్శి కర్తవ్యము. శిక్షణ పొందినటువంటి పుస్తక భాండాగారులకు జిల్లాయందలి గ్రంథాలయ ముల అభివృద్ధిపరచు బాధ్యతలను ఈ విధముగా అప్పగించుట దేశమున ప్రప్రథమముగా ఆంధ్రప్రదేశ్ నందే జరిగినది. దేశములో

మొట్టమొదటిసారిగా ఆంధ్రప్రదేశ్ రాష్ట్రమునందే గ్రంథాలయశాఖ ప్రత్యేకశాఖగా పరిగణింపబడినది.

రాష్ట్ర కేంద్ర గ్రంథాలయ భవనము విశాలముగా లేనందున ఆ భవన ఆవరణములో మరొక భవనమును నిర్మించుకొనుటకుగాను తొమ్మిది లక్షల మొత్తమును ప్రభుత్వము మంజూరు చేసినది.

ఆంధ్రరాష్ట్ర అవతరణానంతరము విశాఖపట్టణమునందు స్థాపించి యుండినటువంటి రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమును గుంటూరుకు తరలించి, ఆ గ్రంథాలయమును ప్రాంతీయ గ్రంథాలయముగా ప్రభుత్వము ప్రకటించినది. గ్రంథసూచీని తయారుచేయు బాధ్యతను ఈ ప్రాంతీయ గ్రంథాలయమున కప్పగించడమైనది.

దశాంశ వర్గీకరణ విధానమును రాష్ట్ర కేంద్ర గ్రంథాలయము నందు ప్రవేశపెట్టుట జరిగినది.

రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమునందు నవీనపద్ధతుల ప్రవేశపెట్టు టకు కృషిజరిగినది. తెరువబడిన బీరువాలయందు పుస్తకముల నమర్చు విధానమును రాష్ట్రగ్రంథాలయమునందు ప్రవేశపెట్టడంకూడ జరిగినది.

ఇదివరకు విద్యాశాఖవారి అధీనమునందుండిన పబ్లిక్ గార్డెన్స్ లోని బాలల గ్రంథాలయము పౌరగ్రంథాలయశాఖ డైరెక్టరువారి అధీనములోనికి చేర్చబడినది.

గ్రంథాలయ శాస్త్రమునకు సంబంధించిన డిప్లొమా, సర్టిఫికేటు కోర్సుల నిర్వహణమునకుగాను ఉస్మానియా విశ్వవిద్యాలయమునకు పదివేల రూపాయల గ్రాంటు మంజూరు చేయబడినది. డిప్లొమా కోర్సు చదువుటకై పదిహేను మందిని, సర్టిఫికేటు కోర్సు చదువుటకై ఇరవైరెండు మందిని ఈ విశ్వవిద్యాలయమునకు పంపుట జరిగినది.

సహాయక గ్రంథాలయాల అభివృద్ధికిగాను రూ. 49,000 మొత్తమును ప్రభుత్వము మంజూరు చేసినది.

ఆంధ్ర ప్రాంతములోని ఫిర్కా కేంద్ర గ్రంథాలయాల నిర్వహణ నిమిత్తము లోకల్ లైబ్రరీ అథారిటీలకు రూ. 22,500 మొత్తమును ప్రభుత్వము మంజూరు చేసినది.

తెలంగాణ ప్రాంతములోని లోకల్ లైబ్రరీ అథారిటీలకు పుస్తకములు మరియు ఫర్నిచర్ కొనుగోలుకుగాను రూ. 1,00,000 మొత్తమును మంజూరు చేయడమైనది.

ఈ సంవత్సరము వసూలయిన గ్రంథాలయ సెస్సు రూ. 7,37,000; 1959 – 60 సం॥లో వసూలయిన సెస్సుకు సమాన ముగా ప్రభుత్వము మంజూరు చేసిన మొత్తము రూ. 4,68,900; గ్రంథాలయాల అభివృద్ధికి మంజూరు చేయబడిన ప్రత్యేక గ్రాంట్లు రూ. 1,23,000; ఈ ఆర్థిక సంవత్సరము పౌర గ్రంథాలయశాఖ గ్రంథాలయాల బడ్జెట్టు పదకొండు లక్షలు. ఈ బడ్జెట్టునందు వసూలయిన సెస్సు చేర్చుకొనబడలేదు.

## 1961 సం॥ చివరి నాటికి రాష్ట్రమునందలి గ్రంథాలయాలు:

| | | |
|---|---|---|
| 1. | రాష్ట్ర కేంద్ర గ్రంథాలయము | 1 |
| 2. | ప్రాంతీయ గ్రంథాలయము | 1 |
| 3. | సంచార గ్రంథాలయము | 1 |
| 4. | బాలల గ్రంథాలయములు | 11 (పబ్లిక్ గార్డెన్స్‌లోని గ్రంథాలయముతో సహా) |
| 5. | జిల్లా కేంద్ర గ్రంథాలయములు | 21 |
| 6. | శాఖా గ్రంథాలయములు | 209 |
| 7. | పుస్తక పంపిణీ కేంద్రములు | 370 |
| 8. | సహాయక గ్రంథాలయములు | 1061 |
| | మొత్తము | 1675 |

పై గ్రంథాలయములే గాక ప్రభుత్వ ఆర్థిక సహాయమునకు అర్హములైనవిగా డైరెక్టరుగారిచే గుర్తింపబడిన 49 గ్రంథాలయములుకూడ యుండినవి.

1961 సం॥ చివరి నాటికి ఆంధ్రప్రదేశ్ లోని గ్రంథాలయముల యందలి మొత్తము పుస్తకముల సంఖ్య 9,40,000 కు చేరినది. ఈ సంవత్సరము నందు గ్రంథాలయములకు విచ్చేసిన పాఠకుల సంఖ్య 3,83,500.

ఈ సం॥నందు ప్రతినెల పఠించబడిన పుస్తకముల సంఖ్య 7,50,000 కు పైగా నుండినది. పఠనముకొరకు ఇంట్లకు కొనిపోబడినటువంటి పుస్తకముల సంఖ్య 5,50,000 కు పైగా నుండినది.

పుస్తక ప్రదర్శనలు, ఉపన్యాసములు, ముఖ్యముగ విద్యా కార్యక్రమములు రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమునందును, ప్రాంతీయ గ్రంథాలయములందును జిల్లా కేంద్ర గ్రంథాలయములయందును కొన్ని శాఖా గ్రంథాలయములయందును నిర్వహించుట జరిగినది.

పై నుడివిన గ్రంథాలయములందేగాక యితర శాఖా గ్రంథాలయములందు గూడ బాలల కార్యక్రమములు నిర్వహింపబడినవి.

## 1961–62 సం॥ నందు జరిగిన ముఖ్యమైన గ్రంథాలయాభివృద్ధి కార్యక్రమములు:

ఆంధ్రప్రదేశ్ పౌరగ్రంథాలయ చట్టము క్రింద పొందుపరచబడినటువంటి చట్ట నిబంధనలు 6—4—1961 నుండి అమలులోనికి వచ్చినవి.

రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమునకు నూతనముగా నిర్మింపబడిన భవనమునకు 9—7—1961 న ప్రారంభోత్సవము జరిగినది.

రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమునందు ఆధునిక పద్ధతుల ప్రవేశ పెట్టుట జరిగినది. సాంఘిక విద్యా విభాగము కూడ ఈ సంవత్సరమున స్థాపించ బడినది.



**రాష్ట్ర కేంద్ర గ్రంథాలయములో ఉర్దూ గ్రంథముల విభాగము ఏర్పాటును పరిశీలిస్తున్న శ్రీ కె. రాఘవరెడ్డిగారు.**

1958-59 సంllన ప్రచురించబడిన పుస్తకముల సూచీలను తయారుచేసి రాష్ట్రమునందలి గ్రంథాలయాలకు ఉచితముగా పంపడమైనది.

డిప్లొమా, సర్టిఫికేట్ కోర్సుల నిర్వహించుటకుగాను ఉస్మానియా విశ్వవిద్యాలయమునకు పదివేల రూపాయల గ్రాంట్లను మంజూరు చేయడమైనది. మఱియు డిప్లొమా కోర్సునందు శిక్షణ పొందుటకుగాను 20 మందిని, సర్టిఫికేటు కోర్సునందు శిక్షణ పొందుటకుగాను 20 మందిని యీ విశ్వవిద్యాలయమునకు పంపుట జరిగినది.

సర్టిఫికేటు కోర్సు నిర్వహణావ్యయములకు గాను ఆంధ్ర విశ్వవిద్యాలయమునకు ప్రభుత్వము మూడువేల రూపాయలను మంజూరు చేసినది.

సహాయక గ్రంథాలయములకుగాను 75,430 రూపాయల గ్రాంట్లను మంజూరు చేయడమైనది.

ఈ సంవత్సరమునందు గ్రంథాలయాభివృద్ధియందు మిగుల వెనుకబడినటువంటి తెలంగాణ ప్రాంతమునందు గ్రంథాలయ స్థాపనాభివృద్ధులకుగాను ప్రత్యేక శ్రద్ధను గైకొనుట జరిగినది.

ఈ క్రింద సూచించబడిన మేరకు ఆయా కార్యక్రమముల అభివృద్ధికిగాను తెలంగాణ ప్రాంతములోని లోకల్ లైబ్రరీ అథారిటీలకు ప్రభుత్వము గ్రాంట్లు మంజూరు చేసినది.

| అభివృద్ధి కార్యక్రమము | మంజూరు చేయబడిన మొత్తము రూ. |
|---|---|
| 1. గ్రంథాలయములకు కావలసిన పుస్తకముల కొనుగోలు మఱియు గ్రంథాలయోద్యోగుల జీత భత్యములు. | 1,78,000 |
| 2. జిల్లా కేంద్ర గ్రంథాలయాలలో బాలల విభాగముల స్థాపన. | 13,500 |
| 3. పుస్తక పంపిణీ కేంద్రముల స్థాపన. | 63,000 |
| 4. సంగారెడ్డి, వికారాబాద్‌ల యందలి కేంద్ర గ్రంథాలయముల భవన నిర్మాణము. | 1,00,000 |

రాష్ట్రమునందు వయోజన విద్య నభ్యసించువారికి సంబంధించిన పుస్తకముల కొనుగోలు నిమిత్తము రూ. 38,000 మొత్తమును లోకల్ లైబ్రరీ అథారిటీలకు ప్రభుత్వము మంజూరు చేసినది.

నిర్వహణా సామర్థ్యము లోపించినటువంటి సహాయక గ్రంథాలయముల కొన్నిటిని లోకల్ లైబ్రరీ అథారిటీలు తమ అధీనములోనికి గైకొన్నవి.

ఈ సంవత్సరమునందు వసూలయిన గ్రంథాలయ సెస్సు. రూ. 5,75,000

1960-61 సం॥ వసూలయిన సెస్సుకు సమానముగా ప్రభుత్వము మంజూరు చేసిన మొత్తము. రూ. 4,10,425

గ్రంథాలయాభివృద్ధికి మంజూరు చేయబడిన ప్రత్యేక గ్రాంట్లు. రూ. 3,79,500

ఈ సంవత్సరము చివరినాటికి రాష్ట్రములోని గ్రంథాలయాల సంఖ్య. 1,740

ఇవి గాక గ్రాంట్లు పొందని గ్రంథాలయాలు కూడ రాష్ట్రమునందు యుండినవి. ఈ సంవత్సరము గ్రంథాలయములలోని పుస్తకముల సంఖ్య 12,25,000 కు పెరిగినది. పాఠకుల సంఖ్య, అరువు కొనిపోబడిన పుస్తకముల సంఖ్యకూడ గత సంవత్సరము కన్న పెరిగినదని చెప్పవచ్చును. వయోజన విద్యా కార్యక్రమములు, బాలల కార్యక్రమములు జిల్లా కేంద్ర గ్రంథాలయాలలోనే గాక కొన్ని సహాయక, శాఖా గ్రంథాలయములందు కూడ నిర్వహింప బడినవి.

ఈ సంవత్సరమునందు కేంద్ర ప్రభుత్వము దేశమునందలి గ్రంథాలయముల అభివృద్ధిని పరిశీలించు నిమిత్తము నియమించినటువంటి కమిటీ అధ్యక్షులు, గ్రంథాలయ నిపుణులు, వయోజన విద్యా కార్యక్రమముల నడుపుటయందు గొప్ప సమర్థులు అయిన డా॥ టి. ఎ. కోషిగారు మన రాష్ట్రమునందలి గ్రంథాలయాభివృద్ధికి సంబంధించిన పలు కార్యక్రమముల పరిశీలించి ఆంధ్రప్రదేశ్ లో "Library Organisation is Commendable" అని శ్లాఘించియున్నారు.

## 1962 – 63 సం॥ నందు జరిగిన ముఖ్యమైన గ్రంథాలయాభి వృద్ధి కార్యక్రమములు:

లోకల్ లైబ్రరీ అథారిటీల గ్రంథాలయ నిధులు తగినంతగా లేకపోయినప్పటికి, గ్రంథాలయోద్యమము మాత్రము రాష్ట్రమంతటా చక్కగా వ్యాప్తి చెందినది. పుస్తక భాండాగారకులలో పలువురు శిక్షణ పొందిన వారగుటచే పలు గ్రంథాలయములందు ఆధునిక పద్ధతులు ప్రవేశ పెట్టబడినవి.

1960 – 61 సం॥ ప్రచురించబడినటువంటి పుస్తకముల యొక్క జాబితాలను రాష్ట్రములోని అన్ని గ్రంథాలయాలకు పంపుట జరిగినది.

గుంటూరు ప్రాంతీయ గ్రంథాలయము 'బాలల సాహితీ మాల'ను పూర్తి చేసినది.

ఈ సంవత్సరమునందు పౌర గ్రంథాలయ చట్టమునకు కావలసిన సవరణల రూపొందించుటకొరకు కమిటీని, గ్రంథాలయోద్యోగుల సేవా నిబంధనల పరిశీలించుటకొరకు కమిటీని నియమించుట జరిగినది.

గ్రంథాలయాభివృద్ధి యందు వెనుకబడిన తెలంగాణ ప్రాంతమునకు పుస్తకముల కొనుగోలుకు, ఫర్నిచర్ కొనుగోలుకు ప్రభుత్వము లోకల్ లైబ్రరీ అథారిటీలకు రూ. 1,79,000 లను మంజూరు చేసినది.

హైదరాబాదు, కడప లోకల్ లైబ్రరీ అథారిటీలకు బాలల సాహిత్య రూపకల్పనకు మఱియు వయోజన విద్యా గ్రంథ రూప కల్పనకై రూ. 2,500 మంజూరు చేయబడినది.

ఈ సంవత్సరాంతమునకు రాష్ట్రమునందు మొత్తము గ్రంథాలయాల సంఖ్య 2,062 కు పెరిగినది. ప్రభుత్వ సహాయమును పొందని గ్రంథాలయాల సంఖ్య కూడ కొంత వరకు వృద్ధిచెందినది.

689 సహాయక గ్రంథాలయాలకు రూ. 58,000 గ్రాంటు క్రింద మంజూరు చేయడమైనది.

ఈ సంవత్సరాంతమునకు గ్రంథాలయాలలో 252 మంది పుస్తక భాండాగారులు డిప్లొమా, సర్టిఫికేటు కోర్సులందు శిక్షణ పొంది యుండిరి.

| | |
|---|---|
| ఈ సంవత్సరము నందు వసూలయిన గ్రంథాలయ సెస్సు. | రూ. 10,80,100 |
| 1961 - 62 సం॥ వసూలయిన సెస్సుకు సమానముగా ప్రభుత్వము మంజూరుచేసిన మొత్తము. | రూ. 5,29,600 |
| ప్రభుత్వము మంజూరు చేసిన ప్రత్యేకగ్రాంట్లు | రూ. 1,83,500 |
| రాష్ట్రము నందలి గ్రంథాలయములలోని పుస్తకముల సంఖ్య. | 12,43,000 |

ఈ సంవత్సరము గ్రంథాలయములకు విచ్చేయు పాఠకుల సంఖ్య, అరువు కొనిపోబడు పుస్తకముల సంఖ్య కూడ కొంత వఱకు అధికమైనది.

టిక్కెట్టు విధానము, తెరువబడిన బీరువాల యందు పుస్తకముల నమర్చు విధానము, మొదలగునవి చిన్న చిన్న శాఖా గ్రంథాలయాలలో కూడ ప్రవేశ పెట్టుట జరిగినది.

బాలల కార్యక్రమములు, వయోజన విద్యా కార్యక్రమములు గత సంవత్సరము కన్న ప్రోత్సాహకరముగా పెక్కు గ్రంథాలయములలో నిర్వహింపబడినవి.

## 1963 - 64 సం॥ నందు జరిగిన ముఖ్యమైన గ్రంథాలయాభివృద్ధి కార్యక్రమములు:

గత సంవత్సరముకన్న లోకల్ లైబ్రరీ అథారిటీల నిధులు మెఱుగుపడినందున గ్రంథాలయాభివృద్ధిలో కూడ మెఱుగు కన్పించినది.

గ్రంథపాలకులు సాంకేతిక విషయములందు తగు అనుభవమును గడించుటచే వర్గీకరణ – సూచీకరణల రూపకల్పన, బైబ్లియోగ్రఫీల తయారీ మున్నగునవి సక్రమముగా జరిగినవి.

తిరుపతి, వరంగల్లు పట్టణములయందు రెండు ప్రాంతీయ గ్రంథాలయాలు స్థాపించబడినవి.

గుంటూరు ప్రాంతీయ గ్రంథాలయమువారు రూపొందించిన 'బాలల సాహిత్యమాల'ను ముద్రించి రాష్ట్రములోని అన్ని గ్రంథాలయాలకు ఉచితముగా పంపిణీ చేయడమైనది.

చైనా భారత దేశముపై దాడి సల్పిన సందర్భమున గ్రంథపాలకులు సానుభూతితో సైనికులకు బట్టలను, పుస్తకములను మున్నగు వాటిని విరాళముగా పంపిరి.

గత సంవత్సరము వలెనే ఈ ఏట కూడ తెలంగాణ ప్రాంతములోని గ్రంథాలయాల అభివృద్ధికిగాను లోకల్ లైబ్రరీ అథారిటీలకు ఈ క్రింది విధముగా గ్రాంట్లు మంజూరు చేయబడినవి.

1. పుస్తకముల కొనుగోలుకు రూ. 1,90,500

2. శాఖా గ్రంథాలయాల, పంపిణీ కేంద్రముల స్థాపనా నిర్వహణలకు రూ. 12,000

3. వికారాబాద్‌లోని జిల్లా కేంద్ర గ్రంథాలయ భవన నిర్మాణమునకు రూ. 18,140

4. ఆదిలాబాద్, నిజామాబాద్, మెదక్, ఖమ్మం జిల్లాల లోకల్ లైబ్రరీ అథారిటీలకు గ్రంథాలయాల స్థాపనా నిర్వహణలకుగాను రూ. 8,000

ఉస్మానియా విశ్వవిద్యాలయమునందు గ్రంథాలయ శాస్త్ర శిక్షణా కోర్సుల నిర్వహణకుగాను. రూ. 5,000

డిప్లొమా కోర్సునందు శిక్షణ పొందుటకుగాను 14 మందిని, సర్టిఫికేటు కోర్సునందు శిక్షణ పొందుటకుగాను పౌర గ్రంథాలయ శాఖవారు 15 మందిని విశ్వవిద్యాలయమునకు పంపిరి. ఈ సంవత్స రాంతమునకు రాష్ట్రమునందు గ్రంథాలయములలోని శిక్షణ పొందిన పుస్తక భాండాగారుల సంఖ్య 266 కు చేరినది.

ఈ సంవత్సరము నందు 39 శాఖా గ్రంథాలయములు, 72 పుస్తక పంపిణీ కేంద్రములు ప్రారంభింపబడినవి. సక్రమముగా నిర్వహింపబడని తొమ్మిది సహాయక గ్రంథాలయములను లోకల్ లైబ్రరీ అథారిటీలు తమ ఆధీనము లోనికి తీసికొన్నవి.

966 సహాయక గ్రంథాలయాలకు రూ. 84,722 లను గ్రాంటు క్రింద మంజూరు చేయడమైనది.

| | |
|---|---|
| ఈ సంవత్సరమునందు వసూలయిన గ్రంథాలయ సెస్సు. | రూ. 15,08,300 |
| గత సంవత్సరము వసూలయిన సెస్సునకు సమానముగా ప్రభుత్వము మంజూరు చేసిన మొత్తము. | రూ. 6,75,00 |
| ప్రభుత్వము మంజూరు చేసిన ప్రత్యేక గ్రాంట్లు | రూ. 2,30,600 |
| సంవత్స రాంతమునకు రాష్ట్రము నందలి గ్రంథాలయ సంఖ్య. | 2,090 |
| రాష్ట్రములోని గ్రంథాలయాలలోని పుస్తకముల సంఖ్య. | 14,70,000 |

ఈ సంవత్సరమున గత సంవత్సరమున కన్న రెండు లక్షలకు పైగా పుస్తకముల కొనుగోలు చేయబడినవని తెలియుచున్నది.

గ్రంథాలయముల గణాంక వివరముల పరిశీలించు నిమిత్తము పౌర గ్రంథాలయ శాఖయందు రెండు ఆడిటర్ ఉద్యోగముల కల్పిం

చుట జరిగినది. సక్రమ కార్య నిర్వహణ కొఱకు రాష్ట్ర కేంద్ర గ్రంథాలయము నందొక సూపరెంటెండెంట్ నియామకము జరిగినది.

గ్రంథాలయములకు కావలసిన పుస్తకముల జాబితాను తయారుచేసి లోకల్ లైబ్రరీ అథారిటీలకు అందించుటకుగాను ఒక నిపుణుల కమిటీని నియమించుట జరిగినది.

ఈ సంవత్సరమునందు గ్రంథాలయాల మధ్య అరువు పద్ధతులు విస్తృత పరచబడినవి. అంతేగాక వయోజన విద్యా కార్యక్రమములు, బాలల కార్యక్రమములు మునుపటికన్న పెక్కు గ్రంథాలయము లందు సంతృప్తికరముగా నిర్వహించబడినవి.

## 1964-65 సం॥ నందు జరిగిన ముఖ్యమైన గ్రంథాలయాభివృద్ధి కార్యక్రమములు:-

ఈ సంవత్సరమున గ్రంథాలయములందు సాంకేతిక కార్య క్రమములు గత సంవత్సరమునకన్న చక్కగా నిర్వహింపబడినవి. గుంటూరులోని ప్రాంతీయ గ్రంథాలయ భవనమును కొనుటకుగాను రూ. 31,048-40 పైసలను ప్రభుత్వము మంజూరు చేయడమైనది.

ఈ క్రింద కనబరచిన మేరకు ఆయా జిల్లాలకు జిల్లా కేంద్ర గ్రంథాలయ భవనముల నిర్మాణమునకుగాను గ్రాంట్లు మంజూరు చేయడమైనది.

| జిల్లా పేరు | మంజూరు చేయబడిన మొత్తము రూ. |
|---|---|
| 1. విశాఖపట్టణము | 10,000 |
| 2. అనంతపురం | 10,000 |
| 3. శ్రీకాకుళం | 25,000 |
| 4. చిత్తూరు | 25,000 |

బాలలకు సంబంధించిన పుస్తకముల జాబితాను (Bibliography) తెలుగునందువలె ఉర్దూ భాషలో రూపొందించు నిమిత్తము రాష్ట్ర కేంద్ర గ్రంథాలయోద్యోగులు కృషి చేసిరి.

ఆరు గంటల కాలము పనిచేయుచుండిన కొన్ని జిల్లా కేంద్ర గ్రంథాలయములు ఉదయం 8 గంటలనుండి సాయంత్రం 8 గంటల వరకు అనగా 12 గంటల కాలము పనిచేయ బూనినవి.

గ్రంథాలయ శాస్త్ర శిక్షణ కోర్సుల నిర్వహణకుగాను రూ. 7,500 లను ఉస్మానియా విశ్వవిద్యాలయమునకు మంజూరు చేయడమైనది. ఈ సంవత్సరాంతమునకు రాష్ట్రమునందలి గ్రంథాలయాలలో 294 మంది శిక్షణ పొందిన గ్రంథపాలకులు పనిచేయుచుండిరి. ఉస్మానియా విశ్వవిద్యాలయము, డిప్లొమా కోర్సునకు బదులుగా బి.ఎల్.ఎస్.సి. కోర్సును నిర్వహించుటకు సంకల్పించినది.

ఈ సంవత్సరమునందు 32 శాఖా గ్రంథాలయములు, 8 పుస్తక పంపిణీ కేంద్రములు ప్రారంభింపబడినవి. ఆర్థికముగా వెనుకబడిన 13 సహాయక గ్రంథాలయములను లోకల్ లైబ్రరీ అథారిటీలు తమ అధీనములోనికి తీసికొన్నవి.

ఈ సంవత్సరము చివరినాటికి 2,115 గ్రంథాలయములుండినవి.

ఈ సంవత్సరమునందు గ్రంథాలయ బడ్జెట్టులో, సహాయక గ్రంథాలయాలకుగాను రూ. 2,00,000 లను కేటాయించడమయినది. అంతేగాక, 1,307 సహాయక గ్రంథాలయములకు రూ. 1,03,490 లను మంజూరు చేయడమైనది. గత సంవత్సరములో ప్రభుత్వముయొక్క గ్రాంటును పొందని గ్రంథాలయాలలో 55 గ్రంథాలయములను సహాయక గ్రంథాలయములుగా ప్రకటించడము జరిగినది.

## కొన్ని గణాంక వివరములు :-

వసూలయిన గ్రంథాలయ సెస్సు మొత్తము రూ. 9,28,000

గత సంవత్సరము వసూలయిన గ్రంథాలయ సెస్సుకు సమానముగా ప్రభుత్వము మంజూరు చేసిన మొత్తము రూ. 11,00,000

ప్రభుత్వము మంజూరు చేసిన ప్రత్యేక గ్రాంట్లు. రూ. 2,63,400

సంవత్సరాంతరమునకు గ్రంథాలయాలలోని పుస్తకముల సంఖ్య. 19,29,000

ఈ సంవత్సరమునందు గ్రంథాలయాలలోని పుస్తకములతో పాటు అరువు కొనిపోబడిన పుస్తకముల సంఖ్య, గ్రంథాలయాలకు విచ్చేసిన పాఠకుల సంఖ్యలలో కూడ పెరుగుదల కన్పించినది.

తెలుగునందు మతము, వేదాంతము మున్నగు విషయములకు సంబంధించిన పుస్తకముల వర్గీకరణ జాబితాను తయారుచేయుట కొఱకు ఒక ప్రత్యేక నమూనాను రూపొందించుట జరిగినది.

పౌర గ్రంథాలయ శాఖ గ్రంథాలయముల తనిఖీచేయు విధానమును కూడ రూపొందించినది.

మహిళలకు, వృద్ధులకు గ్రంథాలయాలలో పఠన వసతులు పెంపొందించ బడినవి.

నాల్గవ పంచవర్ష ప్రణాళికా పథకములను పౌర గ్రంథాలయ శాఖ రూపొందించినది. ఈ సంవత్సరమునందు పలు శాఖా గ్రంథాలయాలకు రేడియోలను సరఫరా చేయుటచే రేడియో కార్యక్రమాలను వినెడి అవకాశము గ్రామప్రాంతము లందలి ప్రజలలో పెక్కండ్రకు కూడ కల్పించుట జరిగినది.

# 1965 - 66 సం॥ నందు జరిగిన ముఖ్యమైన గ్రంథాలయాభివృద్ధి కార్యక్రమములు:

ఈ సంవత్సరమునందు గ్రంథాలయోద్యమ వ్యాప్తికి, సహాయక గ్రంథాలయముల అభివృద్ధికి కూడ గొప్ప ప్రోత్సాహము లభించినది. ఈ సంవత్సరాంతమునకు రాష్ట్రమునందు 1,876 సహాయక గ్రంథాలయము లుండినవి. పౌర గ్రంథాలయశాఖ డైరెక్టరు సహాయక గ్రంథాలయములకు 2.08 లక్షల రూపాయల గ్రాంటును మంజూరు చేసిరి. ఈ విధముగా రెండు లక్షలకు పైగా సహాయక గ్రంథాలయములకు మంజూరు చేయుట ఇదే తొలిసారి. దీనినిబట్టి యీ సంవత్సరము నందు సహాయక గ్రంథాలయములకు తగు ప్రాధాన్యత నివ్వడం జరిగినదని గుర్తించవచ్చును. పై తెలిపిన 1,876 సహాయక గ్రంథాలయములేగాక మునుపు ప్రభుత్వ సహాయమును పొందకుండ నిర్వహించబడు చుండినటువంటి గ్రంథాలయాలలోని 569 గ్రంథాలయములను ప్రభుత్వ సహాయము పొందుట కర్హత కల్గినవిగా అనగా, సహాయక గ్రంథాలయములుగా ప్రకటించుట జరిగినది. ఈ సంవత్సరము చివరి నాటికి 3,200 గ్రంథాలయములు ప్రభుత్వ సహాయమును పొందనివిగా యుండినవి. స్వచ్ఛందముగా గ్రంథాలయసేవ గావించు గ్రంథాలయములకు రాష్ట్ర ప్రభుత్వము రూ. 17,500 లను, కేంద్ర ప్రభుత్వము రూ. 10,540 లను ప్రత్యేక గ్రాంట్లుగా మంజూరు చేసినవి.

1966 – 67 సం॥లో నిజామాబాదునందొక ప్రాంతీయ గ్రంథాలయమును ప్రారంభించవలెనన్న సూచనకు ప్రభుత్వము సుముఖతను వ్యక్తము చేసినది.

గ్రంథాలయ భవన నిర్మాణములకు గాను యీ క్రింద కనబరచిన ప్రకారము ఆయా లోకల్ లైబ్రరీ అథారిటీలకు గ్రాంట్లు మంజూరు చేయబడినవి.

| జిల్లా పేరు. | గ్రాంట్లు మొత్తము రూ. |
| --- | --- |
| మెదక్ | 6,000 |
| ఖమ్మం | 7,000 |
| నల్గొండ | 6,000 |

ప్రాజెక్టు పథకము క్రింద 4 శాఖా గ్రంథాలయాలను, 4 పుస్తక పంపిణీ కేంద్రములను స్థాపించుటకుగాను హైదరాబాదు, కడప లోకల్ లైబ్రరీ అథారిటీలకు (ఒక్కొక్క లోకల్ లైబ్రరీ అథారిటీకి) రూ. 25,000 చొప్పున గ్రాంట్లు మంజూరు చేయబడినవి.

లిఖిత ప్రతులను భద్రపరచు విధానములయందు శిక్షణ నిచ్చుటకుగాను రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమునందు పని చేయు పుస్తక భాండాగారులలో నిరువురిని ఢిల్లీలోని ప్రాచీన పత్ర పరిరక్షణ శాఖకు పంపుట జరిగినది.

ఈ సంవత్సరము చివరినాటికి రాష్ట్రమునందలి గ్రంథాలయాలలో 302 మంది శిక్షణ పొందిన పుస్తక భాండాగారులు పనిచేయుచుండిరి.

ఉన్నత పాఠశాలల యందు పనిచేయు 40 మంది ఉపాధ్యాయులకు పాఠశాలల యందలి గ్రంథాలయాల నిర్వహణా విధానముల యందు శిక్షణ యివ్వబడినది.

కడప, కృష్ణా తదితర జిల్లాలయందు ఇంటింటికి వెళ్ళి పుస్తకముల నరువిచ్చు విధానము ప్రయోజనకరముగా నిర్వహించబడినది.

ఈ సంవత్సరమునందు 42 శాఖా గ్రంథాలయములు, 17 పుస్తక పంపిణీ కేంద్రములు తెరువబడినవి.

ఆర్థికముగా వెనుకబడినటువంటి ఆరు సహాయక గ్రంథాలయములను లోకల్ లైబ్రరీ అథారిటీలు తమ అధీనములోనికి తీసికొన్నవి.

ఈ సంవత్సరము 1,58,068 పుస్తకములను వర్గీకరించి, కేటలాగు కార్డులను తయారు చేయుట జరిగినది.

గ్రంథాలయాభివృద్ధిని గురించి చర్చించు నిమిత్తము ఆంధ్ర ప్రదేశ్ గ్రంథాలయముల సమావేశములు 6—2—1966 నుండి 8—2—1966 వఱకు నిర్వహింపబడినవి. పుస్తక భాండాగారులు కూడ యీ సమావేశములకు అధిక సంఖ్యలో హాజరైరి. రాష్ట్రము నందలి లోకల్ లైబ్రరీ అథారిటీ సెక్రటరీల, చైర్మెన్‌ల సమావేశ మొకటి హైదరాబాదునందు మార్చి, 1966 లో నిర్వహింపబడినది.

ఈ సంవత్సరాంతమునకు రాష్ట్రమునందు గ్రంథాలయాల సంఖ్య 2,280 కి పెరిగినది.

| | |
|---|---|
| ఈ సంవత్సరము వసూలు కాబడిన గ్రంథాలయ సెస్సు. | రూ. 14,76,200 |
| గత సంవత్సరము వసూలయిన సెస్సునకు సమానముగా ప్రభుత్వము మంజూరు చేసిన మొత్తము | రూ. 16,99,900 |
| ప్రభుత్వము మంజూరు చేసిన ప్రత్యేక గ్రాంట్లు. | రూ. 2,83,500 |

ఈ సంవత్సరాంతమునకు రాష్ట్రమునందలి గ్రంథాలయముల లోని పుస్తకముల సంఖ్య 21,96,000 కు చేరినది. అరువు కొనిపోబడు పుస్తకముల సంఖ్య, గ్రంథాలయములకు విచ్చేయు పాఠకుల సంఖ్య కూడ గత సంవత్సరమున కన్న కొంతవఱకు పెరిగినదని చెప్పవచ్చును.

## 1966-67 సం॥ నందు జరిగిన ముఖ్యమైన గ్రంథాలయాభివృద్ధి కార్యక్రమములు:

ఈ సంవత్సరమున గత సంవత్సరముల కన్న గ్రంథాలయముల అభివృద్ధి మెఱుగుగా జరిగినట్లు నుడువవచ్చును.

నిజామాబాదు నందొక ప్రాంతీయ గ్రంథాలయము ప్రారంభింపబడినది. పబ్లిక్ గార్డెన్స్‌లోని బాలల గ్రంథాలయము జవహర్

బాలభవన్‌తో విలీనము చేయబడినది. తిరుపతి, వరంగల్లు పట్టణముల ప్రాంతీయ గ్రంథాలయములకు ప్రభుత్వము రేడియో తదితర ప్రచార సాధనములను పంపిణీ చేసినది.

ఈ సంవత్సరము పలు శాఖా గ్రంథాలయములను స్థాపించుటకు గట్టి ప్రయత్నములు జరిగినవి. ఈ గ్రంథాలయములను స్థాపించుటకు గొప్ప విద్యావేత్తల మఱియు మేధావుల సహకారము కూడ లభించినది.



26—11—1966 బుక్కపట్టణం శాఖా గ్రంథాలయమును భగవాన్ శ్రీ సత్యసాయిబాబాగారు ప్రారంభించిన సభలో శ్రీ కె. వి. వేమారెడ్డిగారు ప్రసంగిస్తున్న దృశ్యం. వేదికపై శ్రీ కె. రాఘవరెడ్డిగారు, శ్రీ కె. ఎస్. ప్రకాశంగారు కూడ కలరు.



**రాఘవరెడ్డిగారు భగవాన్ శ్రీ సత్యసాయిబాబాగారికి ఆంధ్రప్రదేశ్‌లో గ్రంథాలయాల వ్యాప్తిని గురించి వివరిస్తున్నప్పుడు తీసిన ఛాయా చిత్రం.**

ఈ సంవత్సరము, 1,843 సహాయక గ్రంథాలయములకు రూ 1,95,563 లను గ్రాంటు క్రింద మంజూరు చేయడమైనది. ప్రయివేటు సంస్థల యాజమాన్యములోని 719 గ్రంథాలయములను సహాయక గ్రంథాలయములుగా ప్రకటించడమైనది. ఈ సంవత్సరము చివరి నాటికి రాష్ట్రమునందు ప్రభుత్వ సహాయమును పొందని గ్రంథాలయములు మూడు వేలకు పైగా యుండినవి.

పుస్తక పంపిణీ కేంద్రములతో కలిపి 96 గ్రంథాలయములను యీ సంవత్సరమున లోకల్ లైబ్రరీ అథారిటీలు ప్రారంభించినవి.

ఆర్థికముగా వెనుకబడిన 8 సహాయక గ్రంథాలయములను లోకల్ లైబ్రరీ అథారిటీలు తమ అధీనములోనికి తీసికొన్నవి.

ఈ సంవత్సరము బి. ఎల్. ఎస్. సి. శిక్షణాకోర్సుల నిర్వహణకుగాను ఉస్మానియా విశ్వవిద్యాలయమునకు రూ. 20,000 ల గ్రాంటు మంజూరయినది. ఏడుగురు పట్టభద్రులను బి. ఎల్. ఎస్. సి. నందు శిక్షణ పొందు నిమిత్తము విశ్వవిద్యాలయమునకు పంపడమైనది.

విజయవాడలో ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘమువారు నిర్వహించిన గ్రంథాలయశాస్త్ర శిక్షణకు 40 మంది శిక్షణ పొందని గ్రంథపాలకులు పంపబడిరి. రాష్ట్ర కేంద్ర గ్రంథాలయములోని అంధుల విభాగ నిర్వహణయందు ప్రత్యేక శిక్షణ పొందుటకుగాను ఒక గ్రంథపాలకుని ఢిల్లీ, డెహరాడూన్ లకు పంపడమైనది.

ఈ సంవత్సరము చివరి నాటికి గ్రంథాలయములయందు పని చేయు చుండిన వారిలో 346 మంది శిక్షణ పొందిన పుస్తక భాండాగారు లుండిరి.

ఈ సంవత్సరమున గ్రంథాలయ పుస్తక భాండాగారుల వేతనముల సవరించుట జరిగినది.

హైదరాబాదులోని 'సాహిత్యసౌధ' (Literary Society) కు పుస్తకముల కొనుగోలుకుగాను 5,000 రూ. మంజూరయినది.

భారత ప్రత్యేక గ్రంథాలయాల సమాచార కేంద్రాల సంఘము ఏర్పాటు కావించిన గ్రంథాలయ సదస్సుకు రెండువేల రూపాయలను రాష్ట్ర ప్రభుత్వము మంజూరు చేసినది. ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘమునకు గ్రంథాలయ సర్వస్వము అను పత్రికా నిర్వహణకుగాను రెండువేల రూపాయలను ప్రభుత్వము మంజూరు చేసినది.

గ్రంథాలయోద్యోగులకు పునశ్చరణ తరగతుల కోర్సుల నిర్వహించుటకుగాను లోకల్ లైబ్రరీ అథారిటీలకు ప్రభుత్వము 51 వేల రూపాయలను మంజూరు చేసినది.

## కొన్ని గణాంక వివరములు:

| | |
|---|---|
| సంవత్సరాంతమునకు రాష్ట్రములోని గ్రంథాలయాల సంఖ్య. | 2,533 |
| ఈ సంవత్సరము నందు వసూలయిన గ్రంథాలయ సెస్సు. | రూ. 12,28,300 |
| గత సంవత్సరము వసూలయిన సెస్సునకు సమానముగా ప్రభుత్వము మంజూరు చేసిన మొత్తము. | రూ. 11,89,100 |
| ప్రభుత్వము మంజూరుచేసిన ప్రత్యేక గ్రాంట్లు. | రూ. 3,70,500 |
| సంవత్సరాంతమునకు రాష్ట్రమునందలి గ్రంథాలయాలలోని పుస్తకముల సంఖ్య. | 22,32,900 |

ఈ సంవత్సరమునందు కొన్ని సహాయక గ్రంథాలయములందు ఆధునిక పద్ధతులను ప్రవేశ పెట్టుటయేగాక, వీటియందు పాఠకులకు తగు వసతుల కల్పించుట, సాంకేతిక విధానముల నమలు పరచుట, పుస్తక వర్గీకరణ - సూచీకరణల కావించుట మున్నగునవి కూడ సక్రమముగా జరిగినవి. వయోజన విద్యా కార్యక్రమములు మరియు బాలల కార్యక్రమములు జిల్లా శాఖా గ్రంథాలయములందే గాక, గ్రామీణ ప్రాంతములందున్న గ్రంథాలయాలలో కూడ కొన్నింటిలో ప్రవేశ పెట్టబడినవి.

## 1967 - 68 సం॥ నందు జరిగిన ముఖ్యమైన గ్రంథాలయాభివృద్ధి కార్యక్రమములు:

ఈ సంవత్సరము నందు కూడ గ్రంథాలయాల వ్యాప్తికి తగినంతగా కృషి జరిగినది. గ్రామీణ ప్రాంతములలోని కొన్ని గ్రంథా

లయములందు ఆధునిక పద్ధతులను ప్రవేశ పెట్టుటకు ప్రయత్నములు కూడ జరిగినవి.

నల్గొండ, మెదక్, వికారాబాదు, మహబూబ్ నగర్, అనంతపురం, వరంగల్లు, కర్నూలు, నెల్లూరు, విశాఖపట్టణము మున్నగు జిల్లాల లోకల్ లైబ్రరీ అథారిటీలకు గ్రంథాలయాభివృద్ధి మఱియు భవన నిర్మాణముల నిమిత్తము 1.5 లక్షల రూపాయలను మంజూరు చేయడమైనది.



మెదక్ జిల్లా సంగారెడ్డి కేంద్ర గ్రంథాలయ భవనమును ప్రారంభోత్సవము సల్పిన ఆంధ్రప్రదేశ్ గవర్నరు పట్టంథానుపిళ్ళె వారి సతీమణి పొన్నమ్మథానుపిళ్ళెగార్లకు రాష్ట్ర గ్రంథాలయ ప్రగతిని గూర్చి వివరిస్తున్న శ్రీ కె. రాఘవరెడ్డిగారు.

ఆమూలకే గ్రంథముల కొనుగోలుకుగాను రాష్ట్రమునందలి లోకల్ లైబ్రరీ అథారిటీలకు, ప్రాంతీయ గ్రంథాలయములకు రూ. 72,000 లను మంజూరు చేయడమైనది.

లోకల్ లైబ్రరీ అథారిటీల ఆధీనములోని గ్రంథాలయములకు బేగ్రైడ్స్‌ల - షెల్ఫ్‌గ్రైడ్స్‌ల కొనుగోలుకుగాను రూ. 58,000 మంజూరు చేయబడినది.

కృష్ణాజిల్లా లోకల్ లైబ్రరీ అథారిటీ ఫిల్ము ప్రొజెక్టర్‌ను కొనుగోలుచేయు నిమిత్తము రూ. 5,000 లను గ్రాంటుగా ఇవ్వడమైనది.

ఉస్మానియా విశ్వవిద్యాలయమునకు బి. ఎల్. ఎస్.సి. కోర్సునందు శిక్షణ పొందుటకుగాను ఆరుమంది పట్టభద్రులు పంపబడిరి. విజయవాడలో 'ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘము' నిర్వహించు సర్టిఫికేటు కోర్సునకు, హైదరాబాదులో 'ఇన్స్టిట్యూట్ ఆఫ్ లైబ్రరీ సైన్స్' నిర్వహించు సర్టిఫికేటు కోర్సునకు శిక్షణపొందని గ్రంథపాలకులు 30 మంది పంపబడిరి. ఈ సర్టిఫికేటు కోర్సుల నిర్వహణకుగాను హైదరాబాదులోని ఇన్స్టిట్యూట్ ఆఫ్ లైబ్రరీసైన్స్'కు వేయి రూపాయలు, విజయవాడలోని 'ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘము'నకు వేయి రూపాయలు మంజూరు చేయబడినది. బి. ఎల్. ఎస్. సి. కోర్సు నిర్వహణకుగాను ఉస్మానియా విశ్వవిద్యాలయమునకు ప్రభుత్వము రూ. 20,000 లను మంజూరు చేసినది.

ప్రభుత్వము 1,751 సహాయక గ్రంథాలయములకు రూ. 1,70,110 ల గ్రాంటును మంజూరు చేసినది. ప్రభుత్వ సహాయము పొందకుండిన 127 గ్రంథాలయములను ఈ ఏట సహాయక గ్రంథాలయములుగా ప్రకటించుట జరిగినది.

తెలుగు భాషయందలి మతము, వేదాంతము మున్నగు విషయములకు సంబంధించిన పుస్తకములను వర్గీకరించుటకై గత సంవత్సర

మున రూపొందించిన నమూనాలవలె ఈ సంవత్సరము నందు ఉర్దూ భాషా పుస్తకములకు కూడ, ఒక నమూనా రూపొందింప బడినది. మహిళలకు, బాలలకు గ్రంథాలయములయందు వసతులు పెంపొందింప బడినవి.

| | |
|---|---|
| ఈ సంవత్సరమునందు వసూలయిన గ్రంథాలయ సెస్సు. | రూ. 15,10,400 |
| గత సంవత్సరము వసూలయిన గ్రంథాలయ సెస్సుకు సమానముగా ప్రభుత్వము ఈ సంవత్సరము మంజూరు చేసిన మొత్తము. | రూ. 12,65,000 |
| ప్రభుత్వము మంజూరు చేసిన ప్రత్యేక గ్రాంట్లు | రూ. 3,92,900 |
| సంవత్సరాంతమునకు రాష్ట్రములోని పౌర గ్రంథాలయాల సంఖ్య. | 2,809 |

సంవత్సరాంతమునకు రాష్ట్రములోని గ్రంథాలయము లందలి పుస్తకముల సంఖ్య 25,09,300 కు పెరిగినది.

ఈ సంవత్సరమున రాష్ట్రమునందు 10 శాఖా గ్రంథాలయములు, 43 పుస్తక పంపిణీ కేంద్రములు తెరువబడినవి. ఆరు సహాయక గ్రంథాలయములను లోకల్ లైబ్రరీ అథారిటీలు తమ అధీనములోనికి తీసికొని శాఖా గ్రంథాలయములుగా రూపొందించినవి.

మొత్తముమీద గత సంవత్సరముకన్న ఈ సంవత్సరమున గ్రంథాలయాభివృద్ధి తృప్తికరముగా జరిగినదని చెప్పవచ్చును.

## 1968–69 సం॥ నందు జరిగిన ముఖ్యమైన గ్రంథాలయాభివృద్ధి కార్యక్రమములు:

ఈ సంవత్సరమును గ్రంథాలయోద్యమము ముందంజవేసిన సంవత్సరముగా ఘంటాపథముగా పేర్కొన వచ్చును. గ్రంథాలయాభి

వృద్ధికి ప్రభుత్వము గత సంవత్సరములకన్న అధికముగా లోకల్ లైబ్రరీ అథారిటీలకు గ్రాంట్లను మంజూరు చేసినది. చిత్తూరు, శ్రీకాకుళం, హైదరాబాదు జిల్లాల లోకల్ లైబ్రరీ అథారిటీలకు పుస్తకముల మఱియు పరికరముల కొనుగోలుకుగాను రూ. 96,000 లను ప్రభుత్వము మంజూరు చేసినది. అదే ప్రకారము తెలంగాణ ప్రాంతములోని లోకల్ లైబ్రరీ అథారిటీలకు పుస్తకముల, పరికరముల కొనుగోలుకుగాను 1.71 లక్ష రూపాయలను మంజూరు చేసినది.

ఈ సంవత్సరమున తెలంగాణకు మంజూరు చేయబడిన ప్రత్యేక గ్రాంట్లు రూ. 4,22,600 కు పెరిగినది. రాష్ట్రములోని ఏడు లోకల్ లైబ్రరీ అథారిటీలకు భవన నిర్మాణమునకుగాను రూ. 1.05 లక్షల మొత్తమును మంజూరు చేయడమైనది.

ఈ సంవత్సరము ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ సవరణ చట్టము ప్రకారము లోకల్ లైబ్రరీ అథారిటీల మఱియు రాష్ట్ర గ్రంథాలయ కమిటీ సభ్యుల కాలపరిమితి 3 సంవత్సరముల నుండి 5 సంవత్సరముల వఱకు పొడిగించడమైనది. ఈ చట్టప్రకారము జిల్లా కేంద్ర గ్రంథాలయ పుస్తక భాండాగారుల నిరువురిని రాష్ట్ర గ్రంథాలయ కమిటీయందు సభ్యులుగా నియమించడమైనది.

ఆంధ్ర, ఆంగ్ల భాషలందలి ప్రామాణిక గ్రంథ పట్టికలను ముద్రించి, రాష్ట్రములోని అన్ని గ్రంథాలయాలకు పంపుట జరిగినది.

ఈ సంవత్సరము రాష్ట్రములోని 1,580 సహాయక గ్రంథాలయాలకు ప్రభుత్వము 1,76,400 రూ॥లను గ్రాంటు క్రింద మంజూరు చేసినది. అంతేగాక సక్రమముగా పని చేయుచుండిన ఐదు సహాయక గ్రంథాలయములకు 15,000 రూ. లను ప్రత్యేక గ్రాంటు క్రింద మంజూరు చేసినది. ఈ సంవత్సరమునందు 35 శాఖా గ్రంథాలయములు, 21 పుస్తక పంపిణీ కేంద్రములు తెరువబడినవి.

శాఖా గ్రంథాలయములుగా నిర్వహించుటకుగాను రెండు సహాయక గ్రంథాలయములను లోకల్ లైబ్రరీ అథారిటీలు తమ అధీనములోనికి గైకొన్నవి. ప్రభుత్వ సహాయమును పొందని 35 సహాయక గ్రంథాలయములను ప్రభుత్వ గ్రాంటును పొందుట కర్హమైనవిగా ప్రకటించుట జరిగినది. ఈ సంవత్సరమునందు రాష్ట్రమున 4 వేలకు పైగా సహాయక గ్రంథాలయములు ప్రభుత్వ సహాయము లేకనే నిర్వహింపబడు చుండినవి.

ఈ సంవత్సరమున గుంటూరునందు పని చేయుచుండిన యు. ఎస్. ఐ. ఎస్. గ్రంథాలయము ప్రాంతీయ గ్రంథాలయమునకు తరలించ బడినది. ఆ నాటినుండి ఈ యు. ఎస్. ఐ. ఎస్. గ్రంథాలయము ప్రాంతీయ గ్రంథాలయమునందు ప్రత్యేక విభాగముగా పనిచేయు చున్నది.

ఈ సంవత్సరము సైకిల్ రిక్షాల ద్వారా గ్రంథాలయములకు రాలేని వారికి, మహిళలకు తగు పఠన వసతులను కల్పించుట జరిగినది.

నవంబర్ నెల 14 వ తారీఖును జాతీయ గ్రంథాలయోద్యమ దినముగాను, 14 వ తారీఖు నుండి 20 వ తారీఖు వరకు జాతీయ గ్రంథాలయ వారముగాను ప్రకటించడమైనది. అంతేగాక ఈ సంవత్సరమే ప్రప్రథమముగా జాతీయ గ్రంథాలయ దినోత్సవ, వారోత్సవములు జయప్రదముగా నిర్వహించబడినవి.

నాలుగవ పంచవర్ష ప్రణాళికా కాలమున గ్రంథాలయముల అభివృద్ధి కొఱకు 75 లక్షల రూపాయలను మంజూరు చేయవలెనని ప్రభుత్వము తీర్మానించినది.

ఈ సంవత్సరాంతమునకు రాష్ట్రమునందలి పౌర గ్రంథాలయాల సంఖ్య 2,865 కు పెరిగినది. ఈ సంవత్సరమునందు వసూలయిన గ్రంథాలయ సెస్సు రూ. 19,27,500 కాగా, గత సంవత్సర

మున వసూలయిన గ్రంథాలయ సెస్సుకు ప్రభుత్వము మంజూరు చేసిన మొత్తము రూ. 11,76,000. అంతేగాక యీ సంవత్సరమున 4,22,600 రూపాయలను ప్రత్యేక గ్రాంట్ల క్రింద ప్రభుత్వము మంజూరు చేసినది.

గత సంవత్సరమున కన్న ఈ సంవత్సరమున గ్రంథాలయము లలో వయోజన విద్యా కార్యక్రమములు, బాలల కార్యక్రమములు అధికముగా జరిగినవి. గ్రంథాలయముల అభివృద్ధి కూడ చక్కగా జరిగినది. ఈ సంవత్సరమున లోకల్ లైబ్రరీ అథారిటీల సెక్రటరీలు, చైర్మెన్‌లు, గ్రంథాలయాల పుస్తక భాండాగారులు మఱియు సభ్యులు గ్రంథాలయాల అభివృద్ధికి బహు విధముల కృషి చేసిరి.

ఈ విధముగా 1961 సం॥ నుండి 1969 సం॥ వరకు గ్రంథా లయాల అభివృద్ధి ప్రశంసనీయముగా జరిగినది. ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ చట్టము 1960 అమలులోనికి వచ్చిన నాటినుండి గ్రంథ పాలకులలో ఉత్సాహము కూడ పెంపొందినది. ఆనాటి నుండి వీరు మిగుల ప్రోత్సాహకరమయిన గ్రంథాలయ సేవ నందించుచూ వచ్చిరి. లోకల్ లైబ్రరీ అథారిటీల కార్యదర్శులు, చైర్మెన్‌లు కూడ గ్రంథాలయముల అభివృద్ధికి మిగుల ఆసక్తిని కనబరచిరి. ఈ కాలమున గ్రంథాలయముల సంఖ్యతో బాటు, గ్రంథాలయాలలోని పుస్తకముల సంఖ్య, గ్రంథాలయాలకు విచ్చేయు పాఠకుల సంఖ్య, గ్రంథాలయముల నుండి అరువు కొనిపోబడు పుస్తకముల సంఖ్య కూడ వృద్ధి చెందుచూ వచ్చినది. గ్రంథాలయములందు పాఠకులకు తగు వసతుల కూడ పెంపొందించుట జరిగినది. కొన్ని లోకల్ లైబ్రరీ అథారిటీలు ఆర్థికముగా వెనుకబడియున్నప్పటికి, గ్రంథాలయ ముల అభివృద్ధికి మిన్నగా సేవ జేసినవి. ఈ కాలమున పలువుర గ్రంథ పాలకులను ప్రభుత్వ వ్యయముతోను, లోకల్ లైబ్రరీ అథారిటీల

వ్యయముతోను సర్టిఫికేటు, డిప్లొమా, బి.ఎల్. ఎస్.సి కోర్సులకు పంపుటచే, వారు శిక్షణానంతరము గ్రంథాలయాలలో చక్కని సాంకేతిక పద్ధతులను ప్రవేశపెట్టి, ఆధునిక విధానముల నవలంబించి శ్రేయోదాయకమయిన గ్రంథాలయ సేవ గావించిరి.

## 1961 సం॥ నుండి 1969 సం॥ వరకు జరిగిన గ్రంథాలయముల అభివృద్ధి — కొన్ని వివరములు:

| | 31—3—61 నాటికి గ్రంథాలయాల సంఖ్య | 31—3—1969 నాటికి గ్రంథాలయాల సంఖ్య |
|---|---|---|
| (1) రాష్ట్ర కేంద్ర గ్రంథాలయము | 1 | 1 |
| (2) ప్రాంతీయ గ్రంథాలయములు | 1 | 6 |
| (3) సంచార గ్రంథాలయము | 1 | 1 |
| (4) బాలల గ్రంథాలయములు | 11 | 17 |
| (5) జిల్లా కేంద్ర గ్రంథాలయాలు [నగర కేంద్రగ్రంథాలయాలతో కలిపి] | 21 | 21 |
| (6) శాఖా గ్రంథాలయాలు | 209 | 492 |
| (7) పుస్తక పంపిణీ కేంద్రములు | 370 | 528 |
| (8) సహాయక గ్రంథాలయములు | 1061 | 1799 |
| మొత్తము గ్రంథాలయములు | 1675 | 2865 |

పౌర గ్రంథాలయశాఖ డైరెక్టరుగారిచే గుర్తింపబడి ప్రభుత్వ ఆర్థిక సహాయమును పొందలేని గ్రంథాలయముల సంఖ్య 31-3-61 నాటికి 49 యుండినది. ఇటువంటి గ్రంథాలయముల సంఖ్య 31—3—1969 నాటికి 4000 కు పైగా పెరిగినది.

1968-69 సం॥ రాష్ట్రములో అన్ని జిల్లాలయందును సహాయక గ్రంథాలయాలు, ముఖ్యముగా గ్రామీణ ప్రాంతములందలి గ్రంథాలయములు, గ్రంథాలయ కార్యకర్తల మఱియు పుస్తక భాండాగారుల ప్రోత్సాహము వలన ప్రారంభింపబడినవి.

1960—61 సం॥ నాటికి రాష్ట్రమునందలి గ్రంథాలయములందున్నటువంటి పుస్తకముల సంఖ్య 9, 40, 000 కాగా, 1968-69 సంవత్సరము నాటికి వీని సంఖ్య 28,09,300కు చేరినది. అదేవిధముగా గ్రంథాలయాలకు విచ్చేయు పాఠకుల సంఖ్య 1960-61 సం॥ నుండి 1968-69 సంవత్సరము వఱకు రెండింతలకుపైగా పెరిగినది. 1960-61 సంవత్సర కాలమున 1061 సహాయక గ్రంథాలయాలకు 49,000రూ.లు మంజూరుకాగా, 1968-69 సంవత్సర కాలమున 1580 సహాయక గ్రంథాలయాలకు 1,76,400 రూ. లు మంజూరయినది. దీనినిబట్టి 1960-61 — 1968-69 సంవత్సరము మధ్యకాలమున సహాయక గ్రంథాలయాల సంఖ్య, సహాయక గ్రంథాలయాలకు ప్రభుత్వము మంజూరు చేసిన గ్రాంట్లు కూడా వృద్ధిచెందినట్లు గ్రహింప వచ్చును. 1960-61 సం॥ చివరినాటికి రాష్ట్రమునందు 18 మంది డిప్లొమా పట్టభద్రులు, 135 మంది సర్టిఫికేటు కోర్సు శిక్షితులు యుండగా, 1968-69 సం॥ చివరినాటికి డిప్లొమా పట్టభద్రుల సంఖ్య 89 గాను, సర్టిఫికేటు కోర్సు శిక్షణ పొందిన వారి సంఖ్య 317 గాను పెరిగినది.

ఈ కాలమున గ్రంథాలయ భవన నిర్మాణములకు కూడ సందర్భావసరముల పురస్కరించుకొని ప్రభుత్వము ప్రత్యేక గ్రాంట్లను మంజూరుచేయుచూ వచ్చినది. ఈ కాలమున పలు గ్రంథాలయములు అద్దెలేని భవనాలలో కూడ నిర్వహింపబడు చుండినవి. దాదాపు అన్ని గ్రంథాలయములందును పాఠకులకు కావలసిన వసతులను

కల్పించుట జరిగినది. గ్రంథాలయాలలోని పుస్తక భాండాగారులలో ఎక్కువ శాతము శిక్షణ పొందిన వారగుటచే పుస్తక వర్గీకరణ, సూచీకరణల చక్కగా రూపొందించి, తగు పుస్తక సూచీల తయారు చేసి గ్రంథాలయాలలో ఆధునిక విధానములను కూడ అమలు పరచిరి. ఇట్టి అభివృద్ధికి కృషి చేసిన రాఘవరెడ్డిగారు ప్రశంస నీయులు. అందులకే ప్రభుత్వము నుండి పదవీ విరమణులయిన అనంత రము కూడ వీరికి గౌరవాదరములు లభించినవి.



హైదరాబాదులో 1979 సం॥లో జరిగిన ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయాల సమావేశములో శ్రీ కె. రాఘవరెడ్డిగారికి జరిగిన సన్మాన సభలో ఇన్స్టిట్యూట్ ఆఫ్ లైబ్రరీ సైన్స్ ప్రిన్సిపాల్ మిసెస్ లీలా జగన్నాథం ప్రసంగిస్తున్న దృశ్యం. ఈ చిత్రంలో వరుసగా ప్రొఫెసర్ కౌలా, మాజీ ప్రధాన న్యాయమూర్తి శ్రీ ఎక్బోటే, మంత్రి శ్రీ హయగ్రీవాచారి, శ్రీ కె. రాఘవరెడ్డి ఆశీనులైనారు.



సన్మాన సభలో శ్రీ కె. రాఘవరెడ్డిగారికి మెమెంటోను సమర్పిస్తున్నప్పుడు తీసిన ఛాయాచిత్రం. ఈ చిత్రంలో మంత్రి శ్రీ హయగ్రీవాచారి గారిని, మాజీ ప్రధాన న్యాయమూర్తి శ్రీ ఎక్బోటేగారిని కూడ చూడవచ్చును.

మన రాష్ట్రమునందు జరిగిన గ్రంథాలయాభివృద్ధిని గురించి మన దేశములోని విద్యావంతులేగాక, విదేశీ మేధావులు, గ్రంథాలయ శాస్త్రజ్ఞులుకూడ అనేకవిధముల కొనియాడి, యిందులకు కారణభూతులగు రాఘవరెడ్డిగారిని పలువిధముల శ్లాఘించియున్నారు.

ముఖ్యమంత్రిగారైన శ్రీ కె. బ్రహ్మానందరెడ్డిగారు 18—9—1964 తేదీన వికారాబాద్‌నందు, జిల్లా కేంద్ర గ్రంథాలయ భవనమునకు ప్రారంభోత్సవము చేయు సమయమున శ్రీ రాఘవరెడ్డిగారిని ప్రశంసిస్తూ

"Library movement in Andhra Pradesh is in the forefront in the Country" అని శ్లాఘించిరి.

దేశమునందు గ్రంథాలయాల గురించి ప్రచురించబడు పత్రికలలో అఖిల భారత గ్రంథాలయ సంఘముచే నిర్వహించబడు పత్రిక

అత్యున్నతమైనటువంటిది. ఈ అఖిల భారత గ్రంథాలయ సంఘము వారు 1967 సం॥ డిసెంబర్ పత్రికలో సంపాదకీయమునందు ఈ క్రింది విధముగా రాఘవరెడ్డిగారి ఘనతను కొనియాడిరి.

" There is the work of Raghava Reddy in Andhra Pradesh who has quietly brought up his state into the leading Position among the States with a Public Library System "

ప్రభుత్వము గ్రంథాలయములకు తగినంతగా గ్రాంట్లను మంజూరు చేయక పోయినప్పటికి, ఉన్నంతలోనే గ్రంథాలయములను అభివృద్ధి పఱచి రాష్ట్రమునకు మొనలేని ఘనతను తెచ్చిపెట్టిన రాఘవరెడ్డిగారి గ్రంథాలయ సేవ ప్రశంసనీయము.

దేశమునందలి గ్రంథాలయ శాస్త్రవేత్తలలో ప్రముఖులయిన శ్రీ డి. ఆర్. కాలియాగారు ఆంధ్రప్రదేశ్‌లోని గ్రంథాలయాల సందర్శన నిమిత్తము 1967వ సం॥ విచ్చేసిరి. వీరు యునెస్కో నిపుణులు. మఱియు దేశములోని వివిధ రాష్ట్రములయందలి గ్రంథాలయాల అభివృద్ధిని గురించి చక్కగా నెఱిగిన వారేగాక, అఖిల భారత గ్రంథాలయ సంఘమునకు అధ్యక్షులుగా కూడ నుండిరి. వీరు 1967వ సం॥ సెప్టెంబర్ 25, 26, 27 తేదీలలో ఆంధ్రప్రదేశ్‌లోని కొన్ని గ్రంథాలయాలను సందర్శించిరి. వీరు సెప్టెంబర్ 27 వ తేదీన హైదరాబాదులోని రాష్ట్ర కేంద్ర గ్రంథాలయాన నిర్వహింపబడిన గ్రంథ పాలకుల సమావేశమున రాష్ట్రమునందలి గ్రంథాలయోద్యమమును, గ్రంథాలయాలలో అవలంబించబడుచున్న నవీన పద్ధతులను, గ్రంథాలయాల అభివృద్ధిని, రాఘవరెడ్డిగారి కృషిని బహు విధముల శ్లాఘించుచూ,

" What Andhra Pradesh has done Today in the field of Libraries, the rest of the Country is going to do tomorrow " అని నుడివిరి.

హైదరాబాదు నగర కేంద్ర గ్రంథాలయ భవనమునకు 9—10—1969 న శ్రీ వి. వి. గిరిగారు శంకు స్థాపన గావించు

సమయమున ఆనాటి విద్యాశాఖ మంత్రిగారైన శ్రీ పి. వి. నరసింహారావుగారు గ్రంథాలయాల చట్టము రూపొందింపబడుటకు, అమలు పరచుటకు, గ్రంథాలయాల అభివృద్ధికి శాయశక్తుల కృషి చేసిన రాఘవరెడ్డిగారిని పలువిధముల శ్లాఘిస్తూ:-

"Mr. Raghava Reddy had laid a firm foundation to the Library movement in the State"

అని ప్రస్తుతించిరి.

వీరి సేవలు ప్రభుత్వ గుర్తింపును కూడ పొందినవి. సాధారణముగా 30 సం॥ల ప్రభుత్వసేవ కావించినవారు తప్ప, యితరులు పూర్తి పింఛనుకు అర్హులు కారు. రాఘవరెడ్డిగారు కొంత కాలము మదరాసులోని విద్యా సంస్థలలో పని చేసి, తదనంతరము ప్రభుత్వ పదవీ బాధ్యతల స్వీకరించిన వారగుట వలన వారి పదవీ వయో పరిమితి ముగియునాటికి, వారు ప్రభుత్వ పదవియందు పని చేసిన కాలము 30 సం॥ల కన్న లోపుగా యుండినది. కాన వీరికి తొలుత పూర్తి పింఛను మంజూరు కాకపోయినది. కాని వీరు తాము మదరాసులోని విద్యా సంస్థలలో పని చేసిన కాలమును గూడ గణన లోనికి గైకొనవలసినదిగా ప్రభుత్వమును కోరగా ప్రభుత్వ మందుల కంగీకరించి, వీరి గ్రంథాలయోద్యమ సేవా ఘనతను గుర్తించి 1969 సెప్టెంబర్ మాసమున ఈ క్రింది విధముగా తెలియ జేసినది.

"In view of the contribution made by Sri K. RAGHAVA REDDY in building up the Library movement in the State, Government direct that the temporary Service rendered by Sri K. RAGHAVA REDDY in the above institutions in Madras be treated as qualifying Service as a Special Case"

ఈ విధముగా సేవా ఘనతల గుర్తింపును పొంది ప్రభుత్వముచే కొనియాడబడినవారు కొందరే. అట్టి వారిలో రాఘవరెడ్డిగారొకరగుట మిగుల గర్వకారణము.



# పంచవర్ష ప్రణాళికలు - గ్రంథాలయాల అభివృద్ధి:

## కేంద్రప్రభుత్వము రాష్ట్రప్రభుత్వాలకు సూచించిన రెండు ముఖ్య గ్రంథాలయ పథకములు :

ప్రథమ పంచవర్ష ప్రణాళిక ప్రారంభ కాలము నాటికి (అనగా 31—3—1951 నాటికి) అవిభక్త మదరాసు రాష్ట్రమునందు జిల్లా కేంద్ర గ్రంథాలయములు కాని, శాఖా గ్రంథాలయములు కాని, పుస్తక పంపిణీ కేంద్రములు కాని లేకుండినవి. మదరాసు నగరమందు కన్నెమారా గ్రంథాలయ ముండినది. సహాయక గ్రంథాలయములు నగరమునందును, జిల్లాలయందును ఉండినవి.

పౌర గ్రంథాలయముల అభివృద్ధికి యీ క్రింది రెండు పథకములను సిద్ధముచేసి, వాని నమలు పరచుటకు గ్రాంట్లు మంజూరు చేయబడునని, మొదటి పంచవర్ష ప్రణాళికాకాల ప్రారంభమున కేంద్ర ప్రభుత్వము రాష్ట్ర ప్రభుత్వములకు తెలియజేసినది.

1. వెనుకబడిన ఒక ప్రాంతమునందు నిరక్షరాస్యులకు, అక్షరాస్యతను కల్పించు నిమిత్తము మఱియు విద్యనభివృద్ధి చేయు ధ్యేయముతోను ఒక గ్రంథాలయమును స్థాపించి, పరిసర ప్రాంతములకు సైకిళ్ళ ద్వారా పుస్తకముల పంపిణీ చేయుచు విద్యాభివృద్ధికి తోడ్పడవలయును.

2. ప్రతి రాష్ట్రమునందును ఒక రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమును, జిల్లా కేంద్ర గ్రంథాలయములను స్థాపించి, వాటి ద్వారా ప్రజలకు పుస్తకముల పంపిణీ చేయవలెను.

ఈ రెండు పథకముల నమలు పరచుటకగు ఖర్చును కేంద్ర ప్రభుత్వముతోపాటు, రాష్ట్ర ప్రభుత్వము కూడ కొంతవరకు భరించవలెనని కేంద్ర ప్రభుత్వము తెలియజేసినది.

ఈ రెండు పథకములలో రెండవ పథకమున కధిక ప్రాధాన్యత నిచ్చియుండిన, సముచితముగా నుండెడిదని రాఘవరెడ్డి గారి అభిప్రాయము. ఈపథకముల నమలుపఱచుటకు వెనుకబడిన కొన్ని ప్రాంతములందు స్థాపించబడిన గ్రంథాలయములలో ఆనాడు శిక్షణ పొందిన గ్రంథపాలకులు లేకుండిరి. శిక్షణ పొందిన గ్రంథపాలకులు లేనందువలన గ్రంథాలయ సేవ సక్రమముగా జరుగుటకు వీలులేక పోయినది. కావున ఆ ప్రాంతమునందు అనుకున్నంత విద్యాభివృద్ధి జరుగలేదని రాఘవరెడ్డిగారు అభిప్రాయపడిరి. ఈ అభిప్రాయముతో పలువురు గ్రంథపాలకులు ఏకీభవించిరి. సాంఘిక సంక్షేమ అధికారులు, తదితరులు ఈ గ్రంథాలయముల నిర్వహణా బాధ్యతల కల్గియుండిరి.

## ప్రథమ పంచవర్ష ప్రణాళికా కాలమున విద్యాశాఖచే గ్రంథాలయాల అజమాయిషీ:

అవిభక్త మదరాసు రాష్ట్రమునందు విద్యాశాఖకు చెందిన అధికారులే గ్రంథాలయముల అజమాయిషీ బాధ్యత వహించుచుండిరి. గ్రంథాలయాభివృద్ధికి కూడ వీరే ప్రణాళికలను తయారుచేయుచుండిరి. వీరు విద్యాలయములకే ప్రాముఖ్యతను చూపుచు పంచవర్ష ప్రణాళికల మూలమున ప్రభుత్వముచే మంజూరగు గ్రాంట్లలో ఎక్కువ భాగమును విద్యాలయముల యభివృద్ధికే వినియోగించుకొనుచుండిరి. గ్రంథాలయ శాఖకు మంజూరు చేయు గ్రాంట్లు నామమాత్రముగానే యుండినవి. గ్రంథాలయ శాస్త్రమునందు శిక్షణ పొందినటువంటి వారే గ్రంథాలయ నిర్వహణాధికారులుగా నుండిన గ్రంథాలయములకు ప్రణాళికల మూలమున తగు గ్రాంట్లు మంజూరై యుండెడివి. ఇంగ్లండులో శిక్షణ

పొందినటువంటి శ్రీ జనార్దనంనాయుడుగారు గ్రంథాలయములకు ప్రత్యేకాధికారిగాకొంతకాలముండిరి. వారుప్రత్యేకాధికారిగా నుండిన కాలమునందు మాత్రము గ్రంథాలయములు కొంతవరకు మెరుగుపడు అవకాశములు కన్పించినవి. కాని తిరిగి వారి అనంతరము గ్రంథాలయముల అభివృద్ధి బాధ్యత విద్యాశాఖాధికారులపై బడినది.

## గ్రంథాలయ శాఖకు విద్యాశాఖ కేటాయించిన నామమాత్రపు బడ్జెటు :

1953 వరకు విద్యాశాఖాధికారులే గ్రంథాలయ నిర్వహణాధికారులుగా నుండిరి. ఆంధ్రరాష్ట్ర అవతరణానంతరము గ్రంథాలయ శాస్త్రమునందు శిక్షితులు. గ్రంథాలయ నిర్వహణానుభవము గడించిన రాఘవరెడ్డిగారిని ప్రభుత్వము గ్రంథాలయముల ప్రత్యేకాధికారిగా నియమించినది. వారు ప్రత్యేక అధికారిగా నున్నపుడు, సహాయక గ్రంథాలయముల నిర్వహణాధికారులయిన విద్యాశాఖాధికారులు రాఘవరెడ్డిగారి సాంకేతిక సలహాల నామోదించు చుండిరి. రాఘవరెడ్డిగారు పట్టుదల వహించుటవలన,గ్రంథాలయముల అభివృద్ధి నిమిత్తము విద్యాశాఖవారు కొంత గ్రాంటును మాత్రము మంజూరు చేయుచుండిరి.

1952-53 సం॥ నందు, మదరాసు రాష్ట్ర పౌర గ్రంథాలయ చట్టము 1948 ప్రకారము, వసూలయిన గ్రంథాలయ సెస్సు, మఱియు అందులకు సమానముగా ప్రభుత్వము మంజూరు చేసిన పైకముతో ఆంధ్ర ప్రాంతమునందు పదకొండు జిల్లా కేంద్ర గ్రంథాలయములను స్థాపించుటకు ప్రయత్నము జరిగినది. కొంత కాలమునకు 1953 సం॥ నందే 11 జిల్లా కేంద్ర గ్రంథాలయములనేగాక 5 శాఖా గ్రంథాలయములను కూడ స్థాపించగల్గిరి.

## ప్రథమ పంచవర్ష ప్రణాళిక బడ్జెటు ద్వారా రాష్ట్ర కేంద్ర గ్రంథాలయ స్థాపన :

1953 సం॥ ఆంధ్రరాష్ట్రము అవతరించిన పిదప, రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమును స్థాపించవలసిన అవసర మేర్పడినది. ఇందులకగు వ్యయమును కేంద్ర ప్రభుత్వము మొదట పంచవర్ష ప్రణాళిక ద్వారా మంజూరు చేసినది. ఈ మొత్తములో విశాఖపట్టణమునందు ఆంధ్ర రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమును స్థాపించడము జరిగినది.

## తెలంగాణ ప్రాంతమునకు ప్రథమ పంచవర్ష ప్రణాళిక నిధులు కేటాయింప బడలేదు :

ప్రథమ పంచవర్ష ప్రణాళికా కాలమున తెలంగాణ ప్రాంతము నందు జిల్లా కేంద్ర గ్రంథాలయముల స్థాపన జరుగలేదు. ఆంధ్ర ప్రాంతమునందువలె తెలంగాణ ప్రాంతమునందును విద్యాశాఖాధి కారులే గ్రంథాలయ నిర్వహణా బాధ్యతల కల్గియుండుట వలనను, తెలంగాణ ప్రాంతమునందు గ్రంథాలయ సెస్సు 55-56 సం॥ సరిగా వసూలు కాకపోవుట వలనను, కేంద్ర ప్రభుత్వము యొక్క ఆర్థిక సహాయము లేకపోవుటచేతను, మొదట పంచవర్ష ప్రణాళికా కాల మున గ్రంథాలయముల స్థాపన లేకపోయినది.

మొదట పంచవర్ష ప్రణాళికా కాలమునందు తెలంగాణ ప్రాంతమునందు ప్రభుత్వాధీనములోని అసఫియా గ్రంథాలయము, పబ్లిక్ గార్డన్స్‌లోని బాలల గ్రంథాలయము, మఱియు 52 సహాయక గ్రంథాలయములు మాత్రమే యుండినవి. జిల్లా కేంద్ర గ్రంథాలయ ములుగాని, శాఖా గ్రంథాలయములు కాని, పుస్తక పంపిణీ కేంద్ర ములు కాని అనాటికి ప్రారంభింపబడి యుండలేదు.

ప్రథమ పంచవర్ష ప్రణాళికా బడ్జెట్‌నందు ఆంధ్ర ప్రాంతము లోని గ్రంథాలయాల అభివృద్ధికి కేటాయించబడిన నిధులు రాష్ట్ర కేంద్ర గ్రంథాలయ స్థాపనకే గాక, దృశ్య శ్రవణ పరికరములను గ్రంథాలయాలకు పంపిణీ చేయుటకు, సహాయక గ్రంథాలయాల అభివృద్ధికి, మున్నగు వాటికి కొంతవరకు తోడ్పడినవి. లోకల్ లైబ్రరీ అథారిటీలకు వసూలు అయిన లైబ్రరీ సెస్సు, అందుకు సమానమైన ప్రభుత్వ గ్రాంటులతో మిగత అభివృద్ధి కార్యక్రమముల చేపట్టడము జరిగినది.

## ద్వితీయ పంచవర్ష ప్రణాళిక (1956—61) కాలమునందు గ్రంథాలయ శాఖపై విద్యాశాఖ అజమాయిషీ:

రెండవ పంచవర్ష ప్రణాళికా కాలమునందు రాఘవరెడ్డిగారు కొంతకాలము గ్రంథాలయ శాఖకు ప్రత్యేకాధికారిగాను, కొంత కాలము డిప్యూటీ డైరెక్టరుగాను వుండిరి. ఈ కాలమునందు కూడ గ్రంథాలయ ప్రణాళికా రూపకల్పన బాధ్యతలను విద్యాశాఖాధి కారులే కల్గియుండిరి. వీరు విద్యాశాఖకే ఎక్కువ ప్రాముఖ్యత నిచ్చి గ్రంథాలయముల అభివృద్ధికి తగు నిధులను కేటాయించ లేదు. కాన ప్రభుత్వమే గ్రంథాలయములకు ప్రత్యేకముగా గ్రాంట్లను మంజూరు చేసి యుండిన బాగుండెడిది.

## ద్వితీయ పంచవర్ష ప్రణాళికా నిధుల ద్వారా తెలంగాణాలో జిల్లా కేంద్ర గ్రంథాలయాల, శాఖా గ్రంథాలయాల స్థాపన:

ఆంధ్ర ప్రాంతమునందు వలెనే తెలంగాణా ప్రాంతమునందు కూడ జిల్లా కేంద్ర గ్రంథాలయములను, శాఖా గ్రంథాలయములను స్థాపించవలెనని రాఘవరెడ్డిగారి ఆకాంక్ష. కాని హైదరాబాదు పౌర గ్రంథాలయ చట్ట ప్రకారము వసూలగు గ్రంథాలయ సెస్సు, అందులకు ప్రభుత్వము సమానముగ మంజూరు చేయు గ్రాంట్లు నామ

మాత్రముగానే యుండినవి. కాన తెలంగాణా ప్రాంతములో లోకల్ లైబ్రరీ అథారిటీలు గ్రంథాలయములను స్థాపించలేక పోయినవి. కాన జిల్లా కేంద్ర గ్రంథాలయముల స్థాపన బాధ్యత గ్రంథాలయ శాఖ పై బడినది. రాఘవరెడ్డిగారు, మంత్రిగారైన శ్రీ చెన్నారెడ్డి గారిని, ఆర్థికశాఖ సెక్రటరీ గారైన శ్రీ అబ్బాసీ గారిని కలిసి ఆంధ్ర ప్రాంతము నందువలె తెలంగాణా ప్రాంతము నందును, జిల్లా కేంద్ర గ్రంథాలయములు, శాఖా గ్రంథాలయములు స్థాపించ వలసిన ఆవశ్యకతను వివరించగా, వారు రాఘవరెడ్డిగారి అభిప్రాయముతో ఏకీభవించి, గ్రంథాలయముల స్థాపన కొఱకై తగిన ఆర్థిక సహాయము చేయించిరి. ఈ మొత్తముతో హైదరాబాదు నగరమునకు ప్రత్యేకంగా నగర కేంద్ర గ్రంథాలయముతో పాటు, తెలంగాణాలో తొమ్మిది జిల్లా కేంద్ర గ్రంథాలయములు ఏర్పాటు చేయడమైనది. హైదరాబాదు జిల్లాలో మాత్రము జిల్లా కేంద్ర గ్రంథాలయమును, వికారాబాదునందు ఏర్పాటు చేయడమైనది.

ఈ విధముగా అనుకున్న ప్రకారము గ్రంథాలయముల స్థాపన జరిగినను, ఆనాడు గ్రంథాలయ శాస్త్రమునందు శిక్షణ పొందినవారు లేకుండిరి. ఇందులకై డిప్యూటీ డైరెక్టరు ప్రత్యేక శ్రద్ధను గైకొని, పదుగురిని ఉస్మానియా విశ్వవిద్యాలయమునకు శిక్షణకు పంపి, అనంతరము కేంద్ర గ్రంథాలయములందు గ్రంథపాలకులుగా నియమించిరి. పిదప మంత్రి చెన్నారెడ్డిగారు, ఆర్థిక శాఖ కార్యదర్శి అబ్బాసీ గారల తోడ్పాటుతో శాఖా గ్రంథాలయములను స్థాపించడము జరిగినది. ఉస్మానియా విశ్వవిద్యాలయమునందు కొందరిని సర్టిఫికేటు కోర్సులో శిక్షితుల జేసి, శాఖా గ్రంథాలయములలో గ్రంథ పాలకులుగా నియమించడం జరిగినది.

పై జిల్లా కేంద్ర, శాఖా గ్రంథాలయములకు కావలసిన ఫర్నీచర్, పుస్తకముల కొనుగోలుకుగాను, 1,54,800 రూపాయల మొత్త

ము:ను ఫిబ్రవరి 1958 వ సం॥ ప్రభుత్వము లోకల్ లైబ్రరీ అథారిటీ లకు మంజూరు చేసినది.

రెండవ పంచవర్ష ప్రణాళికా కాలమున హైదరాబాదు పౌర గ్రంథాలయ చట్టము 1955 తెలంగాణ ప్రాంతమునందే గాక కర్నాటక, మరఠ్వాడ ప్రాంతములందు కూడ అమలులో నుండినది. అయినప్పటికి కర్నాటక, మరఠ్వాడ ప్రాంతములయందు జిల్లా కేంద్ర గ్రంథాలయముల స్థాపనగాని, శాఖా గ్రంథాలయముల స్థాపనగాని 1959 నాటికి కూడ జరుగలేదు. ఇందులకు గ్రంథాలయ సెస్సు వసూలు సక్రమముగా జరుగక పోవుట ప్రధాన కారణముగా చెప్ప వచ్చును మరఠ్వాడ, కర్నాటక ప్రాంతములనుండి తెలంగాణ ప్రాంతమునకు విచ్చేసిన పలువురు గ్రంథపాలకులు తెలంగాణ ప్రాంతమునందు గ్రంథాలయ స్థాపనా కార్యక్రమముల గురించి మిగుల సంతసించి, యిందులకై బహు విధముల కృషి సల్పిన రాఘవరెడ్డి గారిని శ్లాఘించిరి.

ఆంధ్రప్రదేశ్ అవతరణానంతరము, హైదరాబాదు పౌర గ్రంథాలయ చట్టము 1955, మదరాసు పౌర గ్రంథాలయ చట్టము 1948, యీ రెంటిని విలీనముచేసి, ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ చట్టము 1960 గా రూపొందించి, రెండవ పంచవర్ష ప్రణాళికా కాలమునందు అమలు జరుపుట గుర్తించవలసిన విషయము. రెండవ పంచవర్ష ప్రణాళికా కాలముననే (ఆంధ్రప్రదేశ్ అవతరణానంతరము) అసఫియా గ్రంథాలయమును, ఆంధ్రప్రదేశ్ కేంద్ర గ్రంథాలయముగాను, ఆంధ్రప్రాంతములోని విశాఖపట్టణమునుండి గుంటూరుకు తరలింపబడిన ఆంధ్రరాష్ట్ర కేంద్ర గ్రంథాలయమును, రాష్ట్ర ప్రభుత్వ ప్రాంతీయ గ్రంథాలయముగాను ప్రకటించడము జరిగినది. ఈ రెండవ పంచవర్ష ప్రణాళికాకాలమున జరిగిన గ్రంథాలయాభివృద్ధి కార్యక్రమములకు రాఘవరెడ్డి మరియు గ్రంథాలయోద్యమ

కార్యకర్తల, గ్రంథ పాలకుల కృషి గణనీయమైనది. గ్రంథాలయ శాఖను ప్రత్యేక డిపార్టు మెంటుగా గుర్తింపబడుటకు వీరి కృషి కూడ కారణము.

## గ్రంథాలయాల నిర్మాణ, నిర్వహణలపై ప్రముఖ గ్రంథాలయ శాస్త్రవేత్త, సాంఘిక శాస్త్రవేత్తయైన టి. ఏ. కోషిగారి ప్రశంస:

రెండవ పంచవర్ష ప్రణాళిక కడపట, మూడవ పంచవర్ష ప్రణాళిక ప్రారంభ కాలమున ప్రణాళికా కమిషన్ మఱియు కేంద్ర ప్రభుత్వము కలసి గ్రంథాలయములు 'పనిచేయు తీరుతెన్నుల పరిశీలించు నిమిత్తమొక పరిశీలన కమిటీని నియమించినది. ఈ కమిటీ సభ్యులు 15-10-1962 న వరంగల్లునకు విచ్చేసిరి. వీరు రాష్ట్రము నందలి పౌర గ్రంథాలయముల నిర్వహణను చక్కగా పరిశీలించి, ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయములు అనుసరించుచున్న నవీన పద్ధతుల గురించి మిగుల ప్రశంసించిరి. ఈ కమిటీ అధ్యక్షులయిన టి. ఎ. కోషి గారు దేశమునందలి సాంఘిక విద్యావేత్తలలో ప్రసిద్ధికెక్కిన వారు. గ్రంథాలయ నిర్మాణ, నిర్వహణలయందుకూడ గొప్ప అనుభవమును గడించినవారు. వీరు ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయముల నిర్వహణా పరిశీలన సందర్భమున,

" Library organisation in Andhra Pradesh is very Commendable " అని శ్లాఘించి, ఆంధ్రప్రదేశ్ నందు గ్రంథాలయము లభివృద్ధి చెందుటకు ప్రధాన పాత్ర వహించిన వారిని మిగుల కొనియాడిరి. ఆనాడు వామనరావుగారు గ్రంథాలయ శాఖ డైరెక్టరుగా నుండిరి. వీరు రామ్‌లాల్ గారివలె గొప్ప విద్యావంతులు, ఉత్తములు. పరిశీలన కమిటీవారు ఆంధ్రప్రదేశ్ నందలి గ్రంథాలయా నిర్వహణ తీరుతెన్నుల గురించి శ్లాఘించిన విషయములను గ్రహించి, వీరు ఆంధ్రప్రదేశ్ నందు గ్రంథాలయములు అభివృద్ధి పథము

నధిరోహించుటకు ప్రధాన పాత్ర వహించినటువంటి రాఘవ రెడ్డిగారి కృషిని ప్రశంసించిరి.

ద్వితీయ పంచవర్ష ప్రణాళికా బడ్జెట్ నందు తెలంగాణ ప్రాంత గ్రంథాలయములకు కేటాయించబడిన నిధులు జిల్లా కేంద్ర గ్రంథాలయములను, శాఖా గ్రంథాలయములను స్థాపించుటకును, గ్రంథ పాలకులను శిక్షణకు పంపుటకును మిగుల తోడ్పడినవి. ఆంధ్ర ప్రాంతమునకు కేటాయించబడిన నిధులు ఏలూరునం దొక సంచార గ్రంథాలయమును స్థాపించుటకు, ప్రభుత్వ ప్రాంతీయ గ్రంథాలయముల, ఇతర పౌర గ్రంథాలయముల అభివృద్ధికి, గ్రంథపాలకులను శిక్షణకు పంపుటకు, కొన్ని గ్రంథాలయములకు దృశ్య-శ్రవణ సాధనములను పంపిణీ చేయుటకు కొంతవరకు తోడ్పడినవి. రాష్ట్రములో జరిగిన యితరమైన గ్రంథాలయాభివృద్ధి కార్యక్రమములు, గ్రంథాలయ సెస్సు, సెస్సునకు ప్రభుత్వము మంజూరు చేసిన సమాన గ్రాంట్ల వలననే అధికముగా జరుగుటకు వీలుపడినది.

## మూడవ పంచవర్ష ప్రణాళిక 1961–66 గ్రంథాలయాలకు విద్యాశాఖచే నామమాత్రపు బడ్జెటు కేటాయింపు:

ఒక సంవత్సరమునకు రెండు లక్షల చొప్పున ఐదు సంవత్సరములకు పదిలక్షల రూపాయలు నామమాత్రపు మొత్తమును మూడవ పంచవర్ష ప్రణాళికా కాలమున గ్రంథాలయముల అభివృద్ధికి కేటాయించడము జరిగినది. మూడవ పంచవర్ష ప్రణాళికా కాలమున జరిగిన చైనా దాడి కారణమున 1963 - 64 సం॥లో గ్రంథాలయముల అభివృద్ధికి కేటాయించబడిన రెండేసి లక్షల మొత్తమును కూడ తగ్గించడం జరిగినది. కాని మూడవ పంచవర్ష ప్రణాళికా కాలమున విద్యా శాఖాభివృద్ధి పథకములకు కేటాయించ బడినటువంటి మొత్తమును సంపూర్ణముగా వినియోగ పరచుట జరుగక పోవుటచే, మిగి

లిన మొత్తములో కొంత భాగమును గ్రంథాలయముల అభివృద్ధికి తరలించిరి. ఈ విధముగా తరలించుట వలన మూడవ పంచవర్ష ప్రణాళికా కాలమున గ్రంథాలయముల అభివృద్ధికి కేటాయించబడి నటువంటి మొత్తము రూ. 8.08 లక్షలకు చేరినది. మూడవ పంచవర్ష ప్రణాళి కారంభ కాలమునకు మునుపటి నుండియే గ్రంథాలయాభి వృద్ధి పథకముల రూపొందించి, వాటి అమలుకు చర్యగై కొనబడుటచే ఈ మొత్తమును పూర్తిగా వినియోగించడము జరిగినది.

మూడవ పంచవర్ష ప్రణాళికద్వారా గ్రంథాలయముల అభివృద్ధికి మంజూరయిన గ్రాంటు పరిమిత మయినప్పటికిని, ఈ కాలమున గ్రంథాలయ సెస్సు వసూలు మెఱుగు పడుటవలనను, సెస్సుకు సమాన మొత్తమును ప్రభుత్వముమంజూరు చేయుటచేతను, ఈప్రణాళికా కాలమున గ్రంథాలయముల సంఖ్య పెరుగుటయే గాక, గ్రంథాలయములు పాఠకులకు కల్గించెడి సదుపాయములు కూడ మెరుగైనవి. గ్రంథాలయములలో పాఠకుల సంఖ్య, పుస్తకముల సంఖ్య కూడ పెరిగినది. గ్రామీణ గ్రంథాలయములలో కూడ తగు వసతులు కల్పించడము జరిగినది. తెలంగాణ ప్రాంతమునందు గ్రంథాలయ సెస్సు వసూలు తగినంతగా కాకపోవుట వలన పుస్తకములు, ఫర్నిచర్ల కొనుగోలు నిమిత్తము రూ. 1,90,500 ప్రత్యేక గ్రాంటుగా ప్రభుత్వము మంజూరు చేసినది. రెండవ పంచవర్ష ప్రణాళికా కాలమున ప్రవేశ పెట్టబడిన ఆధునిక పద్ధతులలో నిర్వహణాభివృద్ధులకు కూడ ఈ మూడవ పంచవర్ష ప్రణాళికా కాలమున పలు తెరగుల ప్రయత్నములు జరిగినవి. పలు శాఖా గ్రంథాలయములందు వయోజన విద్యా కార్యక్రమముల నిర్వహించడమేగాక, తెరువబడిన బీరువాలయందు పుస్తకముల నమర్చు విధానమును కూడ ప్రవేశ పెట్టడము జరిగినది.

ఈ విధముగా మూడవ పంచవర్ష ప్రణాళికా కాలమున గ్రంథాలయముల సంఖ్య, పుస్తకముల సంఖ్య, పాఠకుల సంఖ్య కూడ పెరిగినది. ఆధునిక పద్ధతులను గ్రంథాలయములందు ప్రవేశ పెట్టడము కూడ కొంతవరకు జరిగినది. మూడవ పంచ వర్ష ప్రణాళికా కాలము యొక్క అంతమున (31—3—1966 కు) రాష్ట్రమునందు 21 జిల్లా కేంద్ర గ్రంథాలయములు, 1876 సహాయక గ్రంథాలయములు, 390 శాఖా గ్రంథాలయములు, 450 పుస్తక పంపిణీ కేంద్రములు పని చేయు చుండినవి.



26—11—1966 న పలు విద్యాలయాల వ్యవస్థాపకులైన శ్రీభగవాన్ సత్యసాయి బాబాగారి సహాయమున వారిచే బుక్కపట్టణమున శాఖాగ్రంథాలయము ప్రారంభింప బడిన సమయమున తీసిన ఛాయా చిత్రము.

ప్రథమ, ద్వితీయ పంచవర్ష ప్రణాళికల కాలము వలెనే, మూడవ పంచవర్ష ప్రణాళికా కాలమున కేటాయించబడిన గ్రాంట్లు గ్రంథ పాలకులను గ్రంథాలయ శాస్త్ర శిక్షణకు పంపుటకు, రాష్ట్ర కేంద్ర గ్రంథాలయముల, ప్రభుత్వ పౌర గ్రంథాలయముల మఱియు ఇతర పౌర గ్రంథాలయముల అభివృద్ధికి, గ్రంథాలయ భవన నిర్మాణ ములకు మున్నగు వాటికి కొంతవరకు తోడ్పడినవి.

★

# నాలుగవ పంచవర్ష ప్రణాళిక 1969 - 74

## సాంకేతిక నైపుణ్యముగల రాఘవరెడ్డిగారిచే గ్రంథాలయాల అభివృద్ధికి రూపొందింపబడిన చతుర్థ పంచవర్ష ప్రణాళిక :

మూడవ పంచవర్ష ప్రణాళికా కాలము వరకు గ్రంథాలయాభివృద్ధికి సంబంధించిన ప్రణాళికలను విద్యాశాఖాధికారులే రూపొందించుచుండిరి. గ్రంథాలయ శాఖను ప్రత్యేక శాఖగా పరిగణించుటచే, గ్రంథాలయాభివృద్ధి ప్రణాళికల రూపొందించు బాధ్యతలు గ్రంథాలయ శాఖ డిప్యూటీ డైరెక్టరుగారికి అప్పగించడము జరిగినది. నాలుగవ పంచవర్ష ప్రణాళికా కాలమున రాఘవరెడ్డిగారు గ్రంథాలయముల అభివృద్ధికి చక్కని ప్రణాళికల రూపొందించిరి. గ్రామీణ ప్రాంతములలో అధిక సంఖ్యలో గ్రంథాలయముల స్థాపింప వలెననియు, ఉన్నటువంటి గ్రంథాలయములందు మరింత సార్థకమైన గ్రంథ సేవ కల్పించ వలెనను తలంపుతోను గ్రంథాలయ ప్రణాళికను తీర్చిదిద్దిరి. వారు రూపొందించిన ప్రణాళికా పథకముల అమలునకు ప్రభుత్వము రూ 85.36 లక్షల మొత్తమును గ్రంథాలయ శాఖకు మంజూరు చేయవలయును. కాని ఇంతటి మొత్తము కేటాయించుటకు విద్యాశాఖవారు సుముఖులుగా లేకుండిరి. అయినప్పటికి విద్యాశాఖ మంత్రిగారైన శ్రీ పి. వి. నరసింహారావుగారు మఱియు సెక్రటరీ శ్రీ ఎన్. రమేశన్‌గారు గ్రంథాలయముల ప్రగతికి ఈ మొత్తమును తప్పనిసరిగా మంజూరు చేయవలయునని సూచించిరి. 6—5—1967 న జరిగిన రాష్ట్ర కేంద్ర గ్రంథాలయ కమిటి సమావేశము నందు గ్రంథాలయాభివృద్ధికి ప్రభుత్వము మంజూరు చేయవలసిన గ్రాంటును గురించి, పలువిధములయిన చర్చలు జరిపి రూ. 85.36 లక్షలను ఏమాత్రము తక్కువ కాకూడదని తీర్మానించిరి. ఈ సమావేశమునకు అధ్యక్షత వహించిన విద్యాశాఖ మంత్రి శ్రీ పి. వి. నర

సింహారావుగారు కూడ ఎటువంటి పరిస్థితులలోను ఈ మొత్తమును తగ్గించరాదని, సంవత్సరమునకు మంజూరుచేయు 15 లక్షల మొత్తము కూడ స్వల్పమేయని సూచించిరి. 20-4-1965 న ప్రణాళికా సంఘము వారు గ్రామీణ ప్రాంతములయందు కూడ గ్రంథాలయముల స్థాపన కెక్కువ ప్రాముఖ్యత నివ్వవలెనని, ఈ గ్రంథాలయముల వలన నిరక్షరాస్యుల శాతమును తగ్గించ వచ్చునని రాష్ట్ర ప్రభుత్వమునకు తెలియజేసిరి. ఈ విషయమును గురించికూడ ఈ సమావేశమునందు రాఘవరెడ్డిగారు సభ్యులకు తెలియ జేసిరి. 5000 తక్కువ గాకుండ జనాభా కలిగిన ప్రాంతములందు శాఖా గ్రంథాలయ స్థాపన జరుగవలెనని, 5000 కు లోపు 1000 కు పైబడి జన సంఖ్య గల ప్రాంతములందు పుస్తక పంపిణీ కేంద్రముల స్థాపన జరుగవలెనని, ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ చట్టమునందు కూడ సూచింపబడి యుండుటచే, నాలుగవ పంచవర్ష ప్రణాళికా కాలమున రాష్ట్రమంతట 300 శాఖా గ్రంథాలయములను, 1000 పుస్తక పంపిణీ కేంద్రములను ప్రారంభించ వలసిన ఆవశ్యకత ఎంతేని కలదని, ఆధునిక పద్ధతులను గ్రంథాలయ ములందు ప్రవేశపెట్టి పాఠకులకు తగు సదుపాయముల కల్పించ వలసిన అవసరము కూడ ఎంతేని కలదని, గ్రంథాలయాల అభివృద్ధికి ప్రణాళికలో సూచించబడిన మొత్తము నేమాత్రము తగ్గించరాదని ప్రభుత్వమునకు స్పష్టపరిచిరి.

## రాఘవరెడిగారి ణాళికకు ప్రభుత్వ కమిటీ సబ్ గ్రూపు (IV) అంగీకారము:

నాలుగవ పంచవర్ష ప్రణాళికా కాలములో సాంఘిక, సాంకేతిక, విద్యా సంబంధ పథకముల పరిశీలన నిమిత్తము ప్రభుత్వ మొక Working group ను నియమించినది. ఈ గ్రూపు సభ్యులు కూడా రాఘవరెడ్డిగారు రూపొందించిన సుమారు రూ. 90 లక్షల వ్యయంతో కూడిన 25 ప్రణాళికా పథకములను పరిశీలించి, యివి మిగుల ప్రయో

జన కరమైన పథకములని గుర్తించి, రాష్ట్ర ఆర్థిక పరిస్థితుల దృష్ట్యా కనీసము రూ. 75 లక్షల మొత్తము నైనను కేటాయించ వలెనని సూచించిరి. నాలుగవ పంచవర్ష ప్రణాళికారంభ కాలముననే (అనగా 1969 జనవరిలో) రాఘవరెడ్డిగారు గ్రంథాలయ శాఖ డైరెక్టరుగా పదవీ విరమణ చేసిరి. వీరి పదవీ విరమణానంతరము గ్రంథాలయ ముల అభివృద్ధికి వీరు సూచించియుండిన మొత్తములో చాల భాగము తగ్గింపబడినది. రాఘవరెడ్డిగారి అనంతరము గ్రంథాలయ శాఖ డైరెక్టరుగా పదవీ బాధ్యతల చేపట్టినవారు ఎక్కువ కాలము డైరెక్టరుగా కొనసాగక పోవడము వలన, వీరు నాలుగవ పంచవర్ష ప్రణాళికకుగాను గ్రంథాలయముల అభివృద్ధికి సూచించి యుండిన మొత్తమును పూర్తిగా ప్రభుత్వమునుండి పొందలేక పోయిరి.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము నియమించిన రెవ్యూ కమిటీ వారి రిపోర్టు నందు, విద్యా శాఖ వారు గ్రంథాలయములకు కేటాయించ బడిన మొత్తమును తరచుగా తగ్గించెడివారని తెలియజేయ బడినది. ఇది యథార్థమైన విషయము.

## చతుర్థ పంచవర్ష ప్రణాళికలో గ్రంథాలయాభివృద్ధికి రాఘవరెడ్డిగారు సూచించిన ముఖ్యపథకములు:

1. రాష్ట్రములోని తాళపత్రముల గ్రంథ సూచీని రూపొందించుట, అరుదైన తాళపత్ర గ్రంథములను ముద్రించుట.
2. మూడు వందల శాఖా గ్రంథాలయముల స్థాపించుట.
3. వేయి పుస్తక పంపిణీ కేంద్రములను స్థాపించుట.
4. ప్రతి జిల్లాయందును ఒక సంచార కేంద్ర గ్రంథాలయమును స్థాపించుట.
5. ప్రాంతీయ గ్రంథాలయములందు, అంధుల విభాగముల నేర్పరచుట.

6. గ్రంథ పాలకుల ప్రయోజనముకై సమావేశములను, సదస్సులను నిర్వహించుట.

7. తెలుగునందు సమీక్షిత గ్రంథ సూచిని (యూనియన్ కేటలాగు) బాలల సాహితీమాలను, ఎప్పటి కప్పుడు అత్యాధునికముగ తయారు చేయుట.

8. జిల్లా గ్రంథాలయ సంస్థల క్రింద పని చేయు గ్రంథపాలకులను ప్రభుత్వోద్యోగులుగా పరిగణింప జేయుట

9. (ఎ) ప్రత్యేక పరిశోధనా గ్రంథాలయములను తిరుపతి, వరంగల్లు, విశాఖపట్టణము. హైదరాబాదులందు ప్రారంభించుట.

9. (బి) వివిధ రకములైన గ్రంథ సూచీలను రూపొందించుట.

9. (సి) రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమునందు డాక్యుమెంటేషన్ విభాగమును ఏర్పరచుట.

10. ప్రాథమిక, ఉన్నత పాఠశాలల గ్రంథాలయముల నిర్వహణ బాధ్యతలను గ్రంథాలయ శాఖ స్వీకరించుట.

11 లోకల్ లైబ్రరీ అథారిటీలకు జిల్లా కేంద్ర గ్రంథాలయ భవన నిర్మాణ నిమిత్తము గ్రాంట్లు మంజూరు చేయుట.

12. రాష్ట్ర కేంద్ర గ్రంథాలయ, ప్రాంతీయ గ్రంథాలయముల అభివృద్ధి పరచుట.

13. గ్రంథాలయ మాసపత్రికను ప్రచురించుట.

14. పౌర గ్రంథాలయ శాఖా కార్యాలయమును విస్తరించుట.

15. ప్రాంతీయ కార్యాలయముల స్థాపన.

16. ఉస్మానియా విశ్వ విద్యాలయమునందు ఎమ్. ఎల్. ఎస్. సి. కోర్సును ప్రారంభించుట.

17. పునశ్చరణ తరగతులు నిర్వహించుట, ఇతర రాష్ట్రము లందలి గ్రంథాలయముల నిర్వహణను గ్రహించుటకుగాను గ్రంథపాలకులను యితర రాష్ట్రములకు పంపుట.

18. పిల్లలకు, వయోజనులకు సంబంధించిన సాహిత్య పుస్తకముల రూపొందించుట.

19. పౌర గ్రంథాలయములకు సంబంధించిన పుస్తకములను వ్రాయు కవులకు బహుమతుల నిచ్చుటయే గాక, ఆ పుస్తకముల ప్రచురణకుకూడ కవులకు కావలసిన ఆర్థిక సహాయము చేయుట.

20. సాహిత్య అకాడమీ తదితర సంస్థలు ముద్రించిన ప్రామాణిక పుస్తకములను ప్రభుత్వము కొనుగోలుచేసి, రాష్ట్రము నందలి గ్రంథాలయములకు సరఫరా చేయుట.

ఈ పథకముల నమలు పరచుటకు ప్రభుత్వము 85 లక్షల మొత్తమును మంజూరు చేయవలెనని, మూడవ పంచవర్ష ప్రణాళికా కాలమున పూర్తిగాని పథకముల నమలుపరచుటకుగాను అదనముగా 5 లక్షల మొత్తమును మంజూరు చేయవలసి యుండునని రాఘవరెడ్డి గారు ప్రణాళికయందు సూచించిరి. కాని దురదృష్టవశాత్తు, ఆర్థిక ఇబ్బందుల వలన, ఇతర కారణముల వలన వర్కింగ్ గ్రూప్ పై మొత్తమును రూ. 75 లక్షలకు తగ్గించినది. వర్కింగ్ గ్రూప్ నందలి సభ్యులలో పలువురు, ప్రణాళికాభివృద్ధి పథకములను మాత్రము బహు విధముల కొనియాడిరి. రాఘవరెడ్డిగారు డైరెక్టరుగానున్న కాలమున నాలుగవ పంచవర్ష ప్రణాళికా కాలమునకు గ్రంథాలయ అభివృద్ధికి రూ॥ 75 లక్షల మొత్తమును గ్రాంటుగా మంజూరు చేయుటకు అంగీకరింపబడినప్పటికిని, వీరు పదవీ విరమణ చేసిన యనంతరము ఈ మొత్తము పది లక్షలకు తగ్గింపబడినది.

నాల్గవ పంచవర్ష ప్రణాళికా బడ్జెట్టునందు కేటాయించబడిన నిధులు గ్రంథపాలకులను గ్రంథాలయ సభలకు, సమావేశములకు పంపుటకు, రాష్ట్ర కేంద్ర గ్రంథాలయ మఱియు ప్రభుత్వ ప్రాంతీయ గ్రంథాలయముల అభివృద్ధికి, లోకల్ లైబ్రరీ అథారిటీవారు నూతన

ముగా గ్రంథాలయములను స్థాపించుటకు, ఇదివరకే స్థాపించబడిన గ్రంథాలయముల పురోభివృద్ధికి మున్నగు వాటికి కొంతవరకు హేతు దాయకమయినది.

## రాష్ట్ర గ్రంథాలయాల అభివృద్ధికి కేంద్ర ప్రభుత్వ బడ్జెట్‌లో సరాసరి కేటాయింపు అవశ్యకత :

విద్యాశాఖకు, సాంకేతిక విద్యా సంబంధ కార్యక్రమములకు, తదితర శాఖలకు మంజూరు చేయు విధముగా కేంద్ర ప్రభుత్వమే గ్రంథాలయ శాఖకుకూడ ప్రత్యేకముగా గ్రాంటును మంజూరు చేసిన, ఇతోధికముగా గ్రంథాలయాభివృద్ధికి వీలేర్పడును. అట్లు గాక గ్రంథాలయములను విద్యాశాఖలో చేర్చి, విద్యా శాఖకే గ్రాంట్లు మంజూరు చేసినచో, విద్యా శాఖ వారు గ్రంథాలయములకు కేటాయించు మొత్తము మిగుల పరిమితముగా నుండుట జరుగును. కేంద్ర ప్రభుత్వము 1951 లో ప్రచురించబడిన సలహా సంఘ సభ్యుల నివేదికయందు కూడ విద్యా శాఖ వారు పాఠశాలల గ్రంథాలయములనే వృద్ధిపరచడము లేదని, రాష్ట్రమునందలి పౌర గ్రంథాలయముల అభివృద్ధికి తగిన శ్రద్ధను చూపడము లేదని, మంజూరయిన గ్రాంటులో కూడ ఎక్కువ భాగమును విద్యా శాఖకే వినియోగించుకొను చున్నారని, అంతేగాక సందర్భావసరములనుబట్టి గ్రంథాలయములకు కేటాయించిన మొత్తమునందు అప్పుడప్పుడు కోతను విధించుచుందురని కూడ తెలియజేయబడి యున్నది. ఈ కారణముల వలన కేంద్ర ప్రభుత్వమే గ్రంథాలయములకు ప్రత్యేకముగా గ్రాంట్లను మంజూరు చేసిన, గ్రంథాలయముల అభివృద్ధికి చేయూత నిచ్చి నట్లగునని చెప్పవచ్చును.

ఈ నాటికైన రాఘవరెడ్డిగారు రూపొందించిన గ్రంథాలయాభివృద్ధి పథకములను అమలు పరచినచో, గ్రంథాలయములు అభివృద్ధి చెందుటకు వీలేర్పడును. మన రాష్ట్రములోని వారేగాక, అఖిల భారత గ్రంథాలయ సంఘ అధ్యక్షులు, తదితరులు కూడ రాఘవ

రెడ్డిగారు రూపొందించిన పథకముల వలన కలుగు ప్రయోజనములను గుర్తించి ప్రస్తుతించారు. నాల్గవ పంచవర్ష ప్రణాళిక డ్రాఫ్టునందు రాఘవరెడ్డిగారు సూచించిన పథకములు "Comprehensive" గా నున్నవని కేంద్రప్రభుత్వము తెలియబరచినది. ఈ పథకములను చక్కగా పరిశీలించిన ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘమువారు "గ్రంథాలయ సర్వస్వము" 1967 ఫిబ్రవరి సంచికలోని ఎడిటోరియల్ నందు ఈ క్రింది విధముగా రాఘవరెడ్డిగారిని శ్లాఘించి యున్నారు.

"ఎన్నో నూతన ప్రణాళికలను ప్రవేశపెట్టి భారత భూమిలో గ్రంథాలయ రంగంలో ఆంధ్రప్రదేశ్‌కు గౌరవ స్థానాన్ని కల్పించినారు." ఈనాటికిని వారి సేవా ఘనతల గుర్తించి పెక్కు సంస్థలు వారి కృషిని కొనియాడుచున్నవి.




ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ సంఘమువారు 1979 సం॥ లో రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమునందు శ్రీ కె. రాఘవరెడ్డి గారిని సన్మానించిన సందర్భాన తీసిన ఛాయాచిత్రము. ఇందులో ఉపన్యసిస్తున్న మాజీ ప్రధాన న్యాయమూర్తి శ్రీ ఎగ్బోటే గారిని ఆసీనులయిన ప్రొఫెసర్ కౌలా మరియు మంత్రి శ్రీ హయగ్రీవాచారిగారలను కూడ తిలకింపవచ్చును

# కేంద్ర ప్రభుత్వ నియమిత సలహా సంఘ నివేదిక (1959) యందలి సూచనల అమలు

1957వ సంవత్సరమున కేంద్ర ప్రభుత్వ మొక పౌర గ్రంథాలయ సలహా సంఘమును నియమించినది. శ్రీ కె. పి. సిన్హా యీ సంఘమునకు అధ్యక్షులుగా నుండిరి. ఈ సలహా సంఘ సభ్యులు పౌర గ్రంథాలయాల అభివృద్ధి నిమిత్తము ఒక నివేదికను 1959 లో కేంద్ర ప్రభుత్వమునకు సమర్పించిరి. ఈ నివేదికలోని సూచనలను అమలు పరచవలెనని, కేంద్ర ప్రభుత్వము రాష్ట్ర ప్రభుత్వములను కోరినది. ఈ నివేదికయందు మదరాసు పౌర గ్రంథాలయ చట్టము 1948, లోని కొన్ని అంశములు, హైదరాబాదు పౌర గ్రంథాలయ చట్టము 1955, లోని కొన్ని అంశములు పొందుపరచబడి యున్నవి. ఈ చట్టములు 1959 సంవత్సరమునకు పూర్వమే రాష్ట్రమునందు అమలునందుండుట వలన, 1959 సంవత్సరమున సలహా సంఘము సూచించిన సిఫార్సులలో పెక్కింటిని, మన రాష్ట్రమునందు 1959 సంవత్సరమునకు పూర్వమే అమలుపరచడము జరిగినది.

కేంద్ర ప్రభుత్వముచే నియమించబడిన పౌర గ్రంథాలయ సలహా సంఘ సభ్యులు 13—1—1958 తేదీ నుండి 15—1—1958 తేదీ వరకు హైదరాబాదులో గ్రంథాలయ కార్యకర్తలతోను, పుస్తక భాండాగారులతోను, గ్రంథాలయాల ప్రత్యేకాధికారియైన రాఘవరెడ్డిగారితోను, ఆంధ్రప్రదేశ్ లో గ్రంథాలయాల నిర్వహణ, అభివృద్ధి తదితర అంశములకు సంబంధించిన విషయములను గురించి కూలంకషముగా చర్చించిరి. ఈ సందర్భమున రాష్ట్రమునందలి గ్రంథాలయాల నిర్వహణ విధానములను గురించి రాఘవరెడ్డిగారు సలహా సంఘ సభ్యులకు వివరించి, గ్రంథాలయాల అభివృద్ధికై గైకొన

వలసిన ప్రధాన చర్యలను గురించికూడ వారికి ప్రస్ఫుట పరచిరి. వారి సూచనలతో సంఘ సభ్యులు ఏకీభవించిరి.

గ్రంథాలయ శాస్త్ర నిర్వహణ గురించి చక్కని అవగాహన కల్గిన రాఘవరెడ్డిగారికి మన రాష్ట్రములో, గ్రంథాలయాల నిర్వహణ సులభతరమైనది. కేంద్ర ప్రభుత్వము నియమించిన పౌర గ్రంథాలయ సలహా సంఘ సభ్యుల నివేదిక రూపొందింపబడక మునుపటి నుండియే, అందలి, పెక్కు సూచనలను రాష్ట్రమునం దమలు పరచుటకు వీరు గట్టి కృషి సల్పిరి.

ఈ నివేదిక యందలి కొన్ని సూచనలను అమలులో నుంచక పోవుటకు కేంద్ర ప్రభుత్వము కొంత వరకు బాధ్యతను వహించవలసి యున్నది. ఇందులకు యూనివర్సిటీ గ్రాంట్స్ కమీషన్ కూడ కొంత వరకు బాధ్యతను వహింపవలసియున్నది.

**కేంద్ర ప్రభుత్వము అమలు పరచవలసిన ప్రధాన సిఫార్సులు:**

1. కేంద్ర ప్రభుత్వ యాజమాన్యమున నిర్వహింపబడు పరిశోధనా గ్రంథాలయములలోని, డిపార్ట్‌మెంటు గ్రంథాలయము లందలి గ్రంథ సూచీలను తయారు చేయుటకు కేంద్ర ప్రభుత్వ విద్యాశాఖ భాధ్యతను స్వీకరించవలెను.

2. దేశమునందలి అన్ని రాష్ట్రములలోని రాష్ట్ర, కేంద్ర గ్రంథాలయాలలో గల కాపీరైటు పుస్తకముల సూచీలను జాతీయ గ్రంథాలయము తయారు చేయవలెను.

3. దేశమునందలి పరిశోధనా గ్రంథాలయాలలో, విశ్వవిద్యాలయ గ్రంథాలయాలలో శాస్త్ర సంబంధమైన పరిశోధనా పత్రికల (Periodicals) సూచీలను కేంద్ర ప్రభుత్వానికి చెందిన పరిశోధక, సాంస్కృతిక శాఖలు తయారు చేయవలెను.

4. ఉచిత గ్రంథాలయ సేవకై రాష్ట్ర ప్రభుత్వాలకు కేంద్ర ప్రభుత్వము ఆర్థిక సహాయము చేయవలెను.

ఆర్థిక వనరులు తగినంతగా లేనందువలన కేంద్ర ప్రభుత్వము ఈ సలహాలను అమలు పరచలేక పోయినదని తెలియుచున్నది.

## యూనివర్సిటీ గ్రాంట్సు కమీషన్ అమలు పరచవలసిన ప్రధాన సిఫార్సులు:

1. దేశమునందలి విశ్వవిద్యాలయాలలో గల పుస్తకముల సూచీలను యూనివర్సిటీ గ్రాంట్సు కమీషన్ రూపొందించవలెను.

2. యం. ఎల్. ఎస్. సి. శిక్షణకు, విశ్వవిద్యాలయ గ్రంథాలయ శాఖల అభివృద్ధికి యు. జి. సి. కేంద్ర ప్రభుత్వము నుండి ఆర్థిక సహాయమును పొందవలెను.

ఆర్థిక వనరులు అనుకూలముగా లేనందున ఈ సిఫార్సుల నమలు పరచలేదని తెలియుచున్నది.

సలహా సంఘ నివేదిక 1959 సంవత్సరములో ప్రచురించబడినను, ఈ నివేదికయందు కనబరచిన సూచనలను 1959 సంవత్సరమునకు పూర్వము పెక్కింటిని, తర్వాత కొన్నిటిని అమలు పరచుటకు మన రాష్ట్రమునందు గట్టి కృషి జరిగినది. ఉదాహరణకు:- ఈ క్రింది ముఖ్య సూచనలను 1959 సంవత్సరమునకు మునుపే అమలు పరచడమైనది.

1. రాష్ట్ర, జిల్లా, గ్రామ స్థాయీలలో గ్రంథాలయాలను స్థాపించవలెను.

2. బాలలకు ప్రత్యేక గ్రంథాలయాల నేర్పాటు చేయవలెను.

3. జిల్లా గ్రంథాలయ కమిటీల నేర్పాటు చేయవలయును.

4. జిల్లా, కేంద్ర గ్రంథాలయములలో ప్రత్యేక విభాగముల స్థాపించవలెను.

5. చైర్మెన్, గ్రంథపాలకుల సమావేశముల తరచుగా నేర్పాటు చేయవలెను.

6. పంచాయతీ గ్రంథాలయాలను స్థాపించవలెను.

7. గ్రంథాలయ సంఘములకు తగు ప్రోత్సాహ మివ్వవలెను.

8. పౌర గ్రంథాలయాలకు, ఇతర గ్రంథాలయాలకు మధ్య సహకారమును పెంపొందించవలెను.

9. పాఠశాలల గ్రంథాలయాల, ఇతర గ్రంథాలయాల మధ్య సహకారమును పెంపొందింపవలెను.

10. సాంకేతిక సంబంధమైన కార్యకలాపముల నిర్వహణా బాధ్యతలను శిక్షణ పొందిన గ్రంథపాలకుల కప్పగించవలెను.

11. గ్రంథాలయ శాస్త్రములో శిక్షణ పొందుటకై గ్రంథాలయ సిబ్బందికి ప్రోత్సాహ మివ్వవలెను.

12. సాంకేతిక విషయములపై చర్చలు జరుపు నిమిత్తము గ్రంథపాలకుల సమావేశముల, సదస్సుల నేర్పాటు చేయవలెను.

13. గ్రంథపాలకుల నుండి సెక్యూరిటీ డిపాజిట్లను వసూలు చేయరాదు.

14. సర్టిఫికేటు కోర్సును విశ్వవిద్యాలయాలు నిర్వహింపరాదు. గ్రంథాలయ సంఘములు యీ కోర్సులను నిర్వహించవలెను.

15. గ్రంథాలయ కార్యకర్తలు, వయోజన విద్యా కార్యకర్తలు పరస్పరము సహకరించుకొనవలెను.

16. బాలల గ్రంథసూచీలను విధిగా తయారు చేయవలెను.

17. శిక్షణ పొందిన పుస్తకభాండాగారులనే గ్రంథాలయ సంస్థల కార్యదర్శులుగా నియమించవలెను.

ఈ నివేదికయందు పౌరగ్రంథాలయ శాఖను, ప్రత్యేక శాఖగా గుర్తించవలెనని లోకల్ లైబ్రరీ అథారిటీలకు ప్రత్యేకముగా సెక్రట

రీలను నియమించవలెనని సూచన గలదు. ఈ సూచన మేరకు ఆంధ్రప్రదేశ్ నందు పౌర గ్రంథాలయ శాఖను ప్రత్యేక శాఖగా పరిగణించుట, లోకల్ లైబ్రరీ అథారిటీలకు ప్రత్యేక సెక్రటరీల నియమించుట జరిగినది. అఖిలభారత గ్రంథాలయ సంఘ అధ్యక్షుడైన శ్రీ సోహన్ సింగ్ 1967 సంవత్సరమున ఆంధ్రప్రదేశ్ లోని కొన్ని పౌర గ్రంథాలయాలను సందర్శించి, పౌరగ్రంథాలయాలు అనుసరించుచున్న విధానములను గురించి, రాఘవరెడ్డిగారి కృషిని గురించి ప్రశంసించి, ఢిల్లీకి వెళ్ళిన యనంతరము అక్టోబర్ 25 న రాష్ట్రవిద్యాశాఖ మంత్రి టి. వి. రాఘవులు గారికిని, లోకల్ లైబ్రరీ అథారిటీ ఉద్యోగుల సంఘ అధ్యక్షుడైన పి. జనార్ధనరెడ్డిగారికిని తన లేఖలో ఈ క్రింది విధముగా తెలియజేసిరి.

"It gladdened my heart to know that Andhra Pradesh is now at the top in so far as the Public Libraries Organisation is concerned. Two of the most important recommendations of the Committee were that there should be an independent Directorate of Libraries and that District Librarians should be Secretaries of District Library Committees, in your case Local Library Authorities. I was very happy to find that Andhra Pradesh has taken a lead in initiating these two measures" అంతేగాక "A much needed reform in the Public Library set up in your State has been introduced" అని కూడ తన లేఖలో తెలియజేసిరి.

రాష్ట్ర ప్రభుత్వము యొక్క ఆర్థిక వనరులు వలసినంత లేక పోవుట వలన, నివేదిక యందలి యీ క్రింది సూచనలను రాష్ట్రమున అమలు పరచుటకు వీలు లేక పోయినది.

1. వసూలయిన గ్రంథాలయ సెస్సునకు మూడురెట్ల గ్రాంటును రాష్ట్ర ప్రభుత్వ మొసంగవలెను.

2. గ్రంథాలయ సెస్సును రూపాయకు 6 పైసలకన్న ఎక్కువ చేయవలెను.

3. గ్రంథాలయోద్యోగులను ప్రభుత్వోద్యోగులుగా పరిగణించవలెను.

4. బ్లాకు, పురపాలక, జిల్లా గ్రంథాలయాలకు ఆయా స్థాయిలలో నిధులు ఏర్పాటు చేయవలెను.

5. వయోజన విద్యాశాఖ మఱియు గ్రంథాలయ శాఖ ఒకే శాఖగా నుండవలెను.

నివేదిక యందలి పెక్కు ఇతర సూచనలను అమలు పరచుటలో ప్రభుత్వము గొప్పగా తోడ్పడినది.

## రాష్ట్రమునందు కేంద్ర సలహా సంఘ నివేదికలోని సూచనలను అమలు పరచుటలో రాఘవరెడ్డిగారి కృషిపై ప్రశంసలు:

కేంద్ర ప్రభుత్వముచే నియమించబడిన సలహా సంఘము తమ నివేదికను వెలువరచక మునుపటి నుండియే, పెక్కు సంవత్సరములుగా యితర రాష్ట్రములకన్న మిన్నగా మన రాష్ట్రమునందు ఈ నివేదికలోని సూచనలు అమలుపరచబడి యుండినవి. 1961 సంవత్సరము ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర కేంద్ర గ్రంథాలయ భవన ప్రారంభోత్సవ సందర్భాన ముఖ్యమంత్రిగారు, ఇతర రాష్ట్రములకన్న ముందుగనే, అనగా నివేదిక ప్రచురింప బడక మునుపటి నుండియే, నివేదిక యందలి సూచనలు అమలు పరచబడిన విధానమును గుఱించి బహువిధముల శ్లాఘించియున్నారు. 9—12—1965 తేదీన నిర్వహించబడిన రాష్ట్ర గ్రంథాలయ కమిటీ సమావేశమునందు గూడ, కేంద్ర ప్రభుత్వ నియుక్త సలహా సంఘ సభ్యులు తమ నివేదిక ప్రచురింపబడక మునుపే, నివేదిక యందలి సలహాలలోని పలు అంశములను మన రాష్ట్రమునం దమలు పరచబడిన విధానమును గురించి గ్రహించి రాఘవరెడ్డిగారిని బహు విధముల కొనియాడిరి.

భారత దేశమునందు అమెరికా ప్రభుత్వముచే నియమింప బడిన గ్రంథాలయాల డైరెక్టరు శ్రీ విలియం బెన్నెట్ గారు ఆంధ్ర ప్రదేశ్ లోని పౌర గ్రంథాలయాలను 1967 సంవత్సరమునకు పూర్వమే సందర్శించి యున్నారు. వీరు గొప్ప గ్రంథాలయ శాస్త్ర జ్ఞులు. గ్రంథాలయ నిర్వహణా విధానమును క్షుణ్ణముగా గ్రహించిన వారు. వీరు 1967 సంవత్సరము సెప్టెంబర్ నెలలో రాష్ట్ర కేంద్ర గ్రంథాలయాన జరిగిన గ్రంథపాలకుల సమావేశమునందు ప్రసంగిం చుచూ, ఆంధ్రప్రదేశ్ నందు జరిగిన గ్రంథాలయాల అభివృద్ధిని గురించి, రాఘవరెడ్డిగారి కృషిని గురించి ఈ క్రింది విధముగా వక్కా-ణించిరి.

"I am greatly impressed by the rapid development of Public Libraries in several directions"

సుప్రసిద్ధ విద్యావేత్త, గ్రంథాలయ నిపుణులు, దేశమునందలి గ్రంథాలయములు సాధించిన ప్రగతిని కూలంకషముగా గ్రహించిన అఖిల భారత గ్రంథాలయ సంఘ అధ్యక్షులు శ్రీ సోహన్ సింగ్ గారు ఆంధ్రప్రదేశ్ నందలి పలు గ్రంథాలయములను సందర్శించిన యనంత రము రాఘవరెడ్డిగారి కృషిని గురించి వారికి 25—10—1967 తేదీన ఈ విధముగా, ప్రశంసా పూర్వకముగా తెలియజేసిరి.

"I was so glad to find that under your leadership Andhra Pradesh is marching ahead in implementing the major recommendations of the Advisory Library Committee. My heart felt wishes that you continue to give this guidance to Librarians in the State for many more years to Come."



# విశ్వ విద్యాలయాలలో గ్రంథాలయాల అభివృద్ధికి కృషి

## ఉస్మానియా విశ్వవిద్యాలయములో గ్రంథాలయ శాఖ అధ్యక్షులుగా రాఘవరెడ్డిగారి నియామకము :

ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయముల అభివృద్ధికి ఎనలేని కృషి సల్పిన రాఘవరెడ్డిగారి గ్రంథాలయ సేవను గుర్తించి గ్రంథాలయాభిమానులు, నిపుణులు పలు విధముల కొనియాడి యున్నారు. రాఘవరెడ్డిగారు రాష్ట్రములో, విశ్వవిద్యాలయములలోకూడ తగినంత గ్రంథాలయ సేవ చేసి యున్నారు. ఈ అధ్యాయమునందు విశ్వ విద్యాలయములందు వారొనర్చిన గ్రంథాలయ సేవను గురించి పేర్కొన వలసిన ఆవశ్యకత ఎంతేని గలదు. రాఘవ రెడ్డిగారి గ్రంథాలయ సేవను గుర్తించి ప్రభుత్వ సర్వీసు నుంచి పదవీ విరమణ గావించిన తరువాత కూడ, వారిని ఉస్మానియా విశ్వ విద్యాలయము వారు గ్రంథాలయ శాఖకు అధ్యక్షులుగా నియమింప దలచిరి. ప్రభుత్వ సర్వీసునుండి రిటైరైన తర్వాత, విశ్వ విద్యాలయములందు ఉద్యోగావకాశము రాష్ట్రమున ఏ కొద్దిమందికో గాని లభింపదు. ఇట్టి అవకాశము లభించిన వారిలో రాఘవ రెడ్డి గారు పేర్కొనదగినవారు. ఉస్మానియా విశ్వ విద్యాలయమునందు గ్రంథాలయ శాఖను ప్రారంభించుటకు మిగుల కృషి చేసిన రాఘవ రెడ్డిగారు ఈ అవకాశమును సద్వినియోగపరచి విశ్వ విద్యాలయ గ్రంథాలయములకు కూడ, తమ సేవ నందించు తలంపుతో 29—1—69 న ఉస్మానియా విశ్వ విద్యాలయ గ్రంథాలయ శాఖాధ్యక్షులుగా పదవీ బాధ్యతలు చేపట్టిరి.

## తెలంగాణా ఉద్యమము:

రాఘవరెడ్డిగారు ఉస్మానియా విశ్వ విద్యాలయ గ్రంథాలయ శాఖాధ్యక్షులుగా నియమింపబడిన కొద్ది రోజులలోనే తెలంగాణ

ఉద్యమము ప్రారంభమయినది. తెలంగాణ ఉద్యమ సమ్మెల వలన విశ్వ విద్యాలయమునందు ఎక్కువగా అల్లర్లు చెలరేగినవి. ఈ సమ్మె కాలమున కూడ రాఘవ రెడ్డి గారు ప్రతిదినము విశ్వ విద్యాలయము నకు వెళ్ళి తమ బాధ్యతలు నిర్వహించు చుండిరి. రాఘవ రెడ్డి గారు రాష్ట్రములో విశ్వ విద్యాలయములలో కూడ తగినంత గ్రంథాలయ సేవ చేసి యున్నారు. ఈ అధ్యాయమునందు విశ్వ విద్యాలయము లందు వారొసర్చిన గ్రంథాలయ సేవను గురించి పేర్కొనవలసిన ఆవశ్యకత ఎంతేని గలదు. చక్కగా గ్రహించు పద్ధతిలో ఉపన్యాస ముల నిచ్చుట వలన, ఆనాడు విద్యార్థులకు వీరిపై ఎంతో గౌరవ ముండెడిది. విశ్వ విద్యాలయములలోని యితర శాఖలందు అల్లర్లు చెలరేగు చున్నను గ్రంథాలయ శాస్త్ర శాఖ యందు ఏ మాత్రము అల్లర్లు ఉండెడివి కావు. విశ్వ విద్యాలయము నందలి యితర శాఖలందును, నగరమునందును తెలంగాణ ఆందోళన అమితత మగుటచే విశ్వ విద్యాలయమును తాత్కాలికముగా మూసి వేసిరి. ఆ పిదప కూడ రాఘవ రెడ్డి గారు గ్రంథాలయ శాఖ విద్యార్థులకు రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమున వసతి కల్పించి, అచట గ్రంథాలయ నిర్మాణ – నిర్వహణాంశములను బోధించిరి. విద్యార్థులను రాష్ట్ర కేంద్ర గ్రంథాలయము నందలి వివిధ శాఖలకు కొనిపోయి, ఆ యా శాఖలు నిర్వహించు బాధ్యతలను గురించి కూడ వివరించిరి. ఆందో ళనల వలన విశ్వ విద్యాలయ పరిపాలనా యంత్రాంగము స్తంభించి యుండుటచే, తమ విధ్యుక్త ధర్మమును నిర్వర్తించకుండా వేతనము పుచ్చుకొనుటకు ఇచ్ఛగించక 4—4—1969 న తమ పదవికి రాజీనామా చేసిరి. కాని విశ్వ విద్యాలయ అధికారులు వీరి రాజీ నామాను చాలా కాలము వరకు అంగీకరించలేదు. చివరకు రాఘవ రెడ్డిగారి ఒత్తిడిచే 8—5—1969 న రాజీనామాను అంగీకరించ డము జరిగినది. వీరు ఉస్మానియా విశ్వ విద్యాలయ గ్రంథాలయ శాస్త్ర శాఖాధికారిగానున్న కాలమున విశ్వ విద్యాలయ అకడమిక్

కౌన్సిల్‌నందు సభ్యులు గాను, పరీక్షలకు బోర్డు [Board of Examiners] ఛైర్మన్‌గా నుండిరి.

## వ్యవసాయ విశ్వవిద్యాలయ గ్రంథాలయాలకు ప్రత్యేకాధికారి:

1969 సం॥ వరకు హైదరాబాదు నందలి రాజేంద్రనగర్ వ్యవసాయ విశ్వవిద్యాలయ గ్రంథాలయము స్థాపించ బడియుండలేదు. కళాశాలల గ్రంథాలయములను ఆధునిక పద్ధతులలో నడుపుట యందు అనుభవము పొందిన గ్రంథపాలకుని నియమించాలని విశ్వ విద్యాలయాధికారులు నిశ్చయించిరి. విశ్వవిద్యాలయ గ్రంథాలయ మును స్థాపించుటకు, కళాశాలల, తదితర గ్రంథాలయముల అభివృద్ధి పరచుటకు విశ్వవిద్యాలయాధికారులు రాఘవరెడ్డిగారిని ప్రత్యేకాధి కారిగా పదవీ బాధ్యతలను చేపట్టవలసినదిగా కోరిరి. వారి కోరిక మేరకు రాఘవరెడ్డిగారు ప్రత్యేకాధికారిగా 1969 మే నెలలో బాధ్య తలు చేపట్టిరి.

## గ్రంథాలయాల అభివృద్ధికి సమర్పించిన ప్రణాళిక:

రాఘవరెడ్డిగారు ప్రత్యేకాధికారిగా రాజేంద్రనగర్, తిరుపతి, బాపట్ల మొదలగు ప్రాంతములందు గల వ్యవసాయ విశ్వవిద్యా లయ అనుబంధిత కళాశాలల గ్రంథాలయములను, పరిశోధనా సంస్థా గ్రంథాలయములను సందర్శించి వాటి నిర్వహణ విధానములను పరిశీలించి, నాలుగవ పంచవర్ష ప్రణాళిక కాలమున ఈ గ్రంథాలయ ముల అభివృద్ధికి (1969 - 74) ఒక ప్రణాళికను తయారుచేసి విశ్వ విద్యాలయమునకు సమర్పించిరి. ఈ ప్రణాళికలోని ప్రధానాంశములు:

(1) రాజేంద్రనగర్ నందు విశ్వవిద్యాలయ గ్రంథాలయ స్థాపన.
(2) తిరుపతి పరిసర ప్రాంతములలో కేంద్ర గ్రంథాలయ స్థాపన.
(3) బాపట్ల వ్యవసాయ కళాశాల గ్రంథాలయ భవన విస్తరణ.
(4) కళాశాలల యందు డిపార్టుమెంటు గ్రంథాలయముల స్థాపన.

(5) వసతి గృహము (Hostels) ల యందును విశ్వ విద్యాలయ పరిపాలనా యంత్రాంగ సిబ్బందికి, నాలుగవ తరగతి ఉద్యోగస్థులకు గ్రంథాలయముల వసతుల కలుగ జేయుట (6) పరిశోధనా సంస్థ గ్రంథాలయములను, బేసిక్ సైన్స్ కళాశాలల యందలి గ్రంథాలయ ములను అభివృద్ధి పరచుట. (7) గ్రంథపాలకులకు శిక్షణ వసతుల కలుగజేసి సదస్సుల, సమావేశముల నిర్వహించుట. (8) ఒక కళా శాల గ్రంథాలయము నుండి మరొక కళాశాల గ్రంథాలయమునకు పుస్తకముల నరువు పొందు సహకార విధానమును ప్రవేశ పెట్టుట. (9) రాజేంద్రనగర్ మరియు తిరుపతి యందును డాక్యుమెంటేషన్ కేంద్రముల స్థాపించుట. (10) నవీన దృశ్య-శ్రవణ విద్యాపరికరము లను కళాశాలలకు పంపిణీ చేయుట.

భారతీయ వ్యవసాయ పరిశోధనా సమాఖ్య (I.C.A.R) సూచ నల మేరకు రాఘవరెడ్డిగారు పై ప్రణాళికను రూపొందించిరి. గొప్ప గ్రంథాలయాభిమానులగు వ్యవసాయ విశ్వవిద్యాలయ ఉపాధ్య క్షులు శ్రీ పుల్లారెడ్డిగారు గ్రంథాలయములలో ఆధునిక పద్ధతులను ప్రవేశ పెట్టవలయునని ఆకాంక్షతో, రాఘవరెడ్డిగారు రూపొందించిన ప్రణాళికలను అమలు పరచుటకు అంగీకరించిరి. I. C. A. R. బృందము 1969 సం॥ డిసెంబర్ లో వ్యవసాయ విశ్వవిద్యాలయమును సందర్శించిన సమయమున రాఘవరెడ్డిగారి పథకములను పరిశీలించి ఆమోదించిరి.

ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ విశ్వవిద్యాలయ అకాడమిక్ కౌన్సిల్ కు 2-6-1970 న రాఘవరెడ్డిగారు తమ ప్రణాళికను పంపిరి. అకాడమిక్ కౌన్సిల్ సభ్యులు కూడ ఈ ప్రణాళికను అంగీకరించిరి.

## విశ్వవిద్యాలయ కేంద్ర గ్రంథాలయ స్థాపనకు ఆకాంక్ష:

రాజేంద్ర నగర్ నందు వ్యవసాయ విశ్వవిద్యాలయ గ్రంథా లయమును సాధ్యమైనంత త్వరలో స్థాపించవలెనని రాఘవరెడ్డిగారి



ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ విశ్వ విద్యాలయ కేంద్ర గ్రంథాలయ భవనము

అభిమతము. వ్యవసాయ విశ్వవిద్యాలయ గ్రంథాలయ భవన నిర్మాణ పథకమును రూపొందించి ఆ పథకమునందు, కేంద్ర గ్రంథాలయ మున ఎన్ని శాఖలు ఉండవలెను, ఒక్కొక్క శాఖకు కేటాయించ వలసిన స్థల విస్తీర్ణము, శాఖల పరస్పర సంబంధము మున్నగు అంశ ముల విశదపరచి ఆ పథకమును విశ్వవిద్యాలయమునకు పంపిరి. I. C. A. R. బృందమువారు కూడ 1969 సం॥ వ్యవసాయ విశ్వ విద్యాలయమునకు విచ్చేసిన సమయమున ఈ భవన నిర్మాణ పథక మును పరిశీలించి, దీనికి కావలసిన నిధులను కూడ మంజూరు చేసెద మని హామీ నిచ్చిరి. I. C. A. R. వారు ఈ గ్రంథాలయ నిర్మాణ మునకు శీఘ్రకాలమున నిధులను మంజూరు చేసినప్పటికి, భవన నిర్మా ణము మాత్రము మందకొడిగా సాగి 1980 న పూర్తయినది. కాని యీ భవనమున గ్రంథాలయమును ప్రారంభింపక, కొన్ని విశ్వ విద్యాలయ కార్యాలయాలను ప్రవేశపెట్టిరి. నాలుగవ పంచవర్ష ప్రణాళికా కాలమున రాఘవరెడ్డిగారు రూపొందించిన ప్రణాళికను అమలుపరచుటకు విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు I. C. A. R. టీమ్ వారు అంగీకరించి నప్పటికి, ప్రత్యేక గ్రంథాలయ భవన నిర్మాణము మునకు మాత్రమే వ్యవసాయ విశ్వవిద్యాలయ ఫైనాన్స్ కమీషన్ వారు గ్రాంటును మంజూరు చేస్తూ వచ్చిరి. కాని యితర పథకములకు తగు నిధులు కేటాయించటములో తెలంగాణ ఉద్యమము వలన జాప్యము జరిగెను.

**గ్రంథాలయ అభివృద్ధి పథకములకు విశ్వవిద్యాలయ గ్రాంటులు:**

రాఘవరెడ్డిగారు పట్టుదల వహించుటచే 1969 – 70 నందు యీ క్రింది ప్రణాళికలను అమలు పరచుటకు మాత్రము గ్రాంట్లు మంజూరు చేయబడినవి.

1. కళాశాలల గ్రంథాలయముల నుండి అరువుకొని పోబడు పుస్తకముల వివరములను, రిజిష్టరు పద్ధతి ద్వారా నిర్వహించుట

వలన ఎక్కువ కాలయాపన జరుగునని, టిక్కెట్టు పద్ధతిని ప్రవేశ పెట్టవలెనని రాఘవరెడ్డిగారు ప్రణాళికయందు సూచించుటచే, రాజేంద్రనగర్ వ్యవసాయ కళాశాల ఆవరణలోని కళాశాలల గ్రంథాలయములలో మాత్రము టిక్కెట్టు పద్ధతిని అమలుపరచుటకు 5,350 రూ. మంజూరు చేయబడినవి.

2. కళాశాలల గ్రంథాలయముల యందు ఏ పుస్తకము లెచ్చట గలవన్న విషయమును పాఠకులు సులభముగా గ్రహించుట కొరకు బేగైడ్స్, షెల్ఫ్ గైడ్స్‌లను కొనుటకు 3,400 రూ. మంజూరు చేయబడినవి.

3. తిరుపతి - బాపట్ల - రాజేంద్రనగర్‌లలో గల కళాశాలల గ్రంథాలయములకు పుస్తకముల కొనుగోలుకు రెండు లక్షల రూపాయల ప్రత్యేక గ్రాంటు మంజూరు చేయడమయినది.

విశ్వవిద్యాలయానికి సంబంధించిన కొన్ని గ్రంథాలయములందు పుస్తకములు మిగుల తక్కువగా నుండినవి. ఉదా:- రాజేంద్రనగర్‌లోని వెటరినరీ కళాశాల పెద్దదైనప్పటికి, యిందలి గ్రంథాలయములోని పుస్తకముల సంఖ్య 4,544 మాత్రమే. తిరుపతిలోని వ్యవసాయ కళాశాల యందలి గ్రంథాలయము పెద్దదైననప్పటికి, యిందలి పుస్తకముల సంఖ్య 4,800 మాత్రమే. రాజేంద్రనగర్‌లోని వ్యవసాయ విస్తరణ విద్యాకేంద్రములోని పత్రికల సంఖ్య 45 మాత్రమే. హైదరాబాదు యందలి హోమ్‌సైన్స్ కళాశాల యందలి పత్రికల సంఖ్య 50 మాత్రమే. ఈ విధముగా గ్రంథాలయములకు తగిన పుస్తకములు, పత్రికలు లేనందువలన ప్రత్యేక గ్రాంట్లు మంజూరు చేయడము జరిగినది. I.C.A.R. వారి సిఫార్సు మేరకు విశ్వవిద్యాలయ బడ్జెట్ యొక్క 6% నిధులు గ్రంథాలయముల అభివృద్ధికి మంజూరు చేయవలసినదిగా రాఘవరెడ్డిగారు సూచించిరి. కాని యిందుకు ఆర్థిక పరిస్థితు లనుకూలించలేదు.

## అంతర్ గ్రంథాలయ అరువు విధానమునకు ప్రోత్సాహము:

ఒక కళాశాల కొనిన పుస్తకముల జాబితాను యితర కళాశాలలకు పంపి, యితర కళాశాలలు కొనిన పుస్తకముల జాబితాలను ఆ కళాశాల పొంద వలయునని కూడ రాఘవరెడ్డిగారు సూచించిరి. ఈ సూచనను అమలుపరచడము జరిగినది. ఒక కళాశాల కొనుగోలు చేసిన పుస్తకములను సాధ్యమయినంత వరకు యితర కళాశాలలు కొనుగోలు చేయరాదని, ఒక గ్రంథాలయములో లేని పుస్తకములను మరొక గ్రంథాలయము నుండి అరువు పొందవలెనని, నిధులు తగినంతగా లేనందున ఈ విధానము ప్రయోజన దాయకమని రాఘవరెడ్డిగారు తెలియజేసిరి. ఇదే అభిప్రాయమును 1969 న వచ్చిన ఐ. సి. ఏ. ఆర్. విజిటింగ్ టీమ్ సభ్యులు నొక్కి చెప్పిరి.

రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమునందు పాఠ్య పుస్తక విభాగమునందు, రాజేంద్రనగర్ నందలి వ్యవసాయ కళాశాల విద్యార్థులకు కూడ తగు ప్రవేశ వసతులు, పుస్తక వినియోగ వసతులు కల్పింపబడినవి.

రాజేంద్ర నగర్‌లో నేషనల్ ఇన్స్టిట్యూట్ ఆఫ్ కమ్యూనిటీ డెవలప్ మెంట్ సెంటర్‌లో వున్న గ్రంథాలయమునందు కూడ, విశ్వవిద్యాలయ కళాశాలల విద్యార్థులకు పఠన వసతులు కొంత వరకు కలుగ జేయబడినవి.

## విశ్వవిద్యాలయ కేంద్ర గ్రంథాలయ పాలకునిగా నియమించుటలో గమనించవలసిన విషయములపై రాఘవరెడ్డిగారి సూచనలు:

రాఘవరెడ్డిగారు విశ్వ విద్యాలయ గ్రంథాలయ సిబ్బందికి కూడ, సందర్భానుసారముగా తగు ప్రోత్సాహము నిచ్చుచూ, వారి స్థితి గతులు మెరుగు పరచుటకు కూడ కృషి చేసిరి. ఎమ్. ఎస్. సి. (అగ్రికల్చర్) లేదా ఎమ్. వి. ఎస్. సి. పట్టభద్రులలో ఒక రీడర్‌ను

ఎన్నుకొని, వారిని అమెరికా లేదా ఇంగ్లాండునకు పంపి, వారు ఆ దేశములందు గ్రంథాలయ నిర్వహణాది పద్ధతుల యందు తగు అనుభవమును గడించి వచ్చిన అనంతరము, అట్టి వారిని విశ్వ విద్యాలయ గ్రంథాలయ పుస్తక భాండాగారిగా నియమించినచో వారు గ్రంథాలయములందు ఆధునిక పద్ధతుల ప్రవేశ పెట్టగలరని, పరిశోధనా విద్యార్థులకు డాక్యుమెంటేషన్ సర్వీసు నందు తగు సహకారమునందించుటకు అవకాశ మేర్పడునని రాఘవరెడ్డి గారు విశ్వ విద్యాలయమునకు తెలియబరచిరి. ఇటువంటి గ్రంథ పాలకుడు విశ్వ విద్యాలయముల గ్రంథాలయముల కంతటికి గ్రంథాలయ డైరెక్టరుగా కూడ నుండవలెనని, అంతర్ గ్రంథాలయ అరువు పద్ధతుల అమలు పరచుట, కళాశాలల గ్రంథాలయములు కొనుగోలు చేసిన పుస్తకముల నన్నిటిని విశ్వ విద్యాలయ కేంద్ర గ్రంథాలయము నందే వర్గీకరణ సూచీకరణ. కావించుట మొదలైన బాధ్యతల నతని కప్పగించవలెనని రాఘవరెడ్డిగారు సూచించిరి.

## విశ్వవిద్యాలయ అకడమిక్ కౌన్సిల్ సభ్యులుగా రాఘవరెడ్డి గారి నియామకము :

విశ్వ విద్యాలయ కేంద్ర గ్రంథపాలకునకు తగు అంతస్థు నేర్పరచి, వారికి కూడ అకడమిక్ కౌన్సిల్ నందు సభ్యత్వ మేర్పరచ వలెనని రాఘవరెడ్డిగారు సూచించిరి. 26—11—1970 న జరిగిన అకడమిక్ కౌన్సిల్ సమావేశమునందు విశ్వ విద్యాలయ గ్రంథ పాలకునికి కూడ అకడమిక్ కౌన్సిల్ నందు సభ్యత్వము కల్పించ వలె నను సూచన నంగీకరించుటయేగాక, రాఘవరెడ్డిగారిని మొట్ట మొదటి సారిగా అకడమిక్ కౌన్సిల్ సభ్యులుగా కో ఆప్ట్ చేసిరి. విశ్వ విద్యాలయ గ్రంథాలయాధికారి నింతవరకు అకడమిక్ కౌన్సిల్ నందు సభ్యులుగా చేయలేదు. గ్రంథాలయ నిర్వహణానుభవములనుబట్టి రాఘవరెడ్డిగారిని సభ్యులుగా చేయడం జరిగినది.

## రాఘవరెడ్డిగారి సూచన మేరకు గ్రంథాలయాలలో అదనపు గౌరవ గ్రంథాలయాధికారి అజమాయిషీని రద్దుపరచుట:

విశ్వవిద్యాలయ కళాశాలలయందు విశ్వవిద్యాలయ ప్రొఫెసర్ గాని, రీడర్ గాని గ్రంథాలయములకు గౌరవ పర్యవేక్షకులుగా నుండిరి. గ్రంథాలయ శిక్షణపొందిన కళాశాల గ్రంథాలయ గ్రంథ పాలకులు, శిక్షణ పొందని గౌరవనీయ గ్రంథాలయాధికారినుండి ఉత్తర్వులను గొనుట అసమంజసమయిన విషయము. కాన యు. జి. సి. వారు ఈ విధానమును నిషేధించవలెనను తలంపుతో నుండిరి. రాఘవరెడ్డిగారు వీరి అభిప్రాయముతో పూర్తిగా ఏకీభవించి, గ్రంథాలయములకు గౌరవాధికారుల నియామకము సరియైనది కాదని, ఈ విధానమును తొలగించవలెనని పట్టుబట్టిరి. కొంత కాలమునకు ఈ పద్ధతిని మాన్పించిరి.

### గ్రంథపాలకులకు యు. జి. సి. వేతనములు:

విశ్వ విద్యాలయము నందలి గ్రంథాలయ శాస్త్ర శిక్షణ పొందిన గ్రంథపాలకులు తగు అనుభవము లేనివారైనప్పటికి, మిగుల ఉత్సాహముతో గ్రంథాలయ సేవ చేయుచుండిరి. అట్టి వారికి యు. జి. సి. స్కేళ్ళను మంజూరు చేయ వలసినదిగా రాఘవరెడ్డిగారు సూచించిరి. విశ్వ విద్యాలయమువారు ఈ విషయమును పరిశీలించుట కొరకు ఒక కమిటీని ఏర్పరచి, ఆ కమిటీ యందు శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయమున డెవలప్‌మెంట్ ఆఫీసరుగా పని చేయుచున్న రాఘవరెడ్డిగారిని, మదరాసు విశ్వవిద్యాలయములో గ్రంథాలయ శాస్త్ర అధ్యక్షులు డి బి కృష్ణారావు గారిని సభ్యులుగా నియమించిరి. ఈ కమిటీ విశ్వ విద్యాలయ గ్రంథపాలకులకు యు. జి. సి. స్కేళ్ళ నివ్వవలసినదిగా తీర్మానించినది. ఈ తీర్మానమును విశ్వ విద్యాలయము కూడ ఆమోదించినది.

## తెలంగాణలో ఉధృతమైన ఉద్యమము:

తెలంగాణ ఉద్యమ ఆందోళన కొనసాగుచున్నందున విశ్వ విద్యాలయ కార్యాలయాలలో కార్యకలాపములు స్తంభించినవి. ఈవిధమైన స్తంభన యేర్పడుటచే రాఘవరెడ్డిగారి యితర పథకముల నమలుపరచుటలో జాప్యము జరిగినది. హైదరాబాదులో ఉద్యమము వలన కార్యకలాపములు స్తంభించినవి. కావున ఉద్యమ కాలములో సమయమును వృధాచేయక రాఘవరెడ్డిగారు తిరుపతికి, బాపట్లకువెళ్ళి, అచటి గ్రంథాలయముల సందర్శించి, గ్రంథాలయ కార్యకర్తలకు లభ్యమగు వనరులతోనే సాధ్యమయినంత గ్రంథాలయ సేవ చేయ వలెనని, ఆధునిక పద్ధతులను ప్రవేశ పెట్టవలెనని వివరించు చుండిరి. రాఘవరెడ్డిగారు హైదరాబాదులోని హోమ్ సైన్స్ కళాశాల, రాజేంద్రనగర్‌లోని యితర కళాశాల గ్రంథాలయములకును వెళ్ళి, పరిశోధనా విద్యార్థులకు సహాయపడుచు విద్యార్థులకు ప్రయోజనకర ముగా గ్రంథాలయ సేవ చేయవలెనని గ్రంథపాలకులకు వివరించు చుండిరి.

వ్యవసాయ విశ్వ విద్యాలయ కళాశాలల గ్రంథాలయములు ఉదయం 6 గం|| నుండి సాయంత్రం 5 గం|| వరకు పనిచేయు చుండినవి. రాఘవరెడ్డిగారు ఉదయం 8 గం|| నుండి సాయత్రం 7 గం|| వరకు పనిచేయవలయునని నిర్ణయించి, రాజేంద్రనగర్‌లోని గ్రంథాలయము లలో అచ్చటి గ్రంథపాలకులకు ఆచూకీ సేవ విధానములను గురించి వివరించు చుండిరి. గ్రంథపాఠకులకు సాయంత్రం 7 గం|| వరకు రెఫ రెన్స్ సర్వీసు చేయుచుండిరి.

తెలంగాణ ఉద్యమము కొనసాగుతూ వచ్చినది. రాఘవరెడ్డి గారి పథకములను అమలుపరచుటకు విశ్వవిద్యాలయమునకు వీలు లేక పోయినది. ఇట్టి పరిస్థితులలో రాఘవరెడ్డిగారికి యు. జి. సి. డెవలప్ మెంటు అధికారిగా పదవీ బాధ్యతలు వహించుటకు తిరుపతి శ్రీవేంక

శ్వర విశ్వ విద్యాలయమునుండి ఆహ్వానము వచ్చినది. రాఘవరెడ్డి గారు శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయమునకు కూడ కొంతకాలము పాటు సేవ చేయదలచి, 6—1—71 న శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయమున డెవలప్‌మెంట్ ఆఫీసరుగా చేరిరి.

## ఐ. సి. ఎ. ఆర్. సభ్యుల ప్రశంస:

రాఘవరెడ్డిగారు ప్రత్యేకాధికారిగా వ్యవసాయ విశ్వ విద్యాలయమునందు చేరిన నాటినుండి, కళాశాలల గ్రంథపాలకులకు ఆధునిక పద్ధతుల అవలంబనకు తగు సలహాలను, సూచనలను యిచ్చి నవీన పద్ధతులను ప్రవేశ పెట్టుటకు తగు ప్రోత్సాహమును కల్పించిరి. రాఘవరెడ్డిగారు వ్యవసాయ విశ్వవిద్యాలయమున పని చేయు చుండిన కాలమున విచ్చేసిన I.C.A.R. టీమ్ సభ్యులు కూడ, రాఘవరెడ్డిగారు తయారు చేసిన గ్రంథాలయాల అభివృద్ధి పథకములకు సంతసించిరి. "An Experienced special officer Shri K. Raghava Reddy has been appointed to plan the libraries of the Campuses" అని కూడ రాఘవరెడ్డిగారిని గురించి విశ్వ విద్యాలయమునకు తెలిపిరి.

## శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయములో డెవలప్‌మెంట్ ఆఫీసరుగా నియామకము:

విద్యారంగమునందు అనుభవజ్ఞులయిన రాఘవరెడ్డిగారి సేవను వినియోగించుకొనదలచి, శ్రీ వేంకటేశ్వరా విశ్వవిద్యాలయము వారు 12—10—1970 వ తేదీన జరిగిన సిండికేట్ సభ్యుల సమావేశమునందు, రాఘవరెడ్డి గారిని డెవలప్‌మెంట్ ఆఫీసరుగా నియమించవలెనని ఏకగ్రీవముగా నిశ్చయించిరి. రాఘవరెడ్డిగారు పౌర గ్రంథాలయములందేగాక ప్రత్యేకాధికారిగా, డిప్యూటీ డైరెక్టరుగా నున్న

కాలమున కూడ, కొన్ని సంవత్సరములు విద్యారంగమున పనిచేసి విద్యాశాఖ నిర్వహణాది అంశములను కూడ క్షుణ్ణముగా గ్రహించిన వారు.

గ్రంథాలయ రంగమునందు ప్రత్యేకానుభవమును గడించిన వారగుటయేగాక, విద్యారంగమునందు సమగ్రానుభవము గల వారని శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ పాలక వర్గము భావించినది. రాఘవ రెడ్డిగారే విశ్వవిద్యాలయ గ్రంథాలయమునకు, విశ్వవిద్యాలయ ముద్రణాలయమునకు కూడ, అజమాయిషీదారుగా నుండునట్లు సిండికేట్ సభ్యులు తీర్మానించిరి.

వ్యవసాయ విశ్వవిద్యాలయాధికారులు రాఘవ రెడ్డిగారిని వదలుకొనుటకు సుముఖులుగా లేరు. కాని రాఘవ రెడ్డిగారు పంపిన గ్రంథాలయాభివృద్ధి కార్యక్రమముల అమలు పరచుటకు తెలంగాణ ఆందోళన వలన జాప్యము జరుగుట వలన, వ్యవసాయ విశ్వవిద్యాలయము నుండి 31—12—1970 న విరమించుకొని, తిరుపతి శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయమున 6—1—1971 న డెవలప్‌మెంట్ ఆఫీసరుగా పదవీ బాధ్యతల స్వీకరించిరి.

## గ్రంథాలయశాస్త్రములో సర్టిఫికేటు కోర్సు ప్రారంభము:

1971 నాటికి శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయము గ్రంథాలయ శాస్త్రమునందు సర్టిఫికేటు కోర్సును ప్రారంభించి యుండలేదు. విజయవాడ, హైదరాబాదు నగరములందు సర్టిఫికేటు కోర్సు శిక్షణ నడపబడు చుండినది. కాని దూర ప్రాంతములకు వెళ్ళి, సర్టిఫికేటు కోర్సులో శిక్షణ పొందుట వ్యయ ప్రయాసలతో కూడిన పని యగుటచే కొందరికి కష్టతరముగా నుండినది. ఈ విషయమును రాఘవ రెడ్డిగారు విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు డా॥ డి. జగన్నాథ రెడ్డి గారితో చర్చించి, 1—5—1971 నుండి శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయమునందు సర్టిఫికేటు కోర్సును ప్రారంభించిరి.

విద్యార్థులను విశ్వవిద్యాలయ గ్రంథాలయము నందలి ప్రతి విభాగమునకు తీసుకొని వెళ్ళి, వారికి అభ్యాస పూర్వకముగా ఈ విభాగములలో జరుపు కార్యకలాపముల గురించి తరచుగా వివరించుచుండిరి. తిరుపతిలోని కళాశాలల గ్రంథాలయముల కేగాక, ప్రాంతీయ గ్రంథాలయమునకు కూడ విద్యార్థులను తోడ్కొని వెళ్ళి, వారికి ఆయా గ్రంథాలయముల నిర్వహణ విధానముల వివరించుచుండిరి. కొన్ని శాఖా గ్రంథాలయములకు కూడ తోడ్కొని వెళ్ళి, పౌర గ్రంథాలయములు పనిచేయు విధానములను ఉదాహరణ సహిత ముగా విపులీకరించు చుండిరి. సందర్భమునుబట్టి చర్చాపద్ధతులను కూడ బోధన కుపయోగించిరి. బోధనా పద్ధతులు విద్యార్థులకు సులభ ముగా నుండుటవలన వారు ఉత్సాహముతో తమ శిక్షణను పూర్తి చేసికొనుచుండిరి. ఈ శాఖలో పని చేయుచుండిన అధ్యాపకులు గురసామినాయుడుగారు చక్కని ఉపన్యాసముల నిచ్చి విద్యార్థులకు సంతృప్తి కలుగ జేయుచుండెడివారు.

రాఘవరెడ్డిగారు విశ్వవిద్యాలయ డెవలప్‌మెంటు ఆఫీసరుగా పదవీ బాధ్యతల చేపట్టిన అనంతరము సర్టిఫికేటు కోర్సును ప్రారంభించి, విశ్వవిద్యాలయమున గ్రంథాలయ శాఖ అధికారిగా కూడ నుండి గ్రంథాలయముల కవసరమయిన సిబ్బందికి సర్టిఫికేటు కోర్సునందు శిక్షణకు తగిన ఏర్పాట్లుచేసిరి. సర్టిఫికేటు కోర్సులో తగిన సంఖ్యలో అభ్యర్థులకు శిక్షణ యిచ్చిన పిదప, ఈ కోర్సును నిలుపుదలచేసి B.L. Sc., కోర్సును ప్రారంభించుటకు పూనుకొనిరి.

## పట్టభద్రులకు గ్రంథాలయ శాస్త్ర శిక్షణ :

రాఘవరెడ్డిగారు ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయాల డిప్యూటీ డైరెక్టరుగా, డైరెక్టరుగా నుండిన కాలమున గ్రంథాలయములలో పనిచేయు శిక్షణ పొందని గ్రంథపాలకులను ఎన్నుకొని ఉస్మానియా

విశ్వవిద్యాలయమునకు శిక్షణకై పంపుచుండిరి. హైదరాబాదు నగరమునకు వెళ్ళి శిక్షణ పొంది వచ్చుట శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయ ప్రాంతము వారికి వ్యయ ప్రయాసలతో కూడుకొన్న పని. రాఘవ రెడ్డిగారు శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయమున పదవీ బాధ్యతలు చేపట్టిన అనంతరము పెక్కుగు గ్రంథాలయాభిమానులు శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయమునందే పట్టభద్రుల శిక్షణ ప్రారంభించవలసినదిగా కోరిరి. విశ్వ విద్యాలయ ఉపాధ్యక్షులతో ఈ విషయమును చర్చించి, యు. జి. సి. వారిచే అధ్యాపకుల నియామకమునకు అనుమతిని గైకొని, రాఘవ రెడ్డిగారు డెవలప్ మెంట్ ఆఫీసరు హోదాతోపాటు గ్రంథాలయ శాస్త్ర శాఖాధికారి బాధ్యతలను గూడ చేపట్టి 1973 న బి. ఎల్. ఎస్. సి. కోర్సును ప్రారంభించిరి. ఈనాటికిని ఈ శిక్షణ నిర్వహింపబడు చున్నది. గ్రంథాలయ శాస్త్ర విద్యార్థులకు సులభపద్ధతులలో బోధించుచు, వివిధ గ్రంథాలయములకు వారిని తీసికొని వెళ్ళి, ఉదాహరణ సహితముగా వివిధ విషయముల గురించి వివరించుచుండిరి. విద్యార్థులకు చర్చాపద్ధతుల ద్వారా అవసరమున్నప్పుడు బోధించుచుండిరి.

రాఘవ రెడ్డిగారు శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయ అకడమిక్ కౌన్సిల్ నందును, బోర్డ్ ఆఫ్ స్టడీస నందును, బోర్డ్ ఆఫ్ ఎగ్జామినర్స్ నందును [గ్రంథాలయ శాస్త్రము] సభ్యులుగా నుండిరి.

## పదవీ విరమణానంతరము కొన్ని బాధ్యతలు :

శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయమునందు డెవలప్ మెంట్ ఆఫీసరుగా నుండిన రాఘవ రెడ్డిగారు 31—3—1974 లో పదవీ విరమణ చేసిన అనంతరము కూడ 1977 వరకు బోర్డాఫ్ స్టడీస్ నందు సభ్యులుగా నుండిరి. శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయ సిండికేటు సభ్యుల తీర్మానము మేరకు రెడ్డిగారు 31—3—1974 న డెవలప్ మెంట్

ఆఫీసరుగా పదవీ విరమణ చేసిన అనంతరము కూడ 1974-75 సం॥ బి. ఎల్. ఎస్. సి. విద్యార్థులకు ఉపన్యాసముల నిచ్చిరి.

## విశ్వవిద్యాలయ గ్రంథాలయముపై అజమాయిషీ :

రాఘవరెడ్డిగారు డెవలప్‌మెంట్ ఆఫీసరుగా గ్రంథాలయ శాస్త్ర శాఖకు అధికారిగా మాత్రమేగాక విశ్వ విద్యాలయ గ్రంథాలయము నకు అజమాయిషీ బాధ్యతలను కూడ కల్గి యుండిరి. ఆ రోజులలో విశ్వ విద్యాలయ గ్రంథాలయ గ్రంథపాలకుని పదవి ఖాళీగా యుండి నది. కావున రాఘవరెడ్డి గారు తరచుగా గ్రంథాలయమునకు వెళ్ళి, గ్రంథాలయమునందలి వివిధ శాఖల నిర్వాహకులను కలసికొని వారికి కూడ తగు ప్రోత్సాహము నిచ్చేవారు.

పిల్లల విద్యయందు గొప్ప అభిమానము కల్గిన శ్రీ జగన్నాథ రెడ్డిగారు విశ్వ విద్యాలయ గ్రంథాలయమునందు బాలల గ్రంథాలయ విభాగమును స్థాపించి యుండిరి. విశ్వ విద్యాలయ పరిసర ప్రాంతము లందలి బాలలకీ గ్రంథాలయము మిగుల ప్రయోజనకరముగా నుండినది. తిరుపతి పట్టణములోని ప్రాథమిక, ఉన్నత పాఠశాలల విద్యార్థులు కూడ పెక్కురు సాయంవేళల యందు ఈ గ్రంథాలయమునకు వచ్చి మిగుల ప్రయోజనము పొందుచుండిరి. రాఘవరెడ్డిగారు కూడ తిరుపతి పట్టణములోని ప్రాథమిక పాఠశాలలకు వెళ్ళి, అచటి ఉపాధ్యా యులకు, విద్యార్థులకు ఈ గ్రంథాలయమునందు గల పుస్తకముల వివరములను తెలియజేసి, ఆ గ్రంథాలయములకు వచ్చుటకు వారికి తగు ఉత్సాహమును కల్గించుచుండిరి. రాఘవరెడ్డిగారు పాఠశాలలకు వెళ్ళి బాలల గ్రంథాలయమును గురించి తెలియజేసిన అనంతరము. ఎక్కువ మంది పట్టణ ప్రాంతపు పిల్లలు గ్రంథాలయమునకు వచ్చుచుండిరి. ఈ బాలల గ్రంథాలయమునందు ఉల్లాస, వినోద వికాస కార్యక్రమము లను కూడ ఏర్పాటు గావించిరి.

## పరిశోధక విద్యార్థులకు కల్పించిన వసతులు :

విశ్వ విద్యాలయమునందు పరిశోధక విద్యార్థులకు ప్రయోజన కరముగా నుండునట్లు డాక్యుమెంటేషన్ లిస్టులను తయారు చేసిన, వారికి మిగుల ప్రయోజనకరముగా నుండును. ఆ రోజులలో పరిశోధక విద్యార్థులకు డాక్యుమెంటేషన్ లిస్టులు అందుబాటులో లేకున్నందున, వారు మిగుల ఇబ్బందులకు గురియగు చుండిరి. విశ్వ విద్యాలయ గ్రంథాలయ గ్రంథపాలకుడు డాక్యుమెంటేషన్ లిస్టులను తయారు చేసి, విశ్వ విద్యాలయమునందలి వివిధ శాఖలకు అందించవలసిన ఆవశ్యకత ఎంతేని కలదు. 3—2—71 న రాఘవ రెడ్డిగారు విశ్వ విద్యాలయ గ్రంథాలయమున ఒక సమావేశ మేర్పరచి, ఆ సమావేశ ములో డాక్యుమెంటేషన్ లిస్టులను తయారు చేయవలసిన ఆవశ్య కతను గురించి వివరించగా, విశ్వ విద్యాలయ గ్రంథాలయము నందలి పత్రికల విభాగ అధికారియగు శ్రీ సి. గోవింద కృష్ణన్ అందులకు సమ్మతించి, ప్రతి నెల మొదటి వారమునందు పరిశోధక విద్యార్థులకు ప్రయోజనకరమైన డాక్యుమెంటేషన్ లిస్టులను తయారు చేసి విశ్వ విద్యాలయ కళాశాలలోని వివిధ శాఖలకు పంపుచుండిరి.

## గ్రంథపాలకులకు యు. జి. సి. స్కేళ్ళ వర్తింపుకు సిఫార్సు :

శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయ గ్రంథ పాలకులు మిగుల ఉత్సాహముతో పనిచేయుచు పాఠకులకు తగు విధముగా గ్రంథా లయ సేవ చేయుచుండిరి. విశ్వ విద్యాలయ గ్రంథపాలకులు తమకు యు. జి. సి. వేతనముల మంజూరు చేయవలసినదిగా విశ్వ విద్యా లయమునకు విన్నవించుకొనిరి. అందులకు విశ్వ విద్యాలయము వారు ఈ విషయ పరిశీలన నిమిత్తమై ఒక కమిటీని ఏర్పరచి, అందు రాజేంద్ర నగర్‌లోని వ్యవసాయ విశ్వవిద్యాలయమునందు ప్రత్యేకాధి కారిగా నుండిన రాఘవ రెడ్డి గారిని కూడ సభ్యులుగా నియమించిరి.

రాఘవ రెడ్డిగారు 1970 సం॥ గ్రంథపాలకులకు యు. జి. సి. వేతనముల అమలుపరచుట సముచితమని నిర్ణయించి గ్రంథపాలకులకు యు. జి. సి. స్కేల్లు మంజూరు చేయవలసినదిగా విశ్వ విద్యాలయమునకు సిఫార్సు చేసిరి. కాని యు. జి. సి. స్కేల్లు అమలుపరచడములో మాత్రము జాప్యము జరిగినది.

## ఆర్థికముగా వెనుకబడిన విద్యార్థుల ఉపయోగార్థము స్టడీ సెంటరు ఏర్పాటు :

విశ్వ విద్యాలయము నందు గాని, విశ్వవిద్యాలయాను బంధిత కళాశాలలందుగాని పాఠ్య పుస్తకములు చాల తక్కువగా వుండేవి. అదియునుగాక డిపార్టుమెంటు గ్రంథాలయములను సాయం సమయము లందు 5 గం॥లకు మూసివేయుట వలన విశ్వ విద్యాలయ కళాశాల విద్యార్థులకు వీనివలన ప్రయోజనము తగినంతగా లేకుండినది. పెక్కు మంది పేద విద్యార్థులకు గృహములలో చదువుకొను వసతులు చాల తక్కువగా నుండును. మరియు ఆర్థికముగా వెనుకబడిన పలువురు విద్యార్థులు పాఠ్య పుస్తకముల కొనుటకు తగిన స్థితిని కలిగి యుండరు. మరియు కళాశాల పాఠ్యపుస్తకముల మూల్యము హెచ్చుగా నుండుట వలన యిటువంటి పుస్తకములను కొనుటకు కొందరికి ఆర్థికముగా యిబ్బందికరముగా నుండును. ఇటువంటి పరిస్థితులను దృష్టి యందుంచుకొని విద్యార్థులకు మిగుల ప్రయోజనకరముగా నుండునట్లు పాఠ్య పుస్తకముల కొనుగోలు చేసి స్టడీ సెంటర్లను నెలకొల్పిన పెక్కుమంది పేద విద్యార్థులకు ప్రయోజనకరముగా నుండునని, విశ్వ విద్యాలయ ఉపాధ్యాయులతో రాఘవ రెడ్డిగారు చర్చించి, ఈ విషయమును యు. జి. సి. వారికి విన్నవించి యు. జి. సి మంజూరు చేసిన నిధులతో ప్రప్రథమముగా తిరుపతి యందలి శ్రీ గోవిందరాజ స్వామి కళాశాల నందొక స్టడీ సెంటరును 2—10—1971 న ప్రారం

భించిరి. స్టడీ సెంటరు ఉదయము 9 గం॥ నుండి 12 గం॥ వరకు సాయం త్రము 4-30 గం॥ నుండి 8-30 గం॥ వరకు పనిచేయు చుండినది.



తిరుపతి విశ్వవిద్యాలయ, కళాశాలల విద్యార్థుల కొఱకు శ్రీ గోవింద రాజస్వామి కళాశాలయందు స్థాపించబడిన స్టడీ సెంటరు.

స్టడీ సెంటరుకు కావలసిన పాఠ్య పుస్తకముల కొనుగోలుకు యు. జి. సి. మంజూరుచేయు నిధులు చాలకుండినవి. కావున అట్టి పరిస్థితులలో విశ్వ విద్యాలయ గ్రంథాలయము నుండి పాఠ్య పుస్తకములు తెప్పించు కొనవచ్చునని రాఘవరెడ్డిగారు స్పష్టపరచి ఆ పద్ధతిని అమలు పరచిరి. రాఘవరెడ్డిగారు 7 గం॥ల తరువాత స్టడీ సెంటరునకు వెళ్ళి; అచట ఎక్కువ కాలమును గడిపి అచటి నిర్వాహకులకు కావలసిన సలహాలను, సహాయమును చేయుచూ తగు సూచనల నిచ్చుచూ, విద్యార్థులతో కలసి చర్చించి వారికి కావలసిన వసతులను కూడ కలుగజేయుచుండిరి.

## అనుబంధ కళాశాలల గ్రంథాలయాలకు ప్రోత్సాహము:

పౌర గ్రంథాలయముల డిప్యూటీ డైరెక్టరు గాను, డైరెక్టరు గాను ఉన్న కాలము నుండి రాఘవరెడ్డి గారు కొన్ని కళాశాలల గ్రంథాలయములను సందర్శించి వాటి నిర్వాహకులకు గ్రంథాలయముల అభివృద్ధిని గురించి తెలియ జేసి, శిక్షణ పొందని పలు గ్రంథపాలకులను శిక్షణకుపంపి, ఒక గ్రంథాలయమునుండి మరొక గ్రంథాలయము సహకార విధానము ద్వారా పుస్తకముల సదుపు పొంద వలసినదని కళాశాలల నిర్వాహకులకు తెలియ చేయుచూ కళాశాలల గ్రంథాలయములకు సేవ చేసి యున్నారు. ఈ విషయములు ఇంది వరకే స్థూలముగా వివరింపబడి యున్నవి. శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయ డెవలప్ మెంట్ ఆఫీసరుగా పదవి బాధ్యతలను స్వీకరించి నాటినుండి రాఘవరెడ్డిగారు విశ్వ విద్యాలయమునకు అనుబంధ కళాశాలల గ్రంథాలయముల అభివృద్ధికి కూడ కృషి చేసిరి. డెవలప్ మెంట్ ఆఫీసరైన రాఘవరెడ్డిగారు యు. జి. సి. వారి కూడ పెక్కు కళాశాలల గ్రంథాలయముల అభివృద్ధికి నిధులను కూడ మంజూరు చేయించిరి. ఈ గ్రంథాలయముల యందలి శిక్షణ పొందని పలు గ్రంథపాలకులకు శిక్షణ పొందవలసినదిగా సలహా చేసి, వారికి శిక్షణకు వెళ్ళుటకు తగిన ఉత్సాహ ప్రోత్సాహములను కూడ కలుగ జేసి పలువురను శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయమునందు శిక్షితుల జేసిరి.

## కళాశాలల గ్రంథాలయాభివృద్ధికై ఏర్పాటు చేసిన సదస్సు:

అనుబంధ కళాశాలల గ్రంథాలయముల అభివృద్ధి గురించి, గ్రంథాలయముల సిబ్బంది స్థితిగతుల మెరుగు పరచుటకు తీసి కొనవలసిన చర్యలను గురించి చర్చించు నిమిత్తము

17—7—1971 న శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షుల వారి అధ్యక్షతన ఒక సమావేశము ఏర్పాటు కావింపబడినది. డెవలప్‌మెంట్ ఆఫీసరగు రాఘవరెడ్డిగారు, ప్రిన్సిపాల్ శ్రీ ఎమ్. వి. రామశర్మగారు, విశ్వవిద్యాలయ రిజిష్ట్రారు శ్రీ రామకృష్ణన్‌గారు, యు. ఎస్. ఐ. ఎస్. గ్రంథాలయ అధికారి శ్రీ తిరువేంగడం తదితరులు ఆ సమావేశానికి హాజరయిరి. ఆ సమావేశమునందు అనుబంధిత కళాశాలల గ్రంథాలయములను సాంకేతికముగా అభివృద్ధి పరచవలెనని, ఈ గ్రంథాలయ గ్రంథపాలకులకు కళాశాలల అధ్యాపకులతో సమానముగా వేతనముల మంజూరు చేయవలసినదని, యిందు నిమిత్తము ఒక సదస్సును ఏర్పాటు చేయవలెనని తీర్మానించడము జరిగినది. ఈ తీర్మానము మేరకు 14—10—1971 నుండి 16—10—1971 వరకు సదస్సు నిర్వహింపబడినది. ఈ సదస్సునకు విశ్వవిద్యాలయానుబంధిత కళాశాలల గ్రంథపాలకులు, కొందరు ప్రొఫెసరులు, తిరుపతి పట్టణము నందలి కళాశాలల అధికారులు, తదితరులు, విశ్వవిద్యాలయ గ్రంథాలయోద్యోగులు మున్నగువారు హాజరయిరి. ఈ సదస్సునందు విద్యాభివృద్ధికి గ్రంథాలయముల పాత్ర (Evaluation of College Libraries as Educational tools) ఎంత వరకు ప్రాధాన్యత వహించుచున్నదన్న అంశముపై చర్చ జరిగినది. ఈ చర్చలలో గైకొన్న తీర్మానములను ముద్రించి వాటిని అనుబంధిత కళాశాలల గ్రంథాలయముల కన్నిటికి పంపి, ఆ తీర్మానములను అమలు పరచవలసినదిగా రాఘవరెడ్డిగారు కళాశాలలకు తెలియజేసిరి.

## డెవలప్ మెంట్ ఆఫీసరుగా చేపట్టిన కొన్ని ముఖ్య అభివృద్ధి పథకములు :

6—1—1971 నుండి 31—3—1974 వరకు విశ్వవిద్యాలయ డెవలప్‌మెంట్ ఆఫీసర్‌గా విద్యారంగమునకు కావించిన అభి

వృద్ధి కార్యక్రమములను ప్రస్తావించక తప్పదు. వారు డెవలప్‌మెంట్ ఆఫీసరుగా విశ్వవిద్యాలయాభివృద్ధికి పెక్కు ప్రణాళికలను రూపొందించి, యు. జి. సి. వారి అనుమతితో వాటిని చక్కగా అమలు పరచుటకు బహువిధముల కృషి చేసిరి. విద్యా శాఖయందు వారు గడించిన అనుభవము విశ్వవిద్యాలయములో విద్యాభివృద్ధికి సంబంధించిన ప్రణాళికలను అమలు పరచుటకు ఎంతో తోడ్పడినవి. విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు మఱియు సిండికేటు సభ్యులు ఈ పథకముల నమలు పరచుటకు రాఘవరెడ్డిగారి కెంతో ప్రోత్సాహము నిచ్చిరి. రాఘవరెడ్డిగారు విశ్వవిద్యాలయములో డెవలప్‌మెంట్ ఆఫీసరుగాయున్న యనతికాలములోనే విశ్వవిద్యాలయ కళాశాలల యందలి శాఖల సంఖ్య, మునుపటికంటె చాల యెక్కువైనవి. విశ్వవిద్యాలయ సమగ్రాభివృద్ధికి వీరు చేసిన కృషి ప్రశంసనీయమైనది.



# ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ (సవరణ) చట్టము 1964.

## 1960 పౌర గ్రంథాలయ చట్టమునకు సవరణలు–వాటి ఆవశ్యకత:

ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ చట్టము 1—4—1960 న అమలులోనికి వచ్చినది. ఈ చట్టము అమలుపరచు బాధ్యత వహించిన రాఘవరెడ్డి గారికి ఈ చట్టమును అమలుపరచు సందర్భమున కొన్ని సమస్య లెదురైనవి.

10—12—1959 న ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయముల బిల్లుపై అసెంబ్లీలో చర్చలు జరుపు సందర్భమున సభ్యులు జిల్లా గ్రంథాలయోద్యోగులను ప్రభుత్వోద్యోగులుగా పరిగణించవలెనని కోరగా విద్యా శాఖ మంత్రి అందుల కంగీకరించిరి. కాని చట్టము నందు జిల్లా గ్రంథాలయోద్యోగులను ప్రభుత్వోద్యోగులుగా పరిగణించబడునట్లు సూచించబడ లేదు. కావున గ్రంథాలయములందు పనిచేయు వారు ప్రభుత్వ సిబ్బందిగా పరిగణింపబడుటకు వీలులేక పోయినది. మరికొన్ని సమస్యలు కూడా ఎదురుకాగా ఆ సమస్యల పరిష్కారమునకు, గ్రంథాలయముల నిర్వహణ సులభ సాధ్యమగునట్లు చేయుటకు రాఘవ రెడ్డిగారు ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ చట్టమునకు కొన్ని సవరణలు చేయవలెనని గుర్తించి, ప్రభుత్వమునకు ఆ సవరణలను సూచిస్తూ డ్రాఫ్టు బిల్లును పంపిరి.

## అసెంబ్లీలో విద్యామంత్రి ప్రసంగిస్తూ సూచించిన కొన్ని ముఖ్య సవరణలు:

రాఘవరెడ్డిగారు పంపిన సవరణల డ్రాఫ్టు బిల్లును ప్రభుత్వము చక్కగ పరిశీలించి కొన్ని మార్పులను చేసినది. సవరణలు చేయు

బడిన బిల్లును 4—7—1964 న అసెంబ్లీయందు విద్యా శాఖ మంత్రి గారు ప్రవేశపెట్టుచూ, హైదరాబాదు కార్పొరేషన్ - సికింద్రాబాదు కార్పొరేషన్ అని ప్రత్యేకముగా గాక జంట నగరములకు హైదరాబాదు కార్పొరేషన్ అని అనగా, రెండు నగరములకు ఒకే కార్పొరేషన్ ఉండునట్లు చట్టమునందు సూచింపబడవలెనని, లోకల్ లైబ్రరీ అథారిటీల ఆధీనము నందలి గ్రంథాలయోద్యోగులకు సంబంధించిన (Service Rules) సేవా నిబంధనల తయారు చేయవలెనని, కాన ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ చట్టమునకు సవరణల కల్పించవలసిన ఆవశ్యకత కలదని వివరించిరి.

## సవరణలపై అసెంబ్లీలో సభ్యుల అభిప్రాయములు:

జిల్లా పరిషత్, పురపాలక సంస్థలలోని ఉద్యోగుల సేవా నిబంధనలవలె గ్రంథాలయోద్యోగులకు కూడ సేవానిబంధనల రూపొందించవలెనని ఏ. నాగేశ్వరరావుగారు తెలియజేసిరి.

ఆంధ్రప్రదేశ్ నందు గ్రంథాలయోద్యమము అగ్రస్థానమందున్నదని ఒక గ్రంథాలయ సదస్సునందు శ్రీ ఎం. సి. చాగ్లాగారు కూడ వక్కాణించారని, మన రాష్ట్రమునందు గ్రంథాలయముల అభివృద్ధికి తగిన ప్రచారము జరుగుటలేదని శ్రీ వావిలాల గోపాల కృష్ణయ్యగారు చర్చా సందర్భమున వివరించిరి. అంతేగాక వావిలాల గోపాలకృష్ణయ్యగారు (Library Service Rules) గ్రంథాలయ సేవానిబంధనల గురించి వివరించుచూ, లైబ్రరీ సర్వీసు అనుటకన్న గవర్నమెంటు సర్వీసు అనుటయే సమంజసముగా నుండునని తెలియజేయగా, అందులకు మంత్రిగారు లైబ్రరీ సర్వీసు అనగా గవర్నమెంటు సర్వీసు అని తెలియజేసినారు. తదనంతరము వావిలాల గోపాల కృష్ణయ్యగారు తగిన వ్యక్తి లభ్యము కాలేదనో, ఏ యితర కారణముల వలననో పౌర గ్రంథాలయ శాఖకు ప్రత్యేక డైరెక్టరు నియా

మకము జరుగలేదని కూడ ప్రస్తావించారు. పుస్తకముల కొనుగోలు విధానము సమంజసముగా లేదని, కొన్ని సమయములందు మార్చి నెల ఆఖరునందు కూడ పుస్తకముల కొనుగోలు చేయడము జరుగుచున్నదని, పుస్తకముల ధరలను కూడ మార్పు చేయడము జరుగుచున్నదని, అంతేగాక ప్రభుత్వమే గ్రంథాలయములకు పుస్తకముల కొనుగోలుచేసి పెట్టుటవలన పుస్తకముల కొనుగోలుకు గ్రంథాలయములకు స్వేచ్ఛ వుండజాలదని కూడ శ్రీ వావిలాలగారు వ్యక్తీకరించారు.

ఈ విధమైన చర్చలు జరిగిన అనంతరము విద్యాశాఖ మంత్రిగారు సూచించిన సవరణల నామోదించడం జరిగినది.

## అసెంబ్లీలో అమోదింపబడిన సవరణలు:

| ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయాల చట్టము 1960 | ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయాల (సవరణ) చట్టము 1964 |
|---|---|
| 1. సెక్షన్ 10 (1) సి మేరకు హైదరాబాదు కార్పొరేషన్ నుండి ఒక సభ్యుని, సికింద్రాబాదు కార్పొరేషన్ నుండి ఒక సభ్యుని హైదరాబాదు నగర లోకల్ లైబ్రరీ అథారిటీకి ఎన్నుకొనవలెను. | హైదరాబాదు కార్పొరేషన్ మరియు సికిందరాబాదు కార్పొరేషన్ కలిసి హైదరాబాదు కార్పొరేషన్‌గా ఏర్పడినది. ఈ కార్పొరేషన్ సభ్యులు తమలో ఇరువురిని హైదరాబాదు నగర లోకల్ లైబ్రరీ అథారిటీకి ఎన్నిక చేయవలెను. |

| | |
|---|---|
| 2. సెక్షన్ 10 (2) (డి) ప్రకారము జిల్లాలోని మునిసిపల్ కౌన్సిల్స్ లేక కమిటీలు కలసి ఇద్దరు సభ్యులను జిల్లా లోకల్ లైబ్రరీ అథారిటీలకు ఎన్నుకొనవలెను. | జిల్లాలోని ప్రతి మునిసిపల్ కౌన్సిల్ లేదా మునిసిపల్ కమిటీ తమ సభ్యుల నుండి ఇరువురిని జిల్లా లోకల్ లైబ్రరీ అథారిటీకి సభ్యులుగా ఎన్నిక చేయవలెను. |
| 3. సెక్షన్ 13 (సి) ననుసరించి జిల్లా లోకల్ లైబ్రరీ అథారిటీలు గ్రంథాలయములకు అవసరమైన సిబ్బందిని ఎప్పటికప్పుడు నియమించుకొనవచ్చును. | ఈ సెక్షన్‌ను పూర్తిగా తొలగించడమైనది. |
| 4. సెక్షన్ (13) నందు లోకల్ లైబ్రరీ అథారిటీ యాజమాన్యము ప్రభుత్వ గ్రంథాలయములకు వర్తింపదని తెలుపబడలేదు. | సెక్షన్ 13 (2) నందు ప్రభుత్వ గ్రంథాలయములు లోకల్ లైబ్రరీ అథారిటీల యాజమాన్యము క్రిందికి రావని స్పష్టపరచబడినది. |
| 5. 1960 చట్టములో లోకల్ లైబ్రరీ అథారిటీలకు చెందిన సిబ్బందిని Library Service కు చెందిన సిబ్బందిగా గుర్తింపబడునట్లు సూచించబడలేదు. | 1964 చట్టములో సెక్షన్ 19 (ఎ)ను కల్పించి అందు లోకల్ లైబ్రరీ అథారిటీలకు చెందిన సిబ్బందిని Library Service కు చెందినసిబ్బందిగా గుర్తింపబడుట కవకాశము కల్పించబడినది. |
| 6. సెక్షన్ 20(2)(ఎ) ప్రకారము హైదరాబాదు నగరమునందు | సెక్షన్ 20 (2)(ఎ) ప్రకారము హైదరాబాదు, సికింద్రా |

| | |
|---|---|
| హైదరాబాదు మునిసిపల్ కార్పొరేషన్ ద్వారా సెస్సు వసూలు చేయవలెను. | బాదు జంట నగరములయందు హైదరాబాదు పురపాలక కార్పొరేషన్ ద్వారా సెస్సు, |
| 6. (ఎ) సెక్షన్ 20 (2) (బి) ప్రకారము సికింద్రాబాదు నగరమునందు సికింద్రాబాదు నగర మునిసిపల్ కార్పొరేషన్ ద్వారా సెస్సు వసూలు చేయవలెను. | వసూలు చేయవలెనని సూచించబడినది. కావున 1960 చట్టములోని 20 (2) (బి) ని తొలగించడం జరిగినది. |
| 7. సెక్షన్ 25 నందు లోకల్ లైబ్రరీ అథారిటీ యాజమాన్యములోని పౌర గ్రంథాలయోద్యోగుల నియామకము గురించి ప్రభుత్వ మే విధమయిన చర్యల గైకొనవచ్చునో సూచించ బడలేదు. | సెక్షన్ (25) (2) లో కల్పించబడిన (ఇ) అండ్ (ఎఫ్) ల ప్రకారము లోకల్ లైబ్రరీ అథారిటీ యాజమాన్యమునందలి పౌర గ్రంథాలయ సిబ్బందిని నియమించుటకు, వారి జీత భత్యముల నిర్ణయించుటకు, సేవ షరతీ యు సిబ్బందికి సంబంధించిన నిబంధనల రూపొందించుటకు ప్రభుత్వమున కధికారము కలదు. |
| 8. సెక్షన్ 25 (3) ప్రకారము ప్రభుత్వము రూపొందించిన గ్రంథాలయ నిబంధనలను విధాన మండలి, విధాన పరిషత్‌ల యందు 14 రోజుల | సెక్షన్ 25 (3) ననుసరించి విధానమండలి, విధాన పరిషత్ లందు ప్రవేశ పెట్టబడి ఆమోదింప బడిన నిబంధనలనే అనుసరించ వలెను. |

లో ప్రవేశ పెట్టవలెను. ఈ కాలమున విధాన మండలి యందుగాని, విధాన పరిషత్ యందుగాని సవరణలు చేయ బడినచో మార్పు చేసిన నిబంధనల ననుసరించవలెను. అయితే 1964 సం॥ నకు మును పు అనుసరింపబడిన నిబంధన లకిది వర్తించదు.

## కౌన్సిల్‌లో సవరణ ఆమోదము:

విద్యాశాఖ మంత్రిగారు 23—7—1964 వ తేదీన అసెంబ్లీలో ఆమోదము పొందిన సవరణల బిల్లును కౌన్సిల్‌నందు ప్రవేశపెట్టిరి. హైదరాబాదు, సికిందరాబాదు నగరములకు ఒకే లోకల్ లైబ్రరీ అథారిటీ ఉండవలెనని, లోకల్ లైబ్రరీ అథారిటీలోని గ్రంథాలయ సిబ్బందికి గ్రంథాలయ సేవా నిబంధనలను రూపొందించుటకు ప్రభుత్వమున కధికార ముండవలెననిరి. చర్చల యనంతరము అసెంబ్లీలో ఆమోదింప బడిన సవరణ బిల్లును కౌన్సిల్ ఆమోదము కూడ పొందినది.



# ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ (సవరణ) చట్టము: 1969.

1—4—1960 సం॥ నుండి అమలులోనికి వచ్చిన ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయాల చట్టమును మఱింత ప్రయోజనకరముగా రూపొందించు నిమిత్తము 1969 సం॥ నందు, గ్రంథాలయముల నిర్వహణా విధానములను చక్కగా నాకళింపు చేసికొని, గ్రంథాలయ స్థితుగతుల మెఱుగు పరచుటకు మార్గముల గ్రహించినటువంటి గ్రంథాలయ శాఖ డైరెక్టరు రాఘవరెడ్డి గారు చట్టములో కొన్ని సవరణలను ప్రభుత్వమునకు సూచించిరి.

## సవరణల బిల్లును శాసన సభలో ప్రవేశ పెట్టినపుడు విద్యా శాఖ మంత్రి ప్రసంగము:

ప్రభుత్వము రాఘవరెడ్డిగారు చేసిన సూచనలను సమగ్రముగా పరిశీలించిన యనంతరము కొన్ని మార్పులతో ఈ సవరణల బిల్లును విద్యాశాఖామాంత్యులయిన శ్రీ పి. వి. నరసింహారావు గారు 3—12—1968 న శాసనమండలి యందు ప్రవేశ పెట్టిరి. ఈ సవరణల బిల్లును ఆమోదించ వలసిన అవసర మెంతేని కలదని విశదీకరించిరి.

## సవరణ బిల్లులోని ముఖ్య సూచనలు:

1. లోకల్ లైబ్రరీ అథారిటీలను జిల్లా గ్రంథాలయ సంస్థలుగా పేర్కొన వలెను.

2. లోకల్ లైబ్రరీ అథారిటీ సభ్యుల కాలపరిమితిని మూడు సం॥ల నుండి ఐదు సం॥లకు పొడిగించవలెను.

3. ప్రస్తుతము లోకల్ లైబ్రరీ అథారిటీలు గ్రంథాలయములకు కొనుగోలు చేయు పుస్తకములు మిగుల ప్రయోజనకర

మైనవిగా లేకపోవుట వలన బహుళ ప్రయోజనమును కూర్చు పుస్తకములనే లోకల్ లైబ్రరీ అథారిటీలు కొనుగోలు చేయవలెను. ప్రభుత్వము సిఫార్సు చేసిన పుస్తకములను లోకల్ లైబ్రరీ అథారిటీలు కొనుగోలు చేయవలెను.

4. అధికార దుర్వినియోగము చేయు లోకల్ లైబ్రరీ అథారిటీ చైర్మన్‌లను సభ్యులు తొలగించుటకు చట్టమునందవకాశము కల్పించవలెను.

**శాసన సభలో సవరణ బిల్లుపై సభ్యుల చర్చలు :**

చైర్మన్‌పై అవిశ్వాస తీర్మానమును ప్రకటించు అవకాశమును సవరణ బిల్లునందు ప్రతిపాదించుటను శ్రీ టి. సి. రాజన్‌గారు వ్యతిరేకించిరి. పుస్తకముల కొనుగోలు విషయము నందు లోకల్ లైబ్రరీ అథారిటీలకు పూర్తి స్వేచ్ఛ నొసగవలెనని కూడ తెలియ జేసిరి. శ్రీ ఎ. భాస్కరరావు లోకల్ లైబ్రరీ అథారిటీలకు పుస్తకముల కొనుగోలు నందు పూర్తి స్వేచ్ఛ నొసగవలెనని వివరించిరి.

చర్చలలో టి. సి. రాజన్‌గారు, శ్రీ గోవిందరావుగారు 1964 సం॥ శాసన మండలి సమావేశములందే గ్రంథ పాలకులను ప్రభుత్వోద్యోగులుగా గుర్తించుటకు ఆమోదించడము జరిగినప్పటికి, యింతవరకు వీరిని ప్రభుత్వోద్యోగులుగా పరిగణింపబడకుండుట మిగుల విచారకరమైన విషయమని తెలియ జేసిరి.

మైసూరు రాష్ట్రమునందు పౌర గ్రంథాలయ చట్టము, 1965 లో అమలు లోనికి వచ్చినప్పటికి, గ్రంథాలయోద్యోగులను ప్రభుత్వోద్యోగులుగా గుర్తించడము జరిగినదని ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ చట్టము 1960 సం॥ నందే అమలులోనికి వచ్చినప్పటికి, యింతవరకు గ్రంథాలయ సిబ్బంది ప్రభుత్వ సిబ్బందిగా పరిగణింపబడక పోవడము మిగుల శోచనీయమని శ్రీ టి. సి. రాజన్‌గారు పునరుద్ఘాటించిరి.

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యగారు కూడ 1964 సం॥ నందు గ్రంథపాలకులను ప్రభుత్వ సిబ్బందిగ గుర్తించుట కంగీకరించి నప్పటికి, ఈ అంగీకారము నింతవరకు కూడ అమలులో పెట్టక పోవుట గుర్తించ వలసిన విషయమని వివరించిరి.

గ్రంథాలయ సెస్సును పురపాలక సంస్థలు, పంచాయతీలు సక్రమముగా వసూలు చేయుట లేదని, వసూలు చేసిన మొత్తమును లోకల్ లైబ్రరీ అథారిటీల గ్రంథాలయ నిధికి సక్రమముగా చెల్లించుట లేదని శ్రీ ఎ. భాస్కరరావు చర్చా సందర్భమున స్పష్టీకరించిరి. మూడు సం॥ లలో వసూలయిన మొత్తము యొక్క సగటును పురపాలక సంస్థలు, పంచాయతీలు ప్రతి సంవత్సరము ఏప్రిల్ నెల 15 వ తేదీ లోపున లోకల్ లైబ్రరీ అథారిటీలకు చెల్లించ వలెనని, తదనంతరము [ లెక్కల పరిశీలన (Audit) యనంతరము ] మిగిలిన మొత్తమును చెల్లించ వలెనని, వావిలాల గోపాల కృష్ణయ్య గారు కూడ సూచించిరి.

పురపాలక సంస్థలు, పంచాయతీలు తదితర సంస్థలు వసూలు చేయు గ్రంథాలయ సెస్సునకు సమాన మొత్తమును ప్రభుత్వము గ్రంథాలయ నిధికి గ్రాంటు క్రింద మంజూరు చేయవలెను. ఎటువంటి పరిస్థితులయందును ఈ గ్రాంటు 50,000/- కు తక్కువ కాకూడదని శ్రీ కె. గోవిందరావుగారు సూచించిరి.

ప్రామాణిక (Standard Works) పుస్తకములను ప్రభుత్వమే రాష్ట్రమునందలి గ్రంథాలయములకు పంపిణీ చేయుట శ్రేయోదాయకమని పలువురి అభిప్రాయమని, శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య గారు చర్చలలో వివరించుచూ, పుస్తకముల రిజిస్ట్రారుగా రాష్ట్ర కేంద్ర గ్రంథాలయ పుస్తక భాండాగారిని నియమించుట ప్రయోజనకరమని తెలియజేసిరి. మఱియు లోకల్ లైబ్రరీ అథారిటీలను జిల్లా గ్రంథాలయ సంస్థలుగా పేర్కొనవలసిన అవసరము కూడ ఎంతేని కలదని కూడ వివరించిరి.

ఈ విధముగా చర్చలు జరిగిన అనంతరము లోకల్ లైబ్రరీ అథారిటీల సభ్యుల కాలపరిమితిని మూడు సం॥ల నుండి ఐదు సం॥లకు పొడిగించుటకు, లోకల్ లైబ్రరీ అథారిటీలను జిల్లా గ్రంథాలయ సంస్థలుగా పేర్కొనుటకు అంగీకరించడము జరిగినది.

## విద్యామంత్రిగారి సమాధానము:

చర్చల అనంతరము విద్యాశాఖా మంత్రి శ్రీ పి. వి. నరసింహారావుగారు లోకల్ లైబ్రరీ చేర్మెన్‌లు కొన్ని సందర్భములందు అభిప్రాయ భేదముల వలననో లేక మరే యితర కారణముల వలననో చెక్కులపై సంతకములు చేయుటకు నిరాకరించడము లేదా జాప్యము చేయు సందర్భములందు లోకల్ లైబ్రరీ అథారిటీలను రద్దు చేయుట కంటె, చైర్మెన్‌ను తొలగించుటకు ప్రభుత్వమున కధికారము కల్పించుట సముచితమని, ప్రభుత్వము కూడ ఈ విషయముపై ఉదారబుద్ధి కల్గియుండునని స్పష్టపరచిరి. సాధారణముగా కొన్ని గ్రంథాలయములు ప్రామాణిక పుస్తకములను కొనుటలేదని, సాహిత్య అకాడమీ తదితర సంస్థలు ప్రచురించు ఉత్తమ పుస్తకముల కొనుటలేదని తెలిపిరి.

అనంతరము విద్యాశాఖామాత్యుల సూచనలు ఆమోదింపబడినవి.

## విధాన పరిషత్తులో ప్రవేశ పెట్టబడిన సవరణల బిల్లుపై ప్రసంగము:

విధానమండలిలో ఆమోదించబడినటువంటి సవరణ బిల్లును 12—12—1963 తేదీన విద్యాశాఖ మంత్రిగారు విధాన పరిషత్ యందు ప్రవేశ పెట్టుచు లోకల్ లైబ్రరీ అథారిటీ సభ్యుల కాలపరిమితిని, రాష్ట్ర గ్రంథాలయ కమిటీ సభ్యుల కాలపరిమితిని 3 సం॥ల నుండి 5 సం॥లకు పొడిగించవలెనని, లోకల్ లైబ్రరీ

అథారిటీలను జిల్లా గ్రంథాలయ సంస్థలుగా పేర్కొనవలెనని, ప్రభుత్వము ఆమోదించిన పుస్తకముల జాబితాలోని పుస్తకములను లోకల్ లైబ్రరీ అథారిటీలు తమ బడ్జెట్‌లో 25/- శాతమునకు తక్కువ గాకుండ కొనుగోలు చేయవలెనని, లోకల్ లైబ్రరీ అథారిటీల చైర్మెన్‌లు తమ బాధ్యతల సక్రమముగా నిర్వర్తింప కున్నచో ఆ సంస్థలను రద్దుచేయక, చైర్మెన్‌లను మాత్రమే తొలగించిన సమంజసముగా నుండునని తమ అభిప్రాయముల వ్యక్తము చేసిరి.

ఈ బిల్లునకు సంబంధించిన చర్చలలో పాల్గొనుచూ శ్రీ డి. ఎస్. సుబ్రహ్మణ్యంగారు గ్రంథాలయోద్యోగుల సేవా నిబంధనల (Service Rules) ను యింతవరకు రూపొందించడము జరుగలేదని తెలియ జేసిరి.

పంచాయతీలు గ్రంథాలయ సెస్సును సక్రమముగా వసూలు చేయ కున్నందులకు గాను వాటిపై తగు చర్యల నింతవరకు గైకొనడము జరుగలేదని, గ్రంథాలయ సెస్సు వసూలు సక్రమముగా లేనందున ఉద్యోగస్థులకు కూడ వేతనములు సకాలమునందు అందుట లేదని, గ్రంథాలయములలో మంచి అనుభవమును గడించిన, ప్రత్యేక శిక్షణ పొందినటువంటి ప్రస్తుత డైరెక్టరు గారు పదవీ విరమణ చేసినచో ఆ స్థానమును భర్తీ చేయుటకు తగిన సమర్థత కలవారు లేరని శ్రీ టి. పి. సి. కూర్మాచార్యులుగారు వివరించిరి.

ప్రతి లోకల్ లైబ్రరీ అథారిటీలో ఒక షెడ్యూల్డు కులమునకు చెందిన అభ్యర్థి సభ్యుడుగా నుండవలెనని శ్రీ ఎ. జోసఫ్ గారు వివరించిరి.

గ్రంథాలయములలో పనిచేయు ఉద్యోగుల హోదాను పెంచవలెనని శ్రీ గిరిధరరావుగారు సూచించిరి. వయోజన విద్యయందును

సాహిత్యమునందును అనుభవములు కలవారికి రాష్ట్ర గ్రంథాలయ కమిటీయందు సభ్యత్వమును కల్పించ వలెనని శ్రీ పి. వి. రాఘవాచార్యులు గారు వివరించిరి. ఉపాధ్యాయుల తరపున, పట్టభద్రులయిన వారి తరపున ఆ యా జిల్లాలలో ఎమ్. ఎల్. సి. లుగా నున్నటువంటి వారిని ఆ యా జిల్లాలలో లోకల్ లైబ్రరీ అథారిటీల యందు సభ్యులుగా చేర్చినచో, గ్రంథాలయముల కవసరమయిన ప్రయోజనకర పుస్తకముల నెన్నుకొనుటకు తోడ్పడుదురని శ్రీ వై. సి. రంగారెడ్డి గారు స్పష్టపరచిరి.

## విధానపరిషత్తులో బిల్లుపై విద్యా మంత్రి సమాధానము :

విధానపరిషత్తులో చర్చలు జరిగిన అనంతరము విద్యా శాఖ మంత్రి గారు చర్చలకు సమాధానము నొసగుచూ, గ్రంథాలయములకు కావలసిన పుస్తకముల కొనుగోలులో లోకల్ లైబ్రరీ అథారిటీలకు కూడ అధికారము కలదని, లోకల్ లైబ్రరీ అథారిటీలు ఏవేని ఉత్తమ పుస్తకములను ప్రభుత్వ ఉన్నత అధికార కమిటీకి ( High Power Committee) సూచించినచో వాటిని ఈ కమిటీ పరిశీలించి కొనుగోలు చేసికొనుటకు అనుమతించునని, పంచాయతీలు, పురపాలక సంస్థలు సక్రమముగా సెస్సు వసూలు చేయుటకు తగిన చర్యలు గైకొనడం జరుగునని, అశ్లీల సాహిత్యమును గ్రంథాలయములలో నిషేధించడము కూడ జరుగునని స్పష్టపరచిరి.

ప్రభుత్వమే గ్రంథాలయములు కొనుగోలు చేయవలసిన పుస్తకముల జాబితాను తయారు చేయవలసిన అవసరము కలదని వివరించిరి. ఈ విధముగా ప్రభుత్వము రూపొందించిన పుస్తకముల జాబితా నుండి మాత్రమే గ్రంథాలయములు తమకు కావలసిన పుస్తకముల నెన్నుకొని కొనుగోలు చేయవలసి యున్నది. లోకల్ లైబ్రరీ అథారిటీలు ఈ జాబితాయందు తమ గ్రంథాలయములకు

అవసరమగు పుస్తకములు లేనిచో వాటిని సూచించిన, అట్టి ఆ పుస్తకములను కూడ ప్రభుత్వముచే యంగీకరింపబడిన జాబితాయందు చేర్చవచ్చు ననిరి. ఈ విధముగా రూపొందింపబడిన పుస్తకముల జాబితా నుండి ఆ యా గ్రంథాలయములు తమకు కావలసిన పుస్తకములను ఎన్నుకొని కొనుగోలు చేసికొనవలెనని శ్రీ పి. వి. నరసింహారావుగారు విశదము చేసిరి. ఈ విధముగా విద్యా శాఖ మంత్రి ప్రతిపాదించిన సవరణలు విధాన పరిషత్తు ఆమోదము పొందినది.

## సవరణ బిల్లుపై ఆమోదము :

ఈ విధముగా విధాన మండలి యందును, విధాన పరిషత్తు నందును చర్చలు జరిగిన అనంతరము విద్యా శాఖ మంత్రి గారు ప్రతిపాదించిన సవరణలతో కూడిన చట్టము 1969 జనవరి 15 వ తేదీన గవర్నరుగారి ఆమోద ముద్ర పొందడం జరిగినది. తదనంతరము ఈ చట్టమును 18—1—1969 న ఆంధ్రప్రదేశ్ గెజెట్ నందు ప్రకటించడము జరిగినది.

| ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ (సవరణల) చట్టము 1964 | ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ (సవరణల) చట్టము 1969 |
|---|---|
| 1. సెక్షన్ 2 (9) (ఎ) ప్రకారము జిల్లా గ్రంథాలయముల అజమాయిషీ బాధ్యతల వహించు సంస్థలను లోకల్ లైబ్రరీ అథారిటీలుగా సూచించడము జరిగినది. | 1. సెక్షన్ 2 (9) (ఎ) ప్రకారము జిల్లా గ్రంథాలయముల అజమాయిషీ బాధ్యతల వహించు సంస్థలను 1964 నందు సూచింపబడినట్లు లోకల్ లైబ్రరీ అథారిటీలుగా గాక జిల్లా గ్రంథాలయ సంస్థలుగా సూచించడం జరిగినది. |
| 2. సెక్షన్ 3 (2) (బి) ననుసరించి స్థానిక సంస్థలకు అజమాయిషీ వహించు మంత్రిగారు రాష్ట్ర గ్రంథాలయ కమిటీ యందు సభ్యులు. | 2. సెక్షన్ 3 (2) (సి) ననుసరించి మంత్రికి బదులు ఆరోగ్య, పురపాలక శాఖ సెక్రటరీకి గ్రంథాలయ కమిటీ యందు సభ్యత్వము కల్పించడము జరిగినది. |
| 3. సెక్షన్ 3 (2) (డి) ననుసరించు పౌర గ్రంథాలయ శాఖ డైరెక్టరు రాష్ట్ర గ్రంథాలయ కమిటీయందు సభ్యులు. | 3. సెక్షన్ 3 (2) (డి) ప్రకారము పౌర గ్రంథాలయ శాఖ డైరెక్టరు రాష్ట్ర గ్రంథాలయ కమిటీ యందు సభ్యుడు మరియు రాష్ట్ర గ్రంథాలయ కమిటీకి సెక్రటరీ కూడ. 1964 చట్టము నందు సూచించబడిన సెక్షన్ 3 (2) (1) ను రద్దు చేయడం జరిగినది. |

4. సెక్షన్ 3 (2) (ఇ) ప్రకారము రాష్ట్ర స్థానిక సంస్థల తనిఖీఅధికారి (Inspector General of Local Administration). రాష్ట్ర గ్రంథాలయ కమిటీయందు సభ్యులు.

5. సెక్షన్ 3 (2) (హెచ్) ప్రకారము విశ్వవిద్యాలయ సిండికేట్ సభ్యులచే ఎన్నుకొనబడిన వ్యక్తి రాష్ట్ర గ్రంథాలయ కమిటీయందు సభ్యుడు.

6. సెక్షన్ 3 (2) (జె) ప్రకారము హైదరాబాదు సికిందరాబాదు నగర లోకల్ లైబ్రరీ అథారిటీ సభ్యులలో ఒకరిని, రాష్ట్రమునందలి మూడు విశ్వవిద్యాలయ ప్రాంతముల నుండి, ప్రతి విశ్వవిద్యాలయ ప్రాంతమునకు చెందిన లోకల్ లైబ్రరీ అథారిటీల సభ్యులలో ఇరువురు, చొప్పున, అనగా మొత్తము ఏడుగురిని రాష్ట్ర గ్రంథాలయ కమిటీయందు సభ్యులుగా ప్రభుత్వము సూచించవలెను.

4. సెక్షన్ 3 (2) (ఎఫ్) ననుసరించి పురపాలక సంస్థ డైరెక్టరు రాష్ట్ర గ్రంథాలయ కమిటీయందు సభ్యులు.

5. సెక్షన్ 3 (2) (1) ననుసరించి విశ్వవిద్యాలయ సిండికేట్ సభ్యులు ఎన్నిక విధానమున గాక తమలో ఒకరిని రాష్ట్ర గ్రంథాలయ కమిటీకి సభ్యునిగా సూచించవలెను.

6. సెక్షన్ 3 (2) (కె) (1) +(2) ననుసరించి హైదరాబాదు నగర లోకల్ లైబ్రరీ అథారిటీ సభ్యులలో ఒకరిని, రాష్ట్రము నందలి మూడు విశ్వవిద్యాలయ ప్రాంతముల నుండి, ప్రతి విశ్వవిద్యాలయ ప్రాంతమునకు చెందిన లోకల్ లైబ్రరీ అథారిటీ సభ్యులలో ఒక్కొక్కరిని, అనగా మొత్తము నలుగురిని రాష్ట్ర గ్రంథాలయ కమిటీయందు సభ్యులుగా ప్రభుత్వము సూచించవలెను.

| | |
|---|---|
| 7. సెక్షన్ 3 (2) (కె) ప్రకారము రాష్ట్ర, గ్రంథాలయ కమిటీకి, నలుగురిని సభ్యులుగా కో ఆ-ప్టు(Co-opt) చేసికొను అధికారము కలదు. | 7. సెక్షన్ 3 (2) (కె) (3) (4) (5) ననుసరించి రాష్ట్ర గ్రంథాలయ కమిటీకి నలుగురిని సభ్యులుగా కో-ఆప్టు చేసికొను అధికారము రద్దు చేయబడినది. దీనికి బదులు గ్రంథాలయోద్యమమున ప్రముఖ పాత్ర వహించిన వారిలో నొకరిని, గ్రంథాలయ శాస్త్రమునందు నిపుణత పొందినవారిలో నొకరిని, ఇరువురు జిల్లా గ్రంథాలయ పుస్తక భాండాగారులను అనగా మొత్తము నలుగురిని రాష్ట్ర గ్రంథాలయ కమిటీయందు ప్రభుత్వము సభ్యులుగా నియమించవలెను. |
| 8. సెక్షన్ 4 ప్రకారము ఎన్నికల మూలమునను, ప్రతిపాదనా మూలమునను, కో-ఆప్టుద్వారాను, రాష్ట్ర గ్రంథాలయ కమిటీయందు సభ్యత్వము పొందిన సభ్యుల కాల పరిమితి మూడు సంవత్సరములు. | 8. సెక్షన్ 4 ననుసరించి ఎన్నికల మూలమున, ప్రభుత్వ ప్రతిపాదనా మూలమున, రాష్ట్ర గ్రంథాలయ కమిటీ యందు సభ్యత్వము పొందిన సభ్యుల కాల పరిమితి ఐదు సంవత్సరములు. |
| 9. సెక్షన్ 5 ప్రకారము రాష్ట్ర గ్రంథాలయ కమిటీయందు ఖాళీ ఏర్పడిన సందర్భాన, ప్రభుత్వ ప్రతిపాదనా మూలమున గాని, కో-ఆప్టు ద్వారా గాని ఆ ఖాళీ భర్తీ చేయవలెను. | 9. సెక్షన్ 5 ననుసరించి రాష్ట్ర గ్రంథాలయ కమిటీ యందు ఖాళీలు ఏర్పడిన సందర్భమున ఎన్నికల మూలమున గాని, ప్రభుత్వ ప్రతిపాదనా మూలమున గాని ఆ ఖాళీని భర్తీ చేయవలెను. మునుపటివలె కమిటీకి కో - ఆప్టు |

| | |
|---|---|
| | చేయు అధికారము రద్దు చేయడము జరిగినది. |
| 10. సెక్షన్ 8 ప్రకారము పౌర గ్రంథాలయాల శాఖకు ప్రత్యేక డైరెక్టరు గారినైనా నియమించ వచ్చును. లేదా విద్యా శాఖ డైరెక్టరు పౌర గ్రంథాలయాల డైరెక్టరుగా వ్యవహరించ వచ్చును. | 10. సెక్షన్ 8 ననుసరించి గ్రంథాలయ శాఖకు ప్రత్యేక డైరెక్టరు నియామకము జరుగవలెను. విద్యా శాఖ డైరెక్టరు పౌర గ్రంథాలయాల డైరెక్టరుగా వ్యవహరించుటకు వీలులేదు. |
| 11. సెక్షన్ 8 (ఇ) ప్రకారము గ్రంథాలయ శాఖా డైరెక్టరు ప్రతి సం॥ రాష్ట్ర గ్రంథాలయ కమిటీ ద్వారా గ్రంథాలయములకు సంబంధించిన వార్షిక నివేదిక ప్రభుత్వమునకు పంపవలెను. | 11. సెక్షన్ (8) (ఇ) ననుసరించి గ్రంథాలయ శాఖ డైరెక్టరు ప్రతి సం॥ రాష్ట్ర గ్రంథాలయ కమిటీ ద్వారా గ్రంథాలయములకు సంబంధించిన వార్షిక నివేదికను ప్రభుత్వమునకు పంపవలెను. ప్రభుత్వము ఆ నివేదికను తమకు చేరిన మూడు మాసములలోపున విధానమండలి, విధాన పరిషత్తులకు పంపవలెను. |
| 12. సెక్షన్ 8 నందు గ్రంథాలయములలో ఉద్యోగములను కల్పించుటకు గ్రంథాలయ శాఖ డైరెక్టరు గారి కధికారము కల్పించబడలేదు. | 12. సెక్షన్ 8 (జె) ననుసరించి జిల్లా గ్రంథాలయ సంస్థల కార్యాలయములలోను మఱియు పౌర గ్రంథాలయములలోను ఉద్యోగములను కల్పించుటకు అధికారము గ్రంథాలయ శాఖ డైరెక్టరుకు ఇవ్వడము జరిగినది. |

13. సెక్షన్ 9 (1) ప్రకారము హైదరాబాదు నగరమునకు, సికింద్రాబాదు నగరమునకు కలిసి ఒక లోకల్ లైబ్రరీ అథారిటీ, ప్రతి జిల్లాకు ఒక లోకల్ లైబ్రరీ అథారిటీ యుండవలెను.

13. సెక్షన్ 9 (1) నందు హైదరాబాదు, సికింద్రాబాదు జంట నగరములకు ఒకే జిల్లా గ్రంథాలయ సంస్థ నిర్మాణము జరుగవలెనని, అది హైదరాబాదు నగర జిల్లా గ్రంథాలయ సంస్థగా పేర్కొన బడవలెనని, ప్రతి జిల్లాకును ఒక జిల్లా గ్రంథాలయ సంస్థను ఏర్పాటు చేయవలెనని తెలియ చేయబడినది.

14. సెక్షన్ 10 (1)(ఎ) ప్రకారము విద్యాశాఖకు లేదా పౌర గ్రంథాలయములకు సేవ చేసి నటువంటి నలుగురు జంటనగర వాసులను నగర లోకల్ లైబ్రరీ అథారిటీ సభ్యులుగా ప్రభుత్వము ప్రతిపాదించవలెను.

14. సెక్షన్ (10) (1) (ఎ) ననుసరించి విద్యాశాఖకు పౌర గ్రంథాలయములకు సేవ చేసిన జంట నగర వాసులను నలుగురను జిల్లా గ్రంథాలయ సంస్థల సభ్యులుగా ప్రభుత్వము ప్రతిపాదించవలెను.

15. సెక్షన్ 10(1)(బి) ప్రకారము హైదరాబాదు, సికింద్రాబాదు జంట నగరములలో లోకల్ లైబ్రరీ అథారిటీలు, ప్రభుత్వము, స్థానిక సంస్థలు మఱియు సహకార సంఘములు–వీని యాజమాన్య

15. సెక్షన్ 10 (1) (బి) ననుసరించి హైదరాబాదునగర గ్రంథాలయ సంస్థకు ఆ సహాయక గ్రంథాలయముల నిర్వహణ సభ్యులలో ఆర్గురికి బదులుగా ఇరువురిని మాత్రమే సభ్యులుగా ఎన్నుకొనవలెను.

ము లోని గ్రంథాలయములు తప్ప, మిగిలిన సహాయక గ్రంథాలయముల నిర్వహణ సభ్యులలో ఇద్దరిని హైదరాబాదు లోకల్ లైబ్రరీ అథారిటీకి సభ్యులుగా ప్రతిపాదించవలెను.

16. సెక్షన్ 10 (2)(ఎ) ప్రకారము విద్యాశాఖకు లేదా పౌర గ్రంథాలయములకు సేవచేసిన వారిలో ప్రతి జిల్లాకు ప్రభుత్వము నలుగురిని ఎన్నుకొని, వారిని ఆయా జిల్లాలకు చెందిన లోకల్ లైబ్రరీ అథారిటీ సభ్యులుగా ప్రతిపాదించును.

16. సెక్షన్ 10 (2) (ఎ) ననుసరించి వైద్య వృత్తికి, న్యాయ వృత్తికి చెందిన వారిలో నొక్కొక్కరిని, ప్రధానోపాధ్యాయులలో నొక్కరిని, విద్యా శాఖకు లేదా పౌర గ్రంథాలయములకు గొప్ప సేవ చేసినవారిలో నిరువురిని, అనగా మొత్తము ఐదుగురిని ప్రభుత్వము జిల్లా గ్రంథాలయ సంస్థల సభ్యులుగా ప్రతిపాదించవలెను.

17. సెక్షన్ 10 (2)(సి) ప్రకారము ప్రతి తాలూకాలో గ్రామ ప్రెసిడెంట్ లేదా గ్రామ సర్పంచ్‌లచే ఎన్నిక కాబడిన వ్యక్తి లోకల్ లైబ్రరీ అథారిటీ సభ్యుడుగా గుర్తింప బడును.

17. సెక్షన్ 10 (2) (సి) ననుసరించి ప్రతి తాలూకాలో గ్రామ పంచాయతీ సర్పంచ్‌లచే ఎన్నిక కాబడిన వ్యక్తి జిల్లా గ్రంథాలయ సంస్థ యందు సభ్యుడుగా నుండవలెను.

| | |
|---|---|
| 18. సెక్షన్ 10(2)(డి) ప్రకారము ప్రతి పురపాలక కౌన్సిల్ లేదా ప్రతి పురపాలక కమిటీ సభ్యుల నిరువురిని లోకల్ లైబ్రరీ అథారిటీకి సభ్యులుగా ఎన్నుకొనవలెను. | 18. సెక్షన్ 10 (2) (డి) ననుసరించి పురపాలక కమిటీని పురపాలక కౌన్సిల్ గా పేర్కొనడము జరిగినది. ప్రతి పురపాలక కౌన్సిల్ ఆ కౌన్సిల్ సభ్యులలో నొకరిని జిల్లా గ్రంథాలయ సంస్థ సభ్యుడుగా ఎన్నుకొనవలెను. |
| 19. సెక్షన్ 11 (1) ప్రకారము లోకల్ లైబ్రరీ అథారిటీ సభ్యుల కాల పరిమితి మూడు సంవత్సరములు. | 19. సెక్షన్ 11 (1) ననుసరించి జిల్లా గ్రంథాలయ సంస్థల సభ్యుల కాల పరిమితి మూడు సం॥ల నుండి ఐదు సం॥లకు పొడగించడం జరిగినది. ఈ సవరణ అమలు లోనికి వచ్చిననాడు మునుపటి చట్టము ప్రకారము కొనసాగు సభ్యులెవరేని యున్నచో అట్టివారు ఎన్నికకాబడిన నాటి నుండి ఐదు సం॥ల వరకు కొనసాగుదురు. |
| 20. 1969 (సవరణల) చట్టము సెక్షను 11-ఎ(1)లోని సూచన 1964 (సవరణ) చట్టమునందు సూచింపబడలేదు. | 20. సెక్షన్ 11-ఎ (1) ప్రకారము క్రిమినల్ కోర్టు ద్వారా చర్యతీసికొనబడి 6 మాసములకు పైగా కారాగార శిక్షితుడైన సభ్యుడు, మతి స్థిమితము లేని సభ్యుడు, మూగవైన సభ్యుడు, ఋణగ్రస్థుడై దివాలా తీసిన సభ్యుడు, జిల్లా గ్రంథాలయ సంస్థల సమావేశములకు వరుసగా మూడు పర్యాయములు హాజరు కాని సభ్యుడు జిల్లా గ్రంథాలయ సంస్థయందు సభ్యుడుగా కొనసాగుటకు వీలు లేదు. |

| | |
|---|---|
| 21. 1969 (సవరణల) చట్టము సెక్షను 11-ఎ (2) లోని సూచన 1964 (సవరణల) చట్టమునందు సూచింప బడలేదు. | 21, సెక్షన్ 11-ఎ (2) ప్రకారము మూడు సమావేశములకు హాజరు కాని సభ్యుడు తిరిగి సభ్యత్వమును పొందు నిమిత్తము జిల్లా గ్రంథాలయ సంస్థకు దరఖాస్తు నుంచుకొన్నచో, జిల్లా గ్రంథాలయ సంస్థానుమతి లభించిన, మరల సభ్యుడు కావచ్చును. ఈ విధముగా సభ్యత్వమును పొందుటకు ఏ సభ్యునికైనా తన 5 సంవత్సరముల కాలమున రెండుసార్లు మాత్రమే ఈ అవకాశము కలదు. |
| 22. సెక్షన్ 13(1) (బి) ప్రకారము గ్రంథాలయములకు పుస్తకములను పత్రికలను, చలనచిత్రములను, ఫిల్ము ప్రొజెక్టర్లను, టేప్ రికార్డర్లను మున్నగు వాటిని లోకల్ లైబ్రరీ అథారిటీలు కొనుగోలు చేసికొనవచ్చును. | 22. సెక్షన్ 13 (1) (బి) ననుసరించి ప్రభుత్వము ఆమోదించిన పుస్తకముల జాబితా యందలి పుస్తకములను మాత్రమే జిల్లా గ్రంథాలయ సంస్థలు కొనుగోలు చేసికొనవలెను. అంతేగాక గ్రంథాలయ సంస్థ బడ్జెట్‌లో 25% నకు తక్కువ గాకుండు మొత్తమునకు ప్రభుత్వము చే సూచింప బడిన పుస్తకములను కొనుగోలు చేయవలెను. |
| 23. సెక్షన్ 13(1)(డి) ప్రకారము లోకల్ లైబ్రరీ అథారిటీలు ప్రభుత్వానుమతితోను గ్రాంట్ ఇన్ | 23. సెక్షన్ 13 (1 )(డి) ననుసరించి జిల్లా గ్రంథాలయ సంస్థలకు ఇట్టి అధికారము కలదు. కాని యవియీ అధికారములను చట్టము |

| | |
|---|---|
| ఎయిడ్ కోడ్ నిబంధనల ననుసరించి తమ పరిధిలోని ఏ పౌర గ్రంథాలయము నైనను ఒక ప్రాంతము నుండి మరొక ప్రాంతము నకు తరలించ వచ్చును. లేదా ఏ గ్రంథాలయమున కైన చేయు సహాయమును నిలుపుదల చేయువచ్చును. లేదా ఏ గ్రంథాలయము నైనను మూసి వేయుట కను అధికారము కలదు. | క్రింద పొందుపరచబడిన నియమావళి ననుసరించి డైరెక్టరు అనుమతి లభించిన తరువాత మాత్రమే వినియోగించు కొనవలెను. |
| 24. సెక్షన్ 13(1)(జి) ప్రకారము ఏదేని ఒక ప్రయివేటు గ్రంథాలయమును లోకల్ లైబ్రరీ అథారిటీ స్వాధీన పరచుకొన వలెనన్న ప్రభుత్వానుమతిని పొందవలెను, | 24. సెక్షన్ 13(1) (జి) ననుసరించి ఏ గ్రంథాలయమునైనను జిల్లా గ్రంథాలయ సంస్థలు స్వాధీన పరచుకొనవలెనన్న ప్రభుత్వానుమతిని లేదా ప్రభుత్వ నియమిత అధికారి అనుమతిని పొందవలెను. |
| 25. గ్రంథ పాలకులు సమావేశములకు, సభలకు ఎవరి అనుమతిని పొందవలెనని సెక్షన్ 13 నందు సూచింపబడలేదు. | 25. సెక్షన్ 13(1)(హెచ్-1) ననుసరించి ఏ జిల్లా గ్రంథాలయ సంస్థయైన, గ్రంథాలయముల అభివృద్ధిని గురించి చర్చించుకొను నిమిత్తము సమావేశముల నేర్పాటుచేయ సంకల్పించినచో ముందుగా గ్రంథాలయశాఖ డైరెక్టరుగారి అనుమతిని పొందవలెను. |

| | |
|---|---|
| 26. 1969 సవరణ చట్టము సెక్షను 18 (ఎ) లో సూచించినట్లు 1964 సవరణ చట్టము నందు సూచించ లేదు. | 26. సెక్షన్ 18 (ఎ) ప్రకారము జిల్లా గ్రంథాలయ సంస్థ ఛైర్మెను అధికార దుర్వినియోగము చేసిన లేదా చట్టమునుగాని, చట్టముల లోని నియమముల గాని ఉల్లంఘించిన అట్టి వారిని తొలగించుటకు ప్రభుత్వమునకు అధికారము కలదు. ఈ విధముగా తొలగింపబడిన ఛైర్మెన్ తిరిగి తాను పదవియందు కొనసాగుటకు ప్రభుత్వమునకు దరఖాస్తు నుంచుకొన్నచో ప్రభుత్వము అనుమతించిన మాత్రమే కొనసాగగలదు. తొలగింపబడిన సభ్యుడు తిరిగి జిల్లా గ్రంథాలయ సంస్థ ఛైర్మెనును ఎన్నికల యందు పాల్గొన దలచిన తాను పదవిని కోల్పోయిన 3 సం॥ల వరకు అర్హుడు కానేరడు. |
| 27. సెక్షన్ 20 (2) (బి) నందు మునిసిపల్ కమిటీ లేదా మునిసిపల్ కౌన్సిల్ అని పురపాలకసంస్థలను సూచించడముజరిగినది. | 27. సెక్షన్ 20 (2) (బి) నందు పురపాలక సంస్థను మునిసిపల్ కౌన్సిల్ లని పేర్కొనడము జరిగినది. కమిటీ అను పదము తొలగించ బడినది. |
| 28. సెక్షన్ 20 (2) (సి) ప్రకారము పంచాయతీ సంస్థలను పంచాయతీలని పేర్కొనడం జరిగినది. | 28. సెక్షన్ 20 (2) (సి) యందు పంచాయతీ సంస్థలను గ్రామ పంచాయత్ అని సూచించడం జరిగినది. |

| | |
|---|---|
| 29. సెక్షన్ 20(2)(డి) ప్రకారం మునిసిపల్ కౌన్సిల్ లేదా మునిసిపల్ కమిటీ లేదా పంచాయతీ అని సూచించడం జరిగినది. | 29. సెక్షన్ 20 (2) (డి) ప్రకారము మునిసిపల్ కౌన్సిల్ లేదా గ్రామ పంచాయత్ అని చేర్చడం జరిగినది. |
| 30. సెక్షన్ 20 (3) ప్రకారము వసూలయిన గ్రంథాలయ సెస్సును గుర్తించబడిన లోకల్ లైబ్రరీ అథారిటీకి చెల్లించవలెను. | 30. సెక్షన్ 20 (3) ప్రకారము వసూలయిన గ్రంథాలయ సెస్సును ప్రభుత్వము సూచించిన నిశ్చముగా జిల్లా గ్రంథాలయ సంస్థలకు చెల్లించవలెను. |
| 31. సెక్షన్ 25 (2) (ఎ) ప్రకారము రాష్ట్ర గ్రంథాలయ కమిటీకి, లోకల్ లైబ్రరీ అథారిటీలకు సభ్యుల నెన్నుకొనుటకు, సూచించుటకు, కో-ఆప్ట్ చేయుటకు ప్రభుత్వము నిబంధనలను తయారు చేయవలెను. | 31. సెక్షన్ 25 (2) (ఎ) ప్రకారము రాష్ట్ర గ్రంథాలయ కమిటీకి, లోకల్ లైబ్రరీ అథారిటీలకు సభ్యులను ప్రభుత్వము నామినేట్ చేయుటకు అవకాశము కలదు. కో-ఆప్టు చేయుటకు అవకాశము రద్దుచేయబడినది. |
| 32. సెక్షన్ 26 ప్రకారము పౌర గ్రంథాలయ చట్టము అమలు పరచుటలో ఉత్పన్నమగు సమస్యలను ప్రభుత్వము పరిష్కరించును. | 32. 1964 (సవరణ) చట్టము లోని సెక్షన్ 26 ను తొలగించడం జరిగినది. |



# ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ చట్టము 1969 - కొన్ని సవరణలకై సూచన.

గ్రంథాలయముల నిర్వాహణ విధానమును కూలంకషముగా గ్రహించిన రాఘవరెడ్డిగారు మదరాసు పౌర గ్రంథాలయ చట్టము, 1948, హైదరాబాదు పౌర గ్రంథాలయ చట్టము, 1955, ఆంధ్ర ప్రదేశ్ పౌర గ్రంథాలయ చట్టము, 1960 లను చక్కగా అమలు పరచుటకు అవిరళ కృషి సల్పుటయేగాక, ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ చట్టమునకు 1964 వ సంవత్సరములోను, 1969 వ సంవత్సరములోను కొన్ని సవరణల సూచించి పాఠకులకు, గ్రంథపాలకులకు ప్రయోజనకరముగా పౌర గ్రంథాలయ చట్టమును తీర్చి దిద్దుటకు, ఆధునిక పద్ధతులను గ్రంథాలయములందు ప్రవేశపెట్టుటకు కృషి సల్పిరి. వీరు నేటికిని గ్రంథాలయములకు తమ సేవ నందించుచు గ్రంథాలయ సభలందును, సమావేశములందును పాల్గొనుచు గ్రంథాలయముల అభివృద్ధికి తగు సూచనల నిచ్చుచున్నారు. ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ చట్టములో జరుగవలసిన సవరణల గురించి కూడ ఈ సభలయందు వివరించుచున్నారు. ఇదివరకే ఈ గ్రంథమునందు సూచించిన సవరణలే కాకుండా, ఈ క్రింద కనబరచిన సవరణలను కూడ చక్కగా పరిశీలించి కొన్ని సవరణల నైనను త్వరితముగా చట్టమునందు పొందుపరచినచో, గ్రంథాలయముల నిర్వాహణా విధానము మెరుగై గ్రంథాలయములకు విచ్చేయు చదువరులకు కావలసిన వసతుల నభివృద్ధి పరచుటకు తగు వీలేర్పడును.

1. ఇంగ్లాండు పౌర గ్రంథాలయ చట్టము నందు రాష్ట్ర గ్రంథాలయ అథారిటీ (State Library Authority) అని సూచించ బడినది. విద్యాశాఖ, విజ్ఞాన శాస్త్ర శాఖలకు సంబంధించిన మంత్రి గారిపై గ్రంథాలయముల అభివృద్ధికి బాధ్యత యుండును. హైదరా

బాదు చట్టము నందు కూడ ఈ అవకాశము కల్పింపబడినది. అట్టి వీలును ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ చట్టము నందు కల్పించ వలెను. అందువలన రాష్ట్ర గ్రంథాలయ కమిటీని రాష్ట్ర గ్రంథాలయ అథారిటీగా నిర్దేశించి, మంత్రిగారికి గ్రంథాలయముల నభివృద్ధి బాధ్యతలను కల్పించినచో ప్రయోజన కరముగా నుండును.

2. రాష్ట్రమునందలి వివిధ గ్రంథాలయములకు వాటి కనీస ప్రామాణికములను (Minimum Standards) ను నిర్ణయించ వలసిన బాధ్యత గ్రంథాలయ శాఖ డైరెక్టరుగారిది. ఈ అంశమును ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ చట్టమునందు సూచించవలెను.

3. రాష్ట్ర కేంద్ర గ్రంథాలయము, ప్రాంతీయ గ్రంథాలయముల విధులను ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ చట్టమునందు సూచించవలెను.

4. రాష్ట్ర కేంద్ర గ్రంథాలయ పుస్తక భాండాగారి లేక పౌర గ్రంథాలయశాఖ డైరెక్టరు పుస్తకముల రిజిస్ట్రారుగా నుండ వలెనని పౌర గ్రంథాలయ చట్టమునందు సూచన చేయవలెను.

5. రాష్ట్ర కేంద్ర గ్రంథాలయమునందు ఇతర విభాగములతో పాటు, ఈ క్రింది ముఖ్య విభాగములను కూడ ఏర్పరచుటకు తగు వీలును ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ చట్టమునందు కల్పించ వలెను.

(1) అంధులకు ప్రత్యేక విభాగము.

(2) అంతర్ గ్రంథాలయముల అరువు పద్ధతుల కల్పించు విభాగము.

(3) సాంకేతిక సేవా విభాగము, (Burean of Technical Services)

6. ఈ క్రింది అంశములను కూడా రాష్ట్ర కేంద్ర పుస్తక భాండా గారి బాధ్యతలుగా పౌర గ్రంథాలయ చట్టమునందు నిర్దేశించ వలెను.

(ఎ) అమూల్యమైన, అరుదైన పుస్తకములను, ప్రాచీన కాలమునకు సంబంధించిన వ్రాత ప్రతులను సేకరించుట.

(బి) పార్లమెంటులోని ఎగువ, దిగువ సభల నివేదికలను, శాసన మండలి నివేదికలను, ప్రభుత్వ ప్రచురణలను సేకరించుట.

7. జిల్లా గ్రంథాలయ సంస్థ యాజమాన్యములో పని చేయు సిబ్బందిని ప్రభుత్వోద్యోగులుగా గుర్తించి, వారికొసగు జీత, భత్యములు, పింఛను తదితరములు ప్రభుత్వము యొక్క కన్సాలిడేటెడ్ (Consolidated) నిధుల నుండి కేటాయించ వలెను.

8. గ్రంథాలయములందు శిక్షణ పొందిన వారుండ వలెను. ఈ శిక్షణకు గ్రంథాలయోద్యోగులను పంపెడు బాధ్యతను కూడ ప్రభుత్వము గైకొన వలెను. ఈ అంశమును ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ చట్టమునందు సూచింప వలెను.

9. ప్రభుత్వము సూచించిన విద్యార్హతల పొంది, గ్రంథాలయ శాస్త్రమును వృత్తి విద్యగా అభ్యసించినట్టి వారిని (Professionals) పౌర గ్రంథాలయాల డైరెక్టరు గారు, గ్రంథపాలకులుగా నియమించ వలెనను సూచనను పౌర గ్రంథాలయ చట్టమునందు స్థూలముగా పేర్కొన వలెను.

10. ఆసుపత్రుల యందలి రోగులకు, అంగ వైకల్యము కల్గిన వారికి, సైనికులకు, ఖైదీలకు మున్నగు వారికి గ్రంథ పాలకులు సేవ చేయ వలెనని ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ చట్టము నందు నిర్దేశించ వలెను. కొన్ని పాశ్చాత్య దేశములలో (ఉదా॥ ఫిన్‌లాండ్) ఆసుపత్రుల యందలి వారికి కూడ గ్రంథాలయ సేవ చేయుటకు ఆ యా దేశముల గ్రంథాలయ చట్టములందు తావు కల్పించ బడినది. కొన్ని యితర దేశము లందలి అంగ వైకల్యము గల

వారికి కూడ గ్రంథాలయ సేవ కల్పించుటకు అచ్చటి పౌర గ్రంథాలయ చట్టము లందు వీలు కల్పింప బడినది. మన రాష్ట్రములో కొన్ని జిల్లాలలో (ఉదా॥ చిత్తూరు, పశ్చిమ గోదావరి) ఈ సేవను కొంత వఱకు అందచేసి యున్నారు.

11. సాంఘిక విద్యా కార్యక్రమములకు, సమాజ అభివృద్ధి కార్యక్రమములకు, తదితర కార్యక్రమములకు పౌర గ్రంథాలయముల నిధి నుండి సహాయము చేయుటకు వీలును ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ చట్టము నందు స్పష్టముగా పేర్కొన వలెను.

12. పుస్తకముల వర్గీకరణ, సూచీకరణ జిల్లా కేంద్ర గ్రంథాలయము లందు గాక, రాష్ట్ర కేంద్ర గ్రంథాలయము నందు చేయుటకు వీలును ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ చట్టమునందు కల్పించ వలసిన అవసర మెంతేని కలదు.

13. మన రాష్ట్రము నందు కళాశాలల యందును, పలు ఉన్నత పాఠశాలల యందును గ్రంథాలయము లున్నవి. కాని ప్రాథమిక పాఠశాలలలో కొన్నిటి యందు మాత్రమే గ్రంథాలయము లున్నవి. కావున ప్రతి ప్రాథమిక పాఠశాల యందు తప్పనిసరిగా ఒక గ్రంథాలయమును స్థాపించ వలెనని ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ చట్టమునందు నిర్దేశించ వలెను. నార్వే మున్నగు దేశముల పౌర గ్రంథాలయ చట్టము లందీ అంశము స్థూలముగా నిర్దేశింప బడినది. దీనివలన ప్రాథమిక దశలోనే పిల్లలు పఠనము నందు మక్కువను పెంచుకొనుటకు వీలు కల్పించినట్లగును. ఇట్టి వీలు ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ చట్టము నందు కూడ కల్పించుట మిగుల ప్రయోజనకరము. లేదా ఈ అవకాశమును విద్యా చట్టము (Education Act) నందు సూచింపవలెను.

14. కళాశాలల, విశ్వవిద్యాలయ గ్రంథాలయములు, ప్రత్యేక గ్రంథాలయములు, పౌర గ్రంథాలయములు, పాఠశాలల, తదితర గ్రంథాలయములు, వీటి మధ్య ఏ విధమైన సహకార పద్ధతులు ఆచరణలో నుండవలెనన్న అంశమును పౌర గ్రంథాలయ చట్టము నందు స్పష్టీకరించవలెను. డెన్మార్క్, నార్వే మున్నగు దేశము లందలి పౌర గ్రంథాలయములందు అంతర్ గ్రంథాలయ సహకార విధానములు స్థూలముగా సూచింపబడి యుండుటచే అచట సహకార విధానము చక్కగా యున్నది.

15. మన రాష్ట్రి కేంద్ర గ్రంథాలయము, ఇతర రాష్ట్రముల యందలి కేంద్ర గ్రంథాలయములతోను, మనదేశ జాతీయ గ్రంథాలయముతోను కలిగి యుండవలసిన సహకార విధానములను గూర్చి కూడ ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ చట్టమునందు పొందు పరచ వలసిన అవసర మెంతేని కలదు.

16. ఇంగ్లాండు మున్నగు పాశ్చాత్య దేశములందు గ్రంథాలయ సెస్సును గ్రంథాలయ స్థితి గతులను బట్టి వసూలు చేసికొను టకు ఆయా దేశ పౌర గ్రంథాలయ చట్టములందు వీలు కల్పించ బడినది. అదే విధముగా మన రాష్ట్రమునందు కూడ ఆస్తి పన్నుపై, ఇంటి పన్నుపై రూపాయకు ఎనిమిది 8 నయాపైసల వంతున గాక, గ్రంథాలయముల స్థితి గతులను బట్టి వసూలు చేసికొను వసతిని ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ చట్టమునందు కల్పించవలెనని కొందఱు గ్రంథాలయ శాస్త్ర వేత్తలు యభిప్రాయ పడిరి.

17. కర్ణాటక రాష్ట్ర పౌర గ్రంథాలయ చట్ట ప్రకారము భూమిశిస్తు, భవనములు, వాహనములు, వ్యాపార సంస్థలు మున్నగు వానిపై గ్రంథాలయ సెస్సు వసూలు చేయబడుచున్నది. అదే విధముగా, మన రాష్ట్రిమునందు కూడ అవసర మున్నచో,

వసూలు చేయు ఏర్పాట్లు కల్పించునట్లు ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ చట్టమునందు పొందు పరచవలెనని గ్రంథాలయ కార్యకర్తల కోరిక.

18. లక్షకు పైబడి జనసంఖ్యగల పట్టణములందు ప్రత్యేక జిల్లా గ్రంథాలయ సంస్థ స్థాపన జరుగవలెనని కొందరి అభిప్రాయము. కాని మన రాష్ట్రమునందు లక్షకు పైబడిన జనసంఖ్యగల పట్టణములందు వసూలగు గ్రంథాలయ సెస్సు మిగుల పరిమిత మగుటచే, ప్రస్తుతము రెండు లేదా మూడు లక్షలకు పైబడి జనసంఖ్యగల పట్టణము లందైన ప్రత్యేక జిల్లా గ్రంథాలయ సంస్థల స్థాపించునట్లు పౌర గ్రంథాలయ చట్టమునందు వీలు కల్పించవలెను. మన రాష్ట్రమునందలి జిల్లా గ్రంథాలయ సంస్థల ఆర్థిక పరిస్థితులు మెరుగైన యనంతరము, ఒక లక్షకు పైబడి జనాభాగల పట్టణముల యందు ప్రత్యేక గ్రంథాలయ సంస్థను ఏర్పాటు చేయవచ్చును.

19. జిల్లా గ్రంథాలయ సంస్థల సభ్యుల ఎన్నుకొనుట, వారి నియామకము, వారి పదవీ కాలము ముగియుట, రాష్ట్రమంతట జిల్లాపరిషత్తుల వలె ఏక కాలమునందు జరుగవలెను. ఈ అంశమునకు ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ చట్టమునందు వీలు కల్పించవలెను.

పై నుడివిన కొన్ని సవరణలను యన్. బి. ఈశ్వర రెడ్డి, జె. కృష్ణాజీగారు రాఘవరెడ్డి గారితో చర్చించిన యనంతరము హైదరాబాదు నగరమునందు 10—1—1981 సం॥ జరిగిన అఖిల భారత గ్రంథాలయ సంఘ సమావేశమునందు వాటిని చదవడము జరిగినది. సమావేశము నందు ఈ సవరణలకు ఏ అభ్యంతరము లేకపోయినది. పెక్కు సభ్యులు ఈ సూచనలను కొనియాడిరి.

పై సవరణల పరిశీలించి మిగుల ప్రయోజనకరమైన కొన్ని సవరణలనైనా ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ చట్టము నందు పొందుపరచినచో ఆధునిక పద్ధతిలో మరింత పటిష్టముగా గ్రంథాలయముల నిర్వహించుటకు వీలుండును.



# అచ్చు పొరబాటుల సవరణ పట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| VII | 23 | — | 10—11—82 |
| IX | 15 | అంతరాతీయ | అంతర్జాతీయ |
| 1 | 18 | ఈ నాటికిని | 1981 వరకు |
| 1 | 21 | భోజిరెడ్డి | భోజ్ రెడ్డి |
| 7 | 17 | ఫాసిత్ | ఫాసిల్ |
| 26 | 24 | చేసివవి | చేసినవి |
| 32 | 1 | ఉనిధాన్ | ఉన్నితాన్ |
| 59 | 19 | మిగిలివ | మిగిలిన |
| 61 | 7 | తగిపంతగా | తగినంతగా |
| 66 | 12 | ఉనయోగించుట | ఉపయోగించుట |
| 71 | 16 | గ్రంథాపాలకులు | గ్రంథపాలకులు |
| 72 | 11 | ఈ విధ | ఈ విధమైన |
| 79 | 15 | సహాయ గ్రంథాలయ | సహాయక గ్రంథాలయ |
| 81 | 17 | గ్రంథాలయాభవృద్ధి | గ్రంథాలయాభివృద్ధి |
| 93 | 15 | ఈ విథముగా | ఈ విధముగా |
| 103 | 5 | ఆధ్రప్రదేశ్ | ఆంధ్రప్రదేశ్ |
| 104 | 23 | చేయుచున్నది | చేయుచున్నవి. |
| 144 | 23 | ప్రాతినిథ్యము | ప్రాతినిధ్యము |
| 181 | 19 | యుటకు | చేయుటకు |
| 188 | 4 | నిరక్ష్యరాస్యులు | నిరక్షరాస్యులు |
| 190 | 14 | ఉద్థా | ఉద్ధా |
| 201 | 22 | నిరక్ష్యరాస్యులకు | నిరక్షరాస్యులకు |
| 209 | 17 | ఎన్. ఎం. ఫాసిల్ | ఎస్. ఎం. ఫాసిల్ |
| 219 | 15 | గ్రంథాలయము సంఘుము | గ్రంథాలయ సంఘము |
| 252 | 13 | వృ_ | వృత్తి |
| 257 | 22 | చేసినది | చేసినవి |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 288 | 12 | డైరెక్టిరు | డైరెక్టరు |
| 303 | 7 | సింగారెడ్డి | సంగారెడ్డి |
| 312 | 13 | విశిష్ఠసేవ | విశిష్టసేవ |
| 324 | 13 | భోజిరెడ్డి | భోజ్‌రెడ్డి |
| 352 | 13 | సంప్రతించ పలెనని | సంప్రతించవలెనని |
| 363 | 6 | భోజిరెడ్డి | భోజ్‌రెడ్డి |
| 403 | 21 | భోజిరెడ్డి | భోజ్‌రెడ్డి |
| 425 | 15 | శాఘ బాధ్యతలు | శాఖ బాధ్యతలు |
| 446 | 23 | పంచవర్షిక ప్రణాళిక | పంచవర్ష ప్రణాళిక |
| 448 | 9 | 1918 | 1948 |
| 450 | 10 | అదె భవనములు | అద్దె భవనములు |
| 460 | 22 | భోజిరెడ్డి | భోజ్‌రెడ్డి |
| 476 | 8 | యువసరము | యవసరము |
| 492 | 4 | ఉద్యమవ్యాప్తి | ఉద్యమవ్యాప్తికి |
| 497 | 16 | లకవరం | లక్కవరం |
| 501 | 22 | ప్రకాశరావుగారికి | ప్రకాశరావుగారు |
| 515 | 4 | క్షణపొందని | శిక్షణ పొందని |
| 524 | 23 | నిరువురును | నిరువురను |
| 540 | 16 | రూ. 6,75,00 | రూ. 6,75,000 |
| 541 | 19 | జిలాపేరు | జిల్లాపేరు |
| 550 | 16 | వయోజ | వయోజన |
| 566 | 16 | మొదట పంచవర్ష | మొదటి పంచవర్ష |
| ,, | 18 | మొదట పంచవర్ష | మొదటి పంచవర్ష |
| 575 | 20 | రెడిగారి | రెడ్డిగారి |
| 615 | 14 | సవరణ బిల్లును | సవరణ బిల్లు |

*